హైదరాబాదాంధ్రసాహిత్యపరిషత్ప్రచురణము 3.

# నవ్యాంధ్ర సాహిత్య వీధులు

అను

## (నవ్యసాహిత్యచరిత్రము)

(1827 — 1942)






కురుగంటి సీతారామయ్య, ఎం.ఏ.

ప్రొఫెసరు నిజాం కాలెజి,

హైద్రాబాదు (దక్కను)




# అర్పణము

వ్యాసప్రసాదాసాదితతత్త్వ నిశ్చయులై, పూర్వాశ్రమమున శ్రీ సుబ్రహ్మణ్య మహాగ్నిచిన్నామమును ధరించి యస్మత్తాతపాదులై, అస్మద్విజ్ఞానగురువులై, బ్రహ్మీభూతులైన శ్రీ అద్వైతానందతీర్థ యతుల కత్యంత భక్తిపురస్సరముగా వినమిత శిరసుతో నర్పితము.

# శుద్ధపత్రిక

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 193 | తుది | మంచి స్ఫురద్రూపి | అన్నగారు మంచి స్ఫురద్రూపి. |
| 379 | 4 | మూడో | మొదటి. |

# వి న్న ప ము

తెనుగుసారస్వతానికి సమగ్రసాధికారచరిత్ర లేదు. ఎప్పు డది రచింపబడుతుందో చెప్పలేము. పూర్వవాఙ్మయచరిత్రరచనానికి సామగ్రి సేకరింపబడి ఉంది. కొందరు యేదో తమకుతోచినట్లు చరిత్రను రాయ సాహసించారు. అట్లా కొన్ని గ్రంథాలు వెలువడ్డవి. నవ్యసాహిత్యాన్నిగూర్చి చారిత్రకంగా అవలోడనంచేసిన స్థలాలు లేవు. ఇప్పటి కింకా చాలామట్టుకు ప్రచారంచేసుకునే స్థితిలోనే వుంది. దాని లక్షణా లేవో, పరిమితి యెంతో, యే క్రమపరిణామాలను పొందిందో, మొదలైన విషయాలను యథాశక్తిగా చర్చించి తచ్చరిత్రకు వక అనిర్దిష్టమైన ఆకారాన్నిచ్చింది మొదటి మాటు విశ్వనాథ బెజవాడ పరిషదధ్యక్షోపన్యాసం. చాలాకాలంనించీ యేతచ్చరిత్ర రాయాలని నాకు వుండె. ఈ ఆసక్తిని పురికొల్పి యీ వుపన్యాసం నాచేత యీ గ్రంథం రాయించింది. తద్వ్యాసానికీ, తద్రచయితకూ నా ధన్యవాదాలు. నా తంజావూరాంధ్రనాయకరాజచరిత్ర వలెనే యీ నవ్యసాహిత్యచరిత్రకుకూడా నాదే ప్రథమగ్రంథమైనందుకు గర్వపడుతున్నాను. ఇక పొరపాట్లకా, "ప్రమాదోధీమతా మపి."

ప్రాచ్యపాశ్చాత్యసంప్రదాయసమ్మేళనంచేసి విమర్శనం సాగించాలని నా ఆశయం. సంప్రదాయం నాకు చాలాపవిత్రం. నాకేకాదు. సారస్వతోద్ధారకులకందరికీ అంతే! రచనా, విమర్శనమూకూడా దాన్ని నిరసించటం మన పార్థక్యాన్ని కోల్పోవడం. ఈ ఆశయంతో, సానుభూతినీ, సహృదయత్వాన్నీ, ఊతగా చేసుకుని రాశా ననుకుంటున్నా నీ గ్రంథం. నా సహృదయత్వానికి బాగుండనప్పుడు వ్యక్తి యొక్క గొప్పతనం తలవకుండా నిర్మొగమాటంగా హృదయంలో సంగతులు చెప్పాను. నా కర్తవ్యమని యెంచి అట్లా చేశానేగాని వ్యక్తులను అగౌరవపరచాలని నా ఉద్దేశ్య మెప్పటికీ కాదు. ఈ నవ్యసాహిత్య తరంగంతో సాక్షాత్తుగానో, పరోక్షంగానో, నాకుకూడా సంబంధముండడంచేతా, వ్యక్తులుకూడా నాకు సమకాలికులై అనేకులు నాకు

తెలిసినవా ళ్లవడంచేతా, అనేక స్థలాల్లో నా స్వానుభవాలూ, వ్యక్తులనుగూర్చిన వాక్చిత్రాలూ, ఉన్నవి. వాటిలోకూడా అసభ్యాలుగానూ, అసత్యాలుగానూ యేమీ రాయలేదని నా నమ్మకం. ఒకొ్కకప్పుడు సత్యకథనంకూడా కోపకారణం కావచ్చు. అట్టి విషయాల్లో క్షంతవ్యుణ్ణి. సారస్వతం ముఖ్యంగాచేసుకుని అందులో ప్రతిబింబించే యీ కాలపు యావదాంధ్రజాతీయ జీవనమూ స్పృశింపబడ్డ దీ గ్రంథంలో. ఈ గ్రంథభాగాలు విని నాకు సలహాల నిచ్చిన మిత్రులందరికి నా వందనములు.

నేను పేదవాడను. ఇంత పెద్దగ్రంథం స్వయంగా అచ్చువేసుకునే సామర్థ్యం లేదు. వ్రాత పూర్తై అచ్చుసంగతి తలుచుకున్నప్పుడు జ్ఞాపకానికివచ్చారు, నా తంజావూరాంధ్రనాయకరాజచరిత్ర నచ్చేశిన విశ్వదాతగారు. చల్లని మహారాజు! ఈ విషయంలో ఆయన దృష్టి వర్తకదృష్టి కాదు! సిగ్గు విడిచి ముగ్గురిని సహాయం కోరాను. మొదటివారు "సాహిత్యసామ్రాట్టు", రెండోవారు "భాషోద్ధారకులు", మూడోవారు లక్ష్మీపుత్రులైన మాజీమంత్రి. మొదటివారు "తమ రా సంవత్సరానికి అచ్చువేయించదలచిన గ్రంథాలన్నీ అయిన తర్వాతగాని దీనిసంగతి ఆలోచించలే"మని సెలవిచ్చారు. రెండోవారు "తా మచ్చువేయటాని కెట్టి అభ్యంతరం లేదనీ, కొన్ని ప్రతుల నియ్యగలమేగాని రచించినందులకు పారితోషిక మియ్యలే"మనీ ప్రత్యుత్తరం రాశారు. మూడోవారు జవాబే లేదు! దేశం గొడ్డుపోలేదు! ఇంతలో ఏలూరు సాహిత్యమండలివారు నన్ను ఉపన్యాసాలియ్యమని ఆహ్వానంచేశారు. వాటితర్వాత "ఒకొ్కక్కరు 10 రూపాయల నియ్యగలవ్యక్తులను 100 మందిని అచ్చువ్యయాలకు ద్రవ్యాన్ని అడిగి వారిపేర్లు పుస్తకంచివర అచ్చువేయిస్తానని" విన్నపంచేశాను. యథాశక్తి సహాయం చేస్తామన్నారు యేలూరుప్రజలు. ఉపన్యాసమై యింటికి వచ్చినవెంటనే గుప్తంగా పది రూపాయలు చేతులో పెట్టారు కుప్పా విశ్వపతిశాస్త్రిగారు. అదే శంఖుస్థాపన యీ గ్రంథ ముద్రణానికి. ఆయన్ను నే నెంత కొనియాడినా తక్కువే! మళ్ళీ

రెండో పది యెవ్వరినీ అడగలేదు; యెవ్వరూ యివ్వలేదు! పుస్తకం అచ్చుఅయింది. శాస్త్రిగారికి వందనశతాలు! ఆయన సిద్ధసంకల్పుడు! అనేక రచయితలనూ, అనేక గ్రంథాలనూ వదలి ఉండవచ్చును. సారస్వతవీథీవిన్యాసమూ, వానిలోని ముఖ్యసంచారులూ, తెల్పడం నా కర్తవ్యం. కాబట్టి వారందరు నన్ను క్షమిస్తారని ఆశిస్తున్నాను. సభాపతి మొదలైనవాళ్లు "గాథాసప్తశతి" మొదలైన మహా కావ్యాలు రాస్తున్నట్టువినికిడి. అముద్రితాలవి. అంచేత వాటిని పరా మర్శించడానికి వీల్లేకపోయింది.

లక్ష్మీ పవర్ ప్రెస్సులో ఉన్నవాళ్ళంతా, తత్రాపి, యజమాని పిల్లలమఱ్ఱి లక్ష్మీనారాయణగారి సానుభూతికీ, సౌహార్దానికీ మేర లేదు. ఎప్పుడూ చిరునవ్వేగాని విసుగు లేదు. ముద్రణవిషయంలో యెన్ని ఆటంకాలు వచ్చినా, ద్రవ్యాన్నిగూర్చి తలపకుండా, పనే ప్రధానంగా ముద్రణ సాగించారు. ఎన్ని వందనా లాయన కిచ్చినా చాలా తక్కువే! నా దస్తూరి, నా గుర్తులు, తెలుసుకొని అతిశ్రద్ధతో కూర్చిన, ప్రూఫులు దిద్దినవాళ్ళందరికీ నా వందనాలు. ఇందులో గుణదోషాలకు సహృదయులే ప్రమాణం.

ఈ మాటలు రాశినతర్వాత విద్యాశేఖర ఉమాకాన్తపండి తుడుపరమపదించినట్టు తెలిసింది. ఆయన ఆత్మకు శాంతి కలుగుగాక! భాషకు తీరని నష్టము!

డాక్టరు పిశుపాటి వెంకటరమణయ్యాది మిత్రబృందంయొక్క ప్రోత్సాహమమూల్యము.

హైద్రాబాదు, దక్కను
4—5—'42

విధేయుడు,
కురుగంటి సీతారామయ్య.

# విషయవిభాగము

## I భాగం (1827—1920)

---

## III భాగం (1931—1942)

# నవ్యాంధ్ర సాహిత్యవీధులు

## ౧

### పూర్వరంగము :

"In the study of literature few things are more interesting than to consider the periodic changes of outlook which sway the human mind and spirit; to observe those recurrent fluctuations of 'values' which cause the truths and certainties of our generation to appear as superstitions and empty conventions in the eyes of generations following."

***A. C. Ward.***

నవ్యాంధ్రసాహిత్యానికి పునాది 19 శతాబ్దం ఉత్తరార్ధంలో పడిందనచ్చు. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు యీ సాహిత్యానికి మూలపురుషుడని చెప్పడం తప్పేమీ లేదు. * ఆయన రంగంమీది కొచ్చేటప్పటికి మన భాషాసారస్వతాలు యెట్లా వున్నవో చెప్పటం అవసరం. 1827 సంవత్సరానికి తెనుగుపుస్తకాలు అచ్చు ప్రారంభమైంది. నిజంగా యే దక్షిణదేశ భాషా

* 1889 సంవత్సరం వరకు జీవించిన హాప్కిన్సు అనే కవి నవ్యాంగ్ల సారస్వతానికి మూలపురుషుడట! కొంచెం వెనకా ముందుగా వీరేశలింగంగారూ యీన సమకాలికులే.

"*Modern' being a word of extremely elastic meaning, I may explain that it is used here of poetry written by men and women who were still alive when King George V came to throne (1910), or whose work was published in book-form for the first time after that date. This is not meant to be the defintion of the word, but is an indication of the limits within which the choice of the poems had been made.*"

(*Gilkes*)

[illegible] అభివ్యక్తిపొందటం అప్పుడే ప్రారంభించినై. [illegible] 19 శతాబ్దాంతం వరకు భాష, సారస్వతం, ప్రచురణం, [illegible] చెప్పి తరువాత మరో అంశానికి వెళుతాను.

భాష :

"సంస్కృతం బాద్యప్రకృతి, ప్రాకృతంబు ద్వితీయ ప్రకృతి, ఆంధ్రభాష వికృతి" ఇది అప్పటికి భాషాసిద్ధాంతం. తెనుగు సంస్కృతప్రాకృతభవమని అప్పటి పండితులందరి మతం. ఇది నన్నయ్యభట్టు సిద్ధాంతం. అదే నిరుత్తరంగా నమ్ముతున్నారు. చిన్నయసూరి యీమతంలోవాడే. ఈయన మంచి వైయాకరణి. అందుచేత సంస్కృత పరిభాషానుసారంగా తెనుగుకు ఒక వ్యాకరణం రచించాడు. ఈ "బాలవ్యాకరణం" 1860 సంవత్సరానికే ప్రచురణైంది. ఆ వ్యాకరణానుసారం లక్ష్యంగా "నీతిచంద్రికను" ఆయనే రచించాడు. ఇందులో ఆయన దారిజూపిన భాష వరవడి అయిపోయింది. ఎవ్వరు రాశినా అదేభాష! దీన్నే శ్రీ గిడుగు రామమూర్తి గారు "కృతకభాష" అన్నది. భాషస్థితి యిది.

సారస్వతం:

ఏవేపునుంచి చూచినా వెనుకటియుగంలోలాటి ప్రబంధాలనూ, శైలినీ, భాషనూ, అనుకరించటమేతప్ప కొత్తపోకడలేలేవు. మండపాక పార్వతీశ్వరశాస్త్రి (భావకవిగారి తాత) వగైరాలు యింకా వెనక బాటల్లోనే సంచరిస్తున్నారు. అవే అలంకారాలు! అదేశైలి! అదే సంస్కృతభూయిష్టమైన భాషారచన! కాని సామాన్య ప్రజలలో కొంచెం జిజ్ఞాస కలిగినట్టు కనపడుతుంది. కొందరు పెద్దల్లోకూడా హిందూమతజ్ఞానం ప్రజల్లో వెదజల్లాలని అభిప్రాయం కలిగింది. దీనికి వకటి కారణం వుంది. మిషనరీలప్పుడే తమ మతప్రచారం ప్రారంభించారు. దీనిని అరికట్టాలనొచ్చింది. అందుచేత భారత రామాయణాది

గ్రంథస్థ విషయాలు అచ్చొత్తించి సులభంగా ప్రజలకు అందజేయా లనే తలంపు కలిగింది దేశంలో.

## గ్రంథ ప్రచురణం :

గ్రంథపఠనంలోకూడా అభిరుచి కల్గిందనవచ్చు. గ్రంథప్రచు రణానికి అవసరం వచ్చింది. ఈవిషయాన్నిగూర్చి మొదట కృషిచేసిన వాళ్ళల్లో బహూరు త్యాగరాయశాస్త్రి, యద్దనపూడి సంజీవయ్య మొదలగువార్లు యెన్నదగినవారు. వీరిద్దరు ముద్రాలయాలనుస్థాపించి గ్రంథ ప్రచురణం ప్రారంభించారు. చాలాగ్రంథాలు ప్రచురించారు. ఈకాలంలో మనకాగ్రంథాలు యెంతమాత్రం నచ్చవు. అవి మొదటి దినాలు. కాగితపు పరిశ్రమలోగాని, అచ్చు అక్షరాలలోగాని, కూర్పు లోగాని, చిత్రాల్లోగాని, యిప్పుడు వచ్చిన నూతనపద్ధతు లప్పట్లో లేవు. తెనుగులోవున్న ఉద్గ్రంథాలను చాలావాటిని వీరు ప్రచురిం చారు. వీటిలోవున్న చిత్రాలు నవ్వొస్తూవుంటాయి. తోలుబొమ్మల్లో చిత్రాలల్లే వుంటాయి. కాగితాలు వూడితే చినిగిపోయేటట్టుంటై. తెలుపు ఆట్టేవుండవు. అట్ట బైండైనా గట్టిగా వుండదు. వీరు ముద్రిం చిన భారతభాగవత రామాయణాలు యిప్పటికీ ప్రచారంలోవున్నై. కొత్తదినాల్లో, అంతకంటె చెయ్యటానికి వీల్లేని పరిస్థితుల్లో, యీ మాత్రమైనా చేసినందుకు వారికి వందనాలియ్యాలి. ఇప్పటికీ వీరు ముద్రించిన గ్రంథాలు బజారులో అమ్ముతూనే వున్నారు. కొన్ని పురాతనగ్రంథాలు యిటువంటివాటిలోనే దొరుకుతై. ఇతరాధునిక ముద్రాశాలలు ప్రకటించని కొన్నిగ్రంథాలు వీరుప్రచురించినవాట్లో ఉన్నై. వీటిని అమ్మేవాళ్ళూ కొనేవాళ్ళూ కూడా వున్నారు.

## ఇద్దరు వైదేశికులు (బ్రౌన్, కాల్డ్వెల్) :

ఈకాలంలో యిద్దరు విదేశీయులపనిని స్పృశించక తప్పదు. రాజ్యంచెయ్యటానికి వచ్చిన పాశ్చాత్యులు కొందరు, మతప్రచారం

కోసం వచ్చినవాళ్లు కొందరు. మొదటమొదట వీళ్ళలో సహృదయులు, పట్టుదలకలవాళ్ళూ వచ్చేవాళ్ళు. వాళ్ళూవీళ్ళు కలసిమెలసి వుండేవాళ్ళు. మిషనరీలపనికి పాలించే దొరలుకూడా సాయం చేసేవాళ్ళు. మిషనరీలకు బైబిలు పరివర్తనం ముఖ్యమైనపని. ఈ మిషనరీలు యేసు ఆజ్ఞను నిర్వర్తించటానికి ప్రపంచమంతటా వెళ్ళి, స్వభాష రాని వాళ్ళలో నివసించి, ఒక్కొక్కప్పుడు వాళ్ళ వేషభాషలనుకూడా స్వీకరించి, వాళ్ళభాష నేర్చుకొని, చాలా శ్రమపడ్డారు. ఇప్పటికీ కొందరు పడుతూనేవున్నారు. బైబిలుపరివర్తనానికీ,చర్చీలలో పాడేందుకు కీర్తనలురచించడానికీ, ప్రచారానికీ, వీళ్ళు పరభాషలు నేర్చుకోవలశొచ్చింది. 1827 లో దక్షిణ యిండియాలో బ్రౌన్ దొరగారు సర్కారుద్యోగంలో వున్నారు. ఆయన మిషనరీల యీ అవసరాన్ని పురస్కరించుకొని, వాళ్ళకు కావలసిన సామగ్రి సేకరించాలని పూనాడు. ఉద్దేశ్యమెట్లావున్నా తెనుగుభాష కుపకారమైంది. ఈయన తెనుగుభాషకు చేసినమేలు యింతని చెప్పటానికి వీలులేదు. భాషకు శరీరంవంటిది నిఘంటువు. అదివరలో ఆంధ్రనామ సంగ్రహంకంటె తెనుగుకు నిఘంటువులేదు. ఇంగ్లీషుకుకూడా జాన్సన్ కాలందాకా నిఘంటువులేదు. ఈయన ఆసగంతి కనిపెట్టి, నిఘంటు నిర్మాణానికి సమకట్టాడు. గొఱ్ఱెకొవ్వటం గొల్లవాడికుపయోగించింది! మతపరివర్తనంయెట్లావున్నా ఆంధ్రభాషకు మహోపకారమైంది. ఈ బైబులుపరివర్తనకాలంలో మొదటి హిందూక్రైస్తవులైన ధన్నవాడ అనంతం, బి. ఏ, మల్లాది వెంకటరత్నం బి. ఏ, మొదలైనవారు పాల్గొన్నారు. ఈ బైబులు కిప్పటికి అనేక ముద్రణాలైనై. ఆంధ్రానికి అమరసింహుడంత పనిచేశాడీ బ్రౌన్. రాసినపద్ధతికూడా చాలా మంచిది. ఒక్కొక్కమాటకు గల భిన్నార్థాలను చెప్తూతూ, వాటి కుదాహరణలిస్తూ, ఆఅన్ని అర్థాలకూ యింగ్లీషులో సమానార్థకాలిచ్చాడు.

ఈనిఘంటువు యింగ్లీషు తెలిసినవాళ్లకు తెనుగు నేర్చుకోటాని

కుద్దేశించిందవడంచేత, యీన ఇంగ్లీషు-తెనుగు, తెనుగు-ఇంగ్లీషుగా, రెండు ప్రతులు ప్రకటించాడు. ఇంతేగాక యింగ్లీషు భాషలో తెనుగు వ్యాకరణమూ, ఛందశ్శాస్త్రమూకూడా వ్రాశాడు. శంకర నారాయణ నిఘంటువులకు రెంటికీ బ్రౌన్ దొరగారి నిఘంటువులే మాతృకలు. శంకరనారాయణ తెనుగువాడైనా, అసలు పుస్తకప్రణాళికలో బ్రౌన్‌గారి నిఘంటువే మంచి పునాదులపైన నిర్మింపబడిందా అనిపిస్తుంది. 1853 సంవత్సరంనాటికే బైబిలు పరివర్తనం ప్రారంభింపబడి సాగుతున్నది. ఆసంవత్సరానికే వీళ్లకు ముఖ్యంగా కావలసిన ఇంగ్లీషు—తెనుగు నిఘంటువు కొంతభాగము ప్రచురణమైంది. తెనుగు—ఇంగ్లీషు నిఘంటువు తరువాత కొంతకాలానికైంది. వీరేశలింగంగారి "రాజశేఖరచరిత్ర" రచనకుముందే యీ బ్రౌన్‌దొరగారు వేమనపద్యావళిని యింగ్లీషులోకి పరివర్తనంచేసి, 1829 నాటికే ప్రచురించాడు. ఆంగ్లేయులు మొదట తెలుసుకున్న ఆంధ్ర వేదాంత కవి వేమనయోగి. వేమన పద్యాలు చక్కని సులభశైలిలో ఉదాహరణరూపంగా ఉంటాయి కాబట్టి అవి ఆయన్ని ఆకర్షించినై. నీతులూ తత్వాలూ చెప్పటంలో వేమన అసదృశుడౌటచేత వాటి ప్రాశస్త్యమాయనకు నచ్చి వాటికి యింగ్లీషు రాశాడు. తెనుగు పుస్తకంయొక్క గొప్పతనాన్ని యితరులకు తెలియచేయడంలో పరదేశీయుడైన బ్రౌన్ మొదటివాడని చెప్పటంతో, ఆయనకు తెనుగు యెడలగల గౌరవం తెల్లమౌతుంది. 1857 సంవత్సరంనాటికి యీన రాసిన వ్యాకరణానికి రెండుముద్రణాలయినై. 1827 సంవత్సరం నాటికే ఆయనరాసిన తెనుగు ఛందస్సు ప్రచురణమైంది.

బిషప్పు కాల్‌డ్వెల్ కూడా మిషనరీయే! బ్రౌన్ దొర వక్క తెనుగులోనేచేస్తే యీన దక్షిణదేశ భాషలన్నిటిలోనూ కృషి చేశాడు. పాశ్చాత్యులు ఇండియాకు వచ్చి యిక్కడి సంస్కృత భాషను నేర్చుకొని, దానిలోవున్న ఋగ్వేదాది గ్రంథాలు చూచే

టుక్కుటికి, నాటికి కండ్లు తెరచినట్లయింది. వారు చాలా గొప్పనుకునే "లాటిను గ్రీకు" భాషలకు మాతృక సంస్కృతంలో పొడగట్టింది. పరిశోధనలు ప్రారంభించారు. ఈ పరిశోధనలు అప్పట్లో జర్మనువారు చాలా విశాలంగాచేశారు. తుదకు ఇండియా ఐర్లండులకు మధ్య వున్న భాషలకన్నిటికీ సంబంధంవున్నట్టు తేలింది. ఈభాషాశాస్త్రానికి "ఫైలాలజీ" అని పేరు. దీనికి పునాది సంస్కృతజ్ఞానం. అప్పటినుంచి, అనగా దాదాపు 100 సంవత్సరాలకిందటనుంచి, యీ పరిశోధన ప్రారంభమైంది. ప్రపంచంలోవున్న భాషలన్నీ పరిశోధనకింది కొచ్చినవి. ఈమార్గంలో దక్షిణహిందూస్థాన భాషలు పరిశోధన చేసినవాడు బిషప్పు కాల్ డ్వెల్. ఈయన తమిళము, తెనుగు, కన్నడము, మళయాళము, తుళు, వకౌ భాషాకుటుంబమని పేరెట్టాడు. ఈసిద్ధాంతం తర్కమూలంగాను, సామ్యమూలంగాను, భాషా వ్యాకరణ పద్ధతుల మూలంగాను సాధించాడు. ఇదివరలో "ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే, ఏపాతయోర్వికృతిః" అనే అనూచాన నన్నయభట్టారకసిద్ధాంతాని కిది విరుద్ధం. కాని కాల్ డ్వెల్ తర్కము పొరబడనట్టే కనిపిస్తుంది. అందుచేత ఈ సిద్ధాంతం కొంత అలజడి కలగజేసింది. పండితులంతా పూర్వసిద్ధాంతపక్షపాతులూ, ఆంగ్లవిద్యా సంపర్కమున్నవారంతా నవీన పక్షపాతులూ అయినారు. ఈచర్చ యిప్పటికీ జరుగుతూనేవుంది. ఇటీవలనే శ్రీ డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు రెండుసంపుటాల ఆంధ్రభాషాచరిత్రరాశి కాల్ డ్వెల్ పద్ధతి సరియైనది కాదని రుజువు చెయ్యడానికి శ్రమపడ్డారు. * కాని యింకా కాల్ డ్వెల్ సిద్ధాంతమే చలామణీలోవుంది. ఆయన పరిశ్రమ మాత్రం అపారం. దక్షిణ భారతదేశంలోవున్న అన్ని భాషల వ్యాకరణాలు, ప్రకృతి ప్రత్యయ సంబంధాలు, పదజాలము, సర్వనామాలు, మొదలైనవన్నీ ఆనుపూర్విగా పరిశోధన చేశాడు.

---

* "పాళీ—తెలుగు" పింగళి లక్ష్మీకాంతంగారు, భారతి సం. 8: సం. 3.

ఈనచేసినపనికి పరిణామం యిటీవల చాలా కనబడుతున్నది. తెనుగు భాష సంస్కృతసంబంధ శృంఖలల్లోపడి, విడిపోవడానికి వీల్లేనంత చిక్కుపడి, గిజగిజ కొట్టుకుంటున్నదనీ, దానిని యేవిధంగానైనా ఆచిక్కునుంచి తప్పించడం కర్తవ్యమనీ, అది యెంతకాలం పట్టినా భాషాకుమారులు తప్పక చెయ్యాలసిందేననీ, ఒక భావం ఇటీవల బయలుదేరింది. ఈభావం కొందరు పెద్దల్లోకూడా అంకురించింది. ఒకవేళ భాషా సంప్రదాయాలూ మర్యాదలూ యెరువు తెచ్చు కోటంచేత భాషకు కొంత స్వాతంత్ర్యం తగ్గిందేమోగాని- బొత్తుగా భాష నష్టపడిందనడం అంత విశ్వాసపాత్రంకాదు. పరభాషా సంప ర్కంచేత భాషవిస్తరిస్తుందిగాని యెన్నిటికీ సంకుచితం కాదని నామతం. ఈకాల్ డ్వెల్ సిద్ధాంతం తెనుగుభాషకూ సారస్వతానికీ చేసిన ఉపకారాపకారాలను తర్వాత ముచ్చటించుకుందాం. ఈ బ్రౌన్ కాల్ డ్వెల్ దొరలకు తెనుగువారెంత కృతజ్ఞతచూపినా తక్కువే! వాళ్ళ కృషి యెన్నటికీ మరువదగిందికాదు. విదేశస్థు లింత సేవచేయడం అరుదు. దాస్యంవల్ల కలిగిన యింగ్లీషుభాషాసేవవంటిది కాకుండా, నిజంగా జిజ్ఞాసాపూరితమై, భాషకు అత్యంతోపకారక మైంది. ఒకాయన భాషాసంబంధమే యేర్పాటు చేశాడు. మరో ఆయన భాషావైశాల్యాన్ని కొలిచి సరిహద్దులూ విస్తీర్ణం నిర్ణ యించాడు.

శబ్దరత్నాకరం:

బ్రౌన్‌దొరగారు ఆంధ్రసారస్వతమంతా అవలోకనం చెయ్యకపోవటంచేత ఆయనరాసిన నిఘంటువు సమగ్రంకాదు. ఎలాగైనా ఆంధ్రుడు పండితుడై రాసేనిఘంటువువేరు. సాంప్రదాయా నికి నూతనుడైన యెంతపండితుడైనారాసింది వేరు! ఇటీవల "గాల్టీ" దొరగారొక తెనుగునిఘంటువును రచించి యింగ్లీషు లిపిలో అచ్చే యించారు. పాప "యెందుకాయన యింత శ్రమపడ్డాడూ"అని నాకు

చాలాజాలేసింది. దాన్ని బొబ్బిలిరాజాగారి కంకితం యిచ్చాడు. ఆంగ్లంలోవ్రంటుటంచేత ఆంధ్రుడెవ్వడూ దానిసహాయం కోరడుకదా! ఆంధ్రులుకానివారెందరు తెనుగు చదువుకునేవారుంటారు? అటువంటి వాళ్ళు వకవేళ చాలామందివున్నా, తెనుగులిపిలేకుండా తెనుగుభాష చదువుకొంటారా? కాబట్టి అట్టి ప్రయత్నం కేవలం నిష్ఫలం. ద్రవ్యం మనది కాదు కాబట్టి అచ్చేసుకోనీండి. మనకేం! మనకు మాత్రం అట్టి నిఘంటు వనవసరం. అంతకంటె బ్రౌన్‌దొరగారి నిఘంటువు లక్షరెట్లుపయోగం! తెనుగువారుకూడా దానివల్ల ప్రయోజనం పొందడానికి వీలుంది. కాని తెనుగులో సమగ్రమైన పదనిఘంటువు అవసరం తీర్చినట్లు యితరం తీర్చలేదు. ఇట్టి నిఘంటువు యొక్క అవసరం మిషనరీలకే కలిగింది. వారందరూ చేరిన ఒక సంఘం,* అట్టి నిఘంటువును రాయమని బహుజనపల్లి సీతారామాచార్యులు గారిని కోరగా ఆయన అందులకు అంగీకరించాడు. ఈన చిన్నయ సూరంతవాడు. చిన్నయసూరి వదలిన వ్యాకరణ విషయాలను "త్రిలింగలక్షణశేష" మనే పేరుతో పూర్తిచేసిన వైయాకరణి. బహుగ్రంథపఠనం కలవాడు. భాషావేత్త. ఈయన తనకు వప్పజెప్పిన పనిని చాలా బాగా నిర్వర్తించి "శబ్దరత్నాకరా"న్ని నిర్మించాడు. నేటివరకు ఆంధ్రభాషకు శరణ్యమైన నిఘంటువు అదే! దాదాపు ప్రచురించి 50 యేండ్లయింది. ధారావాహికగా ప్రవహించే జీవద్భాషకు సంస్కృతానికిమల్లె, మారని కట్టుదిట్టాలుగల వ్యాకరణం రాయడం అసంభవం. మన వ్యాకరణాలను నన్నయభట్టు "ఆంధ్రశబ్ద చింతామణి" దగ్గరనుంచి "సూర్యనారాయణీయం" దాకా-చూస్తే, యీసంగతే మనకు గోచరమౌతుంది. అట్లాగేఅటువంటి జీవద్భాషకు శాశ్వతంగా పనికొచ్చే నిఘంటువుకూడా వుండటానికి వీలులేదు. ఎప్పటి కప్పటికి నిఘంటువుకు అనుబంధాలు ప్రచురిస్తూ ఉండాలసిందే!

---

* *The Madras School Book and Vernacular Literature Society.*

చేంబర్సు నిఘంటువుగాని, ఆక్సుఫర్డు నిఘంటువుగాని చూస్తే చివర వక అనుబంధం (Supplement) కనపడుతుంది. కాబట్టి శబ్దరత్నాకరం సమగ్రం కాదనడం ఆచార్లవారి తప్పుకాదు. భాషకు సహజ లక్షణం. ఆచార్లవారు చేసిందిమాత్రం చాలా గొప్ప కృషి! బ్రౌన్ దొరవారి నిఘంటువున్నా, పద్ధతులు కొన్ని మార్చడమేగాక ఉదాహరణాలు బహు గ్రంథాల్లోనుంచి యిచ్చాడు. మాటలకు భిన్నార్థాలు యిచ్చాడు. ఒకవ్యక్తి అంతకంటె యెక్కువ చెయ్యలేదనడం యెన్నడూ యేగొప్పపనీకూడా చెయ్యనివాళ్ళనేమాటగాని, కష్టసుఖాలు తెలిసినవాళ్ళనేమాటగాదు. "వాడట్లా, వీడిట్లా" అనడం ఆంధ్రులకు సహజదోషం! చేసినవాడికీ, చేసినపనికీ, కృతజ్ఞతచూపడం మనం యింకా నేర్చుకోవలసినగుణం. బ్రౌన్, సీతారామాచార్ల ద్వయం ఆంధ్రభాషకు దాదాపు సమగ్రమైన నిఘంటువును యేర్పరచారనచ్చు. సూర్యరాయాంధ్ర నిఘంటువు 30 యేండ్లనుంచీ మోగుతూంది కాని, పూర్తిగా యెప్పుడౌతుందో తెలియదు. శబ్దార్థచంద్రిక వంటివెన్నైనా శబ్దరత్నాకర ప్రతిబింబాలే! ఆంధ్ర వాచస్పత్యం మాత్రం, వక్క-చేతిమీద, భూమి అమ్ముకునో, యేదోవిధంగా శ్రమపడి నెగ్గించాడు కొట్రా శ్యామల కామశాస్త్రిగారు. ఒక్క-వ్యక్తి భాషకు యెంతసేవ చేయగలడో అంతాచేసి ధన్యుణ్ణనిపించుకొన్నాడు శాస్త్రిగారు. సీతారామాచార్లుగారు తన నిఘంటువు ఆదిని సంగ్రహాంధ్ర భాషాసారస్వత చరిత్రరాశి, కవులను, గ్రంథాలను, కొన్ని తరగతులుగా విభజించి తారతమ్యం చెప్పారు. అదిమాత్రం అసంగతం. తన భాషాసేవ యిప్పటికీ ఉపయోగపడుతున్నట్టు చేసుకున్న పూర్వయుగంలో వ్యక్తి యీన.

అముద్రిత గ్రంథ చింతామణి:

నెల్లూరు సారస్వతకేంద్రాల్లో వకటి. మొదట్నించీ ఈకాలంలో అక్క-డ పూండ్ల రామకృష్ణయ్యగారనే భాషాసేవకుడు "అము

దిత గ్రంథ చింతామణి" పేరుతో వక పత్రిక స్థాపించి భాషాసేవ చేశాడు. విమర్శనానికి నిజంగా పునాది వేసినవాడీయనే అనచ్చు. కాని ఆవిమర్శనాలు రంధ్రాన్వేషణాలతో నిండి భాషకు ప్రాధాన్య మివ్వకుండేవి. అయినా వారు చేసిన భాషాసేవ మెన్నదగినది. వేదం వెంకట్రాయశాస్త్రిగారు మొదలైన పండితకవుల రాతలకీ పత్రిక రంగస్థలంగా వుండేది. ఇప్పటికి యీపత్రిక వెనకటి సంచికలు చూస్తే చాలా విజ్ఞానవృద్ధికరంగా కనిపిస్తై. అదివరలో అచుంబితాలైన అనేకవిషయాలు అనగా శాసనపరీక్ష మొదలైనవికూడా యిందులో వుంటై. శ్రీ రామకృష్ణయ్యగారు పత్రికద్వారా చేసినసేవ కూడా చాలా మెన్నతగినదే! ఇట్లా వుండగా శ్రీ వీరేశలింగంగారు రంగంమీదికి వచ్చారు.



# నవ్యాంధ్ర సాహిత్యవీధులు

## ౧

### సంధ్యాకాలం: (శ్రీ వీరేశలింగం పంతులు గారు)

ఏదైనా చాలాకాలముంటేగాని, అనుభవించగలిగిన దానికంటె యెక్కువైతేగాని, విసుగేస్తుంది. "కడుపు నిండితే గారెలు చేదు." పందొమ్మిదో శతాబ్దంనాటికి ఆంధ్రప్రబంధ కవిత్వస్థితి అట్లావుంది. శాస్త్రకట్టు ప్రకారం ప్రబంధం రాయడం! దానిలో తూచాతప్పకుండా అన్ని వర్ణనలు ఉండడం! మొదటి మొదటి ప్రబంధకవులు ఒక్కొక్కరు యేదోవక విశేషగుణం కవిత్వాని కలవడ జేశారు. "అల్లసానివాని అల్లిక జిగిబిగి, ముక్కుతిమ్మనార్య ముద్దుపలుకు, పాండురంగవిభుని పదగుంభనంబు..." ఈ ప్రకారంగా పెరిగి ఆహ్లాదం కలిగించిన ప్రబంధకవిత్వం బూజుపట్టింది. చర్వితచర్వణం' గతానుగతికం అయిపోయింది. తరువాతి ప్రబంధాలు వక్కటిచదివితే మరిచదవనక్కర్లేదు. అవేసన్ని వేశాలు, అవేవర్ణనలు, అదేపరిణామం. అందాకా యెందుకు? జనబాహుళ్యం రుచిమారిందేగాని, ప్రబంధాలు రాశేవారూ, చదివి ఆనందించేవారూ, యీకాలంలోమాత్రం లేరూ? అన్నిరుచులు అన్ని కాలాల్లో వుంటై. కాని అటువంటివాళ్ల సంఖ్య ఇప్పుడు చాలా తక్కువ. ఒక్క సంగతి విని ఆశ్చర్యపడ్డాను. కిందటి నవ్యసాహిత్య పరిషదధ్యక్షులైన విశ్వనాథవారు రామాయణం రాస్తూన్నారు! ఇదో విచిత్రం! "సర్-రియలిజమ"ని కొందరు ఘోషపెడుతూ వుంటే, పాతల్లో పాతైన రామాయణం రాయడమేమిటో!

ప్రబంధయుగం 19 శతాబ్దంలోకి అనువృత్తమైంది. ఈ పందొమ్మిదో శతాబ్దోత్తరార్థం మనదేశానికి చాలాఉపద్రవకరమైన

కాలమేగాక, అన్నివిధాల మార్పుకు పునాది వేసినకాలం. 1857 సంవత్సరానికే ఇంగ్లీషువారి రాజ్యంగట్టిపడింది. ఇంగ్లీషురాజభాషైంది ఆభాషను మన ప్రముఖులు కొంత మంది చదువుకున్నారు. పర దేశీయభాషాసంపర్కం మనవాళ్ల చిత్తవృత్తుల్లో మార్పుకలగజేసింది. మన ఆంధ్రదేశానికి పైనాకిందాకూడా యీపరివర్తనాగ్ని అంటు కున్నది. ఈగాలి బెంగాలుకు మద్రాసుకు ముందు కొట్టింది. మద్రాసు సులభంగా మారే ప్రకృతికలదికాదు. ఇన్ని సంవత్సరాల నుంచీ ఇంగ్లీషువారి సంపర్కమున్నా కాఫీపింగు సంగతి చూడండి! ఆంధ్రదేశంలో వున్నన్ని క్రాపింగుగుండ్లు, తమిళదేశంలో లేవు. ఇక బెంగాల్‌దేశం చూడండి. అన్నీ అవ్వే! ఇదే యీరెండు దేశాల భేదాన్ని చెబుతున్నది. ఒకమూల మిషనరీలు క్రైస్తవ మతాన్ని అత్యంతం ప్రచారం చెయ్యటం మొదలుపెట్టారు. వర్ణాశ్రమధర్మం మీద కొందరికి ఏహ్యతకలిగింది. మానవులందరు వకటేననే సూత్రం బయలుదేరింది. తుదకు సనాతనమత లోపభూయిష్టమనే అభి ప్రాయం ప్రబలింది. ఈఅసంతృప్తికారణంగా కొందరు పరమతాల్లో చేరడం తటస్థించింది. ఈఆపత్తు కొందరు మహాశయులు కనిపెట్టి, కొత్తమతాలు లేవదీశారు. వాట్లో బ్రహ్మమతం వకటి. ఈ మతం క్రైస్తవమతానికి ప్రతిబింబం. పశ్చిమం పంజాబులో సిక్కు ఆర్య సమాజ మతాలెట్లా ముసల్మానుల మత పరివర్తనాన్ని ఆపడానికి పుట్టాయో, బెంగాలులో యీ బ్రహ్మసమాజం క్రైస్తవుల మత పరి వర్తనానికి అడ్డుతగిలింది.

ఎప్పుడైతే మతప్రచారానికడ్డుతగిలిందో, ఇంగ్లీషువారాలో చించారు. రాజకీయంగా గెలిచినదేశం మతంలో భిన్నత్వంచేత నిలువ బెట్టుకోడం కష్టమని గ్రహించారు. వైజ్ఞానికంగా విజయం గనక పొందితిమా, మనరాజ్యం చిరస్థాయిగా వుంటుందని నిశ్చయించారు. ఇందుకు యింగ్లీషుభాషాపఠనం ప్రవేశపెట్టడమే మార్గమని ఊహిం

చారు. ఈదూరదర్శిత్వం కొంతవరకు ఫలించిందని యిప్పటి పరిస్థితులే తార్కాణం. మెకాలే మహాశయుడు ఇంగ్లీషువిద్యా ప్రణాళికను తయారు చేశాడు. ఇంగ్లీషు పాఠశాలలు స్థాపింపబడ్డై. కొన్నియిందులో మిషనరీలు నడిపేవి. ఇంగ్లీషు క్రైస్తవ విజ్ఞానాలు పెరిగి పోయాయి. అవి చదివిన మనవాళ్ళకు మనదంతా అసహ్యంగా కనపడ్డది. బంగాళీలు కొందరే అవకాశం తీసుకొని సారస్వతానికి నూతన వికాసమివ్వడానికి పూనుకున్నారు. బంకించంద్రుడు మొదలైనవారట్టివారే. ఏవంక చూచినా యింగ్లీషు వాతావరణమే. మాట్లాడితే యింగ్లీషే మాట్లాడాలి! రాస్తే యింగ్లీషే రాయాలి!

క్రమంగా యీపరిస్థితు లాంధ్రదేశానికికూడా పాకినై. ఇద్దరు వ్యక్తులు వీటికి పాలైనారు. కాకినాడలో శ్రీ నాయుడుగారూ; రాజమహేంద్రంలో శ్రీ వీరేశలింగం పంతులుగారూ. శ్రీనాయుడు గారిలో సంస్కృతాంధ్ర భాషాసంస్కారం తక్కువై, ఆయన కేవలాంగ్ల పండితుడవటంచేత, ఆయనప్రతిభ కేవల మతవ్యాపనమే పరిణామం కలదై పోయింది. కాని శ్రీ వీరేశలింగం పంతులుగారు దేశీయ సంస్కారాలుకల మనిషి. ఈన మతవ్యాపనం దేశభాష మూలంగా సాగించాడు. * రాజమహేంద్రవరం పూర్వం ఆంధ్ర భాషకూ, కవిత్వానికీ కేంద్రం. మళ్ళీ యిప్పుడుకూడా కేంద్రమై పోయింది. పూర్వయుగంలో నన్నయ యెట్లా ఆంధ్రకవిత్వానికి మూలకందమైనాడో, శ్రీ వీరేశలింగం పంతులుగారు నవ్యాంధ్రసారస్వతానికి మూలపురుషుడైనాడు. మతావేశం ఆయన హృదయంలో గాఢంగా నాటుకుపోయింది. ఆయన పరమేశ్వరుడిచేత సంఘాన్ని

* వీరేశలింగం పంతులు గారిని మార్చింది ఆంగ్లవాఙ్మయం. వారి రచనలన్నింటిలోనూ కళాప్రియత్వంతోబాటు సంస్కరణ యెక్కువ పాళ్ళు కలదై కనిపిస్తుంది.
(జ. రు. శాస్త్రి, ఆంధ్రపత్రిక 22-9-40.)

బాగుచేయడానికి పంపబడ్డ దూత అనుకున్నాడు! అట్లా అనుకుంటే తప్ప ఆయన యింతపని చెయ్యగలుగుతాడా? వకదేశం సాంఘికంగా గాని, మతవిషయంగాగాని, రాజకీయంగాగాని అలజడికి పాలైనప్పుడు మనుష్యుల హృదయాలు వకవిధంగా కలతచెందుతై. ఆ కలత చిత్రకారుల చిత్రాలలోనూ, కవుల గ్రంథాలలోనూ ప్రతిబింబిస్తూ వుంటుంది. అందులో వాదోపవాదాలు బయలుదేరేటప్పటికి, అసలు విషయం యెలాగున్నా, సాహిత్యానికిమాత్రం ఉపకారం జరుగుతుంది. అందుచేతనే జాతీయజీవనం సారస్వతంలో ప్రతిబింబితమై ఉంటుందని అంటారు. ఎలాగైతే నన్నయకాలంలో "కథా కవితార్థ యుక్తి" కిన్నీ "అక్షర రమ్యత" కున్నూ జరిగిన పోరాటం ఆయన గ్రంథంలో కనపడుతున్నదో; యెలాగైతే తిక్కనకాలంలో జరిగిన చిన్న యుద్ధాలు రాయబారాలు ఆయన గ్రంథంలో ప్రతిబింబిస్తున్నయ్యో; యెలాగైతే శ్రీనాథుడి కాలంలో కవుల జీవితం వగైరాలు ఆయన చాటుధారలలో వ్యక్తమౌతున్నయ్యో; యెలాగైతే ప్రబంధ కాలంలో కడుపులో చల్ల కదలకుండా రాజపోషణవల్ల కలిగిన ఐశ్వర్యం, సౌఖ్యం ప్రబంధాల్లో మూర్తీభవిస్తున్నదో; అల్లాగే వీరేశలింగం గారి వివిధ కృతుల్లో ఆయన హృదయవేదన సంస్కరణాభిలాష అచ్చుగుద్దినట్టు కనబడుతున్నై.

తనభావాలను వ్యక్తంచేసే వాహనంగా సారస్వతాన్ని గ్రహించాడు. హిందూసంఘంలో వున్న బాల్యవివాహం, విధవావివాహనిషేధం, రండాముండనం, వృద్ధవివాహం, విగ్రహారాధన, మొదలైన ఆచారాలు ఆయనకు ఏహ్యంగా కనపడ్డాయి. బ్రహ్మసమాజ మత వ్యాపనకు మాత్రం శ్రీనాయుడుగారితో కలిసి పనిచేస్తూ, మిగిలిన కాలాన్ని, ధనాన్ని, ప్రతిభనూకూడా వీటి ఖండనంలో వినియోగించాడు. భాషకు మహోపకారమైంది. ఆయన మతసంఘసంస్కారము మంచిదా చెడ్డదా అనిగాదు యిక్కడ ప్రశ్న. ఆయన చేసినపని

యొక్క పరిణామమేమిటీ అనేది మనకు కావలసింది. పరీక్షచేస్తే వెనకశతాబ్దంలో జరగాలసిన సారస్వతసేవ అంతా ఆయన వక్కడే చేశాడు. అప్పుడు రాజమహేంద్రవరం పండితులకూ, కవులకూ, నిలయమై వుండేది. వీరిలో చిన్నా పెద్దా ఉండేవారు. వీరిలో శ్రీ వీరేశలింగం పంతులుగారున్నూ, కొక్కొండ వెంకటరత్నం పంతులు గారున్నూ, మత సాహిత్యవిషయాల్లో బద్ధ శత్రువులు. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారుకూడా అటువంటివాడే! * వీరికందరికీ చేతిలో వక పత్రిక వుండేది. వాటిలో వాదోపవాదాలు! ఇంగ్లీషు చదువు కున్న, చదువుతున్న విద్యార్థులంతా వీరేశలింగంగారి శ్రీరామసేన. వీళ్ళసహాయంతో శ్రీ పంతులుగారు అనేక విధవలకు వివాహాలు చేశాడు. ఆ దంపతులను యేనుగులమీద ఊరేగింపజేశాడు. అనేక బాల్యవివాహాలను ఆపాడు! దేశంలో వైజ్ఞానికంగా యువకుల చిత్త వృత్తుల్లో చాలా పరివర్తనం కలుగచేశాడు. శ్రీనాయుడుగారికి కూడా యిట్టి శిష్యగణమేవుండేది కాని, వాళ్లు అంతా యింగ్లీషుపండితులు. ఇద్దరి శిష్యులలో యిప్పటికీ కొందరున్నారు. బ్రహ్మసమాజమతమీ శిష్యగణంలో లీనమైవుంది. వీరి ప్రచారమూ, దేశకాలసహాయమూ, కలసి మతాచారాలను కొంచెం సళ్లించిందనక తప్పదు. ఏదియెట్లా వున్నా వీరేశలింగంగారి కృషి, భాషకూ సారస్వతానికీకూడా అత్యంతోపకారకమైంది.

పంతులవారిసేవవల్ల భాషకుజరిగిన ముఖ్య మహోపకారాలు మూడనచ్చు.

(1) భాషా సౌలభ్యకల్పనం
(2) వివిధ సారస్వతవ్యాప్తి.
(3) పరభాషా వాఙ్మయం తెలుగులోనికి రావటం

వీటిని గూర్చి నాలుగు ముక్కలు చెప్పటం అప్రస్తుతంకాదు.

---

*ఈన యిటీవలనే పరమపదించారు-ఆంధ్రదేశానికి తీరనికొరత గలిగింది.

1. భాషాసౌలభ్యకల్పనం :

శ్రీ పంతులవారి ఉద్దేశ్యం సంఘసంస్కారం, మతబోధ. వీటికి పాత్రులెవరు ? సామాన్యప్రజలు. అందరికీ అర్థమయ్యే భాష రాయటం అవసరమైంది. వీరశైవ మతవ్యాప్తి కోసం రచిస్తూ, పాల్కురికి సోమనాథుడు "జానుతెనుగు"లో రాయటమేకాకుండా, దేశీయఛందస్సైన "ద్విపద"లో రచించాడు. జనబాహుళ్యానికి ఉద్దేశించే ప్రతి గ్రంథమూ, సులభశైలిలో ఉండాలె గాని, గిడుగువారు చెప్పినట్లు "కృతకభాష"లో ఉండరాదు. శ్రీవీరేశలింగం పంతులుగారీ రహస్యాన్ని కనిపెట్టారు. 17, 18 శతాబ్దాలలో తుపాకుల అనంత భూపాలుడు, సముఖం వెంకటకృష్ణప్పనాయకుడు, కళువె వీర్రాజు వగైరాలు రాశిన తెనుగువచనంచూస్తే చాలా సహజంగావుండి, సర్వజన పఠనయోగ్యంగా ఉంటుంది. శైలికూడా సంభాషణ శైలిగా వుంటుంది. ఇప్పుడు ఓరియంటల్ లైబ్రిరీలో వున్న గ్రామకైఫీయతులుకూడా ఆభాషలోనేవుంటై. ఇవేగాక కొలరు భాషాంతరీకరించిన చారిత్రిక గ్రంథాలు కూడా అట్లాగేఉంటై. చూడండి యీక్రింది వచనం :

"కొన్ని దినాలకు పిమ్మట రాజా చొక్కనాథనాయనింగారు తమ వివాహార్థముగా, తంజావూరు రాజావిజయరాఘవనాయని వారి వద్దకు, తమ బంధువులను స్థానాపతులనుకూర్చి, వారి భేటికి యోగ్యమైన వస్త్రభూషణాదులున్ను యిచ్చి అంపించిరి. వారున్ను వచ్చి భేటిచేసుకున్నందున విజయరాఘవనాయనివారు వచ్చిన వర్తమానమేమిటియని యడిగిరి."

1827 సంవత్సరంలో, అనగా చిన్నయసూరికి అవ్యవహిత పూర్వంగా ఉన్న యీక్రింది గద్య చూడండి :

"తమరు—అబద్ధములు లేకుండా శోధించుమని మావద్ద యిచ్చిన-శబ్దమంజరి యొక్క ప్రథమ ద్వితీయ భాగములైన-అక్షర గుచ్ఛము, సంధి వృంతము-ఈ రెంటినిన్ని-మేము నలుగురమున్ను-బాగాశోధించితిమి-ఇందులో మాకు చూడగా అబద్ధములు లేవనిన్ని-యిది బాలులకు చదువనుపయోగించుననిన్ని-తోచుచున్నది.

ఈప్రకారముగా"

(సంతకములు).

ఎంత చక్కగావుందో, దీనికిన్నీ గ్రంథాల్లో వచనాల్లో ఉన్న భాషకున్నూ, యెంతభేదముందో చూడండి! పద్యంకంటె గద్యం వైశద్య ప్రధానం. సంహితకంటె బ్రాహ్మణం యెంతవిశదంగా వుంటుందో చదివితే తెలుస్తుంది. చ్యుతసంస్కారం కానట్టి, చిన్నయ సూరి ప్రభృతుల "కృతకభాష" కాక సులభగ్రాహ్యమైనట్టి, వక ప్రత్యేక శైలిని కనిపెట్టారు వీరేశలింగం పంతులుగారు. చ్యుతసంస్కారం కాకుండా అటువంటి భాషైతే పండితులుకూడా ఆదరిస్తారు. ఈభాష మిక్కిలి సులభమై, అందరికి గ్రాహ్యమై, శ్రీపంతులవారి అభిప్రాయప్రచారానికి మిక్కిలి సాయపడుటేగాక, భాషాసాహిత్యాల కొక నూతన జీవం కల్పించింది.

## 2. వివిధ సారస్వత వ్యాప్తి :

ఆంగ్లసారస్వతంలోవున్న సారస్వతవీధులన్నీ చూచేటప్పటికి, మనభాష బీదతనం పంతులుగారికి తేటపడి, వాటిలోకూడా వ్యవసాయం చెయ్యాలని గట్టిగాతట్టింది. అదివరలో యేవోకథలూ కథానికలూ వుండేవేగాని, పాత్రలశీలం ముఖ్యంగాకలిగీ, కథాభవన నిర్మాణంకలిగీ, సంభాషణ పూరితాలైన గాథలు లేవు. వాటినియింగ్లీషులో "నావెల్" లంటారు. దాన్నే యిప్పుడు తెనుగు సారస్వతంలో "నవల" లంటున్నారు. ఇప్పుడాపదానికా అర్థం రూఢమైంది కాబట్టి నామచర్చ

అనవసరం. * ఇటువంటి నవలారచనకు శ్రీపంతులుగారే మార్గదర్శకులని వక ప్రతీతి. ఆయన "రాజశేఖర చరిత్ర" అనే సాంఘిక నవలను రచించారు. ♦ అందులో మన సంఘంలోవున్న దురాచారాల్ని తూర్పారపట్టారు. ఈనవల ఇంగ్లీషులోకికూడా పరివర్తనమైంది. అట్లా అయిందంటే దానిప్రాశస్త్యానికి వేరేసాక్ష్యమక్కర లేదు. ప్రథమాంధ్ర నవలారచయిత శ్రీపంతులవారేననే కీర్తిగడించారు. ఇది గోల్డుస్మిత్ "వికార్ ఆఫ్ వేకుఫీల్డు" అనేదానికి పరివర్తనమని అంటారు కాని అనుకరణంగాని పరివర్తనంకాదు.

తెనుగులో బొత్తుగా నాటకంలేదని చెప్పటానికి వీల్లేదు. తంజావూరు లైబ్రరీలోనూ, చెన్నపురి ఓరియంటల్ లైబ్రరీలోనూ కూడా, నాటకాలు, యక్షగానాలు, సంఖ్యకుమించి ఉన్నై. అవ్వన్ని చూస్తేనూ చదివితేనూ, తోలుబొమ్మలాటలల్లే పామరజనోపయోగంగా కనిపిస్తై. వాటిని యిప్పుడు అందరూకూడా చాలా గొప్పవని అనుకోడం వకఅలవాటైపోయింది. మరీనవ్యసాహిత్య వేత్తలకవి వేద భాగాలల్లె కనపడుతున్నై! వాటిలో భాషసులభమైనట్టు కనపడ్డా, మాండలికాలతోనిండి,సహృదయుడికి కావలసిన పాత్రపోషణం, రసం, కథాసంవిధానం మొదలైనవేమీ ఉండవు. వాటినిమాత్రం తోశి రాజనటానికి వీల్లేదు. అవిమన సహజవిజ్ఞానచిహ్నాలు కాబట్టి మిక్కిలిగా మనకాదరణీయాలే! మన్నారుదాసవిలాసమనే నాటకాన్నొక

---

* నరహరి గోపాలకృష్ణసెట్టిగారు "శ్రీరంగరాజ చరిత్ర" అనే నవల రాశి 1872 లో ప్రచురించినట్లున్నూ, "హితసూచని" అనే పేరుతో వ్యాసావళిని స్వామినేని నరసింహనాయుడుగారు 1863 లో ప్రచురించారనిన్నీ వేకుమళ్ళ రాశాడు.

(ప్రబుద్ధాంధ్ర జనవరి 1934, ప్రతిభ Vol. I. 3)

♦ "రాజశేఖరచరిత్ర మను నవల విపరీతస్థితిలో నడచినందున, లోకములో నిట్టి గ్రంథములు పుట్టిన సారస్వత మంతయు పాడగునని విమర్శింప బూనితిని. ఈ విమర్శనము నా మొదటి గ్రంథము."

(కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు)

దాన్ని ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించారు. ఇవన్నీగనక ప్రచురిస్తే ఆంధ్రభాషా వాఙ్మయ చరిత్ర రచనానికి చాలా ఉపకారకమౌతుంది.

అప్పటికాలానికి సమీపానే బళ్ళారిలో రెండు వ్యక్తులు, తెనుగులో సంస్కృత ఫక్కీ నాటకం లేకపోవటంచూచి, ఆలోటు భర్తీ చెయ్యాలని సమకట్టారు. శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావుగార్లిద్దరూ వకీళ్లే! మంచి ప్రాక్టీసుకలవారే. కాని వృత్తితోపాటు సారస్వతసేవకూడా మరవలేదు. వీరిలో రావుగారికి ఆచార్లగారల్లే పౌరాణిక నాటకాలంటేనే గాకుండా చారిత్రకాలంటేనూ చాలాయిష్టం! వీరిద్దరూకూడా స్వతంత్రవ్యక్తులే! వీరిలో ఆచార్లవారినాటకాలకెక్కువ ప్రచారంకావడంచేత ఆంధ్రదేశం వారికి "ఆంధ్రనాటక పితామహ" బిరుదిచ్చి గౌరవించింది. ఇద్దరూ గ్రంథకర్తలేకాకుండా స్వయంనటులై, రంగప్రసాధనం, యవనికావిక్షేపం, నేపథ్యవిధానం మొదలైనవాట్లో దిట్టలు. వీరు స్వంతనాటక కంపెనీలను స్థాపించారు. కళోపాసనే వీరి ఆదర్శం. † వీరితోబాటు బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు కూడా కొంతకాలంతర్వాత 1905 ప్రాంతంలో హరిశ్చంద్ర బహురసవంతంగా రచించాడు. ఇప్పటికిది ఉత్తమాంధ్రనాటకాల్లో వకటని చెప్పటంలో యేమి అతిశయోక్తి లేదు* శంకరకవి గ్రంథానికి మెరుగుపెట్టాడనవచ్చు. ఈనానటుడే! ఈనపై బళ్ళారివారి కెంతమాత్రం తీసిపోనివాడు. వేదం వెంకట్రాయ శాస్త్రిగారు తమ అభిజ్ఞానశాకుంతలాన్నికూడా అప్పటికే రచించాడు. శ్రీవీరేశలింగం పంతులుగారుకూడా ఆంధ్రనాటక వాఙ్మయానికి కమవంతు సమర్పిస్తూ అభిజ్ఞానశాకుంతలాన్ని సంస్కృతంలోనించి

† *In June 1891 this society (Sarasa Vinodini Sabha) of amatues gave if I am not mistaken 4 performances in the V. P. Hall.*

*(P. Sambandam in the Hindu 9–11–41)*

* ఈన చీనాచరిత్రకూడా రాశాడు.

తెనుగులోనికి పరివర్తనం చేశాడు ♦ ఎందరెన్ని పరివర్తనాలు చేసినా యిదే ఉత్తమమైందై, ప్రదర్శనాల కుపయుక్తమై, తుదకు సినీమా రంగానికికూడా పనికొచ్చింది. ఇదిగాక మాళవికాగ్ని మిత్రాదులను కూడా తెనిగించాడు. ఈవిధంగా సంస్కృతనాటక ఫక్కీ-ప్రకారం పరివర్తనాలూ స్వతంత్రాలూకూడా యీకాలంలోనే బయలుదేరినై అనవచ్చు. వీటికీ వెనకటి నాటక యక్షగానాలకూ చాలా భేదముంది.

ప్రహసనం పంతులుగారి చేతిలో మంచిఉన్నతి కొచ్చింది. వారి సాంప్రదాయదూషణాదులకు దోహదం యిచ్చింది. పూర్వసాంప్రదాయలమీాద నైరస్యం కలిగించడానికి ప్రహసనం చాలా ఉప

---

♦ ఈపరివర్తనాలను కొన్నింటిని కిందఅనువదిస్తున్నాను.

(1) "పరవస్తు వెంకటరంగాచార్లగారిది.
(2) దాసుశ్రీరాములుగారిది.
(3) కందుకూరి వీరేశలింగంగారిది.
(4) రాయదుర్గం నరసయ్య శాస్త్రిగారిది.
(5) వడ్డాది సుబ్బారాయుడుగారిది.
(6) వేదం వెంకట్రాయశాస్త్రిగారిది. (అభినవ సరస్వతి)"
(7) రాజా వత్సరాయి వెంకట నీలాద్రిరాజుగారిది.
(8) కాంచనపల్లి కనకమ్మగారిది.
(9) త్రిపురాన సూర్యప్రకాశరావు దొరవారిది.

" సుప్రసిద్ధ కావ్యకర్త నాటకకర్తయైన కాళిదాసు విక్రమార్కుని కాలమువాడని నిర్ణయము చేయబడియున్నది. వారు వ్రాసిన నాటకములలో అభిజ్ఞాన శాకుంతలం చాలా ప్రఖ్యాతిగాంచినది. దానికి పెక్కు అనువాదములు తెలుగులో బయలుదేరినవిగాని అందు శ్రీ వీరేశలింగంగారి అనువాదమే వుత్తమమైనదనవచ్చును! ఈ సందర్భమున 'అనాఘ్రాతం పుష్పం' అనే శ్లోకమునకు వుపన్యాసకులు శ్రీ వీరేశలింగం పంతులుగారి అనువాదమును తమ (త్రి. సూ. ప్ర. దొరవారు) అనువాదమును సభ్యులకు ప్రసంగవశమున చదివి వినిపించిరి. (ఆంధ్రపత్రిక)

కరించింది. బాల్యవివాహాదులు మొదలైన ఆచారాలను ప్రహసనాల ద్వారా కడిగేశాడీయన.

విద్యార్థుల వుపయోగం కోసం యీన అనేక గ్రంథాలు రచించాడు. ఇంగ్లీషుభాషలో "స్విఫ్ట్" అనే మహాకవి, తనకాలంనాటి పరిస్థితులను విమర్శిస్తూ రాసిన "గల్లివరుయాత్రల"ను గ్రంథము పంతులవారి నాకర్షించి, ఆ నమూనాప్రకారం "సత్యరాజాపూర్వ యాత్రలు" అనేగ్రంథం తయారైంది. చింతామణి పత్రిక స్థాపించి తాను వ్రాసేవాట్ని దానిలో ప్రచురించేవాడు. ఇంకా చిన్న కథలు, వ్యాసాలు, మొదలైన అనేక వాఙ్మయ వీధులందు సంచరించి వన్నె తెచ్చాడు. తెనుగులో మొదటి స్వీయచరిత్రరాశీ, ఆదర్శప్రాయ మైన తమ జీవితచరిత్రను మిక్కిలి సులభశైలిలో అందరికి అంద జేశాడు. తుదకు పాఠశాలా తరగతుల్లో పఠనీయ గ్రంథాలను కూడా-సంగ్రహ వ్యాకరణంసహా-రాశాడు. రాశి దాదాపు 40 సంవత్సరాలైనా, యిప్పటికికూడా ఉపయోగార్హాలుగానే ఉన్నై.

### 3. పరభాషావాఙ్మయం తెనుగులోకి రావటం :

ఒకజాతివాఙ్మయం వృద్ధిపొందాలంటేనూ, లోకవిస్తృతి చెందాలంటేనూ, సృష్టిగాక రెండుమార్గాలున్నై. వాఙ్మయంలో వున్న ఉత్తమ గ్రంథాలను, యితర వాఙ్మయంలోకి పరివర్తనంచేసి పరభాషాకుమారులకు అర్పించడం;♦ పరభాషా వాఙ్మయంలోవున్న సాహిత్యాన్ని పరివర్తనంచేసి తెచ్చుకోడం. ఈ రెండుపద్ధతులతో సాహిత్యం విస్తరించడమేగాక యితరుల్ని ఆకర్షిస్తుంది.* ఈ రెంటిలో

♦ దేకుమళ్ల అచ్యుతరావుగారు పింగళి సూరనను గూర్చి ఆంగ్లంలో ఉద్గ్రంథ మొకటి రచించి ప్రచురించారు. ఇది చాలా గొప్ప యత్నం.

* "ఇతరభాషలలోని సాహిత్యశాస్త్ర గ్రంథాలను ఆంధ్రములోనికి అనువ దించినగాని ఆంధ్రభాష సమగ్రముగాదు" అన్నారు.

శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మమహారాజులుంగారు

విరివిగా రెండోపద్ధతి జరుగుతున్నదిగాని మొదటిదంతగా యెవరూ పాటించినట్టుగాని, అసలు గమనించినట్టుగాని తోచదు. పోనీండి! మొదటిదైనా జరుగుతున్నందుకు సంతోషం! ఈపద్ధతి యిదివరలో సంస్కృతంతోపుట్టి దాంతోనే వెళ్ళిపోతున్నది. ఇప్పటికీ సంస్కృతంలోవున్న ఉద్గ్రంథాలన్నీ తెనుగులోకి రానేలేదు! దగ్గిరున్నై కాబట్టి మనతంటాలు మనంపడచ్చు. యెప్పుడో వకప్పుడు వస్తై! కాని పంతులవారిని యింగ్లీషు సారస్వతం ఆకర్షించింది. ఇంగ్లీషులో వున్న "లాంబు" షేక్స్పియరు నాటక కథలు కొన్ని తెనుగులోకి తెచ్చాడు. ఈవిధంగా అనేక యింగ్లీషు గ్రంథాలు తెనిగించాడు * తుదకు వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం, మొదలైన శాస్త్రాలు సంస్కృతంలో అందరికీ అందుబాటులో లేవని తెలుగులోకి యింగ్లీషు భాషలోనించీ తెచ్చి నాటాడు.

ఈవిధంగా నవ్యవాఙ్మయవ్యాప్తికి మూలపురుషుడైన శ్రీపంతులు గారు చేసిన పనిలో శతాంశం చెప్పాను. ఆయన తొక్కని దోవలేదు. కొన్ని వేలపేజీల గ్రంథాలురాశి భాష కమూల్యమైన సేవచేశాడు. వీటిఅన్నిటికంటె వక్క-పనిమాత్రం ఆయన్ని యెవ్వరూ చేర వీలులేని స్థానంలో పెట్టింది. అది "ఆంధ్రకవుల చరిత్ర" రచన. ఆంధ్రవాఙ్మ యానికి-అప్పటికీ-యిప్పటికీకూడా-సమగ్రమైన చరిత్ర లేదు. గురజాడ శ్రీరామమూర్తి పంతులవారి కృతి పుక్కిటిపురాణాలతో నిండిందే గాని, చారిత్రకదృష్టి తక్కువ. పౌర్వాపర్యప్రశంస అనవసరము. ఏవో చిల్లరపుస్తకాలు యిటీవల వచ్చినైగాని, చారిత్రక దృష్టితో, నిష్పక్ష

* కొన్ని యీకింద యిస్తున్నాను.

| | | |
|---|---|---|
| *Comedy of Errors* | — | చమత్కార రత్నావళి |
| *Sheridan's Duena* | — | రాగమంజరి |
| *do Rivals* | — | కల్యాణకల్పవల్లి |
| *Cowper's John Gilvin* | — | దుర్మార్గచరిత్రము |

పాతంగా, రాశినవి లేవు. ఆంధ్రవిశ్వవిద్యాలయ స్థాపనైనతర్వాత అది రాయడం జరుగుతుందని చాలా ఉవ్విళ్ళూరాము. ఇదివరకు జరగ లేదుగదా! ఇప్పట్లోజరిగే సూచనలుకూడా యెక్కడా కనపడటం లేదు! వ్యక్తులకు వార్ధక్యంలో సుఖజీవనానికో, యితరోన్నత పదవు లకు మెట్లుగానో, ఉపయోగపడుతూవుంటై ప్రజాహితసంస్థలు! సమ గ్రాంధ్రులచరిత్ర, సమగ్రాంధ్రసాహిత్యచరిత్ర, ఉత్తమాంధ్ర నిఘంటువు, ఆంధ్రదేశంలో వున్న తాళపత్ర గ్రంథాలను సేకరించ టం, యీపనులుచేస్తే, ఆంధ్రవిశ్వవిద్యాలయం తన కనీసకర్తవ్యం నిర్వర్తించినట్లౌతుంది. భవన నిర్మాణం మీదా, శాస్త్రపరిశ్రమల మీదా యెంతద్రవ్యం వెచ్చించినా, సంస్కృతీ విశిష్టతా వుంటేనే వ్యక్తిత్వం నిలవడమూ! జాతీయత కుపయుక్తం కావటమూనూ! శ్రీ పంతులవారాలోటును తీర్చాలని "ఆంధ్రకవుల చరిత్ర" రాశాడు. దీన్లో పొరబాట్లున్నయ్యని అనడం పరిపాటిగా వుండేగాని, విషయం వచ్చినప్పుడు అదే శరణ్యమైన పుస్తకం! ప్రత్యేక కవులమీద దీని కంటె యెక్కువసామగ్రి గల గ్రంథాలుండవచ్చుగాని, యింత విశాల మైంది మరోటిలేదు. పంతులుగారికీర్తినీ, సేవనూ, చిరస్థాయిగా చెయ్యడాని కిది వకటిచాలు. ఈవిధంగా వారు వ్యవసాయంచెయ్యని సాహిత్యక్షేత్రం లేదు.*

పంతులుగారి పనినిగూర్చి చెప్పవలసినప్పుడు, వకటిమాత్రం చెప్పాలె. సాహిత్యక్షేత్రంలో వారికృషికి విలువేలేదు. కాని మతవిష యంలో వారిరాతలు యువకుల హృదయాల్లో అసంతృప్తిబీజాలు నాటినై. అనేక సనాతనసాంప్రదాయాలమీద వాళ్ళకి నైరస్యం కల్గించినై. ఒకవేపు యింగ్లీషు విద్యాపఠనం, మరొకవేపు క్రైస్తవ మతబోధ, యింకోవేపు సంప్రదాయ విమర్శచేసే పంతులవారిరాతలూ ఆంధ్రదేశం నాలుగుమూలలా, పెద్దలకూ పిన్నలకూ మధ్య, వక

* ఈన బ్రహ్మసమాజ విధవావివాహోద్యమ చరిత్రలుకూడా రాశాడు.

అంతరం కలగజేసినై! కొక్కొండ వెంకటరత్నం, కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి మొదలైన మహామహులు యెంత వ్యతిరేకప్రచారం చేసినా ధ్వంసం జరిగినంత త్వరగా నిర్మాణం జరగదుగదా! వాటివల్ల ప్రయోజనమాత్రం లేకపోయింది. ఈ అసంతృప్తిబీజా లిప్పటికీఉన్నై. వెనకటిదానిలోనా నైరస్యం కలిగింది. దానిచోటు తీసుకోగల కొత్త భావాలా కనపడలేదు. పోనీ! బ్రహ్మమతంలోనైనా సమగ్రంగా ప్రచారంకలిగి, అది దేశంలో పాతుకునిపోయిందా అంటే-అదీ నామావశిష్టంగానేఉంది అనచ్చు.* పూర్వసంప్రదాయ నైరస్యంమాత్రం మిగిలింది. కాని భగవంతుడు ప్రతిదానిని మంచికే చేస్తాడనే నమ్మకంతో మనం పనిచెయ్యాలె.♦ ఈవిధంగాచూస్తే వచ్చేయుగధర్మానికీపరిస్థితులు పునాదులను కల్పించినైయనాలె. చావు పునర్జన్మకు పూర్వరంగం! ఈఅసంతృప్తీ, నైరస్యమూ, కొందరిలో మిన్నుముట్టింది. కొందరిలో తత్వాన్వేషణానికి మార్గమేశింది. కొందరిలో యత్నమే స్తంభించింది, కాని భాషాసారస్వతాల కుపకరించింది. ఈ విధంగా శ్రీ పంతులుగారీనవ్యయుగప్రారంభానికి సంధ్యాదేవతైనాడు. ఈనలేఖిని చాలా నిశితమైనది. ఈనరాతల్లో మెత్తని హాస్యం గోచరిస్తూవుంటుంది. సమయమొస్తే దాన్ని గుచ్చుకునేట్టుకూడా చేయ

---

* ఎక్కడైనా వకవ్యక్తి దాన్నిపట్టుకునివేళ్ళాడేఆయన కనబడుతూవుంటాడు. అటువంటి వాళ్లలో పాలపర్తి నరసింహంగారొకరు. ఇటీవల "భక్తాంజలి" అనే పేరుతో బ్రహ్మసమాజప్రసంగాలను అనువదించాడు. మన్నవ బుచ్చయ్య పంతులు "ఇండియన్ రిఫార్మర్" రనేపేరుతో పత్రిక స్థాపించి దానిలో బ్రహ్మమత ప్రచారంచేశాడు. కొన్ని ఉపనిషత్తులకు టీకలుకూడా రాశాడు.

♦ "వీటిని (గుణదోషాలను) మనలో నాటుకునేటట్లు చేయడానికై మన కులపతులున్నూ, బలాత్కారంగా మనలను ఆంగ్లభాషా పఠనానికి పురికొల్పి దాన్ని మనలోకి యెక్కించడానికి తలిదండ్రులున్నూ చాలాయత్నంచేశారు. ఎవరెంత చేసినా దాని ఫలితం యెలావున్నా, అది మనమంచికోసరమే అని మనము యిప్పుడనుకోవాలె" (పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు)

గలశక్తివుంది. ఈన మతసాంప్రదాయాలను నిరసించి యువకమండలిలో నైరస్యం ఉత్పత్తిచేసినా, భాషాసౌలభ్యానికి శ్రమపడినా డేగాని, భాషాసాంప్రదాయాలను నిరసించలేదు. కాని ఈనచేసిన మతసంప్రదాయనిరసనం, వాళ్ళల్లో భాషాసంప్రదాయ నిరసనానికికూడా బీజాలను నాటింది. ఈన భాషాసంప్రదాయానికి వకటి ఉదాహరణ మిస్తాను. "శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచననైషధ" మనేగ్రంథ మొకటి రాశాడు. ఎన్ని నిర్బంధాలతో రాశాడో చూడండి! ఇంతకంటె భాషాసాంప్రదాయ పోషణానికి తార్కాణమెందుకు? ఇక్కడకూడా ఈన భాషాసౌలభ్యంకోసమే పాటుపడ్డాడు. కూచిమంచి తిమ్మకవి అచ్చతెనుక్కీ, ఈన రాశిందానికీ చాలాఅంతరం. కూచిమంచి తిమ్మకవి రాశిన అచ్చాంధ్రమంతా కృతకభాషాభవం. ఇది అట్లాగాక జనబాహుళ్యం ప్రతిదినం వాడుకునే భాషలోనే వ్యాకరణ సాంప్రదాయాలను పాటిస్తూ రాశింది. ఈన పరిశోధనచేసి అచ్చొత్తిచ్చిన ముద్రితగ్రంథాలు అసంఖ్యాకాలు. అనేక గ్రంథాలకీయన తర్వాత ద్వితీయముద్రణాలుకూడా జరగలేదు. ఈన ధన్యజీవుడు! యశఃకాయుడు!

## తిరుపతి వెంకటేశ్వరులు: *

వకవంక భాషావిషయంలో సౌలభ్యంకోసం వీరేశలింగం పంతులుగారు పాటుపడుతూవుంటే, మరోప్రక్కనించి అటువంటిసేవే చేయటం ప్రారంభించారు తిరుపతి వెంకటేశ్వరులు. వీరిద్దరు కవులు. ఇద్దరూకూడా సంస్కృతాంధ్రాలు రెంటిలోనూ మంచి ప్రజ్ఞ కలవారు. రెండుభాషల్లోనూ మంచి కవితాధార కలవారు. "ద్రోస

*యుగ సాంప్రదాయాలను మళ్లించినవారు వీరేశలింగం పంతులుగారు. పక్కపక్కలనే తిరుపతి కవులుకూడా కొత్తకొత్తమార్గాలను వెతుకుతూ పట్టిందల్లా బంగారం చేశే పరుసవేదిని సిద్ధింపచేసుకున్నారు.

(జ. రు. శాస్త్రి, ఆంధ్రపత్రిక 22-9-40)

మటంచెరింగియును దుందుడుకొప్పుగ బెంచినారమిా, మిాసము రెండు బాసలకు మేమె కవీంద్రులమంచు” సగర్వంగా చెప్పుకున్నారు. పెద్ద నాదులకెట్లా కృష్ణరాయడు దొరికాడో, అట్లాగే పోలవరం భూపతి కృష్ణారావు దొరికాడు వీరికి ప్రాపు. ఈన పరిపోషణ ఛత్రంకిందా, తర్వాత, ఈ జంటకవులు చేసినపని దాదాపు వీరేశలింగంగారు చేసినంతా వుంది. వీరు స్థావరమేర్పరుచుకోవడానికి పూర్వం శతావధాన సంచారంతో ఆంధ్రదేశంలో అన్ని సంస్థానాలూ పరిచయం చేసుకొని బహుమతులను పొందారు. * ఏనుగులమిాద ఊరేగారు! రాజులమిాద పద్యాలు చెప్పారు! అడ్డువచ్చిన పండితులనూ, కవులనూ, ఢీకొన్నారు! చర్చల్లో పాల్గొన్నారు! ఆదరించని రాజులను తిట్టి సుముఖులను చేసుకున్నారు! కవితాదిగ్విజయంపొందారు! ఎదిరించిన శిష్యులపైన గ్రంథాలురాశి శిక్షించారు! మృచ్ఛకటికా ముద్రారాక్షసాలను మాతృకలను మించేటట్టు పరివర్తనం చేశారు! శ్రవణానందాది స్వతంత్ర ప్రబంధాలు రచించారు! “లైట్ ఆఫ్ ఏషియా” ననుసరించి బుద్ధచరిత్రాన్ని రాశారు! దేవీభాగవతాన్ని పురాణ శైలిలో చాలా హృదయంగమంగా రచించారు! “మీరు తెనిగించిన దేవీభాగవతము ప్రాచీనమహాకవి విరచితములైన కావ్యపురాణముల కెంతమాత్రమును తీసిపోక, ఆంధ్రసరస్వతికి సాటిలేని నవీనాలంకారమై విరాజిల్లుచున్నది” అన్నారు సప్తతి సంవత్సరాభినందన పత్రంలో రాజమహేంద్రవర ప్రజలు. పంతులుగారి స్వీయచరిత్రను

* చరిగొండ ధర్మన్నట యీపద్ధతికి మొదటివాడు. హైద్రాబాదులో జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి అనేపేరుగల వక విద్వత్కవి ఉన్నాడు. ఆయన స్వగ్రామం కృష్ణాజిల్లా కలవపాముల. ఆయన “సహస్రావధానమనే” వకశక్తి కనిపెట్టాడు. ఇది ఒక అద్భుతకార్యం! ఈన “ఆంధ్రుల చరిత్ర”ను పద్య కావ్యంగా రచించడానికి ప్రారంభించాడు. కొన్నివందల పద్యాలు రచించాడు. చాలా హృదయంగమంగా ఉన్నై! ఈన గద్వాల సంస్థానంలో వక ఆస్థానకవి. అక్కడనే గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు కూడా వున్నారు.

రాశినట్టే జాతకచర్య కామేశ్వరీశతకాలను రచించారు. భారతానికి దీటుగా గీరతం రాశారు! ఇప్పటికీ ప్రబంధాలను రచిస్తూనే ఉన్నారు. నానారాజసందర్శనంలో "స్వానుభవభాష్యాలను విప్పి" చెప్పారు. పంతులుగారు వచనానికి చేసినసేవ వీరు పద్యానికిచేశారు; పద్యాన్ని 'కృతక" భాషనించీ సాధ్యమైనంతవరకు తప్పించడానికి ప్రయత్నిం చారు. భాషా సాంప్రదాయాలు, వ్యాకరణ సాంప్రదాయాలు, నిర ంచకుండా, కవితను వ్యావహారికభాష కెంతదగ్గరికి తీసుకురావటానికి ెలుందో అంతదగ్గరికి తెచ్చారు. సామాన్యసంభాషణలోవున్న అనేక పదాలను పద్యాల్లో కెకి-ంచి వాటికి గౌరవమిచ్చారు. భాషాసౌల భ్యానికీ, అర్థసౌలభ్యానికీ, రసవత్తకూ దగ్గరిసంబంధం కల్పించి, భాషకూ సారస్వతానికీ అమూల్యమైన సేవచేశారు. "సరస్వతి" అనే పత్రికపెట్టి తమవేగాక అనేకాముద్రితగ్రంథాలను ప్రచురించారు. వీరి ిష్యకోటి చాలావిపులంగా వ్యాపించివుంది. ఆంధ్రదేశం అన్నిమూలలా ిష్యగణంద్వారా స్థావరమేర్పరచుకున్నారు. దానితో పాటు ఆంధ్ర ాహిత్యచరిత్రలో శాశ్వతస్థాన మమిరింది. ఒకకాలంలో వీరి శ్రవణా ందాముల్లో పద్యాలు విద్యార్థిగణం కంఠస్థాలు చేసుకునేవాళ్లు. వీరు ద్యం చదివేఫక్కీ- అనుసరించని యువకుడు లేడనవచ్చు. వీరి శిష్య ణంలో యిప్పుడు పేరుపడ్డ అనేకమందికవులూ, పండితులూవున్నారు. ంగళివారు, కాటూరు [illegible], వేటూరువారు, కవిరాజులు మొద ైనవారు చాలామంది వీరిశిష్యులే! వీరిద్దరిలో తిరుపతిగారు స్వర్గస్థు ైనారు. వెంకటకవిగారు కుటుంబవంతులై, ద్రవ్యం గడించి, చిన్న కు విజ్ఞానమిస్తూ, ఆంధ్రవారపత్రిక పేజీలలో తమసారస్వత భాషాను ్వాలను వెదజల్లుతునే వున్నారు. ఇటీవలనే 70 సంవత్సరాలు ండినై. ఆంధ్రులందరూ తమ సంతోషాన్ని వెలిబుచ్చారు. వీరికి గవంతుడు దీర్ఘాయువిచ్చి కాపాడాలని కోరుతున్నాను. వ్యావహా కభాష ఎట్లావుండాలో వీరి వ్యాసరచనలను చూస్తే తెలుస్తుంది.

మాండలికపదాలు వాడకూడదనేవారు వీరు రచించే వ్యావహారిక భాష చదివితే తమరు తప్పని వొప్పుకుంటారు. వీరి రాతల్లో సర్వప్రాంతీయ వ్యావహారికమూ ఉన్నట్టు కనపడుతుంది. మళ్లా సులభంగా అర్ధమౌతూవుంటాయి.

వీరి రచనల్లో "గీరతం" వక విశిష్టతగల కావ్యం. "అధిక్షేప కావ్యం" (Satire) తెనుగులో చాలా అరుదు. ఎక్కడైనా చాటుధారల్లో కనపడుతుంది! ఇటీవల వెలువడ్డ యిటువంటి చిల్లరకావ్యాలకీ గీరతమే మాతృక. * వెంకటకవిగారి శిష్యుడొకడు తానుశిష్యుణ్ణి కాదనగా వెలువడ్డదీగ్రంథం. ♦ భారతపర్వాలల్లే దీనిలోకూడా "మేకు బిగింపు పర్వం" "చప్పట్ల పర్వం" మొదలైన యితివృత్తానికి తగిన పర్వవిభాగం చాలా రసవంతంగా వుంది. గ్రంథనామనిర్వచనంచేస్తూ యిట్లాగన్నారు.

> శ్లో॥ గీర్షుయేతురతాస్తేవై గీరతాః పరికీర్తితాః
> తానుద్దిశ్య కృతం కావ్యం గీరతం పరిచక్షతే॥

ఇందులో కవిత్వము మిక్కిలి సరళమై, రసవంతమై, సంభాషణ భాషకు చాలా దగ్గిరిగా వుంది. మొత్తంమీద వీరుకూడా భాషకు సౌలభ్యం కలగజేశారు. ప్రసాదగుణం వీరిసొమ్ము! ఒక్కొక్కచోట తాము ప్రౌఢంగా రాయగలమని చూపారు కాని, బహుళంగా సారళ్యం వీరి కవిత్వానికి విశిష్టగుణం. సంధియుగంలో వీరుకూడా ముఖ్యులే!

---

* పంతం ఆంజనేయకవి "దివాంధమ" ని వకటి రచించాడు. ఇంకా తిరుపతివేంకటకవులవే "శనిగ్రహా"దులు కొన్ని ఉన్నై.

♦ రామకృష్ణకవులలో కృష్ణకవి. వీరుకూడా ప్రతిభావంతులైన కవిద్వయమే! "వెంకట రామకృష్ణ గ్రంథమాల" అనే పేరుతో కొన్ని సంపుటాలు ప్రచురించారు. "కథాసరిత్సాగరం" పిఠాపురంలో వుండే తమ ముద్రాక్షరశాలలో ప్రచురించారు. అయిదు సంపుటాలైనై.

మరోవిషయం. ప్రథమయుగంలో శ్రీనాథుడు చాటుపద్య చక్రవర్తి. ద్వితీయయుగంలో కృష్ణరాయల కాలానికి సమీపంలో మళ్ళీ యీ చాటుధారాకవిత్వం తలెత్తింది. రామరాజభూషణుడు శతలేఖినీ పద్యసంధాన నిపుణుణ్ణని చెప్పుకున్నాడు. ఈరెండుపనుల్లో యీజంటకవులు మళ్ళీ వెనకటియుగాన్ని తలపింపజెయ్యడమేకాకుండా మించారని చెప్పవచ్చు. "కలంతో కాగితంమీద పద్యాలు రచిస్తూంటే చెయ్యిగనక ఆగితే దాన్ని తెగెయ్యొచ్చున"ని శపథం చేశారు. ఇప్పుడు ఆంధ్రదేశంనిండా జంటకవుల గుంపులే! శతావధాన్లపుట్టలే! ఇదంతా వీళ్ళ అనుకరణం. * ఎవరో కొందరుతప్ప మిగిలినవాళ్ళు 30 మందికి మించి అవధానం చేసినట్టగపడదు. వీరి చాటువులూ, శతావధానపద్యాలూ, కేవల పూరణమాత్ర ప్రయోజనం కలవేగాక రసవంతంగాకూడా వుంటాయని చెప్పడంలో యెట్టి ఆక్షేపణా లేదు. కొందరు వీరినీయుగకవులుగా భావిస్తున్నారు. ఒక కాలం యెక్కువమంది యేకవి నెక్కువగా అనుకరిస్తారో వారి నా యుగకవి అనచ్చు. పెద్దనను చాలామంది అప్పటికవులనుకరించారు. కాబట్టి ఆయుగాన్ని పెద్దనయుగం అన్నాము. ఈపరీక్షతో చూస్తే 15 సంవత్సరాల కిందటివరకూ వీరి ననుకరించని కవులసంఖ్య చాలా తక్కువే ! ఇప్పటి నవ్యకవికుమారుల్లో కొందరు వీరిశిష్యులని వెనక చెప్పాను. పింగళ కాటూర్లు చాలరూ ? వాళ్ళగురువులను యుగకవులనటంలో యేంతప్పు కనుపించటంలేదు. వారుకూడా తమ "సౌందరనంద" కావ్యాన్ని వెంకటకవిగారికి సమర్పించి గురుఋణం తీర్చుకున్నారు. ఎందరికీపుణ్యం లభిస్తుందో చెప్పలేము ? యుగకవులనండలో

* చళ్లపిళ్లవారి కుమారుడు దుర్గేశ్వరశాస్త్రిన్నీ, వారి మేనగోడలి కుమారుడు సత్యనారాయణశాస్త్రిన్నీ సత్యదుర్గేశ్వర కవులనే పేరుతో శతావధానాలుచేస్తూ వున్నారు. వీరు "శాంతిసమరం" వంటి నాటకాలు కొన్ని, రచించారు. అప్పుడప్పుడూ పత్రికల్లో పద్యాలూ, వ్యాసాలూ రాస్తూవుంటారు. మహాత్మాగాంధిగారి "ఆత్మకథ"ను సంస్కృతంలోకి పరివర్తనంచేశారు. అముద్రితంగావుంది యింకా !

కొందరికభిప్రాయభేదముంది. 30-7-40 ఆంధ్రపత్రిక సంచికలో యీ విషయంలో వాదోపవాదాలు జరిగినై! "పద్యకవిత్వంలో, ఆధునికులలో, ప్రబంధకవులపోకడలూ, ఆధునిక కవుల ఫక్కీనీ, అనుసరించిన తిరుపతి వెంకటకవులు యీ యుగపురుషులనదగున"ని రామానుజరావు నాయుడుగారన్నారు. "తిరుపతి వెంకటకవులు శతావధానములమూలమున విద్యాభిలాష కలిగించినందులకు వారు వంద్యులేగాని వారు యుగకవులనుటకునే నామోదించన"ని తల్లావఝ్ఝలవారన్నారు. "వారిలో తిరుపతి వెంకటేశ్వరులు పూర్వాంధ్ర కవిశిఖామణులలో చివరవారనీ, నవ్యాంధ్ర కవులలో మొదటివారనీ నాఉద్దేశం" అన్నారు నోరి నరసింహశాస్త్రిగారు వకమాటు.

వెంకటకవిగారికి "కళాప్రపూర్ణ" బిరుదునిచ్చారు ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు. అది ఆయనకంటే విశ్వవిద్యాలయానికే యెక్కువ గౌరవం! ఆయన షష్టిపూర్తి మహోత్సవం జరిపిం దాంధ్రదేశం! తిరుపతి వెంకటేశ్వరులు రచించిన గ్రంథాలన్నీ 8 సంపుటాలుగా ప్రకటింపబడ్డవి! వీరు ధన్యజీవులు! షష్టిపూర్తిసందర్భంలో 'భారతి'పత్రిక యీకిందివిధంగా రాశింది. "వీరి సరసశిల్ప నైపుణిచే, కవితాలతాంగి, నవ్యాలంకారభూషితయు, నూతనోత్సవ భరితయునై, క్రొత్త పోకడలతో సహృదయ హృదయరంగముల కెక్కి, నర్తనము చేయదొడగినది. ఆంధ్రదేశమున పలువురీమహామహులకు వరివస్య సలిపి, తదనుగ్రహమున కవులు, పండితులునై, పేరున కెక్కిరి. నేడీనాట, శతావధానుల శిష్యులు, ప్రశిష్యులు, నసంఖ్యాకులు కలరు. ఇట్లాంధ్రవాణికి పుష్టినిగూర్చి, ఆంధ్రులకు సాహిత్య కవిత్వ సంపదల ననుగ్రహించి, శకపురుషులన మించిన శ్రీ తిరుపతి వేంకటకవుల పవిత్రనామము లాంధ్రులకెల్లరకును నిరంతర స్మరణమననయోగ్యములు."

వెంకటకవిగారు గొప్పవక్త! ఈన వేలకువేలున్న సభలలో ఉపన్యాస వేదికనెక్కి మాట్లాడుతూ, పద్యాలను విశిరివేస్తూంటే

ముగ్ధులైపోయేవారు సభ్యులు. 1907 సంవత్సర ప్రాంతాల్లో అట్లాంటి సభల కెళ్ళే భాగ్యం నాకు లభించింది. అది నాకెన్నటికీ మరవను. నవ్యుల్లో నవ్యుడైన, జ. రు. శాస్త్రిగారు వీరినిగూర్చి రాశిందాన్ని చూడండి.

"వెంకటశాస్త్రిగారు జన్మతఃకవి... ... ... ... ......... శాస్త్రిగారి కవితాకుటుంబం చాలా పెద్దది.........శాస్త్రిగారు బహుగ్రంథనిర్మాత.........శాస్త్రిగారు ప్రసంగం చేస్తూవుంటే జనం విరగబడతారు.........సరస్వతీదేవి మాట్లాడుతున్నట్లు వుంటుంది.........'తెనుగున కున్న వ్యాకరణదీపం చిన్నది.' ఏనాటిదో శాస్త్రులవారిమాట. నాటికీ నేటికీకూడా తెనుగులో వ్యాకరణ దీపం చిన్నదిగానేవుంది. శాస్త్రులవారే ఆలోటును పూర్తిచెయ్యాలి కూడాను. ఇటీవల శాస్త్రులవారి రచనల్లో కావలసినన్ని వ్యాకరణ విశేషాలు దొర్లుతూన్నవి. సూత్రించడమే తరువాయి. శాస్త్రులవారు, యేమరక, వొకకొంత శ్రద్ధపడితే సమగ్రవ్యాకరణం తెనుగులో ఆయన చేతిమీదుగానే రావీలౌతుంది."

## ఈకాలంలో స్వతంత్రరచనలు సాగించిన కొందరు :

ఈకాలంలో ప్రౌఢరచనలు సాగించినవాళ్ళల్లో శ్రీకొక్కొండ వెంకటరత్నంగారినిగూర్చి వెనక కొంచెం ముచ్చటించాను. ఈన చాలా పొట్టిమనిషి. ఎంతపూర్వాచార పరాయణుడో అంత స్వతంత్రుడుకూడాను. అద్వైతిగాపుట్టి ద్వైతం స్వీకరించాడు. "సీసమ"ని లోహంపేరు ఛందస్సుకున్నప్పుడు మరోలోహంపేరెందుకుండకూడదూ అని "వెండి" "బంగారం" అని ఛందస్సులను సృష్టించి, వాటిని తన గ్రంథాల్లో రాశాడు. ఈన స్వాతంత్ర్యం దీనివల్లనే వ్యక్తమౌతున్నది. ఈకాలపు పండితులతో మాట్లాడడమే విజ్ఞానదాయకం. ఈన తాను రాశిన ప్రహసనంలో "వీరిగాడని" వకపాత్రను సృష్టిస్తే, వీరేశలింగంగారు వక ప్రహసనంలో వక నత్తివాడిని సృష్టించి, వాడిపేరు, కొ-

క్కొ-క్కొ-క్కొ-క్కొండ వెంకడనిపించాడు. ఇద్దరూ చల్లనిహాస్యం రాయగలవాళ్ళే! ఈన భాషకుచేసిన వక గొప్పసేవ యెవ్వరూ ఆకాలంలో చేయలేదు. అది యింగ్లీషుకాలం. ఇంగ్లీషుతప్ప ఉపన్యాసాలకు యితరదేశభాషలు పనికిరావనీ, అందులో తెనుగు గ్రాంధికశైలిలో ఉపన్యాసం యివ్వడం కష్టసాధ్యమనీ, అభిప్రాయముండేది. ఇంగ్లీషు భాషా పండితుల్లో యీఅభిప్రాయం ఘనీభవించివుంది ఆకాలంలో. అప్పుడుసలక్షణమైన గ్రాంథికాంధ్రంలో-వకప్పుడు ప్రాసతోకూడా-గంటలు గంటలు అనర్గళంగా ఉపన్యాసాలిచ్చి ఆదురభిప్రాయాన్ని తొలగించాడు. "తండులంబులు నిండుకొనియె, నేడు పొండు, రేపురండు" అని బిచ్చగాడితో అనేమాటలూ, "కొమ్మా! పానీయంబులదెమ్మా" అనే మంచినీళ్ళడగటాలూ, యిప్పటికీ కథలుగా చెప్పుకుంటూ వుంటారు. ఒకక్క-తార్కాణం. సలక్షణమైనా, వ్యాకరణయుక్తమైనా, యింగ్లీషుభాషలో మనవాళ్ళు కొందరు అనర్గళంగా ఉపన్యాసాలియ్యటం లేదూ ? కాబట్టి ఆ తర్కం చొప్పదంటుతర్కమే. ఈపంతులుగారికి రెండు పనికిరావు. సంఘసంస్కారమూ, వ్యావహారికాంధ్రమూ, ఈరెండంటే వారికి తలనొప్పి. పండితుడికి-అందులో సంస్కృతాంధ్రభాషల్లో పూర్వసంప్రదాయప్రకారము చదువుకున్న వాడికి - గిట్టకపోవడంలో యేమీ ఆశ్చర్యంలేదు. ఈన చాలా ప్రౌఢంగా రాసేవాడు. నారికేళపాకం యీనసొమ్ము. పెచ్చుతియ్యటంలోనే బేజారైపొయ్యేవాడు పాఠకుడు. "పానకం" "బిల్వేశ్వరీయం" "నరకాసుర విజయవ్యాయోగం" మొదలైనవి సులభంగా కొరుకుడుపడేవికావు. ఈనకుకూడా భాషాసేవకులలో వక అగ్రస్థాన మియ్యాలసిందే.

దాసు శ్రీరామపండితుడు :

ఈన గొప్పపండితుడు. బహుగ్రంథాలను రచించాడు. ఈన కూడా దేవీభాగవతాన్ని తెనిగించాడు. వాణీ ముద్రాక్షరశాలను

స్థాపించి దేశమంతటా పేరువహించిన దాసు కేశవరావు పంతులగారి యన కుమారుడు. ఈయన తనవంశంలోపుట్టిన స్త్రీపురుషులకు కేశవాదినామాలను పేరులుగాపెట్టినాడు. ఇప్పటికి దాదాపు వకమారు నామాలన్నీ అవృత్తి అయినై అనుకుంటాను. ఈనది చక్కని శైలి. "తెనుగునాడు" అనేపేరుతో ఆంధ్రదేశంలోవుండే అన్ని బ్రాహ్మణ శాఖలు మాట్లాడే వ్యావహారికాన్ని అనుకరిస్తూ చక్కని కావ్యం రచించాడు, మచ్చుకు.

"అష్టే సూస్నివషే బలేచాడషే అష్టాగషే కాదషే, విస్నావఝులవారి బుర్రినష యీా విస్సాయకిస్సారషె" ఇవి శుద్ధవైదీకుల ధోరణి.

## కోరాడ రామచంద్రశాస్త్రి :

ఈనది అమలాపురం. ఈన సుప్రసిద్ధ భాషాసేవకుడని పేరు వహిస్తున్న కోరాడ రామకృష్ణయ్యగారి తాత. * వీరు తాతగారి రథాంగదూత మంజరీమధుకరీయాది గ్రంథాలను చాలా ప్రచారంలోకి తెచ్చారు. వీరికికూడా కొక్కొండవారి శైలల్లే మిక్కిలి ప్రౌఢం. ఒక్కొక్క స్థలంలో టీకతోకూడా అచ్చొయ్యాలశొచ్చింది. ఇటీవల ఆంధ్ర మద్రాసు విశ్వవిద్యాలయాల్లో యీాన గ్రంథాలు కొన్ని పఠనీయాలుగా నియమించి యీా ప్రౌఢకవిని గౌరవించారు. వీరుకూడా సంస్కృతాంధ్రాల్లో రెంటిలోనూ అనేక గ్రంథాలు రాశారు. ఎన్నతగినవారే!

## వీధి నాటకాలు :

ధేనువకొండ, తమ్మవరం, అని ఒంగోలుతాలూకాలో రెండు గ్రామాలున్నై. ధేనువకొండలో ఆయింటిపేరాయనే వెంకయ్య

---

* " శ్రీరామచంద్ర కృతినం, ద్వంద్వాతీతం గురోద్ధురం,
యోగీశ్వరం జ్ఞానఘనం, వందేనాగేశ్వరం గురుం॥ "

(ఆంధ్రభారత కవితా విమర్శనము)

గారని వుండేవారు. వారిది మంచి విద్వత్కుటుంబం. ఆయన భారత కథలో ఉత్తరగోగ్రహణం మొదలైనవి కొన్నిఘట్టాలూ, భాగవతంలో "వామన చరిత్ర" మొదలైనవికొన్నీ, తీసుకుని గేయాలుకలిపి చక్కని రసవచ్ఛైలిలో, హరికథారూపంగా చెప్పటానికీ, నాటక రూపంగా ప్రదర్శించడానికీ కొన్ని గ్రంథాలు రచించారు. ఇవి ఆకాలంలో చాలా ఆకర్షించినై ప్రజలను. తమ్మవరం కాపురస్థుడు వెంకటస్వామిఅనేఆయన కొందరుస్త్రీలనుకూడాతయారుచేసి,వారితో కలిసి నాటకాలాడేవాడు. ప్రజలు సహస్రాలుగా ఆహ్లాదించేవారు. స్త్రీలు స్త్రీపాత్రలు ధరించడం యీ వెంకటస్వామీ, సురభి కంపెనీ వారూ ప్రచారంలోకి తెచ్చారు. ఈవాదం రాఘవచార్లుగారితోనే పుట్టిందని భ్రమపడద్దు. 1908, 1909 ప్రాంతాల్లో యీకథలూ, నాటకాలూ నేను చాలాఆదరణతో చూశాను. ధేనువకొండ వెంకయ్య గారి తమ్ముడు చిన్నయ్యగారు గొప్ప సంగీతవిద్వాంసుడు. ఆయన కొడుకు ధేనువకొండ సుబ్బారావు యిదివరలో నాటకాల్లో అర్జునాది పాత్రలు ధరించడంలో ప్రవీణుడై యిప్పుడు సినీమారంగ మెక్కాడు. చక్కగాపాడి శ్రోతల నానందింపజేయుగల సమర్థుడు. శాస్త్రీయ నాటకాలొచ్చి పైవాటిని ముంచేసినై! సినిమావచ్చి నాటకాలను ముంచేసింది! నరసింహశాస్త్రిగారు ల్లేఖించిన దొడ్డవరపు వెంకట స్వామి యిలాగా జానపదుల నాకర్షించిన "బుర్రకథకుడు."

## గ్రంథ ప్రచురణం :

వెనకటికంటె మంచిపద్ధతులమీద ముద్రాలయాలు స్థాపింపబడ్డవి. వాటిలో వకటి స్థాపించారు వావిళ్ళ రామస్వామిశాస్త్రిగారు. దానికి "ఆదిసరస్వతీనిలయ ముద్రాశాల" అని పేరని నాకుజ్ఞాపకం.* వెనకటికాగితాలు అచ్చువగైరాలు మార్చి అంతకంటె అభివృద్ధి కనపర్చారు శాస్త్రులుగారు. వీరు స్వయంగా సంస్కృతాంధ్రాల్లో పరి

* ఇంతకుపూర్వం కన్న డాంధ్రాలలో చిన్నచిన్న ముద్రాలయస్థాపనం జరిగించారట!
(వావిళ్ళసంచిక : ఉపోద్ఘాతం)

శ్రమ చేసినవారు కాబట్టి, తప్పులు తక్కువగా అచ్చుపడటం తటస్థించింది. వీరు వ్రాసిన మనుచరిత్ర టీక యిప్పటికీ ప్రచారంలో వుంది. చక్కనిశైలిలో బాగుగా ప్రచురింపబడి పాఠకులకు మిక్కిలి ఉపయోగంగా నేవుంది. వారితర్వాత వారికుమాళ్లు వెంకటేశ్వరశాస్త్రిగారి సేవకు పరిమితిలేదు. వారితండ్రిగారు చేసినపనిని సహస్రముఖాలగా అభివృద్ధిచేశారు. అచ్చేమి, బైండేమి, ప్రశస్తంగా వుండటమే కాకుండా, తప్పులు చాలాతక్కువగానూ, గ్రంథాలు భిన్నభిన్న విషయాలమీదనూ ఉండి, సర్వాంధ్రదేశాదరణాన్ని పొందారు. వీరు చెన్నపట్నంలో యే ఆంధ్రులఉద్యమమైనా ప్రథమస్థానంలో వుండి, దానికి చేయూత యిస్తూవుంటారు. నెల్లూరులో వకమారు పౌరులు వీరి సారస్వతసేవకు వీరికభినందనపత్రం సమర్పించి కొనియాడారు. యీవిధంగానే మద్రాసులోవున్న తెనుగు ప్రకాశకులలో వేమూరు వెంకటకృష్ణమ్మశెట్టిగారొకరు. వీరి ఆనంద ముద్రాక్షరశాలకూడా ప్రసిద్ధమైందే! భాషాసేవకు కవి యెంత అవసరమో ప్రకాశకుడుకూడా అంత అవసరమైనవాడే! కాబట్టి వీరి సేవ మరవతగ్గదికాదు. ఏలూరులో మంజువాణీ ముద్రాక్షరశాల, కాకినాడలో సుజనరంజనీ సరస్వతీ ముద్రాక్షరశాల మొదలైనవీ యిట్టివే!

మరికొందరు పండితులు :

ఈ ముద్రాలయములపోషణలో కొందరు పండితులుండేవాళ్ళు. వాళ్ళు పుస్తకాలకు పీఠికలు మొదలైనవి రాస్తూ యథాశక్తిగా భాషాసేవ చేసేవారు. వీరందరు సామాన్యంగా గద్యరాతగాండ్లు. వీళ్ళచేతిలో గద్యం మరీప్రౌఢంగాక, అతిసులభంగాక, మధ్యరకంగా వుండేది. శతఘంటం వెంకటరంగశాస్త్రులు, దండిగుంట సూర్యనారాయణ శాస్త్రులు, చదలవాడ సుందరరామ శాస్త్రులు, పురాణం హయగ్రీవశాస్త్రి, నోరి గుర్లింగశాస్త్రిగార్లు, తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్య మొదలైనవారు పండితులూ, వ్యాకరణవేత్త

లూనూ. వీరు రచించినవాటిలో ఉపోద్ఘాతాలూ పీఠికలూగాక, భారత భాగవత రామాయణ వచనాలు చాలా ప్రశస్తంగా ఉంటై. వీరందరు కూడా మనకువంద్యులే! వారిపీఠికలు వారిపాండిత్యాన్ని తెలుపుతూ నేవుంటై. అప్పటి విమర్శనాసాంప్రదాయాలు వేరు. అందుచేత ఆంగ్ల విమర్శనాపద్ధతులు వాటిలో కనపడవు. అందుకాకాలమే ఉత్తరవాది గాని వారిలోపం కాదు.

వీరేగాక కాలేజీలలోను, ఉన్నతపాఠశాలల్లోను పండితులనేకులు తమకు తీరికవున్న కాలంలో యథాశక్తిగా భాషాసేవ చేసేవారు. వేదం వెంకట్రాయశాస్త్రిగారు క్రిస్టియన్ కాలేజీలోవుండి తమ రచనలను సాగిస్తున్నారు. జానపాటి కామశాస్త్రిగారు బెజవాడ హైస్కూలులో పండితులుగావుండి కాదంబరి పద్యకావ్యంగా రచించారు. ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రిగారు అనర్ఘ రాఘవ ప్రబోధ చంద్రోదయాదులను అనువదించారు. సర్కారునౌకరీచేస్తూ వావిలాల వాసుదేవశాస్త్రిగారు ఉత్తరరామచరిత్ర మృచ్ఛకటికలు రచించి భాషాసేవచేశారు. కల్లూరి వెంకట్రామశాస్త్రిగారు వైయాకరణై బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక రాశి తన విజ్ఞానం వెదజల్లి కీర్తిశేషుడై నాడు. పాడి వెంకటస్వామిగారు ఆంధ్రాక్షరతత్వాన్ని రచించి పరిశోధనాన్ని మనకిచ్చిపోయినారు. వసురాయకవి తమ భక్తచింతామణి మొదలైనవాటిని రాయటం సాగించారు. సుసర్ల అనంతరావుగారు బేకనుపన్యాసాలను తెలుగులోకి అనువదించారు. పనప్పాకం అనంతాచార్యులుగారూ, వారి కుమాళ్ళు శ్రీనివాసాచారిగారూ, వైజయంతిఅనే మాసపత్రికద్వారా మంజువాణీవిజయాదులను రచించి యథాశక్తిగా భాషాసేవ చేసినవారే! పట్నంలో ఓ. వై. శ్రీ. దొరసామయ్యగారనే ఆయన వుండేవారు. ఆయన అయ్యరుపేరుగల ఆంధ్రుడు. ఆయన అనేక కథాపుస్తకాలు రాశాడు. విశేషించి బంకించంద్రుడి "ఆనందమఠం" భాషాంతరీకరించాడు. ఇప్పుడు తెలుగులో ప్రచారంలో వున్నదిదే!

రా జ క వు లు :

వీరిలో ముగ్గురెన్నదగినవారున్నారు. శ్రీశ్రీశ్రీ విక్రమదేవ వర్మగారూ, రాజామంత్రిప్రగడ భుజంగరావుగారూ, - బొబ్బిలిరాజా గారు. శ్రీ వర్మగారు మానవతీచరిత్రాది గ్రంథాలను రచించారు. శ్రీ భుజంగరావుగారు బహు గ్రంథనిర్మాతలు. * భుజంగరావుగారి మిత్రులగు నందిరాజు చలపతిరావుగారు మంజువాణీ ముద్రాక్షరశాల ద్వారా భాషా సేవచేశారు. శ్రీశ్రీశ్రీ వర్మగారు లక్ష్మీకటాక్షంకలిగి జయపురంమహారాజులుకావడమేగాక, కవి పండితపోషకులైవున్నారు. భుజంగరావుగారు వృద్ధులై తమ కాలమును విద్యాగోష్ఠిలో గడి పారు. బొబ్బిలి మహారాజుగారు అనగా యిప్పటాయన తాత, తన దేశయాత్రానుభవాలను "యాత్రాచరిత్ర"ని వకదాన్ని, యింకా యితర చిన్నగ్రంథాలనూ రచించారు. ఇంతకు కొంచెము దగ్గరగా జటప్రోలు సంస్థానాధీశులగు శ్రీ రాజా సురభి మాధవరాయలు చంద్రికాపరిణయమనే ప్రౌఢప్రబంధానికి విద్వట్టీకను రాయించి ప్రచురించి తెనుగు కవుల కుచితంగా పంచిపెట్టారు. ఈనసోదరులే వెంకటగిరి బొబ్బిలిరాజాగార్లు! వెంకటగిరిమహారాజాగారగు వెలుగోటి గోపాలకృష్ణ యాచేంద్రులవారు పండితులూ రసజ్ఞులూను. గోపీనాథ రామాయణం రాశిన వెంకటకవి యీవెంకటగిరి ఆస్థానంలోవాడే! ఈయాచేంద్రులవారు వెలుగోటివారి చరిత్రనురాయించి భాషాచరిత్ర లకు మిక్కిలి సేవచేశారు. దీన్ని యిటీవల డాక్టరు యన్. వెంకట రమణయ్యగారు గొప్ప పీఠికతో ప్రచురించారు. పీఠికాపురంకూడా పండితులకూ కవులకూ పోషణ యిస్తూవచ్చింది. ఇంతకు కొంచెం పూర్వం విజయనగరం అనందగజపతి హయాములో పండితులకూ కవులకూ రంగస్థలంగా వుండేది. ముడుంబ నరసింహాచార్లుగారి రంగంలో వుండేనటుడే!

* భుజంగరావుగారు పరమపదించి ఆత్మశాంతి అనుభవిస్తున్నారు.

ఈ కాలానికిదగ్గిరగా బందరులో కృష్ణాజిల్లాసంఘమొకటి స్థాపించారు కొందరుపెద్దలుకలిసి. వారు కృష్ణాపత్రికనే వక వారపత్రికను నడపటం ప్రారంభించారు. అది శ్రీముట్నూరు కృష్ణారావుగారి చేతిలోకొచ్చి సాంఘిక, రాజకీయ, భాషాసేవ అమోఘంగా చెయ్యటం మొదలెట్టింది. ఆంధ్రసంస్కృతికి పనిచేసినపత్రికల్లో కృష్ణాపత్రిక అగ్రస్థానం వహిస్తున్నది. జాతితోకూడా పక్కననడుస్తూ,జాతిని కూడా నడిపిస్తూ, అన్యోన్యంగావుండి జాతీయజీవనంలో పాల్గొన్నదీ పత్రిక. ఈపత్రిక చేసిన సేవనుగూర్చి మళ్ళీముచ్చటించుకొనే అవకాశం వస్తుంది. ఈ శతాబ్దాంతానికే వావిలికొలను సుబ్బారావుగారు "ఆంధ్ర వాల్మీకి రామాయణం", జనమంచి శేషాద్రిశర్మగారు "బ్రహ్మాండ పురాణం", శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు "శ్రీకృష్ణ భారతం," రాయడం సాగించారు. సుబ్బారావుగారూ, కృష్ణమూర్తిశాస్త్రిగారూ, రామాయణ భారతాలను యథామాతృకాలుగా రాయడం ఆశయం పెట్టుకున్నారు. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు తమహాస్యపూరితాలైన విమర్శనాలూ, నాటకాలూ ప్రారంభించారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు తమ నవలారచనకూడా మొదలుపెట్టి కొన్నిరాశి బహుమతులనుకూడా పొందారు.

## పరిణామం :

ఈవిధంగా 20 శతాబ్దం ప్రథమసంవత్సరాలవరకు భాషాసారస్వతాల్లో పరివర్తనం జరుగుతూవచ్చింది. వెనకటి శతాబ్దం చూస్తే ఉన్న నిరుద్యోగానికీ, యీఅభివృద్ధికీ, తారతమ్యంచెప్పనలవికాకుండా వుంది. భాషాసేవకులు బయలుదేరారు. ప్రచురణం బాగా సాగుతున్నది. పత్రికలు స్థాపింపబడ్డై. నవలానాటకాలు తలలెత్తినై. తెనుగుశైలికి సౌలభ్యమలవడ్డది. స్వీయచరిత్ర బయలుదేరింది. వచన రచన విరివిఅయింది. అభివృద్ధితోపాటు అసంతృప్తిబీజాలుకూడా పడ్డవి దేశీయుల హృదయక్షేత్రాల్లో. యివి యెట్టిపరిణామాన్ని పొందాయో చూదాము !

# నవ్యాంధ్ర సాహిత్యవీధులు

## 3

### 20 శతాబ్ద ప్రథమవింశతి వత్సరములు :

వెనకటి సంధికాలపు పరిస్థితులీశతాబ్దంలోకి అనువృత్తాలైనై. ఈ కాలంలో మొదటిసంవత్సరాల్లో జరిగిన కొన్నివిషయాలు వెనుకటి అధ్యాయంలో వచ్చిండొచ్చు. సారస్వత వీధులను నిష్కర్ష చేయడం నాపని. ఒకొక్కప్పుడొక కావ్యరచనాకాలం 5, 10 సంవత్సరాలు వెనక ముందైనా, నా ఆశయానికి భంగం యెంతమాత్రంకాదు. 20 శతాబ్దప్రవేశంనాటికి భాషావిషయంలో, సారస్వత విషయంలో, అనేక నూతన సన్నివేశాలు కలిగినై. వాటిని మనవిచేశాను, వాటి [illegible]ణామాలను ఆనుపూర్విగా మనవిచెయ్యాలని సంకల్పం. ఈ ప్రథమసంవత్సరాలు భాషకు, సారస్వతానికీ, గొప్పకాలం. చలనం అభివృద్ధిసూచకం. భాషాసారస్వతాల్లో తర్వాత యెన్ని త్రోవలు కనబడుతున్నయో, వాటికన్నిటికీ బీజాలు యీ కాలంలోనే పడ్డా యనచ్చు. సంఘ, భాషా, సారస్వత సంస్కరణంతోపాటు అనేక ఉద్గ్రంథాలనురచించడంకూడా యీ వత్సరాల్లోనే జరిగింది.

### మతవిప్లవంగా కనపడ్డది సంఘసంస్కారంగా మారింది :

శ్రీ పంతులవారి బ్రహ్మమతప్రచారం, పూర్వాచార విమర్శనం, ప్రజల హృదయాల్లో కల్లోలం గలగజేసినప్పటికీ, మతమనేది వదలటం సులభంగాజరిగేది కాకపోవటంచేత, బ్రహ్మమత ప్రచారం కంటె, సంఘసంస్కారం ప్రజలను ఆకర్షించింది. మతం మార్చుకోకుండా సంఘం అభివృద్ధినిపొందే మార్గాలాలోచించారు పెద్దలు. శ్రీ వీరేశలింగంగారు చూపించే లోపాల్లో ముఖ్యమైనవాటిని సవ

రించుకొంటే సరిపోతుందని నిర్ధారణ చేశారు. విగ్రహారాధన నిర సనం మాత్రం అందరికీ నచ్చలేదు. పురుషులకెట్లావున్నా స్త్రీలకు మాత్రం అది చాలా విప్లవంగా కనిపించింది. పురుషులు సంస్కార చికీర్షువులైనా, స్త్రీలుకూడా ఆచిత్తవృత్తులు కలవాళ్ళయితేనేగాదూ ఆసంస్కారం అమలుకావటం! జనసంఖ్యలో సగంవంతు స్త్రీలే! ప్రకృతి కన్నుతెరిస్తే పురుషుడేంచేయలేడు! ప్రకృతిస్వరూపిణి స్త్రీ! ఆమె యింటింటా అవతరించినప్పుడు ఆమె వీల్లేదంటే యేపరివర్తనం సాగుతుంది? స్త్రీలు పూర్వాచారాన్నింకా పురుషులంత ఉల్లంఘిం చటంలేదుకాబట్టే మనసంస్కృతి నిలిచిఉండడమైంది. స్త్రీలుకూడా యింగ్లీషు విద్యాపఠనంచాత తమ నమ్మకాలను మరచినట్లయితే, యిప్పటికప్పుడే భారతదేశం యూరపుయొక్క ప్రతిబింబమయ్యేదే!* వీరేశలింగంగారి మతపరివర్తనం సంఘసంస్కారంగా మారడం స్త్రీల వల్లనే! వాళ్ళు చూచీచూడనట్టున్నారు కాబట్టి మగవాళ్ళు చేసేపని సాగింది! బాల్యవివాహ నిరసనం, స్త్రీవిద్యామాత్రం, తప్పక ఆందో ళన చెయ్యాలశిన అంశాలేఅని పెద్దలు చాలామంది నిశ్చయించారు. వీటికి విధవావివాహంకూడా, మనస్ఫూర్తిగాకాకపోయినా, కలిపారు. కాబట్టి యీమూడు కార్యాలనూ సాధించటానికి సంఘసంస్కరణ సభను స్థాపించారు. ఆకాలంలో ప్రతిసంవత్సరం వకవూళ్ళో రాజకీయ సభ జరిగేది. దానికి అనుబంధంగా వక సంఘసంస్కరణసభా, చెదరి అక్కడక్కడ వున్నవాళ్ళంతా కలిసి వక ఆస్తికసభా, స్త్రీలసభా, జరుగుతూండేవి. ఈమూడుసభలు ఏకకాలంలో జరుగుతూండడంచేత

* ఈ సందర్భంలో కృష్ణాపత్రికద్వారా ముట్నూరి కృష్ణారావుగారు చేసినపని చాలాగొప్పది. బ్రహ్మసమాజంద్వారాజరిగే మనవాళ్ళ సాంప్రదాయ నిరస నాన్ని, పత్సంప్రదాయ ప్రదర్శనంద్వారా వాళ్ళకళ్ళయెదుటచూపి, దాన్ని అరికట్ట డానికి మిక్కిలి పరిశ్రమచేశాడు. బాహ్యతంత్రాలమీదినుంచి దృష్టిని మళ్ళించి స్వచ్ఛభారతీయ పంప్రదాయాలమీదికి యువకులదృష్టిని నిగిడించేట్టు చెయ్యడంలో సనాతనులమనుకునే వాళ్ళకంటె యీనకృషి చాలా కార్యకారి అయింది.

జనం కనపడేవాళ్ళేగాని ఆచరణదగ్గిరకొచ్చేటప్పటికి చాలామంది
జారిపోయేవాళ్ళు! మళ్ళీ సంవత్సర సభనాటికే ఉత్సాహం! ఇట్లా
ఉండీ ఉండకుండా జరిగింది శ్రీ పంతులవారి చికీర్షిత పరివర్తనం.

## చిలకమర్తి :

ఈసంస్కర్తల్లో యింగ్లీషుపండితులుగాక యిప్పుడు జీవించి
వున్న మహామహుల్లో కొందరాంధ్రభాషాభిమానులున్నారు. వీరిలో
చిలకమర్తి లక్ష్మీనరసింహం గారొకరు. వీరికలం చాలా చలాకీకలది.
లెక్కించిచూస్తే ఈయనరాశినపేజీలు దాదాపు వీరేశలింగంగారు రాశి
నన్నున్నై. వీరి నవలలూ, నాటకాలూ, వ్యాసాలూ, కథలూ,
ప్రహసనాలూ, లెక్కకు మిక్కిలిగా ఉన్నై. ఈన ప్రథమాంధ్ర
నవలారచయితల్లో వకరు. "అహల్యాబాయి" "సౌందర్యతిలక"
"రామచంద్ర విజయం" మొదలైన చక్కని నవలలను రచించారు.
నవలారచనంలో యీనకు "స్కాటు" ఆదర్శకుడు. ఆయననవలల్లోనే
చారిత్రకపునాదులుగలిగి హఠాత్సన్నివేశాలతోకూడి, మొదటిచిక్కు
తుదకువిడడం మొదలైన లక్షణాలు కలిగివుంటై. ఈనను "ఆంధ్ర
స్కాటు" అని పిలిచేవారు! ఇదిగాక యీన మొదటి ఆంధ్రనాటక
రచయితల్లోకూడా వకరు. "ప్రసన్నయాదవ, ప్రచండయాదవ, పారి
జాతాపహరణాలు" స్వతంత్రనాటకాలు. చాలా మొదటమొదట
ప్రజలను ఆకర్షించినై. నాటకసంఘాలుకూడా చాలావిరివిగా ఆడే
వాళ్ళు. బందరులో "రామమోహన థియేట్రికల్ కంపెనీ" వారు
తప్పక నరకాసురవధను నరకచతుర్దశినాడు ఆడేవాళ్ళు. ఇది వక
ఆచారంగా పెట్టుకున్నారు. కొందరీయనరాశిన నాటకాలాడడంలో
చాలా పేరుమోగారు. బెల్లంకొండ సుబ్బారావుగారు శ్రీకృష్ణపాత్ర
ధారిగా చాలా కీర్తిపొందాడు. సామాన్యంగా ప్రతివిద్యార్థీ యిత
డుడూకూడా యీనాటకాల్లోనించీ కొన్నిపద్యాలైనా కంఠతా
పెట్టేవాడు. "అల్లుడారమ్మని" సామాన్యంగా అందరినోళ్ళల్లోనూ

స్తుండేది! ఈవిధంగా ఆకాలంలోయేవో "హరిశ్చంద్ర" మొదలైనవి తప్ప పీటల్లే ప్రజల నాకర్షించలేదు. ఇప్పటికీ "గయోపాఖ్యానం" అక్కడక్కడా ప్రదర్శింపబడుతూనేవుంటుంది. వీటన్నిటికంటె 'రాజస్థాన కథావళి" రాశియువకులలో దేశభక్తిని ఆకాలంలో పురికొల్పిన వాడీన. ఇది వకగొప్పకార్యం! వీరిశైలి చక్కని వైదర్భీరీతికలది. అప్రయత్నలభ్యమై రసవంతంగా వుంటుంది. ఈన నాటకాల్లో సందర్భోచితంగా తన విగ్రహారాధననైరస్యం ప్రకటిస్తూవచ్చాడు. సన్నివేశానికి తగ్గట్టే వుంటుందీనదూషణం! శ్రీకృష్ణణ్ణి నరకాసురాదులచేత దూషింపిస్తాడు. పారిజాతాపహరణంలో సవతులపోట్లాట చాలా మనోహరంగావుంటుంది. ఈన సీసపద్యాలు శ్రీనాథునివాటల్లే చాలా వరకూ సమత కలిగి రసవంతంగావుంటై! ఒకొక్కచోట చక్కని ప్రబంధకవిత్వ పోకడలు కనబడుతూవుంటై! వీరేశలింగంగారి శైలల్లే యీనదికూడా సౌలభ్యంతో కూడివుంటుంది. ప్రసాదగుణం కలిగి వుంటుంది. "లులాయశతక" పరివర్తనం చక్కని పాకంలోవుంది. ఉద్గ్రంథ రచయితల్లో చేర్చతగినవాడు.

ఈన నెరిగినవారు యీనను ప్రేమించకుండా వుండలేరు. రాజమహేంద్రవరం హిందూసమాజంలో గంగరావిచెట్టుకింద కూర్చున్నప్పుడు యీనసంభాషణ చాలా ఆనందకరం. ఈన్ను జాగ్రత్తసంతో పోల్చాలనిపిస్తుందప్పుడు. ఈన కంఠస్వరంవిని మనుష్యుల్ని గుర్తిస్తాడు. ఒకమారు నాకంఠస్వరంవిని "ఓహో! సీతారామయ్యగారా! మీ తంజావూరు చరిత్రంతా చదివానండోయి; బాగావుంది" అన్నారు, నేను ధన్యుణ్ణని నమస్కరించాను. ఈన వకవ్యక్తికాడు. వ్యక్తిసమూహమనచ్చు. ఈనతోకూడా యెప్పుడూ పదిమందికి తక్కువ ఉండరు. పరమేశ్వరుడు నేత్రాన్నే ప్రసాదించినట్లైతే ప్రపంచానికి అత్యుపకారకంగావుండేది. ఈనబ్రహ్మసమాజం అవ్యక్తంగావున్నా, సంస్కార ప్రియత్వం, సహృదయత్వం, విశ్వప్రేమ, ప్రతివాక్యంలోనూ

వ్యక్తమౌతూవుంటాయి. ఈనహృదయం ప్రపంచమంత విశాలం. వీరిసహజ ప్రవృత్తిప్రేమ. ఈనగొప్పవక్త. పట్టుకుని తీసుకెళ్లి వేదిక యెక్కిస్తే అనర్గళధారలో గంగాలహరుల్లే యీనవాణి విజృంభించి శ్రోతలకుకర్ణపేయంచేస్తుంది. ఈన గద్యపద్యశైలీకూడా గంగాల హరుల్లే అనర్గళం. పరమేశ్వరుడువీరికి దీర్ఘాయువిచ్చుగాక! వీరేశలింగం గారి నడకలో నడుస్తూ ఆయనపనిని సాగించడానికి ప్రయత్నించిన వారిలో ముఖ్యుడు!

మంగిపూడి:

మంగిపూడి శర్మగారి వాణీ, లేఖినీకూడా, బాలవితంతువుల కొరకు పొంగిపొర్లిపోయినై. ఈన "బాలవితంతు విలాపం" చదివితే ప్రతివాడికంటా నీరుకారవలసిందే! ఈన ముందురాబోయ్యేభావకవి త్వాన్ని తాడుకట్టి లాగి నూతనయుగాన్ని దెగ్గరికితెచ్చాడు. "మద్రకత" చదువుతూంటే ఒళ్ళు జల్దరిస్తూవుంటుంది. సానుభూతి తంత్రి చదువరులలో మోగుతూంటుంది. అగ్నిపరీక్ష, పశ్చాత్తా పమూ, యెంతటి కఠినహృదయాన్నైనా కరిగిస్తై. ఆంధ్రదేశంలో యెవ్వరూ కళ్లుతెరవక పూర్వం హరిజన సమస్యను లేవదీసి, అస్పృశ్యత కోసం, నిమ్నజాత్యుద్ధరణంకోసం, కష్టించిన వ్యక్తీయన. ఈయన "నిరుద్ధభారతం" అనేగ్రంథాన్ని రాశాడు. అదిచతువుతూంటే గాంధీ గారి హరిజన పత్రిక చదువుతున్నట్టుంటుంది. ఈన బంధువు లీయన సంస్కరణాన్ని చూచి సహించలేక వెలేశారు. ఈన అత్యంతత్యాగి. ఈన "సానుభూతి" అనేకావ్యంలో,

> "వస్తువులన్నియు పోనీ
> పస్తుండగ వచ్చుగాని, ప్రాణపదములౌ
> పుస్తకములు తడియగగని
> వాస్తవ వాస్తవ్యుడగు నెవండుసహించున్"

అని చెప్పి స్వీయచరిత్రను రాసుకున్నట్టు కనబడుతుంది. దారిద్ర్యాన్ని పోడిగట్టుకుని సాహిత్యానందంలో తేలుతున్న వ్యక్తి! మనుష్యుడు ఆహారంవల్లనే జీవించడు, విజ్ఞానంవల్లకూడా జీవిస్తాడనే గట్టి నమ్మకం కలవాడు. ఈనకు స్త్రీవిద్యంటే అమిత అభినివేశం. "నీతికథామంజరి" "స్త్రీధర్మబోధిని" అంగుకని రాశినవి. సరసమైన శైలిలో పరిణత ప్రజ్ఞుడు.

## రాయసం వెంకట శివుడు :

ఈన వార్ధక్యంలో గుంటూరులో స్వగృహంలో సుఖజీవనం చేస్తూ, తన అనుభవాలను ప్రపంచానికి గ్రంథాలమూలంగానూ, వ్యాసాలమూలంగానూ, అందజేస్తున్నాడు. తమగురువుగారైన వీరేశలింగంగారి చరిత్రరాశి గురుఋణం తీర్చుకున్నాడు. చదువుతూంటే ఉదాత్తంగా హృదయంగమంగా వుంటూంటుంది. స్త్రీవిద్యయీనకు కూడా అభిమాన విషయం. బ్రహ్మసమాజాన్ని వదలినట్లు తోస్తోంది.

## ఆదిపూడి సోమనాథరావు :

శ్రీ వీరేశలింగంపంతులువారి సాక్షాచ్ఛిష్యులలో శ్రీసోమనాథరావుగారొకరు. ఈన విధవావివాహోద్యమంలో స్వయంప్రవర్తన చేత పాల్గొన్నాడు. ఈన బహుగ్రంథాలు రచించాడు. మత విషయాలపైనా, రాజకీయాలపైనా, హరికథలు చెప్పి ప్రచారం చేశాడు. ఈన ఉపన్యాసధోరణి మిక్కిలి పండితపామరజనహృదయంగమంగా వుండేది. ఈన కాళిదాసుని కావ్యత్రయానికీ పరివర్తనాలు చేశాడు. ఇవిచాలా సరసంగా వుంటై. మొదట బ్రహ్మసమాజకుడై తరువాత ఆర్యసమాజంలో చేరినట్లు తెలుస్తుంది. కాదనికొందరన్నారు కాని యిది నానమ్మకం. దయానందులవారి సత్యార్థప్రకాశికకీయన వకడే తెనుగు రాశింది! చాలా గొప్పగ్రంథం. మరిన్నీ రవీంద్రుని

గీతాంజలినికూడా తెనుగులో రసవంతంగా రాశిందీయనవకర్తే! అనేక శతకాలను రచించాడు. దయానంద సరస్వతుల చరిత్రనూ, హిందీలోఉన్న ఆర్యసమాజ గ్రంథాలనూ, చక్కని తెలుగులోకి తెచ్చాడు. ఈన మిక్కిలి సంస్కారప్రియుడు. నిరాడంబరజీవి. ఈన యిటీవలనే స్వర్గస్థుడైనాడు. బహుకుటుంబి. సంతానంలో వసుంధరా దేవిగారు విదుషీ. వకకుమారుడు మంచి వైణికుడు. ఆంధ్రపత్రిక వీరినిగూర్చి యిట్లావ్రాసింది. "సోమనాథరావుగారు ఆర్యసమాజి కులు. భక్తులు. హరికథాలాపము వారికి ప్రీతి. వారెన్నో గీతము లను స్వయముగ రచించిరి. గొప్పసంస్కర్తలు."

ఈవిధంగా యెందర్నిగూర్చి ప్రజాసంఘం అనుకోటానికి వీలుందో చెప్పలేము!

కవుతా శ్రీ రామ శాస్త్రి:

ఈనకూడా పైవారివంటివాడే. ఈనకూడా సంస్కారప్రియుడు. స్వయంగా సంస్కరణాన్నాచరించాడు. ఈనను సుప్రసిద్ధ దేశ భక్తుల్లో చేర్చాలె. ఈన గొప్పవక్త. బంగాళా విభజనాందోళనంలో ఈన చేసినసేవ అప్రతిమానం. బంకించంద్రుని వందేమాతరంగీతం పాడటంలో ఈన మిక్కిలి సమర్థుడు. ఏసభల్లోనైనా ఈయనే ప్రథ మంలో గీతంపాడేవాడు. ఈన మిక్కిలి భక్తుడు. సుప్రసిద్ధ భక్తు డైన అశ్వినికుమారదత్తుగారి గ్రంథాలనీయన అనువదించి బందరులో "సరస్వతీ నికేతన" మనేపేరుగల స్థలాన్నించి ప్రచురించాడు. బహు కుటుంబికుడు. ఈయన యిద్దరు చిత్రకారులను ఆంధ్రదేశానికి సమర్పిం చాడు. కవుతా రామమోహన ఆనందమోహను లీయనకుమాళ్ళే.*

*"ఆనందమోహన్ యిటీవల పరమపదించినట్లు విని చాలా దుఃఖించాను. 'వారి (రామమోహన ఆనందమోహనుల) తండ్రి శ్రీరామశాస్త్రిగారు కుమాళ్ళకు

కాని ప్రజాదరణతక్కువగావున్నట్టు తెలుస్తుంది. ఇంతేగాక "భారతీ" స్థాపనానికి పూర్వం ఈన తన సర్వస్వమంతా ఖర్చుపెట్టి బందరులో "శారద" అనే మాసకపత్రికను స్థాపించి నడిపాడు. చాలాశ్రమపడి 2, 3 సంవత్సరాలు నడిపాడు. పత్రికమాత్రం మిక్కిలి ఉత్తమ శ్రేణిలో చేర్చతగింది. వ్యాసాలేమి, చిత్రాలేమి, మిక్కిలి ఆదరణీయాలుగా వుండేవి. పాపం లక్ష్మీపుత్రుడు చెయ్యాల్సినపని బీదవాడు చేస్తే ఆదరణంవస్తుందా? చెప్పకూడదుగాని విశ్వదాతవంటి ధనికుడు ఈనకు యేమాత్రం చేయూతయిచ్చినా మనిషి తట్టుకునేవాడే! విశ్వదాత యీనవిషయంలో వైముఖ్యమేకాకుండా తమ ఉదార ప్రకృతికి భిన్నంగా ప్రవర్తించినట్టు దృష్టాంతాలున్నై. పత్రిక అంతరించింది. భక్తిప్రధానాలుగా అనేక గ్రంథాలు రచించాడు. స్త్రీలకు పనికొచ్చే గ్రంథాలుకూడా రాశాడు. బందరునుంచి చెన్నపణ్ణం బసమార్చాడు. వృద్ధుడైనాడు. పిల్లలచాటున విశ్రాంతితీసుకుంటున్నాడు. భగవంతుడీయనకు చిరాయువొసగుగాక! 1938 సంవత్సరం ఏప్రిల్ నెలలో చెన్నపట్నంలో నేను వీర్ని కలుసుకున్నప్పుడు వార్ధక్య చిహ్నాలు బాగా కనపడుతున్నై! పుత్రశోకంతో దుఃఖించే యీనకు నాసానుభూతి నర్పిస్తున్నాను.

## కొందరుస్త్రీలు:

కొందరుస్త్రీలు వీరేశలింగంగారు స్త్రీవిద్యకు చేసినపనిని అందుకొని నిర్వర్తించారు. వీరిలో కొటికలపూడి సీతమ్మ, పులుగుర్తి

---

మఛిలీపట్నం జాతీయ కళాశాలలో నేర్పించిన చిత్రకళాభిజ్ఞత పెంపొందునటుల తోడ్పడి వారి ప్రతిభనుచూచి ఉప్పొంగుతూండేవాడు. ఇప్పుడాయన ఆనందమంతా పోయింది' అని రాశిందాంధ్రపత్రిక. ఆయనదేగాక ఆంధ్రదేశం ఆనందాన్ని కోల్పోయిందని నేనంటున్నాను. 'క్షయవ్యాధి ఆయన్ని పొట్టనబెట్టుకున్నది. ఎందుకు పనికిరాని జనాభాను పెంచేజనం యిందరున్నారే! మా ఆనందమోహనే కనపడ్డాడా? హాతవిధీనీకు!' "

(ఆంధ్రపత్రిక)

లక్ష్మీనరసమాంబ, బాలాంత్రపు శేషమ్మ, మాడభూషి చూడమ్మ, కళ్ళేపల్లి వెంకటరమణమ్మ, మొసలిగంటి రామాబాయమ్మ గార్లు యెన్నదగినవారు. వీరు "హిందూసుందరి", "సావిత్రి" మొదలైన ప్రతికలు నడిపి వాటిలో స్త్రీలకు మిక్కిలి ఉపయోగించే విషయాలను రాస్తూండేవాళ్ళు. వీటిద్వారా స్త్రీవిజ్ఞానం చాలా ప్రచారంచేశారు. వీరేగాక శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి సోదరి శ్రీమతి బండారు అచ్చమాంబగారు స్త్రీల ఉద్యమంకోసం చాలా పాటుపడ్డారు. ఆదర్శ స్త్రీల కథలను "అబలా సచ్చరిత్ర రత్నమాల" అనేపేరుతో ఆమె రచించింది. అనురూపులైన సోదరున కనురూపమైన సోదరి! శ్రీ చిలకమర్తి, మంగిపూడిగార్లుకూడా యీస్త్రీవిద్యకొరకు చాలాపాటుపడి గ్రంథాలు రాశారు. శర్మగారి స్త్రీనీతికథామంజరి, స్త్రీధర్మబోధిని, ఆవుద్దేశ్యంతో వ్రాసినగ్రంథాలేనని మనవిచేశాను. రాయసంగారు కొన్నాళ్ళు "జనానా పత్రిక" అని వక స్త్రీలకుపయుక్తమయ్యే మాసపత్రికను నడిపేవారు. బాలికల ఉపయోగానికి కుమారీశతకము మొదట దీనిలో ప్రచురమైందని నాకు జ్ఞాపకం. గుండు అచ్చమాంబ అనేఆమె పాటలు పద్యాలు రాశి స్త్రీవిద్యకు తోడ్పడింది. ఈవిధంగా శ్రీవీరేశలింగంగారి పనిని వీరంతా కొనసాగించారు. వీరియొక్క, యితరులయొక్క కృషి కొంతవరకు ఫలించిందిగాని, అనాదిసిద్ధంగా సంఘంలోవున్న బాల్యవివాహ దురాచారాదుల్ని రూపుమాపటం సామాన్యకార్యం కాదు! శారదాచట్టము ప్యాసైనతర్వాతకూడా యిప్పటికీ ఆగకుండావున్నదీ ఆచారం. కట్నపిశాచంకూడా ఆడపిల్లలతండ్రుల్ని పీక్కుతింటూనేవుంది. చదువుకున్న తండ్రి కుమాళ్ళల్లోనే యిది యెక్కువగా వుందనటానికి సిగ్గేస్తున్నది! ప్రజల మనస్సులలో పరివర్తనం అన్నింటికంటె అవసరం. అది కలగడం అతికష్టం. స్త్రీవిద్యనుగూర్చిమాత్రం శ్రీ పంతులవారి కృషి సఫలమైంది. మిగిలిన ఆశయాలు ప్రజలలో అంతగా ఫలవంతాలుకాలేదు. కాని వకకూటిమాత్రం కలిగింది. అటువంటి పనులు

చేసినవాళ్ళనుచూస్తే అసహ్యించుకోడం, బహిష్కరించటం, మొద లైనపనులుమాత్రం ఆగినై. సముద్రయానంవలెనే, శిష్టులయిండ్లలోనే యిటువంటి పనులు జరగటమంటేనూ, వాటికంతగా ప్రాముఖ్య మియ్యటంలేదంటేనూ, పంతులవారికి జయమన్నమాటే! వెనక చెప్పి నట్టు పూర్వసాంప్రదాయాలమీద, ఆచారాలమీద, ప్రత్యయంచాలా సళ్ళింది. అభిప్రాయస్వాతంత్ర్యం యెక్కువైంది. అపనమ్మకం ప్రబలి పోయింది. ఇంగ్లీషుగ్రంథాలూ, రాతగాండ్లూ అంటే ప్రీతి క్రమంగా హెచ్చింది. ఆంగ్లేయులు చేదామనుకొన్న వైజ్ఞానికవిజయచిహ్నా లివి!

ఉద్గ్రంథరచనం - వాఙ్మయ విస్తృతి : *

ఒకవేపున సంఘసంస్కారప్రచారం, పూర్వాచార నైరస్యం, జరుగుతూండగానే ఉద్గ్రంథరచనంకూడా జరుగుతూవచ్చింది. ఈగ్రం థాలను రచించినవారు ఉద్దండ పండితకవులూ, ప్రతిభావంతులూనూ.

వావిలికొలను :

వెనకటి శతాబ్దంలోనే రాయటం ప్రారంభించిన కొందరు మహా మహులరాతలు సాగుతూనేఉన్నై. వావిలికొలను సుబ్బారావుగారిది నెల్లూరు. ఈన తన ఆంధ్రవాల్మీకి రామాయణాన్ని పూర్తిచేసి "ఆంధ్రవాల్మీకి" అనే బిరుదును పొందాడు. ఈన రామాయణాన్ని వాల్మీకమల్లేనే దత్తమండలాల్లో పారాయణ చేస్తూవుంటారు. మడికి పనికొచ్చేటట్టుగా భగవద్గీతలల్లే కిత్తానిబైండుచేసిన గ్రంథాలున్నై. ఈన, శరీరచ్ఛాయలో, నేత్రవిన్యాసంలో, యెంత వికృతంగా కనపడే వాడో, అంత ప్రతిభాశాలి. ఎల్లప్పుడు పుస్తకవ్యాసంగం తప్ప వేరే పనిలేదు. అంతర్ముఖుడు. అఖండ రామభక్తుడు! ఈన పూర్వఫక్కీన

* "కొందరు తెలుగు కవులు" (జో. స.)

(భారతి 1939 సెప్టెంబరు)

కుమారాభ్యుదయం మొదలైన ప్రబంధాలు వ్రాశాడు. సుభద్రాపరిణయమనే నాటకం చాలా ప్రదర్శనానుకూలంగానూ, రసవంతంగానూ, రచించాడు. ఈన తన రామాయణాన్ని ఒంటిమిట్ట కోదండరామ స్వామికి అంకితమిచ్చాడు. పోతన్నగారి గ్రామం ఒంటిమిట్టని యీన గట్టినమ్మకం. అదికాదనే వాళ్ళను సహించేవాడుకాదు. వెనకటి ఆ కోదండ రామస్వామికి అంకితమిచ్చిన, పోతన అయ్యలరాజు రామభద్రులు ఈనకు వందనీయులు. పోతనకవిత్వంలో భక్తి ప్రధానరస మౌటచేతా, తాను మహాభక్తుడౌటచేతా, ఆయన్నే తనకు ఆదర్శంగా పెట్టుకొని రాశాడు. పోతన్నను లాక్షణికకవిగా అంగీకరించని అప్ప కవిని "తుచ్ఛుడ"న్నాడీయన. ఈన రామాయణం యీనపేరును ఆంధ్రసారస్వతంలో చిరస్థాయి చేసింది. ఈన భాషాంతరీకరించిన మార్గం యథామాతృకం. మాతృకలో శ్లేషవుంటే పద్యంలో శ్లేష పెట్టాడు. మాతృక యెంత రసవంతంగావుందో అంతరసవంతంగానూ వుంది భాషాంతరీకరణం. అందులో ఉపోద్ఘాతంలో తాను గ్రంథ కర్తృత్వానికి పూనిన కారణాదులు చెప్పటంలో మిక్కిలి రసవంతంగా రాశాడు. తాను రామాయణాన్ని రచించబూనటం "కవిననే గాఢగర్వం" వల్ల కాదనిన్నీ, "పాండితివల్ల కాదనిన్నీ, మాధవ చరణారవింద సేవ చేయాలననే ఆశ" వల్లమాత్రమే అనిన్నీ, అట్టిపనిని "దంతంబులూడకమునుపు" "కనుదోయి మసకలు గనకమునుపు" అనగా వార్ధక్యం వచ్చేలోపుననే చేయటం తగుననిన్నీ, చెప్పినభాగం చాలా హృదయంగమంగా వుంటుంది. సుందరకాండ మిక్కిలి సుందరంగానే రాశాడు! * ఇవన్నీగాక యీనకు ఆర్యసంస్కృతి అంటే అత్యంత ఆదరం. ఈ సంస్కృతిని చిన్నప్పట్నించీ బోధ చేస్తేగాని పిల్లలకు పట్టుపడదని "ఆర్యకథానిధి" అనేపేరుతో బాలుల ఉపయో

* "మందరమనేపేరుతో తాను రామాయణ వ్యాఖ్యనుకూడా రచించి దాని అంతరార్థంకూడా నిర్వచించాడు. ఈవ్యాఖ్య చాలా విశేష విషయాలతో నిండి వుంటుంది."

గార్థం వక గ్రంథమాల స్థాపించాడు. దీనిలో ఆర్యసంస్కృతికి సంబంధించిన గొప్పరాజులు, ఋషులు, పతివ్రతలు, మొదలైనవాళ్ళ చరిత్రలు, జీవితాలు, కథలు; సత్యము, అహింస, రాజ గురుభక్తులు మొదలైన గుణగణాలకు సంబంధించిన కథలు మొదలైనవి తరగతి వారీగా అత్యంత సులభంగానూ, వ్యాకరణయుక్తమైన శైలిలోనూ, రాశాడు. ఈప్రకారంగానే భావికవుల కుపయుక్తమయ్యేటట్టుగా కూడా సులభ వ్యాకరణాన్ని రాశాడు.

ఈన సర్కారుద్యోగం చేశాడు. మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో తెనుగుపండితులుగా వున్నప్పుడు ఈనదగ్గర శిష్యుడుగా ఉండే భాగ్యం నాకు లభించింది. నాకించిదాంధ్రభాషాజ్ఞానం వారి ప్రసాదమే! ఈనతో మాట్లాడుతూంటే నే చాలు విజ్ఞానానికి. ఈన తుది దినాల్లో సన్యసించి "వా॥ సు॥ దాసు"డనే పేరుగ్రహించి ఒంటిమిట్ట దేవాలయాన్ని జీర్ణోద్ధరణంచేసి, అక్కడ నిత్యోత్సవ పక్షోత్సవ మాసోత్సవాలు జరగటానికేర్పాట్లుచేసి,దాన్ని మంచిస్థితిలో పెట్టాడు. అంతేగాకుండా దేశమంతా సంచరించి "శ్రీరామభక్తమండలి" యేర్పరచి శ్రీరామభక్తిని దేశం అన్నిమూలలా నాటాడు. * దత్త మండలాల్లో ఈన నెరిగినట్టు యేకవినీ యెరగరు. సారస్వతసేవతోనూ, రామభక్తితోనూ ధన్యతచెందిన పవిత్ర చరిత్రుడు.

## శ్రీపాద :

ఈనది రాజమహేంద్రవరం. ఈయన సంస్కృతాంధ్రాల్లో నిష్ణాతుడు. తిరుపతి వెంకటేశ్వరకవుల్లో వెంకటకవిగారీయనవద్ద కొన్నాళ్లు శిష్యత్వంకూడా చేశాడు. ఈన్ను అపరతిక్కననచ్చు. తిక్కన పదిహేనుపర్వాల భారతంమాత్రమే రచిస్తే, యీాన భారతం యావత్తూరచించి, కవిత్రయంవారు ముగ్గురుచేసినపనిని వక్కచేతి

* భక్తసంజీవినని వక పత్రిక స్థాపించి భక్తిని ప్రచారం చేశాడు.

మీద చేశారు. ఈకృష్ణభారతం మంచి రసవంతమైన పాకంలోవున్నది. ఎక్కడైనా కొన్నిచోట్ల తిక్కనకుండే శాస్త్రస్ఫూర్తి కలిగినా, దాన్ని నిర్దుష్టమైనభాషలో సాధ్యమైనంతవరకు యథామూలాత్మకంగా రాశారు. తిక్కన అనేకస్థలాల్లో కుదిస్తూ పెంచుతూ పోయినవి సాధించారు. శ్రీపాదవారిక్కాగాక మాతృకననుసరించి నడిచారు. దాదాపుదంతా పూర్తికావటానికి 20 సంవత్సరాలకాలం పట్టినట్టుంది. ఇంత పెద్ద గ్రంథం యితరభాషల్లో ఆమాత్రం పట్టిందంటే ఆశ్చర్యమేలేదు. అక్క-డక్కడా తిక్కనకంటె బాగా రాశాడనికూడా అనచ్చు. శ్రీకృష్ణ భారతమని వ్యాసప్రధానంగా కవిగారిపేరుకూడా వచ్చేటట్టు నామకరణం చేశారు. ఈకాలపు కవుల్లో, మహాగ్రంథ నిర్మాతల్లో, యీయనొక్క అగ్రస్థానంలో వుండదగినవారు. ఇదేగాక యీనవి చాలా యితర గ్రంథాలున్నాయి. బొబ్బిలియుద్ధనాటక మీన రాశింది వకటి చాలా ప్రసిద్ధి కెక్కింది. రంగస్థలంమీద యిప్పుడాడేది అదే! ఏదిది చక్కని కవిత్వమూ శైలీని! నాతికఠినమైన కదళీపాకంలో వుంటుంది. ఈనకూడా కొన్ని అధిక్షేప ఖండకావ్యాలు రచించారు. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికీ యీనకీ పోరాటంకలిగి భాషకు సహాయం చేసింది. మంచి సరసమైన హాస్యరసం చిలకగల సమర్థుడు. సామాన్యంగా కవికి ప్రేరణవుంటేగాని, కవిత బహిర్గతంకాదు. అటువంటి ప్రేరణానికి పోట్లాట మూలమైనప్పుడు భావోద్రేకంచేత మంచి పాకాన పడుతుంది కవిత! ఈనకు ప్రజలు "కవిరాజ"ను బిరుదిచ్చారు. ఆంధ్రవిశ్వవిద్యాలయంవారిటీవల "కళాప్రపూర్ణ" బిరుదిచ్చి తమకు గౌరవం తెచ్చుకున్నారు. బొబ్బిలియుద్ధనాటకమేగాక అనేకేతరనాటకాలను రచించారు. ఈనకూడా వక వేణీసంహార పరివర్తనం చేశారు. ఈన మంచి వక్త. వీరిల్లు వక పాఠశాల. అనేకమంది ఉదయం నించి సాయంకాలమువరకూ వస్తూపోతూ తమ సందేహాలను తీర్చుకుంటూ జ్ఞానాన్ని పొందుతూ వెళ్ళుతూవుంటారు. ఈనకూడా

అనేక శిష్యగణం కలవాడు. భారతం విషయమైన యేసంగతికైనా యీన ప్రమాణమనచ్చు. కురుపాండవ దాయభాగాన్ని గూర్చిచాలా చర్చించాడు. వార్ధక్యంలో విశ్రాంతి ననుభవిస్తున్నాడు. అభినవ తిక్కన! * సర్కారువారీనకు మహామహోపాధ్యాయ బిరుదు నిచ్చారు.

## వ. సు. రాయలు :

రాజమహేంద్రవరం అదృష్టమేమనవచ్చు? ఇంతమంది కవులు, సంస్కర్తలు, పండితులు, యేకకాలావచ్ఛేదకంగా అక్కడ వుండటం నిజంగా అదృష్టమనాలె! వకరికితీసిపోనివారు వకరు! ఏదిచూచినా దిగ్గజమే! వడ్డాది సుబ్బరాయకవిగారు వెనకటివారికెందునా తీసిపోడు. వీరికలంకూడా సరసమైన సారస్వతవీధుల్లో ప్రవర్తించింది. చాలా వృద్ధులైనంతవరకు జీవించాడు. వీరిల్లొక విశ్వవిద్యాలయ మనచ్చు. అనేకమంది యువకుల్లో విజ్ఞానం వెదజల్లి తెనుగు సహృదయత్వం వాళ్ళకలవడజేశాడీయన. పక్కనున్న ట్రైనింగు కాలేజీకి ఉజ్జీగా వుండేది వీరిల్లు! ఈనజీవితంలో వచ్చిన ఆపత్తప్పుడల్లా వక కావ్యం నిర్మాణమైంది. కుమారుడు చనిపోయినప్పుడు "సుతస్మృతి", భార్య చనిపోయినప్పుడు "సతీస్మృతి" మిక్కిలి శోకపూరితంగా వెలువడ్డై. ఈన పాఠశాలా యువకులకు చాలా వుపయోగించేటట్టు కొన్ని గ్రంథాలు రాశాడు. "సుమనోమనోజ్ఞం" "శ్రీసూక్తివసుప్రకాశిక" మొదలైనవి అట్టివే. ఈన "భక్తచింతామణి" చాలా ఉత్తమకావ్యం. దాశరథీ శతకేత్యాది గ్రంథాలల్లే చాలా ప్రచారంలోవుంది. దీనిలో వక్క పద్యమైనా తప్పక ప్రతియువకుడికి వచ్చుంటుంది.

* తాడూరు లక్ష్మీనరసింహారావనే ఆయనకూడా భారతభాగాలు కొన్ని ఆంధ్రీకరించి తాను చాలా బాగా రాశానని భారతిలో వ్యాసాలమూలంగా చెప్పుకున్నాడు. ఈనకూడా కొన్ని నాటకాలు వగైరాలు రాశాడు. ఈనరాశినవాట్లో ఆంధ్ర చంద్రాలోకం యెన్నతగింది.

ఈన చాలానాటకాలు రాశాడు. వేణీసంహారం యీనకత్యంత కీర్తిని తెచ్చిపెట్టింది. తెలుగులో ఉత్తమనాటకాల్లో సంఖ్యేయం అయింది. బళ్ళారివారి చిత్రనళీయం, వీరేశలింగంగారి శకుంతల, లక్ష్మీకాంతంగారి హరిశ్చంద్ర, శ్రీపాదవారి బొబ్బిలి, తిరుపతి వెంకటేశ్వరుల పాండవవిజయం, వేదంవారి ప్రతాపరుద్రీయం, పానుగంటివారి రాధాకృష్ణ, వీటితోపాటు స్థానాన్ని వేణీసంహార మాక్రమించుకుంటుంది. భట్టనారాయణుడి గౌడీ పాంచాలీ రీతులీయన పరివర్తనంలోకూడా అచ్చంగా అట్లాగే ఉండిపోయినై. అనురూప కావ్యానికి అనురూపపరివర్తకుడు దొరకడం భాషచేసుకొన్న అదృష్టం. భట్టనారాయణుడెట్లా అష్టరసభరితంగా రాశాడో అట్లాగే అష్టరసభరితంగా రాశాడు. వీరమూ, రౌద్రమూ, ముఖ్యరసమని అనుమానించేటంత చక్కగా రాశాడు. ఈన "వసురాయ చాటూక్తి ముక్తావళి" కూడా చాల రసవంతమైందే! "శ్రీసూక్తి వసుప్రకాశికలో" ప్రతిపద్యసూక్తులు మిక్కిలి హృదయంగమాలు. ఈయన ప్రకృతి పరిశీలనము, మన స్తత్వ రహస్యజ్ఞానము, వ్యక్తమౌతూవుంటుంది. ఈనాకూడా వక వుత్తమకక్ష్యకు చెందినవాడు. ఇటీవలనే కీర్తికాయుడైనాడు.

జనమంచి:

ఈన దత్తమండలాంధ్రుడు. ఈన బ్రహ్మాండ పురాణాన్ని భారత రామాయణ శైలిలో బ్రహ్మాండంగా తెనిగించి కీర్తి పొందాడు. ఈనకూడా వావిలికొలను సుబ్బారావుగార్లల్లే పండితుడు, కవి, భక్తుడు. ఆయనల్లేనే ఒంటిమిట్టప్రియుడు. ఇటీవల సమస్త పురాణేతిహాసాల్లోనించీ క్రోడీకరించి శ్రీకృష్ణావతార తత్వాన్ని దాదాపు 12 సంపుటాలుగా రచించాడు. భాగవతము, రామాయణము కూడా మళ్ళీరచించాడు. లలితోపాఖ్యానం, హాలాస్యమాహాత్మ్యం, సర్వమంగళాపరిణయం, మొదలైన ప్రబంధాలు రాశాడు. శంకర విజయ

ధ్వజం తెనుగులో రచించాడు. ఈన రచించిన పుస్తకాలన్నీ వక బీర్వా నిండుతై. ఈనకు గద్యపద్యాలు చాలా సహాజంగా వస్తాయి. చక్కని వైదర్భీరీతి. ఈనకూడా యీకాలపు బహుగ్రంథనిర్మాతల్లో చేర్చ తగినవాడు. నిరాడంబరజీవి. ఈనకూడా విశ్వవిద్యాలయం "కళా ప్రపూర్ణ" బిరుదు నిచ్చింది.

ఇటీవల ఈనకు నెల్లూరులో విద్యార్థులిచ్చిన సమ్మానపత్రంలో నించి యీకింది వాక్యాలనుఉదహరిస్తున్నాను.

"సంస్కృతాంధ్రవఙ్మయంబులం దసమాన పాండిత్యము గడించి, శృతినయనత్రిభాగ గోచరులై, మంత్రఖండ సర్వస్వ వేత్తలై, యోగ శాస్త్ర మర్మజ్ఞులై, కావ్యప్రపంచతీర్థులై,............మరియు మీయద్భుత జ్యోతిశ్శాస్త్ర విజ్ఞానమునకు పంచాంగనిర్మాతలగు మీ శిష్యకోటియు, అన్యజన దుర్లభ మంత్రశాస్త్రవైదుష్య ప్రచురణము నకు మిమ్మనవరత మాశ్రయించియుండు భక్తబృందమును, ప్రబల నిదర్శనములు". చూచారా యెటువంటివాడో యీన! ఈనరచించిన గ్రంథాలు చదవడానికి చాలా సంవత్సరాలు పడుతుంది!

## వేదం:

ఈన ఉత్తమాంధ్రపండితుల్లో వకడు. మద్రాసులోని క్రైస్తవ కళాశాలలో ఆంధ్రపండితులుగా వుండేవాడు. సంస్కృతాంధ్ర పాండిత్యంతోపాటీయన ఆంగ్లంలోకూడా ప్రవీణుడు. అందుచేత ఆంగ్ల సాంప్రదాయాలుకూడా యీనకు తెలుసు. ఈనగ్రంథాల్లో పరి వర్తనాలూ, వ్యాఖ్యానాలూ యెక్కువ. వ్యాఖ్యానాలవల్ల గ్రంథ పఠనంమీద అభిరుచి కలిగి సహృదయత్వం కలుగుతుందని యీన ఆశయం. * అందుచేత తెనుగులోవున్న ఉత్తమగ్రంథాలకు కొన్ని

* "సాహిత్యాభివృద్ధినిచేయునవి, విమర్శనములు, భాషాంతరీకరణములు, వ్యాఖ్యానములు, నను నీమూడునునైయున్నవి." (కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు)

టీకే వ్యాఖ్యానాలు రాయడానికి సమకట్టారు. అంచేత తెనుగు కావ్యా
లీయన ఎంచారు. విజయవిలాసం, శృంగారనైషధం, ఆముక్త
మాల్యద, వీటికి ఉత్తమ వ్యాఖ్యానాలు రచించారు.* వేదంవారి
వ్యాఖ్యానాల్లో ఆయన పాండిత్యంయొక్క సర్వతోముఖత్వం వెల్ల
డౌతుంది. నృత్యశాస్త్రం, వాస్తుశాస్త్రం, వ్యాకరణంనుంచికూడా ఆయనకు
తెలిసినట్టు వ్యక్తమవుతుంది. ఈయనకూడా వావిలికొలను సుబ్బారావు
గారల్లే ఆంధ్రవైయాకరణి. వ్యాఖ్యానాలు పాండితీపూరితాలైనాగానీ
విజ్ఞానం ఎక్కువచేసే విశేషాలతో నిండివుంటాయిగాని, కవి
యొక్క ఉదాత్తభావాల్ని వివేచించి, దానిలో వైశిష్ట్యాన్ని చెప్పి,
పాఠకుడికి కవియందు ఆదరం కలిగించేట్టుగా వుండవు. ఒక్కొక్క
ప్పుడు విసుగుకూడా కలిగిస్తై. ఎట్లావున్నా యీన చాలా గొప్ప
భాషాసేవకుడు. ఈనపరివర్తనాలు కొన్ని చదవడమేకాకుండా పాఠం
చెప్పేభాగ్యంకూడా నాకులభించింది. మాతృకకంటె జటిలంగావుంటై.
కాళిదాసుడివీ, శ్రీహర్షుడివీకూడా నాటకాలు పరివర్తనం చేశాడు.
మాతృక కదళీపాకంలో వుంటే యీనపరివర్తనం నారికేళపాకంలో
వుంటుంది. ఈనది సంశ్లిష్టశైలి. తక్కువపదాలతో ఎక్కువఅర్థం
తెప్పించడానికి ప్రయత్నిస్తాడీయన. కొక్కొండ వెంకటరత్నంగారి
శైలికంటె నారికేళత్వం కొంచం తక్కువ. ఒక్కొక్కప్పుడీసంశ్లిష్ట
శైలి భావవైశద్యానికడ్డంవస్తుంది. ధారకూడా ధారాళంగావుండదు.
అప్రయత్నంగా వచ్చినట్టుండదు. ఒకపద్యంలో "దాంగిలి" అంటే
కృష్ణావతారమన్నమాట. "లేదటంచు" అంటే దేవుడులేడనే బుద్ధావ
తారమన్నమాట. ప్రక్రమంనించీ పద్యం దశావతారద్యోతకమని
తెలిస్తేకాని యీమాటలకీయర్థమని మనం చెప్పలేము. విజయవిలాస
వ్యాఖ్య బాగానేవుంది. తాపీ ధర్మారావుగారు తామొక విజయ

---

* నాగపూడి కుప్పుస్వామయ్యగారుకూడా వేదంవారి ననుకరిస్తూ పారిజా
తాపహరణానికి పరిమళమనే వ్యాఖ్య రాశాడు. ఇటీవలనే యీన పరమపదించాడు.

విలాస వ్యాఖ్య రాసినట్టూ, వెంకట్రాయ శాస్త్రిగారుకూడా కొన్ని స్థలాలువిని తనదానికంటె బాగున్నదన్నట్టూ, శాస్త్రిగారితదనంతరం రాసుకున్నారు. ప్రచురించిన యేకొంచెంతప్ప యీధర్మారాయ వ్యాఖ్యానాన్ని సమగ్రంగా ఆంధ్రప్రపంచమెరగదు. ప్రచురించి పుణ్యం కట్టుకుంటే బాగుండును. ఇటీవల యీధర్మారావుగారికి సారస్వతప్రీతి తగ్గి పత్రికారచనప్రీతీ సంప్రదాయనిరసనప్రీతీ యెక్కు-వైనట్టు కనబడుతుంది.

వెంకట్రాయశాస్త్రిగారికృతుల్లోకల్లా ఉత్తమమై, సర్వజనాదరణీయమై, సారస్వతంలో ఆయనకు శాశ్వతస్థానమిచ్చేంచిది "ప్రతాపరుద్రీయ నాటకం". ఆంధ్రభాషలోవున్న ఉత్తమనాటకాల్లో అగ్రశ్రేణిలోదిది. * పిచ్చివాడిపాత్రను చిత్రించటం అసమానమనచ్చు. దాన్ని అభినయించటానికే ప్రతిభ కావాలె. పిచ్చిమాటల్లో అంతరార్థం! "తెలిసినవాళ్లకు సార్థకం తెలియనివాళ్లకు నిరర్థకం" అయినట్టుగా సంభాషణను కల్పించి, పాత్రను "పరాకోటి"కెక్కించ్చాడు. నిజంగా యుగంధరుడి రాజ్యతంత్రంలో రహస్యంగ్రహిస్తేనేగాని అట్లా చెయ్యలేడు. మిగిలిన నాటకమంతాకూడా తగినట్టే రచించాడు. పాత్రోచితభాష, మొదలైనవాటిలో అందేశిన చెయ్యనిపిచ్చుకున్నాడు. ఆంధ్రతురుష్క-పదసమ్మేళనం, ఆంధ్ర ముసల్మానుల తెనుగు సంభాషణ అచ్చుగుద్దినట్టు వ్యక్తం చేస్తున్నది. "హావు యెక్వా మీకీ మనిసీతక్వా" "ఆయన బాత్వింటువుంటె అదె సాల్నాకీ" "ధ్రువం సిద్ధం" మొదలైన వాక్యాలు యెన్నటికీ మరుపురానివి. ఈనతో పాటీపనిలో సమర్థుడు పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. ప్రతాపరుద్రీయంలో పాత్రపోషణం, కథాసంవిధానం, మిక్కిలి రమణీయాలుగా వుంటై. ప్రేక్షకుల్లో, నటుల్లోకూడా పునఃపునర్దర్శనప్రయోగప్రేరకమని చెప్పడంవల్లనే దానియొక్క ప్రాశస్త్యం గ్రహించచ్చు. ఒకప్పుడు తెనాలి "రామవిలాస సభ" వారే యీనాటకం

* "1909 నాటికే రాశాడు."

ఆడాలని పేరుపొందారు. నెల్లూరిలోనే కవిగారే వక నటమండలి నీ నాటకప్రదర్శనానికి తయారుచేశారు. పిచ్చివాడి పాత్రధారణంలో తెనాలి డాక్టరు గోవిందరాజుల వెంకటసుబ్బారావుగారు, యేలూరు ముంజులూరి కృష్ణరావుగారు చూపిన ప్రతిభ మరెవ్వరూ చూపలేదనటంలో పొరబాటు లేదు. ముఖ్య స్త్రీపాత్ర లేకుండా, శృంగార పీరాల్లో వకటి ముఖ్యరసంకాకుండా, యింత రసవంతంగా నాటకం రచించడంలోమాత్రం కన్యాశుల్కంకంటె విశేషమనచ్చు. కేవలం సంఘంలోవ్రుంపే లోపాలను చూపి, పాఠకులకు ప్రతిబింబాలను తయారుచేసి, మనస్సుకానందంకొల్పింది కన్యాశుల్కం.* ప్రతాపరుద్రీయంయొక్క కథాపరిణామం దీనికంటె మిక్కిలి ఉదాత్తమైంది. హాస్యరసంలోకూడా కన్యాశుల్కంలో పేలవత్వం దాన్లో లేదు. అందుచేత యీ నాటక మొక ఉత్తమకక్ష్యలోదనకతప్పదు. ఈ వక్కటేచాలు శాస్త్రిగారికి సారస్వతంలో శాశ్వతస్థానం యివ్వడానికి. ఈన గ్రాంథిక వ్యావహారిక భాషాచర్చలో చాలాజోక్యం కలుగజేసుకున్నాడు. కథాసరిత్సాగరం తెనిగించాడు. ఆంధ్రవిశ్వవిద్యాలయం వారీయనకు "కళాప్రపూర్ణ" బిరుదునివ్వడం తమ్ము తాము గౌరవించుకోడమే! ఈనవద్దకూడా చల్లనిహాస్యరసం వుంది. ఉద్గ్రంథరచయితలలో ఈయన ఉన్నతస్థాన మేర్పరచుకున్నాడు.

పానుగంటి :

వీరేశలింగంగారు యువకులలో కలగజేసిన సంప్రదాయ వైరస్యాన్ని ఆపటం కొందరికిఅవసరమనితోచింది. దానితోబాటుసంఘంలో వున్న కొన్ని దురాచారాలుకూడా విమర్శిస్తేగాని పూర్వసంప్రదాయాలమీద సరియైన ప్రత్యయం కలగడానికి వీల్లేదు. అంతేగాక

* 1897 నాటికే ఇది రాశాడు గురజాడ.

పూర్వసంప్రదాయాలను మూఢవిశ్వాసంతో కాకుండా, తరుచూ మూలంగా, నమ్మజెయ్యడంతో, వాటిమీద అభినివేశం సకారణమై, చిరస్థాయి అవుతుంది. మన పూర్వాచారాలకు అంతరార్థం చెప్పి ప్రత్యయం కలగజేయడం సామాన్యమైన పనికాదు దానికి సమస్తశాస్త్రజ్ఞానమేకాకుండా ప్రతిభకూడా కావాలె. చెప్పేపద్ధతి రసవంతంగా ఉండాలెకూడానూ. ఇంతపని సామాన్యవ్యక్తి చేయలేదు. ఈపని పానుగంటివారు పూనుకున్నారు. ఈన ఆంధ్రాంగ్లసంస్కృత భాషలలో మంచి నిశితమైన జ్ఞానంకలవాడు. సరస్వతి యీనకు వశ్యైంది. సహజంగా హాస్యరసప్రధానమైన చిత్తవృత్తికలవాడు. ఈనతో కొన్నిదినాలువుండేభాగ్యం నాకుకలిగింది. ఈయన మాట్లాడినంతసేపు, మనం నవ్వుతూవుండాలశిందే! హాస్యరసానికి హద్దూ ఆజ్ఞాలేదు! అకారాదిక్షకారాంతం ప్రవర్తించాలసిందే! కొందరికీహాస్యరస మెక్కొక్కచోట పచ్చిగావున్నట్టు తోస్తుంది. కాని ఆయనసమకట్టిన పని యెటువంటిది? జాడ్యానికొద్దీమందు. అసామాన్యజాడ్యానికి మంచి ఘాటుగల మాందుగాని పనిచెయ్యదు. ప్రతిపాఠకుడూ ఈయనరాతల్లో యెక్కడోవాకక్కడ తనప్రతిబింబాన్ని చూచుకొని నవ్వుకోటమో, యేడ్చుకోటమో చెయ్యాలసిందే! అయినా కలిగేది ఆనందమే! ఈన పీఠికాపురాధీశ్వరుడికి ఆస్థానకవి. ఈయన రాశిన సమస్తగ్రంథాలూ ఆయనేలచ్చేశాడు. అటువంటివాడుండబట్టే ఈయనరాసినగ్రంథాలన్నీ ప్రచురణైనై! ఈయనరాయటంలో "త్వర" చాలామంది రాయసగాండ్లకులేదు. దినైకగ్రంథం రచించగల సామర్థ్యముంది. ఈయన అనేక నాటకాలు రచించాడు. వాటిలో అధికసంఖ్యాకాలు హాస్యరస ప్రధానాలు. హాస్యప్రకృతికాబట్టి మిగిలినరసాలు చిత్రించటంలో శక్తిలేదని యెంతమాత్రం అనుకోడానికివీల్లేదు. ఈయన యెంతహాస్యగాడో అంత భక్తుడు. ఈయన రాధాకృష్ణనాటకం భక్తిసిద్ధాంతంలోవుండే శేషశేషిభావానికి పరమావధిఅనవచ్చు. "పాదుక"కూడా సర్వజనాదరణాన్ని పొందింది. హాస్యరసప్రధానమైనవాట్లో వృద్ధవివాహం, కంఠా

భరణం మొదలైనవి ప్రశస్తాలు. కరుడుగట్టిన ఛాందసం, మూఢ విశ్వాసాలు, ఆధునికుల సర్వజ్ఞత్వంమన్యాలూ, మతానికీ ప్రవర్తనకూ సంబంధం లేదనుకోడాలూ, మతంచాటునజరిగే నీతిబాహ్యాచేష్టలూ, పాశ్చాత్యులదంతా బాగుందనే తెలివితక్కువతనాలు, మొదలైనవి యీన విమర్శనానికిగురైనై! వాటిని పండితపామరజనులకు హృద్యమైనవిధంగా విమర్శించాడు.

ఆంగ్ల సారస్వతంలో ఎడిసన్ అనే వకకవి సంఘంలోవున్న విషయాల్నన్నిటిని "స్పెక్టేటర"నే పేరుతో పత్రికలో విమర్శించేవాడు. అనగా ప్రేక్షకుడు కనపడ్డదాన్ని విమర్శించినట్లు రాశాడన్నమాట! అది పానుగంటివారి నాకర్షించింది. ఆవిధంగా మనసంఘానికీ, సారస్వతానికీ, సేవ చెయ్యాలనుకున్నాడు. "సాక్షి" అనేపేరుతో ఉపన్యాసాలు రచించటం మొదలుపెట్టాడు. అవి ఆంధ్రపత్రికలో పడేవి. కొన్నిదినాలు యీ ఉపన్యాసాలాంధ్రపత్రికకు ప్రచారం కలుగ జేసినై యనడంలో తప్పేమీలేదు. పాఠకులు నోళ్లు తెరచుకుని చదివేవాళ్లు! ఈ సాక్షిఉపన్యాసాలు చివరకు కొన్ని సంపుటాలుగా ముద్రించారు. ఈగ్రంథం ఉత్తమాంధ్రగ్రంథాల్లో వకటని గట్టిగాచెప్పచ్చు. ఈ ఉపన్యాసాలకు సర్వకాలంపనికొచ్చేవిలువవుంది. మనస్సుకు యెంతమాత్రం నొప్పికలుగజెయ్యకుండా విషయబోధనం చెయ్యడంలో వీటికితగినవి ఆంధ్రసారస్వతంలోలేవు. వీటిలో ఆయన స్పృశించని విషయంలేదు. వేదాంతందగ్గిరనించీ "సోషాలజీ" దాకా సర్వవిషయాలూ చర్చించబడ్డై. ప్రతిఆంధ్రుడివద్ద ఉండవలసిన గ్రంథమిది. ఒకమారు పుస్తకంపట్టుకుంటే వదలబుద్ధిపుట్టకపోవడమే కాకుండా, మళ్లీమళ్లీ చదవాలనికూడా బుద్ధిపుడుతుంది. ఇంక పుస్తకం ప్రశస్తమని వేరేచెప్పాలా? జంఘాలశాస్త్రి అనేపాత్ర కవిగారి ప్రతిబింబమే! ఏదిచెప్పినా శాస్త్రినోట చెప్పించాడు. స్త్రీస్వాతంత్ర్యవాదం, గ్రంథవిమర్శనా పద్ధతి, గ్రామ్యగ్రాంథిక

భాషావాదం మొదలైన సాంఘికసారస్వతవిషయాలన్నీ కూడా యీన విమర్శకుగురైనై! తోలుబొమ్మలు మొదలైనవాట్లో హాస్యం కొంచెం ముదురుపాకమని అంటారు. కాని విషయాలు సత్య దూరాలుకావు. ఒక్కొక్కప్పుడు కవిచిత్రంకంటె సాక్షాత్తు జరిగిన సంగతి నమ్మడానికి వీల్లేకుండా వుంటుంది! అంతేగాక అసత్యం మొదలైనవి, సంఘంలో అతిగా పాకిపోయినై. వాటినిగూర్చి యెంత చెప్పినా యెట్లా చెప్పినా తక్కువే అనాలె! మొండి వాడికి మొండిమాటలతోనే సమాధానం చెప్పాలె! * ఈన యిటీ వలనే పరమపదించాడు. ఈయన సప్తతిమహోత్సవం జరిపిందాంధ్ర దేశం. తుదివరకు యీనను పీఠకాపురాధీశ్వరుడు పోషించి చిరకీర్తిని పొందాడు. ఈన యీ శతాబ్దంలోవున్న గొప్పవ్యక్తుల్లో ఒకడు.

ఈనరాతలవల్ల సారస్వతానికి రెండుపకారాలు జరిగినై. (1) నాటకరచనాపద్ధతిలో మార్పు మొదటిది. పాత్రోచిత భాష రాయటమేగాక సందర్భంలో గద్యపద్యావశ్యకతను నిర్ణ యించడం యీనతోకిక్కన కొత్తతోవ. ఇంతకు పూర్వం నాటకంలో గద్యానికంటె పద్యాని కెక్కువ స్థానముండేది. ఈ కాలంలోరాశే ఆంగ్లనాటకాలు చూస్తే వాటిలో పద్యానికంటె గద్యాని కెక్కువస్థాన మిచ్చినట్టు కనబడుతుంది. కొన్ని కేవల గద్యనాటకాలే? పద్యమనగానే మననాటకాల్లో సంగీతానికి తావు కలుగుతుంది. నటులకు సంగీతంమీద బుద్ధి యెక్కువగా పోతుంది.

---

* మళయాళంలోకూడా యీపద్ధతిన సంఘువిమర్శనాన్ని చేశాడు కుంజక్ష నంబియారనేకవి.

*"He has woven very cleverly into the fabric of his poems some excellent didacticisn, splendid spiteful stuff, satirically humourous, while applies the lash to the evils of contemporary society, effectively, without leaving however any lascerating wound behind.*

*(Hindu 5-1-40)*

నాటకానికెంత సంగీతం కావాలా అనేది యిప్పటికీ నిర్ధారణ కాలేదు. సినిమాలొచ్చి యీ సమస్యను చాలా క్లిష్టం చేసినై. సంగీతం ప్రధానంకాక, కేవలపఠనమే పరమావధిగాగల శ్రవ్య ప్రబంధాలే రసోత్పత్తికి తోడ్పడి పాఠకుల కానందంకలుగజేస్తూంటే, సంగీతముంటేగాని నాటకం రక్తికట్టదనేవాదం యెంతమాత్రం విశ్వాసార్హం కాదు. కాబట్టి తగుమాత్రమైన సంగీతముంటే చాలును అని తేలుతుంది. కీర్తనలు నాటకానికి కావశ్యకములా అనేదికూడా క్లిష్టప్రశ్నే. పద్యం అవసరమైతే కీర్తనా అవసరమే! "పద్యభావ గ్రహణాని కవసరమైన సంగీతమే నాటకానికి చాలుననీ, అల్లాగే కీర్తనకూడాఅనీ" శ్రీ పానుగంటివారి వాదం. అందుచేత ఈయన రాసిన తర్వాతనాటకాల్లో పద్యంకంటె గద్యానికెక్కువచోటిచ్చాడు. ఈన, వాట్లో గీతపద్యం చాలాయెక్కువగా వాడాడు. "గీతకవి" అని యీనకు కొందరు పేరుపెట్టారు.

(2) రెండవది ఆంధ్రగద్యశైలీపరిణామం. గద్యవల్లరసోత్పత్తి చెయ్యవచ్చునని యీన ధృవపరిచాడు. ఈన చేతిలో గద్య వక కొరడావంటిదైంది ఒక్కొక్కప్పుడు. ఈనగద్యశైలి గంగాప్రవాహమల్లే నిరంతర పదధారాసంకలితం. పదాలు ప్రవహిస్తై. సమాసాలు ఉప్పొంగుతై. ఒక్కొక్కప్పు డొక్కవాక్యంలో సమాసాలు కుప్పలు పడిపోతై! పెద్దసమాసంకూడా సులభంగా అర్థంస్ఫురిస్తూఉంటుంది. చదువుతూంటే యెంతమాత్రం విసుగు కలిగించదు. ఈన గద్యశైలి యిట్టి విశిష్టగుణాలు కలిగివుంది. ఇంగ్లీషుభాషలో వుండే భావాన్ని మిక్కిలి హృదయంగమంగాపెట్టి అంతకంటె వన్నె తెప్పించటంలో యీన కపరిమితమైన శక్తివుంది. పదచిత్రాలు, వాక్యచిత్రాలు కల్పించి, పాఠకుడి హృదయంలో భావచిత్రం కల్పించడంలో, యీన పజ్ఞ అసమానం. మశకమహాసభలో వివిధమశకస్కంధావారాలు

వర్ణించడం చదువుతూంటే వాటిని చూస్తున్నట్టే వుంటుంది. ఈన కున్న భావనాశక్తి చాలా తక్కువమందికుంది. బహుగ్రంథ రచయితై, యెన్నింటినైనా, వకదాన్ని మించేటట్టు యింకొకదాన్ని రచించటంలో యీనతో సమానులెవ్వరూ లేరనచ్చు.

ఈ విధంగా యింకా కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి మొదలైనవారు, పండితులై, కవులై, అనేక గ్రంథాలను రచించారు. మధిర సుబ్బన్న దీక్షితులనే ఆయన ప్రచారంలోవున్న కథలన్నిటిని సేకరించి గుదిగూర్చి కాశీమజిలీలనే పేరుతో కొన్నిసంపుటాలుగా ప్రకటించాడు. రాయజగపతివర్మగారు పెద్దాపుర సంస్థానచరిత్ర రాశాడు. దానికి విమర్శనంగాకూడా వక గొప్ప గ్రంథం వెలువడింది. ఈవిధంగా యీకాలంలో ఉద్గ్రంథరచన జరిగింది.

---

# నవ్యాంధ్ర సాహిత్యవీధులు

౪

నవ్యాంధ్ర సాహిత్యం :

"నవ్యాంధ్ర సాహిత్యమన్నారే! ఈపైనచెప్పిన ఉద్గ్రంథాలన్నీ నవ్యాంధ్రసాహిత్య మెట్లాఅవుతాయీ" అని వకప్రశ్న. దీనికి విశ్వనాథ సత్యనారాయణగారిని సాక్ష్యంవేసుకుంటున్నా—

"సాహిత్యమంటే వకజాతిసంస్కారం. మనజాతి పూర్వం వక గొప్ప సంస్కారదశను పొందింది. సృష్టిక్రమంలో, సృష్ట్యాది నుండి కాలనిర్ణయంలో, భిన్నరాజ చరిత్రనిర్ణయంలో, సంఘ ధర్మ నీతులలో, ఆర్థిక రాజకీయాలలో సారస్వతపథాలలో వక విశిష్టమైన సంస్కారంతో గూడిన సిద్ధాంతాలమీద మనజాతినడిచింది. ఇవ్వాళ ఆంగిలేయులు మన్ని ఆక్రమించడంచేత ఆమహాసంస్కారం మీద అభిమానం పోయింది. పాశ్చాత్యదేశీయుల సంస్కారంమీద అభిమానం ప్రబలింది. ఏతదభిమాన పురస్కృతములైన భాషా తత్వం, చరిత్రనిర్మాణం, సృష్ట్యాది కాలనిర్ణయం, సంఘధర్మాలు, విశ్వాసాలు, వీటిని యేయేగ్రంథం పరామర్శిస్తుందో అదంతా నవ్యసాహిత్యం."

మా గురువులు ఆదినారాయణశాస్త్రిగారి మాటలుచూడండి. "ఆంగ్లపాలనఫలితంగా, మనకు ఆంగ్లవిద్యాపరిశ్రమమూ, ఆంగ్లుల ఆచార వ్యవహారాల వాడుకలూ, వారి రాజకీయ సాంఘిక పరిజ్ఞానమూ, తప్పోఒప్పో కొంత స్వదేశ విదేశాలకు సంబంధించిన చరిత్రజ్ఞానమూ, స్వదేశ స్వభాషాభిమానము, తన్మూలాన మన

పరాశ్రయస్థితి, జనసంఘంలోవున్న లోపాలూ, వాటిని సవరించుకోడానికిన్నీ విదేశాలతో సాటిగావుందామనేదానికిన్నీ తగిన యత్నమూ, ఇత్యాదులు మనలో అంకురించినవి. ఇంతవరకూ అన్నీ సుగుణాలే అని చెప్పవచ్చు. కాని సుఖదుఃఖాలూ శీతోష్ణాలూ మొదలైన ద్వంద్వాలలాగునే, యీ సుగుణాలతోపాటు కొన్ని దుర్గుణాలుకూడా మనకు అంటుకున్నవి. ఐచ్ఛికంగానో నిర్బంధంగానో అబ్బిన విదేశీయ ఆచారవ్యవహారభాషాసంప్రదాయాలు మంచివనే వక వ్యామోహం, స్వజాతి దూషణం, పరజాతి కీర్తనమూ, ఆత్మ విశ్వాసశూన్యతా, నిత్యశంకితావస్థా, వీటినన్నిటినీ మించిన దారిద్ర్యం, ఆదారిద్ర్యంలోమునిగి పరస్పరావిశ్వాసాలతోనిండిన అప్రయోజకము లైన కులద్వేషాలు, స్వార్థపరత, అందుకై తన్నుగాని, తన దేశాన్ని గాని, జాతినికానీ బలిపెట్టే అసభ్యమైన త్యాగం, యిత్యాదులు ఆగుణాలతో అంటుకున్న శాశ్వతదోషాలు. వీటినన్నిటిని ప్రతిబింబింప చేశేది నవ్యసాహిత్యం' (శ్రీ శాస్త్రిగారి వివరణందాదాపు సమగ్రం.

ఈ నిర్వచనాల్లో సూచించిన మార్పులు ఉన్నైఅనుకోండి. వాటిపైన అభిమానాన్ని అనుసరించి రాశేవాటికీ, స్వసంప్రదాయ రక్షణం పరమావధిగా పెట్టుకుని రాశేవాటికీకూడా ఈనిర్వచనం వర్తిస్తుంది. కాబట్టి తదభిమానంతో రాశే వీరేశలింగం పంతులు మొదలైనవారి రాతలూ, తజ్ఞానంమూలంగా మనసాంప్రదాయాన్ని విమర్శించి, దానిలోవున్న నిగ్గునుచూపే పానుగంటి మొదలైనవారి రాతలూకూడా నవ్యసాహిత్యంలో చేరుతాయని నా మనవి. వ్యావహారిక భాషావాదంలో, తన్నిరసమూ, దానికి సమాధానమూ కూడా భాగాలుకావూ? వాద ప్రతివాదాలు రెండూకూడా వ్యాజ్యంలో అంతర్భాగాలే! సంప్రదాయవిమర్శకులు సంప్ర దాయాన్ని విమర్శించే రాతలవలెనే, పూర్వప్రత్యయ రక్షకాలైన

రాతలూ కూడా, తదంతర్భాగాలే! మరిన్నీ తత్కాలంలో రాయబడ్డ పూర్వసాంప్రదాయానుసారాలైన రాతలుకూడా నాకు పరామర్శనీయాలే నని మనవిచేస్తున్నాను. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి వ్యాకరణం నవ్యాంధ్రి సారస్వత భాగమైనప్పుడు ఈ కాలంలో రాశిన ఉద్గ్రంథాలేల కావు? ఇంకో చిత్రం! వఝల చినసీతారామ శాస్త్రిగారి "వైయ్యాకరణ పారిజాతం" కూడా నవ్యాంధ్రిసారస్వతాంతర్భూతమే! ఇంక నాకు భయం లేదు.

భాషాసంస్కారం:—(గిడుగువారు)

"All new literary movements....................originate in dissatisfaction of the past, and aim at turning over new leaf, which in the case of poetry means, an attempt to return to the method and manner of ordinary natural speech."

(*Martin Gilkes.*)

వెనక దేన్నైతే నవ్యసాహిత్యమన్నానో దానికి మూలభూతాలైన విషయాలు నాలుగు:

1. గిడుగువారి భాషాసంస్కారవాదం, దాని ప్రోద్బలం.
2. రాయప్రోలు, గురజాడల ఉపజ్ఞకమైన ఖండకావ్య గీతికారచన.
3. కట్టమంచివారి కవిత్వతత్త్వవిచార రచన.
4. సాహితీసమితి పత్రికాస్థాపనాలు.

మొదటిదాన్ని గూర్చి పరామర్శిస్తున్నాను.

ఇక్కడ మనదృష్టి కొంచెం వెనక్కు మళ్ళించాలె. కాల్డ్వెల్ సిద్ధాంతాన్ని వెనక మనం తెలుసుకున్నాము. దానివల్ల అప్పటివారిలో కొందరికి ద్రావిడభాషలు సంస్కృతప్రాకృతభవాలుకావని గట్టి అయింది. "కాల్డ్వెలు గ్రామరు చదివి ద్రావిడభాషల సంప్రదాయం,

తెలుగుకు వాటితో గల సంబంధం, ఇదొకవైపున భాషాశాస్త్రమనే పేరుతో బయలుదేరింది. ఈశాస్త్రానికి అచ్చంగా శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు ఆచార్యుడైనాడు," అన్నారు విశ్వనాథవారు. ఆవిషయంలో పరిశోధనలు దేశమంతటా ప్రారంభించారు. తమిళ భాష పదజాలాన్నిబట్టి వ్యాకరణాన్నిబట్టి యీ ద్రవిడభాషలో వయోవృద్ధగా కనబడ్డది. కొందరు తమిళసోదరులు పరిశోధించి తమిళమే సమస్త ద్రవిడభాషలకు తల్లి అని రాయటంసాగారు. వాళ్ళ తమిళభాషలో సంగం వాఙ్మయమున్నదనీ, దాన్ని పరీక్షచేస్తే చాలా ప్రాచీనమనీ చెప్పటం మొదలుపెట్టారు. (ఈవిషయాన్ని గూర్చి డాక్టరు నారాయణరావుగారు ప్రమాది ఉగాదిసంచికలో గొప్ప వ్యాసం రాశారు. అది చదవమని హెచ్చరిస్తున్నాను.) 1904-5 లో బెజవాడలో మాణిక్యనాయకారను వక యింజనీరుండేవాడు. ఆయన పరిశోధనచేసి సమస్త ప్రపంచలిపులు తమిళ లిపిలోనించే వచ్చాయని ఉపన్యాసాలిచ్చాడు. అటువంటి ఉపన్యాసం నా చిన్నతనంలోనే నొకటి విన్నాను. ఈ ద్రావిడ భాషాచారిత్రక పరిశోధన చేసిన వాళ్లల్లో వకడు పి. టి. శ్రీనివాసయ్యంగారు. ఈన 1905-6 ప్రాంతంలో విశాఖపట్నం కాలేజీ ప్రిన్సిపాలుగా ఉండేవాడు. విశాఖపట్నం కాలేజీనించి ప్యాసైన అప్పటి విద్యార్థులందరికీ ఆయన చాలా విషయాలలో గురువు. ఆయనతో సమావేశం కలిగింది గిడుగు రామమూర్తి పంతులుగారికి. వీరికి తోడైనాడు గురజాడ అప్పారావుగారు. ఈత్రిమూర్తులూ యేకీభవించారు. తెనుగుభాషను సంస్కారం చెయ్యాలని పూనారు. అప్పారావుగారప్పటికే కన్యాశుల్క-నాటకాన్ని రాశి భళిభళీ అనిపించుకున్నాడు. ఈనాటకాన్నిగూర్చి తరువాత మళ్ళీ ముచ్చటిస్తాను. గిడుగువారు కూడా అప్పటికే తన సవర భాషా పరిశోధనం సాగించి, ఆభాషకు వాగనుశాసనుడైనాడు. ఈనలో భాషాపరిశోధనబీజాలు సహజంగా వున్నై. సంస్కృతభాషా సంప్రదాయాలు తెనుగుకు తెచ్చిపెట్టి,

వెనకటి వైయాకరణులు భాషకపకారం చేశారని యీన గట్టిగా నమ్మాడు. భాషావేత్త కాబట్టి స్థిరమైపోయిన సంస్కృతభాషా మర్యాదలు గచ్ఛద్భాష అయిన తెనుగుకు పనికిరావనే వాదం లేవదీశాడు. వెనకటి గద్యగ్రంథాలన్నీ అవలోకనం చేశాడు. చిన్నయ్యసూరిచేసిన పనిమీదపడ్డది వీరిదృష్టి. చిన్నయ్యసూరి గద్య ఆయనకు తలనొప్పి కలిగించింది. నీతిచంద్రికను యెత్తుకున్నాడు. తర్వాత చిన్నయ్యసూరి ననుసరించి పండితులు రాసిన గద్యనుకూడా పరామర్శించాడు. వ్యాకరణానికిన్నీ, భాషకున్నూ, అంతరంయెత్తి చూపాడు. తుదకు చిన్నయ్యసూరి వ్యాకరణ ప్రకారం చిన్నయ్యసూరే రాయలేదని రుజువుచేశాడు. ఈనదృష్టి గద్యంమీదికే ఎక్కువగా పోయింది.

ఈకాలంలో జరుగుతున్న కొన్ని నూతనమార్పు లిక్కడ చెప్పటం అవసరం. సామాన్యవిద్య ప్రజలలో వ్యాపించాలని నాయకులు చెప్పటం మొదలుపెట్టారు. గోఖ్లేగారు తమ నిర్బంధ ప్రారంభ విద్యాశాసనాన్ని ఉపపాదించి దేశమంతా ప్రచారం చేశాడు. మొత్తంమీద సామాన్యప్రజల్లో విద్యావ్యాపనావశ్యకత ప్రతివారి ఆశయమైంది. సామాన్య ప్రజలకు గ్రాంథికభాషలో రాశే గ్రంథాలకంటె, వారు ప్రతిదినమూ వినే వ్యావహారికంలో రాస్తే సులభగ్రాహ్యమౌతై. పండితులైనవాళ్ళు తమ భాషాప్రపంచంలోనే తాము వుంటారు గాని వారికి జనసామాన్యవిద్యంటే అంతశ్రద్ధలేదు. పైపెచ్చు పండితులకూ సామాన్యప్రజలకూ మధ్య అంతరం పెరగటం మొదలెట్టింది, విజ్ఞానం అందరికీ అవసరమే! ప్రజాసామాన్యంలో యిప్పుడున్న స్వల్ప విజ్ఞానం, వారికి సులభగ్రాహ్యమై, ప్రతిదిన ప్రచారంలోవున్న పాటలయొక్కా పద్యాలయొక్కా ఫలమని పంతులుగారు కనిపెట్టారు. అదే వీరి యభిప్రాయాలకు ప్రేరకం. చిన్నప్పటినుంచి అడివిజాతైన సవరులకు చేసిన వీరిసేవ, వీరికీ అభిప్రా

యాన్ని గట్టిపరిచింది. సవరభాష వదిలి తెనుగుపైన దృష్టిచొప్పించాడు. కాల్డ్వెల్‌గారి ఆంధ్రభాషాతత్వరహస్య మీయన అభిప్రాయనికి తోడ్పడింది. తెనుగు సారస్వతంలో జటిల సంస్కృతపదభూయిష్టమైన భాగం యీన విమర్శకు గురైంది. కాని బొత్తుగా సంస్కృతాన్ని తోశిరాజనటం యీన ఉద్దేశ్యం కాదని తలుస్తాను. సామాన్యవ్యవహారంలో ఉన్న సంస్కృతపదాలు వాడటానికి ఈయన కేట్టి అభ్యంతరం లేదు. ఈయన వాడాడు. వ్యాకరణం యీనకు భాషను కట్టే శృంఖలగా కనపడ్డది. వ్యవహారంలోవున్న తెనుగుభాషా రూపాలన్నీ ఈయనకు గ్రాహ్యాలే!

ఈ కాలంలోనే కర్జన్ప్రభువు బెంగాలురాష్ట్రాన్ని ద్విధా విభజించేటప్పటికి బెంగాలు ప్రజలకు కోపమొచ్చి ఆందోళనం మొదలెట్టారు. ఆ ఆందోళన మూడు రూపాలు పొందింది.

1. స్వరాజ్యవాంఛ.
2. స్వదేశవస్తుప్రీతి—విదేశవస్తుబహిష్కారం.
3. జాతీయవిద్యావశ్యకత.

వీటిలో మూడోదానికి స్వరాజ్యకాంక్ష దోహదమైంది. దానితో స్వభాషలమీద అభిమానం జనించింది. బంగాళానుంచి యీఆందోళనం యావద్భారతదేశానికీ వ్యాపించింది. ఆంధ్రదేశం కూడా కలవరం చెందింది. ప్రచారం చెయ్యాలశొచ్చింది. ప్రజాసామాన్యానికి వ్యావహారికంలో ఉపన్యాసాలియ్యాలె. ఈ విషయం కూడా తత్కాలంలో వీరి ఉద్యమానికి సహాయపడ్డది.

ఈ ఉద్యమానికి పరిణామంగా ఆంధ్రోద్యమంకూడా పుట్టే బీజాలు పడ్డై. ఆంధ్రులు అరవదేశ సంపర్కంచేత సంస్కృతిలోనూ, ఆర్థికంగాకూడా, నష్టపడుతున్నారని నాయకులంతా గమనించి ఆంధ్రరాష్ట్రాందోళన ప్రారంభించారు. దీనికికూడా ప్రచారం

కావాలె. అందుకు జనసామాన్యందగ్గిరి కెళ్ళాలె. కాబట్టి వ్యావహారిక భాషావశ్యకత కలిగింది. *ఇవన్నీ కారణాలే అయినప్పటికీ పంతులవారిని ప్రేరేపించింది నిజమైన ప్రజాసేవేచ్ఛే అని చెప్పాలె. "ప్రజలలో వ్యాపించవలసిన విద్య, ఈకాలానికి పనికిరాని ప్రాచీన కావ్యాలు వ్యాకరణాలు చదివించడంవల్లరాదు" అని రాశాడాయన ఒకమారు. "ప్రజలలో విద్య వ్యాపిస్తేకాని సంఘం వృద్ధిలోకిరాదు" అన్నాడు మరోమారు.

జీవద్భాషకుచుట్టూ కట్టుకట్టడం యెవ్వరికీ సాధ్యంకాదు. అటువంటి భాషకు శాశ్వతమైన వ్యాకరణం రాయటం కట్టుకట్టడంవంటిదే! అంతే గాక సంభాషించే భాషే నేర్చుకోవలసిన భాషైతే, ఆభాషలో వ్యాకరణాన్ని యెంత రుక్కుపెట్టినా, రాయాలశొచ్చినప్పుడు మాట్లాడే భాషే సులభంగా వస్తుంది. ఈసంగతి నిజమని పంతులవారు పండితుల అందరిరాతల్లోనించీ చూపారు. ఈ కింది వాక్యం పంతులవారిది.

"మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకటరత్నంపంతులుగారికీ, రావుబహద్దరు కందుకూరి వీరేశలింగం పంతులుగారికీ గ్రాంధికాంధ్రభాష రాదనీ, వారి గ్రంథాలలోవున్న తప్పులు చూపించారు కళాప్రపూర్ణులయిన వేదం వెంకట్రాయశాస్త్రిగారు. వారు తప్పులు ఒప్పులుగాను, ఒప్పులు తప్పులుగాను చెప్పారని చూపించి, ప్రాచీన

* ఈ ఉద్యమం వక్క మనభాషలోనేగాక దేశభాషలలో చాలావాటిలో కలిగింది. చూడండి :

*"The present-day literary Bengali is often nothing but Calcutta colloquial, with only a few archaic inflections of the verb; it is freely used in literature especially in poetry drama and fiction, and there is a strong body of writers who advocate the suppression of old literary language by this living and vigorous form of Spoken Bengali."*

*(Bengali Phonetics)*
*by Dr. S. K. Chatterjee.*

గ్రాంథికాంధ్రభాష వారికి బాగా పట్టుపడలేదని నేను రుజువు చేశాను" ఈవిధంగా పండితులే గ్రాంథికాంధ్రం రాయలేరనీ, అటువంటప్పుడు పామరులు రాయలేకపోవటం విశేషంకాదనిన్నీ, కాబట్టి వ్యావహారికమే గ్రాహ్యమనిన్నీ, అట్లా దాన్ని అనుసరించడం సహజమైన జీవద్భాషాసంప్రదాయమనీ, పంతులవారి వాదం. ప్రజాసామాన్యపఠనానికి వ్యావహారికంలో గ్రంథాలు రాయాలనీ, వారు కూడా ఆ భాషను రాయడానికీ చదవడానికీ సమర్థులుకావాలనీ ఆయన చెప్పాడు.

ఈ విధంగా అప్పారాయ సహాయంతో యీ వాదం లేవదీశాడు. ఆంధ్రదేశంలో యీన కెట్టి ప్రోత్సాహం కలగలేదు. చూడండి, ఆయనే వకచోట, "మొదట నేను నామిత్రుడగు గురజాడ అప్పారావూ, మాకు తోడుగా మరి యిద్దరు మాత్రమే యీ ఉద్యమము ప్రారంభించాము" అని రాశాడు. ఒకవైపునుండి పండితబృందమంతా యీ "రాక్షస కృత్యాన్ని" యెదుర్కోడానికి నడుం బిగించారు. వీరిలో జయంతి రామయ్యపంతులుగారు ముఖ్యుడు. ఆయన అధికారంలో వున్నవాడు. అప్పటికే తెనుగులో పండితుడూ పరిశోధకుడూ అనిపించుకుంటున్నాడు. ఆయనకు అధికారంవుంది కాబట్టిన్నీ, యిది సహజంగా తమ కయిష్టమైన సంస్కారం కాబట్టిన్నీ, పండితులందరూ ఆయనపక్షమే అయ్యారు. రామమూర్తిగారు విశ్వవిద్యాలయాల్లోకూడా వ్యావహారికభాషకే ప్రాముఖ్య మియ్యాలనీ, అటువంటి గ్రంథాలే పాఠ్యగ్రంథాలుగా నిర్ణయించాలనీ పట్టుపట్టాడు. వీళ్ళల్లో కొంతమంది పాఠ్యగ్రంథనిర్ణయసభలో మెంబర్లుగా కూడా వున్నారు. శ్రీనివాసయ్యంగారూ, అప్పుడు విశాఖపట్నంలో విద్యాశాఖాధికారిగావున్న యేట్సు అనే దొరగారూ వీరికి పట్టుకొమ్మలైనారు. మొత్తంమీద అందరూ ఆలోచించి వేదం వెంకటాచలయ్యగారు రాశిన "విధిలేక వైద్యుడు" అనే వ్యవహారి

కంలో కాశీన పిరిజర్ నాటకపరివర్తనాన్ని పాఠ్యగ్రంథంగా నిర్ణయించారు. దానిమీద వాదోపవాదాలు జరిగినై. శ్రీనివాసయ్యంగారు ఆంగ్లభాషలో "Life or death, a plea for vernaculars" అనే గ్రంథాన్ని రచించి యీవాదానికి సాయపడ్డారు. మొదట వకరిద్దరైనా తర్వాత విశాఖపట్నం కాలేజీ పాత విద్యార్థుల్లో ఆంధ్ర భాషాభిమానులూ యింకా కొందరూ వీరికి తోడుపడ్డారు. 1911 లో "ఆంధ్రసారస్వతసంఘు" మొకటికూడా స్థాపితమైంది. అప్పుడు పనిచేసినవారిలో చెట్టి లక్ష్మీనృసింహంగారూ, బుర్రా శేషగిరిరావుగారూ, కిడాంబి రామానుజాచార్లగారివంటివా ళ్లున్నారు. అప్పుడు యిక ఊరుకోటం పనికిరాదని రామయ్యపంతులుగారు, ఆంధ్రసాహిత్యపరిషత్తని వక సంస్థను స్థాపించి ప్రచారంచేస్తే నేగాని వీల్లేదని అటువంటిదాన్ని ప్రారంభించాడు. ఈ పరిషత్తు యేటేటా వక పట్టణంలో సాంవత్సరికసభచేసి యీ వాదంలో నడుముకట్టుకొని పోట్లాడేది. మొదట "వ్యావహారిక"పదం అంత యెక్కువగా ప్రచారంలో లేదు. "గ్రామ్య"పదంతో యీ వాదానికి నామకరణం చేశారు రామయ్యపంతులుగారు. "గ్రామ్య"శబ్దం చెడ్డదికాబట్టి 'గ్రామ్య భాషా'ప్రచారం యీ సంస్కర్తలయొక్క ఉద్దేశ్యమనిగనక ప్రజలతో చెబితే, అట్టి చెడ్డభాషను యెట్లాగైనా సంహరించడంలో వా రెంతో తమకు తోడ్పాతారని వీరి ఆశయం. వాదం లేవదీసిన గిడుగు వర్గరాలు "వ్యావహారికభాష" అంటే జయంతిప్రభృతులు "గ్రామ్య భాష" అన్నారు. ఇప్పటికీ యీ వాదాని కక్కడక్కడా అడ్డం తగులుతూండేవాళ్ళంతా "గ్రామ్య"శబ్దమే వాడుతూవుంటారు. కాని వాదం చాలా బలం చేకూర్చుకున్నది. ఈ కాలంలో వీళ్ళను బహిరంగసభల్లో గెలవలేమని పండితులంతా లోకలుముడుచుకున్నారు. ఈ వాదంయొక్క పోకడకూడా చూస్తే మొదట ప్రారంభించినప్పుడున్నంత విప్లవంగా సాగడంలేదు. రామమూర్తి అప్పారావుగార్లు మొదట యీ ఉద్యమం ప్రారంభించినప్పుడు వారికి సార

స్వతంతోనూ, రసంతోనూ, కావ్యత్వంతోనూ పనే లేనట్టు తోస్తుంది. భాషే ముఖ్యంగా కనపడ్డది. గ్రంథాలు మంచివా అనే ఆలోచన నక్కర లేదు. వ్యావహారికంలో రాస్తే సరి. అప్పారావుగారు రసికుడు కాబట్టి, తర్వాతనైనా యీ సిద్ధాంతాన్ని కవిత్వానికి పట్టించడానికి ప్రయత్నించాడు. కాని, రామమూర్తిగారు కేవలం "వైయాకరణఖసూచి". ఆ భాష రాస్తేసరి, భావంతో పని లేదాయనకు. ఇదికూడా వెనకటి ఛాందసపండితులఫక్కీయే కొంతవరకు. వాళ్ళూ భాషకే ప్రాముఖ్యం యిచ్చారు. రామమూర్తిగారూ అంతే. దొంగను దొంగే పట్టాలెకాబట్టి వాళ్ళవాదాన్ని వాళ్ళ ఉపకరణాలతోనే ఢీకొన్నాడు. ఇది సమంజసమే.

ఈ వాదాన్ని బాగా పరీక్షిస్తే దీనిలో మూడు అంతస్తులు కనపడతై. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారీ సంగతిలో నాకు సాక్ష్యం.

"వారి వాదము మొదటినుంచి కొన్ని సంవత్సరములు దేశములో భాష వాడుకలో నున్నట్లే వ్రాయవలె నన్నంత తీవ్రముగా నడిచింది."

ఇది మొదటిమెట్టు. చావుకు పెడితేగాని లంఖణాలకు తేలదు!

"తరువాత భాషాసంప్రదాయవిమర్శనలగ్నమై, ప్రాచీనార్వాచీన కవిప్రయోగములకు సరివచ్చు శిష్టవ్యవహారములోని శబ్దములు రచనయందు గ్రాహ్యములనుచు, ప్రమాణ ప్రదర్శనపూర్వకముగా విజృంభించినది."

ఇది రెండోమెట్టు. కాల్డ్వెల్ సిద్ధాంత మిక్కడ పనిచేసింది. వాదం నియమాల ననుసరించింది. వాదానికి దారి యేర్పడ్డది. కవిప్రయోగాలకూ, ప్రస్తుత శిష్టవ్యవహారానికీ, కాలానుసారంగా మార్పుకూ, పరస్పరసంబంధం కలిగించి వాదానికి స్థాయిత్వమిచ్చారు యీ మెట్టులో.

"పిదప భాషాసంస్కారము, భాషాసంప్రదాయము, అను రెంటిని సహేతుకముగా, సోదాహరణముగా విశదీకరించుచు, శిష్టుల వాడుకలోని భాష కెప్పటికప్పుడు ఆనాటి గ్రంథములలోని భాష దగ్గరగానుండవలెనన్న మతమును స్థాపింపబూనినది."*

ఇది చారిత్రక పద్ధతి. ఈవిధంగా పెరిగిన వాదాని కెప్పటికి దుర్బలం అనేది వుండదు. సంప్రదాయానికికూడా చోటొచ్చింది. ఈ రెండూ అనగా చరిత్ర, సంప్రదాయము తెలియనివారు అభినివేశంతో పోట్లాడవలశిందే కాని, భాషాసంప్రదాయచరిత్రవేత్తలు నిరుత్తరులై పోవలసిందే! మొండిగా వాదించేవాళ్ళకు సమాధానమే చెప్పలేము! మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారివంటి లాక్షణికుడీ వాదం సహేతుకమైందంటే, యింకేం కావాలె? చూడండి. సూర్యనారాయణశాస్త్రిగా రేమన్నారో!

"'పాతబడ్డ మాటలు రచన కర్హములుకావు. వాటి సంప్రదాయము నేటివారికి తెలియదు. ప్రాచీనకవి ప్రయోగములెన్నో పూర్వ వ్యాకరణములకు విరుద్ధములుగా నున్నవి. దేశ్యశబ్దజాలము మారునట్లే దేశభాషా వ్యాకరణములును మారుచుండవలెను. తదనుగుణమైన రచన పండితపామరరంజకము' అనుచు సయుక్తికముగా గ్రాంథికవ్యావహారిక భాషలకు సామరస్యము కలిగింప నుద్యమించినది. ఇది వారి వాదములోని సారాంశము". సూర్యనారాయణ శాస్త్రిగారు సహృదయులు కాబట్టి ప్రతికక్షివాదంలో హేతువును కనిపెట్టి దాని సత్యం గ్రహించారు. ఇది నిజమైన

---

* "..............*all poetry, so long as it remains alive and vital must be in touch with the life of its own day.*"

"ఆంధ్రశబ్దచింతామణి రచయితయు, తమపరి అప్పకవి, కూచిమంచి తిమ్మకవి, అడిదం సూరకవి, వీరందరు తమతమకాలాల్లో వ్యావహారికపదములను ప్రయోగించినటుల ప్రబలసాక్ష్య మున్నదనీ"

(గి. వేం. సీతాపతిగారు 30-7-40 ఆంధ్రపత్రికలో)

భాషా వ్యవసాయం. మొత్తంమీద రామమూర్తిగారి వాదం భాషకు సంబంధించిందనే చెప్పాలె. ఈసందర్భంలో విశ్వనాథవారి నవ్యాంధ్ర సాహిత్య పరిషదధ్యక్షోపన్యాసోపోద్ఘాతం చదవమని హెచ్చరిస్తున్నాను.

ప్రతిపక్షులంతా ఆలోచించి సాహిత్యాని కీవాదంవల్ల ముప్పు వచ్చిందనుకుని, పరిషత్తు స్థాపించారు. వారి మతం ప్రకారం వారూ భాషా సేవకొరకే దాన్ని స్థాపించారనే మనమనుకోవాలె. భాషా సాహిత్యాలను చెడగొట్టాలని యిద్దరి ఉద్దేశ్యమూకాదు. అభిప్రాయ భేదం. ఇది సహజమే. ప్రతి నవ్యతా ప్రాచీనులకు విప్లవంగా కనబడు తుంది. అడ్డుపెట్టడానికి ప్రయత్నం జరుగుతుంది. దానికి కూడా సేవే వ్యాజం. కాబట్టి పరిషత్ స్థాపకులది దురుద్దేశ్యమని యెంతమాత్రం చెప్పడానికి వీల్లేదు. పరిషత్తు కేవలం గ్రామ్య ప్రతికూల ప్రచారం కొరకే పుట్టినట్టు గిడుగువారి అభిప్రాయం. కింది వారి వాక్యం చూడండి.

"సుమారు 30 సంవత్సరములై వర్తమానాంధ్రభాషాప్రయో జనముగురించి పాటుపడుతూ వున్నాను. వ్యావహారికభాషాగౌర వాన్ని నిలబెట్టడానికి నేను ప్రయత్నిస్తూవుంటే, దాన్ని పడగొట్టడానికి ఆంధ్రసాహిత్యపరిషత్తువారు పనిచేస్తూవచ్చారు ... ... ... మొదట నేనూ నామిత్రుడగు గురజాడ అప్పారావూ మాకుతోడుగా మరి యిద్దరు ముగ్గురు మాత్రమే యీ ఉద్యమమును ప్రారంభించాము. తక్కిన తెనుగువారందరూ ఆంధ్రసాహిత్యపరిషత్తువారితోకలిసి మా ఉద్యమాన్ని యెదిరించినవారే" కాని పరిషదుద్దేశ్యము కేవలమిదేనని చెప్పలేము. తత్కాలంలో రామమూర్తిగారి వాదానికి బలంకలగ లేదుకాబట్టీ, వకవేళ ఆపక్షంలో కొందరు అధికార్లున్నా, పరిషత్తు కుండే పలుకుబడి వీళ్లకులేదు కాబట్టీ, పరిషత్తువారి ప్రచారమే యెక్కువైంది. కాని రామమూర్తిపంతులుగారు యెంతమాత్రం నిరు

త్సాహం కనపర్చలేదు. వాళ్ల ప్రచారముతో పాటు యీన ఉత్సాహం కూడా యెక్కువైంది. కాని తత్కాలానికి పఠనీయగ్రంథనిర్ణయంలో మార్పుకలగకుండా రామమూర్తిగారి ప్రయత్నాన్ని విఫలంచేశారు పరిషత్తువారు వారిపలుకుబడితో. రామమూర్తిగారే సాక్ష్యమిచ్చుకు.

ఆకాలంలో ఆంధ్రసాహిత్యపరిషత్తువారి ప్రతిష్ఠా, గౌరవమూ, ప్రాభవమూ, ఎక్కువగా వుండడంవల్లనూ, ఆపరిషత్తువారి అభిప్రాయము ననుసరించి, తెనుగుదేశమందలి పెద్దలందరూ తీర్మానముచేసి, గవర్నమెంటువారి కెక్కువగా ఒత్తిడికలిగించి, వాస్తవమైన దేశభాష బడిపిల్లలు అభ్యసించకుండాచేశారు." *

కొంతవరకు యీ పరిస్థితు లిప్పటికీ, అట్లాగే ఉన్నై. కాని రెండు **మార్పులు** కలిగినై. విశ్వవిద్యాలయంలో వాడుకభాషకు దగ్గిరగావుండే భాషలో వున్న పుస్తకాలు పాఠ్యగ్రంథాలుగా పెట్టడం వకటి. నవ్యాంధ్ర సాహిత్యమంటూ వకటి ప్రబల స్థావర మేర్పరచుకుని విజృంభించిందనీ, దానికి కూడా విశ్వ విద్యాలయశిక్షలో స్థానం వుండాలనీ, అభిప్రాయం రెండోది. విద్యార్థులుకూడా తమ వ్యాసాలలోనూ పరీక్షాపత్రాల్లోనూ అట్లాదగ్గరగావుండే భాషరాస్తే వాళ్లను పూర్తిగా శిక్షించకూడదనే భావం కూడా కలిగింది. ♦

విశ్వవిద్యాలయ విషయంలో కలిగిన యీరెండుమార్పులే గాక, ఉన్నత విద్యనుగూర్చి చాలా గొప్ప పరివర్తనం జరిగింది. దేశ

---

* "గిడుగురామమూర్తి నుడుగునిల్వకపోయె నొగిజయంతి రామమూర్తిగెల్చె!"
(వడ్డాది సుబ్బారాయుడుగారు)

♦ "కవిత్వమనేది, గ్రాంథికవాదులు తమబిగింపువదలి, వ్యావహారికభాషకు దగ్గరగావుండేటట్లూ, వ్యావహారభాషావాదులు చెత్తనువదలి, గ్రాంథికభాషౌన్నత్యాన్ని నేర్చుకొని, రెండుభాషలకు వకవిధమైన సమ్మేళనంకూర్చి, తెలుక్కు దగ్గరగావుండే సంస్కృతపదాలుపయోగించి కవిత్వం వ్రాయడంమంచిదనిన్నీ."
(ప్రసాదరావు ధోరవారు 30—7—40 ఆంధ్రపత్రికలో)

భాషలలోనే ఉన్నత విద్య గరపాలని నాయకులందరూ యేకీభవిస్తు న్నారు. అందుకని అన్ని పాఠ్యవిషయాల్లోనూ పాఠ్యగ్రంథాలు కావాలె. కేవల సాహిత్యంలో గ్రంథాలను యెట్లా రాసుకున్నా, విషయగ్రహణం ముఖ్యోద్దేశంగా కలిగి, బడిపిల్లల కొరకు కుపయో గించే పుస్తకాలు మాత్రం, సులభ గ్రాహ్యమయ్యే భాషలోనే వుండాలని నిశ్చయమైంది. ఇప్పుడు సమస్తశాస్త్రాలనుగూర్చి పాఠ శాలల్లో ఉపయోగించటానికి రాశే గ్రంథాల్లో దాదాపు వ్యావహారిక భాషకు దగ్గరగావుండేదే ఉపయోగిస్తున్నారు. ఇక సామాన్య గ్రంథ రచనను గూర్చి గనక ఆలోచిస్తే రామమూర్తిగారి వాదానికి అంతు లేని ప్రచారం కలిగింది. ఇప్పుడు సంపూర్ణంగా వ్యావహారిక భాషలో రాశే పుస్తకాలనూ పత్రికలనూ, లెక్కపెట్టలేము! సారస్వతంలో యీవాదం తెచ్చిన మార్పును తరవాత ముచ్చటించుకుందాం! రామమూర్తిగారి వాదం జయించిందనచ్చు. వారుకూడా ఆజయం కళ్ళారాచూశి పరమపదించారు. సిద్ధప్రతిజ్ఞుడు. కర్మవీరుడు. *

ఇంతపనిచేసిన యీననుగూర్చి కొంచెంరాస్తాను. వీరిది గంజాం జిల్లా—వీరుపర్లాకిమిడి రాజాగారి కాలేజీలో ఉపాధ్యాయులుగావుండే వారు. కుటుంబీకుడు. రైతుబిడ్డలో జమీందారుగా నటించిన గిడుగు సీతాపతిగారీయన కుమారుడు! వీరికుటుంబం మిక్కిలి దేశభాషాభి

* వఝులవారి శిష్యుడైన దూసివారివాక్యాలు చూడండి.

“లక్షణకర్తల పదసాధుతాసాధుతలకు సంబంధించిన వాదోపవాదములను గమ నించినను, వ్యావహారికాంధ్రమునకు, లాక్షణికులకును, యుద్ధమేకాలమును జరుగుచుం డెడిదే యనుట స్పష్టపడును ...... బాలవ్యాకృతినిగల కొరంతల నెత్తిచూపుచు, ప్రసిద్ధవ్యవహారములు పద్యగ్రంథములందును ప్రయోక్తవ్యములేయను శ్రీ రావుసాహెబు, జి. వి. రామమూర్తిపంతులుగారి మార్గమును, ప్రచురప్రసిద్ధములకే సాధుత్వము నంగీక రించు పండితలాక్షణికుడైన సూరిగారిపద్ధతియు సహజములై, తమతమవిధులను దాము నిర్వహించుటలో, కృతకృత్యములే యనుట సత్యదూరప్రసంగము కాదు.”

(బాలవ్యాకరణము)

మాలు గలది. వెనకరాశినదాన్నిబట్టి వారికెంతభాషాభిమానముందో తెలుసుకున్నాం. ఆంధ్రులు దాదాపు 35 సంవత్సరాలనించి మొత్తుకుంటున్నా వాళ్లు ప్రత్యేకరాష్ట్రం సంపాదించుకోలేకపోయినారు. పర్లాకిమిడి రాజాగారు రౌండుటేబిలు సభలకు వెళ్లి అక్కడ యేమని ఊదాడోగాని, నూతన 1935 యిండియాచట్టంలో ఒరియావారికి ప్రత్యేకరాష్ట్రం లభించింది. ఆరాష్ట్రం విభజించటంలో గంజాంజిల్లాలో కొంతభాగాన్ని ఆరాష్ట్రంలో కలిపారు. కొందరాంధ్రులందుకు అసమ్మతి తెలిపారు. అట్లా అసమ్మతి తెలిపిన వారిలో గిడుగు కుటుంబ మొకటి. జనసంఖ్యనుబట్టీ, సంబంధాలనుబట్టీ, చరిత్రనుబట్టీ అట్లా కలపటం సమంజసం కాదని సపుత్రులైన వీరు ప్రచారం చేశారు. రాజావారి కోపాగ్ని కాహుతైనారు. ఆంధ్రులందరూ స్వరాజ్యాందోళనంలో మునిగిపోయి తాత్కాలికాపత్తును గూర్చి శ్రద్ధవహించ లేదు. అదివరకే రామమూర్తి పంతులుగారు రిటైరైనారు కాబట్టి ఆయన్నేమీ చెయ్యలేక ఆయనకుమారునికి ఉద్యోగం తీసేశాడు యేదో సాకుపెట్టి రాజాగారు. అప్పుడు చూపాడు రామమూర్తిగారు తమ అస్ఖలితాంధ్ర దేశాభిమానాన్ని! కష్టపడి కట్టుకున్న స్వగృహాన్ని వదలి, రాజ విద్వేషం భరించలేక, సకుటుంబంగా, కన్నీరుకారుస్తూ, ఆంధ్రభూమధ్యం చేరాడు. ఒరియా దేశంలో కలిసిపోయినందున స్వగృహంమీదకూడా నైరస్యం కలిగింది. ఎంత దేశభక్తుడో చూడండి! "జననీజన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ" అనే వాక్యం యీనకు అన్వర్థమైంది. రాజమహేంద్రవరం చేరాడు. కుమారునికి ఉద్యోగం పోయేటప్పటికి వృద్ధాప్యంలో రామమూర్తిగారు కొంచెం పేదరికంకూడా అనుభవించాలశొచ్చింది. ఇది కర్మవీర లక్షణం! ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆయన నాదాన్ని వొప్పుకున్నట్లు సూచనగా ఆయనకు కళాప్రపూర్ణ బిరుద నిచ్చారు. ఆయన షష్టిపూర్తి చేసి ఆయన గ్రంథాలన్నీ ప్రచురించి, వివిధ వ్యాసాలతో నిండిన సంపుటాన్నాయనకు సమర్పించిందాంధ్రదేశం.

భాషాతత్వవేత్త ! వాగనుశాసనుడు ! చూడండి యీ కింది వాక్యాలు.

"ముండారిక్, లేక ఆస్ట్రిక్, లేక కొలేరియన్ భాషాశాఖకు చెందిన సవరభాషలో వారు కావించిన వ్యాసంగము మహత్తరమైనది. సవర భాష సవరలలో వాడుకలోమాత్రమే వున్నది. వారు ఆటవికులు. పంతులుగారు స్వయంకృషిచే బహుశరీరకష్టములకులోనై, కంపారిటివ్ ఫైలాలజీశాస్త్రమునకు అత్యవసరమైన ఆ భాషను సాధించారు. పదజాలమంతయు ప్రకృతిప్రత్యయ విభాగముచేసి శోధించినారు. వ్యుత్పత్తిసహితములైన రెండు నిఘంటువులను, ఒకబోధినిని వ్రాసినారు. అనేకశబ్దములకు ప్రత్యయములకు సవర, దాని జాతీయభాషలగు, గుటోబ్, పరేంగ్, ఖాసీ భాషలతోపోల్చిచూపి పట్టికలనిచ్చినారు. ఈపనిని పంతులుగారుగాక మరెవ్వరూచేయలేదు. ఇట్టి శబ్దశాస్త్రపారంగతులు మరెవ్వరును లేరు." వాగను శాసనత్వానికింకేం కావాలె ? ఒకజాతిని, వాళ్లభాషకు లిపి వాఙ్మయాలను కల్పించి నాగరకంచేశాడు. ఆంధ్రులలో ఇంతపని చేసినవారు ముమ్మాటికీ లేరు. నన్నయ భట్టారకుడితర్వాత ఆంధ్రభాషకుకూడా యీన చేసినంతపని యెవ్వరూచేయలేదు. వ్యాకరణభాషకూ వ్యావహారిక భాషకూ అంతరంతగ్గించి, రెంటినీ దగ్గరకుతెచ్చి, భాషాసారస్వతాలకు మహోపకారంచేసి నవ్యాంధ్రసాహిత్యవాగనుశాసనుడై పట్టంగట్టుకున్నాడు.

"మనభాషలో యిద్దరే వాగనుశాసనులు. నన్నయభట్టుగారు, గిడుగు రామమూర్తిభట్టుగారు," అన్నారు విశ్వనాథవారు.

ఆంధ్రసాహిత్య పరిషత్తులో చేరి తమ వాదానికి బలం చేకూర్చుకోవాలని చాలా పాటుపడ్డాడు. కాని యీననుగాని, యీన శిష్యులనుగాని చేరనిస్తే కొంపెక్కడ మునుగుతుందో అని పరిషత్తు వారు యిట్టి అభిప్రాయం గలవారు పరిషత్తులో చేరటానికి వీలులేని

కట్టుదిట్టాలను చేశారు. తణుకులో జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్సభలో నేనుకూడా పాల్గొన్నాను. ఆచంట వెంకటరాయ సాంఖ్యాయన శర్మగారధ్యక్షులు. అప్పుడు జయంతి రామయ్యపంతులవారెందులకో రాలేదు. ఆ సభలో వ్యావహారిక భాషా తీర్మానాన్ని రామమూర్తి పంతులుగారుపపాదించారు. దాన్ని బలపర్చే భాగ్యం నాకు లభించింది. పంతులవారు "మడికట్టుకున్న పూర్వాచారపరాయణుడవని అనుకుంటున్నాను. అబ్బాయీ! బుద్ధిమంతుడవు" అని దీవించారు. ఆసభలో నన్నూ యింకా యితరుల కొందరినీ పరిషత్తులో గౌరవ సభ్యులుగా చేర్చుకునేటట్టు వక తీర్మానం ప్యాసుచేశారు! కాని పరిషత్తులో తర్వాత మాప్రశంసే మెరుగం! మేమెప్పుడూ తర్వాత వెళ్ళలేదు! నాబోటి శుంఠలు చేరకుండా కట్టుదిట్టాలు జరిగాయని విన్నాము. రామమూర్తిగారి సాక్ష్యం చూడండి.

"దానితో పరిషత్తు పెద్దలు, ఉపద్రవం జరిగిపోయినట్లుగా భయపడి, అటుపైని జరిగే సాంవత్సరికోత్సవములలో, అటువంటి తీర్మానాలు మరి కాకుండా వుండేటట్లున్నూ, వ్యావహారిక భాషా వాదులెవరూ తమ పరిషత్తులో సభ్యులుగా చేరకుండా వుండేటట్లున్నూ, కట్టుదిట్టాలు చేసుకున్నారు."

దాదాపు గత 35 సంవత్సరాలనించీ రామమూర్తిగారు భాషకు చేసినకృషీ, సేవా యింతని చెప్పనలవికాదు. వారు ప్రచురించిన "గద్య చింతామణి", "బాలకవిశరణ్యం", "భాషాభేషజం" మొదలైనవాటిలో రాసిన విషయంతో గ్రాంధికభాషావాదులు నిరుత్తరులైపోయినారు.* పంతులుగారుచేసిన చాలా యితరకృషి అము

*గ్రాంథికభాషరాయటం చాలా కష్టమని తాము మాదరికి "ప్రాఁజెనుఁగుకమ్మ" అని వక అధిక్షేపకావ్యం రాశాడు. దానిమీద మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు "అంపగమి" అని విమర్శనాన్నిరాశారు.

ద్రితంగా నోట్సురూపంగావుంది. నల్గురు భాషాపండితులు కొన్ని సంవత్సరాలు శ్రమపడితేనేగాని ప్రచురించలేరు. ♦

"తెనుగు" అనేపత్రికనుపెట్టి వాదప్రచారంచేశాడు. అతిపట్టుదల మనిషి. చిలకమర్తివారికి నేత్రంలోటు బుద్ధిలోవున్నట్టు, రామమూర్తిగారికి చెవ్విలేనిలోటు బుద్ధివైభవం తీర్చింది. ఆయన విశాలమైనహృదయంకలవాడు. ఒక్క గ్రాంథికాంధ్రంతప్ప ఆయన నిరసించేవిషయం ప్రపంచంలోలేదు. నిగర్వచూడామణి. పసిపిల్లవాడికీ కూడా సులభుడు. తనకు అపకారంచేసినవాళ్ళనుకూడా క్షమించే ఔదార్యంకలవాడు. అనేకమంది యువకులకు మార్గదర్శి. వ్యావహారిక భాషాప్రియుడూ అంటేచాలు ఆయనప్రేమకు పాత్రతకలిగిందీ అన్నమాటే! ఇటీవల ఆయన వాదాన్నిమించి అతిక్రమించే యువకుల విషయంలో మనస్తాపం అనుభవించినట్టు కనపడుతుంది. విశృంఖలత్వం ఆయనస్వభావంలోలేదు. ఉపాధ్యాయుడు కాబట్టి క్రమశిక్ష ఆయనపద్ధతి. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారితో వకమారిక్రింది విధంగా అన్నారట!

"ఆధునికులు పెక్కండ్రువ్రాసిన చిన్నచిన్న గ్రంథములు చదివి పంతులుగారు వకటి రెండు సందర్భములలో 'ఇంత తెగబడి వ్రాయవలెనని నా ఉద్దేశ్యముకాదు. అయితే యిపుడెవరిని నిర్బంధించగలము? ఇది సంధికాలము. క్రొత్తయేటినీరు కలకగానుండును. శరత్కాలమురాగానే తేటపడును. అట్లే యిదిన్ని కొంతకాలమునకు చక్కబడును' అని నాతోననియున్నారు." నవ్యులలో నవ్యులైన నవ్యాంధ్రభాషా కుమారులు పంతులువారి విచారాన్ని స్వర్గంలో యినుమడించకుండా చేయుదురుగాక!

ఈవిషయం చర్చించేటప్పుడు రెండు సంగతులు మాత్రం చెప్పాలిశొస్తుంది. తెనుగుభాషలో వ్యవహరిస్తూన్న అనేక సంస్కృత

♦ ప్రచురించి పుణ్యం కట్టుకుంటే బాగుండును.

పదాలున్నాయి. వ్యావహారికంగా తెనుగు పదాలే మారటం సహజం కాని సంస్కృతపదాలు మార్చటం న్యాయంగాదు. పదాలు మార్చట మనేది వక్క నిరక్షరాస్యులకే జరిగేదికాదు. అక్షరాస్యులుకూడా అనేక మంది వ్యావహారికంలో శబ్దాల సహజ స్వరూపం మార్చడం కద్దు. ఇదీకూడా దేశభేదంచేత కలుగుతూ, వక్కశబ్దంలోనే వివిధ దేశాల్లో వివిధ విధాలగా మార్పుండవచ్చు. వాటి నాప్రాంతపు శిష్టులు మాట్లాడుతూ వుండవచ్చు. అవన్నీ తద్భవాలుగా వ్యావహారిక భాషలోకి గ్రాహ్యాలే. నాకేమీ విప్రతిపత్తిలేదు. ఆ రూపాలన్నీ బహుళోపయుక్తాలైతే వైకల్పికరూపాలై భాషను విశాలం చేస్తై. కాని సంస్కృతంలోనించి తత్సమాలగా వచ్చిన పదాలను గూర్చి మాత్రం వ్యవస్థ వకటి వుండాలె! సంస్కృతం వక విశిష్ట భాష. దానిపైనగాని దాని వ్యాకరణం పైనగాని మనకేమీ అధికారం లేదు. తద్భవాలనుగూర్చి మన యిష్టమొచ్చినట్టు చేసుకోవచ్చు గాని తత్సమాలకు విభక్తులు చేర్చడమే మనం చెయ్యతగింది. అసలు శబ్దంలో, వర్ణక్రమంలో మార్పుచెయ్యడం మాత్రం కూడనిపని. ఒకవేళ శిష్టులాపదాలు తప్పుగాగాని, భిన్నంగాగాని ఉచ్చరిస్తున్నా శిష్టవ్యవహారమని ఆతప్పు రూపాలను రాయటం తప్పని నాఅభిప్రాయం. తద్భవం చేసుకుంటే సరిపోతుంది. రెండుదాహరణాలిస్తాను. "పరీక్ష" శబ్దముంది. అనేకులు శిష్టులుకూడా యీపదాన్ని హ్రస్వమధ్యంగా "పరిక్ష" అని ఉచ్చరిస్తున్నారు. కాబట్టి ఉచ్చారణ రూఢమైందని రాయటంలోకూడా "పరిక్ష" అని రాదామా? అట్లా రాయకూడదనీ రాశేటట్టైతే తద్భవమనమనీ, నామనవి. మన అధికారానికి మించిన పనని నా ఆశయం. సంస్కృతంగానీ, గింస్కృతం గానీ, మాయిష్టమంటారా మీయిష్టం! వాదానికి లోబడతామంటారా లోబడండి! ఆప్రకారంగానే "ఆలస్యం" అలసశబ్దభవం. దీన్ని వక నవ్యనవ్యనవ్యాంధ్రకవి "ఆలిశ్యం" అని రాశాడు. ఇత్వ

మధ్యంగా రాయడమే కాకుండా "స" కు "శ" కూడా వాడాడు. ఇట్టిది కూడదని నామనవి. మాభాషలోకి వచ్చింది కాబట్టి మాయిష్ట మంటారా నాసమాధానం లేదు ! ఇది వక సంగతి.

రామమూర్తిపంతులుగారు వ్యావహారికం వాడటాన్నిగూర్చే వ్యవస్థ చేశారుగాని రెండు భిన్నసాంప్రదాయాలుగల భాషలలో మాటలను కలిపి కలగాపులగం తయారు చెయ్యటంగూర్చి యేమీ చెప్ప లేదు. ఈ విషయంలో సమానసాంప్రదాయాలుకల భాషలైనా పరిణామం ఒకటే ! ఇందులో రెండనుపపత్తులున్నై. గుఱ్ఱాన్నీ గాడిదను కలిపికట్టిన బండెల్లేవుండడం మొదటిది. తర్వాత ఆ నూతనభాష రానివారికి ఆవిధమైన సారస్వతంలో రసం ఆస్వాదించలేకపోవడం రెండోది. ఇంగ్లీషు తెలుగు కలిపి రాస్తామనుకోండి. ఇంగ్లీషురాని భాషాకుమారులను తద్రసగ్రహణం నుంచి బహిష్కరిస్తున్నా మన్నమాట ! ఏకారణంచేత సంస్కృతం వద్దన్నామో ఆకారణానికే మనమూ గురౌతున్నాము. సంస్కృతంమాటలు అర్థంచేసుకునే వాళ్ళ సంఖ్యకంటె యింగ్లీషు తెలిసినవాళ్ళసంఖ్య యింకాతక్కువ. కాబట్టి అట్టిరాతలకు మనకారణం మరీ యెక్కువగాపడుతుంది. వ్యావహారికభాషావాదానికి పునాదైన ప్రజాసామాన్యగ్రహణ మనేదే మన ముల్లంఘిస్తున్నామన్నమాట ! ఇది శ్రీపంతులువారి వాదానికే వ్యాఘాతం కలుగజేస్తుంది. కన్యాశుల్కమే తీసుకోండి. ఆంధ్రాంగ్ల మిశ్రసంభాషణం. అర్థమయ్యేవాళ్ళ నానందపరుస్తుంది. కాని ఆంధ్రదేశంలో యెంతమంది కర్థమౌతుందో చెప్పండి ? "ఏమోయ్, మైడియర్ షేక్స్పియర్", షేక్స్పియరెవరో, అక్కడవున్న శ్లేషేమిటో యింగ్లీషురానివా డెంతమాత్రం తెలుసుకోలేడు. తెలుసుకోలేకపోతే, పోనీమంటారా ! మన ఉద్యమానికే దెబ్బ ! ప్రజాసామాన్యాని కుద్దేశింపబడేది, వారిలో నూటికి 90 మంది కర్థంకాకపోతే యింక మనవాదం మట్టిలోకలిసిపోయిం దన్నమాటే ! భాషాకుమా

రుల్లో మెజార్టీ అర్థంచేసుకోలేని భాషలో యెంతమాత్రం రాయటం సమంజసంకాదు. రామమూర్తిగారి ఆశయానికిది విరుద్ధం! ఇంగ్లీషు వచ్చినవాళ్లకే, అందులో ఆ బాపతుమాటలు తెలిసినవాళ్లకే రాశామంటే, నేనికచెప్పేదేంలేదు !

ఈగ్రాంధిక వ్యావహారిక వాదోపవాదాల్లో కొందరు పండితులు కొన్నిగ్రంథాలు రాశారు. ముఖ్యంగా వేదం వెంకట్రాయశాస్త్రి గారు, వావిలికొలను సుబ్బారావుగారు, కాశీభట్ల సోదరులు మొదలగువారు ముఖ్యులు. శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు అప్పట్లో మౌనం వహించాడు. ఇప్పుడు బాహాటంగా వ్యావహారికం రాస్తున్నాడు. ఇట్లా మౌనం వహించిన పండితులుకూడా చాలామందున్నారు. వావిలికొలను సుబ్బారావుగారి కీవిషయంలో చాలాపట్టుదల. ఆయన రాశినదాని పేరు "గ్రామ్యాదేశ నిరసనము." ఇందులో ఆవిషయమైన కారణ జాతమంతా విమర్శించాడు. ఎందరు పండితులెంత యెక్కువగా వాదించినా వాదానికి బలమే చేకూరిందిగాని తగ్గలేదు. బంతినిగనక కొడితే మళ్ళి రెట్టింపు వేగంతో ముఖానికి కొట్టుకున్నట్టు యీ వాదం కూడా ద్విగుణీకృత బలంగలదైంది. రామమూర్తిగారు ప్రతిపక్షులు చెప్పిన కారణాలనన్నిటినీ సహేతుకంగా ఖండించారు. చొప్పదంటువాదాలని రుజువు చేశారు. వేదం వెంకట్రాయశాస్త్రిగారికే గ్రాంధికాంధ్రంరాదని సోదాహరణంగా చూపేటప్పటికి పండితులంతా భయపడి పోయారు!

ఆంధ్రసాహిత్యపరిషత్తు, సంస్కారనిరోధం :

వెనక కొంచం దీన్నిగూర్చి చెప్పాను. భాషాసేవే దీనిస్థాపనానికి కారణం. వీరీపనిని సాగించడాని కవలంబించిన పద్ధతులు మంచివే! మొదట దానికి ప్రాణాధారుడైన రామయ్యపంతులుగారు చెన్నపట్నంలో ఉద్యోగరీత్యా ఉండేవారుకాబట్టి యీ సంస్థకార్యాలయం

చెన్నపట్నంలోనే ఉండేది. కొత్తపల్లి సూర్యారావుగారు కార్యదర్శిగా వుండేవాడు. * ఈనకూడా పండితుడే! కవిత్వంకూడా రాశేవాడే! గ్రంథాలయాన్నొకదానిని స్థాపించారు. తాటాకు గ్రంథాలను సేకరించారు. మాసపత్రిక నొకదానిని స్థాపించి నడిపారు. దానిలో ఉదాత్తమైన వ్యాసాలు పండితులచేత రాయబడుతూ వుండేవి. గ్రంథప్రచురణంకూడా వీళ్లవుద్దేశ్యమే! మన్నారుదాస విలాసం మొదలైన అనేకగ్రంథాలను ప్రచురించారు. ఈప్రకారంగా భాషాసేవచేయటం సాగించారు. ఏఏటకటవకస్థలంలో సాంవత్సరికోత్సవాలు జరుగుతూవుండేవి. రామయ్యపంతులుగా రుద్యోగికాబట్టి ఉద్యోగస్థుల ప్రాపకమూ, సర్కారుపలుకుబడీ, ఉండేవి. షడ్రసోపేతంగా యెవరి అతిథులుగానో సభాసదులు భోజనంచేసేవారు. ఏవో కొన్నితీర్మానాలు చేశేవారు. రామయ్యపంతులుగారికనుకూలులంతా కార్యనిర్వాహకుల్లో వుండేవారు. ఇప్పుడు సంవత్సరసభలుమాత్రం తగ్గినట్లున్నై. పత్రికమాత్రం సంకుచితంగానో యేవిధంగానో వస్తూనే వుంది. కార్యస్థానం ముక్త్యేశ్వరంలోవున్న రామయ్యపంతులుగారికి దగ్గిరగా కాకినాడైంది. ఒకవ్యక్తిని యెక్కువగా పురస్కరించుకున్న కార్యం యెన్నాళ్లు సాగుతుంది? రాజులూ జమీందార్లూ ద్రవ్యవంతులూ యెల్లకాలం డబ్బిస్తారా! ఆంధ్రసాహిత్య పరిషత్తు చేసినపనికంతకూ పరిణామం లేకపోలేదు. రామయ్యపంతులుగారు చాలా పరిశోధనపని చెయ్యటంకలిగింది. దానికిగా నాయనకు విశ్వవిద్యాలయంవారు "కళాప్రపూర్ణ" బిరుదివ్వటం అయింది. ♦

---

* ఇటీవలనే పరమపదించాడు.

♦ ఈన చిన్నప్పటినించీ చాలా సారస్వతసేవ చేసినవాడే! ఉత్తమకక్ష్యలో యెన్నదగినవాడే! "పంతులుగారు (రామయ్య) తమ చిన్నతనమునుండియు పాండిత్యప్రకర్ష, విద్యాగోష్ఠి, ఆంధ్రచారిత్రక శాసనపరిశోధనాసక్తి కలిగి సనాతనధర్మపరాయణులై యుండిరి...... ... ఆమరణాంతము ఆంధ్రభాషాయోషకై అస్థిచర్మముల నప్పగించిరి"

(శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు ఆంధ్రపత్రిక 10—4—41)

సాక్షాత్తుగా పరిషత్తుకు సంబంధించక పోయినప్పటికీ రామయ్యపంతులుగారి పలుకుబడివల్ల ఒక గొప్ప కార్యం ప్రారంభించడమైంది. ఆయన కొంతకాలం యిప్పటి పిఠాపురాధీశ్వరుడికి విద్యాగురువుగా వుండేవాడు. అందుచేత యీనమీాద రాజాగారికి అత్యంత గౌరవం. రాజాగారు సారస్వతసేవకు డని ప్రసిద్ధి. మత విషయాల్లో నాయుడుగారూ, విద్యావిషయాల్లో రామయ్యపంతులు గారూ యెంతచెబితే అంతని ప్రతీతి. అందుచేత రాజాగారికి నచ్చచెప్పి, ఒక సమగ్రాంధ్రనిఘంటువు రాయటానికి ద్రవ్యము శాంక్షన్ పొందారు. ఇంకెవ్వరైనా అంటే రాజాగారు ఆపనికొప్పుకోడమూ అనుమానమే! అంత డబ్బివ్వడమూ అనుమానమే! రామయ్య పంతులుగారి నిఘంటునిర్మాణం విషయమై చాలామంది సలహాను తీసుకున్నారు. తెనుగులో శబ్దరత్నాకరమే నిఘంటువు. కాబట్టి ఒక సమగ్ర నిఘంటువవసరమే! ఇందర్నీ సంప్రదించి ఒక ప్రణాళిక తయారుచేశారు. ఈ ప్రణాళిక విషయంలో వారికీ రామమూర్తిగారికీ తగాదా వచ్చింది.

"ఆంధ్రనిఘంటు నిర్మాణము విషయమున రామయ్యగారికీ రామమూర్తిగారికీ అభిప్రాయభేదం వచ్చిందిట! తాము చెప్పినట్లు చేస్తే తక్కువ ఖర్చుతో యెక్కువపని చేయించవచ్చునని రామమూర్తిగారన్నారట! రామయ్యగారికి నచ్చలేదు. పదముల కర్థములు వ్యవహారభాషలో ఉండవలెననీ, ప్రాచీన గ్రంథముల శుద్ధప్రతులు తయారుచేసిన పిమ్మటనే అందలి పదములు గ్రహించవలసి ఉంటుందనీ, రామమూర్తిగారు. ఇవేవీ రామయ్యగారికి కిట్టలేదు. అప్పుడు చేశారు రామమూర్తిగారు ప్రతిజ్ఞ— మీానిఘంటువులో నేను తప్పులు చూపుతాను. మీారు ఒప్పుకున్న తప్పులకు తప్పు ఒకటింటికి ఒకరూపాయి నాకు యిప్పించగలరా— అని. రామయ్య

గారు ఈపరతు వప్పుకుంటే, ఎన్నివేలు లేక లక్షలు ఖర్చుచెయ్యవలసి ఉండేదో !"

(చింతా దీక్షితులుగారు)

ఈ నిఘంటు నిర్మాణ పద్ధతులు తెలుసుకోవాలంటే రామమూర్తిపంతులుగారు 'ప్రతిభ'లో "సూర్యరా యాంధ్రనిఘంటువు" అని రాసిన బ్రహ్మాండమైన వ్యాసాన్ని చదవమని పాఠకులను ప్రార్థిస్తున్నాను. ఈ నిఘంటువు పూర్తిగావచ్చేటప్పటికి చాలాకాలం పట్టేట్టున్నది ! పైన వివరించినపను లన్నిటితో బాటు పరిషత్తువారు వ్యావహారిక భాషావాదాన్ని ప్రతిఘటించి భాషకు మహోపకారం చేశారు. ఈ సంస్థ యెన్నదగిన సేవే చేసింది. ఆంధ్రదేశవందనాలకు రామయ్యపంతులుగారూ పరిషత్తూ అర్హులు.*

కాని పరిషత్తు గతానుగతికమార్గాల్లోనే ప్రవర్తించింది గాని, భాషకుగాని సారస్వతానికిగాని యెన్నతగిన నూతనాలంకారా లేవీ అలవర్చలేదు. త్వరలో సూర్యరాయనిఘంటు నిర్మాణాన్ని పూర్తిచేసి తమసేవను సార్థకం చేసుకుంటుందని ఆశిస్తున్నాను. పీఠికాపురాధీశ్వరుణ్ణి నిఘంటు ప్రకటనంలో వెనకటి ఆదరాన్ని చూపుతూ, ఆర్థిక సహాయం వెనకటల్లేనే చేస్తూవుండాలెనని ప్రార్థిస్తున్నాను. తమపేరు చిరస్థాయి అవుతుంది !♦

---

* ఈన భవభూతి ఉత్తరరామచరిత్ర యథామాతృకంగా తెలుగులోనికి అనువదించాడు. బాగా వుంది. ఈనకూడా కవిపండితులంటే చాలా ఆదరం కలవాడు. ఉత్తరరామచరిత్రను చాలామంది అనువదించారు. బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు ఉత్తరరాఘవ మనేపేరుతో రాశారు కూడాను. అదీ రసవంతంగానే వుంటుంది.

♦ "జయంతి రామయ్య పంతులుగా రంత తీవ్రగ్రాంథికభాషావాది గానిచో నేడు తీవ్ర విప్లవరూపమున వచ్చుచున్న వ్యవహారభాషవల్ల ఆంధ్రభాషకు చాలా అపకారం చేకూరియుండెడిదని యొప్పుకొనక తప్పదు."

(చి. నారాయణరావుగారు, ఆంధ్రపత్రిక 10-4-41)

# నవ్యాంధ్ర సాహిత్యవీధులు

౫

## ఆంధ్రోద్యమం : (వక్తృత్వం) (దేశాభిమాన కవిత్వం) :

వెనక కొక్కొండ వెంకటరత్నంగారి వక్తృత్వాన్నిగూర్చి ముచ్చటించాను. అది ప్రతివాడూ చెయ్యలేని అద్భుతకార్యం. కాని రాతమూలంగా గాని ఉపన్యాసమూలంగాగాని ప్రజల్లో ప్రచారం చెయ్యాలంటేనూ, విషయాలనుగూర్చి వాళ్లకి తెలపాలంటేనూ సంభాషణకు దగ్గరగా వున్న శైలి రాయాలె, మాట్లాడాలె. ఈశతాబ్ద ప్రథమ దశవర్షాల్లో అట్టి అవసరం కలిగింది. వెనక బంగాళా విభజనాందోళనాన్నిగూర్చి, అది జాతీయోద్యమంగా యెట్లా పరిణమించిందీ మనవిచేశాను. ఆజాతీయోద్యమకాలంలో బందరునుంచి వక వ్యక్తి బంగాళాదేశంవెళ్ళి అక్కడి పరిస్థితులను చూశేటప్పటికి, ఆఉద్రేకం సరియైందనీ, దాన్ని ఆంధ్రదేశంలో కూడా వ్యాపింప జేస్తే బాగుండుననీ, ఆయనకి తోచింది. ఆఆందోళన యెంత విశాలమైతే బంగాళీవాళ్ళ కంత ఉపకారం. ముట్నూరు కృష్ణారావుగారెప్పుడైతే వాళ్లను ఆంధ్రదేశం రమ్మని ఆహ్వానం చేశాడో, వెంటనే దాన్ని గ్రహించారువాళ్లు. ఆయనతో బిపిన్ చంద్రపాల్ గారు తదాందోళనాప్రచారంకోసం దక్షిణదేశమొచ్చారు. అది 1907 సంవత్సరం. నేను బందరులో చదువుకుంటూవుండేవాణ్ణి. పాల్ గారు బందరు వచ్చినప్పటి దృశ్యం యెన్నడూ మరవను. పట్టణమంతా పని స్తంభించిపోయింది. యావత్పట్టణం పాల్ గారి ఊరేగింపుతో వుంది. విద్యార్థులు పాఠశాలలకు పోలేదు. సభలకు వేలూ లక్షలూ హాజరుకావటం! నేను వందేమాతర గీతమూ, కేకా, కూడా మొదటిమాటు అప్పుడే విన్నాను. పాల్ గారి ఊరేగింపు

కుపయోగించిన గుఱ్ఱపుబండి వెనక, యెండతగలకుండా గొడుగుపట్టిన వాళ్లల్లో నేనొకణ్ణి. అప్పుడు నేనంటే నేనని తగాదా పడటంచేత యిది స్వల్పవిషయమైనా చెప్పాలశొచ్చింది. అదివరకే కృష్ణాజిల్లా సంఘం అక్కడ స్థాపించబడి ఉండడంచేతా, ఉద్యమాన్ని నడిపింపగల సమర్థులగు పెద్దలక్కడ ఉండటంచేతా, ఉద్యమానికి బందరు దోహదమిచ్చింది. పాల్‌గారు ఆంధ్రదేశంలో యితరత్రాకూడా పోయి ప్రచారం చేశినా అది బందరులో జరిగినంత తీవ్రంగా యితరత్రా జరగలేదు. కొన్నాళ్ళు బందరు ఆంధ్రదేశానికి ప్రచారకేంద్ర మైంది. ఆయన రగిలించి పోయిన అగ్ని ఆంధ్రయువకులు అందుకుని ప్రచారానికి వైశాల్యం కల్పించారు. ఇందుకు తెనుగు వక్తృత్వం అవసరమైంది. డిమాండు సప్లైలు అన్యోన్యాశ్రయాలు కాబట్టి డిమాండొచ్చేటప్పటికి యువకులు సప్లై అయినారు. ఒక్కమారు వాళ్ల పేర్లు చెబితే పాఠకులు "వీళ్ళు చిరపరిచితులైన పెద్దలేనే" అని ఆశ్చర్య పడతారు. "మహానముద్రాలంకారుడై"న ముట్నూరి కృష్ణరావుగారు అంతశ్శక్తి సప్లైచేశేవాడు. ఆయనకు తోడు చిట్టా సుందరరామయ్యగారు నివురుకప్పిన నిప్పుగా ఊహలిచ్చేవాడు. కోపల్లె హనుమంతరావుగారూ, పట్టాభిగారూ, ఆ ఊహలమీద హర్మ్యాలు నిర్మించేవాళ్ళు. కొండా వెంకటప్పయ్యగారు సలహాదారుగా వుండేవారు. చిల్లరిగె శ్రీనివాసరావు, అవటపల్లి నారాయణరావు వగైరాలు పత్రికల్లో రాశేవారు. * గాడిచర్ల హరిసర్వోత్తమరావు, భోడి నారాయణరావు, చెరుకువాడ నరసింహం, కవుతా శ్రీరామశాస్త్రిగార్లు ప్రచారం చేశేవాళ్లు. కోన సీతారామరావు, ఉన్నవ లక్ష్మీనారాయణగార్లు ప్రచ్ఛన్నంగావుండి మంచి ఊతయిచ్చేవాళ్ళు. చెన్నాప్రగడ భానుమూర్తిగారు మొదలైనవారు దేశభక్తి కవిత్వం రాశి మనస్సుల్లో ఉద్రేకం జనింప చేసేవాళ్లు. వీరిలో పట్టాభిగారూ, భానుమూర్తిగారూ మాకు నోబిల్ కాలేజీలో గురువులు. పట్టాభి

* శ్రీనివాసారావుగారు పుళిందాను శిలాది గ్రంథాలనుకూడా రాశారు.

గారు ఫిజియాలజీ చెప్పేవారు. భానుమూర్తిగారు లెక్కలనేపేరుతో తెనుగు సహృదయత్వ మలవడ చేశేవారు. చూశారా అప్పటి ఆంధ్రుల ఉన్నతి!

అప్పటి ఉత్సాహంయొక్క ఫలమే బందరులోఉన్న ఆంధ్ర జాతీయకళాశాల. ఆంధ్రదేశంలో అప్పటినించీ అవిచ్ఛిన్నంగా జరుగుతూ కాలానుసారంగా నడుస్తున్న దీవక్క-సంస్థే! కృష్ణాపత్రికా, జాతీయకళాశాలా అన్నా చెల్లెళ్లనచ్చు. రెంటికీ పునాది పురుషులొక్కరే! ఈకళాశాల చేసినపనంతా మనకక్కర లేదుగాని దీనితో ఆంధ్రదేశంలో కొందరు వ్యక్తులకు సంబంధం ఉందనటం మనకు కావలశింది. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, కోలవెన్ను రామకోటేశ్వరరావు, విశ్వనాథ సత్యనారాయణ, అడివి బాపిరాజు, కాటూరు వెంకటేశ్వరరావుగార్లు మొదలైనవాళ్లు యెప్పుడో వకప్పుడాసంస్థతో సంబంధం కలిగిఉన్నారు. ఈసంస్థ అనేకమందికి, డ్రైవర్లుగా, వడ్రంగులుగా, వాచీరిపేరర్లుగా, యింకా యితరవిధాలుగా స్వతంత్రజీవనం చేసుకోగలశక్తి కలిగించింది. జాతీయభావాన్ని ఆంధ్రదేశంలో పెంపొందించటంలో యీసంస్థంతపని యేదీ చెయ్యలేదు. గోపాలరెడ్డిగారంతటిదేశభక్తుణ్ణీ,రాజ్యతంత్రవేత్తనూ,పాలనాకుశలుణ్ణీ, విజ్ఞానవంతుణ్ణీ, తయారుచేసింది. వీటన్నిటికంటె వక్కవిశేషముంది. ఈసంస్థలోకి శాంతినికేతనంనించి ప్రమోదచటర్జీ అనే చిత్రకారుణ్ణి పిలపించారు. ఆయన గొప్ప చిత్రకళాకుశలుడు. ఇప్పుడాంధ్రదేశంలోవున్న చిత్రకారులు అనగా శ్రీ అడివి బాపిరాజువంటి * వాళ్లంతా ఆయనకు సాక్షాత్తుగాగాని, పరంపరగాగాని శిష్యకోటిలో

* బాపిరాజు యెంకిపాటలకేమి, కిన్నెరసానిపాటలకేమి, మధుకలశానికేమి, తన గోఘూలికేమి, రాశినచిత్రాలుకూడా, నవ్యసాహిత్యాలంకారాలే! ఇందులో ఈయన అప్రతిమానుడు. రెండు లలితకళల్లోకూడా సమానప్రజ్ఞగల ప్రతిభాశాలి.

వాళ్ళనచ్చు. ఈ చిత్రకళకూడా సాహిత్యాని కనుబంధమే

జాతీయ భావంతో, జాతీయ విద్యోద్యమం రేకెత్తింతర్వాత అంతకుముందు ప్రచ్ఛన్నంగావున్న ఆంధ్ర వ్యక్తిత్వం బయటికొచ్చి ఆంధ్రోద్యమంగా పరిణమించింది. కాని వకటి-మార్పు జరిగింది. బందరులో పుట్టిన జాతీయోద్యమబీజం గుంటూరుదాకా వేళ్లుపాకి ఆంధ్రోద్యమంగా పరిణమించింది. ఈ సందర్భంలో జొన్నవిత్తుల గురునాథంగారు చిరస్మరణీయులు. దీనికి కారణం వకటుంది. కొండా వెంకటప్పయ్యగారు బందరునుంచి గుంటూరుకు బసమార్చారు. ఈ ఆంధ్రోద్యమ మనేఅంటును బందరునుంచి గుంటూరు తెచ్చి నాటాడు. ఈ ఉద్యమానికీకూడా వెనకటివాళ్లే మూలపురుషులు. ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రంకావాలనే ఆందోళన మొదలైంది. ప్రథమాంధ్ర మహాసభ బాపట్లలో జరిగింది. ఆ సభాకాలంలో రైల్వేసమ్మెవచ్చి ప్రతినిధులకు చాలాకష్టం కలిగించినా, ఉత్సాహం యొంతమాత్రం తగ్గలేదు. నాకు తెనుగు మాట్లాడటం రాదని సగర్వంగా చెప్పుకునే బయ్యా నరసింహేశ్వరశర్మగారు తెనుగులో అధ్యక్షోపన్యాస మిచ్చి తమ దేశభాషాభిమానాన్ని వెల్లడిచేశాడు. న్యాపతి సుబ్బారావు, ముట్నూరి ఆదినారాయణయ్య, కొండా వెంకటప్పయ్య, శెడింబి హనుమంతరావు, మోచర్ల రామచంద్రరావు, డాక్టరు లక్ష్మీపతి మొదలైన మహామహులతో, ప్రెసిడెంటుగారి పంక్తిన, బాపట్లలో, అన్నవరపు నాంచారమ్మగారింట్లో, ఆమె షడ్రసోపేతంగా పెడుతూంటే భోంచేసిన దినాలు నేనెన్నటికీ నాజీవితంలో మరవలేను. వాళ్లు భోజనాలముందు మాట్లాడుకుంటూవుంటే మాకు విజ్ఞానం

♦ఇంతేగాక రాజమండ్రిలో దామెర్ల రామారావనే వకప్రతిభాశాలి ప్రత్యేకచిత్రకళాకాశలాన్ని సృష్టించి తదనుసారంగా తాను చిత్రించి కొందర్ని తరబీదుచేశాడు. ఈన కొంతకాలంకింద రాజమండ్రికళాశాలకు ప్రిన్సిపాలుగాఉండి గొప్ప చిత్రకారుడైన, ఓ. జే. కూల్డ్రేగారి శిష్యుడు. ఈ చిత్రకళాకూడా నవ్యసాహిత్యవిషయమే. విశ్వనాథవారు నాకీఅభిప్రాయంలో సాక్షి.

కలుగుతూవుండేది. తుదకు శర్మ ప్రభృతులు వెళ్లుతూ "అన్నపూర్ణ
తల్లివమ్మా నీవు! శెలవియ్యి! జ్ఞాపక ముంచుకో!" అన్నమాటలు
నాచెవుల్లో యింకా ప్రతి ధ్వనిస్తూ ఉన్నై! ఆంధ్రోద్యమానికి
సంబంధించిన అంకెల్లో పట్టాభిగారు దిట్ట. జాతీయవిద్యా తర్కంలో
కోపల్లె హనుమంతరావుగారు సమర్థుడు. వా రిద్దరుకలిసి వక గ్రంథం
రాశారు. "Andhra Province—for and against" దానిపేరు. ఇది
ఆంధ్రోద్యమానికి "భాషాభేషజం" వంటిది. అది చదివితే ప్రత్యేకాం
ధ్రరాష్ట్రావశ్యకత వప్పుకోవలసిందే! అప్పటినుంచి యేటేటా వకచోట
ఆంధ్రమహాసభ జరిగి ఉద్యమప్రచారం చేశింది. స్థాయిసంఘం సంవ
త్సరం పొడుగునా పనిచేస్తూ వుండేది. అప్పుడు 2, 3 యేండ్లల్లోనే
రాష్ట్రంవస్తుందనే నమ్మక ముండేది. పెద్దది హిందూదేశ స్వరాజ్యో
ద్యమం! అందులో అంతర్భూతం ఆంధ్రోద్యమం! రెండూ యేకకా
లావచ్ఛేదంగా జరుగుతూవుండేవి. తర్వాత ఆంధ్రులు విశ్వభారత
సమస్యలో మునిగిపోయినారు. స్వార్థం వదిలేశి గాంధిగారికి ప్రియ
శిష్యులైనారు. ఆంధ్రమహాసభ ప్రాభవ మడుగంటింది. తమిళుల బలం
యెక్కువైంది. స్వరాజ్యంతోపాటు ఆంధ్రరాష్ట్రంకూడా వస్తుందని
మన పెద్దలు ప్రజలకు నచ్చచెప్పారు. కాంగ్రెసువారు తమ వ్యవహా
రాల్లో "ఆంధ్రరాష్ట్రా" న్నిచ్చి పాలపీకను నోట్లోపెట్టి పిల్లవాణ్ణి నిద్ర
బుచ్చినట్లు నిద్రబుచ్చారు. స్వరాజ్యంకోస మొక్క యింగ్లాండును తృప్తి
పరిస్తే చాలు! ఆంధ్రరాష్ట్రానికోసం యింగ్లాండును, కాంగ్రెసును,
తమిళుల్ని, గుజరాతీల్ని కూడా తృప్తిపరచాలశొచ్చింది. స్వరాజ్యమైనా
రావచ్చుగాని ఆంధ్రరాష్ట్రంమాత్రం వచ్చేట్టులేదు! ఇప్పుడిప్పుడే
కొంచెం ఆందోళన మళ్లీ తలెత్తుతున్నది. 1941 వ సంవత్సరం నవం
బరులో, విశాఖపట్నంలో జరిగిన ఆంధ్రమహాసభా, డిసెంబరులో
చెన్నపట్నంలో జరిగిన ఆంధ్రవిజయోత్సవాలూ చాలా ప్రచారం
చేశినై. 1908 స్థితికి మళ్లివచ్చాం. దేశంలో కాంగ్రెసునాయకులంతా
స్వరాజ్యసంపాదన మహాకార్యనిమగ్నులైన కాంగ్రెసువారికి అనవస

రంగా మనస్తాపం కలిగించకూడదనే ఉదారులైపోయినారు. రాష్ట్రం పట్ల ఉదాసీనులైపోయినారు. గుమ్మిడిదల సుబ్బారావు, పంద్రంగి కేసవరావు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగార్ల గొంతెత్తి అరవడం యెవ్వరికీ వినపడలేదు. ప్రాణం విసుగేశి సుబ్బారావుగారు హిందూ మహాసభలోకూడా చేరాడు! *

ఇంతటితో యీ ఉదంతం చాలించి యీసంబంధమైన సారస్వతానికొద్దాం. ఈ సందర్భంలో కృష్ణాపత్రికచేసిన సేవకు విలువలేదు. యంగుయిండియా పత్రికను సాహాయ నిరాకరణోద్యమం రోజుల్లో యెట్లా వేదంవలె చదివేవారో, కృష్ణాపత్రిక నట్లాచదివేవారు. దుగ్గిరాల రామమూర్తి, చెన్నాప్రగడ భానుమూర్తి, క. భాస్కరరావు నాయుడు మొదలైనవాళ్లు కొన్ని గ్రంథాలు రాశారు. ఉద్యమం బెంగాల్‌నుండి వచ్చిందికాబట్టి కొంత ఆ విజ్ఞానమే మనభాషలోకికూడా రావటం తటస్థించింది. దేశభక్తిని పురికొల్పట మప్పటివాఙ్మయం యొక్కపని. అట్టి రాతలన్నిట్లో పీష్వా నారాయణరావు, భానుమూర్తిగారి "భారతధర్మదర్శనం" భాస్కరావునాయుడుగారి "ప్రఫుల్లముఖి" దుగ్గిరాల రామమూర్తిగారి "స్వాతంత్ర్యదర్శనము" (Mills' Liberty) కొండిపర్తివీరభద్రాచార్యులుగారి "భారతదర్పణము" మొదలైనవి ముఖ్యమైనవి. "ప్రఫుల్లముఖి" మంచిఉదాత్తంగా ప్రారంభమై దేశభక్తిస్ఫోరకమై తుదకు పేలవమైంది. దీనికి "దేవీచౌధురాణి" అని మరోపేరు. రామమూర్తిగారి శైలి మంచి సజీవమైంది. చెప్పదలచిన విషయమును సమ్మెటదెబ్బలవలె చెప్పగల సమర్థుడు ఆయన. వీరభద్రాచార్యులు అధ్యాత్మచింతగలవాడు. తుదకు సన్యసించి సంఘసేవచేశాడు. ఇక భానుమూర్తిగారు విద్యార్థుల చిత్తాల్లో కలగజేసిన దేశభక్త్యుద్రేకము చాలాగొప్పది. "భారతధర్మదర్శనం"

* ఇటీవల సాంబమూర్తిగా రొకచోట యిట్లాన్నారు *"The question of achieving the Andhra Province was as difficult a matter as the question of attaining independance for India. There were days when I thought that Andhra Province would come in the usual course"*

మిక్కిలి ఉత్తేజకరము. హిందూదేశానికి స్వరాజ్యమొచ్చిందాకా దేశ భక్తి కలిగించడానికి పనికొచ్చే పుస్తకం. అదివచ్చేదీలేదు! దీన్లో సంగతులు పాతపడేదీలేదు! సాంఘిక, ఆర్థిక, రాజకీయసమస్యలు దానిలో చక్కగా రసవంతంగా ఉగ్గడించబడ్డై. "ఒక నూటఁ బది కైన లేదు తినన య్యో తల్లి ముప్రొద్దులఁ", "ఆపద్ధర్మములుండ వేశ్రుతులఁద ద్వ్యత్యస్తకాలంబు దేశాపత్కాలముకంటె నొండు గలదే" "ఇది యార్యశ్రేష్ఠ ధర్మంబొకో!" అనే భాగాలు తార్కాణాలు. "భరత ఖండంబు చక్కని పాడియావు" అనే చిలకమర్తిగారి పద్యభావానికి సమాధానంగా యీక్రింది పద్యంచెప్పాడు చూడండి.—

"దురుసుదనమున దీరదీ గడుసుదనము
గాన తాపులు పోటులు కార్యమనక
లేగలన్నిటి నేకమాలా గొనర్చి
నేర్పుతో తల్లి యెగజేప నేరవలయు"

1907-8 సంవత్సరంలోనే సహాయ నిరాకరాణాన్ని యీపద్య మూలంగా నిరూపించిన మహామహుడీయన. ఈయన భరతమాతను గూర్చి రాశిన మాలికాస్తవం సారసత్వంలో "పూతమెరుంగులుఁ" వలె శాశ్వతంగా వుండవలసినంత గొప్పది. * శ్రీ గాంధీగారు న్యాయ

* ఓ. వై. శ్రీ దొరసామయ్యారుగారి ఆనందమఠమికాలానిదే! అందులోదే వందేమాతరగీతం.

"శరదభిరామచంద్రికలు చారువసంత సుమోత్కరంబులుఁ
సరసిజసౌరభంబు వెదజల్లెడు వేసవ కమ్మతెమ్మెరల్
పరిమళముల్ దిగంతముల బర్వగవీచెడు సంజపయ్యెరల్
వరఫలపుష్పసంతతుల భాసిలు రమ్యలతాద్రుమావళుల్
సరసరసాలపల్లవఫలంబులు మేసి యెలుంగులిచ్చెడున్
బరభృతకీరశారికలు పాడెడు మతమదువ్రతంబులుఁ

వాద వృత్తిని వదలమనకపూర్వం ఆంధ్రరాష్ట్ర నిర్మాణం కోసం వృత్తిని వదలిన న్యాయవాదిధీరుడు కొండా వెంకటప్పయ్యగారు! గాంధీగారికి పూర్వమే రాజకీయానికీ నైతికానికీ వంతెన గట్టినవాడు ముట్నూరి కృష్ణారావుగారు! గాంధీగారు నిర్మాణకార్యక్రమం ప్రారంభించనపుడు వీరందరూ హరిజన సమస్యను తీర్మానించిన మహనీయులు! డాక్టరై సమస్త విషయాల్లో అంకెలు జిహ్వాగ్రమందున్న సర్వతోముఖ ప్రతిభాశాలి పట్టాభిగారు! *

---

ఖరకిరణుందివింబొదవి కార్ముకసుమబ్బులు గ్రొమ్మెరుంగులుఙ
సురుచిరరత్నకాంతులును చూడ్కులకింపగు నింద్రచాపముల్
తరణికరంబులం ధరణి దాకగనీక తనర్చు సల్లకీ
సరళతమాలసాలపనసక్రముకాంమ్రపటీరకేతకీ
కురవకకింశుకాదికుజకుంజసమంచితకాననంబులున్
హరితతృణాగ్రముల్ మెసవి యంబరవీధిని గ్రేళ్ళు దాటుమేల్
హరిణచయంబు నృత్తసమయస్ఫుటపింఛములౌ మయూరముల్
సరసిజలక్ష్మి జెన్నెసగుసారసభృంగమరాళచక్రఖం
ధురనినదంబులం బొదలుతోయరుహాకరము ల్లసచ్ఛవి
స్ఫురదురువిద్రుమంబులును శుభ్రవినిర్మలమౌక్తికంబులున్
తరళతరంగమాలికల దద్దయు నొప్పెడు సాగరంబులున్
స్ఫురదమలాంశుజాలములఞొంపిరివోయెడు రత్నసానువుల్
పరగు గిరివ్రజం బమలవార్లహరీరమణీయవాహినుల్
ధరపై స్వర్గసౌఖ్యమిడు తల్లిరో! నీప్రజకెల్లకాలముఙ"
"మతముల పొచ్చినిల్లు జనమాన్యచరిత్రుల పుట్టినిల్లు న
ప్రతిమదయాశమాదిగుణరత్నసమృద్ధికి రోహణాద్రిశా
శ్వతనిరపాయసౌఖ్యఫలభాసురవల్లికి నాలవాలమై
యతుల విభూతి బొల్చు విల నంబరొ! నీసరిధన్యులుందురే!"

* వీళ్ళల్లో భానుమూర్తి, భాస్కరరావునాయుడుగార్లు సర్కారు నౌకరీలో చేరి గవర్నమెంటు ట్రాంసులేటర్లు అయినారు.

ఈవిధంగా జాతీయ సారస్వతం వచ్చిం తర్వాత సంఘ సంస్కారోద్యమం వెనక్కి పట్టింది. క్రొత్తనీళ్లు పాతనీళ్లను కొట్టేశినై. కాని సంస్కారమున్న చిత్తవృత్తులు కాబట్టి యీజాతీయ బీజాలు ప్రజాహృదయాల్లో నాటుకొనిపోయినై. త్వరలోనే కందళించినై. యువకులనేకులు గొప్ప వక్తలైపోయినారు. హరిసర్వోత్తమరావుగారూ, బోడి నారాయణరావుగారూ, కవుతా శ్రీరామశాస్త్రిగారూ మొదలెట్టి చరిత్రాత్మకంగా జాతీయోపన్యాసాలిస్తూంటే వేలకు వేలు ప్రజలు చీమ చిటుక్కుమనే శబ్దం లేకుండా వింటూండేవాళ్లు. హరిసర్వోత్తమరావు నారాయణరావు గార్లపైన కేసుపెట్టారు. శిక్ష పడ్డది. సర్వోత్తమరావుగారి ఎం. ఏ. పట్టంపోయింది. అప్పటినించీ "ముద్రవేశిన" దేశభక్తుడై జీవితమంతా దేశంకోసమే వినియోగించాడు. ఈవిధంగా మంచిరసవంతమైన శైలిలో ఉపన్యాసాలిచ్చే పద్ధతి యీకాలపు విశేషాల్లో వకటి. సంఘసంస్కరణ దినాల్లోకంటె యీకాలంలో ఉపన్యాసకుల సంఖ్య యెక్కువై పోయింది. జాతీయ కవిత్వం, వక్తృత్వం యీకాలం సారస్వతానికిచ్చిన ప్రయోజనాలు.* అప్పటికాలపు మహాపురుషు లిప్పటికీ ఉండి ఈ వక్తృత్వా న్నప్పుడప్పుడూ అవసరమొచ్చినప్పుడు ప్రసాదిస్తూనే ఉన్నారు. ముట్నూరు వేదికపైన మూకుడల్లా వాచాలుడౌతాడు! అనర్గళధార! ఉదాత్త భావాలు! వేదాంతం సంసారానికి అన్వయింపచేసే ప్రతిభ! కృష్ణాపత్రికసంపాదకీయాలు చదివితే ఆయన ఉపన్యాసధోరణికూడా బోధపడుతుంది. నోరూ కలమూకూడా వకటిబిగిన బుద్ధివైభవంతో ఆడే ప్రజ్ఞావంతుడీయన. ప్రవర్తనలో ప్రహ్లాదుడు! వంచినతలను ఆఫీసుకెళ్లిందాకా యెత్తడు. వంకతేరి పొడుగాటి తోకగల తలగుడ్డ, గోచీ కుచ్చెళ్లు కలిపి పట్టుకునే యెడమచెయ్యి,

* ఈ ఆంధ్రవక్తృత్వశక్తి సహాయనిరాకరణోద్యమంలో గొప్ప ఉన్నతికొచ్చింది. ఆంధ్రరత్నంలో అది సంపూర్ణ పరిణామం పొందింది.

గొడుగుపిడి చేతిలో పట్టుకొని కోసభుజానికి తాకేటట్టుగా పెట్టుకునే విన్యాసం, శిరఃకుంచనం, ఆలోచనామగ్నమైన ముఖము, చూస్తే ఆయన ప్రపంచంతో సంబంధంలేని వక ఆధ్యాత్మిక వ్యక్తని తోస్తూంటుంది. కానిదృష్టు అతి తీక్ష్ణాలు.

ఈనకు సరీగ్గా వ్యతిరేకం పట్టాభిగారు. ఆయన యెంతమూకుడో యీన అంత వాచాలుడు. ఎల్లప్పుడూ వాక్కు జీవనదిగా ప్రవహిస్తూ ఉంటుంది. ఈయనకూడా ఆంధ్రాంగ్లాల్లో అనర్గళంగా ఉపన్యాసం యియ్యగల సమర్థుడు. ఈయనబుఱ్ఱ యెటువంటిదోగాని అందులో ప్రపంచమంతా ఉన్నది. ఈయన కచుంబితవిషయమంటూ లేదు. తర్కం సహజంగావస్తుందీనకు! వాదనలో యీనను జయించడం సులభసాధ్యంకాదు. ఇటీవల గాంధిగారి తత్వానికీయన వ్యాఖ్యాతై నాడు. మంచి వ్యావహారికాంధ్రం మాట్లాడుతాడు. హిందీలోకూడా ఉపన్యాసధోరణి అలవాటుచేసి సిద్ధప్రజ్ఞుడైనాడు. అత్యంతమైన ప్రపంచజ్ఞానంకలవాడు. ఈన మాట్లాడుతూవుంటే క్లుప్తలేఖకుల కూడా వ్రాయటంకష్టమే! ఆంధ్రదేశ దురదృష్టంచేత అనేక సంవత్సరాలీయన కాంగ్రెసునాయకుడై ఆంధ్రదేశానికి ముఖ్యంగా కావలసిన రాష్ట్రోద్యమానికి దూరుడైనాడు. కాంగ్రెసు ప్రెసిడెంటైనా కాలేదు. కాని గొప్ప ఆంధ్రవక్తల్లో చేర్చదగినవాడు. వకట్ గ్రాంధికత్వంవదిలితే కొక్కొండ వారితో సమానుడనచ్చు వక్తృత్వంలో.

చెరుకువాడ నరిసింహం, అవటపల్లి నారాయణరావుగార్లున్నారు. వీరిలో నరిసింహంగారు యెంతవక్తో అంతరాతగాడు.* కృష్ణా పత్రికలో హాస్యప్రధానాలైన విమర్శలూ అవ్వీ చదివేవాళ్ళ కాయన సంగతి బాగా తెలుస్తుంది. ఆంధ్రదేశంలోవున్న గొప్పవక్తల్లో వకడు. ఇక్కస్యూరెన్సుమీద ఉపన్యాసాలిచ్చానా అవికూడా విమృతవక్తా

* ఈనకు "ఉపన్యాసకేసరి" అని బిరుదునిచ్చిం దాంధ్రదేశం. దానికి తప్పక తగినవాడు.

లతో వినాలసిందే! గొప్పవ్యక్తి. ఇక నారాయణరావుగారో దేశ సేవకై అవివాహితుడై పోయినవ్యక్తి. ఈన కలమూ, నాలుకా కూడా బెత్తాలవంటివి. ఈనను రంగూనుకు పంపిచ్చాం. ఇటీవల రంగూనుమీద విమానదాడులు అవుతున్నై. పరమేశ్వరు డీయనను రక్షించుగాక! అక్కడ ఆంధ్రులకోసం చాలా పాటుపడ్డాడు. ఇటీవల ఆంధ్రమహాపురుషులనుగూర్చి "విశాలాంధ్రము" అనే పేరుతో వకగ్రంథం రాశాడు. చాలా హృదయంగమంగావుంది. కొందరు ఆంధ్రమహాపురుషుల జీవితాలందులోఉన్నై. ఈన రాతలో యెక్కడన్నా పానుగంటిపోకడ పొడకట్టుతూవుంటుంది.

ఈకాలంలో బందరులోవున్న వక మహామహుణ్ణి ప్రశంసించాలనొస్తున్నది. ఇదివరకు పరిచితుడే మనకాయన. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారు. ఈకాలంలో ఆయన బందరు హిందూహైస్కూలులో తెనుగు పండితుడుగా వుండి సంస్థకు గౌరవంతెచ్చాడు. ఆయన కోపంవస్తే స్కూల్లోనించీ వెళ్లిపోతాడేమోనని భయపడుతూండేవారు స్కూలు అధికార్లు. పింగళివారికీ, కాటూరువారికీ కూడా అప్పుడే వారి శిష్యత్వం అబ్బింది. ఆయన ఉపన్యాసధోరణి చెబితే తేలేదికాదు. సభలోవాళ్ళందరూ వక్కమాటు అల్లరిచేస్తున్నారనుకోండి. వకఉపన్యాసకుణ్ణి యేడిపిస్తున్నారనుకోండి. శాస్త్రిగార్ని వేదికమీదికెక్కిస్తే వక్కపద్యం విశిరేశాడాఅంటే అంతా నిశ్శబ్దమే! అక్కడ్నించీ ఘుంటలు ఘుంటలు కిక్కురుమంటేవొట్టు! మాట్లాడితే యెక్కడ మాటపోతుందేమో అని భయపడేవాళ్లు సభాసదులు. ముక్కుతో పద్యాలు చదువుతూంటే ముద్దులు మూట కట్టేనట్టుండేవి.

ఇంకా కొండా వెంకటప్పయ్య మొదలైనవాళ నేకమంది ఉన్నారు. అందరూ అన్ని ముత్యాలు— గుంటూరులో శనగపల్లి రామస్వామిగుప్త అని వక వైశ్యశిఖామణి ఉండేవాడు. ఆయన కాంగ్రెసులో కూడా పాల్గొనేవాడు. బొంగుపోయిన గొంతు. అనర్గ

ళంగా మాట్లాడేవాడు. కాని ఆయన్ని నవ్వులాటగా హేళనచేస్తూండే వారంతా. వద్దన్నా సమయం చూచుకుని వేదికమీాద గభీక్కున యెక్కి ఉపన్యాసం ప్రారంభించేవాడు. ఒకమారు గుంటూరుకు గవర్నరుగారొస్తున్నారు. ఈగుప్తగారిని ప్లాటుఫారంమీాదికి రాని య్యొద్దని కలెక్టరుగా రుత్తరువిచ్చాడు. గుప్తగారు ముందు రైలులో బెజవాడవెళ్ళి అక్కడినించి గవర్నరుగారి స్పెషల్‌బండిలోనే గుంటూరువచ్చి, ఆయనతో పాటుదిగి, "ఈనేకలెక్టరు" అని కలెక్టరు గారిని గవర్నరుగారికి పరిచయం చేశాడట! అందరూ ఆశ్చర్య నిమగ్నులయ్యారట!

---

# నవ్యాంధ్ర సాహిత్యవీధులు

## ౬

గ్రంథప్రచురణ సంస్థలు : (విజ్ఞానచంద్రికాగ్రంథమండలి. శాస్త్ర వాఙ్మయం. చారిత్రకపరిశోధన. పారిభాషిక పదజాలం. ఆంధ్రదినపత్రిక.)

ఒక వంక కృష్ణారావు పట్టాభీత్యాదులు రాజకీయవాతావరణంలో పనిచేస్తూంటే మరోవంక యితరులు విజ్ఞాన వాతావరణానికి ప్రాముఖ్య మియ్యటం మొదలెట్టారు. జాతి సర్వతోముఖంగా అభివృద్ధి కావాలంటే అన్ని విధాల విజ్ఞానం అలవడ జేసుకోవాలె. బంగాళా దేశానికి మొట్టమొదట ఆంగ్లవిజ్ఞానసంపర్కం కలిగింది. అందుచేత వాళ్లు సమస్తశాస్త్రాలు, కళలు, మొదలైనవాట్లో విజ్ఞానం పెంచుకున్నారు. పక్కనున్న మహారాష్ట్రులకుకూడా యీ గాలి తగిలింది. వాళ్లుకూడా తమ విజ్ఞానం అభివృద్ధి చేసుకోడానికి పూని పనిచేస్తున్నారు. అసలు మహారాష్ట్రులకూ ఆంధ్రులకూ సంబంధం యెక్కువ. ఇద్దరూ పంచద్రావిడుల్లోవాళ్ళే! లోకమాన్య బాలగంగాధరతిలకు మహాశయుడు వెనకకాలంలో, యిటీవల సవర్కరుగారూకూడా, మహారాష్ట్రులు రాజ్యాంగమంతా ఆంధ్రుల దగ్గిరనుంచి గ్రహించారని చెప్పారు. ప్రాచీనాంధ్రులు పైఠను పట్టణం రాజధానిగా యేలారు. ఆంధ్రులయొక్క కళాకౌశలాన్ని తెలియజేసే యెల్లోరా అజంతా చిత్రాలు మరాట్వాడాలో ఉన్నాయి. మరాట్వాడా మీదుగానే తూర్పుకు వలస వచ్చారు ఆంధ్రచాళుక్యులు. రెండుజాతులు హంసాయీలు. మహారాష్ట్రులు యీ శతాబ్దాదికే వక విజ్ఞానకోశం తయారు చేసుకుంటూ యితర శాస్త్రాలల్లో

గ్రంథాలు విరివిగా రచించుకుంటున్నారు. బంగాళావారు అంతకు పూర్వం పాఠశాలల్లో చెప్పే హిందూదేశచరిత్ర తప్పులతడికని గ్రహించి నిజమైన చరిత్రను రాసుకొన్నారు. యింకా రాస్తు న్నారూనూ! రమేశచంద్రదత్తు; బి. డి. బాసూ; జుదూనాథ్ సర్కారుగార్లు చరిత్రపరిశోధనచేశారు. ఇప్పుడుకూడా మరికొందరు చేస్తూనూవున్నారు. మహారాష్ట్రలోకూడా లోకమాన్యుడు, డాక్టరు భండార్కరు, సర్దేశాయి, మొదలైనవారు చరిత్రను పునర్నిర్మాణం చేయటానికి గట్టి ప్రయత్నాలు చేస్తూ చాలామట్టుకు రాశారు. ఈకాలానికి పూర్వమే చాలా ఆంధ్ర కుటుంబాలు మధ్యరాష్ట్రా లకు వలసపోయి అక్కడ స్థావరాలేర్పరచుకున్నాయి. అటువంటి కుటుంబాలకు కొన్నింటికి మహారాష్ట్రులయొక్క సంపర్కంచేత తమ స్వంతవిజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవాలని యిచ్ఛ జనించింది. అటు వంటి కుటుంబాల్లో కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారి కుటుంబ మొకటి.

వీరిది నిజాంరాష్ట్ర సరిహద్దుల్లో వకగ్రామం. వీరికుటుంబం వారిప్పటికీ ఆవూరిలో చాలా ప్రాభవంతోవున్నారు. * ఈన ఆం గ్లంలో యెం. ఏ. పరీక్ష ప్యాసైనాడు. ఈన చిన్నప్పటినుండి నాగ పూరు ప్రాంతాల్లో ఉండేవాడు. క్రమంగా మళ్లీ ఆంధ్రదేశానికి వలస వచ్చాడు. మధ్యరాష్ట్రాన్నించీ రావడంచేత అక్కడి సంస్కారంతో వచ్చాడు. దాన్నంతా స్వదేశభాషాభివృద్ధుల కుపయోగించాలని నమకట్టాడు. మునగాలరాజాగారు కూడా విజ్ఞానవంతుడు కాబట్టి, విజ్ఞానం గల యీన ఆయన కంటబడ్డాడు. ఆయన యీన్ని దివానుగా పెట్టుకున్నాడు. దివానుపదవి యెప్పుడైనా సలహాకొరకే తప్ప మిగిలిన యావత్తు కాలము దేశభాషాసేవలకోసం వినియుక్తమైంది. రాజులంతా తమ రాజ్యాలు వదలి పట్టణాల్లో ఉంటూవుండటం అల

* బెజవాడలో వైద్యవృత్తిలోవున్న శ్రీమతి కొమర్రాజు అచ్చమాంబగారీయన కుమార్తె.

వాటు. ఆవిధంగా చెన్నపట్నంలో యీానకు కూడా ఉనికి లభించింది. ఈన ఆశయాలవంటి ఆశయాలు కలవాళ్లు అన్యోన్యం ఆకర్షించబడ్డారు. ఒక మండలిగాచేరి, ఆంధ్రభాషలోకి చరిత్రలు, శాస్త్రాలు, యింకా యితర విజ్ఞానం తెచ్చుకోవాలనీ, వీలైతే మహారాష్ట్ర విజ్ఞానకోశంలాంటిది వకటి తయారు చెయ్యాలనీ సంకల్పించారు. ఏనాడా సంకల్పం కలిగిందో భాషకూ జాతికీ గొప్ప ఉపకారమైంది. తాను స్వయంగా చారిత్రకుడౌటచేత తాను చరిత్రను గ్రహించాడు. ఇతరులకు వారి రుచినిబట్టీ, యోగ్యతనుబట్టీ విషయాలను యేరి యిచ్చాడు. విజ్ఞాన చంద్రికాగ్రంథమండలని వక సంస్థ స్థాపించాడు. ఈసంస్థ దేశభాషలకు చాలా ఉపకారం చేసింది. చరిత్రపుస్తకాలు ప్రకటించింది. నవలలను ప్రచురించింది. ఆంధ్రులచరిత్రరచన చిలుకూరి వీరభద్రరావుగారికి లభించింది. రసాయనశాస్త్రం వేమూరి విశ్వనాథ శర్మగారు, పదార్థ విజ్ఞానశాస్త్రం మంత్రిప్రగడ సాంబశివరావుగారు, ఆరోగ్య విషయాలన్నీ డాక్టరు లక్ష్మీపతిగారు, ఈవిధంగా గ్రంథాలురాశారు. కొన్నాళ్ళకు అర్థశాస్త్రం కట్టమంచి రామలింగారెడ్డిగారి పాలబడ్డది. ఇవిగాక నవలలు, చరిత్రాత్మకమైనవి, రాయచూరుయుద్ధం, విమలాదేవి, విజయనగరసామ్రాజ్యం మొదలైనవి రచింపబడ్డై. ఇవీ అవీయేమిటి, అనేక విజ్ఞాన విషయాలు ఈసంస్థ అవలోడన చేశింది. పుస్తకాలు కూడా మంచిఅచ్చు, మంచిబైండుతో వుండేవి. లోపలి విషయానికి వంకలేదు. కాబట్టి చాలా ప్రచారం చెయ్యగలిగిందీ సంస్థ. చందాదారులనుచేర్చి వారికి సంవత్సరానికి కొన్ని వందల పేజీలు లభించేటట్టుచేసి విజ్ఞాన ప్రచారం చేసింది.

లక్ష్మణరావుగారు గొప్ప వ్యక్తి. * ఆయన్ను కనుకుని, అవసరమైన యెస్టేటుపనిని జాస్తీగా ఆయనకియ్యకుండా, దేశభాషా

---

* "మహారాష్ట్రేతిహాసిక పరిశోధకమండలితో వాదించి పంచవటిని నాసికనుండి భద్రాచలమునకు సాధించినారు. తెలుగునుండి త్రిలింగము నోడ్చినారు"

(మున్నంగి లక్ష్మీనృసింహశర్మ)

సేవకు సంపూర్ణ వకాశం కలగజేసినందుకు మునగాల రాజాగారికి వందనాలియ్యాలశిందే! అట్లాకాకపోతే లక్ష్మణరావుగారి మేధఅంతా బీటగాచిన వెన్నెలయ్యేది! ఆయనబుద్ధి యెంత నిశితమో విజ్ఞాన మంత విశాలం. ఆయనకురాని విషయం లేదు. వేదాల దగ్గిర్నుంచీ చీట్లాటదాకా సమస్తసంగతులు ఆయనకు జ్ఞాతాలే! అందులో యెట్లా? ఆమూలాగ్రంగా! ఆయన మనిషినిచూస్తే యింత విజ్ఞానవంతుడని కనపడదు. సామాన్యంగా యెప్పుడూ మహారాష్ట్రుల నేపథ్యమే అవ లంబించేవాడు. మెడమూసిన పొడుగుకోటూ, నెత్తినతలగుడ్డా, కుడిచంకకిందినించీ యెడమభుజం మీాదికి ఉత్తరీయం, అవసరమొస్తే లాగూ లేకపోతే పింజపెట్టి కట్టినధోవతీ, ఇది ఆయన దుస్తులవివరం. ముఖం ప్రశాంతంగా సత్వప్రధానంగా వుండేది. తొందర నేదిలేదు మనిషిస్వభావంలో! ప్రతివిషయము పూర్వాపరాలాలోచించేవాడు. విషయచర్చలో ఆయనతో సమానులు చాలామంది వుండరు. కారణం లేకుండా మాట్లాడేవాడుకాడు, రాశేవాడూకాడు. ఇప్పటి పరిశోధ కులు చాలామందివలె ఆయన గప్పాలెప్పుడూ కొట్టేవాడుకాడు. ఆయనకు సామాన్యంగా నిర్దుష్టమైన దోవే స్ఫురించేది. ఆయన రాసిన హిందూమహాయుగం, మహమ్మదీయ మహాయుగం, సర్వ కాలాలకూ పనికొచ్చే గ్రంథాలు. విషయాల గను లనవచ్చు. ఎన్ని విషయాలు! ఎంత సమంజసంగా చర్చించారు? అత్యంత పరిశోధనా ఫలాలు. బ్రిటిషు మహాయుగం రాయటానికి భగవంతుడు ఆయుర్భా గ్యమియ్యలేదు! ఆయనకు మనుష్యులను కనిపెట్టి వాళ్లకు కర్తవ్యం పంచిపెట్టడంలోనూ, తగిన పనులను తగిన వ్యక్తులనే నిర్ణయించడం లోనూ, చాలా సూక్ష్మదృష్టివుండేది. ఆయన నిరాడంబరజీవి! అందు చేత ఆయనతో సాహచర్యంగల వాళ్లంతా వక్క-రెడ్డిగార్ని వదిలి నిరా డంబరజీవులే! ఈయనకూడా అంతయెక్కువ సంబంధము ఆయనతో లేదు కాబట్టి నిరాడంబరత్వం పట్టుపడలేదు. ఆంధ్రుల చరిత్రను పరి శోధించి రాశిన చిలుకూరి వీరభద్రరావుగారు కొవ్వూరుచేరి పల్లె

టూరి జీవనం గడపి అత్యంత నిరాడంబరంగా చివర దినాలు వెళ్ల బుచ్చాడు. అందరూ ఆయన్ను తలచుకునే దినాల్లో కూడా హాళ్ళూ పెళ్ళూ లేకుండా "యీనా వీరభద్రరావుగారూ!" * అనిపించుకు న్నంతనిగర్వి! రసాయనశాస్త్రం రాశిన వేమూరు విశ్వనాథశర్మగారు గొప్ప ఉద్యోగంలోవున్నా ఆడంబరం యెంతమాత్రం లేకుండా విశ్రాంతికాలంలో విజ్ఞానార్జనం, దేశభాషాసేవా, చేస్తున్న మహా వ్యక్తి! అధికారానికి తగినట్టుండ దాకారం! పదార్థవిజ్ఞానశాస్త్రం రాశిన మంత్రిప్రగడ సాంబశివరావుగార్ని చాలామంది ఆంధ్రులు యెరగరనే నా అభిప్రాయం! ప్రచ్ఛన్నంగా దేశభాషాసేవలు చేస్తూ, సంస్కారాన్ని పొందిన మతసాంఘికభావాలు కల వ్యక్తి! వీళ్లలో చాలామంది ఉపాధ్యాయవృత్తికి తగినవాళ్ళూ, సాక్షాత్తుగా ఆవృత్తిలో ఉన్నవాళ్ళూను. విశ్వనాథశర్మగారు రాజమండ్రి కళా శాలలో రసాయనశాస్త్రపండితుడుగా వుండి జిల్లావిద్యాశాఖాధి కారిగా వెళ్లాడు. వెళ్లినా ఆయన చిత్తవృత్తికి వ్యతిరేకమైందే ఆఅధికారం. జులుంచూపగలశక్తి అధికారికి అవసరం యీరోజుల్లో! సాంబశివరావుగారు గుంటూరు కాలేజీలో ఉపాధ్యాయవృత్తిలో ఉన్నారు. ఆరోగ్యశాస్త్రగ్రంథాలు రచించిన డాక్టరు లక్ష్మీపతిగా రొక ఆదర్శజీవి. జీవితంలో ఆయన ధనసంపాదనకోసం ప్రయత్నించ లేదు. మత, సాంఘిక, రాజకీయ సంస్కారాలను జీర్ణింపచేసుకొని ఆచరించిన మహామహుడు. దక్షిణదేశంలో దేశీయవైద్యానికి పండిత డి. గోపాలాచార్లుగారి తర్వాత ప్రవక్త. ఆలోపాతీలోనించి ఆయు ర్వేదానికొచ్చిన నిరాడంబరజీవి. రాజకీయరంగంలో వున్న స్త్రీలల్లో పేరుగాంచిన శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగా రీయన భార్యయే! ఈన అఖిలభారతవ్యక్తి అయినాడు. దేశీయవైద్యవిషయంలో ప్రామా ణికులలోని అగ్రగణ్యులలో వొకడు. అనేకాయుర్వేదగ్రంథాలు

* ఈన తిమ్మరసు, తిక్కన రామరాజు చరిత్రలు రాశాడు.

ప్రచురించాడు. ఈయనకు పూర్వం పండిత డి. గోపాలాచార్యులు గారు మాధవనిదాన, చరక, శుశ్రుతాది వైద్యగ్రంథాలను సటీకలుగా ముద్రించి ఆంధ్రవిజ్ఞానానికి మహోపకారం చేశాడు. మద్రాసులో ఆయుర్వేదకళాశాలను స్థాపించి దాని కనుబంధంగా ఆసుపత్రిని నెలకొల్పాడు. ఆ భారమంతా ఆయనతర్వాత లక్ష్మీపతిగారి మీద పడ్డది. నిర్వహించడంలో యెట్టి పొరబాటూ లేకుండా జాననిపించుకుంటున్నాడు! ఏ దేశక్షేమకరోద్యమంలోకూడా మొదటి శ్రేణిలో వుంటాడు. పరమేశ్వరు డీయనకు పూర్ణాయువొసంగుగాక! రెడ్డిగార్ని గూర్చి నేను చెప్ప సాహసించను. ఈన గొప్ప విజ్ఞాని, చరిత్రవేత్త, బుద్ధికుశలుడు, వక్త. కాని అంతగా రాణించడం లేదనుకుంటారు. ఈన రాశిన గ్రంథాల్లో అర్థశాస్త్రం (విజ్ఞానచంద్రికాప్రచురణం) గొప్పగా రచించాడు. కాని అసలుపుస్తకంకంటె కృతిసమర్పణపద్యాలు చాలా గొప్పగా వున్నై. వర్ణాశ్రమవ్యవస్థపైన యీన కున్న అసహ్యత అర్థశాస్త్రం ప్రతి పుటలోనూ కనపడుతూ వుంటుంది. ఆంధ్రవిశ్వవిద్యాలయానికి 3 × 3 = 9 సంవత్సరాలు వైసుఛాన్సెల్లరుగా ఉన్నారు. ఈనకాలంలో చెప్పుకోతగ్గ మార్పేమీ జరగలేదు.* కాని మైసూరు, ఉస్మానియావిశ్వవిద్యాలయస్థాపనంలో యీన సలహాలను స్థాపకులు తీసుకున్నారు. పెరటిచెట్టు మందుకు రాదనే సామెత యీనకు వర్తిస్తుంది. ఇంగ్లాండులో చదివిన భారతీయులకందరికీ పేరుతెచ్చాడు. ప్రపంచమంతా సంచరించి విద్యాపద్ధతులన్నీ గమనించాడు. యువకుల కుద్బోధం కలిగిస్తూ స్నాతకోపన్యాసాల నిచ్చాడు. జస్టిసుపక్షంతో శరీకరించి వాళ్ళ పతనానికి హేతుభూతుడైనాడు. కాంగ్రెసుతో శరీకరించి తత్కార్యాలను విమర్శిస్తున్నాడు.♦ ఒక కాలు రాజకీయంలోనూ, రెండో కాలు

* "విక్రమదేవ టెక్నికల్ కాలేజీ" సర్ రాధాకృష్ణన్ గారి హయాంలోది. రెడ్డిగారిహయాంలో భవననిర్మాణం కొంత జరిగింది. దీన్ని విజ్ఞానభాగమంటారేమో!

♦ ఇటీవలే యీన రాజకీయోపన్యాసాలు వక సంపుటంగా ప్రకటించారు మద్రాసు ముస్లింలీగువారు.

విద్యాశాఖలోను పెట్టుకుని నాట్యమాడుతున్నాడు! ఆంధ్రంలో నిష్ణాతమైనప్రజ్ఞ కలవాడు. ఆంధ్రాంగ్లాల్లో రెంటిలోను చక్కగా హృదయంగమంగా మాట్లాడకలిగిన వక్త. ఇంగ్లీషులోకూడా యీ నల్లే మాట్లాడగలవారు యే రైటానరబిల్ శ్రీనివాసశాస్త్రి వంటి వారు తప్ప చాలామంది లేరు! గొప్ప ప్రతిభాశాలి. యితర విష యాల్లో యెంతవాడైనా యీనపేరు శాశ్వతంగా నిలిపేది యీన సారస్వతసేవే. దాన్ని వేరే విపులంగా ముచ్చటించుకుందాం!

గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారుకూడా వీరితో సంప ర్కం కల్గి పని చేసినవాడే! ఈ కాలంనాటికే ఆయన "విస్మృతరాజ కవి" (Forgotten Emperor Poet) "అబ్రహాం లింకను" మొదలైన గ్రంథాలు రచించివున్నాడు. హిందూదేశచరిత్రతోపాటు ప్రజలకు ప్రపంచచరిత్రకూడా కనక చెబితే వాళ్ళదృష్టి విశాలమౌతుంది. ఆ వుద్దేశంతో యీన "ప్రపంచచరిత్ర"ను సంపుటాలుగా ప్రచురించ మొదలెట్టాడు. "ఉత్పద్యంతే విలీయంతే దరిద్రాణాం మనోరథాః" అన్నట్టు కొన్ని సంపుటాలు ప్రకటించేటప్పటికే ప్రయత్నం కుంఠిభ వించింది. దేశం తోడ్పడలేదు. ఆయ నేం చేస్తాడు? ఇంతలోనే ఆంధ్రపత్రిక దినపత్రికై దానికి సంపాదకుడుగా వెళ్ళాడు. కొన్ని సంవత్సరాలక్కడ ఉన్నాడు. ఈనకూడా ధోవతీ, ఉత్తరీయ్యం, చొక్కా, తప్ప యితర దుస్తులు వేసుకోడు. బహుక్లుప్తజీవి. ఈన వక్తృత్వాన్ని గూర్చి యిదివరకే చెప్పాను. ఇప్పటికీ ఇంగ్లీషూ తెనుగూ సమానంగా మాట్లాడగల వ్యక్తుల్లో వకడు. దేశసేవ చేస్తూ నేవున్నాడు. లక్ష్మి ఆయనదగ్గిరికి పోకుండా తొలిగిపోయింది. అయితే సరస్వతీసేవ చేస్తూ చిరకీర్తిని సంపాయించుకున్నాడు. దేశ భక్తుడు. కొన్నాళ్లు రాజకీయంలో పూర్తిగా దిగి శాసనసభ్యుడు కూడా అయినాడు. పవిత్రజీవి. దీర్ఘాయుష్మాన్ భవతు

ఈ విజ్ఞానచంద్రికామండలివారు కొన్ని నవలలు రాయించారు. వాటిలో భోగరాజు నారాయణమూర్తిగారు రాశిన "విమలాదేవి", కేతవరపు వెంకటశాస్త్రిగారు రాశిన "రాయచూరుయుద్ధం" యెన్న దగినవి. వీటిలో రెండోది ఆంధ్రులచరిత్రకు సంబంధించింది "విజయ నగరసామ్రాజ్య" మనే మరో నవలకు 500 రూపాయల బహుమ తొచ్చింది. అది దు. రా. సచ్ఛాస్త్రిగారి అదృష్టమేగాని వేరే కాదని నా అభిప్రాయం. పాత్రపోషణలోగాని, కథానిర్మాణంలోగాని, భావ విజృంభణంలోగాని, శైలీవర్ణనల్లోగాని యెన్నదగిన విషయం లేదు. సంభాషణా, శైలీ, కుంటుతూవుంటయి. "విమలాదేవి" యిప్పటికీ యెప్పుడైనా కంటబడితే కొన్ని భాగాలు చదవ బుద్ధిపుడుతుంది. "రాయచూరుయుద్ధం" మళ్ళీ చదివితే బాగుండును, అనిపిస్తుంది. విజ్ఞానచంద్రికవారు "విజయనగరసామ్రాజ్యా"నికి బహుమతి యిచ్చీ, ప్రచురించీ దానికి గౌరవ మియ్యడం దైవికంగాని మరోటి గాదు. "విమలాదేవి"లో ఉన్న "నిన్ను గాదురా! నన్నే రమ్మనెను" అనే చిత్రమూ మాటలూ సర్వకాలం జ్ఞాపకముంటున్నై! భోగరాజు నారాయణమూర్తిగా రొక వాఙ్మయచరిత్రకూడా రాశారు. ఇటీ వల నే వీరు దివంగతులై ఆంధ్రభారతికి కన్నీరు కల్పించారు. కీర్తి శేషుడు! ఈ సందర్భంలోనే ఎ. వి. నరసింహంపంతులుగారి "పాతాళ భైరవి" అనే నవలకూడా యెన్నదగిందే. ఇది "విజయనగర సామ్రాజ్యం" కంటె అన్నివిధాలా ప్రశస్తతరం. పేరుమాత్రం బాగుండలేదు. లోపలివిషయాన్ని యింతకంటె మెత్తగా తెలియ జేసే పేరుంటే బాగుండేది! ఈ విధంగా నవలావాఙ్మయాన్ని పెం పొందించిం దీ సంస్థ.

తరువాత కొన్ని వత్సరాలీ సంస్థయొక్క స్థితిగతులు ప్రచ్ఛన్నంగా ఉన్నై. మళ్ళీ కొన్నాళ్ళకు యీ సంస్థ కార్యాలయం బెజ వాడకు మార్చి, వెనకటి లక్ష్మణరావుగారితో సాహచర్యం మరవ

లేక, అయ్యదేవర కాళేశ్వరరావుగారు దీనికి నూతన జీవం కల్పించారు. అప్పుడుకూడా మరికొన్ని చరిత్రగ్రంథాలు పరిశోధించి వ్రాయడమైంది. "అమెరికా సంయుక్తరాష్ట్రములు" "ఫ్రెంచి స్వాతంత్ర్యవిజయం" మొదలైన కాళేశ్వరరావుగారి గ్రంథాలూ, వేలూరు సత్యనారాయణగారి "ఫాహియాన్ భారతవర్షయాత్ర" "బౌద్ధ మహాయుగం" మొదలైనవి యెన్నదగినవి. ఇప్పటికీ యీసంస్థ కార్యాలయం బెజవాడలోనే ఉన్నట్టు తెలుస్తుంది. వేలూరి సత్యనారాయణగారు మళ్లీ తప్పక విజ్ఞానచంద్రికా మండలి చిత్తవృత్తికల్గి స్థాపకుల నిరాడంబర జీవనం కలవాడు కాబట్టే యీసంస్థ ఆయన్ని ఆకర్షించింది. ఆయన చాలా విజ్ఞానవంతుడు. సహాయ నిరాకరణోద్యమంలో శ్రీకృష్ణజన్మస్థానానికి వెళ్లివచ్చిన పవిత్రశీలి. చాలా ఉదారహృదయుడు. కాకినాడ కాంగ్రెసు సందర్భంలో ఈనతోనూ, కోలవెన్ను రామకోటేశ్వరరావుగారితోనూ కలిసి పనిచేశే ఆనందం కలిగింది నాకు. ఈన జీవితంలో గొప్ప ధనవంతుడు కాకపోయినా, నిరాశలేని తృప్తజీవి!* కాళేశ్వరరావుగారు నా నీరసవాక్కుల కతీతుడైన దేశభక్తుడూ, వాఙ్మయసేవకుడూనూ! ఈవిధంగా యీసంస్థ దేశభాషాసేవలు చేసి ధన్యమైంది. ఎల్లకాల మొకేసంస్థయే చేయాలె ననటం న్యాయంకాదు. కాలం మారినకొద్దీ మనుష్యుల చిత్తవృత్తులు మారుతూవుంటై! దానితో సేవాపద్ధతులు కూడ మారాలె! తత్కాలంలో ఆంధ్రదేశంలో విజ్ఞానం వెదజల్లిందీ సంస్థ. అనేక శాస్త్రాలను వాఙ్మయంలోకి తెచ్చింది. చరిత్రకు నూతన జీవనం కల్పించింది. పరిశోధనకు దోవ చూపింది. "ఆంధ్రుల చరిత్ర" యీ సంస్థ చేసిన పనికంతకూ మకుటం! అది ప్రథమ యత్నం కావటంచేత నిర్దుష్టంగా వుండడానికి వీల్లేదు. చారిత్రక పరిశోధకులంతా దానిలో వేలెట్టి లోపాలను చూపించక, తమ పరిశోధనా ఫలంగా

* ఇప్పుడు భీమవరంలో వకీలుగా ఉన్నాడు. ఇటీవలనే బ్రిటిషిండియా చరిత్ర రచించాడు.

వాటిని దిద్ది, కీర్తిశేషుడైన వీరభద్రరావుగారు శ్రమపడి చేసిన పనికి పరిణామాన్నిచ్చి, దేశంవందనాలకు పాత్రులౌతారని ఆశిస్తున్నాను.

కొన్నిసంవత్సరాల కిందట రాజమహేంద్రవరంలో "ఆంధ్ర చారిత్రక పరిశోధనమండలి" (Andhra Historical Research Society) అనే వకసంస్థ స్థాపించారు. దానిపక్షమున వక త్రైమాసిక పత్రికకూడా ప్రచురిస్తున్నారు. ఆసంస్థ చేసేపనంతా యింగ్లీషులో జరుగుతున్నది. రాళ్ళభండి సుబ్బారావు, భావరాజు వెంకట కృష్ణారావు, మారేమండ రామారావు, మొదలైన వారాసంస్థను పట్టుకొన్నారు. వీరిలో కృష్ణారావు రామారావుగార్లు సామాన్యంగా తెనుగులోనే రాస్తూవుంటారు. వాళ్లు చాలా చరిత్రగ్రంథాలు పరిశోధించి రాశారుకూడాను. సుబ్బారావుగారు సామాన్యంగా యింగ్లీషులోనే రాస్తూవుంటాడు. ఈపరిశోధకులకూ వీరభద్రరావుగారికీ యేవోకొన్ని తత్కాలంలో అభిప్రాయభేదాలు కలిగినట్టు తెలుస్తుంది. కాని వాటినన్నిటినీ మరచిపోయి వీరభద్రరావుగారి ఆత్మశాంతికొరకైనా వారు శ్రమపడి రచించిన గ్రంథాన్ని సమగ్రంగానూ నిర్దుష్టంగానూ ప్రచురించి తమ కీర్తిని నిల్పుకోమని ప్రార్థిస్తున్నాను. *

---

* ఈ మండలివారు కొన్ని ఉత్సవాలుచేసి కొన్నిసంచికలు ప్రకటించి సాహిత్య చరిత్ర పరిశోధనలకు చాలా దోహదం చేశారు. మొదట రాజరాజనరేంద్రుని పట్టాభిషేకోత్సవం చేసి "రాజరాజనరేంద్ర సంచిక" ప్రకటించారు. ఈ ఉత్సవానికి కట్ట మంచివారధ్యక్షపదవి నధిష్టించారు. తరువాత "కళింగసంచికా, కాకతీయసంచికా" కూడా ప్రకటించారు. కాకతీయమహాసభ వరంగల్లులో జరిగింది. ఈ సందర్భంలో పరిశోధకులలో భిన్నత్వం వచ్చేశింది. పార్టీలైపోయినై. ఈ సభవిషయంలో యీ మండలివారు చాలా శ్రమపడ్డారు. నిజాంకాలేజీ చరిత్రాచార్యులైన సిరుగూరు హనుమంతరావుగా రధ్యక్షతవహించారు. సంచిక ప్రచురించి సేవ చేశారు. కాని యీ సంచిక యెదురుపక్షాం విమర్శనానికి గురైంది. చిలుకూరి వీరభద్రరావుగారూ, డాక్టరు శ్రీనివాసాచార్యులుగారూ దీనిమీద దీర్ఘ విమర్శనలు రచించారు. చిలుకూరివారి "కాకతీయ యుగం" లో యీసంచిక లో రాతలు చాలా తీవ్రవిమర్శనానికొచ్చినై.

శ్రీ లక్ష్మణరావుగారు ఆంధ్రసాహిత్యానికి చేసిన సేవ అపారం. విజ్ఞానసర్వస్వనిర్మాణానికి సంకల్పించాడు. తాను వక్కడే నిర్వహించడానికి సమర్థుడేకాని, వయస్సు మీరుతున్నది. అందుచేత తమ పనిలో సహాయంచేయగల యువకులను యేరాడు. మల్లంపల్లి సోమశేఖరశర్మ, రాయప్రోలు సుబ్బారావుగా ర్లాయనకు కనపడ్డారు. చూడండి ఆయన వివేచనాశక్తి! ఈ యిద్దరుకూడా భావికాలంలో ఆంధ్రాభ్యుదయానికి అత్యంతంగా తోడ్పడ్డ వ్యక్తులు! వీళ్ళల్లో వున్న తేజస్సు ఆయన్ని ఆకర్షించింది. వీళ్ళ యిద్దరిచేత పని చేయిస్తూండేవాడు. విషయావలోడనం, విషయపరీక్ష, విషయవివేచనం, విషయానుకూలపదజాలనిర్మాణం మొదలైన పనులన్నీ తాను సలహాల నిస్తూ వీళ్ళచేత చేయించాడు. మెల్లిగా మొదటి సంపుటం ప్రకటించాడు. దేశంయావత్తు దిగ్భ్రమచెందారు. ఎంత విషయవివేచనం! ఎంత పరిశోధన! తుదకు "అలంకారము" అనే అంశంకింద యీ అల్పజ్ఞుడి పుస్తకంగూడా పేర్కొన్నాడు. అప్పట్లో యీ సంపుటం మీందే అందరికండ్లు పడ్డాయి. ఇంతలో పరమేశ్వరుడికి కండ్లుకుట్టినై! ఈన సహాయం పొంద తగిందికాదీ జాతని ఆయన్ను తన సాన్నిధ్యానికి తీసుకొనిపోయాడు. ఆంధ్రదేశం వక గొప్ప వ్యక్తిని కోల్పోయింది! ధన్యజీవి! ఈ విజ్ఞానసర్వస్వం విశ్వదాతచేతిలో పడ్డది. సోమశేఖరశర్మగారా పనిమీందే వున్నాడు కొన్నాళ్ళు. సుబ్బారావుగారు 1918 సంవత్సరంలోనే తెలంగాణం దోహదంచెయ్యడానికి ఆంధ్రమాత పిల్చింది. వెళ్ళాడు! శర్మగారు వక్కచేతిమీందనే తత్కార్యమంతా చేస్తూండేవారు. మార్పులు గావించాడు. ప్రచురించి నంతవరకు నూతనవిషయాల్ని చేర్చాడు. తరువాత రెండో సంపుటం కూడా ప్రచురించాడు. ఇంతవరకు పూర్తిగా 'అ'కారం అయిందేమో! విశ్వదాతగారికి వక్క పనా! ఒక్క విషయమా! భాష, దేశం, మతం, దగ్గిర్నించీ తోలుబొమ్మలాటదాకా ఆయన కక్కర్లేని విషయం లేదు. వాట్లో సర్వస్వకార్య మొకటి! పోనీ అట్లాగైనా

కొంతవరకు సాగుతుందేమో అంటే! అదీ జరగలేదు. విశ్వదాత కూడా శివైక్యంచెందాడు. సర్వస్వకార్యం ఆటకట్టింది. ఇప్పుడు విశ్వదాతగారి వారసులా! ఇంతకంటె భిన్నవిషయాలమీదకు బుద్ధిపోతున్నది.* ఆంధ్రపత్రిక భారతులు తిన్నగా వెళ్ళదీస్తే చాలనిపిస్తున్నది!

ఈసంస్థవల్ల సాహిత్యానికి అలవడ్డ కొత్తవిషయాలేమిటి అని అడగవచ్చు! అవిరెండుగా కనపడుతున్నై! మొదటిది పరిశోధనా పద్ధతి నెలకొల్పబడడం. పరిశోధనంటే యెట్లావుంటుందో దానికి సరియైన మార్గాలేమిటో వెనకటివాళ్లు సక్రమంగా వదిలిపోలేదు. చారిత్రకుడైన లక్ష్మణరావుగారు యింగ్లీషులో పరిశోధనాన్ని తెలిసివుండడంచేతా, ఆపరిశోధనం మహారాష్ట్రంలోనూ, బెంగాలులోనూ యెట్లా సాగించారో బాగాచూచి వుండడంచేతా, దాన్ని మనభాషలోకి తెచ్చాడు. విషయాలను పౌర్వాపర్యప్రకారం నిర్ణయించడం, విషయాల్లో దేనికెంత ప్రాముఖ్యమియ్యాలో తేల్చడం, తరవ్వాత వాటినన్నిటినీ (? ) — తరకం యేవిధంగా వుపయోగించాలో చెప్పడం మొదలైనవన్నీ భాషలో సక్రమంగా నెలకొల్పినవాడు లక్ష్మణరావుగారు. ♦ అదివరలో శల్యపుంజమై, పాశ్చాత్యులు తమ అవసరంకోసం రాశిన చరిత్రను, పరిశోధనచేసి సత్యానికి దగ్గిరగా తేవడమూ, సారస్వతంలో వక భాగంగావుండడానికి తగినట్టు రచించడమూ యీాన మనకిచ్చినధనం! 19 శతాబ్దంలో చరిత్రను సాహిత్యంలో చేర్చాలా వద్దాఅనే వక ప్రశ్న కల్గింది, యింగ్లీషు సారస్వతచరిత్రలో. కవులంతా వీల్లేదన్నారు. చారిత్రకులంతా చేర్చాలన్నారు. తుదకు మెకాలే, ఫ్రూడు మొద

*1941 సంవత్సరం యేప్రియల్ నెలలో ఫిలింబాలెటు పెట్టి శంభుప్రసాద్ గారు గెలుపొందినవారికి బహుమతు లిచ్చారు. సినిమావ్యామోహమే ఆయన్ని వరించినట్టు కనపడుతుంది.

♦ ఈ పద్ధతులే యిప్పుడు ఆంధ్రచారిత్రకపరిశోధకమండలివారు అనుసరించేవి.

లైనవారు రాశినచరిత్రలను సారస్వతభాగంగా వప్పుకున్నారు. ఆవిధంగానే విజ్ఞానచంద్రికా మండలివారు రచించిన చరిత్రగ్రంథాలన్నీ సాహిత్యాంతర్భూతాలేనని నామనవి. ఆయనరచించిన "వ్యాసావళి", మొదలైనవాటిలో వారి పద్ధతులు చూడవచ్చు. ఇట్టి నిర్దుష్టమై, పరిశోధనాఫలమైన చరిత్రరచనకు మూలపురుషుడు లక్ష్మణరావు గారు.

*ఇక రెండోది శాస్త్రరచనకు పనికొచ్చే పరిభాషాపద జాల నిర్మాణం. మహారాష్ట్రంలో అప్పటికే వ్యవహారకోశం పుట్టి పదజాలం స్థిరపడుతున్నది. ఆపద్ధతినే మన సాహిత్యంలో నెలకొల్పాడు లక్ష్మణరావుగారు. పదార్థవిజ్ఞానశాస్త్రం మొదలైన వాటొక్కొక్క శాస్త్రానికీ, వేర్వేరు పారిభాషికపదాలు కావాలె. ఈ శాస్త్రాలు సంస్కృతభాషలో కొన్నున్నై! వాట్లో కొన్ని పదాలున్నై! కాని యీ శాస్త్రాలు పాశ్చాత్యుల నూతన పరిశోధనలతో అపారంగా పెరిగిపోయినై. అందుచేత వెనకటి పదజాలం చాలదు. అసలు యేపదజాలం వుందో పరిశోధన చెయ్యడం మొదటి పని. ఆ పదజాలంగాక అవసరమైన మిగిలిన పదజాలం

---

* ఇటీవల మద్రాసుగవర్నమెంటువారు, శ్రీ. ఆ శ్రీనివాసశాస్త్రిగారి ఆధిపత్యంకింద వకకమిటీని యిందుకోసం యేర్పాటుచేశారు. వారు కొన్నిసలహాల నిచ్చారు.

"(1) ఇప్పుడు శాస్త్రీయపదాలకు సమానార్థకాలుగా దక్షిణదేశభాషల్లో ఉపయోగించేపదాలు స్థిరమైపోయినై కాబట్టి వాటినే ఉంచడంమంచిది.

(2) దక్షిణదేశభాషలన్నిటిలో అవే ఉపయోగించడానికి వకశాస్త్రీయ శబ్దాలపట్టీని తయారుచెయ్యాలె.

(3) వీల్లేనిస్థలాల్లో యింగ్లీషుపదాలే ఉపయోగించడం మంచిది.

ఈ సూత్రాలననుసరించి ప్రతిభాష కొక ఉపసంఘం యేర్పరచి శబ్దజాలాన్ని తయారుచేయించవలెను." చూశారా యీ సలహాలు కొమర్రాజువారు 30 యేండ్ల కిందటనే ఆచరణలోపెట్టారు!

సృష్టించడం రెండోపని. ఈ రెండుపనులూ కూడా చక్కగా నిర్వహించారు లక్ష్మణరావుగారు. ఇవిగాక వీరు చేసిన మరో మార్పు చాలా గొప్పది. కొన్ని ఇంగ్లీషుపదాలు సామాన్యంగా ప్రజల వాడుకలో వున్నై. అటువంటివాటికోసం మళ్లీ సృష్టి ప్రారంభిస్తే కష్టమేకాకుండా వాడుకలో లేకపోవడంచేత అర్థంకూడా కావు. కాబట్టి అట్టిపదాలకు యింగ్లీషువాటినే వాడటం వీరు నిర్ధారణ చేశారు. ఇది చాలా గొప్పవిషయం. ఈ విధమైన పనిమూలంగా వారు భాషకు మహోపకారం చేసినవాళ్ళల్లో వకరు. వీరి పరిశోధనలవల్ల పూర్వపండితులూ, తెలిశీ తెలియనివాళ్లూ, అనుకునే కొన్ని భావాలు తప్పులని నిర్ధారణైనై! వక ఉదాహరణం. త్రిలింగ శబ్దభవం తెలుగు కాదని లక్ష్మణరావుగారు సకారణంగా రుజువు చేశారు. అట్లాగే త్రినగ శబ్దభవం తెనుగు కాదనీ కూడాను. ఈ విధంగా సత్యపరిశోధనే లక్ష్మణరావుగారి ఆదర్శం. తదనుగుణమైన పదజాల నిర్మాణమూకూడా వారి పరిశ్రమ ఫలమే!

లక్ష్మణరావుగారు చేసిన యింకో గొప్ప పనికూడా స్పృశించడం అవసరం. ఆయన నిజాంరాష్ట్రాంధ్రుడు. అందుచేత తెలంగాణాన్నికూడా విజ్ఞానవంతం చెయ్యడానికి సమకట్టాడు. ఇప్పుడు "శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయ" మనే పేరుతో యేసంస్థైతే హైదరాబాదులో స్థిరంగా పని చేస్తున్నదో, అదికూడా లక్ష్మణరావుగారి ప్రోత్సాహంతో 1–9–1901 లో స్థాపింపబడ్డదే! రావిచెట్టు రంగారావుగారనే దేశముఖు ఉండేవాడు. ఆయన చాలా సారస్వతప్రియుడు. ఆయన సతీమణికూడా దేశసేవాపరాయణ. ఆయనా లక్ష్మణరావుగారూ సంప్రతించి యీ గ్రంథాలయాన్ని స్థాపించారు. ఇదే నైజాంరాష్ట్రిములోకల్లా ప్రాచీనగ్రంథాలయం. తెలంగాణాంధ్రుల సేవ నిరంతరంగా చేస్తున్నది. ఈ స్థాపనసందర్భంలో మాడపాటి హనుమంతరావుగారినికూడా పేర్కొనాలె. ఆయనకూడా

లక్ష్మణరాయసంపర్కం గల్గి పనిచేస్తున్నవాడే. ఆయనకూడా యీ గ్రంథాలయస్థాపనకాలంలో పనిచేసినవాడే. ఇప్పటికీ దానికి బాసటై నిలిచున్నాడు.* హైదరాబాదులో ఆంధ్రసంస్థల్లో యిది అగ్రగణ్యం. తెలంగాణాంధ్రులకూ, ప్రాచ్యాంధ్రులకూ సమ్మేళనస్థలం. ప్రతి సంవత్సర మొక సభచేస్తూ ఉభయులూ కలవటాని కవకాశం కల్పిస్తూ వుంటుంది. దీనితరఫున కృష్ణరాయాదులైన ఆంధ్రసంస్కృతికి మూలపురుషుల కొందరిస్మరణ జరుగుతూవుంటుంది. ఈన్నిగూర్చి, యీన చేసిన పనినిగూర్చీ చెప్పటం చాలించాలశొచ్చిందే అని చాలా విచారంగా ఉంది !

## ఇతర గ్రంథమాలలు :

విజ్ఞానచంద్రికా గ్రంథమాలతోపాటింకా కొన్ని గ్రంథమాలలు లేచినై. బందరులో "ఆంధ్రభాషాభివర్ధనీ గ్రంథమాల", 1908 ప్రాంతములో స్థాపింపబడ్డది. యీ గ్రంథమాలలో కొన్ని గ్రంథాలు ప్రచురింపబడ్డై. వివేకానందస్వామి జీవితం, మొదలైనవి గొప్ప గ్రంథాలే !♦ కాని యీ గ్రంథమాల యెక్కువకాలం పని చెయ్యలేదు. బందరులో వుండే రాజకీయవాతావరణమే దానికి కారణం. రాశేవాళ్ళూ చదివేవాళ్ళూకూడా ఉద్రేకపూరితులై రాజకీయరంగంలో పనిచేయటం వచ్చేటప్పటికి గ్రంథమాల మూలబడ్డది. ఈమాదిరిగా స్థాపించబడ్డ గ్రంథమాలల్లో "ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల" చెప్పదగిందిన్నీ, చాలా భాషాసేవ చేసిందిన్నీ అని

* ఇంకా ఆదిరాజు వీరభద్రరావుగారూ, మునగాలరాజాగారుకూడా యీ స్థాపనకార్యంలో వున్నారని శ్రీ మాడపాటి హనుమంతరావుగా రొక ఉపన్యాసంలో చెప్పగా విన్నాను.

♦ వివేకానందుని పవిత్రవాక్యాలని కంభంపాటి విశ్వనాథంగా రొక గ్రంథం రాశారు. ఇటీవల మైలాపూరు రామకృష్ణాశ్రమంవారు యిటువంటిగ్రంథాలు కొన్ని తెనుగులో రాయించి ప్రకటించారు.

చెప్పాలి. కొప్పర్వారు చంద్రారెడ్డిగారు చచ్చి స్వర్గంలో వున్నాడు. చల్లనివేళ తలుచుకోవలసినవాడు. సారస్వతప్రియుడు; ఉత్సాహవంతుడు. ఆయనకు వెంకటపార్వతీశ్వరకవులు దొరికారు. ఈ జంట కవులు మంచి కవితాపాటవం గలవారు. ఉదాత్తమైన కవిత్వం చెప్ప గల సమర్థులు. ఈ గ్రంథమాల మొదట తణుకులో అయ్యగారి నారాయణమూర్తిగారి సంపాదకత్వంలో స్థాపింపబడి తరువాత నిడదవోలు చంద్రారెడ్డిగారి ఆధిపత్యం కిందికి వచ్చింది. కవులుకూడా అప్పుడు మంచి యౌవనంలో వున్నారు. మంచి వోపికా, పట్టుదలా కలిగివున్నారు. పోషకుడూ, వీళ్లూకూడా రైలుబండి అల్లే నడిపారు గ్రంథమాలను. "వసుమతీ వసంతం" "దుర్గేశనందని" "చతుర చంద్ర హాసం" మొదలైన నవలలు* రైలుబండి పట్టాలమీద బండితర్వాత బండి నడిచినట్లు వకదానివెంబడి వకటి చొప్పున నిరంతరంగా వచ్చాయి. పాఠకులు యెప్పుడు వస్తుందా పోష్టు అని కనిపెట్టుకుని వుండేవాళ్లు. వసుమతీ వసంతం మొదట చదివి మోహితుణ్ణైపోయినా నేను. యేమి వర్ణనలు! యేమి ప్రేమాలాపాలు! యేమి భావశబలతలు! యేమి క్రియాప్రతిక్రియలు! నవల మిక్కిలి రసవంతంగా వుందని తోచింది. ఆ నమూనాలో వక నవల రాశాను కూడాను. నా అదృష్టంచేత ప్రచురించలేదు. దానికో కారణం వుంది. దానికి నేను "లవంగి" అని పేరుపెట్టాను. నేను చదువుకుని మురుస్తూ, నా స్నేహితులకు చదివి వినిపిచ్చి "బాగావుందా" అని వాళ్ళచేత ఉందనిపించుకుంటూ, కొన్ని చోట్ల చిన్నమార్పులుచేసి, మళ్లీ చదువుకుని, యిక ప్రచురిద్దామని అనుకుంటూ వుండగా, "లవంగి" అనే పేరుతో యెవరో వకపుస్తకం ప్రచురించారు. దానితో నాకు నిరుత్సాహమైపోయింది. అందులో రెండు

---

* "నవలారచన; తెలుగు, ఇతరభాషలు"

(ఆంధ్రపత్రిక సారస్వతానుబంధం 26-1-41, 2-2-41)

అధ్యాయాలుమాత్రం ప్రత్యేకంగా ఒకచిన్నకథచేసి 1913—14 సంవత్సరంలో కృష్ణాపత్రికలో "ఒకచిన్నకథ" అనే శీర్షికతో ప్రచురించాను. ఇప్పుడా పత్రిక ప్రతికూడా నాదగ్గర లేదు. ఈ గ్రంథమాలలో నవలలీ దేశంలో రాశినవాళ్ళకందరికి ప్రేరకాలని నానమ్మకం! పెద్దవికాక అనుబంధాలని చిన్నవికూడా ప్రకటితాలైనై. 'లక్షరూపాయలు' మొదలైనవికూడా రసవంతాలుగానే వుండేవి. మొత్తంమీద యీ గ్రంథమాలవారు నవలావాఙ్మయాన్ని చాలా అభివృద్ధిచేశారనక తప్పదు. ఇందులో ప్రచురించినవన్నీ దాదాపు పరివర్తనాలే. ఆ పరివర్తనాలూ యెక్కువగా బంగాళీ, కన్నడభాషలనుంచే! కొన్ని "Les miserables, Faust" వంటివి యింగ్లీషులోనుంచి కూడాను.* స్వతంత్రాలు చాలాతక్కువ. విజ్ఞాన చంద్రికవారు ప్రకటించిన 'విమలాదేవి' ఇత్యాదినవలలకూ, వీటికీ యిదిముఖ్యభేదం. ఈ భేదం సామాన్యమైందికాదు. దాదాపు వీటిలో ముప్పాతికపాలు, అక్కడక్కడా జాతీయభావాలూ ప్రకృతిచిత్రవర్ణనలూవున్నా, శృంగారరసప్రధానాలై తద్రసనిర్వహణంలో ఉపయోగించే సంభాషణలు ప్రేమపూరితాలౌటచేత యీ నవలలు ప్రజలనాకర్షించినై. ఆడవాళ్ళకు, అందులో ఉద్యోగస్తుల భార్యాలకు కాలక్షేపానికి చాలా ఉపకరించినై. వీటిలో యెక్కడో కొన్ని "ప్రమదావనం" మొదలైన ఆంధ్రచరిత్రకు సంబంధించినవున్నై. మొదట మొదట ప్రేమ ప్రధానంగావున్నవల్లా తర్వాత తర్వాత అపరాధపరిశోధకాలుగా మారినై. జిత్తులు! ఎత్తుపై యెత్తులు! ఒక్కొక్కప్పుడు నమ్మడానికివీల్లేని విషయాలు! హఠాత్సమావేశాలూ! ఈ విధంగా యీ రెండురకాల నవలలూ, గతాను

* "Though many of these books published in this series are either translations or adoptations of Bengali or Canarese novals there are a few that claim to be original and the present book is one of them;"
(మాతృమందిరం పీఠికలో కొమర్రాజు లక్ష్మణరావుగారు).

గతికా లైపోయినై! వీటినిచూచి ఆంధ్రదేశంలో అన్ని మూలలా నవలాకారులు బయలుదేరారు. హాత్యలేకుండా నవలే లేదనిపిచ్చింది కొన్నాళ్లు.* రైళ్ళల్లో అమ్ముతూండేవాళ్లు! పైన "వెల ఎనిమిదణాలు"ండటం, అణా కిచ్చిపోవటం! పిల్లలు పెద్దలు, ఆడవాళ్లు మొగవాళ్లు భేదం లేకుండా వీటిని కొనటం! ప్రతివాళ్ళ యిళ్ళల్లో యివే! చిత్రవిచిత్రాలై ఆకర్షించేపేర్లు! అవెంత ఆశ్చర్య కరంగా వుంటే అంత ఖర్చు! తుద కీ నవలావాఙ్మయం చెత్తకిందికి దిగింది. చంద్రారెడ్డిగారు కొన్ని సంవత్సరాలకు కీర్తిశేషుడైనాడు. గ్రంథమాలకూడా విజ్ఞానచంద్రికల్లే ప్రచ్ఛన్నంగా వుందని నాఊహ. కొన్నాళ్ళు రాజమహేంద్రవరంలో లక్ష్మీపుత్రుడై, సారస్వతప్రియు డైన అద్దేపల్లి లక్ష్మణస్వామిగారిచేతుల్లో ఉంది.♦ కాని వాళ్ళల్లో వాళ్ళకు మళ్ళీ విడిపోయింది. రామకృష్ణ కవులలో వెంకట్రామశాస్త్రి గారు పిఠాపురంలో వక ఆస్థానకవీశ్వరుడుగా వుండేవాడు. పర మపదించి ఆంధ్రభారతికి తీరని లోటు కల్గించాడు. వారి ప్రోత్సాహంచేత యీ గ్రంథమాల మళ్ళీ కొంచెం విజ్ఞాన చంద్రికల్లేనే తలెత్తింది. కాకినాడ కార్యస్థానమైంది. కొన్నిగ్రంథాలు కూడా ప్రచురణమైనై. ఈ మధ్య మళ్ళీ కనపడటంలేదు. కాని యీ "మాల"వారు ఆంధ్రభాషకు నవలాప్రచురణంమూలంగా అమోఘ మైనసేవ చేశారు. తెనుగులో వున్న నవలల్లో ముప్పాతికవంతు వీరి ప్రచురణాలే. వీరిద్దరు కవులుకూడా ప్రతిభాశాలులే. ఈ జంట కవులు వెనకటి సంప్రదాయంలో భాష రాశినప్పటికీ విసుగు లేకుండా నూతనభావాలతో గీతావళి రాయటంలో చాలాసమర్థులు.

---

*ఈ యుగానికి వీరే (వెంకటపార్వతీశ్వర కవులు) కవులనికూడా కొంద న్నారు (ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహం).

♦ "*We have to congratulate the organisers of this series and their noble patron M. R. Ry. Addepalli Lakshmanaswamy Naidu Garu,......*"

(*Ibid*)

వీరి 'ఏకాంతసేవ' చాలా భావగుంభితంగా వుంటుంది. వీరి కవిత్వంలో వున్న వక విశేష మేమిటంటే పద్యపాదాలూ, భావమూకూడా కొండవీటి చాంతాడల్లె చాలా పొడుగ్గా వుంటై. భావంలో పౌనః పున్య ముంటుంది.* నవలల్లో వర్ణనలుకూడా చాలా పొడుగు. ఎంత రాశినా తనివి లేదు. ప్రమదావనం చూడండి! కథ చాల చిన్నది! పుస్తకం 400 పేజీలు! ఎందుచేత! ముప్పాతికకుపైగా వర్ణనలే! కేవల దృశ్యాలవర్ణనలే కాదు. చిత్తవృత్తులయొక్క, మన స్తత్వంయొక్కా, విషయాలయొక్కా, విషయసాంకర్యంయొక్కా వర్ణనలు సన్నివేశాలయొక్క వర్ణనలుకూడాను. హృదయంగమంగానే వుంటైకాని తీపికూడా యెంత తినగలం? భావవృత్తవైవిధ్యం పఠన ప్రేరకం! ఈ లోపం యిటీవల రాశిన నవ్యకావ్యాలకన్నిటికీ వున్న లోపమే! కాని, అదే గేయమైతే కొంతవర కా లోపం కనిపించదు. బాలనాగమ్మకథా, బొబ్బిలికథా చూడండి!

ఆకాలంలోనే పిఠాపురం దగ్గర చిత్రాడలో చెలికాని లచ్చా రావుగా రుండేవారు.♦ ఆయన దగ్గర ఆస్థానకవి వంగూరు సుబ్బా రావుగారు! వంగూరంటే సామాన్యుడుకాడు! ఆంధ్ర సారస్వతో త్సాహం ఆయన కున్నంత నా అనుభవంలో నే నెవ్వరిదగ్గర చూడ లేదు. ఆయన ప్రేరణంచేత "రామవిలాస గ్రంథమాల" వకటి స్థాపితమైంది. అప్పటి యుగధర్మం నవలారచన. ఈమాలలో కూడా కొన్ని యెన్నతగ్గ నవలలు ప్రచురింపబడ్డై. వంగూరి సుబ్బారావుగారి "ప్రభాతం" ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన నవల. ఈ సుబ్బారావు

* ఒకే భావం అనేక విధాలుగా చెప్పడముంటుంది.

♦ కొన్నాళ్ళు చిత్రాడ సారస్వతకేంద్రాల్లో వకటిగా వుండేది. లచ్చారావు గారు గొప్ప భాషాసేవకుడు, పోషకుడూను. కవులు, పండితులు అనేకమం దీన పోష ణలో వుండేవారు. ప్రతి సంవత్సరం కవిసమ్మేళనాలను జరిపేవాడు. చాలా ఉత్సాహ వంతుడు.

గారు కొన్ని చిన్నకథలే గాకుండా "ఆంధ్రవాఙ్మయచరిత్ర" వకటి రచించాడు.* ఈనకు ఆంధ్రాభిమానం చాలా యెక్కువ. ఈనా, తల్లాప్రగడ సూర్యనారాయణగారూ, భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి గారూ, నేనూ 1909 ప్రాంతంలో పూనాలో జరిగిన "ప్రథమ ఓరియంటల్ కాన్ఫరెన్సు"కు పోయినాం. మాకు ఫెర్గూసన్ కాలేజీహాస్టలుబస

*ఆంధ్రపరిశోధకమహామండలని వకటి స్థాపించి తత్పక్షాన ప్రచురించాడీ పుస్తకము. ఇది వక నూతనంగా నూతనపద్ధతులమీద రచించాలని ఉద్దేశించాడు. మళ్ళీ కట్టమంచివారు దీనికి పీఠిక రచించారు. ఆ కాలంలో నూతనత్వానికీ కట్టమంచివారికీ అవినాభావసంబంధం. చూడండి యేమంటున్నారో యీ గ్రంథాన్నిగూర్చి. "కవుల జీవితములుమాత్రము పరిశీలించినచో భాషాసమిష్టియొక్క చరిత్రము చక్కగా వేద్యము కానేరదు. వ్యష్టికన్న మొత్తముమీద సమిష్టిప్రధానము. వాఙ్మయసర్వస్వము యేకవస్తుగాగొని చరిత్రశోధనము చేసినవారిలో వంగూరు సుబ్బారావుగారు ప్రథములు. ఈ చరిత్రలోని విషయము లితరగ్రంథములలో గన్పట్టినప్పటికిని, కర్తగారిదృష్టియు నవి కూర్చబడినతీరును వేరు. దీనికి మార్గదర్శకములైన గ్రంథములు పాశ్చాత్యభాషలలో వేనవే లున్నవి. మనభాషయందు నాకవి యగోచరములు." రెడ్డిగారి సర్వదృక్పథమూ, సుబ్బారావుగారి గ్రంథగుణదోషాలూ పైవాక్యాల్లో ఉన్నై. నిజమైన వాఙ్మయ చరిత్ర రాయాలని సుబ్బారావుగారి ప్రయత్నమూ, కాని యితరులు చెప్పిన విషయాలనే సమష్టి దృష్టితో చెప్పడమూ, తనదృష్టి పాశ్చాత్యగ్రంథాలమీదే వుండడమూ, మన కట్టివి లేకపోవడమూ, మొదలైన వీరి అభిప్రాయాలు యీ వాక్యాల్లో ఉన్నవి. సుబ్బారావుగారి గ్రంథంమాత్రం నూతనదృక్పథంతో వున్నా, సంపూర్ణంగాగాని, చాలావరకు గాని మన అవసరాన్ని నిర్వర్తింపలేదనీ, పట్టిచూస్తే మరోచోటికి వెళ్ళకుండా తీసుకోదగిన అభిప్రాయాలు లేవనీ, కాని ఆయన చేసిన పనికిమాత్రం మనం ఆయనకు కృతజ్ఞులమై ఉండాలశిందేననీ, నా మనవి. "ముఖ్యవిషయానికి అప్రస్తుతాలైన ప్రసంగాలనేకా లిందులో వున్నై! ఆంధ్రవాఙ్మయంయొక్క విశిష్టగుణా లేమిటి అంటే దీనివల్ల తెలుసుకోటానికి వీల్లేదు. అంతేగాక 1914 సంవత్సరంలో ప్రచురించిన రెడ్డిగారి "కవిత్వతత్వవిచారం"లో చెప్పిన కొన్నివిషయాలయొక్కా పద్ధతియొక్కా ప్రతిధ్వను లిందులో ఉన్నై! రెడ్డిగారి కీగ్రంథం ఆదరపాత్రం కావడానికి కిదిగూడా వక కారణం. "శతకకవులచరిత్ర" కూడా రాశాడు సుబ్బారావుగారు.

కిచ్చారు. డాక్టరు గుణేగారొచ్చి మాకు బస వగైరాలుచూపి సహాయం చేశారు. ఆ భవనంలో కొంతభాగం "మద్రాసు ప్రతినిధులు" అనే శీర్షికతో మద్రాసువారికీ మాకూ కలిపి ప్రత్యేకించారు. అది సుబ్బారావుగారికి కంటకమైంది. గుణేగారిని పిల్చి సగంవచ్చిన యింగ్లీషులో "మాకు మద్రాసువా రనిపిచ్చుకోటం సిగ్గు! మేము ఆంధ్రులం! ఆంధ్రప్రతినిధు లని వేరే బల్లకట్టిందాకా మేము ఆ గదుల్లో ప్రవేశించం" అని గట్టిగా చెప్పాడు. ఆయనప్పుడు మార్పించి తెప్పించి కట్టింతర్వాత మేమా భవనంలో ప్రవేశించాం. చూశారా యెంతపట్టుదలో? ఆయనకు ఆంధ్రదేశసేవ చెయ్యటానికి భగవంతు డాయుర్భాగ్య మియ్యలేదు. దివంగతులై దేవచరిత్ర రాస్తున్నాడు. పొడుగాటి కాయం, హస్తభ్రమణాలతో కూడిన మాటలు, గోదావరి జిల్లా ఉచ్చారణ, శరపరంపరగా వచ్చే సంభాషణ, నా కిప్పటికీ హృదయంలో చిత్రితాలైపోయినై!*

కొన్ని సంవత్సరాల తర్వాత అద్దేపల్లి లక్ష్మణస్వామిగారు రాజమహేంద్రవరంలో 'సరస్వతీ పవర్ ప్రెస్' అనే వక చక్కని ముద్రాశాల పెట్టి వక గ్రంథమండలి స్థాపించారు. దానిపేరు "సరస్వతీ గ్రంథమండలి" దాని వుద్దేశ్యంకూడా నవలాప్రచురణమే! దాని పక్షానకూడా కొన్ని నవలలు ప్రచురించబడ్డై. తల్లావఝుల వంటి మహామహులుకూడా యీ మండలిలో నవలలు రాశారు. ఈన యీ మాలకు కొన్నాళ్లు సంపాదకుడుగావున్నాడు. వీటిలోకూడా చాలాభాగం పరివర్తనాలే అనాలిశొస్తున్నది. ఈ గ్రంథమండలీకూడా ప్రచారిణీగమనాన్నే అనుకరించింది. ఈ లక్ష్మణస్వామిగారికి సారస్వత సేవకంటె వర్తకం ముఖ్యోద్దేశం. కాబట్టి ఈ గ్రంథమండలి ప్రచుర

* "వేగుచుక్క గ్రంథమాల" వకటి బరంపురంలో స్థాపితమైంది. తాపీ ధర్మారావుగారు సంపాదకుడు. ఈ మాలకూడా కొన్ని నవలలు ప్రచురించారు.

ణాలను తరుచు చూస్తూ వుంటాము. ఈవిధంగా ఆకాలంలో అనేక గ్రంథమాలలు స్థాపితాలైనై కుక్కగొడుగులల్లే! మళ్ళీ వచ్చే వానకు నశించినై! బొత్తుగా వీటిని నీరసంగా చూడకూడదు. నవలాప్రచురణంలో యీ గ్రంథమాలలు చాలా కృషిచేసి మొత్తం మీద సారస్వతసేవ చేసినయ్యనే చెప్పాలె! కొన్ని సంవత్సరాల నించీ విశ్వదాతగారు "ఆంధ్రగ్రంథమాల" అని స్థాపించి కొన్ని గొప్ప గ్రంథాలు ప్రచురించారు. దీనికీ వెనకటి గ్రంథమాలలకూ చాలా భేదం. ఇది వర్తకపద్ధతిమీద స్థాపితం. వెనకటివి జనాదరణంమీద ఆధారపడి స్థాపించినవి. ఈ గ్రంథమాలలోకూడా "పండితారాధ్య చరిత్ర", "బసవపురాణం" వంటి గొప్ప గ్రంథాలు ప్రచురితాలైనై.

ఆంధ్రపత్రిక దినపత్రిక అయింది :

ఇంటినించి పైబట్టతో బొంబాయిపోయి లక్ష్మిని జుట్టట్టుకుని లాక్కొచ్చి యింట్లోఉంచుకున్నవాడు కాశీనాథుని నాగేశ్వరరావు గారు. ఈన మేనమామ రెంటాల వెంకటసుబ్బారావుగారుకూడా యిటువంటివారే! విశ్వదాతగారు మొదట బొంబాయిలో మామ గారివద్ద నేర్చుకున్న వైద్యక్రియలను తయారుచేస్తూ "విలియంకం పెనీ" అనేపేరుతో మందులవర్తకం మొదలెట్టారు. ఈ విలియంకంపెనీ వారి "తామరమందు" చాలా ప్రసిద్ధికెక్కింది. ఆ మందుద్వారా విశ్వదాతగారికి "లక్ష్మితామర" వ్యాపించడం మొదలెట్టింది. క్రమంగా ద్రవ్యవంతుడైనాడు. మొదట్నించీ లేనిదినాల్లోకూడా యీన హృదయం చాలా ఉదారమైంది. ఈన బొంబాయిలో వున్నకాలంలో మనవాళ్లెవరు బొంబాయిపోయినా వీరిల్లేబస. ఒకసత్రంలాగుండేది. "త్యాగాయభోగాయచ" అన్నట్టు రెండూకూడా చేశాడు మహాను భావుడు! ఇప్పటికీ ఆ తామరమందు వస్తూనేఉంది. ఆ "విలియం

కంపెనీ" ప్రచారంకోసం "ఆంధ్రపత్రిక" పుట్టింది. మొదటమొదట ప్రకటనలూ, మందులనుగురించిన పాటలూను! క్రమంగా అది వార పత్రికైంది. కాని అంత యెక్కువగా ప్రచారంలోకిరాలేదు. చందాదారులుమాత్రం కొంతమందుండేవారు. ఈ పత్రికకయ్యే ఖర్చంతా మందులదుకాణం భరించేది. ఇట్లా వర్తకమూ పత్రికా ఆస్తిగా బొంబాయిలో చక్కగా కాలక్షేపంచేస్తున్నాడు విశ్వదాత.

ఈ దినాల్లో ఆంధ్రోద్యమం వచ్చింది. ఉద్యమ ప్రచారం కోసం వక తెనుగు దినపత్రికా, వక ఆంగ్ల దినపత్రికా ఉండాలని మద్రాసులోని ఆంధ్రమహామహు లంతా నిశ్చయించారు.* ద్రవ్యం యెట్లా అనే చర్చవచ్చింది. లిమిటెడ్ కంపెనీ పెడదామని తేల్చుకున్నారు హేమాహేమీలు. షేరు నూరురూపాయ లన్నారు. నేను కొన్ని షేర్లు తీసుకుంటానని గంభీరంగా పలికారు బయ్యా నరసింహేశ్వరశర్మగారు ప్రథమాంధ్రమహాసభాధ్యక్షుడు! అక్కడినుంచి వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, కవుతా సూర్యనారాయణగారు, గంటి వెంకట్రామయ్యగారు, చేరి నారాయణమూర్తిగారు, న్యాపతి సుబ్బారావుగారు, భూపతిరాజు వెంకటపతిరాజుగారు, ముట్నూరు ఆదినారాయణయ్యగారు, టంగుటూరి ప్రకాశంగారు మొదలైన వారూ యింకా చెన్నపట్నంలో ఉండే ఆంధ్రవైశ్యులూ కలిసి షేర్లు వేయించడానికి బయలుదేరారు. నేను రెండంటే నేను నాల్గంటూ పడ్డాయి. కాని వక్క దినపత్రికను సాగించడమంటె యెంతకావాలో వీళ్ళకేం తెలుసు? ఉపన్యాసా లియ్యమంటే బల్లలుపగల గొట్టడానికి సమర్థులే! వక్కమాటు హిందూ, మద్రాసుమెయిలు పత్రికల కార్యస్థానాలకు వెళ్ళిచూస్తే తెలుస్తుంది. అధమం రెండు

* అప్పట్లో "ఆంధ్రప్రకాశిక," "శశిలేఖ" మొదలైన చిల్లర వారపత్రిక లుండేవి. పార్థసారథినాయుడుగా రని వకాయన, చాలా వృద్ధుడు, పలుకుబడికల ఆంధ్రుడు ఆంధ్రప్రకాశికకు సంపాదకుడుగా వుండేవాడు.

లక్షలరూపాయ లుంటేనేగాని సాగుతుందా! కాళ్లు చల్లబడ్డై. ఈ సంగతంతా కనిపెడుతూకూచున్నాడు నాగేశ్వరరావుగారు.

అప్పటికే "అమృతాంజన" ప్రకరణం యెట్లా యెవరి దగ్గర్నించి తెలుసుకున్నాడో తయారుచేసి అమ్మటం మొదలెట్టాడు. దాని ప్రచారం "ఆంధ్రపత్రిక" వారసంచికద్వారా జరుగుతూవుంది. "అమృతాంజనం డిపో" వెలిశింది. దాని కొక బ్రాంచి మద్రాసులో స్థాపించాడు. క్రమక్రమంగా యీ "అమృతాంజనం అమ్మక మెక్కువైంది. అది ఒక గొప్ప ఆదాయవిషయమైంది. ఈ సందర్భంలో మద్రాసుకు తరుచు రావలశొస్తూండేది నాగేశ్వరరావుగారు. బొంబాయిలో వకకాలూ మద్రాసులో వకకాలూ అయింది. తెనుగు పత్రిక బొంబాయిలో వుండటంకంటె మద్రాసులోవుంటే తెలుగుదేశ ప్రచారం బాగా జరుగుతుందని నిశ్చయించి బొంబాయినించి పత్రికను మద్రాసుకు మార్చాడు. అప్పటినుంచి 'ఆంధ్రపత్రిక' వారసంచిక మద్రాసునుంచీ వస్తూండేది. ఈ స్థితిలో మనవాళ్ళంతా దినపత్రికకోసం ప్రయత్నిస్తున్నారు. అప్పుడే నాగేశ్వరరావుగారి బస కూడా చెన్నపట్నానికి మార్చి యిక్కడ యెక్కువగా వుంటూ అప్పుడప్పుడూ వర్తకరీత్యా బొంబాయివెళ్లటం మొదలెట్టాడు. మద్రాసే వారికి స్థావరమైంది. పట్టాభిగారంటే విశ్వదాతగారికి మొదట్నించీ చాలా ఆదరం. పట్టాభిగారితో సలహాచేశారు. ఇద్దరూ కృష్ణాజిల్లా వాళ్లే! పట్టాభిగారు సలహాయియ్యడంలో చాలా సమర్థుడు. తగాదాలు పరిష్కారం చెయ్యటంలోకూడా దిట్ట! ఇప్పటికీ ఆయన వకీలు కాకపోయినా, అనేక ఆస్తిపంపిణీ తగాదాలనూ, మనోవర్తి తగాదాలనూ, వర్తకతగాదాలనూ పరిష్కరిస్తూనే వుంటాడు బందరులో! నాగేశ్వరరావుగారిని తప్పక పత్రిక సంగతి చూడమని ఆయన సలహా యిచ్చాడు. ఇప్పటి పరిస్థితులు వకక్కమాటు గమనిస్తే అప్పటి యీ సలహా ఆంధ్రదేశాని కెంత ఉపకారమైందో

ఆశ్చర్యమౌతుంది! విశ్వదాత ఉండే అదృష్టం పట్టాలకుంది మద్రాసుకు! వెంటనే పట్టాభిగారి సలహాను విన్నారు. ఇప్పుడే భవనంలో అయితే "ఆంధ్రపత్రిక" వుందో ఆభవనాన్ని పట్టాభిగారివద్ద అప్పుతీసుకొని కొన్నాడంటారు! అదే అయిశ్వర్యం యెక్కువకావడానికిపునాది. "స్థలభోగం" సాగింది. విశ్వదాత పట్టిందల్లా బంగారమైంది. ఆయన జీవితమంతా ఆంధ్రసంస్కృతియొక్క సర్వతోముఖ సేవతో ధన్యమైంది. ఆంధ్రజాతికి మితిలేని ఉపకారమైంది. ఆంధ్రచరిత్రలో శాశ్వతమైనా, ఉన్నతమైనా, స్థానమేర్పరుచుకున్నాడు విశ్వదాత!

ఒకనాడు సాయంకాలం అకస్మాత్తుగా దినపత్రిక ప్రచురణమైంది. పట్నంపట్నం నిర్ఘాంతపోయింది. ఆంధ్రప్రముఖులంతా కలిసి యెన్నిదినాలనించో ఆలోచించి, చేయలేనిపని వకవ్యక్తిచేశాడు! పెద్దలంతా పాపం విశ్వదాతయెడల సానుభూతిని కనపర్చారు. "అయ్యో! చెడిపోతావు! ఆర్జించిందికాస్తా దండగపెట్టాలశొస్తుందని" భయపెట్టారు. "ఇప్పటికైనా పత్రికను లిమిటెట్ సంస్థచెయ్యమని" బ్రతిమాలారు! "తమప్రతిష్ఠకు భంగమొచ్చెనే! ఇంతవాళ్ళము! ఇంతపేరుగలవాళ్లము, మనముండగా బొంబాయినించి వక అపరిచితవ్యక్తి తమకడ్డంవచ్చాడే!" అని వీళ్ళవిచారం! ఆయన యెంతమాత్రం వినలేదు. ఆయనదోవే ఆయనది. పట్టాభిగారివాక్యం వేదవాక్యమైపోయింది. విశ్వదాతగారికీర్తి వ్యాపించటం ప్రారంభించింది. దేవుడుకూడా సహాయంచేశాడు. 1914 సంవత్సరంలో యుద్ధమొచ్చింది. దేశమంతటా వార్తలయం దభిలాష హెచ్చింది. ఆంధ్రపత్రిక దేశం మూలమూలకూ వ్యాపించింది. పత్రికాపాఠకుల సంఖ్య హెచ్చింది. భోజనంతోపాటు పత్రిక అవసరమైపోయింది. విశ్వదాతగారి అదృష్టంపండింది. అమృతాంజనంకూడా విరివిగా ఖర్చుకావడం తటస్థించింది. అమృతాంజనాదాయం యెక్కువైనకొద్దీ ఆంధ్రపత్రిక సైజు పెరగటం మొదలెట్టింది. ఎంత ప్రచారమెక్కువైనా-లోకంలో

ప్రతీతి, "దీనినష్టం అమృతాంజనం పూడుస్తున్నదనే!" వారపత్రిక వదిలిపెట్టలేదు. అదికూడా కొందరికి అవసరం తీరుస్తూనేఉంది. వారానికోమారు సారస్వతానుబంధమొచ్చేది. కొన్నాళ్లీ సారస్వతానుబంధంలో సాక్షి ఉపన్యాసాలొస్తూండేవి. ఇదీ అదీ అన్నీకలిసి ఆంధ్రపత్రికను స్థాయిగాచేసినై. కొన్నాళ్లు గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు సంపాదకులుగావున్నాడు. చాలా సమర్థతతో నిర్వహించాడు. తర్వాత చల్లా శేషగిరిరావుగారొచ్చాడు. సంపాదకీయ వర్గంలో కొడాలి శివరామకృష్ణరావు వెదురుమూడి శేషగిరిరావు వగైరా లుండేవారు. పత్రిక జాజ్వల్యమానంగా వెలిగిపోయింది. విశ్వదాతగారికి ధనార్జనతోపాటు, వదాన్యతా, దానితో కీర్తి పలుకుబడీ హెచ్చిపోయింది. ప్రచురణలోనూ, వార్తల్లోనూ, అచ్చులోనూ, పనితనంలోనూ చాలా అభివృద్ధి కలగజేశారు. అమృతాంజనం డిపో, పత్రికాకూడా వకటి స్థలానికే వచ్చినై! ఎప్పుడూ యీగలు ముశిరేటట్టు పని! విశ్వదాతగారిల్లూ, ఆంధ్రపత్రికా కార్యాలయమూకూడా చెన్నపట్నంలో ఆంధ్రులకు కేంద్రాలైపోయినై. ప్రతి ఉద్యమానికీ విశ్వదాత మూలపురుషుడైనాడు. కాంగ్రెసు క్రమంగా బలవంతమైనకొద్దీ విశ్వదాతగారికీర్తీ, ఆంధ్రపత్రికప్రచారమూ, మిన్ను ముట్టిపోవటం ప్రారంభించింది. పత్రిక కార్యాలయం యిల్లుచాలక పెంచటం కూడా తటస్థించింది. ఈవిధంగా ఆంధ్రపత్రిక తన విధిని నిర్వర్తించింది. భాష, సారస్వతం, రాష్ట్రం, అన్నీకూడా ఆంధ్రపత్రిక ప్రచారానికి విషయాలైనై! ఎంతకాలంనించో పలవరిస్తున్న కార్యం వకటి వ్యక్తి తన స్వశక్తిమీద మోశాడు. విశ్వదాత యొకటి శాశ్వతకీర్తి కింకేమి కావాలె?* క్రమంగా దుర్గావిలాసం, మర్గాకళామందిరం, గ్రామాలుకొనటం, కుమార్తె పెండ్లి దేవేంద్ర

* యుద్ధం తర్వాత సహాయనిరాకరణోద్యమం వచ్చి యింకా పత్రికకార్యాలను విస్తృతాలను చేశినై.

వైభవంతో చెయ్యడం, అన్నీ తటస్థించినై. కాని ఆయన ఆరోగ్యం, ఆహారం చాలా సున్నితాలైపోయినై. పండూ, మజ్జిగా తప్ప ఆహారం యితరం లేదు. దానానికి అంతులేదు. చేతికి నరంలేదు! పోషణకు మితిలేదు! పైన బట్టతో వెళ్ళినవాడు రెండులక్షల రూపాయలు ఖరీదుచేసే (శ్రీ)భాగ్ నివాసైనాడు. ఆంధ్రదేశం భాగ్యం పండింది. ఆయన ఐశ్వర్యం పెరిగినకొద్దీ దేశసేవే ఫలం. ఆయన సహాయం కాస్తో కూస్తో పొందని సంస్థ లేదు. ఆయన దానానికి విచక్షణ లేదు. మంచిశైలి రాయగల ప్రాయసకాడు.* దైవభక్తి పాపభీతి మెండు. ఔదార్యాని కవధిలేదు. ప్రశాంతమైన ముఖం, తేజోవంతాలైన దృష్టు, మెత్తని జిహ్వా, మరపుకురాదు. భారతి స్థాపించకపూర్వం ఆంధ్రపత్రిక సమస్త సారస్వతసేవ చేస్తూవుండేది. పద్యాలు, వ్యాసాలు, కథలు, యితరవిషయాలు, అన్నిటికీ అదేస్థానం. ఆంధ్ర దేశంలోకల్లా అప్పటికీ ఇప్పటికీకూడా రెండే పత్రికలు. ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక. పాపం గోదావరీనదిపేర కూడా వక పత్రిక స్థాపించారు గాని దానికి సందుగొట్టింది. ఆంధ్రదేశం, దాన్లో మధ్య కృష్ణానది! ఈ రెండుపేర్లు రెండు పత్రికలతో శాశ్వతమైపోయినై! ఏమి విశ్వదాత! కీర్తికాయుడైనాడు! వారసులకు దేశసేవ చెయ్యడానికీ తా మనుభవించడానికీ సంపూర్ణావకాశాలు కలుగజేసి పోయినాడు. స్వర్గం నించి తమ కార్యాలు నిర్విఘ్నంగా జరగడం చూస్తూవున్నాడు.

ఇంగ్లీషులోకూడా దినపత్రిక అవసరమే! అందరూ ఆందోళన పడుతూనేవున్నారు. ప్రకాశంగారు స్వరాజ్యపత్రిక స్థాపించి తాను మునిగాడు. వ్యవహారజ్ఞానం చాలా వుండాలె పత్రికానిర్వహణానకి.

* నేను రచించిన "తంజావూ రాంధ్రనాయకరాజ చరిత్రను" తమరు ప్రకటించి దానికి తాము స్వహస్తాలతో తొలిపలుకు రచించి నన్ను గౌరవించారు. వారికీ వారి శ్యాలకులగు రామచంద్రరావుగారికీ అప్పటి భారతీ సంపాదకులు గన్నవరపు సుబ్బరామయ్యగారికీ మిక్కిలి కృతజ్ఞుడను.

ప్రకాశంగారు విశ్వదాత అవుతాడా యెప్పటికైనా? విజ్ఞానం, దేశ భక్తి, వదాన్యత, సేవాచికీర్ష, ఉన్నా, గొప్ప త్యాగినా అదృష్టంకూడా కలిస్తేనేగాని ఉద్దేశితకార్యం సఫలంకాదు. అదివరలో వ్యాపిస్తున్న పత్రికావాఙ్మయానికి దోహదమిచ్చిందాంధ్రపత్రిక. ఏతత్ స్థాపనతో దేశీయప్రజలలో విజ్ఞానం పెరిగింది. పఠనేచ్ఛ హెచ్చింది. వివేచనా జ్ఞానంకలిగింది. అన్నిటికంటె యెక్కువగా భాషలో వకవిధమైన సౌల భ్యం కలిగింది. శైలిలో మార్పు కలిగింది వార్తావాఙ్మయభాషవకటి స్థిరమైపోయింది. అది సర్వజనాదరణీయమైంది. కొన్ని మాటలు అసలుఅర్థాలు వేరే అయినా, కొన్ని అర్థాల్లో రూఢమైపోయినై. ఇప్పుడవి తప్పనడానికి యెంతమాత్రం వీలులేదు. "పరిస్థితులు", "వాతావరణం" "విశాలవిశ్వమానవజాతి" మొదలైన చాలామాటలు అక్షరాస్యులు కానివారికీకూడా అర్థమయ్యేటంత సులభాలైనై! ఇంగ్లీషువాఙ్మయచరిత్ర చదివితే 18 శతాబ్దంనించీ పత్రికలు వాఙ్మ యాభివృద్ధిలో చాలా పాల్గొన్నట్టు కనపడుతుంది. ఒకొక్క పత్రిక కృతులను విమర్శిస్తూవుంటే కవులు గజగజ వణికేవారు. తాను రాశిన కావ్యాన్నిగూర్చి "యెడింబరో రివ్యూ" అనే పత్రికలో చేసిన విమర్శనాన్ని చూచి గుండెలు పగిలి చచ్చాడు కీట్సుమహాకవి! చూచారా పత్రికల పలుకుబడి! మనదేశంలోకూడా వాఙ్మయ ప్రచారానికి పత్రికలు చాలా తోడ్పడుతున్నై. ఆ విధంగా వాఙ్మయం చాలా అభివృద్ధి అయింది. అవుతున్నది. భారతీ కృష్ణాపత్రికలు మొదలైనవి నవ్యసాహిత్యానికిగనక ప్రోత్సాహ మియ్యకపోతే అది యింత అభివృద్ధికి వచ్చేదికాదు. అసలు నవ్యసాహిత్యవిశారదులు ప్రచారంకోసం పెట్టిన పత్రికలన్నీ మఖలో పుట్టి పుబ్బలో ఆరిపో యినై. వెనకటి సారస్వతాన్ని కలుపుకొని పోతూవుండాలెగాని దాన్ని బొత్తుగా విడవకూడదు. అట్లా విడవకుండా ప్రోత్సాహ

మిచ్చినై కాబట్టే యీ పత్రిక లున్నై ! అట్లా చెయ్యలేదు కాబట్టి అవి అంతరించినై ! మిగిలినవాటి కేంగాని, సాహితి అంతరించటం చాలా శోచనీయం ! సంప్రదాయం మరవకుండా, తల్లిదండ్రులను గౌరవిస్తూన్న వాళ్ళదే నిజమైన అభివృద్ధి. అట్లాగాక పుటక మరిచిపొయ్యే అభివృద్ధి తాత్కాలికమై, పతనహేతు వౌతుంది. ఈ సంగతి మరవవద్దని మన యువకులకు నా హెచ్చరిక ! ఆంధ్రపత్రికస్థాపనోదంతం, దాని సేవ యిది !

# నవ్యాంధ్ర సాహిత్యవీధులు

## ౭

### యువజనమందు భావపరివర్తనము :

*1912 సంవత్సరంనాటికి పూర్వమే మెట్రిక్యులేషన్ పోయి

---

* నవ్యసాహిత్యనిర్వచనం పెద్ద లెట్లా చేశారో వెనక విశ్వనాధవారి రాతలూ, శ్రీ ఆదినారాయణశాస్త్రిగారి రాతలూ యెత్తి చూపించాను. ఈకింది వాక్యాలు కూడా చూడండి :

"ఆంగ్లభాషద్వారా మనవారి (కులపతులూ తల్లిదండ్రులూ) అనుమతితో మనం అనుభవానికి తెచ్చుకున్న స్వదేశీయ విదేశీయ చరిత్రజ్ఞానమూ, మన విద్యాలయాల్లో మన అధ్యాపకులు బోధించి మన మనస్సున కెక్కించిన విదేశీయసారస్వతాలూ, అందలి కళాసంపదా, కవిత్వశోభా, సాంఘికవ్యవస్థలూ, ఉన్నతసాధనాలూ, ఆత్మజాత్యభిమానమూ, మాతృభాషాప్రీతి, ఇత్యాదులన్నీ కలిసి, మనవేషంలో, భాషలో, మాటలో పంతిలో, ఆచారంలో, వ్యవహారంలో, ఒకటేమిటి, అన్ని విషయాల్లోనూ, ఇంతవీ ఇంతవీ అనికూడా చెప్పడానికి సాధ్యంకానిమార్పులు తెచ్చిపెట్టినవి. ఈ మార్పులు మాత్రమేగాక, ఇంకా ఖండఖండాంతరాల్లోనివి, క్షణానికి వేలకొద్దీ మైళ్ళవేగంతో అభివృద్ధిపొందిన విజ్ఞానాన్నిగురించిన వార్తలు, మన కెప్పటికప్పుడు తెచ్చి గుమ్మంలో పనిపించే దినపత్రికలూ, వారపత్రికలూ మాసపత్రికలూ మొదలైనవన్నీ వెలిసినవి. ఇంకా యెన్నో వెలుస్తున్నాయి. ఏపాటి దృష్టి కలవారికైనా అవి కనిపిస్తవి.

యువకజీవితం, ఇంతటి విశ్వవిజ్ఞానాన్నిగురించి నిరంతరం వింటూ, కండ్లతో కంటూఉన్న నేటి యువకజీవితం; తత్రాపి స్వజాతీ, స్వభాషా, స్వీయవిజ్ఞానం, ఏ పరిస్థితిలో, యేపాటి సుస్థితిలో ఉందో, స్వానుభూతాంగ్లవిజ్ఞానంతో పోల్చి చూచుకొన్న యువకజీవితం; అఖిల ప్రపంచంలోనూ తమ స్థానం యేదో తేల్చుకోవాలనే ఉత్సాహవ్యగ్రత గల యువకజీవితం; ఔదాసీన్యం వహించి ఉండగలదా? ఉండజాలదుకదా? పెద్దలు అనుమతించినా, అనుమతింపకున్నా, తమ ప్రయత్నం నెగ్గినా, నెగ్గకున్నా, మనుష్యులై పుట్టినందుకు, అందులో ప్రపంచజ్ఞానాన్ని రుచిచూచినప్పుడు తమ భాషలోకూడా అట్టి విభవాన్ని ఏల నెలకొల్పకూడదు? ఇది యీ యిరవైయో శతాబ్దిలో పడ్డ ప్రధానబీజం". ఈ విధంగా నాటబడ్డ బీజాలు మాలోకూడా పొటమరించినై. మా సంఘంలో, యీ విధమైన సాహిత్యక్షేత్రంలో పరిశ్రమచేసి తర్వాత వారికి మార్గదర్శులైనవా ళ్ళుండటంచేత స్వవిషయం కొంత మనవిచేస్తాను.

స్కూలుఫైనల్ పరీక్షవచ్చింది. ఎఫ్. ఎ. పోయి యింటర్మీడియేట్ వచ్చింది. ఈప్రకారం యువజనం చిత్తవృత్తుల్లోకూడా మార్పు వచ్చింది. విక్టోరియా హాస్టలులో ఉండే విద్యార్థుల్లో ఒక బృంద ముండేది. వాళ్లు అప్పుడప్పుడూ కలిసి నూతన సారస్వత మార్గాలనుగూర్చి చర్చించుకుంటూ వుండేవారు. ముఖ్యంగా వీళ్లకు రెండు విషయాల్లో మార్పు కావలెనని తోచింది. (1) వకటి సలక్షణ మైన విమర్శనం తెలుగులో రావాలనీ. (2) రెండోది భావప్రధా నంగా ఖండకావ్య నిర్మాణం. విమర్శనం పెరిగితేనేగాని వాఙ్మయ వికాసం పెంపొందదనుకునేవాళ్లు. ఎప్పుడూ గతానుగతికంగా పద్యాలూ, కావ్యాలూ రాయటంవల్ల సారస్వతమంటే అభిరుచి తగ్గందనిన్నీ అందుచేత చిన్నకావ్యం, అందులో భావప్రాధాన్యం, కవి స్వానుభవ ప్రదర్శనం, యీ రెండు మిళితంగనక చేస్తే బాగుం డునని వీళ్లు వాదోపవాదాలు చేసుకుంటూ వుండేవాళ్లు.* ఈ విధ మైన చర్చలకు విక్టోరియా హాస్టల్లో వింజమూరి రంగాచార్లుగారి గది కేంద్రంగా వుండేది. అక్కడ ప్రయాగ రాఘవయ్య, ఆయనా,

* ఆంధ్రులచరిత్ర చూస్తే మొదటినుంచీ వీళ్ళు స్వతంత్రులూ, శృంగారకళా ప్రియులూగా, కనిపిస్తారు. ఈ స్వతంత్ర చిత్తవృత్తి అన్ని శాఖల్లో కనిపిస్తుంది. స్వాతంత్ర్యంకోసం తల్లిదండ్రులనుకూడా విడవటానికి వెనక్కుతీయరు. అట్లాగే తమ సోదరులైన ఆర్యుల్లోనించీ విడిపోయివచ్చారు. తర్వాత ఆర్యులమతం వదిలి దక్షిణ హిందూదేశమతాలను స్వీకరించారు. బౌద్ధం అత్యంత వ్యాప్తిపొందింది వీళ్ళల్లో. మొదటినుంచీ పాడిపంటలు కలవాళ్ళౌటచేత నదీతీరాలనే చూసుకున్నారు నివా సంగా. అజాంతా, యెల్లోరా, అమరావత్యాదుల్లో తమ కళాభిజ్ఞతను చూపారు. ఆస్వాతంత్ర్యమూ, కళాదృష్టీ యిప్పుడు మళ్ళీ తలెత్తింది. నవ్యత అంటే ఉప్పొంగి పోయే గుణం ఆంధ్రులకు సహజం! యీ నవ్యత యిప్పుడూ ప్రతివిషయంలోనూ వ్యక్తమౌతున్నది. ఎక్కడైనా ఒక నవ్యత కనపడ్డదీఅంటే చటుక్కున పట్టుకుంటా రాంధ్రులు. నవ్యుల నేపథ్యాదికంకూడా ఆగుణాన్నే తెలియచేస్తూవుంటుంది. కొందరు దీన్ని అనుకరణంగా తీసుకుని ఆక్షేపిస్తారుకూడాను.

నేను, స్వయంపాకుల సీతారామమూర్తి చర్చించుకుంటూ వుండే వాళ్ళం. చచ్చి స్వర్గానవున్నాడు మా మిత్రుడు బసవరాజు అప్పారావు. బెజవాడలో సుఖజీవనంచేస్తూ ధనమార్జిస్తూ యెప్పుడన్నా సారస్వతాన్ని తల్చుకుంటున్నాడు ♦పాటిబండ అప్పారావు. మాకు పరిచయమైనాడు. కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు దగ్గిర గదిలోనే వుండేవాడు.† వీళ్ళంతా యథాశక్తిగా సారస్వతసేవ చేసిన వాళ్ళే! చేస్తూన్నవాళ్ళే! మిత్రుడు అప్పారావుమాత్రం మాకూ, ఆంధ్రదేశానికీ కట్టని కన్నీరు కల్పించి పోయినాడు. తిరువళ్లిక్కేణిలో నాల్గు వీధులు కలిసేచోట మూడు అంతస్తుల మేడమీద చల్లని సముద్రపుగాలి కొట్టుతూవుంటే మైమరచి రాస్తూండేవాడు గేయాలు! నాకు చదివి వినిపిస్తూండేవాడు.

నల్లనిదంచును నవ్వగనేలా ?
నల్లసరకులో నాణెములేదా ?"

అని చదివి వినిపించేటప్పటికి నిర్ఘాంతపడిపోయినాను. ఈనా, నేనూ, చిన్నప్పటినించీ, అనగా 1904 సంవత్సరంలో బెజవాడలో చదువుకున్నప్పటినించీ, స్నేహితులం. వీళ్ల నాన్నగారు వారసత్వవ్యాజ్యం వకటిగెల్చి ఆస్తి సమకూర్చాడు కుటుంబానికి. నావలెనే చదువు మెల్లిమెల్లిగా అబ్బిందాయనకూనూ! సన్నని మెత్తనిదేహం! దేహం యెంతమెత్తనో మనసూ భావం అంతమెత్తన! భావోన్మాది! మనస్సు, పసిపిల్లవాడిదానివలె వంకర్లులేనిది! ప్రేమపూరితమైంది

♦ ఈన యిటీవల "చిత్రశాల" అనే పేరుతో తమ చాటువుల సంకలనం ప్రచురించాడు. బెజవాడ లాయర్లనుగూర్చిన చమత్కారపద్యాలు.

"ఈచాటువులలో ముందు సునిశితమైన హాస్యం వెనక నిర్దాతనం సమంగా ఉంది" ఇది యీన ప్రకృతి ప్రతిబింబమే!

(ఆంధ్రపత్రిక 11—1—42)

† వేలూరు చంద్రశేఖరంగారుకూడా మాతో కొద్దో గొప్పో సంపర్కం ఉన్నవాడే!

చిత్తవృత్తి! ఎప్పుడు సుఖమేకాని దుఃఖంలేదు మనిషిలో! నవ్వుతూ వుండేది యెప్పుడు మొగం! నన్ను అన్నవలె భావించేవాడు. నేను పండితుణ్ణి, అందుచేత తాను రాసేదేయాలను మెచ్చుకోను, అనుకునే వాడు. ఆశేగాని నిరాశలేదు మనస్సులో! అతని మనస్సెంత ఉదారమో అందరూ అంతేననుకునేవాడు. అందుచేత కొందరు స్నేహితులీయన్ని పిచ్చివాడనుకునేవాళ్లు! మరికొందరు చిన్నతనమని నవ్వేవాళ్లు. కాని నిజంచెప్పాలంటే తనకాలానికంటె 15 సంవత్సరాలు ముందు పుట్టాడని చెప్పాలె! ఆయనకాలానికింకా ఆయనభావాలు కొత్తవి. అందుచేత కొందరికి హేళనగావుండేది. జీవించిన దినాలు కొద్దైనా సారస్వతంలో శాశ్వతస్థాన మేర్పరచుకుని పోయినాడు. వేల పేజీల చిత్తరాశినవాళ్ళకంటె చాలా సారస్వతసేవచేశాడు. మాకందరికీ మనస్సుల్లో చిచ్చుపెట్టిపోయినాడు. ఆయన "వాఙ్మయచరిత్ర" లో నాకుకూడా స్థానమిచ్చిపోయినాడు. * అభిప్రాయభేదాలున్నా సహృదయత్వాని కెట్టిలోటులేదు. ఆపుస్తకం కవిత్వాన్నిగూర్చిన వక భాష్యమనచ్చు. అందులో చర్చించినన్ని విషయాలు యెందులోను చర్చించలేదు. పాలమీది మీగడంటివాడు అప్పారావు! మళ్లీ ఆయనా నేను జీవితాల్లో హెచ్చుతగ్గులు కొన్ననుభవించి 1925 1926 సంవత్సరంలో నేను ఆయనాకూడా లా కాలేజీలో చదువుతూ మాంబళంలో కలిశాం. అప్పటికి వివాహితుడైనాడు. వాళ్ల దాంపత్యం స్వర్గంలాగుండేది. చిన్నతనంలోనే, భావోన్మాదంతోనే తాను

* ఇది 1921 లోనే రాశాడు కాని 1932 లో అచ్చైంది. మరణించకపూర్వం మరొకకవిత్వచరిత్రరాస్తున్నాడు. "ఆ గొడవయావత్తు వాడుకభాషలో వేరుపుస్తకం రాస్తున్నాను"

(భారతి 10_308)

కోరుకున్నట్లు పెదవులమీద కవిత్వంతో * దిగులూవిచారం అనేది లేకుండా స్వర్గానికి అడుకోబోయినాడు అప్పారావు! ఆయన్ని నాజీవితంలో యెన్నటికీ మరవలేను. 39 యేండ్లకే యీనకు నూరేండ్లునిండినై. ఈనను ఆంధ్రసారస్వతానికి కీట్సుఅని చెప్పచ్చు. ♦

వింజమూరి రంగాచార్యులుగారు కొంతవరకు మాకు గురుపీఠం. ఆంధ్రభారతిలో అచ్చౌతూ అప్పుడే వచ్చిన గురజాడ అప్పారావుగారి పాటలూ ముత్యాలసరాలూ చూస్తే ముగ్ధుడైపోయి వాటల్లే కొన్నిపాటలు రచించాడు. చదివి వినిపించేవాడు. హస్తభ్రమణాలతో నేనేకాగా రాశాననే గర్వసూచకంగా ఉండే ముఖంతో, సంగీతంతో పాడుతున్నాననుకునే కంఠస్వరంతో, పాడుతూంటే నేను సంతోషిస్తూవుండేవాణ్ణి. కాని నాకప్పటికీ నూతనమార్గంమీద ప్రత్యయం కలగలేదు. ఈన చాలా రాశాడు గాని ప్రకటించలేదు. మేము కలిసి విమర్శనవిషయమై చేశిన పనినిగూర్చి తర్వాత చెబుతాను. అప్పటికే రాయప్రోలు సుబ్బారావుగారు "లలిత" రాశాడు. ఆ పుస్తకానికి తగినపేరది. దీనిలో చాలామందికి నూతనమార్గం పొడకట్టింది. చర్విత చర్వణమైన సంభోగ విప్రలంభరూపాత్మకమైన శృంగారంగాదు దీనిలోది. కవిగారి భావ్యభి

---

బతుకు బరువుమోయలేక
చితికి చితికి డస్సివాడి
పికరుపుట్టి పారిపోయి
ఒకడనె యేతోటలోనొ
పాటబాడుతుండగ నాప్రాణి దాటియేగెనా ?
ప్రాణిదాటి యేగుతుండ పాటనోటమోగెనా ?

సభాపతిగారికిన్నీ కూడా యిట్టిఆశయమే ఉందిట !

♦ ఈనపాటలు యిప్పుడు సినీమాల్లో విరివిగా గ్రహిస్తున్నారు. "గుత్తొంకాయోయ్ - బావా" భరతనాట్యానికి వాడుతున్నారు. తుదకు యీనవని చెప్పకుండా యీనపాటలు యితరులవని చలామణీచేస్తున్నారు సినీమాల్లో! ఇంకా యింతకంటె యీనపాటలకు యోగ్యతాపత్రం కావాలా ? (ఆంధ్రపత్రిక 25—10—40)

వృద్ధియొక్కా, భావ్యాదర్శాలయొక్కా బీజాలిందులో ప్రస్ఫుటం. ఈ గ్రంథాన్ని మేం కొందరం పునః పునః పఠించాము. దానికి ఆంధ్ర షెల్లీ అని నామకరణంచేశాము. చాలా ఆనందించాము. ఈన అంటే మాలో సీతారామమూర్తికి చాలా ఆదరం. ఆయన అతని కావ్యం. తానుకూడా అటువంటి కావ్యాన్ని రాయాలని యెన్నిమార్లో ప్రయత్నించాడు. ఆంజనేయులు లంక దాటాడని ప్రతి కోతీ దాటగలుగుతుందా? అట్లాగే అయిపోయిం దీ సంగతికూడా !*

## ఖండకావ్యగీతికారచన. రాయప్రోలు, గురజాడలు :

రాయప్రోలుగారిపేరు తలుచుకునేటప్పటికి "భావకవిత్వ" మనే మాట స్ఫురణకొస్తుంది. ఈన విద్యార్థిదశలోనే, నూతనరచనకు యెత్తులువేస్తూండేవాడు. ఈన్ను యెట్లా కనుక్కున్నాడో లక్ష్మణరావుగారు మనకు తెలియదు. వెనక చెప్పాను విజ్ఞానసర్వస్వరచనలో యీన్ని కలుపుకున్నాడు రావుగారు అని. ఈ సంబంధం ఉభయులకూ లాభకరమైంది. సుబ్బారావుగారికి విజ్ఞానచక్షు విచ్చాడు లక్ష్మణరావుగారు. ఆయనకు నూతనదృక్పథాన్నిచ్చాడు సుబ్బారావుగారు. ఈ విధంగా ఉభయతారకులౌతూ భాషకు మేలు

---

* చెన్నపట్నం రాజధానౌటచేత, అక్కడి విద్యార్థులలో పుట్టిన యీవిధమైన భావపరివర్తనం ఆంధ్రదేశ మంతటా వ్యాపించి అక్కడక్కడా వున్న యువజనంలో యీ నూతన దృక్పథం కలగజేసింది. గుడిపాటి వెంకటచలంగారూ యింకా అటువంటి భావాలుకల యితరులుకూడా యీ కాలంలోనే యీభావపరివర్తనానికి గురైనారు. ఈకాలానికి కొంచెం వెనకో ముందో ఆయనకూడా పట్నంలో చదువుకుంటూవుండేవాడు. ఈనా, చిర్రావూరి ఆత్మారాంగారూ, సి. క్రిష్ణయ్యగారూ స్నేహితులు. అప్పటి కింకా నాయుడుగారి బ్రహ్మసమాజం చలామణీలోనే వుంది. ఆ కాలంలోనే దక్షిణదేశంలో జస్టిసుపక్షం గర్భీకృతంగావుంది. అవి దాని జనన పూర్వదినాలు. అదీకూడా ప్రాచీనమనే దానిమీద అసంతృప్తే ఆధారంగాకల ఉద్యమం.

రాశిన "తర్వాతకావ్యాల" కన్నిటికీ బీజమిా "లలిత"లోవుంది. కథా, భావమూ, శైలీ, అన్నీ లలితాలే! ఇదే నవ్యకవిత్వానికి ప్రథమ గ్రంథాల్లో వకటనచ్చు. కొందరు తృణకంకణమని అంటారు. తల్లా వఝులవా రిట్లా అన్నారు.

"ఆధునికకవిత్వమునకు తృణకంకణము ఆదిగ్రంథమని అస్మదాదుల ఆశయము."

(తృణకంకణ రజతోత్సవసంచికా నీరాజనం.)

కాని అవ్యక్తంగా లలితలోవున్న "ఆధునికకవిత్వ" లక్షణాలే తృణకంకణంలో వ్యక్తమైనాయనాలె. సుబ్బారావుగారిలోవుండే సంస్కారం నూతనత్వంకోసం పరితపించింది. ఆనూతనత్వం మొట్టమొదట 'లలిత' ద్వారా వెలువడ్డది. ఈ లలిత 1909 నాటికే ప్రచురణమైంది. అప్పటికి కన్యాశుల్కం మొకటే ప్రచురించారుగాని యింకా నీలగిరి పాటలూ ముత్యాలసరాలూ ప్రచురించలేదు గురుజాడ అప్పారావుగారు.* 1912 సంవత్సరంనాటికింకాతృణకంకణం తయారౌతున్నది. మేమూ అనగా వింజమూరిమండలివారం లలితను చదివి చాలా ఆనందించాము.

ద్వితీయముద్రణం 1912 లో జరిగింది.♦ ఈ మధ్య అనగా 1909 సంవత్సరానికి 1912 సంవత్సరానికి మధ్య యీాన రెండు ఖండకావ్యాలు, "అనుమతి, కష్టకుమారి" అనేపేర్లతో రాశాడు. వీట్లో "అనుమతి" "డోరా" యొక్క అనుకరణం. ఈ ప్రకారంగా ఆంగ్లకవిత్వ సంపర్కమూ, సహజసంస్కారమూ, యీానలో వకనూతనత్వం కలగజేసింది. ఆ నూతనత్వమూ, ఆ కళాదృష్టీ యీానకావ్యాలకు నవ్యత నాపాదింపజేసినై. అసలు చిత్తసంస్కారం కలిగినమనిషి

* 1910, 1911 సంవత్సరాల్లో.

♦ ప్రథమముద్రణం 500 ప్రతులు అప్పుడే అయిపోయినై.

కాబట్టి "వర్డ్సువర్తు" "షెల్లీ" "కీట్సు" "టెన్నిసన్" "బ్రౌనింగు" మొదలైన ఆంగ్లకవులకావ్యాల్లో వుండే "జీవకళ"ను వెంటనే పట్టుకుని తనస్వంతం చేసుకోగలిగాడు. వాళ్లు రాజేపద్ధతిని తెనుగు సారస్వతానికి అవలంబింపజేసి సారస్వతాని కొకనూతనకళ కలగజేశాడు. *

ఈ లలితనుగూర్చి అప్పటికాలపువా రేమనుకున్నారో తెల్పి దీనిలో వున్న విశేష మేమిటో, అది యీన తర్వాత వ్రాసిన కవిత్వంలో బీజభూతంగా యెట్లా వున్నదో మనవిచేస్తాను. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారికి "లలిత" కావ్యంలో వున్న రసాన్ని గ్రహించి తానుకూడా సారస్వతనిర్మాతల్లో వకడౌటచేత నిష్పాక్షికంగా యీ ఖండకావ్యాన్నిగూర్చి యిట్లా అన్నాడు.

"లలిత అను నీ చిన్నిపొత్తమును రాయప్రోలు వెంకటసుబ్బారాయకవి హూణభాషలో నుండిన కథ ననుసరించి రచించెను...... ఈయన కవిత్వము లలితపదభూయిష్ఠమై, నిర్దుష్టమై యుండుననుట కీ చిన్నిపొత్తమే సాక్ష్య మిచ్చును.........హూణభాషాకళాభ్యాసమొనర్చు విద్యార్థులలో నిట్టి నిర్దుష్టకవిత్వశైలి కను నరుదుగా నుండునని తలచెదను. ఇందలి యితివృత్తము హూణకవికల్పననుండి గైకొనబడినది. కాని యాయాయి వర్ణనలు స్వకపోలకల్పితములె!...... ఇందు కథాముఖము సనాతనకావ్యసాంప్రదాయకముల ననుసరింపక నాయికావిలాపములతో ప్రారంభమగుచున్నది......". పై వాక్యాలనుబట్టి వెంకటకవిగారికి దీనియందు కనపడిన నవ్యత తెలుస్తున్నది. "ఇతివృత్తము హూణకవికల్పనమునుండి గైకొనబడుట, మాతృకలో కంటె స్వకపోలకల్పితములైనవర్ణన లుండుట, కథాముఖము సనాతన

* *The principal object then proposed (in this kind of poetry) was to choose incidents and situations from common life, and to relate them throughout, as far as was possible, in a selection of language really used by men."*

(*Wordsworth in preface*)

సాంప్రదాయకముల ననుసరింపక నాయికావిలాపములతో ప్రారంభించుట", వీరికి కనపడిన విశేషములు. కవిత లలితపదభూయిష్ట మనేది యీన కావ్యాల్లో వుండే కవిత్వానికి సామాన్యలక్షణం. కాబట్టి వీరు చెప్పినవాట్లో అన్నిటికంటె కావ్యముఖనవ్యత ప్రశంసనీయము. ఇదివరలో "మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతానికావ్యాని ప్రథంతే" అనే వాక్యం కవుల్లో అమలౌతున్నది. అప్పటికి దానికి భిన్నంగా కష్టాదిగా యీ కావ్యాన్ని ప్రారంభించాడు యీ కవి. ఇది వక నవ్యత. వెనకటి "మంగళాంత చాదస్తు"లల్లే గాక ఆధునికులకు "కష్టాదిచాదస్తానికి" మార్గదర్శియైనాడీ కవి. ఈ చాదస్తం యీ కవిగారి చాలా కావ్యాల కనువర్తించింది. ముఖ్యంగా తృణకంకణంలో అచ్చంగా అనువర్తించింది. "అడుగుల బొబ్బలతో" ప్రారంభించింది కావ్యం. నవ్యులకూ, పురాతనులకూ వున్న భిన్న అభినివేశాల్లో యీ "మంగళాది కష్టాదిచాదస్తమూ", "మంగళాంత కష్టాంత చాదస్తమూ" వకటి. కాని వెనకటివాళ్ళ "మంగళాంతచాదస్త" మెటువంటిదో నవ్యుల "కష్టాంతచాదస్తమో" మరో "వికృతచాదస్తమో" అట్టిదే నంటే వాళ్ళకు నచ్చదు. తమ చాదస్తం సమంజసమని వీళ్ళ అభినివేశం.

వెంకటశాస్త్రిగారు "లలిత"ను గూర్చి తెనుగులో అభిప్రాయమిస్తే రమాకాంతాచార్లుగా రింగ్లీషులో యిట్లా యిచ్చారు.

"This poem ............... I believe is the first successful attempt on the part of a Telugu poet to sing the glories of the sacred passions of love under the direct inspiration of the Votaries of English in use, and as such, marks a new epoch in the development of modern Telugu Literature. The author unlike his predecessors (who have enriched the Telugu Literature by translating and imitating the western masters), infused fresh life and blood into the composition by photographing his images

direct from nature and expressing his ideas in a clear, flowing and beautiful style which is both dignified and charming............................

The scenes through which the heroine passes on her way to her lord have been described with a keen sense of the Beautiful in nature and a profound admiration of the ways of Providence as reflected in her. The crystal stream, the limpid lake, the crimson twilight, the star-lit night, the rosy morning, the melting mistt, the flowery creepers, the redolent blossoms, the warbling birds, the humming bees, the grazing fawns, which form the object of some of the descriptions conjure up a scene of great picturesqueness. The author has reached the highest water-mark of poetic excellence in his glowing description of Love, which he idealises and enthrones in the very heart of nature. Nor is he less profound in his reflection or less skilled in his word-paintings. The poem on the whole is a lyrical piece of rare beauty and finish......................................"

ఈ ఆచార్లగారి మాటలవల్ల "లలిత"లో చాలాకొత్తవిషయా లున్నట్టు కనపడుతున్నది. ఇన్ని నవ్యతాపాదకవిషయా లున్నయ్యని యింగ్లీషుసారస్వతపఠనమూ, విమర్శనాజ్ఞానమూ, కలవాళ్ళకే కనపడతై. పవిత్రప్రణయకీర్తనమూ, ప్రకృతివర్ణనములూ, ప్రకృతిరహస్య పరిశీలనమూ, సృష్టిరహస్యగ్రహణమూ, ప్రకృతిలో యీ పవిత్ర ప్రణయాన్ని చూడటమూ, ప్రకృతిప్రోద్బలంచేత కవిలో కల్గే చిత్త సంస్కారమూ, భావప్రాధాన్యమూ, యీ మొదలైన నవ్యలక్షణా లన్నీ ఆచార్యులవారికి "లలిత"లో గోచరించినై. ఇవే ఆంగ్లసారస్వతంలో వర్డ్సువర్తు, షెల్లీ మొదలైన కవుల రాతల్లో వున్న లక్షణాలు.

ఈ లక్షణాలన్నీ మన వెనకటికవుల రాతల్లో లేవా? అని అడగచ్చు. ప్రకృతికవిత్వాన్ని తీసుకుందాం. వెనకటిగ్రంథాలన్నిట్లో ఋతువర్ణనం, సూర్యోదయ సూర్యాస్తమయాదివర్ణనం మొదలైన ప్రకృతివర్ణన లున్నై. కాని వాటిలో తత్కవుల దృక్పథం లేదు. కొందరు యీ వర్ణనలను అలంకారయుక్తంగా చేశారు. కొందరు స్వభావసిద్ధంగా చేశారు. మరి కొందరు వాళ్ళు చెప్పే కథావస్త్వంతర్భాగాలుగా చేశారు. కాని వాటిని ఉన్నదున్నట్టు చెప్పడమేగాని వాటిలో వుండే అంతరార్థమూ, వాటికీ కవికీ ఉండే పరస్పరసంబంధమూ, వాటికీ సృష్టికీ ఉండే పరస్పరసంబంధమూ, వాటివల్ల కవి నేర్చుకుని పాఠకులకు విప్పిచెప్పే పాఠమూ, వాటికి అంతర్భూతమైన తత్వమూ, ఆ తత్వాన్ని జీవితానికి సమన్వయించడం మొదలైన విషయాలు వెనకటికవులు పరామర్శించలేదు. అంతే గాకుండా ప్రకృతికి కథావస్తువును సంబంధింపజెయ్యడంకూడా వెనకటికవు లందరు కూడా చేసిన పని కాదు. సుబ్బారావుగారి ప్రథమకావ్యం తెనుగు సారస్వతాని కలకగచేసిన వకనవ్యత యిది. అప్పటికి "నవ్యసాహిత్య" మనేమాటే పుట్టలేదు. ఈ నవ్యతే తృణకంకణాదికంలో అనువృత్తమై రాటుతేలింది ఆయనచేతుల్లో. ఈ నవ్యదృక్పథం సుబ్బారావుగారిలో వక మతంవంటి సంస్కారాన్ని అభివృద్ధిపరచి ఆయన తరణోపాయంగా సాధించే తపస్సైంది. ఈ విధమైన పవిత్రత అనేకమంది నవ్యకవుల్లో లేదు. ఇతరులకూ ఈనకూ ఉండే భేదాల్లో వక టిది.

ఈలక్షణాలన్నీ లలితలోవున్నయ్యని చదివితే గోచరమవుతుంది. తుదకు కష్టసుఖాలు జీవికి నిసర్గాలనీ, వాటినిగూర్చి దుఃఖపడవద్దనిన్నీ, ఉత్సాహామే సర్వదాధార్యమనీ, దుఃఖంలోకూడా సుఖమే భావించాలనిన్నీ, చిత్తం శబలంచేసుకోకుండా స్థిరంగాఉంచుకోవాలనిన్నీ, మనఅభివృద్ధిబీజాలు మనలోనే విసర్గంగావున్నయ్యనిన్నీ యీ పాఠాలనీ ప్రకృతిలోఉన్నయ్యనిన్నీ, ఋతుపరిణామమే యీ

పాఠం మనకు తెల్పుతున్నదనిన్నీ, మొదట్లో అనేక కవిగారి సిద్ధాంత విషయాలిందులో కనపడ్తై. దీనిలో నాయకానాయకుల మధ్యజరిగే సంభాషణలో ఆవిషయాలన్నీ ఉద్ఘోషింపబడ్డై. ప్రేమ పావిత్ర్యబీజాలిందులో వున్నై. కాని యింకా అమలిన ప్రేమ సిద్ధాంతం కవిగారికిప్పటికి దృఢంకాలేదు. వెనక "కష్టాపిచాదస్తాన్ని" గూర్చి చెప్పేవున్నాను. ఇక సుబ్బారావుగారి సహజమైన కళాదృష్టి, పదలాలిత్యం, పరస్పరపదసమ్మేళనచాతుర్యం, యిందులో నిసర్గాలుగా వుండి తర్వాత కావ్యాల్లో బాగా పరిణామంపొందినై. మొత్తంమీద సుబ్బారావుగారి యీ"చిన్నిపొత్తం" నవ్యమార్గానప్రవర్తించినా, పండితులనూ, విద్యార్థులునూ, ఆంగ్లవిద్యాపారంగతులనూ, అందరినీ కూడా ఆనందింపజేసింది. పండితులను భాష, శైలి తృప్తిపరిచినై! విద్యార్థులకు వెనకటి కావ్యమర్యాదలను అనుసరించకపోవడం నచ్చింది. ఆంగ్లవిద్యాపారంగతులను దానిలోని నవ్యత ఆకర్షించింది. ఈ విధంగా నవ్యసాహిత్యానికి పునాదివేశిందీకావ్యం. కాని నవ్యసాహిత్యమంటే ఫలానాఅని నిష్కృష్టమైన అభిప్రాయం ప్రబలలేదు. ఇంతవరకిచ్చిన నిర్వచనాలన్నీ కొండపిటిచాంతాళ్ళల్లే చాలాపొడుగుగావున్నై. ఇంకాకొత్తరోజులు! నిష్కృష్టలక్షణం యేర్పడ్డానికి కాలంకావద్దూ? గర్భస్థమైన బిడ్డకుపేరుపెట్టడమెట్లా? ఆడఅవుతుందో మొగఅవుతుందో! ఇప్పటికీ యిట్టిది నవ్యసాహిత్యమనే విషయంలో చాలా అభిప్రాయభేదాలున్నాయి. ఇప్పటి కీ "లలిత"లో వుండే నవ్యతను గ్రహించాం.

తర్వాత "భావకవిత్వ"మనే మాటనుగూర్చి కొంచెం చెబుతాను. ఈమాట యెట్లాపుట్టిందో చెప్పటానికి వీల్లేకుండా వుంది. మొదటమొదట యీ పేరును గ్రహించారీ రచయితలూ, తత్పిపాసులూను. శ్రీ సుబ్బారావుగారుకూడా యీమాటతో తమ కవిత్వాన్ని నిర్వచించేవాడు. ఈమాట పుట్టిచ్చిందే అయనా ఆని

కొందరంటుగుతారు. అయితేకావచ్చు.* వీరన్నారనివారూ, వారన్నారనివీరూ, యీవిధంగా యీమాటకు ప్రచారం వచ్చింది. వేలూరు శివరామశాస్త్రీ ల్యాగులు యీమాటనే వాడి దానిపైన భారతీ మొదలైన పత్రికల్లో వ్యాసాలుకూడా రాశారు♦. ఇప్పటికీ యీమాటను కొందరుపయోగిస్తున్నారు. కొంతకాలంతర్వాత యీమాటకు కొంత నీచార్థమొచ్చింది. నిరర్థకమైన అయోమయ కవిత్వాని కీమాటను కొందరుపయోగించటం మొదలుపెట్టారు. "నేటికాలపు కవిత"లో ఉమాకాన్తపండితుడు వాడిన మాటయిదే! ఈ మాట కవిత్వాన్ని తిట్టే ఒక తిట్టుకిందికి దిగింది. అప్పుడీ కవులు యీమాటను ఉపయోగించటం మానేశారు.‡ "నవ్యసాహిత్య"మన్నారు. "నవ్యకవిత్వ"మన్నారు. ఈమాట బాగుందని దీన్నే గ్రహించారందరూ. ఈపేరుతోనే యిప్పుడీ సాహిత్యమంతా వ్యవహారంలోవుంది. నన్నడిగితే "నవ్య కవిత్వం" "నవ్య సాహిత్యం" అనే మాటల్లో వక విధమైన అనిర్వచనీయతా, అనవస్థా, అవ్యాప్తి అతివ్యాప్తులూ, అనిష్కృష్టతా, వుందేమో అంటాను. ఇప్పటికీ దీని పరిమితి యింతనీ, లక్షణా లివ్వనీ, యెవ్వరూ నిష్కృష్టంగా చెప్పినవారు లేరు. వెనక విశ్వనాథవారిదీ, పంచాగ్నులవారిదీ నిర్వచనాలిచ్చాను. అవ్వికూడా యెంత పొడుగ్గాఉన్నాయో మీరు చూచారు. 1850

*గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారీమాట పుట్టించారన్నారు గిడిగు సీతాపతిగారు. (ఆంధ్రపత్రిక 27—10—40)

♦ కవికుమారులు భావగీతా
రవళిలో మగ్నంబునొందుచు
భువిమరచి తన్మయతజెందగ
బొంగిపోయెదరు''

(పెనుమర్తి వెంకటరత్నంగారు ప్రకృతిలో)

‡ సుబ్బారావుగారే కష్టకమలనూచికలో నవ్యకవిత అనేపదం ఉపయోగించటం చేత దాన్నికూడా ఆయనే మొదట వాడినట్టు తోస్తుంది.

సంవత్సరం తర్వాత తెనుగులో కలిగిన రచనఅంతా దీనికిందికి వస్తున్నట్టు కనపడుతున్నది. కాబట్టి నాకకటి లాక్షణికుల నిర్వచన ప్రకారం లక్షణానికి అతివ్యాప్తిదోషం పట్టింది. ఇక "భావకవిత్వ" మనే మాట బాగుందంటారా అని అడిగితే కొంతవరకు సమంజసంగా వుందేమో అనిపిస్తుంది. ఏల?

కవిత్వానికి మూడు విషయా లవసరం. "భావం" "వస్తువు" "రచన". ఈవిషయం విపులంగా తెలియాలంటే రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మగారి "సారస్వతోపన్యాసాలు" చదవమని మనవి. ఆయన అక్కడ చాలా సరసంగానూ, విపులంగానూ, ఉదాహరణపూర్వకంగానూ చర్చించారు. ఇప్పటికీ భావకవిత్వాన్ని నిరసించేవారు "భావం లేని కవిత్వ ముంటుందా?" అని హేళనగా మాట్లాడటం కద్దు. వాళ్ళకు సమాధానంగా ఉంటుందంటున్నాను. కావాలనిస్తే పెద్దన మొదలైన గొప్పకవుల్లోనించీ ఉదాహరణాలు లెక్కకుమిక్కిలిగా యిస్తాను. భావమంటే సామాన్యంగా అనుకునేఅర్థంకాదు. విషయంకాదు. "భావం" అంటే లాక్షణికు లుపయోగించే "విభావం" "అనుభావం" "సాత్త్వికభావం" "భావస్థైర్యం" "భావశబలతా" అనే మాటల్లో ఉండే భావశబ్దానికి యే అర్థమో ఆ అర్థం. అటువంటి "భావం" కవులందరి కవిత్వంలో వుంటుందని చెప్పటాని కెంతమాత్రం వీల్లేదు. అటువంటి భావప్రధానంగా రాశిన కవిత్వం కాబట్టి "భావకవిత్వ"మనచ్చు దీన్ని. పూర్వుల్లోకూడా యీభావానికి ప్రాధాన్యమిచ్చిన స్థలాలు అక్కడక్కడ లేకపోలేదు. దాన్ని మనవాళ్లు యే అలంకారం కిందికో తెచ్చి దాన్ని అప్రధానం చేశారు. చూడండి కింది పద్యం:

"తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గముచేసి క్రూరుడై
యరిగె మహీసురాధము డహంకృతితోనని రోషభీషణ
స్ఫురణవహించెనో యన నభోమణి దాల్చె కషాయదీధితిన్ "

దీనిలో ఉన్న భావప్రాధాన్యాన్ని నిరాదరించి దాన్ని అలంకారం కిందికి తెచ్చి "ఉత్ప్రేక్షాలంకారం" అన్నారు పెద్దలు. కాని యిది కవియొక్క ప్రకృతిపరిశీలనజ్ఞానమూ, కవి ప్రకృతులకు కల్గిన పరస్పరసంబంధమూ, ప్రకృతి కవికి కలిగించిన చిత్తవృత్తిమార్పూ, కథా వస్తువుకూ ప్రకృతికీ వున్న సానుభూతీ, మొదలైన అనేక విషయాల కుదాహరణం. వీటిలో వకదానికైనా ప్రాధాన్య మియ్యరు మన పెద్దలు. నాయికకు కలిగిన చిత్తవికారానికీ ప్రకృతికీ పరస్పరసంబంధంకల్పించి, ప్రకృతి నాయిక అవస్థనుగూర్చి సానుభూతి చూపినట్లు చెప్పడం యీ పద్యంలో విశేషం. కాబట్టి యీ మొదటి నవ్యకవైన సుబ్బారావుగారికవిత్వంలో కనపడ్డ యీ బహుళాంశమె వెనకటి కావ్యాలకూ దీనికీ వైశిష్ట్యం కల్పించింది. ఇట్లా భావం ముఖ్యాంశంగా పెట్టుకునే కవిత్వాన్ని "భావకవిత్వ" మన్నారు. ఇది సమంజసమే! కాని తర్వాత రాశిన కొందరు కవుల అవ్యక్తపురాతలతో యీ మాటకు అపార్థం రావటంవల్ల యీ మాటను పరిహరించారు తదనుయాయులు.* ఈ మాటకు సామాన్యంగా "అర్థం" అని అర్థం చెప్పటాని కెంతమాత్రం వీల్లేదు. అది కావ్యవిషయంలో వక పరిభాషాపదం. వస్తువుకు పర్యాయపదంగా భావశబ్దాన్ని తీసుకొనేటప్పటికి నీచార్థ మొచ్చింది. రెండూ వకటేఅయితే "భావము" "వస్తువు" అని రెండుపదాలు వాడుకలో కొస్తాయా? పారిభాషికంగా సామాన్యవ్యవహారంలో వకవేళ "దీని భావ మేమి తిరుమలేశ" అన్నట్లు "అర్థ" మనే అర్థంలో ఉపయోగించినా, యీ సందర్భంలో

*నోరి నరసింహశాస్త్రిగారు "పండితుల మనుకునేవాళ్ళప్రసాదంవల్ల భావకవిత్వ మనే మాటకు అర్థం లేని పనికిమాలిన ఉల్లాయిపదాలు అని వక కొత్త అర్థంకూడా లోకంలో ప్రచారానికి వచ్చింది" అన్నారు.

అట్లా వ్రుపయోగించడం ప్రతికక్షులు నిరసించడంకోసం చేసిన పనే అని గట్టిగా చెప్పాలె! *

ఇక యీ మాదిరి కవిత్వానికి ప్రథములెవరు? అనే ప్రశ్న కొస్తాను. ఇక్కడ కొన్నభిప్రాయాల నిచ్చి వాటినిగూర్చి రెండుమాటలు చెబుతాను. "ఆధునిక కవిత్వమునకు తృణకంకణం ఆదిగ్రంథమని అస్మదాదుల ఆశయము", అని మాతల్లావజ్ఝుల అన్నగారు శెలవిచ్చారు. "అప్పారావుగారి నీలగిరిపాటలు, ముత్యాల సరాలు కొత్తపాతలకు మేలు కలయికకూర్చిన నవ్యసాహిత్యపు తొలికృతులు" అని అన్నారు నోరి నరిసింహశాస్త్రిగారు. వీటిలో దేన్ని ప్రమాణంగాతీసుకోవాలా అని చారిత్రకులు కళవళపడతారు. అందరూ విశ్వసించతగినవారే! ఇక్కడ రెండు విషయా లున్నై. గ్రంథమూ, పద్ధతీ అని. ఈ రెంటిలోనూకూడా నీలగిరిపాటలు ముత్యాలసరాలకంటె సుబ్బారావుగారి తృణకంకణం అర్వాచీనం. అందుచేత శివశంకరశాస్త్రిగారిక్కడ పొరపాటుపడ్డారు. నరిసింహ శాస్త్రిగారుకూడా వకపొరపాటు పడ్డారు. అప్పారావుగారి నీలగిరి పాటలు ముత్యాలసరాలకంటె సుబ్బారావుగారి "లలిత" ప్రచురణంలో ప్రాచీనం.♦ విశ్వనాథవారు చెప్పిందికూడా ప్రమాదమే! †అప్పారావు

---

* భావకవిత్వమనే పదం కథానికాదులకు సమన్వయించదనడం సమంజసంకాదు. కవిత్వ మనే పదం చాలా విశాలమైన అర్థం కలదై గద్యాదుల నన్నిటినీకూడా చేర్చు కుంటుంది.

♦ అప్పారా యోపజ్ఞకమైన రసగీతాలను రాయప్రోలు సుబ్బారావుగారందు కున్నారు'' అన్నారు విశ్వనాథవారు.

"తరువాత కవి (వీరేశలింగం తిరుపతికవుల తర్వాత) గురజాడ అప్పారావు."

(జం.రు. శాస్త్రి, 22—9—40 ఆంధ్రపత్రిక)

† "ఆధునికాంధ్రకవిత్వ శక్కికి, సాంఘికనాటకరచనకు మార్గముచూపినవారు వాస్తవముగా కీ. శే. గురజాడ వెంకట అప్పారావుగారే అని చెప్పవలెను."

(గి. వెం. సీ. నాట్యకళ. విక్రమ మార్గశీర్షము)

సుబ్బారావుగార్లు యిద్దరూ స్వతంత్ర రచయితలే కాని వకరిదాన్ని వకరు అందుకోలేదు. భావ, వస్తు, రచనలు మూడింట్లోకూడా యిద్దరూ భిన్నమార్గాలు తొక్కినవారే! * పండితుల్లోకూడా వకవిధమైన భావ పరివర్తనం కల్గించిం దీ "లలిత". దానికి కారణం సుబ్బారావు గారు భాషావిషయంలో రామమూర్తి అప్పారావుగార్ల పంథాతో కక, చ్యుతసంస్కారంకాని భాషరాయడం ముఖ్యకారణం. అందు చేత సుబ్బారావుగారు పండితులకూ కూడా ఉపాదేయుడైనాడు. వెన కటి భాషాసారస్వతసంప్రదాయాలు వదిలి నూతనత్వం కల్పించడం మంచిదికాదని సుబ్బారావుగారు గ్రహించారు. పూర్వులనుకూడా కలుపుకునిపోవడం నవీనులకవసరం. కాకపోతే సారస్వతానికి అనువృత్తి పోయి సూత్రంతెగిపోతుంది. కొందరాధునికులు చేసేపొరబాటిది. ఇది యిట్లావుంచి యీ నవ్యతకు పునాదివేయటాన్నిగూర్చిమరోవిధంగా చె ప్పచ్చు. తృణకంకణమే మొదట యీనూతనమార్గానికిపునాదివేసిందని గాని, నీలగిరిపాటకే పునాదివేసినాయనిగాని వొప్పుకోడాని కింకో విషయంచర్చించడం అవసరము. వీరిద్దరిలో సారస్వతక్షేత్రం దోహదం చేసి ఫలింపజేసినవారెవరు? ఈ విషయం చర్చించాలిశొచ్చి

దీనికి కారణజాతా స్నేమీ ఆయన యియ్యలేదు. ఆయన పైవ్యాసంలోనిగ్గించే అప్పారావుగారి సంఘసంస్కార ప్రియత్వాన్ని నిరూపించాను. పాఠకులు చూడ గలరు. సాంఘికనాటకరచనకు వీరేశలింగంగారేమో మార్గంచూపినవారని నా అనుమానం!

* 1910 సంవత్సరంలో అప్పారావుగారు "ఎత్తులంగరు" అనే గేయం రచించి దేశభక్తివిషయ కవితలకు (Subjective poetry) పునాదివేశారు అని 22-9-40 ఆంధ్రపత్రికలో జ. రు. శాస్త్రిగారు రాశారు. కాని లలిత 1909 లోనే ప్రచురణ అయిందని వెనక చెప్పాను.

నప్పుడు సుబ్బారావుగారేనని చెప్పాలె. ఈ క్రింది మరో స్థలంలో నేను రాశినవాక్యాలు గమనించండి. *

* "అప్పారావుగారు సంస్కరణంకంటె కళకు యెక్కువపాలు చేసి చాలా విహరించారు"

(జ. వ. శాస్త్రి, ఆంధ్రపత్రిక 22-9-40)

"సుబ్బారాయకవి నైతికముగాను, సాంఘికముగాను, పారమార్థికముగాను రచించుటయేగాక దేశకల్యాణమునకు, విశ్వసౌభాగ్యమునకు తోడ్పడు రచనలుగూడ నొనరించుచున్నారు. పరిశుద్ధంబగు ప్రేమస్వరూపంబును బ్రదర్శించుచు బద్ధానురాగ పరిణామపోషకములైన, 'నరసముతైన వావివరుసల్ తెలుపంగ నభేదరాగముల్, తిర ముగ చాదుకో ప్రణయవీనులు', వివ వృత్తమును 'వియోగమం దమృతమున్ విసముగా నమవృత్తురే' అను సిద్ధాంతమును వెలిబుచ్చినాడు తృణకంకణములో.

'కడుపు ఉంపపుగోతల ఘటించు, కష్టదైవమునుగూర్చి విలపించు' ప్రేమశాలి యగు ముగ్ధబాలిక విషాదగాథకష్టమకలలో సృజింపబడినది. ప్రేరణధర్మమే పితృగృహ రక్షణమునకు దారిచూప శుల్కవాంఛాపరులగు సోదరులకు దివ్యసందేశము నంపుచు నాత్మోపహార మొనర్చిన చరిత్రము 'స్నేహలతాదేవి'. యాత్రార్థులై దేవపూజప్రవ ణులై వెడలు బాలికల కిడిన నివాళింపు 'తెనుఁగుతోఁట'. కుమారప్రేమబంధురమతి యైన యొక మాతృదేవి యాదేశము 'స్వప్న కుమారము'. వివిధరస భూయిష్ఠంబై, రస వత్ పుష్పసమన్వితమై, అమృతమధురమైయున్న ఖండకావ్యము 'జడకుచ్చులు'. ఈతని కావ్యముల నన్నిటిం బరించిన ప్రత్యేక వైలక్షణ్యము విస్పష్టమగును. దేశకళ్యాణము నకు తోరణములుకట్టు పూర్వగాథల వర్ణించు నీతని పద్యములు రసతరంగములు."

(భారతి. జూలై 1930.)

ఇందుతో యీయనరాశిన దాదాపు అన్ని గ్రంథాలకూ విమర్శనవచ్చిపోయింది. తుదిమాటలో "ఆంధ్రావళి" ఉల్లేఖింపబడింది. ఇక మధుకలశరమ్యాలోకా లున్నై. శృంగారరసానికీ ఆముష్మికానికీ, వంతెనకట్టి అన్యాపదేశానికి పరమావధైన "ఖయ్యామున" కనువాదం "మధుకలశము". తన కవిత్వానికి లక్ష్యలక్షణభూతమై, సార్వకాలిక సారస్వత లక్షణాల నుగ్గడించు లక్షణకావ్యం "రమ్యాలోకం".

"గురజాడ అప్పారావుగారుకూడా సుబ్బారావుగారల్లేనే వక మూలనించి స్వతంత్రంగా రాయటం మొదలుపెట్టినవారే * కాని ఆయనకు "సంఘసంస్కారం" "వ్యావహారికభాషావాదం" పక్కవాద్యాలవంటివి. ♦ దీనికి ఆయనరాసిన కన్యాశుల్కం ఉపోద్ఘా

---

* ఈన మాత్రాఛందస్సును గ్రహించి హృదయంగమంగా చక్కని వ్యావహారికంలో పాటలురాసి దేశాన్ని ప్రబోధించాడు.

"దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్"

మొదలైనవి యెప్పటికీ మరవదగినవికావు. కాని యిట్టిది చారిత్రకదృష్టిని మరుగుపర్చగూడదు.

"దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని యేదైనాను వక మేల్
కూర్చి జనులకు చూపవోయీ."

"................... అప్పటికి (1910 నాటికి) పైని యెత్తిచూపిన పద్యం వ్రాయడమైనదో లేదో చెప్పలేను. బహుశా కాలేదనుకుంటాను."

(గి. వెం. సీ. "నాట్యకళ" విక్రమమార్గశీర్షము)

"ఈ ముత్యాలసరములు 1910లో రచించారు..........అదివర కప్పుడే నేను "చిలకమ్మ పెండ్లి".........మొదలైన పాటలు కొన్ని రచించి వివేకవతిలో ప్రకటించాను." (ఈ వివేకవతిని మేమెవ్వరూ యెరగము.) (Ibid)

"గుత్తునా ముత్యాల సరములు, కూర్చుకొని తేటైన మాటలు
క్రొత్తపాతల మేలుకలయిక, క్రొమ్మెరుంగులు చిమ్మగా."

ఈన కొండుభట్టీయమనే మరో నాటకంకూడా రాశాడు.

♦ బరంపురంలో 1910 సంవత్సరమందు ఒకరింట పెద్దవిందుజరిగింది. అప్పుడు నాలుగుజాతులవారుకలిసి పంక్తులుతీర్చి కూర్చుండి భోజనంచేశారు. దానిపైని సనాతన ధర్మం పోషించాలనే పూర్వాచారపరాయణులు విందారగించినవారిని వెలివేశామన్నారు......ఆ విందు మనసులోపెట్టుకుని......అనేపద్యము తన ముత్యాలసరములలో చేర్చినారు. అప్పారావుగారికి సంఘసంస్కరణ విషయంలో ఉదారాశయాలుం

తంలో మొదటివాక్యమే సాక్షి. (Social reform, and spoken Telugu). * ఆయన యింగ్లాండుపోయొచ్చిన స్నేహితులయొక్కా, అధికారంలోవున్న మనవాళ్లయొక్కా దొరలయొక్కా సహాయంపొంది వ్యావహారికభాషావాదంతో లోకాన్ని ఢీకొన్నారు. వ్యావహారిక భాషావాదం, భావకవిత్వం, రెండూ సోదరోద్యమాలనచ్చు. ఈరెంటిలోను "భావకవిత్వం" బలవత్తరమైనది. (దీనికి రెండోది సహకారి. దాన్ని త్వరగావ్యాపింపజేయడంలో సహాయపడ్డది). అప్పారావుగారి "ముత్యాలసరాలు" కూడా సుబ్బారావుగారి తృణకంకణంతో పాటు నవ్యాంధ్రకవిత్వానికి ప్రోత్సాహకాలని చెప్పచ్చు. కాని కాలరీత్యా చెప్పాలంటే అప్పారావుగారికంటె సుబ్బారావుగారే అసలు మార్గదర్శి అనిచెప్పాలిశొస్తుందేమో! అప్పారావుగారు భాషాసంస్కర్తకూడాను. సుబ్బారావుగారు కేవలకవితామార్గసంస్కర్త. "ఈవిషయం చాలాగమనించదగ్గది. అప్పారావుగారు అభినివేశంతో రాశింది "కన్యాశుల్కం" గాని "ముత్యాలసరాలు" గావు. ఆ కన్యాశుల్కం రాశింది

డేవి. అందుకు నిదర్శనంగా ముత్యాలసరములలో......అనే పద్యములున్నూ "లవణ రాజుకల"లో......అనే పద్యాలున్నూ, "కన్య"లో......అనే పద్యములున్నూ, "డామన్ పితియస్"లో......అనే పద్యమున్నూ, "దేశభక్తి"లో......అనే పద్యములున్నూ యెత్తిచూపించినాను"

(గి. వెం. సీ. *Ibid*)

* *When I wrote the play I had no idea of publication. I wrote it to advance the cause of Social reform and to combat a popular prejudice that the Telugu Language was unsuited to the stage."* *1909*

(*Preface*)

*Since I wrote the preface to the first edition the spoken dialect has gained ground. My friend Pricipal P. T. Srinivasa Iyengar, recently started a Telugu teaching reform society among the aims and objects of which the cultivation of vernacular Telugu holds a prominent place and Mr. Yates whose name will always be remembered in the Telugu Districts for introduction of rational methods of Telugu teaching, into our schools, has lent weight to the movement by accepting the Presidentship of the Society."*

(*Ibid*)

వ్యావహారికభాషావాద ప్రచారంకోసమని గట్టిమాట.* నవ్యకవి
త్వానికి మార్గం చూపాలనిగాని, ("క్రొత్త పాతల మేలుకలయిక"
అన్నప్పటికీ) నేను అట్లా చూస్తున్నాననిగాని అప్పారావుగారికి అహం
ప్రత్యయంలేదు. సుబ్బారావుగారట్లాగాక నవ్యత తీసుకురావాలనీ,
ఆ నవ్యతను ప్రచారంచెయ్యాలనీ అభినివేశంతో రాశారని చెప్పచ్చు.
ఎట్లాగూ అంటారా! "లలిత"తో ప్రారంభించిన ఈ అభినివేశం గట్టి
పడి తృణకంకణంనాటికి పాతుకుపోయి "అభినవ కవితామండలి"♦
స్థాపనంగా పరిణమించింది. తాను నవీనమార్గాన్ని లేవదీశాననీ,
అది దేశంలో కొంతబలం చేకూర్చుకుందనీ, యీ నవీనమార్గం అవ
లంబించి కొన్ని కావ్యాలు రచించాలనీ 1912 సంవత్సరంనాటికే నిశ్చ
యించి తృణకంకణాన్ని రాశి, దాన్ని "అభినవకవితామండలి" ప్రచురించి
నట్టు 1913 సంవత్సరంలో ప్రచురించాడు. అప్పటికీ "అభినవకవితామం
డలి"లో ఆయనతప్ప యితరసభ్యులున్నారేమో నాకు తెలియదు!
1912 సంవత్సరంనాటికే ఆయనకూ నాకూ పరిచయంకల్గింది. అప్ప
టికి యితరసభ్యులుంటే నాకు తప్పక తెలిసేదే! ఆయనరాసే
పద్యాలు బీచికి పోయినప్పుడు నాకు చదివి వినిపిస్తూవుండేవాడు.
"లలిత" చదివితే వచ్చిన ఆనందం యినుమడించిందా పద్యాలు
వింటూవుంటే. "లలిత" అలజడింతగా కలిగించకపోయినా యీ
"తృణకంకణం" మాత్రం కలిగించిందనాలె. § ఉత్సాహంతో ఉవ్వి
ళ్లూరుతూ వుండే ఆంధ్రయువకుల్లో "లలిత" కలగజేసిన భావపరి
వర్తనాన్ని దృఢపరిచింది. కవితాసంస్కారమున్న కొందరుయువకుల్లో
సంకల్పబీజాలు నాటింది. అప్పుడు శ్రీ రామలింగారెడ్డిగారు మైసూ

* వెనకటి ది. వెం. సీ. గారి వ్యాసభాగాన్ని గమనించండి.

♦ (*The Telugu school of Romantic revival.*)

§ "ఈ సూర్యాలోకంవల్ల (తృణకంకణకృత) సాహిత్యసీమలో నూతనరుచి వ్యాపించి కన్నులు మిరుమిట్లు కొలిపింది. కొంతమంది కన్నులు మూతపడ్డవి. కొంత మంది నేత్రపటలాలు నీరైపోయినవి." (రజతోత్సవసంచిక నీరాజనం)

రులో గొప్ప విద్యాశాస్త్రవేత్తగా ఉండేవారు. ఆయనకు సంస్కృ
తంలో ఆయనకు గురుప్రాయులుగా వుండేవారు రాళ్ళపల్లి అనంతకృష్ణ
శర్మగారు. అబ్బూరు రామకృష్ణారావుగారుకూడా మైసూరులోనే
వుండేవారు. వీరందరూకూడా యీనూతన ఖండకావ్యాన్ని ఆస్వా
దించి ఆనందం పొందినవారే. రామకృష్ణరావుగారిలో కప్పబడివున్న
కవితాబీజాలు ఉద్బుద్ధాలైనై. రెడ్డిగారు "ముసలమ్మ మరణం"
అప్పటికే (1900) రాసున్నారు. రామకృష్ణరావుగారి "ఊహా
గానం" ఈ కాలానికి వెనక ముందుగా పుట్టిందే! రెడ్డిగారిని తృణ
కంకణం అత్యంతంగా ఆకర్షించింది. ఆదివరలో ఆంగ్లకవిశేఖ
రులను చదివి వారి కవిత్వామృతాన్ని గ్రోలిన రెడ్డిగారికి ఖండ
కావ్యం రసాయనప్రాయమైంది. సుబ్బారావు గారప్పటికి శ్రీలక్ష్మణ
రావుగారి వద్ద పనిచేస్తూ వుండేవారు. తర్వాత కొన్నిదినాలకు
శాంతినికేతనం వెళ్ళి, అక్కడ కొంతకాలం రవీంద్రసేవచేసి, ఆవాతా
వరణంలో సంచరించివచ్చారు. ఆంధ్రసారస్వతానికి యీన రవీంద్ర
సాన్నిధ్యం అత్యంత ఉపకారకమైంది. ఒక్కొక్కటి వకట్ తర్వాత వకటి
ఆయన కావ్యాలు వెలువడి ఆంధ్ర భాషామతల్లికి నూతనాలం
కారాలైనై.* వీటిని చూచి సంస్కారమున్న మహనీయుల కందరికీ
కండ్లు తెరిచినట్లైంది. ఈవిధంగా సుబ్బారావుగారు నవ్యాంధ్రసాహిత్యా
నికి పితృస్థానం ఆక్రమించారు. రాజమహేంద్రవరంలో జరిగిన
నవ్యసాహిత్యపరిషత్తు కధ్యక్షులైనారు. 1940 సంవత్సరం
మార్చి నెలలో జరిగిన నవ్యసాహిత్య పరిషత్సభలో వారికి ఆంధ్రులంతా
కలిసి అత్యంతమైన గౌరవం జరిపారు. మీసములు వచ్చీరాని

* "కష్టకమల" "స్నేహలతాదేవి" "తెనుగుతోట" "స్వప్నకుమారం" మొద
లైనవి. తర్వాత అప్పుడప్పుడూ రాసిన ఖండకావ్యాలుచేర్చి "ఆంధ్రావళి", "జడ
కుచ్చులు" అయినై. "మధుకలశం" (ఉమర్ ఖయ్యాము పరివర్తనము) రాసి చాలా
కాలమైనా యిటీవలనే ప్రచురణ అయింది. "రమ్యాలోకం" ఆయన కవిత్వానికి పరి
పక్వ లక్షణగ్రంథం.

నవ్యాంధ్రకవులుకూడా ఆయనను తమకు భావనా గురువుగా అంగీకరించారు. ఈన 1909 సంవత్సరంలో ప్రారంభించి చేయటం మొదలు పెట్టిన "వాఙ్మయతపస్సు" యిప్పటికీ అవిచ్ఛిన్నంగా చేస్తూ, దేవీదత్తాలైన సిరిసంపదల ననుభవిస్తూ, వాఙ్మయక్షేత్రంలో నిరంతరమైన కృషిసల్పుతున్నాడు.

ఈనమీద కలిగిన ప్రోద్బలాన్నిగూర్చి రెండుమాటలు చెబుతాను. ఒకమారు "శ్రీ శ్రీ"గారు వక రేడియోఉపన్యాసమిచ్చారు. దానివిషయం "తృణకంకణ విమర్శనం". మిగిలిన ఆయన చెప్పిన అంశాలతో మన కక్కర లేదు. సుబ్బారావుగారిమీద ప్రోద్బలం గూర్చి యిట్లా చెప్పాడు. "తృణకంకణం" లో పాశ్చాత్యప్రోద్బలం "భావనాపద్ధతి" (Tragedy) జడవకపోవడమేగాక, ఆహ్వానించడం అంగీకరించడం ఉన్నాయి. కీట్సుప్రోద్బలం లేదంటే నమ్ముతానా?" మిగిలిన కవులప్రోద్బలం యెట్లావున్నా "కీట్సు" ప్రోద్బలం ఉందని "శ్రీ శ్రీ"గారు గట్టిగా చెప్పారు. లేదంటే కొట్టేటట్టున్నారు. ఇక శివశంకరశాస్త్రిగా రేమన్నారో చూడండి. "The Telugu school of Romantic revival" అనిన్నీ, "అభినవాంధ్రకవితామండలి"అనిన్నీ, దీని (తృణకంకణ) ప్రథమప్రకటనంలో వుండటంచేత, Wordsworth, Coleridge, Shelly, Keats ప్రభృతుల కవితాప్రభావంవల్ల తృణకంకణం రచితమైందని కొంతమంది ఆ రోజుల్లో భ్రమపడ్డారు. (ఇప్పటికీ భ్రమపడుతూనే వున్నారు). సుబ్బారావుగారు ఆంగ్లకవితారసమును ఆస్వాదించినమాట వాస్తవమే! అయినప్పటికీ ఆ కవులశక్తికి ముగ్ధులై ఈ కవివరులు రచించలేదు. కాళిదాసకవీంద్రుని నాటకత్రయము బహుపర్యాయములు సాకల్యముగా సమాలోచన చేసి, ఆమీద తృణకంకణం కూర్చినారు." (రజతోత్సవసంచిక నీరాజనం) వీళ్ళిద్దరూ సత్యాన్నే చెప్పారు. మన లాక్షణికులు చెప్పిన సామగ్రి అంతా యీాన దగ్గిరుంది. "శక్తిర్నిపుణతా చైవ లోకకావ్యాద్యవే

క్షణాం, కావ్యజ్ఞ శిక్షయాభ్యాసః" అన్నట్లు "శక్తి" అనగా సంస్కారం వుందని వెనక మనవిచేశివున్నాను. స్వభాషాపరభాషాసారస్వతాలను బాగా గుర్తెరింగి రాశాడు. సంస్కృతంలో తమకు కావలసినంత విజ్ఞానాన్ని సేకరించుకున్నాడు. ఇప్పటికీ ఆయనకు నాటకాల్లోవి శ్లోకాలు మొదలైనవి అసంఖ్యాకాలు కంఠస్థంగా వచ్చు. ఆంగ్లంలో పరీక్ష కోసం సారస్వతం చదివి తర్వాత మరిచిపోయినట్టు కాకుండా అక్కడ సారస్వతంలో వున్న నిగ్గు గ్రహించాడు. అదివరకున్న సంస్కారానికీ, జ్ఞానానికీ, యీ ఆంగ్లసారస్వతపఠనం దోహద మిచ్చింది. తుట్టతుదిదైన "కావ్యజ్ఞశిక్షయాభ్యాసః" అనేది యీనకు చివరకు మెరుగు బెట్టింది. ఇంటిదగ్గర మేనమామగారిదీ, తర్వాత లక్ష్మణరావుగారిదీ, తుదకు రవీంద్రుడిదీ శిక్ష ఆయన్ని పరిణతప్రజ్ఞుణ్ణి చేసింది. ఒకమారు నేను రాశిన యీ వాక్యాన్ని చూడండి. "ఇదివరకు గర్భితంగా ఉండే సుబ్బారావుగారి శక్తికి రవీంద్రసాహచర్యం నిగురుగప్పిన నిప్పును ఊదినట్లైంది. అప్పటినుంచి యీ నవకవి దివ్యతేజస్సు గోచరించినట్టు, దైవసాక్షాత్కారమైనట్టు, మారిపోయాడు. ప్రతివస్తువును పరిశీలించే సామర్థ్య మలవడింది. దృష్టి విశాలమైంది. సకల విద్యలూ నేర్చినవాడల్లే ప్రతిసంగతీ ఆలోచించి తత్వాన్ని తెలుసుకునేశక్తి కలిగింది." తృణకంకణంలో వ్యక్తమైన యీన నవ్యతా, మనస్తత్వమూ, కళాదృష్టీ, మొదలైనవన్నీ కలకత్తానించీ వచ్చిం తర్వాత స్వతంత్రాలైనై. అంతేగాక రవీంద్రుడి గూఢత (mysticism) కూడా కొంత పట్టుపడ్డది. గవేషణమూలంగా వాఙ్మయతపస్సు ప్రారంభించాడు. నిరంతరకృషి చేస్తున్నాడు. స్నేహలతాదేవి, కష్టకమల మొదలైన కావ్యాలన్నీ వచ్చాయి. తుదకు తన నవ్యతకూ, తన వాఙ్మయతపస్సుకూ కారణభూతాలైన అంతశ్శక్తులను చెబుతూ తన కావ్యాల కన్వయించే లక్షణగ్రంథం "రమ్యాలోక" మనే పేరుతో రచించాడు. నవ్యాంధ్రకవిబ్రహ్మాని కీర్తి పొందుతున్నాడు.

ఈన ఆ స్తికుడు. వాఙ్మయతపస్వి. జిజ్ఞాసువు. తత్త్వాన్వేషకుడు. మిగిలిన చాలామంది ఆధునికకవుల మనుకునే వాళ్ళల్లే పరసాంప్రదాయాల్లో కొట్టుకొపొయ్యేవాడుకాడు. నిర్గుణమైనపరతత్వం సాధించటం కష్టమై సగుణమైన ప్రకృతిని వాఙ్మయంద్వారా భాషామతల్లిగానూ మనస్సాలలితగానూ ఉపాసించాడు.* ఈయనయొక్క హృదయ పావిత్ర్యానికీయన తన కావ్యాల్లో చిత్రించిన "అమలినశృంగారమే" సాక్షి. ఈనకు శీలం చాలా ముఖ్యం. పూర్వుల సాంప్రదాయం పవిత్రం. పూర్వవాఙ్మయం వారు మనకిచ్చిపోయిన మాన్యమని యీనతలంపు. ♦ కాని దేశకాల పాత్రాల ననుసరించీ, నాగరకాతిజ్ఞానాల ననుసరించీ సారస్వతక్షేత్రంలో కొత్త పంటలు పండించి క్షేత్రాన్ని ఫలవంతం చెయ్యాలని వీరిమతం. అంతేగాని గతానుగతికంగా వాళ్ళవీ వీళ్ళవీ కవితా మర్యాదలను తెచ్చుకుని అంధపరంపరగా, వ్యక్తిత్వశూన్యాలుగా, సంప్రదాయ విరుద్ధాలుగా, పిచ్చిరాతలు రాశి మేము నవ్యులమని చంకలు కొట్టుకోవాలనీకాదు;

---

* "కానబడ కనుమాన ప్రమాణమునకె
అంది యందని పరతత్వ మవల నుంచి;
పంచభూాత దృశ్యం బైన ప్రకృతి యొకటె
సన్నిహిత లక్ష్య మనియె వచస్వి నేడు"
"అందు నీవిలక్షణ జీవయాత్ర కైన
పృథివినే నవ్యులు సమాశ్రయింత్రు భక్తి
తల్లిగా ధాత్రిగా దేవతామతల్లి
గా నమస్త పరాపర కార్యములకు"

(రమ్యాలోకము)

♦ "పరిణతవాక్కు, లస్మదనవద్యకలాకవితాపితామహుల్
స్థిరముగనిచ్చిరీ తెలుగు తీయని మాన్యము, నిందు నూత్నప
ల్లరులను, క్రొత్తయంట్లను ఫలద్రుమజాతులనాటి పెంతుసం
బరముగ, నే వనప్రియలు మంచెలపై నెలుగెత్తి పాడగా౯."

(తెనుగుమాన్యము)

లేక ఊహాకందనీ, పోలికకుపొందనీ భావనాకాశంలో నిరంతర విహంగయానం చేస్తూండాలనీ కాదు యీన అభిప్రాయం. భాషా విషయంలోకూడా యీన అభిప్రాయం సౌలభ్యమే. సాక్షాత్తుగా వ్యావహారికం రాయకపోయినా, సామాన్యంగానూ సులభంగానూ ఉన్నట్టీ, అర్ధానుస్వార శకటరేఫలచేత నిబిడం కానీ, సంఘసూత్ర శృంఖలలతో పూర్తిగాబద్ధం కానీ, వక విశిష్టశైలిని రాస్తాడీయన. ఈన శైలికి శ్రవణసుఖమే ప్రమాణం. * ఆకారంలోనూ, నేపథ్యంలోనూ యీన కళాదృష్టి గోచరమౌతూవుంటుంది. "వాగర్థ ప్రణయం" యీనకు తెలిసినట్టు నవ్యులలో చాలామందికి తెలియదు. శబ్దజాలాన్ని యెట్టి సందర్భాల్లో యెట్టిదాన్ని ఉపయోగించాలనో తెలుసుకోడంలో యీనకు చాలా శక్తివుంది. "ఈయన స్వసంస్కారంతో నవ్యకవితాసామ్రాజ్యాన్నెట్లా యేలుతున్నాడో, అట్టి స్వశక్తితోనే నిజాంరాష్ట్రాంధ్ర విద్యాపీఠాన్నలంకరించాడు." "పవిత్రభాగీరథి తనరసవజ్జల ప్రవాహంతో తాను ప్రవహించిన ప్రదేశాన్నంతా యెట్లా సస్యశ్యామలంగా చేసిందో, అట్లాగే యీన తన కవితా ప్రభావం చేత ఆంధ్రయువకుల హృదయ క్షేత్రాలను సరసాలుగానూ, ఫలవంతాలుగానూ, చేశాడు. ......... ఎంతగంభీరంగా కనపడతాడో హృదయమంత మెత్తన.........ఆంధ్రదేశంలో యీన నాటిన నవ్యాంధ్ర కవితా బీజాలు పెరిగి వృక్షరూపాలై ఫలాలనిస్తున్నై. ఇప్పుడీన ఆంధ్రమాత చెల్లెలైన తెలంగాణంలో అంట్లునాటాడు. ఆఅంట్లు కాపు ప్రారంభించినై. భాగ్యనగరాంధ్ర యువజనుల యందుత్పన్నమైన కవితోత్సాహమే యిందులకు తార్కాణము." సరిగా

"మృదుల సరళాక్షరముల సమ్మేళనాప్తి,
నార్ద్రనవనీత మార్దవమగును నుడువు
శ్రవణసుఖమిచ్చు నలలితోచ్చారణమున
భంగిమ యటందు రీపదబంధసరణి"

(రమ్యాలోకం)

ఈన మార్గంలో ప్రవర్తించిన నవ్యకవులు చాలామంది లేరు. ఈన తపస్సు వాళ్ళకు లేకపోవటమే యిందులకు కారణం. సుబ్బారావు గారు సారస్వతానికి చేసిన కృషి స్పృశిస్తూ విశ్వనాథవారిట్లా అన్నారు. "సుబ్బారావుగారు వారిగీత నూత్నత్వం పండితులకు తగిన భాషలో ప్రకటించి, భాషనుగురించి మాట్లాడటానికి వీల్లేకుండా చేసి, ఆమార్గంలోవున్న క్రొత్తదనం పండితులచేతకూడా క్రొత్తదన మని వొప్పించాడు." ఇది ముమ్మాటికీసత్యం. ఈయనకూడా "కవి బ్రహ్మ" అని కొంతవరకనచ్చు. నూతన కవిసమయాలను సృష్టించాడు. వెనుకటినుంచీ వస్తున్న ఉపమా రూపకాలంకారాది సామగ్రిగాక క్రొత్తదాన్ని నిర్మించుకున్నాడు. * తెనుగు పలుకుయొక్క మార్దవాన్ని చూపుతూ, మామూలుగా వాడుకుంటున్న అందమైన అనేకపదా లను పద్యాల్లోపెట్టి వాటికి గౌరవమిచ్చి భాషాసేవ చేశాడు. నుడికారానికి అచ్చమైన తెనుగుతనాన్ని లవడచేశాడు. నూతనత్వాన్ని ద్వేషించే పండితులచేత తలలూపించాడు. ఇదివరకు సంభోగమే పరమావధిగా గల శృంగారరసానికి పావిత్ర్యం కల్పించి, అమలినం చేశి, సంభోగంకంటె, విప్రలంభం అమలినమనీ, దానికంటె తల్లి బిడ్డలమధ్యనూ, సఖులమధ్యనూ వుండేది శాశ్వతమై, స్వార్థరహితమై పవిత్రమైందనీ, అమలినతమమనీ, సిద్ధాంతీకరించాడు. ♦ ఎవరికోసం

* "కనుగందిన కవటాకన"

♦"విషయమయ మైన సంభోగ విధి జగాన
క్షయమ యయ్యె, రూపాంతర సంగ్రహమున
సుప్రజాతంత్ర నిర్వాహ సూత్ర మగుట
తలచెదరు దంపతీనిష్ఠ ధర్మముగనె.
మాధురి లిచ్చయించెదరు సంభోగసుఖము,
నే వియోగ మాధుర్య లీలావిపాక
మనుభవింప నజ్ఞాడెద ననడె యాంధ్ర
రసిక కులరాజు పండితరాజు మున్ను!
తీవెమీద సుతారంపుతీవి నిలిచి,

రాస్తున్నారో, యెందుకోసం రాస్తున్నారో, యేమిరాస్తున్నారో, కూడా తెలియకుండా రాశేవాళ్ళల్లే గాక వక ఉన్నతలక్ష్యం కలిగి, వకతత్వరహస్యాన్ని తాను కనుక్కొని సోదరుల కియ్యాలనీ, తనతో పాటు వాళ్లనుకూడా కూడగట్టుకుని పోవాలనీ, వ్యక్తిత్వంతో రాశిన వాడీయన. ప్రకృతి తనకు సాక్షాత్కరించినట్టు ఆయన ఆమెను పరిశీలించి, ఆమె తత్వాన్ని గ్రహించి, దాన్ని లోకానికి విప్పిచెప్పాడు. అశ్లీలమంటే పనికిరాని సచ్ఛీలంతో నిండుంటై కావ్యాలన్నీ. దేశ భాషాభిమానాన్ని వెదజల్లుతూఉంటై. ఉత్సాహమే తప్ప దుఃఖ మెక్కడా కనపడదు. శృంగారార్చనమేగాని శృంగారానుభవంకాదు యీనకు ప్రాప్యం.* భాషాసేవ యీన కొక తపస్సువంటిది.♦ ఈనకు తల్లిభాషయందు, మాతృదేశమందు ఉన్న అభిమానమూ ప్రీతీ నవ్యాంధ్రకవులలో చాలామందికి లేదు.‡ ఈవిధంగా సుబ్బారావుగారిది వక మార్గం.

---

పగలబడి నవ్వు పువ్వుపై కెగయు అళిని,
ప్రియుడు ప్రియురాలి నట్లు చేర్చెనో కసుకవి
బిడ్డ తల్లిని భాతి కల్పె మహాకందు.
కులశుభాంగీ వయోధీర కుసుమమందు
మోహమధువె గవేషించె మున్ను సుకవి;
సాత్వికప్రేమ కోశపేశలము లయిన
వత్సలామృత రుచులను వలచెనేడు." (రమ్యాలోకము)

"ఏతదమల సౌందర్యార్చనాతిరేక
మాత్మభావన, నానందమై ఫలించు."

"భాషకంటె నవ్వులకు తపస్సు లేదు"

"ఏ ప్రఫుల్ల పుష్పంబుల నీశ్వరునకు
పూజ సల్పితినో యిందు పుట్టినాడ!
కలదయేని పునర్జన్మ, కలుగుగాక
మధురమధురం బైన తెనుగు మాతృభాష!"

(రమ్యాలోకము)

కొంత విశ్వనాథ మొదలైనవాళ్ళల్లో కొంతమందిలో కనపడుతుంది.

అప్పారావుగారు రెండో మార్గానికి మార్గదర్శి. ఆయన సంస్కార ప్రియత్వం, వ్యావహారిక భాషాభినివేశం కలవా డయినా చాలా సహృదయుడు. రసవేత్త. కళాభిజ్ఞుడు. మన స్వత్వ మర్మజ్ఞుడు. ఇందులకు ఆయనరాశిన కన్యాశుల్కమే ప్రమాణము. హాస్యరసం యీన సొమ్ము చేసుకున్నాడు. ఈనను జానపదగీతాలు ఆకర్షించినై. వాట్లోవుండే నుడికారమూ, హృదయాకర్షకత్వమూ గ్రహించాడు. వీరేశలింగం పంతులుగారి అంశ వీరిలో చాలావరకు ఉంది. ఈన తన సంఘసంస్కార ప్రియత్వానికీ వ్యావహారికభాషా ప్రచారానికీ మాత్రాఛందస్సులతో వుండే గీతాలను గ్రహించాడు. అవి చక్కని జాతీయాలతో నిండివుండడంచేత, అదివరకు నిరాదరింప బడుతూ, స్త్రీలకూ, నిరక్షరాస్యులకూ అనుకునే యిటువంటి గీతాలు చిత్తసంస్కారం కలుగుతూన్న యువకులను చాలా ఆకర్షించినై.* వాటికిచ్చిన "ముత్యాల సరాలు" మొదలైన పేర్లుకూడా యీన ప్రతిభా సృష్టే!♦ ఈన గీతాలుకూడా సుబ్బారావుగారి గ్రంథాలల్లే యువకుల్లో భావపరివర్తనం చేశినై యనే చెప్పాలె.‡ వెనక నేను మనవిచేసినట్టు యెవరిది వారి మార్గమే గాని వకర్ని చూచి వకరు రాయలేదు. అప్పారావుగారు సామాన్య గణఛందస్సులను గ్రహించి భావప్రధానంగా ఖండకావ్యాలు రాయలేదు. సుబ్బారావుగా రప్పట్లో గీతాలనూ, వ్యావహారికభాషనూ తలపెట్టలేదు. రెండు మార్గాలూ నవ్యాలే! ఇద్దరూ మనకు వంద్యులే. కాబట్టి

---

* ఏలూరు మంజువాణీ ప్రెస్‌వారు స్త్రీలపాట లని మూడుభాగాలుగా ప్రచురించారు.

♦ ఈన దేశాభిమాని కూడాను.

‡ "క్రొత్త పాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా"

పౌర్వాపర్యమానుషంగిక మని వదలి యిద్దరినీకూడా నవ్యసాహిత్య పితృసమాను లనడం సమంజసంగా కనపడుతున్నది. ఈ రెండు మార్గాలూ క్రమంగా అన్యోన్యసహకారులై కలిసి నవ్యసాహిత్య నది ప్రవహించింది. అప్పారావుగారు గిడుగువారికి కుడిభుజంగా వుండి వారి భాషాప్రచారానికి జీవితకాలమంతా సహాయపడ్డాడు.

ఏతదనుయాయులు :

శ్రీ రామలింగారెడ్డిగారు "ముసలమ్మ మరణం"* 1900 సంవత్సరం నాటికే రాశినప్పటికీ అది అప్పట్లో యెవ్వరినీ ఆకర్షించలేదు. కాబట్టి యువకజనం దానివల్ల ఆకర్షింపబడలేదనే చెప్పాలె. కాని సుబ్బారావుగారి తృణకంకణ ప్రచురణం తర్వాత యీ రెడ్డిగారి గ్రంథం మీదికి కొంచెం దృష్టి మళ్లింది. కాబట్టి రెడ్డిగారి ఖండ కావ్యంగాని, 1914 సంవత్సరంలో రాశిన "అర్థశాస్త్రాంకిత పద్యాలు" గాని, యువకజన మనస్స్వత్వపరివర్తనంలో భాగం తీసికోలేదు. కాని ఆ ఖండకావ్యాలు కొంత నవ్యమార్గా న్ననుసరిస్తూ ఉదాత్తంగానూ రసవంతంగానూ ఉన్నయ్యనటాని కెట్టి అభ్యంతరం లేదు. ఈ విషయా న్నింతటితో విరమించి, అప్పట్లో యీ సుబ్బారాయ, అప్పారాయ మార్గాలను అనుసరించినవాళ్లల్లో ముఖ్యులనుగూర్చి మనవిచేస్తాను. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారీ మార్గాన మొదట కొంత సాధనచేశినవారిలో వకరు. విశ్వనాథవారన్నమాట చూడండి. "వారి 'శమీపూజా, పెనుగొండ పాటా' మొదలైనవి తెలుగులో చావవు. అటువంటి గొప్ప మేధావి కవిత్వాన్ని వదిలివేసె నననగా ఆంధ్ర సరస్వతి దుఃఖించాలశిన విషయం." ఇంతకంటె వారి ప్రశంస యెవ్వరు చెయ్యగలరు? కాని యిటీవల యీన "శాలివాహన సప్తశతి" పరివర్తనంచేసి శ్రీనాథుడి గ్రంథం అంతరించిందే అనే

* యిటీవల యీపుస్తకాన్ని సవివరణంగా ప్రకటించారు.

లోటును తీర్చాడు.* అబ్బూరి రామకృష్ణారావుగారిని గూర్చి యిదివరకు కొంచెం ముచ్చటించాను. ఈనకూడా నాకు చిన్ననాటి మిత్రుడు. నాతోపాటు చదువు చరచర అబ్బనివాళ్ళల్లో వకడు. ఈనకూడా సంస్కారం ఆజన్మంగావున్న మనిషి. ఈనకూడా ఉత్సాహం, సంతోషమే గాని దుఃఖం బాధపెట్టేదిగాదు. దుఃఖంలో కూడా నవ్వే వ్యక్తి. మేం కొందరం అట్లాంటి చిత్తవృత్తులు గల వాళ్ళం కాకపోతే బ్రతికివుండేవాళ్లంకాము. ఆత్మహత్య చేసుకునే వాళ్ళం మాకు వచ్చిన ఉల్లా సీదాలకు! మా హాస్యప్రకృతే మాకు పట్టుకొమ్మ! రామకృష్ణారావుగారు మద్రాసునించి మైసూరు వలస వెళ్లాడు. ఈన విద్యార్థి దశలోనే యీన కావ్యాలు పఠనీయ గ్రంథాలుగా నిర్ణయింపడ్డై. ఎంత గొప్పో చూడండి? ఈన "మల్లికాంబ" "ఊహాగానం" మొదలైనవి యీ రాయప్రోలు ప్రోద్బలంవల్ల ఉద్బుద్ధాలైనవని నాఅభిప్రాయం. పింగళి లక్ష్మీకాంతం కాటూరు వెంకటేశ్వర్రావు గార్లుకూడా యీ ప్రకృతికవిత్వంచేత ఆకర్షింపబడ్డారు. వీళ్ళ సంస్కారానికి చెళ్ళపిళ్ళ శిష్యత్వం వన్నె తెచ్చింది. వీరి బుద్ధులుకూడా నవ్య రచనకు దోవతీసినై. "సంక్రాంతీ, తొలకరీ" (1915-19) యీ మార్గానుయాయులే.♦ వీటిని "జానపదకావ్యా"లనవచ్చు. (Pastoral

---

* "నాటకోపన్యాసములలో శర్మగారు విశదీకరించిన 'లయ' విచారము చాల పరినిష్ఠితమైనది. 'రాయలనాటి రసికత' యను నుపన్యాస మాతని సరసత్వమున కుదాహరణము. 'గాన' మీతని సంగీత పాండితి కనుప్రాసము. 'నాచన సోముని' యుపన్యాసము లాతని సాహితీపటిష్ఠత కన్వాదేశము. 'నాటకోపన్యాసము' లాయన పరీక్షణదృష్టికి కర్కశ తార్కికదృష్టికి నిక్షేపములు. 'వేమన' యాతని సర్వస్వము. గద్యరచనలో శర్మగారికి మించినవా రాంధ్రదేశమున లేరు."

(భారతి. వృష-కార్తీకము)

♦ లక్ష్మీకాంతంగారుకూడా తానే యీ నవ్యకవితకు మార్గదర్శనే అభినివేశం కలవాడుగా కనపడతాడు. కాని ఈ మార్గంలో ప్రథమానుయాయులలో వక డనడంలో యెట్టి అభ్యంతరం లేదు.

poetry). ఈ కావ్యాలు తెలుగుకి ఆంధ్ర నవ్యసాహిత్యంలో కొన్ని తొలకరి గ్రంథా లనడంలో యెట్టి ఆశ్చర్యంలేదు.♦ వింజమూరి రంగాచార్యులుగారిని గూర్చి మా పరస్పర సంబంధాన్ని గూర్చి వెనక ముచ్చటించాను. ఈన ప్రచురించిన గీతాలు చాలా తక్కువ. కాని ప్రచురించిన రెండు మూడా అచ్చంగా అప్పారావుగారి వాటిని మరి పించేటట్లుంటై. ఈన్ను గూర్చి విశ్వనాథవా రన్నారు. "వకటి రెండు రాశి ఉపసంహారించుకున్న వారిలో నేనెరిగియున్నది, వింజమూరి రంగాచార్యులుగారే! ఇటువంటివా రెంతమందో యింకా దేశంలో ఉండవచ్చును."* తుదకు బసవరాజు నండూర్లు. బసవరాజు అప్పారావుపేరెత్తితే నాకు కండ్లకు నీళ్లు రాకుండా వుండవు. అతని

♦ దువ్వూరి రామిరెడ్డిగారు యీ కాలానికి కొంచెం దగ్గర అనగా 1917, 1919 ప్రాంతంలో నేతలెత్తడం మొదలెట్టాడు. "నలజారమ్మ అగ్నిప్రవేశం" (1917) "కృషీవలుడు" (1919) యీన ప్రథమ కావ్యాలు. కర్షకుడి జీవితాన్ని బహు రసవంతంగా చిత్రించాడు రెండో గ్రంథంలో. రెడ్డిగారు పలవరించిం దీమాదిరి కావ్యాల్లేకపోవటాన్ని గురించే! ఇప్పటికీ పాఠకుల నాకర్షిస్తూనేవుంది. మొదటి దొక పతివ్రతా చరిత్ర. 1920 కి "జలదాంగన" రాశాడు. "కృషీవలుడు" అనే కావ్యాన్ని విమర్శకుడైన శ్రీ రెడ్డిగారు *Pastoral poetry* లో చేర్చి ప్రశంసించాడు. "ఇందు వస్తువూ, వర్ణనా కూడా స్వాభావికములై కర్షక జీవితమును ప్రతిబింబింపచేయుచు హృదయము నాకర్షించుచున్నవి." "ఉన్నవి (కవితకు మేలైన యన్యకర్మములు) యను టకు ఈ "కృషీవలుడు"ను, అబ్బూరి రామకృష్ణారావు, రాయప్రోలు సుబ్బారావు మొదలైన యువకులు విరచించియుండెడు నవ్యకావ్యములును ప్రమాణములు."

(రెడ్డిగారి పీఠిక)

వెంకట పార్వతీశ్వర కవులనుకూడా పేర్కొనాలశిందే. వీరు సుబ్బారావు, అప్పారావుగార్లలో యెవ్వరినీ అనుసరించలేదేమో అనిపిస్తుంది. అప్పారావుగారి భాషాతత్త్వాన్ని "హారావళి"లో నిరసించారు. కాని గీతపద్యగుచ్ఛాల్లో చక్కని శైలిలో నవీనమార్గాల కొన్ని ఖండకావ్యాలు రచించారు. వీరినికూడా నవ్యమార్గ ప్రవర్తకుల్లో చేర్చాలె. "ఏకాంతసేవ" చక్కని గ్రంథం. "భక్తుడు ప్రణయినీ స్వరూపమున పరమేశ్వరునిగూర్చి పాడిన దివ్యగాన మిది."

సెలయేటి గానం సంపూర్ణంగా గు. అప్పారావుగారి మార్గావలంబి. సేయాన్ని గ్రహించిన ముద్దులు మూటకట్టే తీరు తియ్యాలు గల వ్యవహారంలో వున్న భాష రాశాడు. నవ్య సాహిత్య నిర్మాతల్లో వొకడై తన పేరుకు శాశ్వతస్థితి కలుగజేసుకున్నాడు. ఈయన అవలంబించిన భాషా, పద్ధతీ కూడా అత్యుత్తమాలు. ఆదర్శకాలు. విశ్వనాథవారేమన్నారో చూడండి. "శ్రీ బసవరాజుగారి వాణి ఆరోజుల్లో మధురంగా వినిపించినవాటిలో వకటి. ఆయన పలుకుబడి గుండెకు సూటిగా ఉండేది. ఆయన కొన్ని కావ్యాల్లో హృదయాన్నే మాటల్లో పెట్టేవాడు. Wordsworth కవివలె వక ఆవేశంవస్తే దివ్యంగా పాడి తక్కినప్పుడు భౌమంగా రాశేవాడు."* (విశ్వనాథవారల్లే యెల్లప్పుడూ వక్క మాదిరిగానే రాయడ మందరిచేతౌంతుదా!)

యెంకిపాటలు :

ఈ ప్రథమ వింశతి వత్సరాంతానికి వీళ్ళవేగాక యితరత్రా కూడా యీ మాదిరి అవ్యక్త మధురగానం వినబడుతూనే వుంది. కాని దానికింకా వక రాజమార్గ మేర్పడలేదు. ఖండకావ్యం తలెత్తి వ్యాపించడం మొదలు పెట్టింది!

ఈ నవ్యమార్గవిషయంలోనే యీ వింశతివత్సరాల్లోనే వక గొప్ప సంగతి జరిగింది. అది యావదాంధ్రసారస్వతాన్ని తల్లకిందు

* తన వాణినిగూర్చి తానే అప్పారా విట్లా చెప్పుకున్నాడు. "మా కవితాకన్య చిన్నతనమున నుండియు రాగిణి, భావనోద్దీపిత, గానలోల, రసజీవిని." ఈన గీతాలు కొన్ని దేశమంతటా పాకినై. ఇంకేం కావాలె?

"కొల్లాయి గట్టితే నేమి
మా గాంధి
కోమటై పుట్టితే నేమి"
"గు త్తొంకాయ్ కూరోయ్ బావా..."

చేసింది. "యెంకిపాటల" నెరగని ఆంధ్రు డుండడని గట్టిగా చెప్పవచ్చు ఇవీ, వీటిని రాశిన కవీ, సారస్వతక్షేత్రంలో ఒక హిమాలయోన్నత మంత పదవిని సంపాదించి భూమ్యాకాశాలకు వంతెన కట్టారు. మా అప్పారావు వాటికి ప్రేరకుడనడంకంటే అతని అత్యంత ప్రియమైన నాకు సంతోషావహమైన అంశం లేదు. ప్రథమాప్పారా(వు) మోహనక్షేత్రమైన నవ్యాంధ్రగీతాస్రవంతి, ద్వితీయాప్పారాయ (బ) హృదయసీమలో పడి పొంగి, పొర్లి, నందూరి సుబ్బారాయ హృదయక్షేత్రాన్ని ఫలవంతం చేసి దానిలోనించీ శాశ్వతగీతామృతాన్ని ఉద్భవింపజేసింది! ఇప్పటికివి గురుపరంపర. ఈ కార్యంలో తృతీయాప్పారావు (పాటిబండ) చెయ్యి కూడా పడింది. 1917-18 నాటికి నండూరు సుబ్బారావుగారు క్రైస్తవ కళాశాలలో చదువుతూ వుండేవాడు. నల్లగా, గుండ్రని మొగం, ఆయనా వుండేవాడు. ఏదో కొంచెం సారస్వతప్రేమ వున్నవాడనుకునే వాళ్ళంగాని ప్రథమప్పారావు, ప్రథమసుబ్బారావు (రా)గా నాకర్షించి నంత మా హృదయతంత్రుల నాకర్షించలేదు. కాని "Full many a gem of the purest ray serene, the dark unfathomed caves of Oceans bear;" అన్నాడు మహాకవి. ఏ పుట్టలో యే పాముందో! ఈకింది వారిమాటలు చూడండి, "ఈపాటలు నేనుమద్రాసులోక్రైస్తవ కళాశాలలో పట్టపరీక్షకు చదువుకునే దినాలలో (1917-18) వ్రాయ మొదలెట్టినాను. అప్పుడు నా అదృష్టంవల్ల మ. రా. శ్రీ. అధికార్ల సూర్యనారాయణరావుగారి (జానకీపతి) స్నేహభాగ్యం లభించటం, ఆయనతో కలిసి వాసంచేయటం, కలిగింది. నన్నంతకుమునుపే సార స్వతవిషయాల్లో అంతో యింతో తరిఫీదు చేయుచున్న మా బసవ రాజు అప్పారావు కూడా అక్కడే వుండేవాడు. వారితో ముచ్చట్లకు మ. రా. శ్రీ. పాటిబండ అప్పారావుగారును వచ్చుట మామూలు. వారందరూ యెవరి రచనలనుగురించి వారు సొంపుగా మాట్లాడుకుం టూంటే నే నొకప్రక్క కూర్చుని విస్తుపోయి వినటం రివాజు. ఒక నాడు ట్రాంబండిలో కాలేజీనుండి వస్తుండగా, గొంతులో సన్నని

రాగం బయలుదేరింది. దానిని నాలో నేను పాడుకోవాలని సాహిత్యం చేసుకోబోయాను. ఎప్పుడో విన్న పదంలాగున "గుండె గొంతుక లోన కొట్లాడుతాదీ" అన్నపల్లవి వచ్చింది. అదే మననం చేసుకోగా చేసుకోగా ఇల్లు చేరేసరికి నేను రాసిన మొదటిపాట తేలింది." ఇది చదువుతూంటే వాల్మీకి "మానిషాద" కథ చదివినట్టుంది. ఎట్లా విశ్వామిత్రుడు పుట్టకోవలోనుంచీ ఊదిన "కూ" శబ్దాన్ని విని వాల్మీకి పుట్టలోనుంచీ "కూజంతం రామరామేతి" అంటూ లేచాడో, అట్లా గొంతులో వినపడ్డ, మిత్రులకవితా సల్లాపాలు వింటూంటే అవ్యక్తంగావుండి బడినించీ వస్తూంటే చెవిలో వినపడ్డ "సన్ననిరాగం" మెంకిపాటలకు "అ" కారమైంది. ఎట్లా "అకారఉకారమకారాత్మక మైన ప్రణవంలోనించి" సమస్తవేదాలూ పుట్టాయో అట్లాగే యీ కావ్యవేదం పుట్టింది. ఇది వక విధంగా చూస్తే యీ కావ్యానికీ సుబ్బారావు ద్రష్టేగాని రచయిత కాడన్నట్టు కనిపిస్తుంది. చూడండి యింటికొచ్చి మిత్రులకు వినిపించేటప్పటికి యేం జరిగిందో!

"మా జానకీపతికిన్నీ, అప్పారావుకున్నూ, యీపాట గద్గది కతో వినిపించాను. 'సెబాస్ వ్రాయ' మన్నాడు జానకీపతి. 'నీవు )త్యం వాడేభాషకా దిది, యీ భాషసాయమున సత్యాన్వేషణం చేయలేవ'న్నాడు మా బసవరాజు అప్పారావు. ఏ సమయమున వెన్ను చరిచాడో, సూర్యనారాయణ! అప్పటినుండియు 'మెంకిని' కవితారీతిని స్మరించుట నిముసమైన మానలేదు. అతడును అంతకం కకూ తన అభిప్రాయమును బలపరుచుకున్నాడు. మా అప్పారావు రాను రాను తన అభిప్రాయం మార్చుకొని యిటీవల అతడును వల్లె అనుచున్నాడు. పాటలు అప్రయత్నంగా వచ్చేటట్లు ప్రసాదించిన మెంకికి కృతజ్ఞుడనా? ప్రోత్సాహంచేసి వీపుతట్టిన అధికార్లవారికా? కవిత్వ కళారహస్యాలు తెలియజెప్పిన మా బసవరాజు అప్పారాయ )కా? ముప్పురకును!" ఈ పైదానిలో అప్పారావు(బ) రా.సుబ్బా

రాయ మార్గంవాడు కాడనీ, ప్రథమాప్పారాయ (గు) మార్గంవాడనీ అంతస్సాక్ష్యంచేత స్పష్టం. "నిత్యం వాడే భాషలో సిద్ధిపొందినవాడు" అప్పారావు. అనగా అప్పారాయోపజ్ఞ నందుకున్నవాడు. అధికార్ల సూర్యనారాయణగారు చాలా సహృదయుడూ, భాషాసేవచేసిన వాడూను. పాటిబండ అప్పారావు సహృదయుడూ, ఇతరవృత్తిలో వున్నా సరస్వతిని మరిచినవాడు కాదు.

చూచారా పైసాక్ష్యం! మా అప్పారావు(బ) నండూరి సుబ్బా రావుగారికికూడా "మా అప్పారావే" గాక "కవితా కళారహస్యాలు తెలియచెప్పిన" వాడైనాడు. గురుశిష్యులు నవ్యాంధ్రసాహిత్యమేలిన వాళ్ళు. ఇప్పుడు మా అప్పారావు నొకమారు తల్చుకోండి! అతని సేవ యెంతగా తేజరిల్లుతున్నదో! ప్రథమాప్పారావు దగ్గిర నేర్చుకు న్నాడు. నండూరు సుబ్బారావును తయారుచేశాడు. ఈ గురుపరం పరలో పరమగురువును మించినవాడు గురువు. గురువును మించిన వాడు శిష్యుడు. వాడుకభాషలోనే సిద్ధిపొందినవాడు ప్రథమాప్పా రావుగారు. వాడుకా, జానపదా, భాషలను రెంటినీ గ్రహించి సిద్ధి పొందినవాడు మాఅప్పారావు, వాడుకభాష ఊసుయెత్తుకోకుండా కేవల జానపదభాషలో సంపూర్ణరససిద్ధిని సాధించి మాగురువులగు శ్రీ ఆదినారాయణశాస్త్రిగారి మన్ననలవడసినవాడు నండూరు సుబ్బా రావుగారు.* ఈసంవత్సరాలప్రాంతంలోనే శ్రీ ఆదినారాయణశాస్త్రి గారు పట్నంవచ్చారు. ఉత్తరదేశంనించి సర్వవిద్యాపారంగతులై వచ్చి నిగర్వచూడామణై, యిన్నివిద్యలు వీరిలో యెట్లాఉన్నాయా అనుకునే టంత సన్నని శరీరంగలిగి, అనర్గళమైనధారతో మాట్లాడారాయాశక్తి

* అప్పారాయా! నీకీర్తి యాచంద్రార్కముండుగాక!

గల యీ అద్భుతవ్యక్తియొక్క పరిచయం నాకు 1917 సంవత్సరంలో నేను వారివద్ద కౌముది చదివే శిష్యుడుగా ప్రవేశించినప్పుడు కలిగింది. వారిరుణం యిప్పటికీ నేను తీర్చుకోలేదు. వీరుదక్షిణదేశం రావటం కూడా నవ్యసాహిత్యనిర్మాణానికి సంబంధించిన ఘనకార్యాలలో వకటి! ♦

♦ కాబట్టి అప్పారాయత్రయం (గు. బ. పా.), సుబ్బారాయద్వయం (రా. నం.)' రెడ్డిద్వయం (కట్టి. దు.), యీ కాలానికి సంబంధించిన రాతగాళ్లల్లో ముఖ్యులు! ఎంత గొప్పకాలం !

# నవ్యాంధ్ర సాహిత్యవీధులు

౮

**కవిత్వతత్వవిచారరచన:**

ఈ ఘట్టంనించీ విమర్శన ఘట్టానికి వస్తాను. ఇంతవరకు విమర్శన మెట్లావుందో తెలుసుకోవడం ముందు కావాలి. ఇప్పటికి సరియైన విమర్శనము వెలువడలేదు. మూడు రకాలుగా వుండే విది. వెనకటి గ్రంథాల కొకపద్ధతి. తాత్కాలికాలై సమకాలికులవాటికొక పద్ధతి. పాశ్చాత్యవాసన కలవాళ్లు రాశేది మూడోది. ఈ మూడు పద్ధతులా నడుస్తూ విమర్శన యెక్కువగా పండితుల చేతులో వుండేది. భారతాదిగ్రంథాలకు పీఠికలలో మొదటి తరగతి వుండేది. వాటిలో అంతా పొగడ్తే! ఆ పొగడ్తాకూడా కార్య కారణ భావం లేకుండా జరుగుతూండేది. ఎప్పుడూ ఉత్తమశబ్దాలేగాని పరీక్ష లేదు. భాషాంతరీకరణాలైతే సంస్కృతానికీ తెనుగుకూ తారతమ్యచర్చ వీటిలో కొంత వుండేది. పండితుల్లో గర్భశైత్యాలు! అందుచేత రంధ్రాన్వేషణం చాలా ప్రధానంగా వుండేది! వక్కమారు అముద్రితగ్రంథ చింతామణిగాని మరే పత్రికగాని వెనక సంచికలు తిరగేస్తే వీటిసంగతి తెలుస్తుంది. విమర్శకుల పాండిత్య ప్రకర్షే పరమావధి. సానుభూతి అనేదే లేదు. అటువంటి విప్పటికీ కనపడుతూనే వుంటై! వ్యాకరణదోషాలుచూపటం విమర్శకుడిముఖ్యవిధి అని వీరిఅభిప్రాయం. కృతిలో రసం చూపించి దాని ప్రాశస్త్యాన్ని చెప్పటం వాళ్ళ కర్తవ్యమల్లె వారికి తోచనే తోచలేదు. ఇక మూడోరకం విమర్శన మెట్లా వుండేదో మాగురువులైన శ్రీ వావికొలను సుబ్బారావుగారి మాటలతో చెబుతాను. "ఇంతవరకీ భాషయందుండు విమర్శనములను పేర బిలువబడు గ్రంథములు బండుబూతుల ప్రోవులు. రామా

యణ భారత భాగవతాదులపై సంస్కార చికీర్షువులు వ్రాయు గ్రంథ ములయందు, దబ్బరలు, నపలాపములు మెండుగావున వానిని బుద్ధి మంతుడు చదువకుండుటమేలు. చదువ బూనినచో మూలగ్రంథము నంతయు పఠించి సత్యాసత్యము లెరుంగవలయు. కేవల విమర్శనము లను నమ్మిన ననర్థము తప్పదు." ఈమూడు రకాల్లోకూడా సరియైన పద్ధతులు లేవు. ఒక గ్రంథమును విమర్శించే పద్ధతులా గ్రంథము ననుసరించేయుండాలెయనీ, దేశకాల పాత్రాలూ కవియొక్క సన్ని వేశమూ మొదలైనవికూడా విమర్శనంలో గ్రహించాలెననీ, ముఖ్యంగా సానుభూతీ సహృదయత్వమనేవి అవసరములనీ, యీవిమర్శనాలు తోపజేయవు. రంధ్రాన్వేషణమే విమర్శనమనీ, భాషేవిమర్శనీయాం శమనీ వీటి పరమావధి,* ఇట్టిస్థితిలో ఉంది విమర్శనం. విద్యాధికుడైన కట్టమంచి రామలింగారెడ్డిగారు యీపరిస్థితులు గమనించాడు. ఈయన ఆంగ్లంలో నిష్ణాతమైన విజ్ఞానం కలవాడు. భారతం చదివి తిక్కన హృదయం తెలిసినవారు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారూ యీ రెడ్డిగారూ వీరిద్దరేనని నానమ్మకం. ముఖ్యంగా తిక్కన, పింగళ సూరనలను యీరెడ్డిగారు తెనుగులో మెచ్చారు. అత్యంతమైన దేశ భాషాభిమానాలు కలవాడీయన. గొప్ప విద్యాధికుడైనా, పాశ్చాత్య వాసన తగిలినా, స్వభాషను మరిచిపోని భాషాభిమాని. విమర్శనం సరైనతోవలో లేకపోవడంచూచి, ఆలోటును భర్తీచేయడానికిబూని "కవిత్వతత్వవిచార" మనే బ్రహ్మాండమైన గ్రంథం రచించాడు. ఈన యింగ్లీషు సారస్వతం మన స్తత్వం క్షుణ్ణంగా, సవిమర్శంగా, చదివినవా డవడంచేత తెనుగులో గ్రంథాలను, అటువంటిసూత్రా

*క్వాచిత్కంగా కొందరు కొంచెం పాశ్చాత్యవాసనాసహిత విమర్శనలు రాయ టం సూచిస్తున్నారు. "అధునిక వచనరచనా విమర్శన''మనీ "కవితా విమర్శనము''నీ, "మనుపసుప్రకాశిక'' అనిన్నీ, దానిమీద ప్రతివిమర్శనాలూ మొదలైనవి మూలమూలలు గా వెలువడుతున్నై. వెన్నేటి రామచంద్రరావుగారు, విమర్శకాగ్రేసర కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారూ మొదలైనవారు వీటిలో జోక్యం కలిగించుకుంటున్నారు.

లతో విమర్శించడం ప్రారంభించారు. "వర్డ్స్‌వర్త్‌లో వుండే ప్రకృతి వర్ణనలూ, షేక్స్పియరులో వుండే మానవజీవిత చిత్రాలూ, మిల్టను లోవుండే పవిత్రతా, షెల్లీకీట్సుల్లోవుండే చిత్తవికారమూ, బ్రౌనింగులోవుండే వేదాంతమూ, మన సారస్వతంలో లేవని దుఃఖిస్తే ప్రయోజనమేమైనా వుందా?" * వీటికిబదులు మనకేవేవో గుణాలున్నై. అవ్వీఅన్నీ మరచి వాళ్ళ సారస్వతమే పరమావధిగా తీసుకుని పరీక్షించడంన్యాయంకాదు. ఒకజాతి వాఙ్మయం, దాని సంప్రదాయంమీదా, నాగరకతమీదా, దాని దేశకాలపాత్రల మీదా, ఆధారపడి వుంటుంది. మరిన్నీ దానికి సహజమైన ఏవిజ్ఞానముందో దాన్ని ప్రతిబింబిస్తూ వుంటుంది. హ్లాదరామణీయకాలు సమస్త సారస్వత సూత్రాలైనా, ప్రత్యేక సారస్వతానికి ప్రత్యేకపద్ధతు లున్నై. భావానికీ భాషకూ సన్నిహిత సంబంధమౌటచేత యీ సారస్వతగుణాలు భాష మీదకూడా కొంత ఆధారపడివున్నై. ఏదీ! రాఘవపాండవీయంవంటి వక్క ద్వ్యర్థికావ్యమింగ్లీషులో రాయమనండి చూదాం. గీత గోవిందమంటి భక్తిరసభరితమైంది గానీ, మేఘదూతవంటి ఖండ కావ్యంగానీ, ఇంగ్లీషులో చాలా అరుదు. భారతమంత విజ్ఞాన సర్వస్వమైన కావ్య మింగ్లీషులో వొకటి చూపండి! మనకు మతం, సారస్వతం, విజ్ఞానం, అన్యోన్యాశ్రయాలవడంచేత మనసారస్వతం పాశ్చాత్యవాసనగల వాళ్ళకు కొంతమందికి గిట్టదు. మన జీవితాదర్శంవేరు. వారానికొకమారు దేవుణ్ణి జ్ఞాపకం తెచ్చుకోడం కాదు మనకర్తవ్యం.♦ ఎల్లప్పుడూ జీవితానికీ ధర్మానికీ లంకె వుంటుంది. "బొత్తుగా రెంటికీ దూరమైపోయి రెండోదెన్నాళ్ళున్నా మళ్ళీ ధర్మంగెలిచి సత్యాన్ని స్థాపిస్తుందని" మనవాళ్ళనమ్మకం.

---

* మనవాళ్ళు కొంద రిట్లా అంటూవుంటారు.

♦ *"The English man prays for six days in the Bank of England and for one day in the Church of England."*

*John Gunther.*

మనకు జీవితం గడులవరసకాదు. ఇది వక దేవాలయం: దానిలో యెన్ని పాపాలు జరుగుతున్నా దేవాలయమే! కాబట్టి వాళ్ళ నాగరకతా విజ్ఞానమూ మనకు సంప్రదాయ సిద్ధంకావు. ఈసంప్రదాయాల మీాద ఆధారపడ్డ సారస్వతాన్ని సంప్రదాయానికి విరుద్ధనియమాలతో పరీక్షించడం తప్పు. కొన్ని సామాన్య సారస్వత నియమాలుండచ్చు. మన వాఙ్మయం చాలా మట్టుకు శృంగారరస ప్రధానం. ఈశృంగారం పాశ్చాత్యవాసన వున్న వాళ్ళల్లో కొందరికి తల కంటకం. శృంగారమంటే తలకంటకంగావున్నట్టు కనపడతారు గాని లోపల యిష్టమేనని ప్రవర్తనవల్ల కనపడుతుంది. ఉంటే ధర్మబద్ధమైన గార్హస్థ్యం వుండాలె! లేకపోతే చిత్తచాంచల్యంలేని స్థిత ప్రజ్ఞత్వం వుండాలె. కాబట్టి యీధర్మబద్ధమైన గార్హస్థ్యం పరమావధై దానికి శృంగారం ముఖ్యరసమైంది. శృంగారరసం యేసారస్వతంలో లేదు? నాయికా నాయకులులేని నాటకముంటుందా సామాన్యంగా? ఇదీగాక మనప్రాచ్యనాగరకత, ప్రాచ్యరాజ్యాంగం, ప్రాచ్య సంప్రదాయం పాశ్చాత్యాల వాటికిభిన్నాలు. * మరీ 18 శతాబ్దంలో యూరపంతా పారిశ్రామిక మైపోయిన తర్వాత దైవాన్నిమరచి, మానవకోటి శరీరకష్టం చెయ్యటం, దానివల్ల పొట్టనిండకపోవటం, ధనమంతా యేకొందరిచేతుల్లోనో ఘనీభవించి ఉండటం, దానిచేత కలిగిన మనస్తాపం, జీవితం దుర్భరం గావటం, అందుచేత వివాహమంటే భయపడటం, కామతంత్ర మేపద్ధతులతోనో తృప్తిపరచుకోడం మొదలైన విషయాలకు లోనై అవ్వేసారస్వతంలో ప్రతిబిం

---

* *"No poet, no artist of any art has his complete meaning alone. His significance, his appreciation is the appreciation of his relation to the dead poets and artists. You cannot value him alone. He must invariably be judged by the standards of the Past........."*

(T. S. Illiot)

చూచారా సంప్రదాయమంటే వాళ్ళుకూడా తృణీకరించలేదు!

బించడం మొదలుపెట్టినై. (Industrial revolution) ఈ పరిస్థితులు గట్టిబడిన తర్వాత కొన్ని సంవత్సరాలకు మనవాళ్ళు ఇంగ్లాండు వెళ్ళ టం మొదలెట్టారు. ఈవిధంగా క్రమంగా వక తరంగం తర్వాత వకో తరంగం చొప్పున వెళ్ళిరావటం తటస్థించింది. ఈ పోయివచ్చినవాళ్ళలో కొందరు తమ తల్లితండ్రులనే మరచిపోయినారు. మరికొందరు ఉద్యోగాలుచేసి ద్రవ్యార్జన చేసి సుఖజీవనం చెయ్యటం మొదలు పెట్టారు. ఇంకా కొందరు అక్కడి పద్ధతులిక్కడ నాటాలని యత్నించారు.♦ అక్కడి పద్ధతులన్నీ యిక్కడ సరిపడవని తలపలేదు. వర్తక విషయంలో రక్షణ అవసరమైన భారతదేశానికి ఇంగ్లాండు ఫ్రీట్రేడ్ పద్ధతన్వయిస్తుందీ? అట్లాగే యీసారస్వత విమర్శనా నియమాలున్నూ! ఈకవిత్వతత్వవిచారం వెలువడగానే ఆయన గొప్పవాడౌటచేత పత్రికలుగాని, వ్యక్తులుగాని, దాన్ని విమర్శించ డానికి మొగమాటపడ్డారు. గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారివంటి సంప్రదాయవేత్తా, స్వతంత్రుడూ, ఆంధ్రపత్రికలో దీన్ని పరామర్శిస్తూ వక్క యెదురుమాటకూడా అనలేదు. ప్రతీవారు యీయన లోపల విమర్శించినవారే! కాని వక్కరికీకూడా పైకిచెప్పే సాహసం లేక పోయింది. ఈనే గనక సంస్కృతలక్షణ గ్రంథాలు చదివివున్నట్లైతే భామకూ సారస్వతానికీ అమూల్యోపకారమయ్యేది.†

ఈ గ్రంథంయువకహృదయాల్లో వక విధమైన అలజడి కలుగ

♦ ఇటువంటి వకతరంగంలోవాడు రెడ్డిగారు. అవిజ్ఞానంతో రాశాడీగ్రంథం.

† ఈన పాశ్చాత్యులయొక్క "కవిత్వం జీవిత ప్రతిబింబమ"నే సిద్ధాంతం ఆధారం చేసుకున్నాడు. మనగ్రంథాలు మానవుల సహజప్రవృత్తికి కొంచెం భిన్నాలుగా వుంటై! ఈదృష్టి మనలక్షణశాస్త్రాలు చదివితేనేగాని తెలియదు.

జేసింది! ఈ గ్రంథంలో ప్రథమభాగంలో మొదటి, మూడవ అధ్యాయాలలో చర్చించిన లలితకళా సామాన్యసిద్ధాంతాలలో చాలామట్టుకు మన లాక్షణికులు చెప్పినట్టుగాక తద్విపరీతంగా ఉన్నై. ఇక్కడ ఈన అవలంబించింది సమన్వయపద్ధతి కాదు. ఎక్కడో వున్న సూత్రాలనుబట్టి మన గ్రంథాలను విమర్శించడం, ఒకప్పుడు సాక్షాత్తుగానూ, మరొకప్పుడు నర్మగర్భంగాను దూషించడం, యిది యీనచేసినపని. "భావనాశక్తి" "ప్రకృతిభావనైతెష్యము" "భావనాశక్తికి కార్యోత్సాహమునకునుండు సామ్యము" "అలంకారముల నావశ్యకములు" "సాదృశ్యతత్వము" "పాత్రరచనాతత్వములు" "వికృతిలేని పాత్రములు జడసమానములు" "మిశ్రచరిత్రములుగాని పాత్రములు ప్రకృతివిరుద్ధములు" "సర్వలక్షణ సమేతముగా వస్తువులను నిర్దేశించటంతప్పు" మొదలైనవన్నీకూడా కొన్ని మనవాళ్ల దృక్పథానికి విరుద్ధాలు. మన స్తత్వశాస్త్రంతో సంబంధం అక్కడక్కడా చెప్పినా దానితో సంపూర్ణంగాజోడించి వీటిని నిర్ధారణచెయ్యలేదు మనవాళ్లు. * ద్వితీయభాగంలోకూడా యిట్లాగేఉన్నై. "కాలసరణి కథాసరణి" ఇది మన లాక్షణికుల కచుంబితవిషయం. "ఐక్యమనులక్షణము" ఇది కేవలం గ్రీకు రోమను సిద్ధాంతం. రెడ్డిగారు వీటితో మనవాటిని సమన్వయింపజేసి వక నూతనమార్గాన్ని చూపడానికి సమర్థుడైనప్పటికీ ఆయనకు సహజంగా లోపలవున్న సంఘసంస్కారచికీర్షా, వర్ణాశ్రమాచారనైరస్యమూ ఆయన్ను కేవలం ముంచేశింది. లక్షణశాస్త్రంగూర్చి ఒకటి రెండు ఆయన అభిప్రాయాలను అనువదిస్తాను. "పాత్రములన్నియు నొక్క తీరుదాల్చిన బొమ్మలు. అలంకార శాస్త్రప్రకారము చెక్కబడినవి."

* మానవుడిలోవున్న పశుత్వానికి సహజమైన మన స్తత్వాన్నే గ్రహించి, వాడిలో వున్న మానవత్వ దైవత్వాలకు సంబంధించిన మన స్తత్వాన్ని వదలడం విమర్శనంకాదు. సామాన్యంగా చిత్తసంస్కారంలేని మానవుడి చిత్తవృత్తికి తగిన మన స్తత్వమే కవికూడా గమనించవలసిన మన స్తత్వమనుకోడం పొరబాటేమో ?

"ప్రాచీనులు వ్రాసినట్లును, అలంకారశాస్త్రము లాదేశించినట్లును విరచింప బ్రయత్నించుట తెలివితక్కువపని". మనోవికారము లను పదంలోవున్న 'వికారము' అనే పదమట! 'వెడివారి తెగకు చేరిన మన వేదాంతులు మొదలైనవారిచే సృష్టింపబడిన పదములు! ఇవి చాలవా? పాతివ్రత్యతత్త్వమే వీరికిగిట్టదు. అది అసహజమని వీరి భావం.* తర్వాత శృంగారవర్ణనంలో పాశ్చాత్యపద్ధతినీ, మనకావ్య పద్ధతినీ, పోల్చి సకారణంగా విమర్శించారు. ఇక్కడకూడా వీరికి సామాన్య మనస్తత్త్వశాస్త్రమే ప్రమాణం. ఇంతవరకు వీరుచేసిన పాశ్చాత్యసాంప్రదాయానుసరణం చూపటం చాలనుకుంటాను. ఈ నైరస్యానికి మన ప్రబంధకవిత్వధోరణి ముఖ్యకారణం. భారత రామాయణాది పురాణ భాషాంతరీకరణాలను గూర్చి కొన్ని అపోహాలున్నా మొత్తంమీద మంచివనే వీరిసిద్ధాంతం. ఇక తర్వాతి ప్రబంధాలంటే యీనకున్న అసహ్యత చెప్పడానికి వీల్లేదు. తత్రాపి ప్రథమ ప్రబంధకాలం తర్వాతి కాలంలో రాశినవాటిమీద (విజయ

---

* లాక్షణికులుకూడా "సద్యఃపరనిర్వృతి" కావ్యప్రయోజనమని చెప్పినా "కాంతాసమ్మితతయోపదేశయుజే" అని చెప్పారు. కాని రెడ్డిగారు "కావ్యము శిల్పము. నీతిశాస్త్రముకాదు ధర్మశాస్త్రముకాదు" అన్నారు వకచోట. మరివకచోట "జారస్త్రీలెల్ల చెడ్డవారయట! కండకావరముచే నన్యులగోరువారట! ప్రబంధములలోని పతివ్రతలుమాత్రము కండకావరముచే గోరువారుకారా? ఇకేవరము వారికున్నది? .........మనుష్యస్వభావమును పరీక్షించి వ్రాయక యలంకారశాస్త్రముల దలనిడి కొన్నందుకు కలిగిన యధోగతియిది!" అన్నారు. రామాయణమన్న వీరికి యేవగింపు. చూడండి. "చవిసారములేని పాత్రములకు దారిచూపినది రామాయణము." అన్నారు. శృంగారతత్త్వాన్నిగూర్చి వక్కమాట. ప్రకృతిసుందరం! సౌందర్యమంతా ప్రకృతిలో వుంది. స్త్రీ యీ ప్రకృతిస్వరూపిణి! ఆమెలో సౌందర్యమంతా మూర్తీభవించుంది! మనుజుడు సౌందర్యపిపాసి! ఆ సౌందర్యం ఆయనకు ఉపాస్యమూ, వర్ణనీయమూ అయింది! ఆశ్చర్యమేమి? వర్డ్సువర్తు, షెల్లీ మొదలైనవారు ఆ పక్షులనే, ఆ మబ్బులనే, ఆ సామగ్రినే యెందుకువర్ణించాలె?

విలాసంతప్పు) పరిపూర్ణకటాక్షం! వాటిని "ఆగ్నేయాస్త్రమును రప్పించి గ్రంథమంతయు నాహుతిగానిచ్చిన యడల లోకమునకెంతో నుపకారము చేసినవారగుదురు." అని ఆశించారు రెడ్డిగారు. ప్రబంధపాత్రలనుగూర్చి వ్రాస్తూ "ఇక సామాన్య ప్రబంధములన్ననో వానియందలి స్త్రీ పురుషు లెండినకట్టెలవలె నున్నారు. వంగలేరు. పెరుగలేరు. కాబట్టి ప్రాప్తులు రెండు. విరువబడుట! ప్రొయ్యిని డబడుట!" అన్నాడు* చూచారా యెంతయసహ్యమో!

తర్వాత యీనభావాలికక్కడవి కావని తెలియజేయడానికి గ్రంథంలో యీ కింది అనువాదాన్నిస్తున్నాను. "మనవారిలో సంఘచరితమను భావమే యున్నదోలేదో! భావమేలేనిది ప్రవృత్తి యెక్కడిది? తమతమ కుటుంబములయు, తెగలయు క్షేమచింతేగాని, రాష్ట్రముంగూర్చిన చింతలు లేనివారగుటంజేసి, వీరిప్రారంభములచే దేశమున కేమాత్రము మానప్రాణరక్షణములు సమకూరవు. అట్లగుట ధీరకృత్యములు, గంభీరోద్యమములు, వీనిచే తెలివియు విరివియు గాంచు కవిత సాధారణజనులపై నేలదృష్టియుంచును?........ ఐరోపాలోని కొందరు కవీశ్వరులు కాపువారు సైనికులు మొదలైన తక్కువవృత్తులవారి బ్రతుకులను వర్ణనార్హములని యెంచి యెంతో సుందరముగ కావ్యములనువ్రాసి యున్నారు. మన గ్రంథముల

---

* కళాపూర్ణోదయంలో సూర్యోదయవర్ణనములలో నొకదానినిగూర్చి "ప్రబంధముల శ్రాద్ధమునకై తేబడిన యెఱ్ఱగుమ్మడికాయ యనరాదా?" అన్నాడు. "45 సంవత్సరములక్రింద (అప్పారావుగారు) రచించిన కన్యాశుల్కనాటకమును విమర్శించినప్పుడు కొన్నివిషయములలో మనము యిప్పటి మనదృష్టితోను, మన ఆశయములతోను, మన సంఘపరిస్థితుల పరిచయముతోను, మనము విమర్శించగూడదు. ఆ కాలమందలి పరిస్థితులు, అభిరుచులు, యెట్లుండెనో కొంతవరకు తెలుసుకొని మరీ విమర్శించవలెను."

(గి. వెం. సీ. నాట్యకళ విక్రమమార్గశరము.) మనవిమర్శకులు చేసేగొప్పపొరపాటిది. ఈ నియమం బొత్తిగా మరిచాడు రెడ్డిగారు.

మాత్రము చదివి యీ పుణ్యక్షేత్రమైన మన క్షేత్రముయొక్క స్థితిగతుల నరయుజూచువారికి యీ దేశమున పేదసాదలపై నాదరము గల కవి యున్నాడా? తుదకు బీదసాదలైన నున్నారా? యను సంశయము పట్టినను తప్పు వారిదికాదు! శోకరసము వర్ణింపవలయు నన్న ననుకూలమగు సందర్భమెయ్యది? క్రౌఞ్చ కాదెడి నాయికా నాయకుల యూహామాత్రములైన కష్టములా? ప్రజలు దినదినము కన్నీరుగార్చుటకైన నవకాశము లేక కుడుచుచుండు పరిపరివిధములైన గోడులా? శాంతరసమునకు పోషకమెయ్యది? తమకు నష్టముదేనట్టి రాజుల యుదారచర్యలా? ఆకట మాడి మలమలలాడుచు, యింటికి వచ్చి వంట సిద్ధముకాకుండినను భార్యను కోపింపక, కన్నులు మూత పడుచుండ విధినిధ్యానించుచు, నొకమూల కూర్చుండు పొలము కాపుయొక్క నడవడియా? ఆహా! జనసామాన్యముయొక్క ప్రతిదిన వృత్తములలో నెంతభావము, రసము, గుణము నుపగతములై యున్నవో మనకవులకుం దెలియవుగదా? ... ... ... కలియుగాది నుండి యింతదాక జమకు ఖర్చుకురాని సాధారణజనులు నేటికి గదా గణ్యులైరి? ఇకముందు పూజ్యులగుదురుగాక!" ఈ వాక్యాలు రాశినవ్యక్తి యూరపులో జరిగిన పారిశ్రామిక విప్లవము తరువాతి భావాలకు లోనైనాడని వేరేచెప్పాలా? ఈ విధంగాఉన్నది రెడ్డిగారి చిత్తప్రవృత్తి. ఈనరాశిన అర్థశాస్త్రమూ, యీ కవిత్వతత్వవిచారమూకూడా "సంఘసంస్కరణోపన్యాసములకూ" "పూర్వాధునిక సంఘచరిత్ర విమర్శనలకూ" పుట్టిళ్లు. నిండాలవ్వే! ఒక్క అక్కిరాజు ఉమాకాంతపండితుడు* మాత్రం నిజం తెలిపివిమర్శించాడు! "పాశ్చాత్య వాతావరణంలో చేతులుమొగిడ్చి కూర్చున్నవారికి ప్రాచ్యకావ్య విషయము లెట్లుతెలియును అన్నాడు". మిగిలినవాళ్లంతా రెడ్డిగారి పదవికి దాసులైపోయినారు.

---

వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు "త్రిలింగ" అని వక వారపత్రిక నడిపేవారు. దానికి ఉమాకాంతంగారు సంపాదకుడుగా ఉండేవాడు.

రెడ్డిగారి యీ చిత్తవృత్తికి బీజాలేవి అని ప్రశ్న వేసుకోవాలె! 1914 ప్రాంతం చాలా ప్రాముఖ్యమైంది. ఆకాలంలో చెన్నపట్నంలో జస్టిసు వాదమని వక వాదం ప్రారంభమైంది.* ఈ ఉద్యమానికి పితలిద్దరు. డాక్టరు నాయరూ ఆంధ్రుడైన పిట్టి త్యాగరాయ చెట్టిగారూ. బ్రాహ్మణులు ఉద్యోగాలన్నీ కాజేస్తున్నారని ఉక్రోషం చేత బయలుదేరిందీ పార్టీ. క్రమంగా దానికారణజాతం వెనకెళ్లింది. అర్వాచీన వేదకాలంనించీకూడా బ్రాహ్మణేతరులకు వేదాలు చెప్పకుండా బ్రాహ్మణులు అజ్ఞానాంధకారంలో ఉంచారనీ, మనువనే దుర్మార్గబ్రాహ్మణుడు వర్ణాశ్రమధర్మాలకు నియమాలురాశి యీ అంధకారస్థితులను శాశ్వతదాస్యంలో పడేశాడనీ, మతమనేపేరుతో అప్పటినించీ యిప్పటివరకు వీళ్లు వీరిని యేలుతున్నారనీ, తుదకు స్వార్థపరులై, పూర్వమొకప్పుడు క్షత్రియులై వైదికకర్మాధికారాలు గల కమ్మ రెడ్డిమొదలగు యితరకులాలవారిక్షాత్రం బ్రాహ్మలు దొంగిలించారనీ, మొదలైనవాదం లేవదీశారు. ఇదే బ్రాహ్మణేతరోద్యమం. ఈ ఉద్యమం దేశాన్నంతా కలిచేశింది. ఏవూళ్లో చూచినా సభ లే! ఉపన్యాసాలే! బ్రాహ్మణ దూషణ లే!♦ వీరేశలింగంగారి సంఘసంస్కరణ వాదం చదివిన ప్రజలంతా దీనికి లోబడి పోయారు. ఇటువంటి ఉద్య

* ఇంతకు పూర్వమే దేశంలో ప్రతిమూలా దానికి బీజాలున్నై! స్థానిక సంస్థలలో తగాదాలు గ్రామజీవనంలో వున్న స్వార్థపరత్వాలూ వీటికిమూలం.

♦ వక మీటింగు పట్నంలో స్పర్ టాంకు అనేచోట జరిగింది. నేను నామిత్రుడు యిప్పుడు తెనాలిలో న్యాయవాదిగావున్న ప్రయాగ రాఘవయ్యయున్నూ ఆమీటింగు కెళ్ళాం. కొంత అయిం తర్వాత వకయిద్దరు రిక్షావాళ్ళు "ఎన్నాడా పాపాం. ఎన్నా తికి వందేడా" అని మాయిద్దరిమీదికి దుమికేటప్పటికి, భయమేశి పరుగెత్తుకుపోయి సత్యనాథంసతి గారింట్లోకిదూరి ప్రాణాలు రక్షించుకున్నాం. నాజీవితానికా ఆపత్తు మరచిపోను. కాంగ్రెసు బలంగావున్న యీదినాల్లోకూడా కాంగ్రెసులోనే యీ కులతత్వ సిద్ధాంతముంది.

మానికి తాను చేసిన కని కారకమైనాతుఁనని తయన యెన్నడూ అనుకుని వుండడు! ఈ పరిస్థితులు పూర్వాంతరంలో యిప్పటికీ దేశం నిండా ఉన్నై!

రెడ్డిగారు ఉపన్యాసాలెప్పుడూ యివ్వలేదు. కాని ఆయన రాసిన గ్రంథాలు మాత్రం మనుదూషణాలతోనూ, వేదాంతదూష ణాలతోనూ, వర్ణాశ్రమధర్మ నిరసనాలతోనూ, సంఘచరిత్ర విమర్శ నాలతోనూ, స్త్రీ స్వాతంత్ర్య వాదాలతోనూ, నిండివున్నై. స్థాలీ పులాకన్యాయంగా కొన్ని ఉదాహరణాలిస్తాను. "మనవారిచే గర్హింప బడు పేదవారి తెగకు చేరిన" వారట మన వేదాంతులు! "మనకు బట్టిన వేదాంత పిశాచిని అట్టిట్టు పారద్రోలినందులకు నింగ్లీషువారు స్వభాషాభిమానులమగు మనకెల్ల బూజనీయులు." "కట్టువారిన కోవిదులకన్న లోకవాసనల ననుభవించి యానందించువారు మేలు." హితోపదేశాన్ని పరభాషీయులు స్వీకరించుటగూర్చి చెబుతూ "మన వలె జాతిమత వర్ణాదుల వ్యత్యాసముకతన, పూజ్యులైన మనువు యొక్క సంతతివారో కారో యను సంశయమునకు పాత్రులైన విదేశీ యులచేతను, నీగ్రంథమెంత గాఢముగ స్వీకరింపఁబడినదనుట విశద మవును." అన్నారు. "హిందూదేశములో మనుస్మృతిదెబ్బ తగిలిన నాటినుండి ప్రజ యీవరకును లేవలేక పడియున్నది. దానిది పరా శ్రయమైన బ్రతుకు." "జాతిభేదములవలన శ్రేష్ఠకులులకు తదితరుల వలన మర్యాదయు గౌరవమును గలుగవు, శ్రేష్ఠులకు మాత్ర మర్థింప దగినదను నియతిని విద్యదాల్చినదగుట." "అగ్రజాతులవారి యహంభావము, అశ్రద్ధ, ఆచారము, ఇవి పెరుగను, అన్యజాతివారిని తమ మార్గమున కధీనులుగా జేయుటను, కవిత్వోచితమైన విషయ మును మిక్కిలి సంగ్రహపరచినవి." "వారిని (స్త్రీలను) విద్య, స్వాతం త్ర్యము, మొదలగు దానంబులచేత నుత్తమపదవికిం దెచ్చిననేగాని, యీదేశమెన్నటికిని శుభములకు పాత్రంబుకాదు." "మనలో పెండ్లికి

మనసునకును సంబంధము లేదు. పరిణయము వ్యవహారములలో నొకటి. చిత్తజముకాదు. మరి పితృపితామహజము. మనసును నిరోధించి పీడించు వర్గములలో ముఖ్యములు జాతిభేదములు. తమతమ యుపశాఖలను మీఱి హృదయము వ్యాపింప గూడదట! దీనివలన గలుగు ఫలమేమనగా, అమనస్క-వివాహములు. అనగా దేహమొకచోట చిత్తమింకొకచోట! మాటలిక్కడ తలపులక్కడ! చిత్తము శివునిమీద! భక్తి రంకులాడిమీద!" "సనాతన ధర్మాగ్రస్తమీదేశము". ఇవి చాలనుకుంటాను. అవకాశం వస్తే యీన యీగోడవచెయ్యని స్థలంలేదు.

ఈరాతలకు యింకోబీజం మరోచోటవుంది. ఈన ఐరోపాలో చదువుకున్న వాడని వెనక మనవిచేశాను. ఈన అక్కడ చదువుకున్న కాలం యింగ్లాండులో సారస్వత విషయాల్లోనూ అన్నివిషయాల్లోనూ చాలా మార్పులు జరుగుతున్నకాలం. "విక్టోరియన్ యుగం"లో వుండే మర్యాదలన్నీ నశించినై. డార్వినుయొక్క మానవజన్మసిద్ధాంతం వెనకటి నమ్మకాలను తారుమారుచేశింది. మనస్తత్వశాస్త్రం పెరగడం మొదలెట్టింది. ప్రకృతిశాస్త్రపఠనం పెరిగింది. ప్రతివిషయంలోనూ మార్పులు. చెప్పిన విషయాలను ప్రశ్నించటం కలిగింది. ఈయుగాన్ని చారిత్రకులన్నారు. "Age of question, examination and test" అనగా పరీక్షాయుగం, లేక అప్రత్యయ యుగం అందాం. ఈయుగానికి కర్తలలో బెర్నార్డుషా, వెల్సుగార్లు కూడా వున్నారు. ఆవాసనే మనకు కొట్టటంకూడా ప్రారంభించింది. క్రమంగా పూర్వమర్యాదలు నశిస్తున్నై. సాంఘికంగా, సారస్వతంలో వాటివైఖరి కొంత వెనక మనవిచేశాను. సాంఘికంగానూ, మత విషయంలోనూ, వీరేశలింగంగారి కాలమే యీపరీక్షకు మొదలు. భాషావిషయంలో గిడుగు రామమూర్తిపంతులుగారూ, కవిత్వ విషయంలో సుబ్బారావు అప్పారావుగార్లూ ఉపలక్షకులు. వారిపని క్రమంగా వ్యాపిస్తున్నది. సారస్వతవిషయాల్లోకూడా వెనకటియుగాన్ని

తల్లకిందుచేసి ఒకొకటి విశ్వాసాలన్నీ, సమస్యలన్నీ, సూత్రాలన్నీ పరీక్షచేసిందీ "కవిత్వతత్త్వవిచారం". పాశ్చాత్యవాసన బాగా తగిలినవారు కాబట్టి విషయాన్ని అతిగాఢంగా చెప్పారు రెడ్డిగారు. మనం బ్రిటిషుసామ్రాజ్యంలో చేరివుండటంచేత యింగ్లాండులో జరిగిన మార్పులు కొంచెం ఆలస్యంగా మనకూ వచ్చినై. అలాంటి మార్పుల్లో ఇదొకటి. చూడండి కిందివాక్యం.

"Once again in the early twentieth century, as in the early years of the nineteenth, political prejudice and literary criticism became confounded" (A. C. Ward).

మనకు రాజ్యాంగంతో సంబంధంలేదు కాబట్టి యీ మార్పు సాంఘికంగా తలెత్తింది. ఇది సమంజసమే! శ్రీ రెడ్డిగారి సంవత్సరాల్లో యింగ్లాండులో ఉన్నవాడుకాబట్టి ఆపరివర్తనాన్ని కండ్లారాచూచాడు. దాన్ని కలగచెయ్యటానికి ప్రయత్నించాడు.

1914 నాటికి నేను పట్నంలో బి. ఏ. ఆనర్సు చదువుతుంటున్నాను. మా "పింజమూరిమండలి"వారమందరమూ యీ "కవిత్వతత్త్వవిచారం" చదివి చాలా ఆనందించాం, విచారపడ్డాం కూడాను! చెప్పిన విషయానికి సంతోషం, పద్ధతికి విచారం' నేనేదో అప్పటికి అలంకారశాస్త్రం కొంచెం చదువుకోడంచేత, ఆలంకారికులను తిట్టడమూ, కావ్యాని కలంకారా లనావశ్యకా లనడమూ చూచేటప్పటికి చిత్తం నిలవలేదు. రెడ్డిగా రింత గొప్పవారే అనీ అనుకోలేదు! అనంత కృష్ణశర్మగారితో నేను పోట్లాడగలనా అనీ తోచలేదు! ఈ గ్రంథాన్ని పొగడిన పత్రికలూ, వ్యక్తులూ, నామీద పడతారేమో అని భయమూవెయ్యలేదు! వెంటనే "అలంకారతత్త్వవిచార" మనే గ్రంథంరాశి ముద్రింపించాను. 15—10—15 తేదీన ప్రకటింపబడ్డది. అచ్చుగాకపూర్వం దీన్ని శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారికి చదివివినిపించాను. చాలా ఆనందించారు. ఆయనప్రోత్సాహమే

చాలనుకున్నాను. అచ్చేశాను. సర్వోత్తమరావుగారు ఆంధ్రపత్రికా సంపాదకులుగా వుండేవారు అప్పుడు ఆయన ఆ పత్రికలో దీనిమీద వక-పేజీ విమర్శనంరాశాడు. దూషణ భూషణలు చెరిసగంగావున్నై. నేనోగొప్పవాణ్ణనుకోడం, మావాళ్లందరు రెడ్డిగారంతవాణ్ణి డీకోడం చేత నన్నొకధీరుడనుకోడం, నేను సంతోషించటం, తటస్థించింది. ఇది మాలోమాట! రెడ్డిగారు అసలు నన్నెట్లా యెరిగివుంటారు? "చూశావా నేనురాశింది" అని ప్రతివారికి నాపుస్తకం చూపడమే నాకుపని. ఆరంగుళాలయెత్తు పెరిగినట్లు భావించుకున్నాను! నేను గొప్ప లాక్షణికుణ్ణనుకున్నారు మా స్నేహితులు! ఇట్టిస్థితిలో "ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో" కొమ్ముశేనుగైన వఝుల చినశీతారామ శాస్త్రిగారు నాపుస్తకంమీద దీర్ఘమైన విమర్శనంరాశాడు. వక వ్యాకరణదోషాలలిస్టు యిచ్చాడు. అంతవైయాకరణీవిమర్శకుడూ రాస్తే నేనేంచెయ్యను? గుడ్లుమిటకరించాను! రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారుకూడా వకవిమర్శనంరాశాడు. దానికి నేను సమాధానంరాశి ఆంధ్రపత్రికలో వెయ్యమని సర్వోత్తమరావుగారి దగ్గరకు తీసుకెళ్ళాను. ఆయన వెయ్యనన్నాడు. ఏంగతీ అనుకుని ముట్నూరి కృష్ణారావుగారికి సందర్భంరాస్తూ పంపాను. ఆయనధర్మాన కృష్ణా పత్రికలోపడ్డది. తర్వాత కొన్నాళ్లకు శర్మగారిదగ్గిర్నించీ వక ఉత్తరం వచ్చింది. "దూషించుకొనుటకు మనం ఛాందస పండితులము కామనీ" "యిక రాసుకోకుండా విరమిస్తే మంచిదనీ" దాని భావం అనుకున్నాను. అప్పటినుంచీ పరిచయం లేకపోయినా శర్మగారంటే నాకు చాలాగౌరవం. అప్పటినించీ రెడ్డిగారు కూడా నన్ను కొంచెం జ్ఞాపకముంచుకున్నాడు. హైదరాబాదు వచ్చినప్పుడు నేను దర్శనం చేశాను. నన్ను మరవలేదని నావద్ద లిఖిత పూర్వకమైన దృష్టాంతంవుంది.* ఇన్ని వ్యాసాలు గ్రంథాలు

* నాకు కావలసివచ్చినప్పుడు రెండుమార్లు నాకు సంస్కృతాంధ్రాలు వచ్చునని యోగ్యతాపత్రాలిచ్చి నా కృతజ్ఞతకు పాత్రుడైనాడు.

ాసుకుని తుదకు రెడ్డిగారూ నేనూ ఒకేసిద్ధాంతానికి వచ్చాంమాకండి. "సాదృశ్యములలో కొన్ని (సామ్యములు) సహజములును, సని వార్యములును. అవి తమంతటన యే ప్రయాసమును లేక వచ్చినయెడ గథాసందర్భములో కలసిమెలసి యుండును." (కవిత్వతత్త్వవిచారము). "అలంకారముల నుపయోగింపవలెనని మనలాక్షణికులు చెప్పినపుడు సందర్భోచితముగనని మనమర్థము చేసుకొనవలసియున్నది. (అలంకార తత్త్వవిచారము). మొత్తంమీద వాదోపవాదాలవల్ల భాషకుపకార మైంది.

కవిత్వానికి భావము, వస్తువు, రచన, అనేవి ఉండాలెనని వెనక మనవిచేశాను. రెడ్డిగారికి ఒక్క భావంతప్ప మిగిలినరెండూ ఉపసర్జనాలు. ప్రతి పద్యభావం వుండటం సాధ్యమూకాదు, సమంజసమూకాదు. ఈ సందర్భంలో రెడ్డిగారి గురుప్రాయులైన అనంత కృష్ణశర్మగారి "సారస్వతోపన్యాసాలూ" "నాటకోపన్యాసాలూ" చదవమని మనవి. సాధారణంగా యీ మూటికీ ప్రత్యేకంగా మనసానందపరిచే గుణంవుందని ఆయనసిద్ధాంతీకరించాడు. అది సర్వథా సత్యం. హృదయమూ, బుద్ధీ, అని రెండున్నై మనిషికి. హృదయాన్ని భావమూ, బుద్ధిని వస్తుశైలులూ ఆనందింపజేస్తై. అందరూ రెడ్డిగారి వంటి కళోపాసకులూ, రసలుబ్ధులూ, భావప్రియులూ వుంటే, మాబోటి ఛాందసుల గతేమిటి? పాఠకుల్లో అందరూ రెడ్డిగారివంటి వారెప్పుడైపోతారో అప్పుడు కవిత్వం ఉత్తమకక్ష్యలో కెళ్లిపోతుంది. కాని అటువంటిసందర్భం యెప్పటికీవుండదు. పాఠకప్రపంచం మిశ్రం. పాఠకు లెట్లా ఉత్తమ మధ్య మాధములుగా వుంటూవుంటారో అట్లాగే కవులూకూడా ఉత్తమ మధ్య మాధమ కక్ష్యల్లో వుంటారు. కాబట్టే కావ్యాలను కూడా మన లాక్షణికులు ఉత్తమ మధ్య మాధ

మూలుగా విభాగం చేశారు. రెడ్డిగారు "కవిత్వతత్వవిచారం"లో విమ
ర్శించిన విషయాలన్నీ ఆయనప్రకారం ఉత్తమ కావ్యాలకు సంబం
ధించినవి.♦ నిజంగా ఆలోచిస్తే మొదటి యే అయిదారో తప్ప
యితర ప్రబంధాలన్నీ ఉచ్ఛిష్టాలే అనాలె! ఈ మొదటివాటికి రెడ్డి
గారూ కూడా సర్టిఫికెట్టు యిచ్చాడు. చూడండి, "రాయకృతమైన
యాముక్తమాల్యద, మనుచరిత్ర, పారిజాతాపహరణం, కాళహస్తి
మాహాత్మ్యం, వీనియందెల్ల నవ్యతయను గుణ మున్నది." అన్నాడు.
17, 18 శతాబ్దాల్లో పందొమ్మిదో శతాబ్దం మధ్యం వరకు రాయబడ్డ
వాట్లో యేకొద్దో తప్ప మిగిలినవన్నీ గతానుగతికాలైనై. కాబట్టి
ప్రబంధాలనుగూర్చి రెడ్డిగారు రాశినది అసలు సత్యమే. కాని ఆపతన
కాల వాఙ్మయాన్ని గూర్చి రాయటంలో చాలాదూకుడుగా రాశారు.
మెత్తగారాయవచ్చు.

ఆయన రాశిన పద్ధతిలో వుండే లోపాలు కొన్ని చెబుతాను.
(1) సవిమర్శంగానూ సర్వసమ్మతంగానూ రాయాలిసినచోట చాలా
కఠినంగానూ, క్రూరంగానూ రాయటం. (2) ఏశీలాన్ని పాతివ్ర
త్యాన్ని చాలా ఉదాత్తమని మనవాళ్లు అందరూ అనుశ్రుతంగా అను
కుంటున్నారో వాటిని నీచంగా నిరసించటం.* (3) లక్షణశాస్త్రాల్లో
యేముందో తెలుసుకుని, అందులో విషయాలు సహేతుకాలుగా
వున్నాయో లేవో తెలియకుండా వాట్లోవుండే అలంకారాలపట్టీలూ,
మొదలైనవన్నీ అవశ్యోపయోజ్యాలని భ్రమించి† వాటిపైన

♦ ఈన భావమనిచెప్పేది ఉదాత్తమై "ఐడియలిజంకు" సంబంధించిన భావమో, 'రియలిజం"కు సంబంధించిన భావమో తర్వాతవచ్చే యిట్టి చర్చవల్ల తెలుస్తుంది.

* "Intentional making great things small" అనే పద్ధతి ఇక్కడ పాటమరించింది.

† ఇది శాస్త్రం. వాత్స్యాయనుడు చెప్పిన సంగతులన్నీ ఆచరణలో యెట్లా లేవో, అట్లాగే యివ్వీని. శాస్త్రకారుడు సమస్తాన్ని చర్చించటం విధి.

అసహ్యించుకోడం. కావ్యప్రకాశిక చదివాడా? సాహిత్యదర్పణం చదివాడా? ధ్వన్యాలోకం చదివాడా? అవి చదివి వాటిలో విషయా న్నెట్లా చర్చించారో తెలుసుకుని, వాటికీ, పాశ్చాత్యులు రాసిన వాటికీ, ఎంతసమన్వయం కుదర్చటానికి వీలుందో పరీక్షించి కుదర్చటం తమ వంటి విద్యార్థికుల కర్తవ్యం. అట్లా చెయ్యకుండా మన పుస్తకాలను పరీక్షించటం తగనిపని. (4) విమర్శనంలో అనేక రకాలున్నప్పటికీ వాటిని స్మరించకుండా, మన కీనాటకున్న లలితకళా జ్ఞానంతో ఎప్పుడో రాసిన గ్రంథాలను పరీక్షించటం. ఎన్నో శతాబ్దాల కింద అప్పటి సన్నివేశాలతో రాసిన గ్రంథాలను 20 శతాబ్దాదర్శాలతో విమర్శించటం సమంజసం కాదు. పిడుకూ- బియ్యానికీ ఒకేమంత్రమా? (5) మనభాషలూ వాటి సంప్రదాయాలూ, మన వాఙ్మయమూర్తు లూ, వాటిసాంప్రదాయాలూ గ్రహించక పోవడం. (6) ఎంత మాత్రం సానుభూతి లేకపోవడం. ఇది అన్నింటికంటె గొప్పదోషం. విమర్శనానికి అది మూలాధారం. లేకపోతే పక్షపాతబడుతుంది విమర్శనం. (7) గ్రంథ విమర్శనమూ, రసచర్చా, కాకుండా అనవసర ప్రసంగాలు చెయ్యడం. వాటిచేత గ్రంథ ప్రాశస్త్యంకూడా తగ్గి పోయింది.

ఇవన్నీ యెట్లావున్నా ఈ గ్రంథం మాత్రం గిడుగువారి భాషావాదం వలె యువకమండలిలో అత్యంత కలవరం కలగచేసింది. వెనకటి సాంప్రదాయాలు తెలియకుండా, కవితా సంస్కారమున్న యువకులు దీనిలో తమ కనుకూల పద్ధతిని కనిపెట్టారు. పూర్వసార స్వతంమీద నైరస్యంగల యువకులందరికీ, యీ నైరస్యానికి కార ణాలు చెప్పలేకుండా ఉన్నస్థితిలో యీ గ్రంథం వాళ్ళకు వేదమైంది. మా అప్పారావు (బ) యీ గ్రంథం చదివి గంతులేశాడు. సుబ్బా రావుగారు దానిలో నిగ్గు గ్రహించి గంభీరించాడు. అప్పట్లో ఆయన ఎవ్వరినీ యేమీ అనగూడదు. ఆయన నవ మార్గం తొక్కాడు.

దాన్ని యిటూ అటూ చూడకుండా అనుసరించటమే ధర్మం. ఇప్పటికీ యీ గ్రంథాన్ని గూర్చి అనేకమంది మనస్సుల్లో అభిప్రాయ భేదాలున్నై.*

ఈ గ్రంథాన్ని గూర్చి విశ్వనాథవారు యేమన్నారో చూడండి. "ఈరోజుల్లో (1914) కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వతత్త్వ విచారము వ్రాసి విమర్శన పథాల్లో గొప్ప దృక్పథం కలిగించి నవ్య సాహిత్యానికి కొత్తబోదెలు తవ్వారు"† ఇందులో సత్యం లేకపోలేదు. నవ్యకవిత్వం బయలుదేరేరోజుల్లో, అదీ భావప్రధానంగా ఉండాలనే అభినివేశముండేరోజుల్లో, భావానికి ప్రాధాన్యమిచ్చి, ప్రాచీన సంప్రదాయాల ననుసరించనక్కర్లేదనే వాళ్ళకు యీపుస్తకం చాలా సహకారైంది. భావకవిత్వం పాశ్చాత్యానుకరణం కాబట్టి వాళ్ళ సారస్వత పంథలను, విషయ వివేచనంచేశి చెప్పటం వాళ్ళకు చాలా దోహదం చేసింది. కాబట్టి గ్రంథం యెట్టిదైనా, యేఉద్దేశ్యంతో రాశినా, దానివల్లమాత్రం సారస్వత క్షేత్రంలో చాలా ఉపకారమై, నవ్యకవులనుసరించే నవ్యతకు నీళ్లుపోసి పెంచి నవ్యాంధ్ర సారస్వతంలో వక ముఖ్యవిషయమైంది.♦ ఈన చేసిన యీసేవే యీనపేరు

---

* కానిరెడ్డిగారు గొప్పపదవిలో ఉండటంచేత యేమీ అనలేకుండావున్నారు. నోరి నరిసింహశాస్త్రిగారి యీ మాటలుచూడండి "కవిత్వతత్త్వవిచారమునకు వచ్చిన ప్రచారము, రెడ్డిగారికి కావ్యరసగ్రహణంలోగాని, విమర్శనలోగాని ఉన్న దక్షతవల్ల రాలేదనీ యెన్నో యితరకారాణాలవల్ల వచ్చినదనీ మేము మనవిచేస్తున్నాము."

† బుర్రా శేషగిరిరావుగారుకూడా యీ కాలానికి కొంచెం వెనకముందులుగా "విమర్శాదర్శ" అనే గ్రంథం రచించాడు. దీన్ని "విమర్శాదర్శ విమర్శాదర్శ" అనే పేరుకింద పానుగంటివారు పునర్విమర్శించాడు.

♦ "ఆంధ్రాంగ్లభాషా సంప్రదాయవేత్తయైన మన కట్టమంచి రెడ్డిగారు కొందరభినవకవులకు మూలశక్తియై పనిచేసిన యుపకారపరుడు. రాయప్రోలు - అబ్బూరి - దువ్వూరి - పింగళి మున్నగువారి యభ్యున్నతి 'కసరా' యిచ్చినవా డీయనయే!"
(ఆంధ్రి, కార్తికి)

సారస్వతంలో చిరస్థాయిగా ఉండాలి విషయం. ఇక అర్థశాస్త్రం
పెద్దర్థాలకే నిండిపోయింది. శాస్త్రంగా లేదు. ఛందస్సులో రాసిన విష
యాలన్నీ పాతపడిపోయినై. దానికి తాత గ్రంథాలు చూస్తే యిష్టంగా
విషయంమీద! మిగిలిన ఉపన్యాసాలు మొదలైనవన్నీ తాత్కాలి
కాలేగాని వాటికి చిరస్థాయిత్వం తక్కువ. ఇక మిగిలింది "కవిత్వతత్త్వ
విచారం". ఇది మాత్రం తప్పక చిరస్థాయిగా ఉంటుంది, ఉండగలదని'
రాసినప్పటినించీ పాఠ్యగ్రంథంగా నేర్పింది. తర్వాతచాలా గ్రంథాలు
కావ్యవిమర్శనం మీద పుట్టినా దీనికి సాటి దీనిదే!* మంచిచక్కనీ,
నిర్దుష్టమైనా, చురుకైనా, హృదయాకర్షకమైన శైలిలో రాశాడీయన.
ఈయన శైలికి సూది గుచ్చుకున్నట్లు హృదయానికి సాక్షాత్తుగా వెళ్ళే
గుణముంది. ఇటువంటి తెనుగుశైలి రాయగలవారు చాలా అరుదు.
చక్కని హాస్యరసం. ఆయనలో ప్రబంధాలు కలగజేసిన జుగుప్స
యొక్క పరిణామమది. ఆయనేంచేస్తాడు! భావప్రధానవాదికాబట్టి
భావశైత్యం చాలా యెక్కువ. ఇప్పటికైనా ప్రాచ్య పాశ్చాత్య
విమర్శనా సూత్ర సమన్వయంచేసి దేశానికీ భాషకూ ఉపకారం
చెయ్యాలని ఆయనకు బుద్ధిపుట్టించమని భగవంతుణ్ణే ప్రార్థిస్తున్నాను.

నవ్యకవుల కొక ప్రోత్సాహమియ్యడమే కాకుండా రెడ్డిగారు
చేసిన పని సరియైన విమర్శనం బైలుదేరటానికి మార్గం చూపించనే
చూపించింది. అప్పటినించీ కొంత నూతనమార్గంలో విమర్శ, వాఙ్మ
యావలోకనం సాగింది. దర్భా యజ్ఞేశ్వర సోమయాజులుగారు
నవలావాఙ్మయాన్ని యెత్తుకొని విమర్శించారు. పొ. రామమూర్తి
గారూ, భావరాజు కృష్ణారావుగారూ, నాటకాన్ని గూర్చి, ట్రాజె
డీలయొక్క లక్షణాలు మొదలైన విషయాలనుగూర్చి రాశారు.
గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారు గద్యచరిత్ర తీసుకుని

* దీనికి పునర్ముద్రణం జరుగతున్నది. అలంకారాలకు కావ్యంలో స్థానాన్ని గూర్చి కొంత నూతనముద్రణంలో చర్చిస్తారని వినికిడి. నా 'అలంకార తత్త్వవిచారం' పునర్ముద్రించ దలచాను. అప్పుడు యీ గ్రంథాన్ని పరామర్శిస్తాను.

పరిశ్రమచేశారు. ఆంధ్రప్రబంధాలనుగూర్చి గంటి జోగిసోమయాజులు గారు పరామర్శించారు. "కావ్యప్రయోజనము" మొదలైనవికూడా విమర్శకు పాత్రాలైనై. తర్వాత యిప్పుడు పాటిబండ్ల మాధవశర్మ, జమ్మలమడక మాధవరాయశర్మ, బులుసు వెంకటరమణయ్య, తల్లావఝుల కృత్తివాసతీర్థులు రాఘవయ్యంగారు మొదలైనవాళ్ళంతా మన ప్రాచీన మార్గాలనుకూడా తరిచిచూపటం కార్యంగా పెట్టుకున్నారు. సాహితీసమితి సభ్యుడు శతావధాని కోపల్లె శివకామేశ్వరరావుగారు "సాహిత్యమీమాంస"ను యెత్తుకుని చాలా విమర్శించాడు. ఈ విధంగా జరిగిన విమర్శనాని కంతకూ రెడ్డిగారే మార్గదర్శని తప్పక చెప్పుకోవాలె! ఇప్పుడు ప్రతి "భారతి" మొదలైన పత్రికల్లో సరి యైన మార్గాలలో ప్రవర్తించిన విమర్శనాలు పరిశ్కృతంగా ప్రకటింప బడుతున్నై. వీటితో పాటు కొడవటిగంటి కుటుంబరావు మొదలైన వాళ్లు లలితకళా ప్రయోజనాలనూ, సిద్ధాంతాలనూ అనువదిస్తూ, కవితాసామాన్యానికి వాటి ననువర్తింపజేస్తూ రాస్తున్నారు. మా గురువులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు వీటిఅన్నింటిపైనా బ్రహ్మత్వంలాంటి వక పదవి అధిష్ఠించివున్నారు.

10–12–40 తేదిన శ్రీ రెడ్డిగారి షష్ఠిపూర్తిఉత్సవం విశాఖ పట్నంలో జరిగి వారిశిలాప్రతిమ మద్రాసుగవర్నరుగారిచేత బహిరంగ పరుపబడటం, దేశదేశాలనించీ అభినందనాలు రావటం జరిగింది. ఆయన సేవ యెన్నటికీ దేశం విస్మరించడానికి వీలులేదు. ఆధునిక సుప్రసిద్ధాంధ్రుల్లో శ్రీరెడ్డిగారు అగ్రశ్రేణిలోవాడని చెప్పడానికి యెట్టి ఆక్షేపణ లేదు. ఆయన సారస్వతసేవతో ఆంధ్రసారస్వతచరిత్రలో శాశ్వతసాన మేర్పరచుకున్నాడు. ఈనకు భగవంతుడు దీర్ఘాయువిచ్చి అనవసరవిషయాల్లో కాకుండా వాఙ్మయసేవలో బుద్ధిని-వినియోగించే టట్టు చెయ్యాలని ప్రార్థిస్తున్నాను. 1–1–42 తేదీన సర్కారువారీయనకు సర్ బిరుదమునుకూడా యిచ్చి గౌరవించారు.

—

## ఆంధ్రకవితా విమర్శన గ్రంథమాలిక : స్వవిషయం

మా "విజయమూరిమండలి" మాట మాటికీ చెప్పుకోడం కష్టంగానేవుంది. కాని చెప్పక తప్పేటట్టు లేదు. మేము ద్రవ్యవంతులమూ కాము, విజ్ఞానవంతులమూ ఎక్కువగా కాము. కాని మాకు ఉత్సాహాని కెట్టి లోటూ లేదు. కార్యదీక్ష ఎట్లా వున్నా ఆంధ్రులకు ఉత్సాహాని కెంతమాత్రం తక్కువలేదు. "English Men of Letters" మాదిరిగా "ఆంధ్రరచయితలు" అని ఒక గ్రంథావళి ప్రచురించుదామని సంకల్పించాము. విజయమూరి రంగాచార్యులుగారు "పింగళి సూరనార్యుడి"ని గూర్చి రాశాడు. ప్రచురించడం సాగించాడు. ఇంతలో "కవిత్వతత్వవిచారం" వెలువడింది. చదివాము. వెనకటి అభిప్రాయం మారి, "ఆంధ్రకవితా విమర్శన గ్రంథమాలిక" అని ఒకటి స్థాపిద్దామనీ, రెడ్డిగారు ప్రారంభించిన విమర్శన కార్యాన్ని సరి అయిన మార్గాల సాగిద్దామని నిర్ణయించుకున్నాము. అట్లా గ్రంథమాలిక పేరు మారిపోయింది. రంగాచార్యులుగారి గ్రంథంకూడా విమర్శనమే కాబట్టి యీ గ్రంథమాలిక కిందే ప్రచురిద్దామని నిశ్చయించాం. "పింగళి సూరనార్యుడు" అనేది ప్రచురణమైంది. ఈ గ్రంథం రెడ్డిగారి పింగళి సూరనార్యుడి విమర్శన ప్రకటించక పూర్వం ప్రకటింపబడ్డది. రెండూ చదివితే పాఠకులకే తెలుస్తుంది.* ఆంధ్రయువకులు పట్నంలో విద్యార్థులుగా వుండేవారంతా చాలా సంతోషించారు. అలంకారాలను గూర్చి రెడ్డిగారి అభిప్రాయాన్ని విమర్శింతామని నాకు తీవ్రంగా యిచ్ఛ కలిగేటప్పటికి, అదివరలో నేను రాస్తున్న "అయ్యలరాజు రామభద్రుడు" అనేదాన్ని మానేశి "అలంకారతత్వవిచారాన్ని" రాశి ప్రచురించాము. ఇది యీ గ్రంథమాలలో రెండో గ్రంథం. ఇదో పెద్దఉద్గ్రంథం కాదుగాని అప్పట్లో విద్యార్థి కోటిలో కలిగిన

* రంగాచార్యులుగారు "ఋతుసంహారం" అనే గ్రంథాన్ని తెనిగించినట్టు కొన్ని పద్యాలు భారతిలో ప్రచురితాలైనై! (భారతి, రక్తాక్షి, కార్తీకం)

భావపరివర్తనానికీ, ఆందోళనకూ, మే ముపలక్షకులమని మనవి చేస్తున్నాను. ఈ క్రింది ఉపోద్ఘాతంలో రాసిన వాక్యాలను గమనించండి. "కేవలాంగ్ల విమర్శనా నియమములు మన యాంధ్రవాఙ్మయమును విమర్శించుటలో పనికిరావు. కేవలము మనపూర్వ విమర్శనా నియమములు ప్రస్తుతకాలమునకు తగవు. కావున నీరెండువిధముల నియమములను సమ్మేళనముచేసి సంప్రదాయములు చెడకుండ విమర్శనమును సాగింపవలయును..................సంప్రదాయ నిరసనము విమర్శనమును పెడత్రోవల కీడ్చుకొనిపోవును. దానిచే (సారస్వతమునకును) భాషకును హాని కలుగును. కావున విమర్శనము సరియైన త్రోవల నడుపవలయు. ఆత్రోవల జూపుటకై యీగ్రంథమాలిక యేర్పరుపబడినది. ......... ఇందు వెలువడు గ్రంథములయందు 'సంఘసంస్కరణోపన్యాసములు' గాని, 'పూర్వాధునిక సంఘచరిత్ర విమర్శనములు' గాని యుండవు. సాకుపెట్టుకొని యాంధ్రకవులగాని, వాఙ్మయమునుగాని తిట్టుటలుండవు. ......"* ఇట్టి యుద్దేశ్యములతో వెలువడిన గ్రంథమాలికను సాగించలేకపోయినాము. ఉడుతకుడుతాభక్తి అన్నట్టు సంతోషిస్తున్నాము. రంగాచార్యులుగారూ, నేనూ, మాఅప్పారావూ, సీతారామమూర్తీ, అందరము ప్రెసిడెన్సీ కాలేజీ విద్యార్థులమే! మాకందరికీ శ్రీవావిలికొలను సుబ్బారావుగారే ఆంధ్రగురువు. "ఆంధ్రభాషాభివర్ధినీ సమాజ"మని కాలేజీలో వక తెనుగు సారస్వత సంఘముండేది. దాని పక్షాన ప్రతి సంవత్సరం వక బహుమతి ప్రచురించి యేటావక ఉత్తమ విమర్శక వ్యాసానికిచ్చి దాన్ని సంఘపక్షాన ప్రచురిద్దామని మేముమాగురువుగారి అనుమతిపొందాము. మొదటనే "ఆంధ్రవాఙ్మయ

---

* *"I was unlike others of my generation in one thing only. I had made a new religion, almost an infallible church of poetic tradition, of a fardel (bundle) of stories, and of personages, and of emotions, inseparable from their first expression passed on from generation to generation."*

*(W. B. Yeats)*

ము నాచన సోమనాథుని శ్లాఘనము" అనేదానికి నాల్గు ఉత్తమవ్యాసా
నికి రూ 50 బహుమతిస్తామని ప్రచురించాం. ఆసన్నానికి కేవలం కార్య
దర్శిని. అయిదో, ఆరో వ్యాసాలు పోటీకి వచ్చాయని నాకు జ్ఞాపకం.
అందులో నెల్లూరినించీ రామదాసయ్యంగారిదొకటి. తుదకా బహు
మతి రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికివచ్చింది. వ్యాసంచాలా ఉత్త
మంగావుంది. ఉత్తరహరివంశం చాలా ప్రశస్తమనీ, సోముడు తిక్క
నంతవాడనీ వీరేశలింగం పంతులుగారి దగ్గరనుంచీ వచ్చేవాదాన్ని
తీసుకుని, సమస్తవిధాలా యెత్తిపెగడే పైచేయని సోదాహరణంగా
నిరూపించాడీయన. ప్రచురించటం మాసంఘంచేత కాకపోయే
టప్పటికి పాపం ఆయనే ప్రకటించుకున్నాడు. ఈవ్యాసంమీద ఆధార
పడి తన "సారస్వతోపన్యాసాల్లో" "నాచనసోమన కవితాగుణములు"
అనే వ్యాసంకూడా రచించాడనుకుంటాను. రెడ్డిగారల్లే యీన అతి
స్తుతికి గాని అతిదూషణకుగాని లోనుగాడు. శైలి చాలా ఉదాత్తంగా
ఉంటుంది. కారణజాతం దృఢంగా వుంటుంది. మంచి పటుత్వంగల
భాష. పాండిత్యమే గాకుండా మంచి లోకజ్ఞానం. ఈయనకు మంచి
కవితాధార ఉన్నట్టు "శాలివాహన సప్తశతి" వల్ల విదితమైంది. సంగీత
జ్ఞానంకూడా ఉన్నట్టు మద్రాసు రేడియోలో యిచ్చిన ప్రదర్శనాలవల్లా,
ఆంధ్రపత్రిక (వార)లో ప్రచురిస్తున్న సస్వరాలైన త్యాగరాయ
కృతులవల్లా విదితం. ఇప్పుడున్న పండిత విమర్శకుల్లో యీన వక
అగ్రస్థానం వహించ తగినవాడు. ఈన నెల్లూరులో జరిగిన నాటక
కళా పరిషదధ్యక్షుడుగా యిచ్చిన ఉపన్యాసం చదివి చాలాసంతోషిం
చాము. ఈనను పదికాలాలపాటుఉంచి ఆంధ్రభాషాసేవ చేయించాలని
భగవంతుని వేడుతున్నాను! ఆయనరాశిన భావకవిత్వాన్నిగూర్చి వెన
కనే స్పృశించిఉన్నాను. "వింజమూరిమండలి" వారం అప్పటినించీకూడా
మాయథాశక్తిగా దేశభాషాసేవలు చేస్తూనేవున్నాము. కాని మాపని
అంతా ప్రపంచానికి తెలిపేదార్థ్యం లేకపోవడంచేత కనపడ్డాని కవకాశం

వ్యసాహిత్య సేవకుడూ యీ పత్రికకు చేయూత యిచ్చి, దీన్ని యేవిధంగానైనా మాసపత్రికచేసి, సారస్వతంమీద స్వతంత్రంగా రాశేవాళ్లకు అవకాశ మిస్తే, తమ విధిని వకదాన్ని నిర్వర్తించినట్టు! ఘనీభవించిన వెనకటి దురభిప్రాయాలను కొన్నిటిని పగలకొడితేనే గాని నవ్యసాహిత్యపీఠనిర్మాణంనిర్విఘ్నంగాసాగదు.నవ్యసాహిత్యానికి యెవర్నిచూచీ జడవకుండావుండే దార్ఢ్యం వచ్చింది. కాబట్టి ధనికులు తమ జేబులను నవ్యసాహిత్య సేవకులకు విరివిగా తెరిచి, భాషాసేవ చెయ్యమని ప్రార్థిస్తున్నాను. ఇది "భారతి" పత్రికకు వ్యతిరేక ప్రచార మని భ్రమపడవద్దని మనవి. భారతి నడకకు వ్యతిరేకమైన సూత్రాల మీద నడిచేవాళ్లకు గతి కల్పించడ మెట్లాగో మనవిచేశాను. అంతే! ఆంధ్రదేశంలో అనేక మాసపత్రికలుండే అవకాశాలున్నవి. పుస్తక ప్రచురయితలకూడా వకమనవి. పుస్తకాల నచ్చువేశేటప్పుడు యిది మనకు ద్రవ్యం తెస్తుందాఅనే ప్రశ్నమాత్రమే ముఖ్యంకాదు. ఒకొక్కప్పుడు వాళ్లు అభినివేశంతో ప్రచురించిన పుస్తకంవల్ల నష్టం వచ్చిం దనుకోండి. అప్పు డేంచేస్తారు? కాబట్టి ద్రవ్యార్జనమే పరమావధిగా పెట్టుకోకుండా దానితోపాటు దేశభాషాసేవ చెయ్యడం కూడా విధిఅని మనవిచేస్తున్నాను.

# నవ్యాంధ్ర సాహిత్యవీధులు

—

## ఇతర తిరుగుబా టుద్యమాలు, సారస్వత చర్చలు, పరిశోధనం.

ఈ వత్సరాలల్లో యెలాగైతే జస్టీసుపక్షం తలెత్తిందో ఆలాగే నియోగి వైదీకకక్ష కూడా కొంత కలకలం కలగచేసింది. ఈ ఉద్యమానికి రెండు కారణాలు. మొదటిది నియోగుల్లో వైదిక కర్మాసక్తి. రెండోది సర్కారు వుద్యోగాలు. ఇదివరలో వైదికవృత్తిఅంతా వైదీకులచేతుల్లోవుండేది. ఆబ్దీకాదుల్లో నిమంత్రణవగైరాల కూడా వైదికులనే నియోగులుకూడా ఆహ్వానించేవాళ్లు. పంచదశ కర్మలు చేయించటంలో బ్రహ్మత్వం కూడా వైదికులకే వుండేది. అసలు యెన్నో వందల సంవత్సరాలనుంచీ వస్తున్న దీ రెండు శాఖలకూ వ్యత్యాసం. ఇక్కడ రెండుదాహరణా లిస్తాను. సంస్కృత కవులంతా వైదీకులనీ తెనుగుకవులంతా నియోగులనీ వక ప్రతీతివున్నది. ఇందులో మొదటిదెట్లావున్నా రెండోదిమాత్రం సత్యమనే తోస్తుంది. అధికసంఖ్యాకులైన ఆంధ్రకవులు నియోగులే! ఇదివకటి. నియోగులు రాజుల దగ్గిర మంత్రులుగాకూడా వుండడం రెండోవిషయం. తర్వాత వీరిద్దరికీ ఆచార వ్యవహారాల్లో, వేషభాషల్లో కొంతభేదంకూడా కనబడుతున్నది. ఇవన్నీ అట్లావుంచండి. వీటినన్నిటిని పురస్కరించుకుని "వైదీకులమీద తిరగబాటుద్యమం" ప్రారంభించిండి. దీనికి శ్రీ.వై. కోటీశ్వరశర్మశాస్త్రిగారు నాయకుడు. ఈనకొక తమ్ముడుండేవాడు. ఆయనపేరు మార్కండేయశర్మగారు. వీరిద్దరిలో చాలా భేదంవుంది. మంచిస్ఫురద్రూపి! వాగ్ధాటికలవాడు! గొడలతావళం వేసు

కుని శాలువకప్పుకుంటే శంకరాచార్లుగారి అపరావతారంవలె వుండేవాడు. ఈన ఉపన్యాసాలకూ ప్రచారానికీ, చందావసూలుకూ మిక్కిలి తగినవాడు. మార్కండేయశర్మగారు చాలా సౌమ్యుడు. పండితుడు. ప్రాయసగాడు. అన్నగారికంటె నిజమైన కర్మాసక్తి కలవాడు. నాకు వీరిద్దరినీ తెలుసుకునేభాగ్యం కలిగింది. మార్కండేయ శర్మగారు భారతధర్మానికే కాకుండా, ఆంధ్రభాషకుకూడా మహోపకారం చేసినవ్యక్తి. ఈనకు నియోగిఉద్యమంకంటె ధర్మప్రచారాసక్తి యెక్కువ. వీరిద్దరిలో శర్మ శాస్త్రిగారు గుంటూరు నివాసంగా యేర్పరుచుకున్నాడు. మార్కండేయ శర్మగారు పట్నంలో ఉండేవాడు. వీరు తదుద్యమ ప్రచారంకోసం "స్వధర్మప్రకాశిని" అనే మాసపత్రిక ఒకటి స్థాపించారు. దానికి సంపాదకులుగా వుండేవాడు మార్కండేయ శర్మగారు. అది ధర్మప్రచారమే గాకుండా సారస్వత సేవకూడా చేస్తూవుండేది. నాకు కొన్నివిషయాల్లో యిందులో వ్యాసాలు చాలాఉపకారకాలైనై. గుంటూరు యీవుద్యమానికి కేంద్రం. అక్కడి న్యాయవాదులూ, ఉద్యోగస్థులూ యీకక్షతో తోణికిసలాడుతూవుండేవాళ్ళు.* వీళ్ళల్లో కొందరు యెప్పుడో వదిలిన సంధ్యావందనాలూ, ఔపాసనలూ, అగ్నిహోత్రాలూ, మళ్ళీగ్రహించారు. ఈఉద్యమానికి మూలం ఇంతకువెనకనేవుంది. నందిరాజు లక్ష్మీనారాయణదీక్షితులుగారని వెనకతరంలో ఒకమహనీయుడు యీఉద్యమాన్ని లేవదీశాడు. నియోగుల్లో నిజమైన కర్మాసక్తి కలగజెయ్యాలని ఆయన లేవదీస్తే అది యీకాలానికి యిట్లాగా పరిణమించింది. దీనికి "పద్ధతి నియ్యోగ" మని పేరు. ధర్మం జీర్ణమైపొయ్యేకాలంలో ధర్మోద్ధరణానికి తలపడ్డ ప్రతీఉద్యమం మంచిదే! వైదికులుకూడా అధఃపతితులైయే ఉన్నారు. వాళ్ళు వైదిక

---

* ఈఉద్యమానికి పరిణామంగా చిల్లర ఉద్యోగులకు చాలా ప్రమాదంగావుండేది! ఎడ్లు ఎడ్లు పోట్లాడి లేగదూడలకాళ్ళు విరగకొట్టినవట!

వృత్తి వదిలి ఉద్యోగకాంక్షతో ప్రవర్తించే ఇప్పటి నియోగ్యం బలవంతమైంది. ఇప్పుడు రెండు తెగలే కాకుండా యావద్భారత జాతీ కూడా ధర్మచ్యుతమైపోయే వుంది. అది పరమేశ్వర సంకల్పంగా వున్నట్టు కనపడుతుంది. ధర్మం కాలాను సారంగా మారుతుందా? లేక మారినట్టు కనబడుతుందా? ఈ రెండు ప్రశ్నలకు సమాధానం చాలా కష్టం! ధర్మమెప్పుడూ వకటే అని వొప్పుకున్నా, తత్ప్రవృత్తి మార్గాల్లో మాత్రం భేదం కనపడుతుంది. కాబట్టి వెనుకటి మార్గాలెల్లప్పుడూ ఉండమంటే వుండవు. మార్గపరివర్తనంతో ధర్మపరివర్తనమే అవుతున్నదని భ్రమపడుతూ ఉంటామేమో? ఈ నియోగి ఉద్యమంకూడా తిరుగుబాటు మార్గాల్లో వకటి. ఈవుద్యమ మీకాలంలో సారస్వతానికి గొప్పకార్యం చేసింది.

**కవుల పోట్లాటలు :**

అప్పటి కింకా తిరుపతి వెంకటేశ్వరుల శతావధానప్రజ్ఞకు కొంచెం వాళ్ళవలెనే వార్ధక్యచిహ్నాలుపట్టినా, ప్రచారంలో నేవున్నది. ఇంతలో కొప్పరపు సోదరకవులు (సుబ్బారాయకవి, రమణకవి) దేశంలో ఆశుకవిత్వావధానాలు చెయ్యటం మొదలు పెట్టారు. నేనూ రెండు ఆశుకవిత్వావధానాలు చూశాను. ఇందులో ధారణా శక్తి అంత అక్కఱలేదు. వరసగా పద్యాలుధారగా చెప్పుకుపోవడమే అందులో ముఖ్యం. చెప్పడం మాత్రం చాలా తొందరగా చెప్పే వాళ్ళు. ఆచెప్పింది తప్పులు లేకుండా, రసవంతంగా ఉన్నాయా అనే చర్చ అక్కఱలేదు. రసమంటే అంత వేగమైన ధారలో నెక్కువగా రసముండటం అసంభవం. రెండోది తప్పులు ఉన్నాయా అని పరీక్ష చెయ్యడాని కవకాశమేదీ! మన మొక్కపాదం ఆలోచిస్తుండగాఅప్పుడే కొన్ని పాదాలు ముందుకెళ్ళిపోతారుకవులు. వెనకటివి వారికీ మనకూ కూడా జ్ఞాపకముండవు. ధారణ అక్కఱలేదు. వీరి కవితాధార అమోఘంగా మద్రాసుమెయిలల్లే వెళుతూవుండేది. మధ్యమధ్య అడ్డంవచ్చిన

వాళ్లమీద కూడాపద్యాలు! ఈవిధంగా వక సారస్వత విషయమైన పండగగా వుండేది వీళ్ల ఆశుకవిత్వావధానం. ఇక తిరుపతి వెంకటే శ్వరులా! అప్పటికి దాదాపు పావుశతాబ్దంనుంచీ అనేక శతావధానా లుచేసి ఆరితేరినవాళ్లు! "మావలె శతావధానాలు చెయ్యమనివీళ్ళూ", "మావలె ఆశుకవితాధార చెప్పమనివాళ్ళూ", తొడచరుచుకున్నారు. కొప్పరపువారు నియోగులు కావటం, తిరుపతివెంకటకవులు వైదీ కులు కావడం వైవికం. మొత్తంమీద కొంత అవ్యాప్తి అతివ్యాప్తు లున్నా, నియోగు లంతా కొప్పరపువారి పక్షం, వైదీకు లంతా తిరుపతివెంకటేశ్వరుల పక్షం. ఈ విధంగా శతావధాన, ఆశుకవి త్వావధాన పరంపరలు జరిగినై. వీళ్లు చేసినచోట వాళ్ళు మొక్కు వగా ఉండలేదు. వాళ్ళున్నచోట వీళ్లుండలేదు. ప్రత్యేకంగా ప్రగ ల్భాల కంతులేదు. ఇంతలో తిరుపతివెంకటేశ్వరుల కొకవిశేషముంది. దేశంలో అన్నిమూలలా శిష్యగణం. వీరిలో కొంతమంది నియో గులే కాకుండా కవిరాజ త్రిపురనేని రామస్వామిచౌదరివంటి కమ్మ వారుకూడావున్నారు. ఈకవిరాజుగారు చిన్నప్పటినించీ జస్టిసుభావా లున్నా, కవిత్వవిషయాల్లో తిరుపతివెంకటేశ్వరుల శిష్యుడు. ఆ గురు భావంమాత్రం జస్టిసుమనస్తత్వానికి లోబడలేదు. ఈ ప్రకారంగా నియోగి వైదీకి ప్రోత్సాహాల ననుసరించి గుంటూరుజిల్లాలో అనేక స్థలాల్లో, (బాపట్ల, గుంటూరు, పినపాడు, తెనాలి, నర్సారావు పేట, వేమవరం, మొదలైన) శతావధానాలు జరిగినై. ఉభయ పక్షాలనించీ అనేకమంది పెద్దలకు వీటిలో పేర్లు బైటికొచ్చినై కాశీ కృష్ణాచార్యులుగారు, జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు దంటు సుబ్బావధాన్లుగారు, బెల్లంకొండ రామారావుగారు, వేలూరి శివరామశాస్త్రిగారు, అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, రాయప్రోలు సుబ్బారావుగారు, చావలి వెంకటకృష్ణయ్యగారు, నడింపల్లి జగన్నా థరావుగారు, పులిపాక పూర్ణయ్యగారు, మొదలైన అనేకులు

సాక్షాత్తుగానో పరోక్షంగానో ప్రతిష్ఠనో అప్రతిష్ఠనో పొందారు * మొత్తంమీద యీవాదోపవాదాలయొక్క యితర ప్రయోజనాలెట్లావున్నా భాషకు మాత్రం ఉపకారమైంది. శతావధానవాఙ్మయం చాలా వృద్ధిపొందింది. అన్నిటికంటె విశేషం తిరుపతి వెంకటేశ్వరులు "గీరతం"తో పాటు "గుంటూరుసీమ" అనేవక అధిక్షేపకావ్యాన్ని రాశారు. ఇదిభాషకు వక అమూల్యాలంకారం. గుంటూరు మాత్రం అదివరలో యీకక్షకుస్థానమనే మాటను సార్థకపరుచుకుంది. ఈవూరేకాకుండా జిల్లాఅంతా వ్యాపించిందీకక్ష. నర్సారావుపేటగ్రామంలో అదిమిక్కిలి

---

*కాశీ కృష్ణాచార్యులుగారు స్వయంగా శతావధాని, సంస్కృతాంధ్రాల్లో గొప్పవక్త బహుగ్రంథాలు నిర్మించాడు. జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు "అభినవసరస్వతి" అనే సారస్వతమాసపత్రికను 40 ఏండ్లనించీ నడుపుతూ ఆంధ్రంలో చక్కని నిర్దుష్ట శైలిరాయగలిగి నాగరఖండాద్యనేక గ్రంథాలను రచించాడు. దంటు సుబ్బావధాన్లు నాకు సహపాఠి. ఈన పండితవంశానికి చెంది సంస్కృతాంధ్రాల్లో చక్కని పాండితీ కవనశక్తులు కలిగి పండితరాయలవారి భామినీవిలాసాని కనువాదం మొదలైన గ్రంథాలు రచించాడు. ఇప్పుడు శ్రీ తిరుమలశ్రీనివాస త్రిలింగవిద్యాపీఠాన్ని నడుపుతూ "అమృత సందేశ" మనే మాసపత్రికకు సూత్రధారుడుగా వున్నాడు. మంచి ఉద్యుక్త పండితుడు. బెల్లంకొండ రామారావుగారు గొప్ప వేదాంతి. సంస్కృతంలో బహుగ్రంథ నిర్మాత. భగవద్గీతాభాష్యానికి భాష్యార్కప్రకాశికనే వ్యాఖ్య రాశాడు. వేలూరి శివరామశాస్త్రిగారు చాలా ప్రతిభాశాలి. వ్యాకరణసాహిత్యాల్లో మంచి ప్రజ్ఞగడించి, ప్రాచీన నవ్యాంధ్రకవితామార్గాల్లో సమానంగా విహరిస్తూ, తమ గురువులైన తిరుపతి వెంకటేశ్వరులతో అనేక చిన్న చిన్న అధిక్షేపకావ్యాలూ, యింకా కొన్ని ఖండ కావ్యాలూ, చిన్న కథలూ రాసి దేశంలో పేరుపొందిన కవిపండితుడు. అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి రాయప్రోలు సుబ్బారావుగార్ల సంగతి వెనకనే మనవిచేశాను. చాపలి కృష్ణయ్య, నడింపల్లి జగన్నాథరావు, పులిపాక పూర్ణయ్యగారు ముగ్గురూ నర్సారావు పేటలో న్యాయవాదులుగా వుండేవారు. ముగ్గురూ స్వర్గస్థులైనారు. కృష్ణయ్యగారు మంచి ప్రతిభాశాలి. నర్సారావుపేట పురపాలకాధ్యక్షుడై చాలా చిన్నవయస్సులోనే స్వర్గస్థుడైనాడు. జగన్నాథరావుగారు ఆంధ్రగుణచరిత్ర రాసి "ఆంధ్రభారతీతీర్థ" వారిచే "పురాతత్వవిశారద" బిరుదాన్ని పొందాడు.

బలిష్ఠంగా వ్యాపించి వేళ్ళు పాకిపోయింది. రెండు ఉదాహరణాలిస్తాను. హైస్కూలుకు నియోగిగానీ, వైదికిగానీ, హెడ్మాష్టరుగా వుండకూడదని సర్కారువారు జీ. ఓ. ప్యాసుచేశారు. ఆ వూళ్లో మ్యునిసిపల్ యెన్నికలు మొదలైనవి జరిగేటప్పుడు అభ్యర్థుల కిదే ముఖ్యయోగ్యత. ఇతరకులాలవాళ్ళనుకూడా చెప్పడంలో "నియోగితురక, వైదీకితురక, నియ్యోగిమాల, వైదీకిమాల," అనే నామకరణం! ఆ పట్టణప్రారబ్ధం యిప్పటికీ అనువృత్తిగా వస్తూనే వుంది. కొప్పరపు కవులుకూడా భాషాసేవ చేసినవాళ్లే! దీక్షిత స్తోత్రాదులు చాలా గ్రంథా లున్నాయి వీళ్ళు రాసినవి. ఈవిధంగా యీ కక్ష భాషోపకారమైనది. దీని ఫలాల్లో మార్కండేయశర్మగారి స్వధర్మప్రకాశినీపత్రికద్వారాచేసిన పరిశోధన ముఖ్యమైనది. *

పైవిగాక యింకాకొన్ని చిల్లరఉద్యమా లున్నై. వాటిలో విరివైనది కమ్మవారికి సంబంధించింది. వెనక బ్రాహ్మణులమీద మొదలెట్టిన జెస్టిసుద్యమంగూర్చి ముచ్చటించాను. అది అరవదేశంలో పెరిగిపెరిగి, యిప్పుడు ఇ. వి. రామస్వామినాయకారుగారి ద్రావిడోద్యమంగా పరిణమించింది. తుదకు "జూ"లను జర్మనీనించీ వెళ్ళగొట్టినట్టు ఆర్యులనేవాళ్ళను తమిళదేశంనించి వెళ్లగొట్టడం కిందికిదిగుతుందేమో తెలియదు? అంత భయపడనవసరం లేదనుకుంటాను! బ్రాహ్మణుల్లో అంతా ఆర్యులనీ, బ్రాహ్మణేతరుల్లో అంతాద్రావిడులనీ నిర్ధారణచేయలేనంత కలిసిపోయినారు! ఈ జస్టిసుద్యమం మనఆంధ్రదేశంలో కులకక్షులకిందికి దిగింది. కమ్మఉద్యమం, రెడ్డికమ్మవిభేదం, కమ్మకాపువిభేదం, విశ్వబ్రాహ్మణోద్యమం, తుదకు ఆదిఆంధ్ర అరుంధతయోద్యమాలూ అన్నీ దీనిశాఖలే! ఎవళ్ళకులం వాళ్ళు అభివృద్ధిచేసుకోడానికి తప్పక ప్రయత్నించాలశిందే. అది

* "నీరతం, గుంటూరుసీమ" లను గూర్చి వెనకనే ముచ్చటించాను.

ద్వేషపూరితమూ, సకల దేశక్షేమనిరోధకమూ, కొంతవరకు అవశ్యభావ్యమేనని నా ఊహ! అది అట్లావుంచండి. కమ్మవారు పూర్వం ఉపనయనాధికారమున్న క్షత్రియులనీ, తర్వాత దాన్ని స్వార్థపరులైన బ్రాహ్మణులమూలంగా కోల్పోయినారనే వక వాదం. * వాళ్ళ కుపనయనాధికారంవుందని వేదంలోనించీ చూపిస్తూ ప్రచారం చేశాడు జి. బి. యస్. సరస్వతి అనే స్వాములవారు. ♦ ఈన దేశమంతా సంచారం చేశాడు. కొల్లూరు మొదలైన అనేకస్థలాల్లో వాళ్ళకు ఉపనయనాలు చేశాడు. వాళ్ళల్లో వాళ్లు యాజ్ఞికాలు చేసుకునేట్టుకూడా యేర్పాట్లు చేశాడు. దీనివల్ల వైదికవృత్తిలో వున్న బ్రాహ్మణులకు యిబ్బంది కలిగింది. ఈవిధంగా ప్రతిగ్రామంలో విరోధాలు ప్రబలినై. ఇంతకు పూర్వమే విశ్వబ్రాహ్మణోద్యమం, † వైశ్యోద్యమం, యింకా యిటువంటివాటివల్లనే విరోధాలు ప్రబలి వున్న గ్రామాలు యీ కొత్త విరోధానికి గురిఅయినై. ఈ పరిస్థితులు ఇప్పటికీ ఇట్లాగేఉన్నై. ఇవిగాకనిమ్న జాతుల్లోకూడాయీద్వేష బీజాలు నాటబడ్డై! దేశమంతా యీ కులకక్షలతో నిండిపోయింది. ఇదంతా వెనక నేను మనవిచేసిన అసంతృప్తిబీజఫలమే! కాని చాలా

---

* ఈ ఉద్యమానికి కృష్ణా గుంటూరుజిల్లాలు స్థావరాలైనై.

♦ ఈన పంచములచరిత్ర వకటికూడా రచించాడు.

† ఈ విశ్వబ్రాహ్మణోద్యమం ప్రముఖులు నిరంజనశాస్త్రి, గానాల రామమూర్తిగార్లు. వీళ్లలో రామమూర్తిగారు శాసనసభ్యుడై చాలా ప్రశస్తిపొందాడు. మద్రాసులో "జస్టిసు"కు తెనుగు తోబుట్టువైన "సమదర్శిని" అనే పత్రికకు సంపాదకుడుగా ఉంటూ ఉండేవాడు. ఈపత్రిక కొద్దిలోనే అంతరించింది. ఈయనకూడా శివసాయుజ్యం పొందాడు. ఈన మంచి వక్త, రాతగాడూను. ఈయనది గుంటూరు జిల్లా. ఆ జిల్లా యిటువంటి ఉద్యమాలకు ఆటపట్టుగా వరలింది. కమ్మోద్యమం అక్కడదే! ఇదీ అక్కడిదే! నియోగిఉద్యమం అక్కడిదే! ఇప్పటికీ యీ ఉద్యమాలు అక్కడ ప్రచ్ఛన్నంగానో బహిరంగంగానో ఉన్నై!

భయంకరమైన ఫలం! తిరుగుబాటు భయంకరాకారాన్ని పొందింది. ఈ పరిస్థితు లిప్పటికీ యిట్లాగేవున్నై! నిజంగా బ్రాహ్మణుడుకూడా తనకు ధర్మమేమిటో మరవబట్టే అందరికీ ద్వేషపాత్రమైనాడు! ఇందులో వక చిత్రం! ప్రతికులం బ్రాహ్మణులను దూషించడం! మళ్లీ బ్రాహ్మణ ధర్మాలనే అనుసరించటం! ఇదేమిటో? ఇట్లా తిరుగుబాటుగా పుట్టిన యీ కమ్మోద్యమంలో కొందరు సారస్వతసేవకులున్నారు. తెనాలి తాలూకా కొల్లూరుగ్రామంలో సూర్యదేవర రాఘవయ్యచౌదరిగారని వక ఆయనవుండేవాడు. మాకిద్దరికీ చాలా స్నేహం. నల్లగావున్నా మంచి మీసాలుకలిగి, చక్కగా మాట్లాడే శక్తికలిగి, గ్రంథం రాయగల భాషాజ్ఞానం కలిగినవ్యక్తి. ఈన "కమ్మవారిచరిత్ర"అని అతిపరిశోధనతో వక గ్రంథం రచించాడు. కమ్మవారి ఉదంతం తెలియజేసే మొదటిగ్రంథ మిది.* ఈన దివంగతుడైనాడు. స్వసంఘసేవ చేసి ఋణవిముక్తుడై నాడు. ఈ గ్రంథంవల్ల కులానికి చాలా ఉపకారమైంది. ఇంకా పరిశోధనచేస్తే కులచరిత్రసమగ్రంగా రాయవచ్చునని యీగ్రంథంవల్ల దృఢమైంది. కమ్మవారిలో లక్ష్మీపుత్రుల కేంకొదవ? గుంటూరుజిల్లా జాగర్లమూడిలో కుప్పుస్వామిచౌదరీగారంటూ వక లక్ష్మీపుత్రుడున్నాడు. ఆయన నిర్దుష్టంగా పరిశోధనం చేసి కమ్మకులచరిత్ర రాయటానికి గొప్ప విరాళ మిచ్చాడు. ఆ పరిశోధనలు చెయ్యటానికి కవిరాజ త్రిపురనేని రామస్వామిచౌదరీగారు మొదలైనవారొక సంఘంగాచేరారు. రామస్వామిచౌదరీగారు నాసహాధ్యాయుడు బందరులో. చిన్ననాటిమిత్రుడు. చిన్నప్పటినించీయీనకు మంచికవితాధార వుండేది. అది తిరుపతివెంకటేశ్వరులకృపచేతా, చెన్నాప్రగడ భానుమూర్తిగారి దయవల్లా అభివృద్ధి అయింది! ఇక్కడ ఎఫ్.ఏ. దాకా చదివి ఇంగ్లాండువెళ్ళి బారిస్టరై వచ్చాడు. ఇంగ్లాండువెళ్ళొచ్చి మాతృభాషను మరవకపోవడమే కాకుండా, తదభివృద్ధికి తోడ్పడడంలో

* "ఆర్యకవికుతంత్రము" అని మరొకటికూడా రాశాడు.

శ్రీరామలింగారెడ్డిగారికి సమకాలికుడవటంచేతను. విద్యార్థిదశలోనే కొన్ని నాటకాలు రాశాడు. ఇంగ్లాండునుంచి వచ్చినతరవాత యీన జస్టిసు చిత్తవృత్తికి పాత్రైనాడు. తెనాలిలో ప్రాక్టీసు పెట్టాడు. అక్కడే మ్యునిసిపల్ చైర్మనుకూడా చేశాడు. అప్పటినించీ ప్రాంతీయ జస్టిసునాయకులలో వకడు. ఈన విజ్ఞానవంతుడవటంచేత కులస్థులందరికీయన గౌరవస్థానమైనాడు. కుప్పుస్వామిశతకమని వక శతకం రాశాడు. సూతపురాణమని తన సిద్ధాంతాలను ప్రచారంచేస్తూ వక గ్రంథం రాశాడు. ఈనకు రాముడు దుర్మార్గుడు! కృష్ణుడు ద్రోహి! "కురుక్షేత్రసంగ్రామ" మని మామూలభిప్రాయాలకు భిన్నమైనవాటిని ఆశయంగా పెట్టుకుని వక నాటకంకూడా రాశాడు. ఇది చాలా విమర్శకు పాత్రమైంది. ఈన తెనాలిలో కట్టిన గృహానికి "సూతాశ్రమ"మని పేరు పెట్టుకున్నాడు. కమ్మకులనాయకుల్లో మంచి విజ్ఞానవంతుడు. భాషాసేవకుడు. అనేక గ్రంథాలను రాశినవాడు. ఈన సహాయంతో కమ్మకులచరిత్రను గూర్చి చేస్తున్న పరిశ్రమ కొంతవరకు ఫలించింది.* హృదయాన్ని దాచుకుని పైకి మెత్తగా మాట్లాడట మెట్లాగో యీన యెరగడు. పాండవులకు భాగమే లేదనీ, దుర్యోధనుడే సత్ప్రవర్తనుడై నిజమైన క్షత్రియుడనీ యీన వాదం. భారతాన్ని గూర్చి యిట్టి విమర్శనాలు

* కొత్త భావయ్యచౌదరిగారు కమ్మవారిచరిత్రను విపులంగా రాశాడు. రెడ్ల తెగనుగూర్చికూడా వక గ్రంథం యిటీవల వెలువడిందిట! ఈగ్రంథంలో కర్త తేల్చిన విషయం నేటికమ్మవారు పూర్వం వకప్పుడు క్షత్రియులని. ఇందులో "విస్మయజనకాలైన సిద్ధాంతాలు" చేయబడినైయనీ, "విషయాల్ని బట్టి నిర్ణయం చేయబడలే" దనీ, "విషయాలు తారుమారు చేయిబడినవనీ, ఆంధ్రపత్రికలో విమర్శనం రాసిన డాక్టరు మారేమండగారు రాశారు. ఈ భావయ్యచౌదరిగారి స్వగ్రామం తెనాలితాలూకా సంగంజాగర్లమూడి. ఈన పై రావుగారి విమర్శనం పైన 20-10-40 తేదీన ఆంధ్రపత్రికలో సమాధానం రాశాడు. దానికి మళ్ళీ రామారావుగారు 27-10-41 తేదీన ఆంధ్రపత్రికలో ప్రతిసమాధానం రాశాడు. కాని వీటితో మనకు పనిలేదు.

చేయటంలో యీన పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని హాత్రం మించలేదు. *రాఘవయ్య రామస్వామి చౌదరీగార్లు గాక యింకా కొందరు వ్యక్తు లున్నారు. వారిలో వకడు దుగ్గిరాల రాఘవ చంద్రయ్యశాస్త్రి. ఈనదీ రామస్వామిచౌదరీగారిదీ వకే గ్రామం. కృష్ణాజిల్లా గుడివాడతాలూకా అంగలూరు. ఈనకూడా యథాశక్తిగా సారస్వతసేవ చేసినవాడే. విద్యార్థిదశలోనే "విజయనగర సామ్రాజ్య"మనే నవలను రాశి 500 రూపాయల బహుమానాన్ని పొందాడు. ఆ నవలనుగూర్చి వెనక ముచ్చటించాను. అప్పటినించీ సారస్వతసేవ చేస్తూనేవున్నాడు. కాంగ్రెసువాడైనాడు. జైలు కెళ్ళాడు. ఖద్దరు వదలలేదు.♦ ఇటీవల యీన ప్రేరణతో తెనాలిలో "సద్బ్రాహ్మణమహాసభ" వకటి చాలా జయప్రదంగా జరిగింది. అందులో కొందరువిశ్వబ్రాహ్మణులుగూడాపాల్గొన్నట్టు వినికిడి! ఈన చిత్తరంజనదాసుజీవితము మొదలైనకొన్ని దేశభక్తప్రేరకాలైన గ్రంథాలను రచించాడు. మొత్తంమీద విజ్ఞానం కలిగిన దేశభాషాసేవకుడు. పంచివక్త. ఈ సందర్భంలో స్మరించాలిశిన యింకోవ్యక్తి వేమూరి

* ఈనకు సన్మానంజరిపి వకసంచిక అచ్చువెయ్యాలని గుడివాడలో వకసంఘం ఏర్పడ్డది. ఈనకు నా అభివందనాలు.

♦ కొన్నాళ్ళు బెజవాడలో "స్వరాజ్య" అనే పత్రిక నడిపాడు. మళ్ళీ సత్యాగ్రహుల లిస్టులో వున్నాడు. ఏమి చేసినా సహజప్రకృతిజస్టిసు చిత్తవృత్తి. ఈనకు కులకక్ష వక స్వభావం. కిందికి దిగిపోయి "అష్టాదశమహాపాతకి"అని బ్రాహ్మణ్ణి తిట్టించిందీనచేత. ఈ సందర్భంలోనే మరివక విప్లవపక్షగ్రంథాన్ని స్మరిస్తాను. ఇది "అశోక" మనే పేరుగల నాటకం. నవ్యుల్లో వకడైన ముద్దుకృష్ణ అనే ఆయన రాశాడు దీన్ని. ఇందులోకథ రామాయణం. కాని దానికి రామస్వామిచౌదరీగారి అర్థంకంటె విశేషార్థాన్ని కల్పించాడీయన. నాటకంలో "సీతను" మానసికంగా అపవిత్రగా చిత్రించాడు. అతినవ్యులలో కొంతమందికి, సామాన్యంగా జాతి యే విషయం పవిత్రమూ, గొప్పా అనుకుంటూ వుంటారో దాన్ని నిరసించడం వకగుణం. అటువంటి సూత్రంతో పుట్టిం దీ నాటకం. కవికుమారుడు కాబట్టి గద్యనాటకాన్ని యేదో తన యిష్టమొచ్చినట్టు రాసుకోనీండి : కాని తాను రాసిన దృశ్యకథాన్ని

రత్నయ్యగారు. ఈయనది కృష్ణాజిల్లా ఘంటసాల అనే గ్రామం. ఈయన చిన్నప్పుడు తానొక పెండ్లికి వెళ్ళితే జరిగిన వైశ్యావమానాన్ని పురస్కరించుకుని, విజ్ఞానాజ్ఞానోద్దేశ్యం కన్న, విజ్ఞానం అజ్ఞానమని చెప్పాడు. ఈయన ఆర్యసామాజికుడుగా కనబడతాడు. ఈయన "హిందూ ధర్మరహస్య" మనే ఒక గ్రంథం రాశాడు. అదీకూడా తిరుగుబాటు సూచకమేనని నా మనవి. ఈ గ్రంథానికి శ్రీ రామలింగారెడ్డిగారు పీఠిక నొకదానిని రాశారు. రెడ్డిగారంటే వెనకటి విజ్ఞానంమీద కలిగిన తిరుగుబాటుకు మూర్తి. కాబట్టి అట్టి తిరుగుబాటు యెందులో నైనా వుండనీ, అనగా సాంఘికంగా వుండనీ, సారస్వతంగా వుండనీ, అక్కడ ఆయన వాక్కో, కలమో, మనిషో ప్రత్యక్షమౌతాడు. తిరుగుబాటు రచయితలందరూ ప్రోత్సాహానికిగాని, సహాయానికి గాని, ఆయనదగ్గిరికి మూగుతూవుంటారు.* ఈ విధంగా అన్ని

సాధిస్తూ పెద్ద "సింహావలోకనం" రాశాడు. ఇది అసలు పుస్తకమంత వున్నది. ఇందులో నీతేమి, ధర్మమేమి, చరిత్రేమి, భారతసంస్కృతి అంతా చర్చించి తన సిద్ధాంతాల నిచ్చాడు. సారస్వతసేవకుడైన తన కీ గొడవంతా యెందుకు? దీని నిండా నిందలే! దూషణమే! సీతకంటె రాముడు విమర్శనానికి గురైనాడు. రామ స్వామి చౌదరీగారికివలెనే శంబూకవధ, సీతాత్యాగం యీనకు "సత్యాగ్రహం" కలిగ జేసినై. ఈనదృష్టిలో రామ రావణుల కేమీ భేదం లేదు! మంచి చెడ్డలకూ, కర్తవ్యా కర్తవ్యాలకూ, అతీతుడైనవాడు స్థితప్రజ్ఞుడైనా అయిఉండాలె, లేదా సంఘానికి శత్రు వైనా అయివుండాలె! ఈ గ్రంథాన్ని ఆత్మహత్యచేసుకున్న ప్రాణస్నేహితుడికి అంకితమిచ్చాడు. ఈ హత్య చేసుకున్న స్నేహితుడీగొప్పతనం యిట్లాచెప్పాడు. "తుప్పు పట్టిన ధర్మబంధాలకు కట్టువడిన పాతసంఘమూ, నిండు సత్యం తేజస్సు భరించలేని నూతనసంఘాలుకూడా......నిన్ను ఒక రాక్షసునిగా నిరూపించినవి." ఈన సింహావ లోకనంలో తాను భవభూతిఅంతవాడినని చాటుకున్నాడు. గ్రంథంలోవిలువయేమన్నా ఉంటే దాన్ని సింహావలోకం నశింపజేసింది. భారతసంస్కృతికి యెదురీతగా రచించే గ్రంథాలు యీ దేశంలో ఆదరణపొందడం చాలా కష్టం!

* కొంతకాలంనించీ యిదివరలో యీతిరుగుబాటుద్యమాల్లో పాల్గొన్న జను లంతా ఆర్యసమాజంలో చేరుతున్నారు. ఆర్యధర్మచ్యుతులు కాకుండా బ్రాహ్మణ్యం సిద్ధిస్తుందని వీరి ఆశయం.

కులకక్షులూ సారస్వతాని కుపకారంచేశినై. తుదకు సికింద్రాబాదు నివాసైన పెదగాడ గంగయ్య అనే విశ్వబ్రాహ్మణ మహాశయుడు తన పరిశోధనలకు ఫలంగా "అయిదుగుఱ కవుల సంగ్రహచరిత్ర" అనే గ్రంథం రచించి భాషాసేవ చేశాడు. ఇందులో యీన కవికర్ణరసాయన" కర్త యింటిపేరు "సంకుసాల" కాదనీ "టంకసాల" అనీ, ఆయన విశ్వబ్రాహ్మణుడనీ రుజువు చెయ్యటానికి ప్రయత్నించాడు! ఈ ప్రకారమే యీయన గ్రంథంలో నూతనమైనవీ, నమ్మటానికి కష్టమైనవీ అనేకమైన సంగతులు చెప్పాడు. అందులో చేమకూర వెంకటకవి నందిగామప్రాంతంలో పుట్టి తర్వాత తంజావూరు వెళ్లాడని వకటి! ఇటువంటి పరిశోధనావిషయా లెన్నో వున్నై యీ పుస్తకంలో. ఇది యావత్తు యీకాలపు తిరుగుబాటులక్షణఫలం. ప్రతి నూతనోద్యమం పరమేశ్వర సంకల్పమే! తత్కాలానికి కొంత ఆందోళన కలగజేసినా ఆద్యంతాల కన్నీ కలిసి దేశక్షేమాన్నే సమకూరుస్తై. ఈవిధమైన ఆందోళనమే గిడుగువారి భాషాసంస్కార ప్రారంభంలోనూచూశాం. అట్టి ఆందోళనమే యీ తిరుగుబాటుద్యమాల్లోనూ చూస్తున్నాం. సాంఘిక విజ్ఞానమే సారస్వతంలో ప్రతిబింబిస్తూ వుంటుంది.

## సారస్వత చర్చలు :

ఈకాలంలోనే యింకా కొన్ని సారస్వతచర్చలు జరిగినై. ముఖ్యమైనవాటినిగూర్చి ముచ్చటిస్తాను. ముందు కొన్నిటిపేర్ల నిస్తాను.

1. నన్నయ్య, వైదీకా నియోగా?
2. ఆంధ్రింబున ననుస్వారంబు కలదా ?
3. కృష్ణరాయలు క్షత్రియుడా ? శూద్రుడా ?
4. నన్నెచోడుడు నన్నయకంటె పూర్వుడా ?
5. నాచనసోమన యెఱ్ఱాప్రెగడలలో నెవరిస్థాన మెట్టిది ?
6. బట్టుమూర్తి రామరాజభూషణు లిద్దరా ? వకడేనా ?

7. *ఒంటిమిట్ట వరంగల్లు వాదము.
8. కురుపాండవుల దాయభాగ చర్చ.
9. ఆంధ్రశబ్దచింతామణి నన్నయ కృతమే — ?

వీటిలోవున్న అంశాలనుబట్టి కొన్ని సాంఘికాలు, కొన్ని చారిత్రకాలు, మరికొన్ని కేవల సారస్వతాలుఅని కనపడుతున్నది. వీటిలో కొన్ని నిరర్థక చర్చలు. నన్నయ వైదీకైతేయేం? నియోగైతేయేం? ఇది సాక్షాత్తుగా శతావధానుల పోట్లాటరోజుల్లో చర్చకొచ్చిన విషయం. వంగూరి సుబ్బారావుగారికి విషయాన్నిగూర్చి బహు అభినివేశంతో మాట్లాడేవాడు. వెనక ఆయన్ను గురించి చెప్పాను. ఆయన చారిత్రకంగా ఆంధ్రసారస్వతం పొందిన మార్పులను, పరిశోధనచేసి, చాలాశ్రమపడి "ఆంధ్రవాఙ్మయచరిత్ర" అనే పేరుతో గొప్ప గ్రంథం రాశాడు. సారస్వతానికి సంబంధించిన చారిత్రకవిషయాలిందులో చాలా బాగా చర్చించాడు. కాని సారస్వతంలో కలిగిన వివిధ తరంగాలనుగూర్చిగాని, గొప్ప కవులనూ, తద్రచిత గ్రంథాలనూ గూర్చిగాని అంత యెక్కువగా స్పృశించలేదు. శ్రీరామలింగారెడ్డిగారు దీనికికూడా పీఠిక రాశాడు. వాఙ్మయసేవ చేసేవాడు తప్పక చదవవలసిన గ్రంథమిది. ఆధునికు లెవరైనా దీన్ని తీసుకుని దానిలోవున్న విషయంతోబాటు నేను పైనఉల్లేఖించిన విషయాలను చర్చించి పరిష్కరిస్తే వాఙ్మయానికి చాలా ఉపకారమౌతుంది. ఈన కొన్ని చిన్నకథలుకూడా రచించి కథకుడైనాడు.

---

* ఇటీవల ఒంటిమిట్ట వరంగల్లువాదంవంటిదాన్ని జనమంచి శేషాద్రిశర్మగారు వకటి లేవదీశాడు. "వేమనయోగిది అనంతపురంజిల్లా కదిరితాలూకా కట్టారుపల్లె"ని చాలా వుదాహరణాలున్నయ్యనినిరూపిస్తూ "ఊరుకొండపల్లి"అనే వేమనరాతకు వేదాంతార్థ మిచ్చాడు. "కొండపల్లి అనగా కొండలోని గుహ"యట! "పొత్తరాహులు"ని వకవిధమైన నైరస్యంతోవాడినట్టు తెలుస్తుంది. (ఆంధ్రపత్రిక 14–12–40) గౌరవలాఘవాలను మీమాంసాన్యాయాలను వీరు మరిచినట్టు కనపడుతున్నది.

ఆంధ్రంలో అనుస్వారం విషయంలో అక్కిరాజు ఉమాకాంత పండితుడు చాలా కృషి చేశి లేదని నిర్ధారణ చేసి తన పేరుకూడా "ఉమాకాన్తమ్" అని రాసుకొనేవాడు. ఈనలో వక మాదిరి పట్టుదల చాలావున్నది. ఈనకెక్కడా చుట్టుపట్ల మైలుదూరంలో మంచిఅనేదున్నా కనపడదు. పెడర్థవాదం. కాని భయమనేది యెంతమాత్రం లేదు. మంచి వ్యాకరణ సాహిత్యజ్ఞానం కలవాడు. స్వయంకృషి చేత విజ్ఞానాన్నార్జించినవాడు. ఇంగ్లీషులోకూడా మంచి ప్రజ్ఞ కలవాడు. ఈన సంస్కృతంలోనించీ పతంజలి మహాభాష్యంలోవున్న విషయాన్ని తెనుగులోకి తేవాలని చాలా శ్రమపడి కొంత రాశి అచ్చేశాడు. కాని పని చాలాపెద్దది. అంతరించింది. ఈన రచించిన గ్రంథాల్లో "టిప్పుసుల్తాన్" అనే నవల చక్కని శైలిలోవుంది. ఈన మంచి సుశిక్షితమైన తెనుగు వచనశైలి రాయగలవాడు. "నేటికాలపు కవిత్వం" అనే పేరుతో భావకవిత్వాన్ని విమర్శించాడు. అందులోదంతా సమంజసం కాకపోయినా ఆపుస్తకం యీయన సాహిత్యశాస్త్ర జ్ఞానాన్ని మాత్రం తెలియజేస్తుంది. వ్యావహారికభాషలోనే రచించాడు. గీరతంలో వేంకటశాస్త్రిగారి పద్యవిభాగంవలె అధికరణ విభాగం చేశాడు. ఈయన చర్చించిన కొన్ని విషయాల్లో కొంత అర్థమున్నా మొత్తంమీద చూపిన సంకుచితదృష్టి గ్రంథ ప్రాశస్త్యాన్ని తగ్గించిందనే చెప్పాలె. ఈన "పల్నాటివీరచరిత్ర"ను గొప్ప పీఠికతో సంపాదించి ప్రకటించాడు. అది ఈనచేసిన వక గొప్ప పని. "త్రిలింగ" పత్రికకు సంపాదకుడుగా వున్నాడు. అప్పుడా పత్రిక పేరు "త్రిలిఙ్గ"గా వుండేది. వావిలికొలను సుబ్బారావుగారి తర్వాత ప్రెసిడెన్సీ కాలేజీలో తెలుగు పండితుడుగావుండి యిప్పుడు పింఛన్ తీసుకుని సుఖంగా వున్నాడు. పాండిత్యానికి తగిన శరీరదార్ఢ్యం లేదు. ఈన సారస్వతానికిచేసింది గద్యశైలీ రచనంలో కలగచేసినమార్పు! షేక్స్పియరు నాటకకథల నింగ్లీషులోనించీ పరివర్తనం

చేశాడు. ఈనకూడా వక ఆంధ్ర చంద్రాలోకం రచించాడు. భాషకు చాలా సేవచేసిన మహనీయులలోవాడే!

కృష్ణరాయలనుగూర్చినీ,విజయనగరసామ్రాజ్యాన్నిగూర్చినీ, తత్సంబంధమైన చాలా విషయాలనుగూర్చినీ, ఆంధ్రుల చరిత్రతో పాటు పరిశ్రమచేసినవాడు చిలుకూరి వీరభద్రరావుగారు. ఆయనకు "చరిత్ర చతురానన" బిరుదిచ్చిం దాంధ్రదేశం. చారిత్రకమైన అనేక గ్రంథాలు రచించాడు. ఆయన రచించినగ్రంథాలన్నీ వక బండెడౌతై. అవేగాక "నవరసిక మనోల్లాసిని" "హిందూగృహము" "హాస్య తరంగిణి" మొదలైన వాటినికూడా రచించాడు. ఈన వార్ధక దశలో కొందరితో ఈనకు వైరం తటస్థించింది. ఈన చాలా పట్టుదల మనిషి. చారిత్రకదృష్టి ఒక్కొక్కప్పుడు అహంకారానికి లోబడిపొయ్యేది! హైదరాబాదు భాగాలలో వుండే మున్నూరు కాపుల ఉదంతాన్ని కొంత పరిశోధనచేసి, తన ఆంధ్రుల చరిత్ర పునర్ముద్రణోద్యమంలో కాకతీయ యుగసంబంధమైన సంపుటాన్ని ముందు ప్రచురించి, ఆఖరిలో తనను తోసిరాజని కాకతీయసభను వరంగల్లులో జరిపి కాకతీయసంచికను ప్రచురించినవాళ్ళమీద తత్సంచికను విమర్శించి కసితీర్చుకుని ఏకకాలంలో వాళ్ళకు మనస్తాపమూ మున్నూరుకాపులకు సంతోషమూ కల్పించిన మహానుభావుడు. "జీర్ణ కర్ణాటచరిత్ర"ను సూయల్ దొర ననుసరించి రాశాడు. కాకినాడలో కుందూరి యీశ్వరదత్తనే ఆయనకూడా వక "విజయనగరసామ్రాజ్య" మనే గ్రంథం రాశాడు. కాని తత్సామ్రాజ్యవిషయాల నామూలాగ్రంగా రచించినవాడు వీరభద్రరావుగారే! వీరు చివరదినాల్లో తమ అల్లుడు మామిడన్న సుబ్బారావుగారింట్లో కొవ్వూరులో పరమపదించాడు. ఆంధ్రుల పూర్వచరిత్రను తెల్పి ఆంధ్రజాతి పునర్నిర్మాణానికి తోడ్పడ్డ మహనీయుడు. కీర్తిశేషుడు. ఆయనరాశిన ఆంధ్రులచరిత్ర విషయమై కర్తవ్యాన్ని వెనకనే మనవిచేశాను.

నన్నెచోడుడి పేరెత్తేటప్పటికి రెండు మూడు పేర్లు తలవాలె వొస్తుంది. మొదటివాడు మానవల్లి రామకృష్ణకవిగారు. సారస్వతంలో పరిశోధనంటే యేమిటో యెవ్వరెరగనికాలంలో యీన చాలా పరిశోధనంచేశాడు. ఈన చేసిన పరిశోధనల్లో ముఖ్యమైంది బరోడాగ్రంథాలయపక్షాన అభినవగుప్తుని వ్యాఖ్యానంతో భరతమహర్షి భరతశాస్త్రప్రచురణం. కానిపూర్తిచేయలేదు. కారణం తెలియదు. నన్నెచోడుడి కుమారసంభవప్రచురణం మరోటి. ఈ పుస్తకం ఆంధ్రదేశంలో సారస్వతసేవకులకు కలగజేసిన అలజడి యింతంతనటానికి వీల్లేదు. గ్రంథం గొప్పగ్రంథం. చాలా ఉదాత్తంగా రాశిన గ్రంథం. ఇది ప్రచురించినందుకు రామకృష్ణయ్యగారికి ఆంధ్రదేశమంతా కృతజ్ఞమై వుండాలశిందే! కాని యీ గ్రంథ పీఠికలో శ్రీ రామకృష్ణకవిగారు కొన్ని కారణాలిచ్చి, యీ గ్రంథం నన్నయ్యకుపూర్వం రచింపబడినట్టు స్పష్టంగా అభిప్రాయంయిచ్చాఢు. "పరప్రత్యయనేయబుద్ధు"లంతా నిజమేనని భ్రమపడ్డారు. నేనూ అట్లా భ్రమపడ్డవాళ్ళలో వకడిని. పూనాలో 1919లో జరిగిన ఓరియంటల్ మహాసభలో నేను తెనుగుసారస్వతాన్నిగూర్చి వక వ్యాసం చదువుతూ, యీకుమారసంభవం నన్నయ్యకుపూర్వందని దానిలో నిర్వచించాను. తర్వాత ఆ అభిప్రాయం మారింది. ఇప్పటికీ యీ వాదం అటూ యిటూ జరుగుతూనేవుంది. మద్రాసు విశ్వవిద్యాలయంలో తెనుగు పరిశోధనశాఖకు చెందిన శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు విశ్వవిద్యాలయ పత్రికలో గొప్ప వ్యాసం యీ విషయాన్నిగూర్చి యీవత్సంగతులూ క్రోడీకరించి రాశాడు. ఈ లక్ష్మీపతిశాస్త్రిగారుకూడా పరిశోధకులలో వకడు. ఈన రఘునాథరామాయణం మొదలైన మూడు గ్రంథాల్లోభాగాలు "రత్నపేటిక"నే పేరుతో ప్రచురించాడు. ఈన సూర్యరాయాంధ్రనిఘంటు కార్యాలయంలో పండితుడుగా కొన్ని వత్సరాలు పనిచేశాడు. తర్వాత అక్కడ యిమడలేక వెళ్ళి వచ్చేశాడు. ఇంతలో

వఝుల చినసీతారామ శాస్త్రిగారు మద్రాసు విశ్వవిద్యాలయం నించీ ఆంధ్రవిశ్వవిద్యాలయానికి వెళ్ళగానే యీనను ఆ స్థానానికి నియమించారు. ఈన వక నిఘంటువు రాశినట్టూ, దానిని వావిళ్ళవారి కిచ్చినట్టూ, అది వాళ్లు ప్రచురిస్తున్నట్టూ దానిపేరు "వావిళ్లీయ"మని "మాదిరిఫారం" వొకటి అచ్చుది చూశాను. కాని యింతవరకు రాలేదు. కారణం తెలియదు. ఈ శాస్త్రిగారు కూడా తమ యథాశక్తిగా భాషాసేవ చేసినవారే! ఈనకుపూర్వమే యీ కుమారసంభవాన్ని పూర్తిగా విమర్శించి కాలనిర్ణయం చేశిన వాడు నడకుదిటి వీర్రాజుపంతులుగారు. ఈనది పిఠాపురం. ఈన కూడా మంచి పరిశోధకుడు. కవిత్వంకూడా చెప్పగల సమర్థుడు. ఈన పరిశోధన, విమర్శన, వ్యాసాలు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో చూడచ్చు. నన్నెచోడుడిమీద అన్ని సంగతులు చర్చిస్తూ వక గ్రంథం రచించాడు. ఇప్పు డీ నన్నెచోడుడు నన్నయ్యకు పూర్వుండని నమ్మేవాళ్లెక్కువగా లేరనుకుంటాను! ఆ విషయం నిర్ధారణఅయిం దనుకోవచ్చు. ఈ విధంగా యీ చర్చ లేవదీసినందుకు రామకృష్ణకవిగారికి మనం వందనా లియ్యాలె! ఈన పరిశోధనవ్యాసాలు "ఆంధ్రచారిత్రకపరిశోధకమండలిపత్రిక" (Journal of the Andhra Historical Research Society) మొదలైన పత్రికల్లో ప్రచురింపబడుతూవుంటై! "అపురూపమైనవి, చెపితే ప్రపంచాన్ని ఆశ్చర్యపరిచేవి అనేకమైన విషయాల కాధారాలు నావద్ద ఉన్నై" అని చెప్పడంలో యీనా, వెంకట రమణాచార్లుగారూ ముఖ్యులు. చెప్పేవాట్లో దశాంశమైనా ప్రకటితంగా వుండవు. మన పరిశోధకుల్లో వున్న విశేషాలు కొన్ని తర్వాత సమయ మొచ్చినప్పుడు ముచ్చటిస్తాను. ఈన పాపం యింత పరిశోధన పండితుడైనా ప్రపంచం తగినట్టు గౌరవించకపోవడం చాలా శోచనీయం! నావలెనే యీనకూడా కాలూది యెక్కడా యెక్కువకాలం వుండలే

నుకుంటాను! ఇప్పుడు తిరుమలప్రాచ్యపరిశోధనాలయంలో పరిశో
కుడుగా వున్నట్టు తెలుస్తుంది!

బట్టుమూర్తి రామరాజభూషణులనుగూర్చి తద్రచితగ్రంథా
నుగూర్చి, ఆంధ్రశబ్దచింతామణినిగూర్చి వఝల చిన సీతారామ
శాస్త్రి, మేడేపల్లి వెంకటరమణాచార్లు మొదలైనపెద్దలు చాలాశ్రమ
పడి చర్చించారు. నాచన సోమననుగూర్చి వెనకనే రాళ్ళ అనంత
కృష్ణశర్మగారు చేసిన పనిని స్పృశించాను. నాచన సోమనాథుడి
కాలాన్ని, గ్రంథాన్నిగూర్చి వేలూరు శివరామశాస్త్రిగా రొక
పుస్తకం రచించాడు. కురు పాండవ దాయభాగ విమర్శనాన్నిగూర్చి
రాశినవాళ్ళల్లో విమర్శకాగ్రేసర కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి, శ్రీపాద
కృష్ణమూర్తిశాస్త్రిగార్లు పెద్దపెద్ద గ్రంథాలే రచించారు. ఇక మిగిలిన
వాటిలో ఓరుగల్లు వొంటిమిట్టచర్చ! దీనిలో వావిలికొలను సుబ్బా
రావుగారు, జయంతి రామయ్యపంతులుగారు, శేషాద్రి రమణకవులు
మొదలైనవారు చాలా పరిశ్రమ చేశారు. మొదటి యిద్దరిని
గూర్చి వెనకనే కొంతవరకు ముచ్చటించాను. ఈ చర్చకూడా నన్నె
చోడిచర్చవలె నిర్ధారణమైందనుకుంటాను. ఇది మా తెలంగాణాంధ్రు
లకు చాలా అభినివేశం గల విషయం. క్రిందటివత్సరం "పోతనజయం
తిని" జరిపించి "హాలికు"డనే నాటకం రాయించి హైద్రాబాదులోని
"కృష్ణరాయాంధ్రభాషానిలయం"వారు భావికాలానికి సాక్ష్యాన్ని బల
పరచారు. ఒక విషయాన్నిగూర్చి గ్రంథాలు బైలుదేరింతర్వాత
దాన్ని తిప్పటం చాలా కష్టం. శిరోమణి రంగాచార్యులుగారీ నాట
కాన్ని చక్కని శైలీపాకాల్లో రాశి ఆంధ్రదేశాన్ని తమకు కృతజ్ఞం
చేసుకున్నారు. వావిలికొలను సుబ్బారావుగారు పరమ
పదించాడు. శేషాద్రిశర్మగారి కంత అభినివేశం లేదు. ఇతర
దత్తమండలాంధ్రకవిపండితు లుదాసీనులు! ఇక వంటిమిట్ట రోదనం
వినేదెవరు? కాని వొంటిమిట్టఅనే పూర్తినమ్మకం కలిగి, అక్కడ ఉత్స

వాలు జరగటానికి "వాసుదాసులు" చేసిన యేర్పాట్లప్రకారం జరిగే వుత్సవాల్లో ప్రసాదాలు తినే భక్తగణంలో వకళ్ళైనా వొంటిమెట్ట వాదం అందుకోకపోవడం చాలా విచారకరం! వరంగల్లువాదులు కూడా వక కోదండరామాలయాన్ని జీర్ణోద్ధరణంచేసినా బాగా వుండును? ఈ విధంగా యీ కాలంలో పండితులూ కవులూ సారస్వతచర్చలు జరిపి దేశభాషాసేవ చేసి కీర్తిపొందారు. ప్రతికాలానికి తగిన ట్టీ చర్చలు జరుగుతూనేవుంటై! వాటివల్ల సారస్వతాని కుపకారమౌతూనేవుంటుంది!

పరిశోధనం :

పైన కొంత పరిశోధనాన్నిగూర్చి చెప్పటంచేత యీ విషయం కూడా యిప్పుడే చెప్తే సరిపోతుంది. సరియైన చరిత్ర పరిశోధనానికి పునాదివేసింది లక్ష్మణరావుగారని వెనక విన్నవించాను. సారస్వత పరిశోధన కూడా అవేమార్గాలలోనడిచింది. ఈ విషయచర్చలో యీకింది పేర్లుగల మహనీయులను కొందరిని పేర్కొనడ మవసరం.

1. మానవల్లి రామకృష్ణకవిగారు.
2. తేకుమళ్ల రాజగోపాలరావుగారు.
3. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.
4. జయంతి రామయ్యగారు.
5. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.
6. చిలుకూరి వీరభద్రరావుగారు.
7. చిలుకూరి నారాయణరావుగారు.
8. వంగోలు వెంకటరంగయ్యగారు.
9. రంగస్వామి సరస్వతిగారు.
10. కోరాడ రామకృష్ణయ్యగారు.
11. భావరాజు వెంకటకృష్ణారావుగారు.*

* ఇంకా పేరు చెప్పనివారు చాలామందిఉన్నారు క్షమించాలె!

రామకృష్ణకవిగారి పరిశోధనలనుగూర్చి ముచ్చటించాను. రాజగోపాలరావుగారు మన ఆంధ్రులలో సర్వతోముఖప్రజ్ఞకల వాళ్ళల్లో వకడు. ఈన మొదట్లో వీరేశలింగంగారి శిష్యుడు. బ్రహ్మమత ప్రచారంచేస్తూ విగ్రహారాధననుగూర్చీ, యీశ్వర తత్వాన్నిగూర్చీ, భోజన ప్రతిభోజనాలనుగూర్చీ, రాశి తుదకు హిందూ సంఘ సంస్కార చరిత్రను రాశాడు. ఈన నాకు చిన్న తనంలో బెజవాడ హైస్కూలులో మేష్టరుగా వున్నాడు. ఈన సన్నని శరీరం గలవాడు. మంచి వాచాలుడు. నిశితమైన బుద్ధీ, మంచి పరిశోధనాశక్తీ కలవాడు. తరువాత ఈన క్రైస్తవకళాశాలలో తెనుగు లెక్చెరరైనాడు. ఆకాలంలో ఈన క్రైస్తవమతం స్వీక రించాడని చెప్పుకునేవారు. ఈన ఇంగ్లాండుకూడా పోయొచ్చాడు. ఈనకు చరిత్ర భాషాపరిశోధన మంటే చాలాప్రీతి. అందులో ఛంద శ్శాస్త్రంలో చాలా పరిశ్రమచేశాడు. ఈన "పరిశోధక పత్రిక"♦ అని వక మాసపత్రిక కూడా కొన్నాళ్లు నడిపాడు. ఆంధ్రదేశచరిత్ర కూడా వక సంపుటము ప్రచురించాడు. దానిలో "తెలుగు" అనే శబ్దంమీద చాలా పరిశోధనం చేశాడు. టిబెటుదేశంలోనించీ తెలుగువా రొచ్చినట్టు రుజువుచేశాడు. ఇప్పటికీ హిమాలయపర్వత ప్రాంతంలోవున్న వకజాతివారికి "తెలంగం" అని దేవుడిపేరట! ఈ విధంగా చిత్రవిచిత్రవిషయా లందులో వున్నై. ఈ సందర్భంలో యీ కింది వాక్యాలు చదవండి "ఆరఖాన్ దేశానికి రాజధానీనగరం పే రేమిటో విన్నారా? దానిపేరు "త్రెలింగట"......బర్మాదేశం లోని పెగూరాజ్యాన్ని సాధించి దాన్ని యేలినవారు "తలైంగులట"! ఈ "తలైంగుల వృత్తాంతాలు క్రీ॥ పూ॥ 4 శతాబ్దంనుంచి పరంపరగా వస్తున్నవి."

భారతి.

(ప్రమాది. భాద్రపదం.)

♦ (*South Indian Research*)

ఈ విషయాలు "తెలుగు" కాకతీయవాసనగల "త్రిలింగ" శబ్ద భవమని చెప్పేవాదాన్ని భగ్నపరుస్తున్నై! ఇటువంటి అనేక విషయాలకు రాజగోపాలరావుగారికి మనం కృతజ్ఞులమై ఉండాలె. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాలా పరిశోధన అవకాశాలు పరమేశ్వరు డిచ్చినమనిషి. మంచి నిశితమైన వివేచనాశక్తి, మంచిబుద్ధి, మంచి రచనాచాతురి, వీటికి తగ్గట్టు పదవీ, పరమేశ్వరు డీయన కిచ్చాడు. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమంతా ఆయనచేతిలో వుంది. కొంత కాలం తాటాకు గ్రంథాలను సేకరించేపదవిలో వుండేవాడు. *నేను తంజావూరు పుస్తకభాండాగారంలోవున్నప్పుడు ప్రతిదినంనూతనజ్ఞానం సంపాయించుకున్నట్టు అనుభవిస్తూవుండేవాడిని. పరిశోధనానికి కావల సినగ్రంథసామాగ్రీ మొదలైనవన్నీ అందుబాటులోవుండేవి. చేసేపని, దానికి సహకారం, మనస్సుకుత్సాహం కల్పించేవి. కాబట్టి ప్రభాకర శాస్త్రిగారికి తగిన వాతావరణం కల్పితమైంది. మొదట శ్రీనాధ కాలాన్నిగూర్చి యీన పరిశోధన మొదలెట్టాడు. నేనుపట్నంలో ఇంటర్మీడియేటు చదువుతున్నప్పు డీయన ప్రచురించిన గ్రంథం "చాటుపద్యమణిమంజరి" (1913) తర్వాత శ్రీనాధుడినిగూర్చి శానా పరిశోధనంచేసి "శృంగారశ్రీనాధం" "కనకాభిషేకం" మొదలైనవి రాశాడు. శ్రీనాధుడుమీాదా ఆయనకాలంమీాదా యీన అధికార జ్ఞానంగల వ్యక్తిఅనచ్చు. ఇవిగాక అనేకవిషయా లీయన పరిశోధనం చేశాడు. బసవపురాణవిషయమంతా అవలోడనంచేసి పీఠికరచించాడు. తంజావూరు వృత్తాంతాన్ని మొదటతవ్వి పైలరుగ్రంథాన్ని మొదట ప్రచురించిందీనే! ఇది నాపుస్తకరచనలో నాకు చాలా ఉపకరించింది. ఈన పరిశోధనమేకాకుండా చక్కని కవితాశైలికలవాడు. భాసనాటకా లీయన్నాకర్షించినై! చాలావాటెని పరివర్తనంచేశాడు. వీటిలో వకటి నేను పాఠంకూడాచెప్పాను. మంచి సరసంగా పరివ

* ఈనప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారంనించీ తిరుపతి ప్రాచ్యపరిశోధనా మండలిలోకివెళ్లి అక్కడ పరిశోధన కార్యం చేస్తున్నాడు.

గ్రహంచేశాడు. ఈన చాలా సారస్వతసేవ చేసినవాడు. ఈనది పండిత కుటుంబం. ఈననుగూర్చి వకవిస్తరింతప్పక మనవిచెయ్యాలశింపుంది. ఈన వైదీకులైనా వీరికూమార్తెను వెనకటి ఆంధ్రయూనివర్సిటీ కళాశాల ప్రిన్సిపాలుగారైనట్టీ, నియోగులైనట్టీ, విస్సా అప్పారావుగారి కుమారుడికిచ్చి వివాహంచేసి తన సంఘసంస్కరణానికి తార్కాణం చూపాడు. ఇప్పటికీశాఖాభేదమంటూ అనవసరమైనసంగతులు పెట్టుకుని బ్రాహ్మణులలో అన్నిశాఖలైనా కలవకపోవడంకంటె శోచనీయమైన అంశంలేదు. ఇది చెయ్యలేని మనం యెందుకుపనికొస్తాము? ఈ విషయంలో యీనను నేనభినందిస్తూన్నాను. ఇప్పుడుశాస్త్రిగారు రామలింగారెడ్డిగారి పంపున రంగనాథరామాయణాన్ని తయారుచేస్తున్నారని వినికిడి. దీని పీఠికను సమగ్రచర్చతోనింపి ఆంధ్రదేశానికి కొన్ని అపోహాలు పోగొడతారని మేమందరం ఆశిస్తున్నాము!

జయంతి రామయ్యపంతులుగారు గొప్ప భాషాసేవకుడు. పరిశోధకుడు. పండితపోషకుడు. వీరిది అమలాపురంతాలూకాలో ముక్తేశ్వరం అనే గ్రామం. ఈన గొప్ప సర్కారుద్యోగం చేశాడు. జిల్లాకలెక్టరుకూడా చేశాడు. ఈన పీఠికాపురాధీశ్వరుడికి విద్యాగురువు కావడం, దానివల్ల ఆంధ్రనిఘంటు నిర్మాణోద్యమప్రారంభం, గ్రాంథికభాషావాదంకోసమూ భాషాసేవకోసమూ ఆంధ్రసాహిత్య పరిషత్తును స్థాపించడం మొదలైన సంగతులు వెనక మనవి చేశాను. ఈన చాలా చారిత్రకపరిశోధనం చేశాడు. అనేక శాసనాలు వ్యాఖ్యానం చేశాడు. అనేక చరిత్రగ్రంథులను, భాషాగ్రంథులను విప్పాడు. నన్ను మొదట ఆకర్షించింది యీన ప్రచురించిన యుద్ధమల్లుశాసనం. తద్వ్యాఖ్యానం చక్కగా రాశాడు. ఆంధ్రవిశ్వవిద్యాలయం పుట్టినప్పటినించీ వార్ధక్యం వచ్చినా విడవకుండా భాషాసేవచేస్తూ నేవున్నాడు. ఆంధ్రవాఙ్మయవికాసంమీద కొన్నివిశ్వవిద్యాలయోపన్యాసా లిచ్చాడు. ఆంధ్రచారిత్రకమండలి త్రైమాసికపత్రికలో ఆంగ్లంలో తెనుగువాఙ్మయంమీద వ్యాసాలు రచించాడు.

పరిశోధనంమాత్రమే కాకుండా యీాన చక్కని శైలిలో కవిత రాయ
గలవాడుకూడాను. ఉత్తరరామచరిత్రను చక్కగా, యథామాతృ
కంగా తెనుగులోకి అనువదించాడు. తమ యిలవేల్పు ముక్తీశ్వరుడి
మీాద వక శతకం రచించాడు. గొప్ప భాషాసేవకుడై చిరకీర్తిని
సంపాదించాడు. ఇటీవలనే యీాన పరమపదించాడు. *

మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆంధ్రదేశంలో యిప్పుడున్న
చారిత్రకుల్లో ఉత్తమకక్ష్యకు చెందినవాడు. ఈనతోపాటు భావరాజు
వెంకట కృష్ణరావుగారుకూడాను.♦ వెనకటితరంలో వున్న చిలు
కూరి వీరభద్రరావుగార్ని గూర్చి మనవి చేశాను. ఈ చరిత్ర
పరిశోధనాని కంతకు లక్ష్మణరావుగారు గురువు. వారి మార్గాన్నే
వీరందరూ అనుసరిస్తున్నారు. మనకు చరిత్రపరిశోధనానికున్న ఆధా
రాలు మూడు. మొదటివి శాసనాలు, రెండోవి సారస్వతంలోవున్న
గ్రంథాల్లో పీఠికలు, మూడోవి సమకాలికుల రాతలు. ఈ బాపతు
వాటినన్నిటిని శర్మగారు అవలోడనం చేశినవాడు. చాలాశాసనాలను,
మూలఉన్నవి వెళ్ళగించి వాటిని చదివి వాటిలో ఆంధ్రులచరిత్రకు
సంబంధించిన విషయాలను క్రోడీకరించి ప్రచురించాడు. వాటిమీాద
విషయచర్చ చేశాడు. ఈన చేసిన పనంతా యింకా మొత్తంమీాద
క్రోడీకరించి గ్రంథరూపంగా ప్రచురించలేదు. చాళుక్యులయొక్క,
చోళులయొక్క, కళింగులయొక్క, గాంగులయొక్క, రెడ్లయొక్క,
అనేకశాసనాలు వీళ్ళిద్దరూ బయటకుతీసి చర్చించారు. చర్చిస్తున్నారు.
వీరి పనంతా యింకాప్రచురణంకాలేదు. చేసినపనిలో ప్రచురణమైంది
వక నాల్గోవంతు. శర్మగారు మొన్నటివరకు విజ్ఞానసర్వస్వకార్యంలో

---

* ఆంధ్రభాషాయోషకు తీరనిదుఃఖం కలిగింది. కీర్తికాయుడు!

♦ ఈన శాతవాహనులకు దరిమిలాన ఆంధ్రదేశాన్ని యేలిన రాజకుటుంబాల చరిత్రను గూర్చి గొప్పచరిత్రగ్రంథంరచించి ఈ విషయాన్నిగూర్చి రాశిన సర్కారు వగైరాలకు భయంకొలిపాడు.

వున్నాడు. తర్వాతకొన్నాళ్లు "భారతి"సంపాదకుడుగావుండి, యిప్పుడు ఆంధ్రవిశ్వవిద్యాలయ పరిశోధకుడుగా వెళ్లాడు. మనిషి చాలా సహృదయుడూ, సరసుడూను. మనస్సు భావశబలతకు లోనయ్యేదికాదు. ఎల్లప్పుడూ చిత్తవృత్తి సరియైనమార్గంలోనే ప్రవర్తిస్తుంది. అత్యంత స్నేహపాత్రుడు. కష్టంకూడా సుఖంగా తీసుకోగల చిత్తస్థైర్యం కలవాడు. ఎప్పుడూ హాసన్ముఖుడు. కీర్తికాముడుకాడు. పనియందుఅత్యంత ప్రీతిగలవాడు. ఈన ప్రచురించిన గ్రంథాల్లో "అమరావతీస్తూపం" ముఖ్యమైంది. దాన్ని పాఠంచేప్పాను నేను. ఈన వచనశైలి సజీవమై హృదయాన్ని పులకరింపచేస్తూవుంటుంది. చరిత్రరచనకు మిక్కిలి ఉపయుక్తమై, పాఠకులకు అభిమానాన్ని కలగచేసేశక్తి కలిగివుంది. ఎంత చిక్కువిషయాన్నైనా చిక్కువిడదీసి అరటిపండువొలిచి చేతులో పెట్టినట్టు చెప్పగలసమర్థుడు. ఇంకా పనిమీదవున్నాడు. గొప్పగా నిర్వర్తిస్తాడని మేమంతా ఆశిస్తున్నాం. కృష్ణారావు నాకుమిత్రుడు. "ఏమోయి" అని పిలుచుకునే స్వాతంత్ర్యంకలవాడు. న్యాయవాది వృత్తిలోవున్నా సారస్వతసేవా, చారిత్రకవిజ్ఞానమూ నిరంతరం ఆకర్షిస్తూన్నవ్యక్తి. చారిత్రకపరిశోధనలో స్థితప్రజ్ఞుడు. ఈనరాశిన ప్రాచీనాంధ్రం నౌకాజీవనచరిత్రను నేను పాఠంచెప్పాను. ఆంధ్రచారిత్రక పరిశోధకమండలీ నిర్వాహకులలో యీన ముఖ్యుడు. రాజనరేంద్ర సంచికేమి, కళింగసంచికేమి, కాకతీయసంచికేమి, యీనహస్తం పడనిది లేదు. అఖిలభారతదేశంచేత వొప్పుకోబడ్డ చారిత్రికుల్లో వకడు. రాళ్లబండి సుబ్బారావుగారుకూడా అట్టివాడే! కాని యీనపరిశోధనంతా ఆంగ్లంలో వుండటంచేత యిక్కడ యెక్కువగా అవకాశం యివ్వడానికి వీల్లేకుండావుంది. వంగోలు వెంకటరంగయ్యగారుగూడా యీదోవలో పనిచేసి తమజన్మను సార్థకపరుచుకున్నాడు. అనేకమంది "మేము పరిశోధనలనుచేశామ"నుకునే యువకులకంటె నిగురుగప్పిన నిప్పువలె జీవితమంతా పరిశోధనకుధారపోసిన మహనీయుడు. వృద్ధుడైనా ఉత్సాహంతగ్గలేదు. నేను భారతిలోరాశిన అల్ప

విషయక వ్యాసాలుకూడా చదివినానని నాకు తెలియజేసిన సహృదయుడు. వేదం వెంకటాచలయ్యగారు కూడా వక గొప్పవ్యక్తి. "కతిపయ శబ్దార్థ నిర్ణయ" మనే శీర్షికతో ఆయన రాశిన వ్యాసావళి చాలా విజ్ఞానదాయక మైంది. నేను దాన్ని చదివి అనేక నూతన విషయాలను నేర్చుకున్నాను. వీరిద్దరూ (వెంకటరంగయ్య, వెంకటాచలయ్యగార్లు) నెల్లూరువారు. చాలాసరసులు. భాషా సేవకులు.

చిలుకూరు నారాయణరావుగారు తమ కాలాన్ని, విజ్ఞానాన్ని వృథావ్యయించకుండా భాషా సారస్వతాలకోసం వినియోగించిన వ్యక్తి. ఈన సర్వతోముఖమైన ప్రజ్ఞ కలవాడు. "భావకవిత్వం" చెప్పగల సమర్థుడు. గొప్ప పరిశోధకుడు. ప్రాయసకాడు. ఈన కూడా వీరేశలింగంగారివలె పర భాషావాఙ్మయం తెలుగులోకి తేవడానికి ప్రయత్నించినవాడు. ఈన అందుకోసం అనేక భాషల్లో పరిశ్రమ చేశాడు. "ఖురాన్ షెరీఫ్"ను తెలుగులోకి పరివర్తనంచేశాడు. "సంగంవాఙ్మయా"న్నిగూర్చి వున్న అపోహాలు చాలామట్టుకు ప్రపంచానికి తెలియజేశాడు. అనేక భాషా పరిశ్రమచేసి యిటీవల ఆంధ్ర భాషాచరిత్ర నొకదాన్ని ప్రకటించాడు. ఇది వక మహాగ్రంథం. ద్రావిడభాషాతత్వమని యింగ్లీషులో వక గ్రంథాన్నికూడా ప్రచురించాడు. "ఓమారు ఖయ్యాం" తెనుగులోకి పరివర్తనంచేశాడు. ఇంకా దీన్ని రాయప్రోలు సుబ్బారావుగారు "మధుకలశ" మనీ, దువ్వూరి రామిరెడ్డిగారు "పానశాల"నీ పేర్లతో పరివర్తనం చేశారు. ఇదే కాకుండా యింకా భావప్రథానాలైన పద్యకావ్యాలు రాశాడు. వెనకటి మన విద్యాపద్ధతి నుగ్గడిస్తూ "ప్రాచీనవిద్యాపీఠాలు" అనే గ్రంథం రాశాడు. విద్యార్థుల కుపయుక్త మయ్యేటట్టు వ్యాసావళి రాశాడు. ఇటీవల "పండితారాధ్యచరిత్ర" కు చాలా ఉత్తమమైన పీఠిక రాశి దేశభాషోపకారం చేశాడు. మనిషి యెంత నిగర్వంగా కనబడతాడో అంత విజ్ఞానం లోపలగలవాడు. ఎల్లప్పుడు పుస్తక

వ్యాసంగమూ, పుస్తకరచనా, నూతనవిజ్ఞానసాధనా, తత్ప్రచారమూ చేస్తున్న నిరంతర భాషాసేవకుడు. పైన ఉల్లేఖించినవి గాక అనేక యితరగ్రంథాలురచించాడు. అరవంలోనించి "కంబరామాయణా"న్ని ఆంధ్రంలోకి పరివర్తనం చేశాడు. ఈన భాషావేత్తృత్వంతో చేశిన పరిశ్రమఫలంగా తెనుగు యే భాషాకుటుంబానికి చెందినదని రుజువైతే యీనశ్రమంతా సంపూర్ణఫలవంత మౌతుంది. కాల్డ్వెలు సిద్ధాంతాన్ని సహేతుకంగా ఖండించినపండితు డీయనవకడేనని చెప్పవచ్చు! ఈనరాశిన తర్వాత యిప్పుడనేకులు తలపడ్డారు. ఈన పాఠ్యగ్రంథంగా వుండడానికి భాషాతత్వచరిత్రను రాయలేదు! కొరాడ రామకృష్ణయ్యగారు కాల్డ్వెలు సిద్ధాంతానుయాయి. ఆయన పుస్తకంతర్వాతపుస్తకం తెనుగులో, యింగ్లీషులో, గుప్పిస్తూ వుంటే యీన ఆ సిద్ధాంతాన్ని ప్రతిఘటించి వాదిస్తున్నాడు. కోరాడ రామకృష్ణయ్యగారుకూడా గొప్ప పరిశోధనచేసి భాషాసేవచేసిన వాడే! "ఆంధ్రభారత కవితావిమర్శనమ"ని వక గొప్ప భారతవిమర్శన గ్రంథంరచించాడు. తమతాతగారైన రామచంద్రశాస్త్రిగారి గ్రంథాలను చాలాప్రచారంచేశాడు. "భాషోత్పత్తి క్రమ"మని ఆంగ్లం లోవున్న టకర్ రాశినగ్రంథంలో కొన్ని అధ్యాయాలు తెనుగులో రాశాడు. గంటి జోగిసోమయాజులుగారుకూడా వక ద్రావిడభాషలనుగూర్చి గ్రంథంరాశాడు. ఇవి రెండూ స్వతంత్రంగా రచించినవి కావు. రామకృష్ణయ్యగారు ఇటీవల పరిశోధనచేసి రచించినవి కొన్ని గొప్పవి. నారాయణరావుగారిది మాత్రం యితరుల పని అనుకరించడం కాదు. చాలామట్టుకు స్వతంత్రం. ఈ ప్రకారంగా నారాయణరావుగారు చాలా భాషాసేవ చేసినా, చేస్తున్నా వ్యక్తి. ఇంకా పదికాలాలపాటు పరమేశ్వరు డాయుర్భాగ్య మియ్యాలని కోరుతున్నాను!

రంగస్వామి సరస్వతిగారు కీర్తికాయుడు. ఈనను మ ఆంధ్రు లెవ్వరూ యెరగరని నా అభిప్రాయం. ఈన తెలుగుల

చాలా కృషిచేసినవాడు. డాక్టరు కృష్ణస్వామయ్యంగారితో కలిసి పనిచేశినవాడు. పట్నంలో నేను చదువుకున్నప్పుడే వీనకూ నాకూ పరిచయమైంది. మనిషి గొప్ప ఉత్సాహవంతుడు. గవర్నమెంటువారి శాసనశాఖలో పనిచేస్తుండేవాడు.* విజయనగర సామ్రాజ్యచరిత్రకు మాతృకలైన ఆంధ్రగ్రంథాల్లో పీఠికలన్నీ సేకరించి వాటి నింగ్లీషులోకి పరివర్తనంచేసి విజయనగరచరిత్ర నిర్మాణానికి పనికొచ్చే సాధనాలను తయారుచేశి పరిశోధకుడికి సిద్ధాన్నం చేశిపెట్టిన మహనీయుడు. కాని చేసిం దీనైనప్పటికీ పేరు కృష్ణస్వామయ్యంగారికి వచ్చింది. ఆ గ్రంథం పేరు "Sources of Vizianagar History". ఇట్లా చేసిన పనికి పేరురాకపోవడంలో ఆయనతోపాటు నేనుకూడా వున్నాను. తంజావూరు లైబ్రరీ సంస్కృత క్యాటలాగును 10 వ సంపుటంనుంచీ తయూరుచేశింది నేను. ఏ కొద్దో అనగా 5% వంతుంటుంది సంపాదకుడి చెయ్యి అందులో. రాశిన విషయానికి ఖండ ఖండాంతరాలనించీ గొప్ప అభిప్రాయాలూ అభినందనాలూ వస్తూండేవి. కాని నా పేరే కూడా అచ్చులోలేదు. అంతా పేరూ సంపాదకులైన పి. పి. యస్. శాస్త్రిగారికివచ్చింది. రిపోర్టు గుమాస్తారాస్తాడు. కాని పేరుఆఫీసరుకు వస్తుంది. ఉద్యోగధర్మమిది. రంగస్వామి సరస్వతిగారిపనికి వందనాలైనా యిచ్చాడు అయ్యంగారు. నేను దానికికూడా నోచుకోలేదు. రంగస్వామి సరస్వతిగారి కృషి చాలా కొనియాడ దగింది. ఆయన స్వర్గస్థుడైనా మన వందనాలకు పాత్రుడు!

పరిశోధనం సందర్భంలో నా స్వవిషయం వకటిముచ్చటిస్తాను. నేను తంజావూరు లైబ్రరీలోవున్నప్పుడు తెనుగుపుస్తకాల పట్టీకూడా తయూరుచెయ్యాలనే ఉద్యమంవచ్చింది. ఇందులోనాకుపూర్వం పింగళి లక్ష్మీకాంతంగారూ, అక్కడ తయూరుచేస్తున్న సంస్కృతక్యాటలాగు సంపాదకులైన పి. పి. యస్. శాస్త్రిగారూ, యీ విషయంలో కొంత

---

* *Preface to "Buddhist remains in Andhra" by K. R. Subrahmaniam.*
*Sources of Vizianagar History. Introduction.*

ప్రచారం చేశారు. నేను వెళ్లినతర్వాత దానికి బలమిచ్చి పోషించి, అక్కడి పుస్తకాలనుగూర్చి లక్ష్మీకాంతంగారితో కలిసి వకరిపోర్టు రాసి ఆంధ్రవిశ్వవిద్యాలయంచేత వొప్పించాము. ద్రవ్యం శాంక్షను చేసి వాళ్ళు ఉద్యమాన్నంతా శాస్త్రిగారిచేతుల్లో పెట్టారు. బందరునించీ శాస్త్రిగారిఆప్తస్నేహితుడైనవరదాచార్యులుగారుయిద్దరుపండితులను పుస్తకావలోడనంచేసి వ్రాతకాపీ తయ్యారుచెయ్యటానికి పంపారు. శాస్త్రిగారికి తెనుగు యెంతమాత్రం రాకపోవడంచేత ఆపనంతా నాఆధ్వర్యంకిందనే జరిగింది. వ్రాతంతా దాదాపు తయారైంది. ఇంతలో నేను హైద్రాబాదు రావడం తటస్థించింది. అచ్చుపనిఅంతా యితరుల సహాయంతో చేయించారు శాస్త్రిగారు. అంతా తయారైన తర్వాత, అక్కడవున్న గ్రంథాల్లో వున్న విశిష్టత తెలిపి, వాట్లో ముఖ్యమైనవాటినిగూర్చి తెలియచేస్తూ పీఠిక రాయాలశివచ్చింది. ఆపని శాస్త్రిగారూచెయ్యలేరు. ఇతరులు చెయ్యటానికీ చాలా శ్రమచెయ్యాలె. అప్పుడు అచ్చైన వకకాపీపంపి శాస్త్రిగారు నన్ను పీఠికరాశిపంపమని హైద్రాబాదుకు వుత్తరంరాశారు. అప్పటికి నేను తంజావూరుద్యోగంలో లేకపోవడంచేత నా పేరుకూడా వేస్తారనే ఆశతో రాశిపంపాను. తర్వాత కొన్నాళ్ళకు నా కొకక్యాటలాగు ప్రతి "ఆంధ్రయూనివర్సిటీ రిజస్ట్రారు అభినందనాలతో" అని వచ్చింది. చూతునుకదా పీఠికకూడా తానే రాసుకున్నట్టు శాస్త్రిగారే సంతకం చేసి అచ్చేసుకున్నారు. చూశారా? దీన్ని యేమంటారో! లైబ్రరీ సంగతులు చెబుతూ యిట్లాఅన్నారు, "ఈ లైబ్రరీలోవున్న తెనుగు గ్రంథాలనుగూర్చి కురుగంటి సీతారామయ్యగారు నా దృష్టిని తిప్పాడు. పని ప్రారంభమైంది. పూర్తిఅయ్యేలోపునే సీతారామయ్య ఖాయపు ఉద్యోగరీత్యా హైద్రాబాదువెళ్ళాడు." కొందరికి పని తక్కువైనా పేరువస్తుంది. కొందరికి పనియెంతచేసినా పేరురాదు. ఈ రెండోరకంవాడిని నేను! వందనాలకైనా పాత్రుడినికాలేను!

పరిశోధనానికి సత్యం పరమావధి. పరిశోధకుడు సత్యాన్వేషి. ఇది ప్రతీ పరిశోధకుడికీ వుండాలిశింది. మన పరిశోధకుల్లోకూడా సత్యాన్వేషణం లేకపోలేదు. పరిశోధకు లంతా వక కుటుంబం వలె తాము చేస్తున్న పనినిగూర్చి కూడ బలుక్కుంటూ సమిష్టిఫలాలను భాషకూ దేశానికీ అందచెయ్యడం విధి. ఇట్టి సందర్భంలో మన పరిశోధకుల్లో కొన్ని కూడనివిషయా లున్నై. మొదటిది అసూయ. అయ్యో! అతనికి పేరొచ్చిపోయెనే! అనేమాట సత్యాన్వేషకుడి కుండకూడదు. రహస్యం మరొకదుర్గుణం వీళ్ళలో. తమకు తెలిసిన విషయాలు తమలోనే వుండాలె. ఇతరులకు తెలిస్తే వాళ్ళెక్కడ తమకంటె ముందు ప్రచురిస్తారో అని బెంగ! పోటిన్నిటికేమిగాని మరోటున్నది. అది క్షమించటానికి వీల్లేని విషయం. ఇతరుల మాటలను తమ స్వంతవాటివలె ప్రచురించుకోటం. కొంతమంది యితరుల మాటలే గాకుండా యితరుల గ్రంథాలలో వుండే భాగాలే దొంగిలించడం! పోనీ, యెవరి దగ్గిర్నించీ గ్రహిస్తారో వాళ్ళపేరు చెప్పడానికి సిగ్గనుకోండి! తుదకు తనదిగాదని చెప్పటమూ, అటువంటి మాటలనుగాని, భాగాలనుగాని అనువాదచిహ్నాం (Inverted Comma) తో వుంచటమూ విధి. ఇటువంటి తప్పునే నొకమాటు చేశాను. చీవాట్లు తిన్నాను. ఇప్పటికీ వక కళంకంగా భావించుకుంటున్నాను. ఒకప్పుడు అభిప్రాయాలుకూడా సుప్రసిద్ధాలైతే పర్వాలేదుగాని, ప్రత్యేకాలైతేతప్పక చెప్పడం విధిఅని నామనవి. ఇంకా పరిశోధకుల్లో ఉన్న గర్భశైత్యాలు మరెక్కడాలేవు. పిల్లులు పోట్లాడుకున్నట్టు పత్రికల్లో పోట్లాడుకోడం. ఎంత విచారకరమైన విషయము! "కాకతీయసంచిక" విషయంలో పరిశోధకు లందరూ యెట్లా పోట్లాడుకున్నారో జగద్విదితం. "తెలంగాణా శాసనాల" విషయంలో యిప్పటికీ మారేమండ రామారావుగా రంతా తప్పుచేశారనే విషయం ప్రచార మవుతూనేవుంది. పాపం! ఈదోషారోపణచేశేవాళ్లు తాము స్వయంగా నిర్దుష్టులా అంటే మళ్ళీ

ఎట్లాగూ కనపడదు. పరిశోధన విషయంలో, చర్చించిన అంశం సరి అని చర్చవల్ల తేలి సర్వాదరణను పొందినదాకా అది సత్యమని స్వీకరించడానికి వీల్లేదు. పరిశోధనలో తర్కం నిశితంగా ప్రయోగిస్తేగాని సత్యం తేలదు. దయా దాక్షిణ్యమూ లేకుండా పరీక్షించాలె. కాని వ్యక్తి దూషణం కిందికి దిగరాదు. పరిశోధన యెట్టి గర్భశైత్యాలకూ అవకాశ మియ్యవలసిన విషయం కాదు. ఒక పరిశోధకుడు దుఃఖిస్తాంటే మరోడు నవ్వడంకంటె గర్హ్యం యింకొకటి లేదు! అంతేగాక అనేక బహిస్సాక్ష్యాలమీద ఆధారపడివున్న ఆంధ్రచారిత్రకసారస్వతవిమర్శనం ప్రథమంలోనే నిర్దుష్టంగా ఉండడానికి యెంతమాత్రం వీలు లేదు. నా "తంజావూరాంధ్రనాయకరాజచరిత్ర" మీద సోమశేఖరశర్మగారు నా పొరబాట్లను భారతిలో విమర్శించాడు. శిరసావహించాను. రెండో ముద్రణంలో చర్చించి తప్పైతే వొప్పుకోక తప్పదు. మరోటి. నా దగ్గర యేదో అపూర్వమైన విషయ ముందని పత్రికలోనో ఉపన్యాసంలోనో చెప్పడం, బయట పెట్టకపోవడం! ఇదొక పరిశోధక రహస్యం! పరిశోధకులు ఒకరిమీదొకరు రాసుకునేటప్పుడు భావాలను కేవలం యిష్ట మొచ్చినట్టు పోనియ్యకుండా కొంచెం చిత్తవృత్తులను నిరోధించుకుంటూ వుండాలె. నిజమైన పరిశోధనం యెట్లా వుండాలంటే లక్ష్మణరావుగారు రాశినట్టుండాలెనని నా మనవి.

వెనక "ఆంధ్రసాహిత్యపరిషత్తు"సంగతి చెప్పాను. మొదట అందులో పాల్గొన్న వారు కొందరు దానితో తృప్తిపొందక, చీలిపోయి "ఆంధ్రసారస్వత సభ" నే పేరుతో వేరే సంస్థ స్థాపించారు. అది 1917 సంవత్సరప్రాంతంలో జరిగినట్లు నాకు జ్ఞాపకం. అప్పటినించీ యీ సంస్థకూడా యేటేటా సంవత్సరసభలు చేస్తున్నది. ఇప్పటికి 23 సభలైనై. 24 సభ చీరాలలో జరగాలిసింది, తేనేలూరులో

జరిగింది. ఈ సంస్థకు ముఖ్యసాధకుడు కోన వెంకట్రాయశర్మగారు. ఎల్లప్పుడు సారస్వత సాధన చేస్తూనే వుంటారు. ఆంధ్రమహాపండితుల జీవితచరిత్రలను సంగ్రహిస్తున్నారు. ఇప్పటి కొక పెద్ద సంపుటమై వుంటుంది. ఇంకా యితరగ్రంథాలుకూడా రచించారు. ఈన సారస్వతసేవకుల్లో యెన్నదగినవారు. నిరాడంబరజీవి. నల్లగా పొడుగ్గా వుండి, శాంతమైన సంభాషణవైఖరి కలిగి, పనే ప్రధానంగా వున్న వ్యక్తి. చిరంజీవియై వర్ధిల్లి భాషాసేవ చేస్తూండాలని ఆశిస్తున్నాను.

# నవ్యాంధ్ర సాహిత్యవీధులు

## ౧౦

సాహితీసమితి :

నవ్యసాహిత్య వ్యాపకానికీ, వెనకటి వింశతిసంవత్సరాంతానికీ తుదివిషయ మీా సమితిస్థాపనం. సాహితీసమితిఅంటే వక సంఘ మనీ, దానికి అధికారవర్గ ముండేదనీ, వక కార్యనిర్వాహకు డుండే వాడనీ, దానికేమైనా రూల్సు వగైరా లున్నాయనీ భ్రమ పడవద్దు. ఇది వక కవిసమయంవలె "నవ్యసాహిత్య వ్యాపనసమయ" మనచ్చు. సంఘంలో సభ్యులెవరు ? నేను సభ్యుణ్ణి అనుకునేవాళ్లంతా సభ్యులే. సభాపతోయెవ్వరూ యెన్నుకోలేదు. యేంలేదు. నువుసభాపతివి, నువుసభాపతివని దగ్గిరున్న వాళ్ళనేటప్పటికి సభాపతిఅయిపోయినాడా యన. ఆసంగతి తెలిసేటప్పటికి మిగిలినవాళ్లంతా యీా "వదంతి"ని వొప్పుకుని ఆయన్ను శిరసావహించారు. ఈన సభాపతవడం శ్రీని వాసశిరోమణి-శిరోమణిత్వమల్లె* వుంది. ఆ వ్యక్తి అప్పట్లో మిగిలిన నవ్యసాహిత్య నిర్మాతలకందరికీ గౌరవస్థానమైనాడు. అది సమంజ సమే ! ఏమైనా చందావుందేమో అని భ్రమపడద్దు ! ఇస్తేఉంది ఇవ్వకపోతే లేదు. ఈలాంటి నియమాలుగలదీ సమితి. మేం సభ్యుల మని అనుకునేవాళ్ల బుర్రల్లోవుందీసమితి. అచ్చేశే కాగితాలమీాదఉం దీసమితి. సభాపతిననుకునే ఆయన చిత్తవృత్తిలో వున్నదీసమితిసభా పతిత్వం. చందా యివ్వాలనుకునే వాళ్లల్లోనూ, ఇవ్వక్కర్లేదను కునే వాళ్లల్లోనూ కూడావుంది. ఇది ఈసమితి ఉదంతం ! ఈ కాలంలో నూతనమార్గాన్ని అనగా సుబ్బారావుగారిదాన్ని గానీ, అప్పారావుగారిదాన్ని గానీ, అనుసరించేవాళ్ళల్లో చాలామంది సమితి

---

* సభాపతిగారి నోట నన్నదాన్నిబట్టి యిది రాశాను. ఈనకూడా నాకు మిత్రుడు.

సభ్యులవుతున్నారు. వీళ్ళందరూ యిట్లా సభ్యుల మనుకోడానికి రెండు కారణాలున్నాయి. ఈ నవ్యమార్గానికింకా ప్రచారం బాగా రాకపోవడం వకటి. అక్కడక్కడా రాశేవాళ్ళున్నారు కాని యెవ్వరెవ్వరు రాస్తున్నారో బయటికిరావడం చాలా కొద్దిగావుంది. పుస్తకా లచ్చుపడ్డ యేయిద్దరు ముగ్గురోతప్ప యీ మార్గాన్ని అనుసరిస్తున్న వాళ్ళందరూ కలవడం యెప్పుడూ జరగలేదు. అసలు మూల మూలల ఆంధ్రదేశంలో యిటువంటివా రెందరున్నారో తెలియడానికే వీల్లేకుండావుంది. ఇక రెండో కారణమేమి టంటే దేశంలో పండితులంతా దాదాపు యీ మార్గానికి శత్రువులైనారు. నూతన మార్గంవాళ్ళందరూ కలిసి వక సంఘంగాయేర్పడి, పండితులకు సమాధానంచెప్పగల వకవిజ్ఞానినో, వక మొండివాడినో, యితరులను లెక్కచెయ్యనివాడినో సభాపతిగా వుంచుకుని రాస్తూ ప్రచారంచేస్తూవుంటే బలం చేకూరుతుందనే భావం. ఈ రెండు కారణాలచేతా, వక కుటుంబంవాళ్లు అందరికీ సామాన్యమైన ఆపత్తొచ్చినప్పుడు కలిసినట్టు వీళ్ళంతా కలిశారు. సమితి నిర్మాణమైంది. మొదటి సభ్యులలో చాలామట్టుకు తెనాలివారు. తెనాలిలోనే యీ సమితి ప్రథమ కార్యాలయం. కార్యాలయ మంటే వక యిల్లనుకోవద్దు సుమీ! ఈ నల్గురూ యెక్కడ కలుసుకుంటే అదే కార్యాలయం! వక చతుష్పథం కావచ్చు, వకప్పుడు కాఫీహోటలు కావచ్చు, వకప్పుడు రైలుస్టేషను కావచ్చు, ఇంకొకప్పుడు వీళ్ళంతా కలిసిన వక స్నేహితు డిల్లు కావచ్చు! కాబట్టి సమితికీ, సభాపతికీ, కార్యాలయానికీ తగినట్టేవుంది! ఇక తెనాల నేది నిర్ధారణే! తెనాలంటే యేమనుకున్నారో! ఆంధ్రదేశానికి కేంద్రమది. బెజవాడంటారేమో! కాదు. భూగోళ రీత్యా బెజవాడకావచ్చు! ఆఫీసు లుండటంచేత బెజవాడకావచ్చు! కేంద్రత్వాని కింతమాత్రం చాలదు. బ్రిటిషుసామ్రాజ్యానికి లండన్ ముఖ్యపట్నం. కాని బ్రిటిషుసామ్రాజ్యాన్ని యేలుతున్నవి, ఆక్స్ఫ

[illegible] నిర్వహించాయి! అప్పుడా బెజవాడకు బదులు తెనాలి [illegible]! మా పండిత [illegible]. తెనాలిలో వున్నన్ని కాఫీ హోటళ్ళు బెజవాడలో వున్నాయా? తెనాలి హోటళ్ళలో లాంటి [illegible]. కాఫీ ఆంధ్రదేశంలో యెక్కడా దొరకవు. వెంకట్రామయ్య [illegible] లాంటి [illegible]! సహాయ నిరాకరణోద్యమంలో జైలుకు [illegible]! దేశభక్తుడు' సాహితీసమితికి వెంకట్రామయ్యవంటి [illegible]. కాఫీ హోటల్ యజమానిగా వున్నవారైన తెనాలి కేంద్రం కావటం యెంతమాత్రం ఆశ్చర్యంకాదు. ఫాషన్లలో ఆంధ్రదేశానికి తెనాలి మార్గదర్శి! స్త్రీపురుష నేపథ్యాలూ, స్త్రీపురుషుల వస్త్రాల కటకటరంగుల రకాలూ, స్త్రీపురుషుల జుట్టుజడల యొక్క విన్యాసాలూ, మొదలైనవాట్లో ఆంధ్రదేశానికంతకు క్రొత్త పోకడలను ప్రసాదించింది తెనాలి! దానికి "ఆంధ్రపారిస్" అనే బిరుదనిచ్చారు పెద్దలు. తెనాలి తాలూకా ఆకాలంలో సిరిసంపదలతో తులతూగుతూవుండేది. ఎకరమమ్మితే 2, 8 వేలురూపాయలు! స్వాతంత్ర్యప్రియులైన కమ్మవారి నివాసస్థానం! ఏదీ రామవిలాససభ వంటి నాటకసంఘాన్ని చూపించండి! గోవిందరాజుల వెంకటసుబ్బారావు వంటి నటకుడినీ స్థానంవంటి స్త్రీపాత్రధారినీ చూపండి! కాంచనమాల వంటి నటిని చూపండి! సర్కారుకు ముప్పైలక్షలపన్ను చెల్లించే తాలూకా చూపండి! తుదకు తెనాలి రామలింగడివంటి వికటకవిని చూపండి! కాబట్టి తెనాలంటే సామాన్యమనుకోవద్దు! సంసార స్త్రీలలో నాటకాల్లో వేషం వేయడానికి ధైర్యంచేసిన ప్రథమాంధ్ర యువతి తెనాలివాసి! కథకుల్లో మహోన్నతిపొందిన "చలం" గారిదీ మా తెనాలి! ఇట్టి తెనాలి యీ సమితికార్యస్థానం.

కారణజాతం, సభ్యత్వం, కార్యస్థానం చెప్పినతర్వాత యిక సభాపతి. ఈయనకు మొదటినామం "శివశంకరుడు". వీరి యింటిపేరు "తల్లావఝ్ఝులవారు". ఈ తల్లావఝ్ఝుల శివశంకరుడుగా

లోక అజ్ఞాతవ్యక్తి. కాదు! ఈయన ఏక వ్యక్తి కాదు ఒక సంస్థ' ఈయన నాకు బంధువు. ఈయనకూ నాకూ పరిచయం కలిగింది 1912 సంవత్సరం. షుమారు 30 సంవత్సరాలైంది. ఈయనది గొప్ప పండిత వంశం. తండ్రిగారూ పితృవ్యుడుగారూ గొప్ప సంస్కృత విద్వాంసులు. ఈయన భార్య, ఉద్దండపండితులైన, "శబ్దార్థసర్వస్వ" మనే యింకా పూర్తికాని గ్రంథం మొదలైనవి వ్రాసిన పేరి సుబ్బారాయ శాస్త్రిగారి కుమార్తె! అటువంటి మామగారికిండు తక్కువైనా కాడీయన. 1913. 1914 సంవత్సరంనాటి కీయన గ్రంథరచన ప్రారంభించాడు. అది నవలలు తయారౌతున్న కాలం. అప్పట్లో వ్యక్తుల సారస్వతసేవ నవలారచనతో ప్రారంభమయ్యేది. అందులో పరివర్తనాలు. అందు కోసం యీయన బెంగాలీ మహారాష్ట్ర భాషలు చదివి వాట్లోనించి నవలలను పరివర్తనం చెయ్యడం మొదలెట్టాడు. "రఘునాథజీ, తేజసింగు" అనేవి యీయనరాసిన ప్రథమ నవలలు. అప్పట్లో నాకు వంగోలులో కలిసినప్పుడీ నవలలు నా కిచ్చాడు చదవటానికి. అవి చదివే టప్పటికి నా కాయనమీద గౌరవం కలిగింది. ఈయన గొప్ప పరీక్ష యేమీ ప్యాసు కాలేదు. ప్రతిభాశాలులకు పరీక్ష లెందుకూ? ఇప్పుడీయనతో మాట్లాడితే ఈయనకున్న విజ్ఞానం ఆంధ్రదేశంలో ముప్పాతికమందికి లేదు! అప్పటి కింకా ఈయన విజ్ఞానార్జనంలోనే వున్నాడు. క్రమంగా విజ్ఞానవంతుడైనాడు. నూతనభాషా సారస్వత మార్గాలన్నీ గమనించాడు. ఇవి యితర దేశాల్లో యెటువంటి మార్పును యెట్లా పొందినయ్యో తెలుసుకున్నాడు. కాలగతి పరిశీలించాడు. భాషా సారస్వతాలు తప్పక నూతన విజ్ఞానానికి లోబడాలని నిశ్చయించుకున్నాడు. కాని యీయన యిక్కడ నిర్ధారణ చేసుకున్న పద్ధతి చాలా ముఖ్యమైంది. రాయప్రోలువారి భావానికీ, అప్పారావుగారి భాషకూ, మధ్య ఏకవంతెన యేర్పరిస్తేనే కాని అభివృద్ధి భవన నిర్మాణం కాదని గట్టిగా మనస్సులో నిశ్చయించాడు. పండితులకు సమాధానం చెబుతూవుండాలె! మళ్ళీ వాళ్ళచేత వొప్పిస్తూ

[illegible] అవకాశం కలగ
[illegible]! [illegible] దోహదమియ్యాలి!
[illegible] సమ్మోహం [illegible] "రసవాది".
[illegible] ఎక్కడ చెప్పంటే అక్కడ
[illegible] ఎక్కడి సహృదయుడు. అన్నిం
టికీ [illegible]. [illegible]. ఎప్పుడూ సమాధాన పద్ధతి.
[illegible] ఎటువంటివాడి
[illegible] సమాధానమియ్యాలో [illegible] సంస్కృతంలోవున్న
సాహిత్యసిద్ధాంతాలకు సంబంధించిన లక్షణగ్రంథాలూ, యింకా
[illegible]లోవున్న [illegible] పుస్తకాలేకాకుండా, ఫ్రెంచి
జర్మను భాషలు చదువుకుని వాటిలో రాసిన లలిత కళావిజ్ఞానం చదివి,
హృదయాన్ని ప్రపంచమంత విశాలంచేసుకున్న మనిషి. ఈన సహాయ
నిరాకరణంలో వకమారు అరెస్టుఅయినారు. అరెస్టుచేసిన ఇనస్పె
క్టరుగారు ఆయనగది సోదాచేసినప్పుడు ఆయనకు కనపడ్డవన్నీ పుస్త
కాలే! అవికూడా ఆయన యెప్పుడూ పేర్లువిననివీ కననివీని! ఆయన
ఆశ్చర్యపడిపోయినారు. "ఇదేమిటి! ఈన సహాయ నిరాకరణ
మంటారు? ఈయనదగ్గిర లలితకళాగ్రంథాలు తప్ప యేమీ లేవే?
అయినా నాపనిని నేను నిర్వర్తించాలిగా!" అన్నాడు దగ్గిరున్న
వాళ్ళతో. సర్వసాహిత్యానుసారుల్లో యేదైనా ప్రశ్నవస్తే దాన్ని
గూర్చి చర్చచేసి ప్రత్యుత్తరం సోపపత్తికంగా రాయగలవారు చాలా
తక్కువగావున్నారు. పద్యాల్లోనో, వచనాల్లోనో, వచనపద్యాల్లోనో
"బూతు" నిర్విశేషంగా, నర్మగర్భంగా, ఊహాకందనట్టుగా,
తిడుతూ రాయసమర్థులు చాలామంది ఉన్నారు. ఇటువంటి
వారు పోట్లాటను తెచ్చిపెట్టగలరు గాని సమర్థించలేరు. వెన
కటి తరంలో అనుకునేవారు. "వెంకటశాస్త్రిగారు పోట్లాటలు
తెస్తే, తిరుపతిశాస్త్రిగారు వాటిని సర్దలేక ఆయన పనైపొయ్యే
ది. కాని వెంకటశాస్త్రిగారు దీనిని ఒప్పుకోరు. దాని

సత్యాసత్యాలతో మనకు పని లేదు. కేవలం ప్రత్యుత్తరాలను సహేతుకంగా చెప్పడం ప్రతి ప్రాచీనవాదికీ సాధ్యమా! ఎప్పటికీ కాదు! దానికి పాండిత్యమూ, తర్కశక్తీ, కావాలి. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, శివశంకరశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, నోరి నరసింహశాస్త్రి మొదలైన కొందరు యీ పని కుపయుక్తులు — తగినవాళ్లూను. వీరి కీఉద్యమానికి ఉపద్రష్టలు. శివశంకరశాస్త్రి గారు కార్యవాది. ఈన సామాన్యంగా పోట్లాటలు తెచ్చుకోరు. సాధ్యమైనంతవరకు తగవు చంపడం యీన పద్ధతి. మన పని మనకయితే చాలు. ఈ సమాధానపద్ధతితో యే పని చేస్తున్నవాడికి ఆ పనికి ప్రోత్సాహ మిచ్చారు. ఇంతమందిని సాహితీసమితిసభ్యులను వ్యావహారికం రాయమని ప్రోత్సహించారు, వద్దనేవాళ్ళకు సమాధానం చెప్పారు; కాని తా నెక్కువగా సాధ్యమైనంతవరకు గ్రాంథికమే రాస్తూ వచ్చారు. ఏదో చిన్నివాళ్ళని కొందరి విషయంలో, వాళ్ళ బలపాటం తీర్చుకో నియ్యమని కొందరి విషయంలోనూ, భాష నీ యిష్టం భావం మాత్రం నవ్యంగావుంటే చాలునని కొందరివిషయంలో, రెండిటియందూ నవ్యత చూపగలవాళ్ళను మెప్పు తెలుపుతూ, యీ ప్రకారంగా అందరినీ కూడదీసుకుని కార్యసాధనం చెయ్యడమే యీన సభాపతిత్వానికి పరిణామం. ఈన, త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి, కొమ్మర్రు హనుమంతరావు, కొడవటిగంటి వెంకటసుబ్బయ్య, వజ్ఝ బాబూరావు, మునిమాణిక్యం నరసింహారావు, పెద్దిభొట్ల పూర్ణశర్మ, నోరి నరసింహశాస్త్రి, కోపల్లె శివకామేశ్వరరావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, చింతా దీక్షితులుగార్లు ప్రథమసభ్యుల్లో కొందరు. ఇంకా కొందరున్నారు కాని వీళ్ళు ముఖ్యులు. వీళ్ళనుగూర్చి కొంచెం ముచ్చటించక పూర్వం యీ సమితినిగూర్చి వారే మేం చెప్పుకున్నారో సాహితీపత్రిక ముఖపత్రంమీద ఉన్నది అనువదిస్తాను. "అందరును పెద్దమనుష్యులు, కవులు, చిత్రకారులు, విద్వాంసులును సభ్యులు. చందాలను తీసుకొని ప్రజలను మోసగించు వర్తకసంఘ

[illegible]గ్రెస్సారు. ఇంత చిన్నవయసులో నుంచి ఆశేషమైన [illegible]ములు కావలసిన వెంకట సుబ్బయ్య తోపోవటం [illegible] యిప్పటివరకూ చాలా విచారకరం!• ఈన స్వగ్రామము [illegible]నాలి. వీరి తమ్ముడు లక్ష్మణ యీ సాహిత్యక్షేత్రాన్ని తమ స్వక్షేత్రం చేసుకుని కృషి చేస్తున్నారు. కులుంబరాన్న చక్కని ఉత్సాహంతో ప్రతి పత్రికలో పద్యం, కథ, వ్యాసము, మొదలైన వివిధ సాహిత్యశాఖల్లో సంచరిస్తూ తనకిప్పటికే వక స్థానాన్నేర్పరచుకున్న యువకుడు. చిరంజీవై యితోధిక సేవ చేస్తాడని నమ్ముతున్నాను! [illegible] చాలా భావో[illegible]ది. చాలా చిన్నతనంలోనే మృత్యువాతబ[illegible]పోయింది. నల్లని దేహకాంతి కలిగి, యెత్తైన [illegible]తో, [illegible]ని ముఖము మందహాసంతో వుండేది. చాలా అభివృద్ధికి రావలసిన వాడు. వీరిద్దరి మృతీ సాహితీ ప్రథమసభ్యసమితిని చాలా [illegible]ం చేసింది. అందరూ చాలా విలపించారు. ఈ విధంగా యీ సమితి స్థాపింపబడ్డది.

"సాహితి" :*

[illegible] సాహిత్య ప్రచారానికో సంపత్రిక [illegible] బాగుంటుందని తోచింది. "సాహితి" అనే పేరుతో వక పత్రిక స్థాపించారు. తల్లావఝ్ఝులశివశంకరశాస్త్రి మొదట దాన్ని సంపాదించారు. ఈన శివశంకరుడల్లా శివశంకరశాస్త్రై నాడు. ఎప్పుడైనాడో యెవ్వరికీ తెలియదు•! ఈ సమితీ, యీ పత్రికాకూడా యీ నూతన సాహిత్య[illegible]తకు చాలా దోహదం చేసినై! మిగిలినవాటికేంగాని యీ పత్రికా, సమితీకూడా చేసిన వక పనిమాత్రం చెప్పదగివుంది. మిగిలిన వాటి

---

• "సంధ్యారాగం" అనే పేరుతో యీన గీతావళి ప్రచురింపబడ్డది. "[illegible]ల్లి" అనే నాటిక కూడా రచించారు. శివశంకరశాస్త్రిగారీ యనను గూర్చి "[illegible]త్ర మను" పేర గీతా రూపముగా అశ్రువులనిచ్చారు. అందులో ఆయనన్ను గూర్చి యెందరెన్నివిధాల చెప్పుకుంటున్నారో అవన్నీ ఉన్నై!

* స్థాపితం. 1920 సంవత్సరం (భారతి, ప్రమాది, భాద్రపదము.)

కంటె ఈ విశిష్టమైన సాహిత్యసాధన చేసేవాళ్లకు వక విధమైన నిర్భ
యత్వం కలగజేసి యీ రకమైన సారస్వతానికి స్థాయిత్వ మిచ్చినై.
వెనక రాసేవాళ్ళంతా జడిసి రాసేవాళ్ళు. ఇప్పుడా జడుపు వదిలిపో
యింది. "వైనించివచ్చే దెబ్బలను కాచుకోడానికి శాస్త్రిగారున్నారు"
అనే వక నిశ్చయత్వం కలిగిపోయింది. ఇది యీ శాస్త్రిగారూ,
యీ పత్రికాకూడా కీళ్ళకిచ్చిన ప్రథమదోహదం! ఈ పత్రికా,
దాశీకవాళ్లూ, వాళ్లు చేసిన పనీకూడా రాబోయే వింశతివర్షాలకు
సంబంధించినవి కాబట్టి యిక్కడ ఆ సంగతులను స్పృశించ నక్కర
లేదు. మొదట యీ సమితిసభ్యులు కొంతమాత్రం పూచీ లేని
వ్యక్తులవలె కనబడేవాళ్లు! ప్రతివాళ్ళకూ హాస్యస్థానమైనారు.
పెద్ద లనుకునేవాళ్ళు వీళ్ళను లక్ష్యంచెయ్యలేదు. కొన్నాళ్ళుండి
వెనక్కు తిరిగి చూచేటప్పటికి యీ సారస్వత మప్పుడే స్థాయి అయి
పోయి, కొంత జనాదరణాన్ని పొంది, యీ సాధకులు బాగా
నిర్భయంగా రాస్తూ, కొందరిచేత గౌరవింపబడుతున్నారు.
అప్పుడు కొందరు చాలా దుఃఖించారు. మరికొందరు కాలస్థితిని
తెలిసికోక వెనక గిడుగువారి భాషాసంస్కారవాదాన్ని ఢీకొన్నట్టు
ఢీకొన్నారు. కాని యీదఫా వాళ్ళ ప్రయత్నాలన్నీ నిష్ఫలాలైనై.
నవ్యసాహిత్యం స్థిరమైపోయింది. కాని దీని కప్పటికి పరిమితీ, లక్ష
ణమూ, యేర్పడ లేదు. అప్పటికి కాదు ఇప్పటికే యేర్పడ లేదు!
ఏదో గాలి పోగుచేసినట్టు చెప్పాలేగాని కొద్దిమాటల్లో చెప్పటానికి
వీల్లేదు. నేనుకూడా నిర్వచన మియ్యటానికి ప్రయత్నించలేదు. నాకు
చాతయ్యేట్టుకూడా కనపడలేదు.* ప్రథమసమితిసభ్యులలో కొంత

---

* ఇంగ్లీషులోకూడా అట్లాగేవుంది. *"What in fact, do we mean by modern poetry? Do we mean the poetry written within the last five, ten or 15 years? Or do we mean all the poetry written since the war?..................and perhaps we ought to go even further back and make the first years of the century our dividing line."* *"A Key to modern English Poetry"* 1937.

మంది అప్పటికే సారస్వతసేవ చేసినవాళ్ళున్నారు. శివశంకర శాస్త్రిగారు రవీంద్రనాథఠాకూరుగారివి, యితరాలు బెంగాలీ మహారాష్ట్రాల్లోనుంచి పరివర్తనం చేసున్నాడు. పెద్దిభొట్ల పూర్ణశర్మ కొన్ని అపరాధ పరిశోధనవలలను వ్రాసి ఉన్నాడు. కోపల్లె శివకామేశ్వరరావు "సాహిత్యమీమాంస"ని వక చక్కని లక్షణ గ్రంథం తెనుగులో రచించాడు. ఇదిగాక యింకా రాశినట్టు వినికిడి. ఇతను సాహిత్య క్షేత్రంలో సృష్టి, విమర్శనాల్లో రెంటిలోనూ కృషి చేసిన మనిషి. కాకినాడ కాలేజీలో సంస్కృతాంధ్రోపాధ్యాయుడుగా ఉన్నాడు. సారస్వత జీవి. ఈ సాహితీ పత్రిక అందరికీ చాలా అందుబాటులో ఉండేది. సంవత్సర చందా రూపాయన్నర. 1920 సంవత్సరంలో ప్రారంభించినప్పటినించీ దాదాపు మూడుసంవత్సరాలు చక్కగా శివశంకరశాస్త్రిగారి నాయకత్వంకింద జరిగింది. తర్వాత ఆయనకు బరువైంది. కొంతకాలం బెజవాడనించీ కొడాలి ఆంజనేయులుగారి ఆధిపత్యంకింద వస్తూ వుండేది. ఈనకూడా సారస్వత సేవకుడు. తర్వాత యీనకుకూడా బరువైంది. పత్రికకు సంవత్సర చందా 3 రూపాయలకు పెరిగింది. వ్రాయసగాండ్ల సంఖ్యా పెరిగింది. కాని అసలు ద్రవ్యజ్యోతి ఆరడం సాగింది. "యావత్తైలంతావద్వ్యాఖ్యానం" అయింది. * అప్పుడీ సాహితీసమితి సభ్యులకు కొంచెం కష్ట మేశింది. పత్రిక అంతరించినా సమితి చాలా యిటీవల కాలందాకా వుంది. అదే యిప్పటి "నవ్యసాహిత్యపరిషత్తు" గా మారిందని నా ఆశయం. అప్పట్లో "శారద" నే పత్రిక 1921 సంవత్సరంలో బందరులో కవుతా శ్రీరామశాస్త్రిగారు సంపాదించటం మొదలు పెట్టారు. అందులో యీ సాధకులకు స్థాన మిచ్చాడు. ఇవిగాక బెజవాడనించి "గ్రంథాలయసర్వస్వ" మనే పత్రిక వకటి

* ఈ పత్రిక అంతరించటం చాలా విచారకరం. మళ్ళీ "ప్రతిభ" తత్స్థానం తీసుకున్నందుకు చాలా సంతోషం.

వున్నాయి. ఈ వుద్యమానికి మూలపురుషులు. శ్రీ వెంకటనరసింహాశాస్త్రి గారు, అయ్యంకి వెంకటరమణయ్యగార్లు. భారతదేశంలో యితర రాష్ట్రాల్లో గ్రంథాలయోద్యమం చూసి, బరోడాలో అది చేసే పనిని చూసి, ఆ విధమైన ఉద్యమం మన ఆంధ్రదేశంలో స్థాపించారు. విద్య విజ్ఞానాన్నిస్తుంది. అటువంటి విద్యను గరపేమార్గాలనేకం వుంటై. వాటిలో గ్రంథాలయస్థాపన యొకటి. వీటి స్థాపనమూలంగా దేశమంతా విద్యావ్యాప్తం చెయ్యాలని వీరి ఆశయం. చాలా శ్రమపడ్డారు. అనేకమైన పాతవాటి గ్రంథాలయాలను బలపర్చారు. నూతనవైనా స్థాపింపచేశారు. చాలా ప్రచారంచేసి దేశమంతా తిరిగి సభలు చేసి యీఉద్యమాన్ని చాలాబలంకలదాన్నిగా చేశారు. కేంద్రసంఘం వకటి, దానికి సంబంధించిన తాలూకా జిల్లా సంఘాలూ, యిట్లా వక సంఘ పరంపర లేచింది. ఆ కేంద్రసంఘం తరఫున "గ్రంథాలయ సర్వస్వ"మని వకమాసపత్రిక స్థాపించారు. తర్వాతదానికి లిమిటెడ్ పద్ధతిని "గ్రంథాలయ ముద్రాక్షరశాల" వకటి స్థాపించారు. అది మాత్రం పేరుతో యిప్పటికీవుంది. ఈ పత్రికకూడా యీ సాహిత్యానికి చేయూతయిచ్చింది. ఈ పత్రికకూడా కొంతకాలంరాలేదు. మళ్లీ యిప్పుడు వస్తున్నదట. * ఇక్కడ వకతమాషా విషయంచెప్పాలి. "సాహితి"కి దగ్గరే యీ "గ్రంథాలయసర్వస్వం" వచ్చింది. కాబట్టి కొందరి నవ్యసాహిత్యసాధకులు దానిలో తమకావ్యాలను ప్రకటిస్తూండేవారు. నండూరు సుబ్బారావుగారు తమ "యెంకిని" యీ పత్రికలో కీర్తించారు. క్రమంగా వాళ్ళకళ్ళగీతం కూడా యీ "యెంకి

* మళ్ళీ యీ గ్రంథాలయోద్యమ తరంగం కొంచెం పైకొస్తున్నట్టు కనబడుతూంది. అక్కడక్కడ గ్రంథాలయసభలు జరుగుతున్నై. అయ్యంకివారి వాణి అక్కడక్కడా అప్పుడప్పుడూ వినబడుతూనే వుంది. ఈ ఉద్యమం సాహిత్య విజ్ఞానవ్యాప్తులకు చాలా సహకారం. దేశనాయకులు రాజకీయంతోపాటు యీ ఉద్యమాన్ని చేపట్టి ప్రచారం చేస్తే చాలా బాగుండును. వెంకటరమణయ్యగారూ, శ్రీ. శే. నరసింహశాస్త్రిగారూ, ఆంధ్రదేశంయొక్క కృతజ్ఞతకు పాత్రులు.

పాటల" సంపుటైంది. తర్వాత సాహితిలోకూడా కొన్ని పడ్డై! రాయప్రోలు సుబ్బారావుగారుకూడా యీ "గ్రంథాలయసర్వస్వా"న్ని తమగీతాలతో పరామర్శించాడు. తర్వాత సాహితీపత్రిక వచ్చేటప్పటికి నిజంగా యీ ప్రథమసాధకులంతా గంతులేశి ఆ పత్రికను తమ వ్రాతలతో అలంకరించాలసింది! నండూరు సుబ్బారావుగారుకూడా చాలా ఆలస్యంగా ప్రారంభించాడు. సాహితీ ప్రథమసంపుటాన్ని అయినాతాక లేదు. సుబ్బారావుగారుగాని, మా అప్పారావుగాని, యింకా యితరులు అనగా రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ మొదలైన వాళ్లుగాని, యీ సాహితిని ప్రథమదినాల్లో ఆదరించినట్లు కనపడదు. కనపడదేమిటి వీళ్ళ రాతలు దానిలో లేవు. దీనికి కారణం చెప్ప లేము! వాళ్లు యీ సమితిలోకూడా సభ్యులైనట్లు తోచదు! కాని యీ సమితి వారందరికీ భావనాగురువులు వాళ్లేనని అప్పటికీ యిప్పటికీ చెప్పుకుంటున్నారు. అట్టిసందర్భంలో వాళ్ళెవళ్ళూ యీ సమితిలో చేరకపోవడమూ, యీ పత్రికలో రాయకపోవడమూ, చాలా ఆశ్చర్యకరం! రాయప్రోలు 1918 సంవత్సరంలోనే హైద్రాబాదువచ్చేశాడు. మా అప్పారావు 1916 దాకా చెన్నపట్నంలోనే విద్యార్థిగా వున్నాడు. బహుశః యీ సమితి సంగతి తెలియదేమో! పాటిబండ అప్పారావుకూడా చేరలేదు. ఐనా అంటే కొందరికి ప్రత్యయం కల్గి చేరలేదేమో! మొత్తంమీద యిది వక ఆశ్చర్యకరమైన విషయమే! తర్వాత కొన్ని సంవత్సరాలకు నండూరు సుబ్బారావుగారు మాత్రం సాహితిని తమ రాతలకు ప్రకటన స్థానంగా గ్రహించాడు.*

ఈ సమితీ పత్రికా కూడా, నవ్యసాహిత్యానికి చేసిన సేవ అపారం. శివశంకరశాస్త్రిగారుకూడా ప్రాచీనానికీ, నవీనానికీ, లంకె

* ఇంకా 1920 సంవత్సర ప్రాంతంలో "సారస్వత సర్వస్వ" మనీ, "కళ" అనీ మొదలైన లలితకళాసేవ చేయడానికి పుట్టిన పత్రిక లుండేవి.

అని చెప్పచ్చు. ప్రాచీనాన్ని తెంచుకుండా మన్నవాళ్ళను కూడకట్టుకుంటూ నవీనాన్ని ప్రోత్సహించి ఉభయులకూ సమ్మేళనస్థానమైనాడు. నిజమైన సారస్వత సేవకుడు! ఇప్పటికీ నవ్యసాహిత్యంలో ఆయనస్థానాన్నెవ్వరూ ఆక్రమించలేరు. ప్రవర్తక స్థానానికి ఆయన్నే ప్రతివాడూ యెన్నుకుంటాడు. ఇటీవల ఆయనకే వార్ధక్యమూ, విశ్రాంతి తీసుకోవాలనే యిచ్ఛా, జనించి కొంచెంకొంచెం సంగం తెంచుకున్నట్టు కనపడుతున్నది. కాని అట్లా చెయ్యటం న్యాయం కాదు. ఆయన చెయ్యలేడట్లా అని నా ఆశయం. యీ సాహితీపత్రిక దోహదమిచ్చిన సాహిత్యశాఖల్లో ముఖ్యమైనవి "ఖండకావ్యం, చిన్నకథ" పెద్ద నవలలూ, నాటకాలూ, "మాధవీకంకణం" "నూర్జహాన్" వంటి వున్నా బహుళంగా "ఖండకావ్యం, చిన్నకథ" మాత్రం చాలా ప్రచారానికి వచ్చినై. * వీటిని గూర్చి కొంచెం పరామర్శ చేదాం!

ఖండకావ్యం :

కావ్యలక్షణం అందరికీ తెలుసు. ఈ లక్షణం ప్రకారం మహాకావ్యం వేరు, ఖండకావ్యం వేరు అని చెప్పటానికి వీల్లేదు. అది ప్రపంచమంత విశాలం. కాబట్టి దాన్నిబట్టి, అనగా బిగువు లక్షణమైన "అదోషౌ సగుణౌసాలంకారౌ శబ్దార్థౌ కావ్యం" దగ్గిర్నించీ "రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యం" దాకా యీ ఖండకావ్యం కూడా తప్పక కావ్యంకిందికి వస్తుంది. ఇక విప్రతిపత్తేమిటి? మీరెందుకీ వివేచనం చెయ్యడం ? అని అడుగుతారేమో? మన పెద్దలందరూ,

* 1928—29 సంవత్సరంనాటికూడా యింతేనని "జయంతి" లో విశ్వనాథ అంటున్నాడు.

"ఈకాలంలో పత్రికలసంపద, ఖండకావ్యాలూ, చిన్నికథలూ, నవలలూ, నాటకాలూ, విమర్శనాలూ, అన్నిని. అగ్రస్థానం కథకూ, ఖండకావ్యానికీ చిత్రాలకూ!"

"ఇప్పటి నవ్యసాహిత్య ప్రధానాంగములైన ఖండకావ్యం కథానిక, ఏకాంక నాటిక, అనేవి పూర్వం సాహిత్యశాస్త్రంలో చెప్పబడినవె" అన్నాడు ఇంద్రగంటి.

కొన్నివృత్తాలుగల కొన్నిశ్లోకాలు, అటువంటి కొన్నిశ్లోకాలుగల కొన్నిసర్గలూ, వకపూర్ణమైన కథ, అనుగుణమైన అష్టాదశవర్ణనలూ, అలంకారయుక్తమైన యితరవర్ణనలూ గలదే కావ్యమనే వక అపో హాలో వుండటంచేత నే నుల్లేఖించాలకొచ్చింది. ఇట్లా అనుకోక యిప్పుడు రాయబడేవాటినికూడా "రమణీయార్థసహితా" మాటచేత కావ్యాలకింద చేరిస్తే నాకు చాలాసంతోషం! నా శ్రమ చాలా తగ్గు తుంది! కాని వక్క విషయముంది. వెనకటికావ్యాలనుకునే రఘువంశ కుమారసంభవాదులకూ, యిప్పుడు రాయబడేవాటికీ కొన్ని విష యాల్లో భేదంమాత్రముంది. ఆభేదం చెప్పి వీటిపార్థక్యం చూపదల్చాను.

1. పరిమితి :

వెనకకావ్యాలు రఘువంశాదులు సంస్కృతంలోనూ, మనుచరి త్రాదులు తెనుగులోనూ, కొన్నివందల పద్యాలతో నిండివుండేవి. కొన్ని ఆశ్వాసాలకింద విభజించబడి వుండేవి. ఖండకావ్యాలనే పేరు వల్లనే వీటిపరిమితి వాటికంటె తక్కువనీ ఎన్నిపద్యాలుండవనీ తెలుస్తు న్నది. ఎంత? అనే ప్రశ్నకు యింత అని ప్రత్యుత్తరం యివ్వడం కష్టం! కాని వక్కటి చెప్పచ్చు. సంస్కృతాంధ్రాలల్లో కావ్యాలనే శబ్దంతో యేవి వ్యవహరింపబడుతున్నవో వాటి కన్నిటికంటెను చిన్నవి అని మాత్రం చెప్పచ్చు. ఒక్కొకప్పు డొక్కపద్యమే వుం డచ్చు. లేక కొన్ని పదులుండచ్చు. కాబట్టి వెనకటివాటికంటె పరి మితి తక్కువ. సంస్కృతంలో మేఘసందేశ మనే వక కాళిదాస కావ్యముంది. దానిలో రెండుసర్గ లున్నై. దాదాపు 150 శ్లోకా లున్నై. దాన్ని ఖండకావ్య మంటున్నారు పెద్దలు.* కాబట్టి పరి మితినిగురించి యింత అని చెప్పడానికి వీల్లేదు.

* "కథలకేం ఖండకావ్యాలకేం పాశ్చాత్యుల వరవడి" అన్నాడు విశ్వనాథ "జయంతి"లో.

ఇంద్రకంటివారి వ్యాసం, డిసెంబరు 1939 భారతి.

వికారం, "భావ" మనవచ్చు కొందరంటారు.* ఈ సన్నివేశం కవి చూడనే అవసరం లేదు. తలవవచ్చు. వినవచ్చు. ఒక వార్త విన్నారనండి! వెంటనే కవిహృదయమైనవాడికి మనస్సులో ఒక విశేషమైన మార్పు కలుగుతుంది. ఇక్కడ మనస్సు, బుద్ధి, చిత్తము అనే పదాలకు ప్రత్యేకత నేను పాటించటంలేదు. వాటినిమూటిని దాదాపు సమానార్థకాలుగా ఉపయోగిస్తున్నాను. ఒక గానం విన్నప్పుడుగాని, ఒక వార్త విన్నప్పుడుగాని, ఒక సన్నివేశం చూచినప్పుడుగాని, ఒక పదార్థం తిన్నప్పుడుగాని, ఒక వ్యక్తిని కలిసినప్పుడుగాని, ఒక దృశ్యం కంటపడ్డప్పుడుగాని, చిత్తంలో ఒకవిశేషమైన వికారం కలుగుతుంది. అది వాగ్రూపం పొందేటప్పటికి యీ ఖండకావ్యంగా పరిణమిస్తుంది. ఇందులోవున్న రహస్యమిది!

## 4. కవి స్వానుభవము :

వెనకటి కావ్యాల్లో కవిపరోక్షుడుగాని ప్రత్యక్షుడు కాడు. వాట్లో కథకు ప్రాధాన్యం కాబట్టి ఆయా సన్నివేశాల్లో కవిచెప్పే భావాలూ అనుభవాలూ నాయికానాయకులవేగాని కవివి గావు. ఇక్కడ [illegible] కాబట్టి చెప్పేభావాలూ చిత్తవృత్తులూ పాత్రల కాపాదింపజేసినప్పటికీ అవి కవియొక్క స్వానుభవాలే! ఎక్కడైనా యిక అర్థాంతరన్యాసాలంకారాలుంటే వాటిని కవి అనుభవాలకింద తీసుకోవాలె పాతకావ్యాల్లో. కాని యీ అర్థాంతరన్యాసాలన్నీ దాదాపు లోకోక్తుల్లో, లేక సర్వజనవిదితాల్లో, నిత్యసత్యాల్లో, అయివుంటాయి. ఇవి కవిస్వానుభవాలని యెట్లాఅంటాము! వెనకటివాళ్ళ "బుద్ధిజాడ్యజనితోన్మనుల్ కదా శ్రోత్రియుల్" అనే మొదలైనవన్నీ యిటువంటివే! కాని యీ కావ్యాల్లో అట్లాకాదు. కవిసన్నివేశాలనుబట్టి తాననుభవించే తత్త్వోపదేశాలు! ఈ కిందిఉదాహరణం చూడండి :—

---

* దీన్నే "mood" అని కొందరంటారు.

“[illegible] కళ్యాణమైన దాంపత్యభక్తి
శృంగారమోహనమైన వాత్సల్యసక్తి
సాక్షిమాత్ర సుందరమైన సఖ్యరక్తి
అంతకన్న మిన్నమగు ప్రేమయందె ముక్తి”

ఇక్కడ ఈ కవి దాంపత్యభక్తి, మాతాపుత్ర, స్నిగ్ధులమధ్య ఉండే మూడురకాల ప్రేమనుగ్రహించి, వాటికన్నిటికీ మూలసూత్రమైన ప్రేమను గూర్చి చెప్పి వరుసలో తారతమ్యచర్చ చేసినాడు. ఇట్టివే కవి స్వానుభవాలనేవి! ఇట్లానే “ప్రేమనలయించు సృష్టిదైవికము కాదు” “ఏ మోగమందమృతమున్, విషమున్, సమవృత్తులేసుమీ” మొదలైనవికూడా యిట్టివే! * సంస్కృతంలో యిటువంటివి యెక్కడైనా కాళిదాసులో కనపడతాయి. అంతేగాని సామాన్యాలు కావు! ఇటువంటివి మనవాట్లోకూడా లేవా? చాటుపద్యాలు అటువంటివి కావా? అవచ్చు! కాని చాటుపద్యాలలో మిగిలిన “పరిమితి” మొదలైన లక్షణాలున్నా అవి అర్థప్రధానాలూ, హాస్యరస ప్రధానాలూ, అంతేగాని తత్వాన్వేషణాది లక్షణాలు వాట్లో లేవు! భావప్రధానాలు అనడంలోనే వీటికీవాటికీ భేదం తెలుస్తున్నది. తిరుపతి వెంకటేశ్వరుల “నానారాజసందర్శన” మున్దనుకోండి. అదీకూడా అర్థప్రధానమే! ప్రాసంగికమే! కాని అందులోనూ యెట్టితత్వాన్వేషణమూ భావగాంభీర్యం లేవు!

* ఈ క్రింది యెంకిపాట అందరెరిగినదె!

యెలకజల్మములోన యెవరమోనంటి
సిగ్గొచ్చినవ్వింది సిలకనాయెంకి!
ముందు మనకే జన్మముందోలెయంటి
తెల్లపోయింది పిల్లనాయెంకి!
న్నాళ్ళు మనకోలె యీసుకములంటి
తడిబెట్టింది జంటనాయెంకి!

ఇది తత్వకథనానికీ, భావ ప్రాధాన్యానికీ, పరాకోటి అనడంలో తప్పేంలేదు! [illegible] వుట, కంటకషి” వీటిలో కవితత్వం యిమిడుంది!

### 5. ప్రకృతిచిత్రాలు :

ఈ నవ్యకవిత్వంలో వ్రాసే ప్రకృతివర్ణనలకూ పాతకవితావాటిలో వర్ణనవాటికీ చాలా భేదం చెప్పారు. ఈ ప్రకృతిచిత్రాలు స్వాభావికంగా రమణీయంగా ప్రశాంతమేగాకుండా కొంత అంతరార్థమూ. దాన్ని విప్పి కవిచెప్పడమూ, కలుగుతుంది వీటిలో. అట్లాచెప్పడం అలంకారంకింద కొచ్చేస్తున్నది.

### 6. ప్రణయకీర్తనం :

మన పూర్వకావ్యాల్లో ప్రేమకూ, రతికీ, ప్రణయానికీ పెట్టి భేదంలేదు. "రతి"లో, అంటే యిటు "సంభోగం"లోనో "విప్రలంభం"లోనో పర్యవసించే ప్రేమతప్ప మిగిలినప్రేమ కంత ప్రాముఖ్యంలేదు. రసాల్లో "శృంగారా"నికిచ్చిన ప్రాముఖ్య మితరాలకు లేదు. ఉండాలసిందే. కాని నవ్యులదృక్పథం వేరు. పైరెంటిలో "విప్రలంభం" రమణీయం. కొందరికి అంతకంటె "సఖ్యం" రమణీయతమం. జీవితానికి పరమావధి! అది స్వార్థరహితమైన అమలినశృంగారం! సౌందర్యార్చనమే గాని సౌందర్యానుభవంలేదు వీళ్ళకు! ఇదిచాలా గొప్పభేదం. విప్రలంభంకంటె మోహపునికరమై పోయిందో శృంగారంచూచారా? శృంగారమంటే సౌందర్యమువీరికి! కాని రతిగా పరిణమించే చిత్తవికారంకాదు! ఇట్లా కొందరు. చాలామంది స్త్రీకి మనకటివాళ్ళవలె గాక చాలా గొప్ప స్థానమిచ్చారు. శృంగారంగా పరిణమించేదిగాక స్త్రీ పురుషులమధ్య ఉండే ప్రణయం వీళ్ళకు ముఖ్యం.

### 7. గూఢత :

దీనిసంగతి తర్వాత విపులంగా చెబుతాను. ప్రస్తుతం దీన్ని "అన్యాపదేశం"గా భావించుదాం. అంటే కవి పరభావం హృదయంలో వుంచుకుని దాన్ని వేరేవిధంగా చెప్పడం.

8. మనస్తత్త్వం :

ఇదికూడా వకటి దానిలక్షణాల్లో అంటారు. ఈ విషయం "సర్రియలిజంలో" చెబుతాను.

ఇంతమాత్రం కోటిప్రాశస్త్యం మనవిచేశాను. ఇంకా వివేచన కాని సూక్ష్మవిషయాలుంటవి! కాబట్టి యిట్టి ఖండకావ్యానికి ప్రాధాన్యమిచ్చిందీ సాహితీపత్రిక. ఈ మార్గంలో సాధకులు అనేక ప్రత్యేక పద్ధతుల ననుసరించారు. వాటిలో ముఖ్యమైనవాటిని వచ్చే అధ్యాయంలో తెలుసుకుందాం.

చిన్నకథ "కథానిక" :

ప్రతిభపత్రికలో నవ్యసాహిత్య ప్రవర్తకుల్లో వకరైన ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు "కథానిక"ను గూర్చి వక వ్యాసం రాశారు. ఈ విభాగంలో విషయాలన్నీ అందులోనించీ గ్రహించాను. నేను వారికి చాలాకృతజ్ఞుణ్ణి! మొదట వారు నామనిర్వచనంలో "కథానిక"ని నిర్ణయించారు. ఇది యితర సారస్వతాల్లోనించీ మనం గ్రహించింది కాదనీ, మన పూర్వసాహిత్యంలోదనీ, లక్షణాలు సంపూర్తిగా నిర్వచింపబడ్డాయనీ, అగ్నిపురాణంలో కథావిభాగం యీవిధంగావుందనీ, చెప్పి యీ కింది శ్లోకాన్ననువదించారు.

"ఆఖ్యాయికా, కథా, ఖండకథా, పరికథాతథా
కథానికేతిమన్యంతే, గద్యకావ్యంచపంచధా."

గద్యకావ్యం అయిదు విధాలు. (1) ఆఖ్యాయిక (2) కథ (3) ఖండకథ (4) పరికథ (5) కథానిక. వీటిలో మనకు కావలసింది "కథానిక". ఈ కిందిభాగం అనువదిస్తాను.

శ్లో॥ భయానకంసుఖపరం గర్భేచకరుణోరసః,
అద్భుతోంతే సుక్లృప్తార్థా నోదాత్తాసాకథానికా.

కథానికబాహ్యలక్షణాలు రెండు: (1) కథ సుమారంగా సాగి పోక పొందికగానుండాలి. (2) వివరణలు, వర్ణనలతోనూ కథా శరీరం బిగిసిపోగూడదు.

అభ్యంతరలక్షణాలు మూడు: (1) కథకసుఖానుసంధాన ఆశ్చ ర్యాన్లోముంచే విచిత్రసంఘటన ఉండాలి. (2) కథాంత్యంలో హృదయం కదిలించే సన్నివేశం కావాలి. (3) పాఠకులు అనుకోని కొత్తమలుపులతో కథ సమాప్తంగా ముగిసిపోవాలి. ఇది కథానికా లక్షణం.

మహాకావ్యానికి చెప్పబడిన అష్టాదశవర్ణనలలో కొన్ని ఉన్నా ప్రబంధత్వానికి క్షతి రాదట్లు, దీనిలో బాహ్యలక్షణాలు తప్పకుండా ఉంటూ, అభ్యంతర లక్షణాల్లో యేవకటైనా లోపించవచ్చు. అయితే అద్భుతనిర్వహణంమాత్రం విడిచిపెడితే "కథానిక" రక్తికట్టడం చాలాకష్టం.

చూశారా మనపూర్వులు యెంతచక్కగా నిర్వచించారో! ఈ లక్షణాలే యితర "భారతీయుల చిన్నకథలలోనూ, పాశ్చాత్యుల short stories లోనూ, బహుళంగా కనిపిస్తున్నవి." "అగ్నిపురాణము నకు పూర్వం దండ్యాచార్యులు, ఆఖ్యాయిక, ఆఖ్యానము, కథ అనే విభాగాలే చెప్పినట్టు సాహిత్యదర్పణంలో విశ్వనాథ కవిరాజుచెప్పి, తానుకూడా వాటినేనిర్వచించి చాలా సూక్ష్మంగా ఆభాగంవదిలే శారు." "శివశంకరశాస్త్రిగారు 'ఏకాదశి' పీఠికలో మనకు కథ, కథానకము, ఆఖ్యానకము, ఆఖ్యాయిక అనే గద్యవిభాగాలున్నట్టు రాశారు. అయితే వాటిని శాస్త్రిగారు నిర్వచింపలేదు. "పాశ్చాత్య కథకులు "గోర్కీ" "చకోవ్" "గాల్స్‌వర్దీ" "వెల్స్" మొదలైనవారి కథల్లో చాలావరకూ యీలక్షణాలు కనుపిస్తాయి". ఇంద్రకంటి వారు నాపనిని చాలా తేలికచేశారు. వందనాలు! ఇక వారి ఆజ్ఞ ప్రకారం దీన్ని "కథానిక" అనేపేరుతో వ్యవహరిద్దాం. ఈ కథానికకు సాహితీపత్రిక చాలాదోహద మిచ్చింది. ఈ కథానికకు వెనక విక్ర

మాటి-రాత్రి, హిందూదేశంలో పోలికలవుపిస్తాయనీ, పూర్వం ఈ-పద్ధతికీ, ఆకి కాలగర్భంలో లీనమైపోయినయ్యనీ కూడా చెప్పారు. మొత్తంమీద యీ ఖండకావ్యానికీ, కథానికకూ పుట్టు కొమ్మలైనై యీ గాథికాసమితి, పత్రికాను.

* ప్రసంగవశాంచేత రెండువిషయాల నిక్కడ ముచ్చటిస్తాను. (1) పాటలు (2) పదాలు ♦ వీటి నిర్వచనం, భేదం, చెప్పటం చాలా కష్టం. పాటలు చిన్నవి. పదాలు పెద్దవి అని అంటారు. అంటే పొడుగాటి పాటలుండకూడదని కాదు. వుండవచ్చు. వున్నైకూడాను. సామాన్యంగా పదాలుకూడా చిన్నవిగా వుండవచ్చు. క్షేత్రయ్య పదాలు చూడండి! 3 చరణా లుంటై సామాన్యంగా. పాటలకు తుదిపాదంలో కవిపే రుంటుంది. పదాల్లో వుండదంటారు. క్షేత్రయ్య వాసుదేవపదాల్లో తప్పక తుదిపాదంలో పే రుంటుంది. కాబట్టి యీ అవ్యాప్తి, అతివ్యాప్తి యెందుకూ? రెండూ సమానార్థకాలని చెప్పడం సమంజసంగా కనపడుతుంది. ఇవికూడా వకప్పుడు భావప్రధానంగానూ, రసవంతంగా వుంటాయి. కాని అవన్నీ జానపదాలుకావడం, వాటిలో కొన్నిటికి కవియెవరో మొదలైనవిషయాలు తెలియకపోవడం, ప్రాంతీయాలుకావడం, అంగాంగభావసంపూర్ణమైన కావ్యత్వం లేకపోవడం, "కథాసాభాగ్యం" కొరవడడం, సహజంగావుండడం, వీరమో కరుణో ముఖ్యరసంగా వుండడం, కథ కెక్కువ ప్రాముఖ్యముండడం, మొదలైనసంగతులు చూస్తే వాటికీ- వకక మనంచెప్పిన ఖండకావ్యాలకూ చాలాభేదముంది. వాటిని యీ తరగతిలో చేర్చడానికి వీల్లేదు. కాని వక్కటిమాత్రం జరిగింది. ఈ ఖండకావ్యాలు తలెత్తినతర్వాత యీ విధమైన జానపదకావ్యాలకు చాలా

* "సంగీతమాల" (ఆంధ్రపత్రిక 29—9—40)

♦ ఇంగ్లీషులో వీటిని "బాలడ్సు" (Ballads)లో చేర్చారు. మనవాళ్ళు కొందరు "జానపదవాఙ్మయం" అని. మరికొందరు "ప్రజారంజకాంధ్రసారస్వత" మని వ్యవహరిస్తూవుంటారు.

ప్రచారం హెచ్చింది. *శ్రీఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు యింగ్లాండునించీ వచ్చిన మొదటదినాల్లో రాజమండ్రి ట్రైనింగు కళాశాలలో ప్రొఫెసరుగా వుండేవారు. చరిత్రచెబుతూ వుండేవారు. ఆయన చాలా దేశభక్తుడూ, భావోన్మాది! గీతగోవిందగీతాలు వినాలంటే ఆయననోటనే వినాలె! నిద్రహారాలులేకుండా విన్నాను! ఆ సుఖమిప్పుడు తల్చుకుంటే సుఖంగావుంటుంది! ఆయన్నుగూర్చి తర్వాత మళ్లి ముచ్చటిద్దాం. అక్కడ వుండేటప్పుడాయన యల్. టి. చదివే విద్యార్థులకు వకదినం చరిత్రనుగూర్చి చెబుతూ, బొబ్బిలి పాట పాడించి వినిపించాడు. వాళ్లు చాలా సంతోషించి ఉత్సాహం చూపారు. ప్రిన్సిపాలు యిదేమిటంటే యిదే "నిజమైనచరిత్ర" అని సమాధానంచెప్పాడు. ఈ వీరగాథలు వింటూంటే చాలా మనస్సుకు ఉత్సాహంగావుంటుంది. వాటిని సారస్వతదృష్టితో చదవక, సహజ ధోరణిలో, వాయిద్యంతో, నాట్యంతో, పాడుతూండగా వింటూంటే చాలా హృదయోత్సాహకరంగా వుంటుంది. వీటికి యీ కాలంలో అనగా నవ్యసాహిత్య సృష్టికాలంలో చాలా ప్రాముఖ్యం వచ్చింది. ఇప్పుడు వీటినన్నిటిని సేకరించి అచ్చేయ్యాలని చాలా శ్రమపడుతున్నారు పెద్దలు. ♦ ఇవి ప్రాంతీయాలవడంచేత చాలా శ్రమపడాలె

* లక్ష్మీరంజనంగారిట్లా అన్నారు.

"ఒక విలక్షణమైన కవిత్వచైతన్యం, శ్రోతలకు యేదో వకవిధమైన అవ్యాజానురాగం కలిగించే శక్తి, నాగరికకవిత్వంలో దొరకని వక నిర్మలానందం, అకృత్రిమ భావం, వీటితో నిండిన జానపదగీతాలను తెనుగువాఙ్మయంలో వక శాఖగా అంగీకరించి తీరాలి. అజ్ఞాతకవిలుల కౌశల్యం లోకం మరచిపోకుండా, తెనుగువా రంత వీటిలో లోకం తెలుసుకునేటట్టు చెయ్యాలె. వీర గీతాలు వ్రాసిపోయిన అజ్ఞాతకవులకు ఆంధ్రజాతి యెంతయు ఋణపడి వుంది" ఈ వాక్యాలతో నేను యేకీభవిస్తున్నాను.

♦ దేవేంద్ర సత్యార్థిగారనే ఆయన వీటిని సేకరించటానికి చాలా శ్రమపడుతున్నాడు. శేషమర్ల కామేశ్వరరావుగారు యీనకి చాలా సహాయంచేశాడు. పాతపాటలని కామేశ్వరరావుగారు కొన్ని సంపుటాలుకూడా ప్రచురించాడు. ఈనకు ఆంధ్రలోకం చాలా కృతజ్ఞం.

స్థితి చేకూర్చడానికి. ఈ విధంగా యీ నవ్యసాహిత్యానికి చాలా ప్రోత్సాహమిచ్చింది సాహితీపత్రిక. ఈ మార్గంతర్వాత "శారద"లో, ఇటీవల భారతివచ్చింతర్వాత "భారతి"లో సాధకులింకా సాధనచేస్తూనే వున్నారు. పరిషన్మార్గంలో ప్రథమసాధకులలో కీర్తిశేషులైన వారిసంగతి చెప్పాను. మిగిలినవారిలో కోపల్లె శివకామేశ్వరరావు సభాపతులను వక్కా బాబుకొన్నగారినీ వదిలి తక్కినవాళ్లనుగూర్చి పరిచయం చేస్తాను. వీళ్లలో కొందరిని అనగా, నోరి నరిసింహశాస్త్రి, దేవుల పల్లి కృష్ణశాస్త్రి, చింతా దీక్షితులుగార్లను ఆంధ్రలోకం బాగా యెరుగును. కృష్ణశాస్త్రిగారు ముఖ్యంగా కావ్యసాధకుడు, మంచివక్త. అక్కడక్కడా సంచారంలో ఆంధ్రసారస్వతాన్నిగూర్చి ఉపన్యాసాలుకూడా యిస్తున్నారు. నరసింహశాస్త్రి దీక్షితులుగార్లు వివిధసారస్వతవీధి సంచారంచేసి కొన్నింటిలో సిద్ధహస్తు లనిపించుకున్నారు. ఇట్టివారు సాహిత్యసమితి ప్రథమసభ్యులు.

ఆ కాలంనుంచీ కథలురాస్తూన్న గుడిపాటి వెంకటచలంగారు జగత్ప్రసిద్ధులు. వారినెరగని యువతీయువకు లుండరు. ఆయన రాయని సాహిత్యపత్రిక లేదు. ఏకవిధమైన (sex) కథలు రాయడంలో ఆయనను మించినవాడాంధ్రుల్లో లేడు. ఆనకథల్లో యెంత చంచలంగా కనపడతాడో మనిషి అంత ప్రహ్లాదుడల్లే కనపడతాడు. చిన్నతనంనించీ అల్లారుముద్దుగా పెరిగినవాడు. మాతామహుడికి దత్తుపోయినాడు. ఆనమాతామహుడు దివాన్‌బహద్దూరు గుడిపాటి వెంకట్రామయ్యగారని గొప్ప [illegible]ఉద్యోగంచేసి బాగాఆర్జించి పింఛనుతీసుకొని తెనాలినివాసంగా యేర్పరచుకున్నాడు. కాబట్టి వెంకటచలంగారు చాలా సంపన్నుడు. వీరి అసలింటిపేరు కొమ్మూరివారు. కొమ్మూరి వెంకట్రామయ్యగారు వెంకటచలంగారి సోదరుడే! ఈ చలంగారు నాయుడుగారి శిష్యుడు. కాకినాడలో యింటరుపాసై పట్నంలో బి. ఏ. చదివి పాసైనాడు. చిత్రాపూరి అన్నపూర్ణమ్మగారూ, సి. కృష్ణయ్యగారనే ఆయనా, వీరు

ముగ్గురూ స్నేహితులు. ఆత్మారాంగారు రాజమండ్రీలో న్యాయవాదిగా ఉన్నారు. కృష్ణయ్యగారు మద్రాసునగర-ఉద్యోగంలో విద్యాశాఖలో వున్నారు. వీరికి మొదటినించీ బ్రహ్మసమాజ భావాలుండీ స్త్రీస్వాతంత్ర్యం మొదలైనవాట్లో అభినివేశముండేది. పట్నంలో థీయిస్టిక్ మొరావిక్ సొసైటీ అని వుంటుండేది. దానికి వైకుంఠ రావుగారని వకాయన కార్యదర్శిగా వుండేవారు. ఇక్కడను సంఘంలో "సింధుఅబ్జర్వరు" అనే పత్రికాధిపతి గోలాబాజా పుష్పయ్యగారూ ఆయన భార్యా యింకా కొందరికీ సంఘసభ్యులుగా బ్రహ్మసమాజంలో సాధకులుగా వుండేవాళ్లు. కాబట్టి అప్పటికింకా బ్రహ్మసమాజ ప్రచారం జరుగుతూ వుండేది. చలంగారు తర్వాత సర్కారు విద్యాశాఖలో ఉద్యోగి బహుకుటుంబీకులైనారు. ఆయన రాతల్లో ప్రతిబింబిస్తూఉండేది ఆయన చంచలత్వమూ అని అనుమానంగా ఉంటుంది. ఒకొక్క-కొక్క-వ్యక్తిని ఉన్నదున్నట్టు రాయడం జుగుప్సాకరంగా వుంటుంది. లోకంలో వున్న రోగ్లు బయటపెయ్యడం మంచిపనే! కాని అది సర్వజనసమ్మతంగానూ, జుగుప్సాకరం కాకుండానూ, యువకులకు ప్రోత్సాహాకరం కాకుండానూ, చెయ్యడానికి వీల్లేకపోతే! జుగుప్సే పశ్చాత్తాపానికి మూలం కావచ్చు! కాని సాహిత్యమనేదానికి యవనిక వకటి అవసరం. అదిలేకపోతే సంసారమనిపించుకుంటుందిగాని సాహిత్యమనిపించుకోదు. అనుకరణం కాకపోతుంది. అనుకరణం కాకపోయ్యేటప్పటికి దానిలో రసంపోతుంది. కళాత్వం కొరవడుతుంది. * కొమ్మూర్మరి హనుమంతరావుగారు అప్పట్లో లక్ష్మీపుత్రుడు, లక్షాధికారి, సారస్వతసేవకుడు. కాని యీ మార్గాన్ని తర్వాత వదలినట్టు కనపడుతుంది. మునిమాణిక్యం సాహితీసంచికల్లో "ఉష్ణ" మొదలైన కథలు రాశాడు. "కాంతం" తలెత్తుతున్నది. వీరరాఘవ

* ఇటీవల కవిత్వం అనుకరణం కాదనీ యథార్థకథనమేననీ వక వాదం లేచింది. ఇది నర్రియలిజంలో వక మెట్టు.

స్వామిగారు చాలా నిష్ఠమనిషి. జీవితమంతా సారస్వతసేవలో గడి పారు. సంస్కృతములోనివి, నవలల అనువాదాలు చాలారచించారు. “శాకుంతల” మొదలైనవి వీరు తెచ్చినవే. * తెనాలి సంస్కృతకళా శాలకు కొన్నిసంవత్సరాలు అధ్యక్షులుగావున్నారు. ఆంధ్రవిశ్వవిద్యా లయసెనేట్‌లో కొంతకాలం సభ్యులుగావున్నారు. మంచిరసికుడు పండి తుడు. సాహితీసమితి సభ్యుల్లో సమితినిగూర్చిగాని, సభ్యులనుగూర్చి గాని తెలుసుకోవాలంటే సభాపతిగారే “స్వామిగారిని కనుక్కోండి” అంటారు. సమగ్రసాహిత్యమంటే యీయనకు ప్రాణవాయువు. ఈనయిల్లు కొన్నిసమయాల్లో సమితికార్యాలయం అయింది. పరమేశ్వరుడు తినడానికి యితరులను పెట్టడానికి కలగచేశాడు. స్వయంగా అనుభవిస్తూ యితరులకుయిస్తూ యింకా సారస్వతసేవచేస్తూనే వున్నారు. కాని కనపడి చప్పుడుచేసేవ్యక్తిగాదు. మంచి ఉదార హృదయుడు. ఈ విధంగా యీ విషయాన్ని సరిపుచ్చి మరోవిషయా నికి పోతాను.

## నాటకకంపెనీలు:

♦ నాటకరచన వక సారస్వతభాగం. అట్లాగే దాన్ని వెంబ డించే నాటకప్రదర్శనాలూ, మంచి నాటకాలు గనక మంచి నట

* “వ్యాకరణబోధిని” అని వక వ్యాకరణ పాఠ్యపుస్తకం సంపాదించాడు.

♦ “తాళ్ళూరి నరసింగరావుపంతులుగారు ఆంధ్రదేశంలో నాటకం తలచూపినప్పటి నించీ వాటికి తన సేవ నిచ్చాడు. ఈనకు “ఆంధ్రనటప్రపితామహుల” ని బిరుదును కూడా మనవారు ప్రసాదించారు. వీరిని “దాదాజీ” అని పిలుస్తారు. ఈన వేదం వెంకటరాయశాస్త్రిగారి మన్నన పొందాడు. వీరిదికూడా మొదట బళ్ళారిపురమే! తరువాత రాజమహేంద్రవర మైంది. దాదాపు 60 సంవత్సరాలకు పూర్వంనించీ యీన అభినయించాడు. మొదట కర్ణాటనాటకంలో పాత్రధారణం చేశాడు. మొదట వీధినాటకాల్లో వేషంకూడా వేసేవారు. తర్వాతతర్వాత ధార్వాడకంపెనీఘక్కాన హిందీ నాటకాల్లోనూ, తర్వాత తెనుగునాటకాల్లోనూ పాల్గొన్నాడు. ఈన యీమని లక్ష్మణ

కులచేత ప్రదర్శింపబడితే తప్పక సమగ్ర ప్రజలకు ఉద్బోధకాలై నాట్యను లలితకళాప్రియులుగా చేస్తై. "నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనం" అన్నాడు కాళిదాసు. ఈ విధమైన దృశ్యకావ్యగ్రంథరచన మొదట్లో వేడిగా సాగుతుందో అప్పుడే యీ ప్రదర్శనాలుకూడా వెలిశాయి. ఈ కాలంలో అలాగే అయింది. వెనకటి తరంలోకూడా కంపెనీ లుండేవి. 1902 సంవత్సరంలో నేను చదువుకునే కొల్లూరనే గ్రామంలో విజయనగరంనించో రాజమండ్రినించో ఒక కంపెనీ వచ్చింది. అది నా చిన్నతనం మవటంచేత అంత జ్ఞాపకం లేదు. అందులో అంబడిపూడి కోటయ్య, జగ్గరాజుగార్లు ముఖ్యపాత్రధారణం చేశారు. జగ్గరాజుగారి స్త్రీపాత్రధారణం అత్యద్భుతం. పాతివ్రత్యం చూపవలసిన పాత్రలను అభినయించటంలో ఆయనకుసాటి ఆంధ్రదేశంలో లేరు. ఆయన నడక, మాట, హస్తము, ముఖవిన్యాసం, శిరఃకుంచనం మొదలైనవి నా హృదయంలో యిప్పటికీ అచ్చు గుద్దినట్లున్నై! చంద్రకాంత, హరిశ్చంద్ర, చిత్రనళీయం మొదలైన నాటకాలలో ఆయన స్త్రీపాత్రధారణం అప్రతిమానం. ఇటీవలనే ఆయన దివంగతు డైనాడు. రాజమహేంద్రవరంలో గున్నే

---

స్వామిగారికి సమకాలికుడు. ఆయనంత ప్రజ్ఞ 'హిందీనాటకప్రదర్శనం' లో కల వాడు. ఆయనతోకూడా 'శివాజీ' 'రణపుత్ర విజయం' 'విజయనగర వినాశం' 'పీష్వా నారాయణరావు' 'విశ్వామిత్ర తపోభంగం' మొదలైనవాట్లో పాల్గొన్నాడు. ఈన దాదాపు ఆంధ్రదేశంలో అన్ని ప్రాంతాలు తిరిగి నాటకకంపెనీలను స్థాపించటంలో శ్రద్ధ తీసుకున్నాడు. బళ్ళారి కృష్ణమాచార్యులుగారినికూడా నాటక రచనకు ప్రోత్సహించిం దీనే నని చెబుతారు. ఇమ్మానేని హనుమంతరావునాయుడు గారు, టంగుటూరి ప్రకాశంగారు, హరి ప్రసాదరావుగారు మొదలైనవారు వీరివద్ద నేర్చుకొనిరి. వీర రౌద్రరసప్రదర్శనంలో ఈయన అసమానుడు."

(భారతి. ప్రమోదూతాషాఢం.)

భావరాజు కృష్ణరావు.

కోల్పోగలనా ?" అన్నారు నాయన. మరి ఆయన తర్వాత ఎంతమంది ప్రయత్నించినా నటించి—, ఆయన ప్రతిభా, నిర్వాహణమూ, రాలేదు. ధన్యజీవి !

హరిప్రసాదరావుగారు మొన్న మొన్నటివరకూ జీవించి కీర్తిశేషులైనారు. హరిశ్చంద్రపాత్ర యీయన ధరించి నటిస్తుంటే "అపిగ్రావా రోదిత్యపి దళతి వజ్రస్య హృదయం" అనాలనిపించేది. ఎంత గుండెధైర్యమున్నవాళ్ళకైనా యేడవాలసిందే! నలుడు, సారంగధరుడు, హరిశ్చంద్రుడు, యీయన అభిమానపాత్రలు. బహుస్వల్పాంశాలు అనగా, నిలుచోడం, చెయ్యిని కదల్పడం, అడుగువెయ్యడం మొదలైన వాటినించీకూడా యే సన్నివేశంలో యెట్లా చెయ్యాలో అక్కడి సందర్భాన్నిబట్టి సమంజసమైన పద్ధతి ననుసరించి నటించేవారు. వీటిలో ప్రతిదశా భేదముండేది. కళాభిజ్ఞుడికి వీటిలో మార్పు తెలుస్తూవుంటుంది. ఇక్కడే పెద్ద రహస్యముంది. కొందరు తమ పాత్రను బాగా చదివి ఆలోచించి యెప్పుడెట్లా అభినయించాలో యేర్పాటుచేసుకుని పెట్టుకుని వాటిప్రకారం అభినయిస్తూవుంటారు. ఎప్పుడుచూసినా ఆసన్నివేశంలో అదే అభినయం! సినిమా చిత్రం కిందికి దిగుతుంది! "Once more" అని ప్రేక్షకులు కేకవేస్తే తెలుస్తుంది వీరి తెలివి. అటువంటిదానిలో జీవం ఉండదు! నిర్జీవం! గ్రామఫోనుప్లేటుపాటా, సినీమాచిత్రమూ, యెటువంటివో అదీ అటువంటిదే! కాని ఉపజ్ఞ, ప్రతిభ, గల నిజమైన నటుడికి అట్లావుండదు. ప్రతి ప్రదర్శనంలోనూ కొన్ని స్థలాల్లో మార్పు కనపడుతుంది. ప్రతి లలితకళా సాధకుడికుండేదే యిది! హరినాగభూషణంగారున్నారనుకోండి! ఆయనపాట విన్నవాళ్ళు నడిగితే ఒకప్పుడున్నట్టు మరొప్పుడుండదని చెబుతారు. ఎప్పుడూ ఆనందమే కలుగుతుంది గాని దానిలో తారతమ్యముంది! "రక్తికట్టింది" అనే మాటలో అర్థమిదే! కాబట్టి నటకుల్లోకూడా యిట్లా "రక్తికట్టించే"వాళ్లు చాలా

కుట్టవసంఖ్య. సినిమాకళకూ సాక్షాదభినయానికీ భేదమున్నటంటే పుస్తకం చదవడానికీ, ఉపన్యాసం వినటానికీ ఉన్న భేదమే! ఎప్పుడు చదివినా అదే పుస్తకం! కాని ఉపన్యాసం ప్రతిభగల ఉపన్యాసకుడిదైతే సజీవం! లక్ష్మణస్వామి, హరిప్రసాదరావుగార్ల అభినయం అటువంటిది! ఉపజ్ఞసహితమైంది! ఒక విషయం చెబుతా నీ సందర్భంలో. కొందరుమనవాళ్లు నాటకంలో పాత్రధారి, పాత్రయొక్క సుఖదుఃఖాల్లో ఐక్యమైతేతప్ప సరిగానటించడని అంటారు. ఈ విషయం మన పూర్వాలాక్షణికులు శోధించి రసం సామాజికనిష్ఠమే కాని నటనిష్ఠమెంతమాత్రంకాదని సిద్ధాంతీకరించారు. నటుడు రసాన్ననుభవించేటట్టైతే నృసింహస్వామి హిరణ్యకశిపుడిపొట్ట చీల్చాలసిందే! హరిశ్చంద్రుడు చంద్రమతిని చంపాలసిందే! అసంభవం! నటుడు తాను నటిస్తున్నానని ఎప్పటికీ మరవకూడదు! ఆయా సన్నివేశాల్లో తాదాత్మ్యాపొందినట్టు నటించాలసిందే! కాని పాత్రయొక్క అంతస్సును మాత్రం ప్రవేశించి తనఅభినయాన్ని సంస్కరించుకోవాలె! ఈ సంగతినిగూర్చి హరిప్రసాదరావుగారి అభినయంనించీ ఒకఉదాహరణ యిస్తాను. అది యీ విషయాన్నిగూర్చిచెబుతూ ఆయన అభినయ సామర్థ్యాన్ని తెలియజేస్తుంది. ఒకమారు బెజవాడలో నాటకపోటీ జరిగింది. అనేకకంపెనీలు పోటీచేశినై. ఎవ్వరి అభినివేశంగలనాటకం వాళ్లాడారు. హరిప్రసాదరావుగారుకూడా వారి కంపెనీతో పోటీచేశారు. నాటకప్రదర్శనం మొదలుపెట్టారు. హరిశ్చంద్రనాటకమది. కాటిసీనొచ్చింది. చంద్రమతి తనతొడమీద లోహితాస్యుని తల పెట్టుకుని ఏడుస్తున్నది! సందర్భమది! చంద్రమతి పాత్రధారికి కన్నీళ్లురావటం ప్రారంభించినై. మాట గద్గదిక కలిగింది. ఎంతసేపు ప్రయత్నించినా మాటపెగిలిరాదు. అంటే, హరిప్రసాదరావుగారు [illegible] రసంఅనుభవించి రసాస్వాదనపరులైన సామాజికుల్లో ఒకడైపోయినాడు స్త్రీపాత్రధారి. ఎప్పుడైతే సామాజికత్వ మాయ

ఎలా కలిసిందో నటత్వం భ్రష్టమైంది! అందుచేత ఇలా ప్రారంభించింది! కాబట్టి మా తేవావారికి నటించేనాటకాలకు సంపూర్ణంగా రాదిరసాలను అనుభవించటం మొదలుపెడితే కొంతసమయం పోతుంది!* హరిప్రసాదరావుగారి అభినయానుభూతి మానాలను అలరించటంగా వెలిగిపోయింది. తనకెప్పుడూ అనేకమూర్తుల పాత్రధరించి నటించిన వ్యక్తి కాదిన మధినయం, రసానుభవం కలగజేసింది! ఇటువంటి నటుడు హరిప్రసాదరావు!

కంపెనీలు ప్రథమదశకంలోవి రెండోదశకంలోకి కొన్ని అనువృత్తి వచ్చినై. కొన్ని నూతనంగా బయలుదేరినై. కొత్తవాటిలో రాజమండ్రిలో నాగేశ్వరరావుగారి కంపెనీ, బెజవాడ మైలవరంరాజాగారి కంపెనీ, తెనాలి రామవిలాససభా, ఏలూరు మోతేవారి కంపెనీ కొన్ని ముఖ్యమైనవి. ఇవి ప్రత్యేకంగా నటులకు వేతనాలిచ్చి పోషించిన సంస్థలు. నాటకకళకు చాలా దోహదమిచ్చారీ సంస్థాపకులు. మోతేవారికేం, మైలవరంవారికేం, జమీందార్లు! పాపం భాగవతుల రాజగోపాలంగారు తమ నిజమైన కళోపాసనతో గరీబైపోయినారు. సరస్వత్యుపాసన చేసేటప్పటికి లక్ష్మి తొలగిపోయింది. ఆస్తిఅంతా పోగొట్టుకుని దారిద్ర్యంలో తుదిదినాలు గడిపిన కళాప్రియుడు. కీర్తికాయుడు! ఆయన ద్రవ్యం తిని తుదిదినాల్లో ఆయనను కళ్ళచూడని మిత్రులిప్పటికీ సిగ్గులేక తలెత్తుకుని గొప్పవాండ్లమని తిరుగుతున్నారు. పాపము శాంతించుగాక! తల్చుకుని యెప్పుడైనా వకొక్క అశ్రుబిందువు వదిలి పాప

---

* "కళలకు కళాత్వము లోపించునంత తన్మయత్వము జెందినయెడల నొకొక్క తప్పు డాభాసమునకు కారణమగునని మాత్రము మరవరాదు."

(లక్ష్మణరాయ వ్యాసావళి 295)

♦ మద్దాలి శేషగిరిరావు, కోపల్లె లక్ష్మీకాంతం మొదలైనవా ళ్ళీయనజట్టులో వాళ్ళే.

పుష్పం" మొదలైన శ్లోకాల అభినయిస్తూంటే హృదయంగమంగానే వుండేది. తర్వాత యీన సినిమాలో కూడా అభినయించారు. ద్రౌపదీవస్త్రాపహరణంలో దుర్యోధనుడుపాత్ర ధరించి నటించారు. బాగానే ఉందనచ్చు. ఇక గురజనాయుడుగా రసటమేగాని యీన అసలుపేరు చాలామందికి తెలుగదు. ఈన యముడు, భీముడు పాత్రల్లో ఆరితేరిన మనిషి. ఇప్పుడు అందరిచేతా మెప్పుపొందుతున్న వేమూరు గగ్గయ్య అభినయం చాలావరకు యీన అనుకరణమే! నాయుడు గారి పాత్రధారణం చూసినవాళ్లది మెచ్చనటికీ మరవరు. ఏలూరులో ఆరితేరిన వాళ్లల్లో మొదటగినవారు మున్జులూరు కృష్ణారావు కొచ్చర్ల కోట రంగారావుగార్లు. కృష్ణారావుగారు సహజంగా ప్రతిభ గల నటుడు. ఆయన ప్రతాపరుద్రీయంలో పిచ్చివాడుగా చేసే అభినయం కొంత గోవిందరాజువారి అనుకరణమైనా, అనేకస్థలాల్లో స్వప్రతిభ కూడా కనపర్చారు. ఈనకు దత్తమండలాల్లో సన్మానం చేశారు. నిజంగా చెయ్యదగ్గవ్యక్తి. రంగారావుగారు హాస్యపాత్రలకు తప్ప భావపూర్ణమైనవాటికి అంతగా పోష్యరు. రంగూరాకాండి, మధు సేవ మొదలైనవాట్లో తాగుబోతువాడిగా బాగా అభినయించారు. ఈనకూడా "సినిమాయాక్టరు" అనిపిచ్చుకున్నారు. తెనాలి రామ విలాసనభవారి నటబృందం కేవల నటులేగాక పండిత నటులూ, సహజనటులూ కలిసినది. ఇందులో ఉన్నపేర్లు కొన్నిచూచితే పాఠకు లకు తెలుస్తుంది. "స్థానం" ముఖ్య స్త్రీపాత్రధారి. ఆంధ్రదేశంలో నిజంగా స్త్రీపాత్రాన్ని ప్రతిభతో, వివేచనతో, నటించేపాత్ర కనుకూలాభినయంతో చేయగల సమర్థులు యీనతో ముగ్గురు మాత్రమే అని చెప్పాలి. నేను చెప్పే కాలాని కింకా పక్క సురభి కంపెనీలో తప్ప స్త్రీలు స్త్రీపాత్రలను ధరించే కాలం రాలేదు. స్త్రీలు స్త్రీపాత్రలను ధరించి బాగా అభినయించా రనిపించుకో టంలో గొప్పంలేదని కొంద రనుకుంటారు గాని అది నిజం కాదు.

[illegible] పాత్రను పోషించేయడానికి నిలుంది. తాను స్త్రీ
[illegible] విషయం ప్రేక్షకులకు [illegible]ని కభ్యంతరం కలగజేస్తుంది. "నటి" అనే
మాట అనుకరణంగా వాళ్ళకు కొంతవర్తించదు. శ్రీ రాళ్ళపల్లి
అనంతకృష్ణశర్మగారు తమనాటకోపన్యాసాలల్లో యీ విషయం
కూలంకషంగా విమర్శించారు. వారుకూడా రెండుపక్షాలూచర్చించి
పురుషులకే స్త్రీ[illegible]టునిచ్చారు. స్త్రీపాత్రధారులలో స్త్రీలను
వదిలితే. స్థానం, జగ్గరాజు, సంజీవరావుగార్లు వినుతికెక్కిన ప్రతి
భాశాలులు. స్థానంవారు చిత్రాంగి, దేవదేవి, పాత్రలను ధరించి
చేసేపని అప్రతిమానం. కాని ఆయన పాతివ్రత్యం కావలసిన
పాత్రలకు పనికిరాడని చెప్పచ్చు. కులుకుబెళుకులు కావలసిన
పాత్రల కప్రతిమానుడు. పాపం! స్త్రీలమీదే మోజుకలిగి, పురుషు
లను స్త్రీపాత్రలకు పిలవని సినిమాదినాల్లోనూ, నాటకాలకన్న
సినిమా ప్రదర్శనాల కెక్కువ ప్రాముఖ్యమిచ్చేకాలంలోనూ, నిజ
మైన ప్రతిభాశాలులైన నటులగతి, అటువంటి సినిమా కంపెనీలలో
చేరితే తప్ప మోక్షం లేకుండావుంది! ఫోటోగ్రాఫు, గ్రామొఫోను,
సినిమా యీ మూడూ వచ్చి, చిత్రకళలకు దెబ్బతగిలింది! దీనికి
కాలమే ఉత్తరవాది.* ప్రకృతి శాస్త్రప్రోద్బలంగల దినాల్లో జీవాల
కన్న నిర్జీవాల ప్రభ వెలిగిపోవడంలో ఆశ్చర్య మేముంది? యుద్ధ
మంటే శౌర్యం కావాలా? పరాక్రమం కావాలా? మోటారు టాం
కులు, విమానాలు, పెట్రోలు, యెవరి కెక్కువగావుంటే వారు
గెలవడం! అంతే! మనిషిని మనిషి యెదుర్కొని శౌర్యంచూపి,
యుద్ధకౌశలంలో జయించే రోజులుకావివి. ఈ పరిస్థితులే సర్వ

* "టాకీకళయందు రసోద్దీపనశక్తి యేవిధంగా లోపిస్తున్నదో, టాకీకంటె నాటకరంగ మెందుచేత రసవత్ప్రధానమైందో, నేటిటాకీలలో వ్యాపారవాంఛవలన అత్యుద్దీపనంకంటె యింద్రియతోషణమే యెలా లక్ష్యంగావుందో, కళకు ఉండదగిన ప్రామాణ్యం యేమిటో విపులంగా సోదహరణంగా "కజిన్సుపండితుడు వివరించాడు"

(ఆంధ్రపత్రిక 25—10—40 తేది)

మానవ కార్యాల్లోనూ అనువర్తిస్తుంది! తుదకు నాటకాచార్యులు గారెంత వారు సినీమాకంపెనీల నాశ్రయించాల్సొచ్చింది! స్థానాన్ని వదిలితే, గోవిందరాజుల వెంకట సుబ్బారావు, మాధవపెద్ది వెంకట్రామయ్య, పిల్లలమర్రి సుందరరామయ్య, యేకేశ్వరపు కుటుంబశాస్త్రి, వెంకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి, పెద్దిభొట్ల వెంకటచలపతిరావు, వంగాల శేషాచార్యులు, మాస్టర్ అంజిగార్ల* వేషాలు జగద్విఖ్యాతాలు. వీళ్లందరూకూడా సహజంగా నటనకే పుట్టినోళ్ళు, విద్యార్థిదశలోనించీ కూడా కళను సాధించిన నటతపస్వులని చెప్పాలి! ఏమి వైభవము! వీరందరూ కలిసి నటిస్తూవుంటే "దేవానాం కాంతంచాక్షుషం క్రతు" వుగా వుండేది! నాట్యయజ్ఞము! అప్పట్లో ప్రజానీకానికి చారిత్రక నాటకాలమీద అభిరుచి యెక్కువగా వుండేది. పౌరాణిక నాటకం అంటే క్వాచిత్కంగానూ! పరిహాసనరూపంగా అప్పుడెప్పుడో! గోవిందరాజుల వెంకటసుబ్బారావుగారినిగూర్చి నే నెక్కువగా చెప్ప లేను. ఆయన యుగంధర (పిచ్చి), బుస్సీ, గిరీశం పాత్రలు చారిత్ర కాలై పోయినై, ఆయన సినిమారంగానికెక్కి, ఎడారిలో పచ్చికబయల్లలే ప్రకాశించాడు. తెనుగువాళ్ళలోకూడా పాల్ వుడ్డు నటులవంటివాళ్లు అల్పసంఖ్యాకు లున్నారని ప్రపంచానికి చాటాడు. దేశానికి కీర్తి తెచ్చాడు. నటనం అతనిలో వక పిచ్చై పోయింది. అది చూపాలని బుద్ధిపుట్టినప్పుడు వృత్తిగిత్తి జ్ఞాపకం రాదు! చివరకు తన ఆరోగ్యాన్నికూడా మరుస్తాడు. మాలపిల్లలో అవధాన్లగారికి ఫిలిం పూర్తైనవెంటనే రొమ్ములో కురుపులేచి బాధ కలిగింది. ఆపరేషన్ చేసి నయమైనతర్వాత డాక్టర్లు యిక నటనం వద్దని సలహా యిచ్చారు. ఊరుకున్నాడా? ఎందుకూరుకుంటాడు? ఇతనికి నటనం రెండో ప్రకృతి! ఇతని నటనంలో రమణీయతవుంది! "క్షణక్షణ నవ్యత" ఉంది! సినిమానుబట్టి పరీక్షిస్తే లాభం లేదు.!

---

* "అందరూ వకెత్తు మాస్టర్ అంజి వకెత్తు."

ప్రేక్షకులూ కూడా చిల్లర నాటకాలమీద పడ్డారు. ఉన్నత కళా దర్శం తగ్గి ప్రతిదీ ప్రజావినోదంమీదికి [illegible] [illegible] కవులకూ, నటులకూ అదే ఉపాదేయమై పోయింది. ప్రాచీన ప్రామా ణికాలకు బొత్తుగా ఆదరం తగ్గలేక. ఇది కాలాన్ని బట్టి సహజమే కదు! పూర్వాచారపరాయణులు దుఃఖింపపనిలేదు! [illegible] [illegible] మహా కంపెనీల నాశ్రయించుకుని నాటకకర్త లుండేవారు. అటువంటి వాళ్ళలో బెజవాడలో మల్లాది అచ్యుతరామశాస్త్రి, శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి, కాశీనాథుని వీరమల్లయ్య, పోచిరాజు రామానుజరావు మొదలైనవాళ్లు యెన్నదగినవారు. కంపెనీలో నటించే వాళ్ళ అభిరుచినిబట్టి వాళ్లు యెటువంటి నాటకంకావాలంటే పాటల తోనూ, పద్యాలతోనూ రాశిచ్చేవాళ్లు వీళ్లు. వీళ్ళలో సచ్చిదానంద శాస్త్రిగారికి "సావిత్రిశాస్త్రిగార"నే బిరుదువచ్చింది. వీళ్లంతాకూడా నాటకరచనలో గట్టివాళ్లే! కాని వీళ్ళ నాటకాలు ఉత్తమకక్ష్యకు చెందిన యనడానికి వీలులేదు. నాటకాన్ని అనేక దృక్పథాలనించి చూడచ్చు. సారస్వతంగా, ప్రదర్శనార్హంగా, భావపూర్ణంగా, పాత్రపోషకంగా, యీ విధంగా ఒక్కొక్కటి వొక్కొక్కగుణం కలి గుంటుంది. ఇటీవల సచ్చిదానందశాస్త్రిగారు "లలిత" అనే పేరుతో సనాతనాచార పోషకమైన నాటకా న్నొకదాన్ని రచించాడు. చాలా బాగుంది. * వీళ్ళేగాక మహాకవి కాళ్ళకూరి నారాయణ రావుగారు వరవిక్రయాదులనూ, కాళ్ళకూరి సాంబశివరావుగారు బొబ్బిలిని "రంగరాయ కదన సమదాకారము" అనే పేరుతోనూ, యీ విధంగా కొందరు రచించారు. ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారి రసపుత్రవిజయం చాలా పేరుమోగింది. ద్రోణంరాజు సీతారామా రావుగారనే ఆయన రాత్రైక ప్రబంధరచనా ధురీణుడు. సాయం కాలం గనక యేదైనా చిత్తైకాగ్ర్యానికి సదుపాయం చేసి ఫలానా నాటకం కావాలె నని చెబితే తెల్లవారేటప్పటి కొక నాటకం

* 'బృంద' అనే వక భక్తిప్రధానమైన నాటకాన్నికూడా రాశాడు.

తయారయ్యేది. లిష్టు చూస్తే 1921 సంవత్సరానికి పూర్వం 32 నాటకాలు దాదాపు రాశినట్టు కనపడుతుంది. ఇన్ని నాటకాలు రాశిన వాళ్ళు చాలాతక్కువ. వీటిలో వకర్దాన్నికూడా యిప్పుడెవ్వరూ ప్రదర్శించటంలేదు! చూశేవాళ్ళుకూడా లేరు! బేతపూడి భగవంతరావు గారుకూడా మనుసంభవం రుక్మాంగద మొదలైన అనేకనాటకాలు రచించాడు.* ఈవిధంగా వకటిరెండు చొప్పున నాటకాలు రచించిన వారు లెక్కకుమిక్కిలిగా వున్నారు. ఇటీవల రైల్వేవాఙ్మయాన్ని పరిశీలిస్తే బద్దిరెడ్డి కోటేశ్వరరావుగారనే ఆయనకూడా సీతారామ రావుగారిని మించిపోయినట్టు కనపడుతుంది. ఈ నాటకాలకు అంతు లేకుండా రచనపెరిగిపోయింది. పూర్వం "నాటకాంతం సాహిత్య" మనేవాళ్ళు. ఇప్పుడో "నాటకాది సాహిత్యం" అనచ్చు. కొంచెం గణాలు తెలిసి పద్యం రాయగలవాళ్ళంతా నాటకరచయితలే. ఈ విధంగా నాటక నవలారచనలు మిక్కిలి విరివిగా సాగింది. నా మిత్రుల్లో నాకంటె తక్కువ సారస్వతకృషి చేసినవాళ్లు కూడా కొందరు నవలా నాటకకర్త లున్నారు! ఈ విధంగా నాటకవాఙ్మయం పెరిగిపోయింది యీ వింశతి సంవత్సరాంత కాలానికి. ఇప్పుడీసందర్భంలో వక నూతనవిషయ మొచ్చింది. ఇవి మతకుల కక్షదినాలు. అందుచేత మతాలకూ, కులాలకూ అంతఃకలహాలు. "ప్రతాపరుద్రీయ" ప్రదర్శనం, "శివాజీ" ప్రదర్శనం కొన్ని ప్రాంతాల్లో పనికిరావు. సారస్వతానికీ, చరిత్రకూ మతకులకక్షలకూ లంకెవెయ్యడం చాలా విచారకరం. సారస్వతాన్ని కులకక్షల

* ఈన సంగీతగ్రంథాలుకూడా రాశాడు. "కవిమిత్రము" ని అర్థానుస్వార శకటరేఫలుగల మాటలపట్టిక వకటి తయారు చేశాడు.

శృంగారకవి సర్వారాయుడుగారు యింటిపేరును సార్థకం చేసుకున్న మంచి వ్రాయనగాడు. ఈన యెంతకవో అంత వైయాకరణి. శ్రీరాం వీరబ్రహ్మంగా రనే బందరువాస్తవ్యుడు చాలా నాటకాలూ, కొన్ని ప్రబంధాలూకూడా రచించాడు. ప్రఖ్యాతుడు. ఈన యిప్పుడు యావదాంధ్రంలో వుండే గొప్పవారి జీవితాలు రచిస్తున్నట్టు తెలుస్తుంది.

దృష్టితో పరిశీలించి కథలో యిట్లా వుండగూడదనడంకంటె విచారకరమైనవిషయం వుంటుందా? నాటకకర్త చరిత్రను వెనుక ఊతగా పెట్టుకుని చిల్లరవిషయాల్లో అనేకమార్పులు చేస్తాడు. పురాణకథలను మన ప్రబంధ నాటకకర్తలు మార్చలేదూ? "రోషనార" నాటకం యెంత విరివిగా మొదట ప్రదర్శింపబడేదో తర్వాత అంత ప్రదర్శన బాహ్యమైందిందుకే! ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారి "రసపుత్ర విజయం"కూడా అంతే! ఇది వక విచిత్రసన్నివేశం. ఈ నిషేధంమాత్రం హిందూకథలకు లేదు. కారణం తెలుసునా? వాళ్ళనువాళ్లే తిట్టుకుంటున్నారు కాబట్టి? మొగుడు ముండాఅంటే ముష్టికొచ్చిన వాళ్లంతా ముండాఅన్నారట! యేనాడు వీరేశలింగంగారు ప్రారంభించారో హిందూధర్మ నిరసనం ప్రతీఅప్రయోజకుడికీ, నీచాచార వర్తికీ, తాగుబోతుకూ, వ్యభిచారికీకూడా నిరసనకేంద్రమైపోయింది. ఏసినిమాఅయినా చూడండి! తన్నిరసనం కొంతఉండి తీరుతుంది. సినీమాలు, వచ్చి ధర్మప్రత్యయానికి చాలా దెబ్బకొట్టినై! కొన్ని యిందులో చోరులకూ, అవినీతిపరులకూ నూతనమార్గబోధకాలుగా కూడావున్నై!

## వివిధవిషయాలు :

**రైల్వేవాఙ్మయం:** 1921 సంవత్సరంనాటికి కొంత రైల్వే వాఙ్మయం పెరిగిపోయింది. ఇప్పుడు యిన్సూరెన్సు యేజెంట్లు ప్రాణం తీసినట్టు అప్పుడీ పుస్తకాల యేజెంట్లు ప్రాణం తీస్తూవుండేవాళ్ళు. తెనాలి, బాపట్ల, వంగోలు, నెల్లూరు యిటేమిటి ప్రతి పెద్ద స్టేషనాలలో చుట్ట బీడి సిగరెట్లతోపాటు పుస్తకాల అమ్మకంవాళ్ళు గూడా కేకేస్తూండేవాళ్లు. బెజవాడకు తూర్పునస్టేషనాలలో వీళ్ళ సంఖ్య యింకా యెక్కువ. రైలులోకూడా బాధ. వద్దంటే ఊరుకోరు. పుస్తకాలబొత్తి దగ్గరుంచేవాళ్ళు. మరీ ఆడవాళ్లున్నారా యింకా వీళ్ళకు హుషారు. వెనక మనవి చేశాను. వీటికి రకరకాల

పేర్లు! కథలే గాక, వృక్షశాస్త్రం, సాముద్రికం, వైద్యం మొదలైన అనేక గ్రంథాలు! పాటలు, పదాలు, యక్షగానాలు, బొబ్బిలి పాటలూ, వీటి ఫణితులు విచిత్రంగా వుండేవి! అప్పుడు ప్రజా సామాన్యం నోట్లో యెటువంటి ఫణితుండేదో దాంతో మర్నాడే పాట అచ్చొత్తించి అమ్మడం! ఈ రైల్వేనాటకాలలో వెనకటివాటి పేర్లే కొందరు పెట్టేవాళ్లు. ఒకొ్కకప్పుడు వకటే కథకు భిన్నభిన్న నామాలు పెట్టేవాళ్ళు. "చింతామణి" "లీలాశుక" "సుబ్బిశెట్టిదివాలా" లు వకే నాటకానికి పేర్లు. ఇవిగాక ఆకర్షించటంకోసం పెట్టే పేర్లకు అంతులేదు. వీటిలో కొన్ని చమత్కారాలే కాకుండా బూతు నిర్విశేషంగాకూడా వుండడం! ఈ విధంగా యీ వాఙ్మయ ముండేది.

**మతవాఙ్మయం**: మతం మొదటినుంచీ వాఙ్మయ బీజాలలో వకటి. తత్రాపి మనకు మతమంటే ప్రాణమే. అందుచేత మతగ్రంథాల సంఖ్యచూస్తే అన్నిటికంటె యెక్కువనే చెప్పచ్చు. కాని మతగ్రంథాలను, భారత భాగవతాల మాదిరిగా కావ్యాలుగా రాయడం మనకు కావలసింది.* కేవల మతగ్రంథాలు మనపరీక్ష కిందికిరావు.♦ పూర్వ

* శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావుగారు బైబులుకు పద్యరూపంగా ఆంధ్రానువాదం రచించారు. చాలా గొప్పకార్యము. 1941 సంవత్సరం యేప్రిల్‌లో వీరు పరమపదించారు.

♦ సూత్రభాష్యం, రామానుజభాష్యం, ఖురానుషరీఫు, బైబిలు మొదలైన అనేక మతగ్రంథాలు భాషాంతరీకరింపబడినై. ఇవేగాక మతత్రయాన్నిగూర్చీ, బ్రహ్మసమాజంగూర్చీ, క్రీస్తుమతంగూర్చీ రాశిన గ్రంథాలు లెక్కకు మిక్కుటంగా ఉన్నై. వాటి కన్నిటి కిక్కడ స్థానం లేదు. పురాణపండా మల్లయ్యశాస్త్రిగా రనే గొప్ప పండితప్రకాండుడు పీఠికాపురవాసి బ్రహ్మసూత్రాది వేదాంతగ్రంథాలను తెనుగులో రాశి భాషాసేవ చేశాడు. ఈన అనేక యువకులకు చాలా భావనాగురువు. ఈన స్కూలులో పండితుడుగా వుండేవాడు. చాలా హాస్యప్రధాన సంభాషణ గలవాడు. ఎన్నదగినవాడు. మద్రాసులో న్యాయవాదివృత్తిలో ఉండి సారస్వతప్రీతిగల పురాణపండా కామేశ్వరరావుగా రీయన కుమారుడే!

మతా న్నుగ్గడించేవిగాక కొందరు నవ్యమతాలనుగూర్చి రాశినవాళ్లు న్నారు. వీళ్లలో కూచి నరిసింహంగారిని ముఖ్యంగా పేర్కొనక తప్పదు. ఈన సింహత్రయంలో వకరు. ఈన వాఙ్మయసేవకులలో వకరు. ఈన పానుగంటివారికి ప్రియమిత్రుడు. ఈన "గౌరాంగ చరిత్ర" యీకాలానికి కొంచెం వెనకముందుగా వచ్చింది. మిక్కిలి రసవంతంగా రాశిన చైతన్యజీవిత మిది. చాలా అద్భుతరచన. నిర్దుష్ట మైన గ్రాంధికభాష. ఈన చాలా పేరుపొందిన హైస్కూలు హెడ్మాష్టరుగా పనిచేశాడు. కాబట్టి భాషావిషయంలో క్రమశిక్షే అనుసరించాడు. ఈన యీకాలపు ఉద్గ్రంథరచయితల్లో చేర్చవలసిన వాడు. వావిలాల శివావధాన్లుగారు థియాసఫీమీాద చాలా గ్రంథాలురాశాడు. ఈనకూడా సారస్వతసేవ చేసినవాడే. విద్యా రణ్యజీవితాన్ని క్రోడీకరించి వక గ్రంథరూపంగా రాశాడు. ఈన మంచివక్తకూడాను. ప్రాచీనవిషయాలకు చాలావాటికి నవీనార్థాలిచ్చి తృప్తిపొందించగలశక్తి యీనకు చాలావుంది. ఈన జడ్జీవుద్యోగం చేసినవాడౌటచేత వివిధపక్షాలను పరీక్షించి సిద్ధాంతాన్ని చెప్పగల శక్తి యీనకు చాలా వుంది. ఈన రాతలుకూడా మెన్నదగినవే!

**పాఠశాల వాఙ్మయం:** ఇవిగాక యింకా పాఠశాలల్లో ఉప యోగంకోసం అనేక గద్యగ్రంథాలు వెలువడ్డై! ఇవి రాసిన వాళ్ళలో ముడియం సీతారామరావుగారివంటివా ళ్ళున్నారు. ఈన హెడ్మాష్టరుపదవి నలంకరించాడు. పూర్వ పురాణపురుషుల జీవి తాలు చక్కని సులభశైలిలో రాశాడు. ఈనచేతలో తెనుగుశైలి సౌలభ్యంకలిగి మెలిగింది. ఈనేగాక యింకా జనమంచి సీతారామ స్వామి మొదలైనవా రున్నారు. భూగోళము, ప్రకృతిశాస్త్రములు వగైరాలు రాశినవారిలో కె. సీతారామయ్య బి. ఏ., యల్. టి. మొదలైనవా రనేకు లున్నారు.

చరిత్రవాఙ్మయం, వైద్యవాఙ్మయం మొదలైనవికూడా అపారంగా పెరిగిపోయినై. ఇవిగాక క్రైస్తవులు తన్మతవ్యాపనంకోసం రాశిన గ్రంథా లసంఖ్యేయాలు. వాటిపేర్లు రాస్తే నా గ్రంథం నిండి పోతుంది. వీటిలో భాష కొంచెం పట్టేశినట్టున్నా వీటిలో కొన్ని ఉత్తమజాతిలో వని చెప్పటాని కెట్టి సందేహం లేదు.

వెనకటి ఉద్గ్రంథరచనావీధి సన్నమైపోతున్నది! తత్సాధకులకు మెలగడానికి చోటుచాలక తన్నుకులాడుతున్నారు! పద్యవీధి పొట్టై, ఉన్నకొంచెం దూరమూ ఆహ్లాదకరంగా సర్వలక్షణ సంపన్నంగా వున్నది! ఇటువంటి పద్యవీధుల్లో కవికుమారులు సంచరిస్తూ నూతన శోభలకొరకు ప్రయత్నిస్తూ వెనక్కు ముందు కూగులాడుతున్నారు. దీన్నే ఖండకావ్యవీధి యందాం! గద్యవీధి చాలా విశాలమై, అనేకముఖాలై చీలిపోయి, ఈచీలిపోయిన అంతర్వీధు లెక్కడికి తీసుకెళ్తాయో తెలియకుండా ఉన్నది. వీటిలో గద్యకావ్యము, దేశచరిత్ర, జీవితచరిత్ర, నవల, కథ, కథానిక, ఉపన్యాసము, వ్యాసము,పరిశోధనం అనేవి ముఖ్యాంతర్వీధులు. వీటి నిర్మాణంలో కొందరు సాధకులు చాలా శ్రమపడుతున్నారు. అహల్యాబాయిదగ్గర్నించీ, మాలపల్లిదాకా నవలావీధి సాగింది. ఇంకా ముందుకు పోతున్నది. నాటకవీధిలో కొన్ని మంచి మంచి ఘట్టా లున్నై! నన్ను చూడు, నన్ను చూడు అని అహమహమికతో ఆకర్షిస్తున్నై! కాని కొంత తుక్కు కనబడుతున్న దీ నవలానాటకవీధుల్లో. కాలసమ్మార్జని కొంత యీ వీధులను పరిశుభ్రపరుస్తున్నది. వెనకటికంటె కొంచెం స్వచ్ఛాలైనై యీ వీధులు. కాని ముందుకుసాగినకొద్దీ యీవీధుల్లో మళ్లీకొత్తచెత్త చేరుతున్నది. మళ్ళీ కొంత పేరుకుంటేనేగాని కాలం పని చెయ్యడానికవకాశం చిక్కదు! కథావీధి చాలా హృదయంగమంగా కనపడుతున్నది. కాని కొంతమన్ను చేరింది. కాలవర్షం వస్తేగాని యిదంతా కొట్టుకుపోయి శుభ్రం కాదు. వ్యాసవీధి మొదలైందిగాని యింకా

సాగటం లేదు. సాధకులు కార్యాంతరవ్యాపృతులై వున్నారు. విమ
ర్శనవీధికి మంచిపునాదులు పడ్డై. సాధకులు సామగ్రి తెస్తున్నారు.
కొద్ది దినాల్లో యీ వీధి పెరుగుతుందనీ, మాబోటివాళ్ళకు కొంత
సంచారావకాశం కలుగుతుందనీ ఆశిస్తున్నాము. అనేకసాధకులు దీనికి
మంచి అంచనాలువేశి ప్రతిభతో దాన్ని రమ్యంగా కట్టాలని ప్రయ
త్నిస్తున్నారు. వాళ్ళ యత్నాలు సఫలం కావాలని ఆశిస్తున్నాను!
నాటకవీధిలో కొన్ని చక్కని దృశ్యాలున్నై! కాని సినిమా
పర్వత మడ్డం వచ్చి ఆ వీధిని సాగకుండా కొంతవర కడ్డుపడ్డది. ఈ
కొండ పగలకొట్టడానికి వీలౌతుందో కాదో తెలియదు! ఈ సినిమా
కొండ వక్క సారస్వతవీధికేగాక యితర లలితకళావీధులకూ-డా
గొప్ప అడ్డంకిగా వున్నది. కాని హైద్రాబాదుకు వచ్చిన ప్రతీవాళ్లూ
యెట్లా గోలకొండ యెక్కి, అక్కడి దృశ్యాలూ, గాలీ ఆకర్షిస్తూ
త్వరగా దిగిరారో, అట్లాగే అందాకా వచ్చినవాళ్ళంతా యీసినిమా
పర్వతమెక్కి చమత్కారం చూస్తున్నారు. మిగిలినవాళ్ళమాట
అటుంచినా, వీధినిర్మాతల్లో కొందరు కొండెక్కి దిగకపోవడంచేత
మిగిలిన సాధకులకు బలం తక్కువై నిర్విణ్ణులైపోతున్నారు. పత్రికా
వీధి కొంచెం వంకర్లగా ప్రవర్తించినా, కొన్ని వార్తాపత్రికలూ, సార
స్వతపత్రికలూ ఆకర్షకాలుగానే వున్నై. సారస్వతసేవచేస్తూ నేడున్నై!
మధ్యమధ్య కొన్ని గుంటమిట్టలున్నై! కాలదంభోళి రాకమానదు!

## వక్తృత్వం, ఆంధ్రరత్నం:

వక్తృత్వవీధిమాత్రం యీకాలాంతానికి మిక్కిలి ఉత్తేజకరంగా
వుండి ఆకర్షిస్తున్నది. సాధకులసంఖ్య హెచ్చిపోయింది. సంచరించే
ప్రజాసంఖ్యకు మితి లేదు. సాధకులు వీళ్ళకు సంపూర్ణసౌకర్యాలు
చెయ్యటానికి చాలా శ్రమపడుతున్నారు. వెనకటి 1907—8 నాటి
కంటె సాధకులసంఖ్య 3, 4 రెట్లైపోయింది. 1920 సంవత్సరములో
రాజకీయప్రచారం ప్రాముఖ్యానికి వచ్చింది. ఈప్రచారానికి యువక

జన మంతా నడుములు బిగించి బైటి కొచ్చారు. పెద్దవాళ్ళంతా వీళ్ళకు కావలసిన విజ్ఞానసామగ్రి సేకరించిపెట్టి ధైర్యాన్నిచ్చి పంపారు. ఈ సాధకులలో కొందరు యెన్నటికీ మరవడానికి వీల్లేని వాళ్లున్నారు. ముఖ్యుడు మా ఆంధ్రరత్నం. ఈనను తల్చుకుంటే మా అప్పారావును తల్చుకుంటే వచ్చినట్టు కన్నీళ్ళు వస్తై నాకు. ప్రజలలో "వజ్రం". "మణి" వంటివాడు. నాయకు లంతా యీనను చూస్తే వణికేవారు. ఈనతో సమానమైనవాడు భారతదేశంలో లేడు. ఇతన్ని ఆంధ్రరత్న మనటంకంటె "భారతరత్న" మనాలె. ఆయనప్రతిభ వర్ణించటానికి నా వాక్కు మిక్కిలి నీరసం! నా బుద్ధి మిక్కిలి మందం! ఇతను యింగ్లాండుపోయి విద్య నభ్యసించాడు. ఎందరు అభ్యసించ లేదు? వాళ్ళపేర్లన్నీ మనకు జ్ఞాపకమున్నాయా? పోయొచ్చి గొప్ప ఉద్యోగాలు చేస్తున్నవాళ్ళపేర్లే యెన్నో మన మెరగం! కానివాళ్ళవలె ఉద్యోగమూ ద్రవ్యార్జనమూ పరమావధిగా కలిగి, "బ్రతికాడు, చచ్చాడు" అనిపిచ్చుకోకుండా, తనపేరు శాశ్వతంగా చేసుకున్నాడు. ఇంగ్లాండు పోయొచ్చిన మనవాళ్ళను ప్రతీ వాణ్ణీ పరీక్షిస్తే వీళ్ళల్లో దేశభాషాభిమానాలు మృగ్యాలుగా వున్నై! ఎక్కడో రెడ్డిగారంటివారు న్మారుకాకుల్లో వక్క కోకిల్లాగ కనపడతారు. ఈ విషయాన్నిగూర్చి వెనక కొంచెం మనవి చేశాను. ఇప్పుడు విపులం చెయ్యనక్కర లేదు. ఈన పేదవాడు. అయినా నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావుగారు మొదలైన స్నేహితుల సహవాసంతోనూ, సహాయంతోనూ అక్కడ విద్యార్జనకాలం గడిపాడు. ఈన కళోపాసకుడు. స్వతః నాట్య సంగీతశాస్త్రజ్ఞానం కలవాడు. ఈ కళోపాసకత్వం యీన జీవితంలో ప్రతీకార్యంలోనూ వ్యక్తమౌతూ వుండేది. ఇంగ్లాండులో విద్యార్థిదశలోనే అక్కడి లలిత కళాభిజ్ఞులతో యీనకు స్నేహ ముండేది. ఈన అష్టపదులు పాడుతూఉంటే నిద్రాహారా లక్కర లేదు. అట్లా రాత్రులు

రాత్రులు వినే అదృష్టం అనేకమార్లు నాకు కలిగింది. ఇంగ్లాండులో డాక్టరు ఆనంద కుమారస్వామిగారనే గొప్ప దేశభక్తు డున్నాడు. ఆయన గొప్ప లలితకళావిమర్శకుడు. ఆయ న్నాకర్షించింది ఆంధ్ర రత్నం కళోపాసన. ఆయన గీతగోవిందగానం విని ముగ్ధుడైపోయి నాడు. వీ రిద్దరికీ మంచి సఖ్యం కలిగింది. ఇద్దరూకలిసి అభినయ శాస్త్రం పరిష్కరించి అచ్చేయించారు. మంచి చిత్రాలతోకూడా నిండివున్నది. చాలా ముఖ్యమైన గ్రంథమది. ఈ ప్రకారంగా విద్యార్థి దశలోనే తన ప్రతిభచూపిన వ్యక్తి. ఈన ఎడింబరో విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. ప్యాసై రాగానే సర్కారువా రీయన్ను విద్యాశాఖలో గెజెటెడు ఉద్యోగానికి నియమించారు. ఈయన యిమిడి వకరికింద ఉండగల వ్యక్తి కాడు. అక్కడ చోటు ఆయనకు వేడైంది. అక్కడ రాజీనామా యిచ్చొచ్చాడు. విద్యాశాఖనష్టం దేశానికి లాభకరమైంది. సహాయనిరాకరణోద్యమంలో అమాంతం దూకాడు. విద్యాలయ బహిష్కారకార్యం ఆంధ్రదేశంలో యీనపైన బడ్డది. అప్పు డీయన చూపిన వక్తృత్వసామర్థ్యం చెప్పటానికి వీల్లేనిది. ఈన గొప్ప ప్రతిభాశాలేగాక సమస్త పురాణేతిహాసవేత్త. అఖండ రామభక్తుడు. ఒక్కొక్కప్పుడు సమాధిలోకి వెళ్ళి రాముడితో సంభాషించి వచ్చేవాడు. ఈన "రామదండ" నే పేరుతో వక వాలంటీరుదళాన్నేర్పాటు చేశాడు. రామదం డంటే దేశంలో మోగిపోయింది. దానికి కావలసిన ప్రణాళికంతా యేర్పాట్లు చేశాడు. ఇంగ్లీషులోనూ తెనుగులోనూ యీన మాట్లాడుతూంటే వెనక గోపాలకృష్ణమురళికి గోవులూ, గోవత్సాలూ, చేతనాచేతనప్రపంచమంతా యెట్లాముగ్ధమైపోయిందో అట్లా ముగ్ధమైపొయ్యేది వేలకువేలకు శ్రోత్రజనం! అది ఉపన్యాసం కాదు! హరికథ కాదు! ఏదో వకవిధమైన దేవగానం! అది వక్కమారువింటే గోపాలకృష్ణగీతలు "గంగాజలలవకణికల"వలె పావనాలూ, తాపశాంతికరాలూ, తుదకు ముక్తిమార్గదర్శకాలూను!

ఆ ధోరణిఅనిర్వాచ్యం. ఆంధ్రదేశంలో యిట్టి వ్యక్తి నభూతో నభవిష్యతి! యువకజనానికి నాయకత్వం వహించి పాఠశాలా బహిష్కారకార్యం సంపూర్తిగా నిర్వర్తించాడు. ఈన యెంత గొప్ప వక్తో అంత గొప్పకవి. జైలు నించీ బయటకు వచ్చినప్పుడు శ్రీరంగంలో రంగనాథుడు మీద చెప్పిన శ్లోకాలు చిరస్థాయిగా వుండాలశినవి! ఇతని తెనుగుపద్యరచన హాస్యరసపూరితంగా వుండేది! మనిషిలో చాలావంతు హాస్యరస మని చెప్పాలె! అంతమాత్రంచేత కార్యదీక్ష లేదని చెప్పటానికి వీల్లేదు. చీరాల పేరాల మ్యునిసిపాలిటీ సత్యాగ్రహసందర్భంలో యీనపేరు భారతదేశ మంతా మోగిపోయింది! ఇంగ్లీషులో వక పుస్తకంకూడా వెలువడ్డది. మ్యునిసిపాలిటీవదిలి పట్టణప్రజనందరిని పాకలలో ఉండేట్టుచేశిన స్థలంలో రామనగర మనేపేర పట్టణం నిర్మించి, అక్కడ రామాలయం కట్టి పుణ్యక్షేత్రాన్ని చెయ్యాలని సంకల్పించి కొంత నిర్మాణంచేశాడు. అక్కడ తుదిస్థావర మేర్పరచుకుని, తాను స్థావరం స్థిరపరచుకున్న చోటే తుదకు భౌతికదేహం వదిలాడు! ఒక్క కుమారు డున్నాడు. చిరంజీవై వర్ధిల్లి తండ్రికీర్తి కాపాడుతా డని ఆశిస్తున్నాను! ఆయన సాధ్వి, మిక్కిలి అమాయకురాలు! కందిపచ్చడిచేసి మాకిద్దరికి వడ్డించి పెట్టిన భోజనం నేను నాజన్మకు మరవలేను! అతన్ని అప్పుడప్పుడు తల్చుకుంటూ వుంటాను! ఆయనకు నేను తీర్చవలసిన రుణముంది. నాజన్మలో దీర్చుకోవాలనే ఆశిస్తున్నాను! పరమేశ్వరుడు నాకు తోడ్పడుగాక! ఈన రాశిన గ్రంథాలన్నీ బెజవాడలో గుమ్మడిదల వెంకటసుబ్బారావుగారచ్చేశారు. ఈన గోపాలకృష్ణయ్యాభక్తుడు. దేశసేవ జీవితపరమావధిగా పెట్టుకున్నవాడు. చాలా ప్రజ్ఞకలవాడు. గోష్ఠిఅనే పత్రికపెట్టి గోపాలకృష్ణమతం ప్రచారంచేస్తున్నాడు, చాలా కొనియాడదగినపని చేస్తున్నాడు. ఆంధ్రరత్న చాటుధారలు మిక్కిలి హృదయంగమాలు! ఈయన ఆంధ్రదేశంలో నాయకులనే వాళ్లను

గూర్చి రాశిన చాటుధారలు అన్నీ అన్ని వాక్చిత్రాలు! సారస్వత ప్రియులకు జిహ్వాగ్రాలమీద ఉంటై! ఈన గొప్ప రాజకీయవేత్త కూడాను. ఈన యిచ్చిన స్వరాజ్యనిర్వచనం యెవ్వరూ యివ్వలేదు. దాన్ననువదిస్తాను :—

"Swaraj therefore means the preservation of Hindu Dharma, Muslim Dharma, Christian Dharma, Parsi Dharma, Sikh Dharma, in short the Swadharma of all, a Co-ordinated federation of all, which are now threatened with distruction, by godless philosophy, industrial anarchy, and spiritual famine that beset the world at the present moment."

ఇతను గాడరుద్రాక్షలు వేసుకుని పెద్ద అర్ధణాఅంత కుంకుమ బొట్టుపెట్టి, బ్రహ్మవర్చస్సు తాండవమాడుతూండగా సుందరకాండం పారాయణచేస్తూంటే, మహర్షివలె తేజోరాశిగా కనపడేవాడు. బయట యేవేషంవేస్తే దానికి అచ్చుగుద్దినట్టుండేది శీవి. ఒకనాడు అకాలీ సిక్కువలె నేపథ్యం ధరించేటప్పటికి నేనుకనుక్కోలేక పోయి నాను. ఇతని "బ్రాహ్మణోద్యమం" వ్యాపించినట్లైతే హరిజనసమస్య వుండేదికాదు! ఒక్కమారు కాంగ్రెసు కార్యదర్శి అయినారు. అదే అర్థశతాబ్దానికిగాను కాంగ్రెసు ఆంధ్రుల చేతుల్లోకి వచ్చిన అదను! మననాయకమ్మన్యులు అంతశ్చైత్యాలతో, గోపాలకృష్ణయ్య అవుతాడేమో అనికడుపుబ్బరంతో, దాన్నికాస్తా పోగొట్టుకున్నారు. నాకి నాడకాంగ్రెసు మనఆంధ్రదేశంలో జరిగిన తుదికాంగ్రెసు. ఇప్పుడాంధ్రులంటే కాంగ్రెసులో న్యూనత! ఆంధ్రరత్నం కాలంలో పోగొట్టుకున్న అవకాశం యిప్పటికి 17 యేండ్లైంది, మళ్లి వస్తుందో రాదో తెలియదు. కాంగ్రెసుదృష్టిలో దక్షిణభారతదేశము లేనేలేదు. 1921సంవత్సరంలో ఆంధ్రరత్నం ఆధిపత్యం కింద బెజవాడలో యేనాడు అఖిలభారత

కాంగ్రెసు సంఘం సభ జరిగిందో! మరిచిగూడా పోయినాం! వల్ల
భాయి పటేలుగారు ఆంధ్రులను చేసిన హేళనం, ఆంధ్రుల చరిత్రలో
కెక్కింది! ఆంధ్రరాష్ట్రమంటే పటేలుగారు చేసిన హేళనను చూస్తే
కాంగ్రెసంటే ఆంధ్రులు వైముఖ్యం చూపాలశింది! కాని వీరంత
సంకుచిత దృష్టికలవాళ్లు కారుకాబట్టి యింకా పెనుగులాడు
తున్నారు! మనవాళ్ల ఉదంతమిది. అటువంటి ఆంధ్రరత్నమంటే
కార్యదీక్ష లేదనీ, అంతా నవ్వులాటేననీ, ఆఖరుకు పిచ్చివాడనీ, మన
ప్రముఖుల అభిప్రాయం! ఆయనకున్న ప్రతిభలో వీళ్లకొక్కళ్లకూడా-
యెవరో వక రిద్దరుతప్ప — శతాంశం లేదు! ఆయనతో అంత
స్సంబంధం కలవాళ్ళ కాయన హృదయమార్దవం, మానవత్వం, ఉదా
త్తతా తెలుస్తుంది! కాంగ్రెసుద్రవ్యం లెక్కచెప్పలే దనే వక
అపోహ ఆయనమీాదవున్నది!* తప్పుడులెక్కలు రాశేవాళ్ళకంటె
చాలా నయం! "తప్పు లెన్నువారు తమ తప్పు లెరుగరు." ఇదంతా
శాఖాచంక్రమణం. అటువంటి "రత్నాన్ని" కోల్పోయిన ఆంధ్రదేశా
నికి యిప్పట్లో ముక్తి వుండదని నమ్మకమే! ఈన తుదిదినాల్లో సేవ
చేసిన లక్ష్మీనరసింహారావుగారూ, డాక్టరు చలపతిగారూ ధన్యులు.
ఆయనశిష్యగణం చాలామంది ఆంధ్రవక్తృత్వంలో ఆరితేరినవాళ్ళు
వున్నారు. వాళ్ళలో వేదాంతం లక్ష్మీకాంతంగా రొకరు! ఈనకూడా
మాట్లాడుతూంటే చాలా ఉదాత్తంగా వుంటుంది. వీరేగాక యీ
ఉద్యమం చాలామందిని వక్తలను ప్రతి జిల్లాలోనూ పట్టణాల్లోనూ
తయారు చేశింది. చెరుకువాడ నరసింహంగారినిగూర్చి వెనక మనవి

* ఆయన సేవచేశాడు. పేదవాడు తిన్నాడేమో! తప్పేంలేదు. జీవితకాలంలో
ఆయనను గౌరవించలేని ఆంధ్రదేశం శిలావిగ్రహం స్థాపించి గౌరవించింది.
కోరుతొడిపర్రుగ్రామం ధన్యం. ఆప్రతిష్ఠ ఆయన ప్రియమిత్రుడు నడింపల్లి చేతుల
మీాదుగా జరగడం గొప్పవిషయం. "ఏకోనివాపసలిలంపిబసీత్యయుక్తం" అనే భవ
భూతివాక్యాలు తలుపుకు వస్తున్నవి.

చేశాను.♦ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు 1921 సంవత్సరారంభంలో పొన్నూరులో యిచ్చిన ఉపన్యాసం చెవులలో మారుమోగుతున్నది.* వక్తలు పురుషులేకాదు! స్త్రీలుకూడా వక్తృత్వంలో ఆరితేరారు! దువ్వూరు సుబ్బమ్మ వేదాంతం కమలమ్మగార్లు వేలకువేల శ్రోతలను ముగ్ధులను చేసేవాళ్లు.† ఈ వక్తృత్వంవల్ల కలిగిన పరిణామాలు రెండు. ఆంధ్రులలో వక్త లున్నారని దేశానికి తెలియడం వకటి. ఆంధ్రభాష వక్తృత్వానికి చాలా ఉపకరిస్తుందని చాటడం రెండవది. ఈ విధంగా దేశభాషాభిమానాలు భాష కుపకార కాలైనై. ఈ విధంగా సారస్వతవీధినిర్మాణమూ దానివల్ల సారస్వతక్షేత్ర సంచారులకుకల్గిన లాభాలూ, క్షేత్రానికికల్గిన శోభా, చూశాం. ఇక యుద్ధానంతరం యీ వీధు లెట్లా అయినవో చూదాం!!

నాటకాలు:

ఈ కాలంలో కొంచెం నాటకవీధిలో మార్పుజరుగుతున్నట్లు తోస్తున్నది. ఇది రెండుమార్గాలుగా వున్నది. ఒకమూల గద్యపద్య నాటకాని కసమ్మతిచూపుతూ గద్యనాటకాలే వుండాలని అంటూంటే కొందరు, మరికొందరు సంపూర్ణంగా పద్య నాటకాలే వుండాలని వాదిస్తూ రాస్తున్నారు. ఈ రెండుపద్ధతులూ పరస్పర విరుద్ధాలుగా కనపడతై! కాని కాలమట్టిది. పరస్పరవిరుద్ధ మార్గా

♦ డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారీ సందర్భంలో యెన్నదగిన వ్యక్తి. గంటలు గంటలు గొప్ప ఉదాత్తశైలిలో ఉపన్యసించి వేలను ఆనందోత్సాహాల్లో ముంచేవాడు. ఇంకా నడింపల్లి లక్ష్మీనరిసింహారావుగారు మొదలైన వాళ్లు చాలామంది యీ వీధిలో కృషిచేసిన వాళ్లు వున్నారు.

* ఉన్నవ లక్ష్మీనారాయణగారు, కొండా వెంకటప్పయ్యగారు మొదలైన మొదటితరంలో వాళ్ళింకా కాలానుసారంగా కృషిసల్పుతూనే వున్నారు.

† ఇటీవలనే కమలమ్మగారు స్వర్గస్థురాలైనారు.

లన్నీ యేకకాలావచ్ఛేదకాలుగా వుంటై! ఈ రెండుమార్గాలకూ వెనక వెలువడిన నాటకాలల్లో కొన్ని ఉత్తమాలను యిదివరకు పేర్లతో మనవిచేశాను. వాటిలోవుండే పరస్పర విశేషాలను కొన్నిం టిని సూక్ష్మంగా చర్చిస్తాను. బలిజేపల్లి లక్ష్మీకాంతంకవిగారి హరి శ్చంద్ర, బళ్ళారివారి చిత్రనళీయం, వీరేశలింగంగారి అభిజ్ఞాన శాకుం తలం పౌరాణిక నాటకాలు. వీటిలో అభిజ్ఞాన శాకుంతలం భాషాంతరీ కరణం. అందుచేత కథగాని, మరేంగాని కర్త స్వంతాలు కావు. వాటిలో ఉండే వైశిష్ట్యమంతా కాళిదాసుదే! కాని భాషాంతరీకరణం కూడా వక విశిష్టగుణంగల కార్యమే! మూలాన్ని చెడగొట్టకుండా దానిలోవున్న రసమంతా తెస్తూ భాషాంతరీకరించడం కూడా కష్టమైన పనే. ఈ పని వీయన చక్కగా నిర్వర్తించాడు. కాబట్టే అన్ని భాషాంత రీకరణాల్లో దీనికే పేరొచ్చింది. హరిశ్చంద్ర చిత్రనళీయాలు పౌరాణిక కథలు. వీటిని గ్రహించి నాటకానికితగిన సన్నివేశాలను కల్పించి సరస మైన నాటకాలు రచించారు వీరిద్దరూ. హరిశ్చంద్ర కథలో కవి యెక్కు వగా మార్పులు చెయ్యలేదు. కాకపోతే సంభాషణలోనూ, దాన్ని కల్పించడంలోనూ నాటకరచన కనుగుణమైన భాషాచిత్రాలను కల్పిం చాడు. నక్షత్రక పాత్రను చక్కగా ప్రతిభావంతంగా పోషిం చాడు. ఈపాత్ర యీానకు మిక్కిలి ప్రియమైనది. అందుచేత అంత మల్చినట్లొచ్చింది. వస్తువును వదిలితే భావరచనలు చాలాహృదయంగ మాలు. ఉదాత్తతా సముపేతాలు. ప్రతిభావంతాలు. నుడికారం మిక్కిలి రసవంతం. చిత్రనళీయం పైవాటివలెకాక ప్రబంధధోరణిలో పడ్డది. వర్ణనలూ, అలంకారాలూ మొదలైనవాట్లో యెట్టి మెక్కు వైన స్వతంత్రతా కనపడదు. ఇది కర్తగారి చిత్తపరిపాకాన్ని తెల్పు తుంది. నూతననాటకం రాయవలెననేగాని పాత్రపోషణాదుల్లో వైదగ్ధ్యం చూపడానికి నాటకరచనాప్రథమదినాలు అవి. కాబట్టి కవిది లోపమని చెప్పడంలో యెంతమాత్రం సామంజస్యం లేదు.

పై నాటకాలుగాక తిరుపతి వేంకటేశ్వరుల పాండవవిజయాది భారత నాటకాలు, వసురాయల వేణీసంహారం, భారతకథ ననుసరించి రచించినవి. కాని వీటిలో వేణీసంహారం మళ్ళీ భాషాంతరీకరణం. దీన్ని కూడా వీరేశలింగంగారి అభిజ్ఞాన శాకుంతలంతో చేర్చవచ్చు. ఉత్తమ మైన భాషాంతరీకరణం. వీటి రెంటిలో తారతమ్యా చర్చచేస్తే వేణీ సంహారమే కొంచెం మించిందని చెప్పాలె! కాళిదాసుకంటె భట్ట నారాయణకవి సామాన్యకక్ష్యకు దగ్గిరవాడు! అందుచేత అతడు రాశింది సులభంగా పరివర్తనం చెయ్యటానికి వీలైంది. కాని కాళిదాస వాక్యాలకింద వుండే విశేషాలు పరివర్తన కందేవికావు! వాటిని మాతృకలో చదివి ఆనందించవలశిందే! భాషను పరివర్తనం చెయ్యడానికి వీలుందిగాని, తద్విశిష్టచమత్కారం పరివర్తనంలో యెట్లా వస్తుంది? ప్రతిభాషాంతరీకరణానికున్న లోప మిదే! కాని మాతృకను రాశినకవి ఉత్తమకక్ష్యకు చెందక, మనకు సమీపంగా ఉంటే కొంచెం సులభం! ఏదీ? షేక్సిపియరు నాటకాన్నొకదాన్ని దానిలోవుండే సమస్తరసం వచ్చేట్టు భాషాంతరీకరించమనండి! అది మరీకష్టం! మన తెనుగులోకి వచ్చిన సంస్కృత గ్రంథభాషాంతరీకరణాలకు వక ప్రత్యేకసౌకర్య ముంది. అదేమిటంటే పదజాలం మాతృకదే అనుసరించవచ్చు! ఇతర భాషలసంగతి అట్లా కాదు. భాషాంతరీకరణాల్లో వున్న వైశిష్ట్య మది. అందుచేతనే తిక్కన పోతనాదులు చేశిన భాషాంతరీకరణాలు యథామాతృకాలు కాకుండా స్వేచ్ఛానువాదాలు! అక్కడే వాళ్ళ ప్రతిభ చూడాలె! పాండవవిజయం యితివృత్తంమాత్రం భారతంలోదే! కాని నాటకానికి వలసిన స్వల్పమార్పులను చేసి తిక్కన భారతరచనలో యెంత ప్రతిభా, కళాకౌశలమూ చూపించాడో అంతప్రతిభా చమత్కారాల నుపయోగించి రచించారు యీ కవులీ నాటకాలు. పాండవవిజయ నాటకం భాష కోక అమూల్యాలంకారం. వారి సారస్వత సంచారా

నికి మకుటాయమానమైన గ్రంథం! ఇందులో రసవంతం కాని ఘట్టం లేదు! ఎట్టి మార్పు చెయ్యకుండా, యేమాత్రం వదలకుండా రంగం మీద నాట్య మాడడాని కనువైనది! ఇదే చాలు కవులు చూపిన కౌశలాని కుదాహరణం! ఇక శ్రీపాదవారి బొబ్బిలి, వేదంవారి ప్రతాపరుద్రీయం, రెండూకూడా చారిత్రక నాటకాలు. దేశంలో ప్రచారంలో వున్న చారిత్రక విషయాలను సంగ్రహించి, వాటికి నాటకవాతావరణమిచ్చి చక్కని నాటకాలుగా, రసవంతాలుగా ప్రదర్శనయోగ్యాలుగా, రచించడం సామాన్యకార్యం కాదు. వీటిలో బొబ్బిలి వీరగాథ ననుసరించింది. ఆంధ్రులకు, పల్నాటి వీరగాథ, బొబ్బిలిగాథ, యింకా యిటువంటి స్థానికగాథలు చాలా ప్రియమైనవి. ఇవి హృదయోత్సాహ జనకాలు. తత్రాపి జానపదులకు చాలా ఆకర్షకాలు. అటువంటి వాటిని నాటకంగా రచించటం యీ వీరగాథలను సారస్వతంలోకి చేర్చడ మన్నమాట! పట్టణవాసులు యీ వీరగాథల నెక్కువగా యెరగరు. వాటిని వీరు చదవడానికీ, ప్రదర్శించడానికీ యోగ్యమైన సారస్వతవీధిలోకి తేవడం వీరు చేసినవిశేషం. నవలలు, నాటకాలు, జాతిచరిత్ర ప్రతిబింబకాలైనప్పుడు వాటికి విలువ చాలా హెచ్చు. మననవలలు చూస్తే యెక్కడనో బెంగాలులోనో, ఆరావళీపర్వతాల్లోనో, ఢిల్లీపట్నంలోనో, వున్న సన్నివేశాలతోనూ, మనవిగాని పాత్రనామాలతోనూ, మనకుసంబంధించని ఆచారవ్యవహారాలతోనూ నిండివుంటై! కొత్తపట్టణం పోయి తెలియక గుడ్లు మిటకరించినట్టుంటుంది చదువుతూవుంటే! ప్రాసంగికంగా నవలను గూర్చి చెబుతాను వక్కవిషయము.* అది మన సాంప్రదాయానికి

* "ప్రేమ ధర్మానికిలోంగి వుండాలని అంటారు (పురాణపంథావారు). నవ్యమార్గంవారు ధర్మమనేదే ప్రేమకులోంగి వుండవలెనంటారు. ఇది యిద్దరికీ వున్న తేడా! రెండూ అనాదులే!" అన్నారు మా గురువులు ఆదినారాయణశాస్త్రిగారు. కాని ప్రేమవ్యక్తిగతం, ధర్మంసంఘగతం కూడాను. వ్యక్తిసంఘచితుడు. సంఘం

విరుద్ధం. ఎక్కడనైనా గాంధర్వవివాహమున్న కులాల్లోతప్ప స్వచ్ఛంద ప్రేమ మన సాంప్రదాయనికి విరుద్ధం! అందుకనే మన పూర్వ సంస్కృతకవులు నాటకరచనచేశినప్పుడు సామాన్యంగా క్షత్రియులనే నాయికా నాయకులుగా కల్పించారు. అట్లా కానివి చాలా తక్కువగా మాలతీమాధవంలాటివి క్వాచిత్కంగా వున్నై! ప్రహసనాదుల్లో విటాదులుంటారు కాబట్టి యీ సంప్రదాయ విరుద్ధత్వం వాటిలోలేదు. నవలసంగ తెత్తుకుంటే ప్రాయసగాళ్లంతా కూడా కథల్లో స్వచ్ఛందప్రేమనే వర్ణించారు. పోనీ క్షత్రియులనే పాత్రలుగా గ్రహించారా? లేదు! ఇది సంప్రదాయవిరుద్ధం! వస్తు నూతనత్వానికితోడీ సంప్రదాయ నూతనత్వం రెండోది! ఇది సమంజసమే! ఈ నూతన వాఙ్మయానికీ నూతనత్వాలూ తగినవే! * కాని వీటిని చదువుతూవుంటే కొత్తపట్టణంవెళ్లిదోవతెలియకా, భాషరాకా, తంటాలు పడుతున్నట్టుంటుంది. ఈ నవలా వాఙ్మయం యువకుల చిత్తవృత్తుల్లో చాలా మార్పుకలగజేసింది. వీటిలో కొన్ని అపమార్గాల్లో నడిచినై! చిన్నకథకు కూడా యీ దోషం పట్టింది కొన్నిస్థలాల్లో! అసలు కావ్యానికీ నీతికీ సంబంధముండాలా అనేది గొప్ప ప్రశ్న. స్థలాంతరంలో దాన్నిగూర్చి ముచ్చటిస్తాను. కాని సంప్రదాయ విరుద్ధాలను రాశి సంఘవిప్లవానికి దారితీయటంగాని, అవినీతిని సంఘంలో ప్రోత్సహించడంగాని సారస్వతసేవకులు చేయతగినపని కాదు. ఒకవేళ అటువంటి వాటిని నవలలో గాని, నాటకంలోగాని, కథానికలోగాని చిత్రించవలసి వస్తే వీటినిగూర్చి ఉత్సాహం కలగజేయకుండా తద్వైముఖ్యం పాఠకుల్లో కలిగించడం

విశాలం. ధర్మాన్ని యింకా పెంచితే సృష్టి అంత విశాలం. ధర్మానికి వ్యక్తి లోబడకపోతే అవ్యక్తిదేశశత్రువనీ, అర్థకామాలు ధర్మానికి లోబడి వుండాలనీ, అది ప్రాచ్య సంప్రదాయమనీ సవినయంగా మనవి.

* తగినవేగాకుండా అవశ్యోపాదేయాలు. నవల సారస్వత వీధులలో వకముఖ్యమైనది! అది అసహజమైనా ఆకాలానికి, యిప్పటి కాలానికి తప్పక సాధించదగినదే!

కవికుమారుడి కర్తవ్యం. ఇదొక విషయం. రెండోది, సాధ్యమైనంత వరకు మన జాతిచరిత్రనూ, జీవితాన్నీ గ్రహించి నవలలను రాస్తే, వాటివల్ల భాషకూ, సారస్వతానికీ, జాతికీ కలిగే ఉపకారం అపారం. ఇటువంటివి అత్యల్పాలుగా వున్నై! ఇటీవల అనగా యుద్ధానంతరం మన సారస్వతకుమారులు కొందరు కొంచెంగా తమ ఖండకావ్యాల్లోనూ, నవలల్లోనూ, కథానికల్లోనూ, స్వదేశసంచారం మొదలు పెట్టారు. ముదావహం! ఈ తరంలో నవ్యతతోపాటు పూర్వ శౌర్యాన్నీ పూర్వౌన్నత్యాన్నీ మరవనివారు రాయప్రోలు విశ్వనాథలు.

బొబ్బిలిపాటను నాటకంగా రచించి సారస్వతశోభ కలగజేసినందుకు శ్రీపాదవారికి యావదాంధ్రదేశమూ కృతజ్ఞం. ఇటువంటి నాటకా లింకా వెలువడాలె! వేదంవారి ప్రతాపరుద్రీయం కాకతీయ సామ్రాజ్యానికి సంబంధించి, చాణక్యుడి తర్వాత రాజనీతికి గురుపీఠమైనట్టీ, ఆంధ్రుడైనట్టీ యుగంధరుడి ప్రతిభనూ, రాజనీతినీ, ప్రతిబింబింపజేసిన నాటకం. దీనిలోవున్న కొన్ని విశేషాలు వెనక మనవి చేశాను. పైవిగాక యిక వకటి-నాటకం యీతరంలో ఆంగ్లాంధ్రులకు చాలా ప్రియమైందుంది. కన్యాశుల్కం చాలా గొప్పసాంఘిక నాటకం. ఇందులో కవి ఉద్దేశ్యం, పరిస్థితులను వున్నవాటి నున్నట్టు చిత్రించడం! ఈ పని చాలా గొప్పగా నిర్వర్తించాడు. అప్పట్లో తనవంటి ఆంగ్లాంధ్రులకు సంతోష దాయకంగా "గిరీశం" పాత్రను సృష్టించాడు! ఆంగ్లంచదువుకున్న అందులో గోదావరిదాటిన ఆంధ్రులకు గిరీశం ఉపలక్షకుడు. వాళ్లు పూర్వాచారపరాయణులను హేళనచెయ్యడం, అకార్యకరణాలకు వెనుదీయకపోవడం, వ్యభిచారం, ధనార్జనలో మోసంచెయ్యడం, సంఘసంస్కార మనేపేరుతో పాపకార్యాచరణం, స్వార్థపరత్వం, అంతరాత్మను జేబులో దాచుకోడం, తుదకు దేవుణ్ణి హేళన చెయ్యడం, మొదలైన అనేకగుణాలను చాలా హృద

యంగమ్యంగానూ, అభిమాన ... శంతుడికి మనస్సు గుచ్చుకునేటట్టూ, సహజంగానూ వర్ణించాడు. *ఇది గొప్ప హాస్యప్రధానమైన సాంఘిక నాటకం. కాని ప్రతాపరుద్రీయాన్నీ దీన్నీ తారతమ్యచర్చ చెయ్యవలసివస్తే కొన్ని విషయాలు చెప్పాలి. కన్యాశుల్కం మొదటి భాగమంత ఉత్తేజకరంగానూ, రసవంతంగానూ లేదు తుదిభాగం. పరిణామంలో కొంత అల్లరి వున్నది. ప్రతాపరుద్రీయ మట్లాకాదు. ఆమూలాగ్రంగా ఉత్తేజకరమూ రసవంతమూనూ! తుదివరకు కథలో యెక్కడా తీవ్రతగాని, రుచిగాని తగ్గదు! నీతిదాయకత్వ విషయంలో వకటి సంఘ నీతికీ; రెండోది రాజనీతికీ ప్రాముఖ్య మిచ్చినై. కాని కన్యాశుల్కం నిర్వహించిన సంఘనీతికంటె, ప్రతాపరుద్రీయం నిర్వహించిన రాజనీతి సమంజసమూ, సమగ్రపరిణామవంతమూను! ప్రదర్శనమంతా చూచిన వాళ్ల హృదయాల్లో ప్రతాపరుద్రీయం కలగచేసే ప్రాభవం కన్యాశుల్కం కలగ చెయ్యదు. పై అన్నిటికంటె విశేషమింకోటుంది. కన్యాశుల్కాన్ని సకలాంధ్ర జనమూ చూచిగాని చదివిగాని ఆనందించ లేరు. అది ఆంధ్రాంగ్ల మిశ్రం! అందుచేత ఆంగ్లంరాని ఆంధ్రులు రసాస్వాదనం చెయ్యలేరు. ఇది చాలా గొప్పలోపం. ఈ కాలంలో కావ్యాలనూ, నాటకాలనూ, రాశేవాళ్లు కొందరు చేసే లోపమే యిది! ఆంగ్లం చదువుకోని ఆంధ్రులు వాళ్ల దృష్టిలో లేరు. మళ్ళీ చెప్పుకోడం సామాన్య ప్రజాజీవనం వెనకటి సారస్వతంలో ప్రతిబింబించడం లేదని! ఆంగ్లవిద్య తెలిసినవాళ్ళు చాలా తక్కువ. ఇంతకంటె సంస్కృతమాటలు అర్థం చేసుకోగలవాళ్ళు

"ఆంధ్రుల హృదయముల నాకర్షించిన నాటకములలో కన్యాశుల్కము అగ్రగణ్యము...."గిరీశము" పేరు ఆంధ్రదేశములో జనరూఢమైనది. ఏయే గుణములు కన్యాశుల్కములోని గిరీశమునకు కలవో, అందులో డంబములు పల్కుతూ నలుగురిని మోసపుచ్చి వేషమునువేస్తూ ఉండే లక్షణములు గల వానిని గిరీశమనడం వాడుకలోనికి వచ్చినది. కన్యాశుల్క నాటకము మూలబడినా గిరీశం పేరు మాత్రం శాశ్వతంగా నిలిచి ఉంటుందని చెప్పవచ్చును" (భారతి)

సంఖ్య చాలా యెక్కువ. ఈ [illegible] సందర్భంలో మనవి చేశాను. నాటక[illegible] యిట్లా లేదే అనవచ్చు! ముఖ్య పాత్రైన గిరీశపాత్రనే అర్థం చేసుకుని రసాస్వాదనం చెయ్యలేకపోతే యింకేముంది? పానుగంటివారి హాస్యప్రధాననాటకాలు యింతకంటె అధికసంఖ్యాకులను తృప్తిపరచ గలవు. కంఠాభరణం చూడండి. అందులో వున్న హాస్యాలూ, నవ్వులూ, పురాతనులూ అందరూ ఆస్వాదించ గలరు. కాబట్టి యీ సంకుచితత్వం, ఏకదేశిత్వం దానికి చాలా విలువ తగ్గించిందని గట్టిగా చెప్పవచ్చు.* పానుగంటి వారి "రాధాకృష్ణ" భక్తిరసప్రధానమైన నాటకం. ఇందులో గ్రంథకర్త భక్తిరసాన్నీ, శేషశేషిభావాన్నీ పరాకోటి కెక్కించాడు. "రాధాకృష్ణ"లో కొన్నిపద్యాలు చదువుతూవుంటే గ్రంథకర్తగారికే ఆనందబాష్పాలు వచ్చేవి. ఆయన తాను రసాన్ని అనుభవిస్తూ రాశాడు. ధన్యుడైనాడు. కృష్ణుడికి యితర నాయికా సంగమంతో కలిగిన శృంగారచిహ్నాలు చూచినప్పుడు రాధ కండ్లుమూసుకుని చూడలేకపోవడందగ్గిర ఆధునిక కవికుమారుడి ప్రేమ పావి

---

* విక్రమభాద్రపదం భారతిలో వక విమర్శకుడు కన్యాశుల్కాన్ని సమీక్షిస్తూ యిట్లా అన్నాడు.

"నిస్సందేహంగా, ప్రాపంచిక వ్యాపారాలను, మానవచిత్తవృత్తులను చూపరకు సరియైన దృక్పథంలో నిలిపి నిరూపించడమే సారస్వతానికి ముఖ్యఆదర్శం కదా?"

కన్యాశుల్కం దృక్పథం సరియైనదేనా? ఈవిమర్శకవాక్యాలు "రియలిజం"కూ మనస్తత్వానికీ సంబంధించినవి. ఇంకా యిట్లా అన్నాడు.

"అందరిని రంజింపజేయడమే సారస్వతంయొక్క ముఖ్యధర్మ మని మనం ఒప్పుకుంటే, కన్యాశుల్కం—పండితులను, పామరులను, స్త్రీలను, పురుషులను, ఆబాలగోపాలాన్ని ఆనందపరిచింది. పరుస్తున్నది, యికముందు పరుస్తుంది." ఇది తప్పక అతిశయోక్తి. "యింగ్లీషు తెలిసిన" అనే విశేషాన్ని వెనకటిదానికి కలిపితే ఈ విమర్శకుడిసంఖ్య సగంకంటె తగ్గిపోతుంది! ఈ విమర్శకుడికి యింగ్లీషు రానివారు బుద్ధిలో లేరు!

త్ర్యమూ, అమలిన శృంగారమూ తలపుకువస్తుంది. రాధకు శృంగా రార్చనమే పరమావధైనట్టు కనపడుతుంది! చింతామణి నాటకంలో వస్తువు చాలా హృదయంగమం. భావరచనల్లో యెక్కువ కౌశలం చూపకపోయినా కవికి వస్తువులో ఆద్యంతాలకుండే వైధర్మ్యమూ, దానికి సహకారులైన విషయాలూ నాటక రసపోషణంలో చాలా సహాయంచేసినై! మనజాతి చిత్తవృత్తిలో స్వాభావసిద్ధమైన మతాభిమానం, ఆస్తిక్యం, వకవేళ చిన్నతనంలో తృతీయపంథలో నడిచినప్పటికీ భగవత్కటాక్షం కలిగి వెనక్కు తిరిగి ఆ కారణంగా సంపూర్ణభక్తి కలగడం, మొదలైనవి నాటకానికి ఆహ్లాదకరత్వమిచ్చి తద్వారా ప్రజల నాకర్షించ గలిగిందీ నాటకం. ఇక ప్రహసనాల సంగతి అంత యెక్కువగా చెప్పక్కరలేదు. అవి యేవో ఫలహారా లుగా పనికొచ్చేవే గాని భోజనంవలే శాశ్వతప్రయోజనాలు కలవి కావు. వీరేశలింగంగారూ, చిలకమర్తివారూ, పానుగంటివారూ వీటిలో నిష్ణాతులు. అందులో తృతీయుల ప్రహసనాలు నిరంతర హాసోద్భేదకాలు! ఈ కాలం తర్వాత నాటకాల పోకడ చాలా మారింది. ఆ మార్పులను తర్వాత చూదాం!

ఈ విధంగా ప్రథమవింశతి వత్సరాంతానికి తెనుగుసారస్వతం యొక్క వైశాల్యం, పరిమితి, గాంభీర్యం, అన్నీకూడా యెక్కువై సకల హిందూదేశసారస్వతాల్లో తన స్థానాన్ని ఆక్రమించుకోటానికి తగినట్టి స్థితిలో వుంది. సాహిత్యపట్టణము విశాలమై, వివిధ విశాలవీధీ యుతమై, సారస్వతసేవకజనానికి సులభసంచలనస్థానమై, చూపర కాశ్చర్యము కొలిపి, "యెంత త్వరలో యెంత అభివృద్ధిఅయిందో చూడండి" అని ప్రతివారిచేత అనిపించుకుని, యింకా యితోధికస్థితికి వెళ్లే దోవలో వున్నది. 1914 సంవత్సరంలో ప్రారంభించిన యుద్ధం 1918 నాటికి పూర్తైంది. యుద్ధం యూరోపుఖండంలో చిత్తవృత్తుల్లో పరివర్తనం చేశినా మన దేశంలోమాత్రం వస్తువులధరలు హెచ్చడం,

జీవనం కొంచెం ఖరీదు కావడంతప్ప, మరేం అల్లరి కలగలేదు. "ఎండెన్" అనే వక క్రూసరు వచ్చి మద్రాసుకోస్తాలో కొంత ఉపద్రవం కలగజేసింది. అనేక వేలమంది సేనలో చేరి సామ్రాజ్యానికి సహాయం చేశారు. ద్రవ్యం చాలా దాన మిచ్చింది భారతదేశం! మిగిలిన విషయా లన్నీ యథాప్రకారంగా జరుగుతూనే వచ్చినై! బంగారం ధర హెచ్చింది. ధాన్యం వగైరాల ధరలుకూడా హెచ్చే వున్నై! అందుచేత యుద్ధం కొందరికి ఉపకారకమే అయింది. యుద్ధం రోజుల్లోనే దాదాపు నవ్యసాహిత్యపోషణ మంతా జరిగింది. యూరపులో వుండే యుద్ధానంతర కవితాపద్ధతులను ఇప్పుడు నెలకొల్పాలని శ్రమపడుతున్న మన యువకులంతా వెనకటియుద్ధంనాటికి పసివాళ్ళు. అందుచేత వాళ్ళరాతలప్రకారం వాళ్ళు వెలిబుచ్చే విషయాలన్నీ తెచ్చిపెట్టుకున్నవేకాని సహజాలు కావు. రక్తస్రావాలు, మాంసఖండాలు, భిన్నసంసారాలు, భిన్న దాంపత్యాలు, మొదలైన వన్నీ మానవులున్నన్నాళ్ళు వుండేవే! వాటిని చూశి లేనిఆవేశం తెచ్చుకో నక్కర్లేదు. కాంతంకథల్లో "ప్రణయ కలహం" వలే వుంది వీళ్ళ కథ. యుద్ధంలో సహాయం కోరినప్పుడూ, పొందినప్పుడూ భారతదేశానికి స్వయంనిర్ణయసూత్రం వర్తింపజేస్తా మని ఇంగ్లాండు ప్రభుత్వం వాగ్దత్తం చేశింది. మనవాళ్ళ దృష్టి అదివరకు ఆంధ్రరాష్ట్రంమీద కేంద్రీకృతమై ఉన్నది. ఈ వాగ్దానం వక్కమారు ఆ దృష్టిని అఖిల భారతవర్షంమీదికి తిప్పింది. యుద్ధమైనతర్వాత పాపం ఇండియా ప్రజలు నోట్లో వేలేసుకుని కూచున్నారు, ఎప్పుడు ఆ స్వరాజ్య ఫలం నోటిలో వేసుకుందామా అని! 1919 సంవత్సరారంభంతో నిరుత్సాహమైపోయింది. అదివరలో కాంగ్రెసు మితవాదుల చేతుల్లో వుండేది. వాళ్లు తీర్మానాలు చెయ్యడం, ప్రభుత్వానికి పంపడం, అవి బుట్టదాఖలవటం, యిట్లావుండేవి పరిస్థితులు. క్రమంగా లోకమాన్యుడి ప్రోద్బల మెక్కువైంది! ఆయన జాతికొక నూతన బలం చేకూ

ర్చాడు! పాపిష్టి దైవమిట్టి స్థితిలో ఆయనకు ఆయుర్భాగ్యమియ్య లేదు. ఆయన పరమపదించేటప్పటికి హిందూ ముసల్మానులు వకటిగా కలిసిపోవడానికి ఉద్యుక్తులవుతున్నారు. ఇట్టి స్థితిలో "యదా యదాహి" అన్నమాటలు పెదవుల మీద వుంటుండగా పరమ పదించిన తిలకుమహాశయునిఆత్మ గాంధీమహాత్ముడిలో దూరింది. ఆయన స్థానాన్నీయన ఆక్రమించుకున్నాడు. ఈన చేతుల్లో జాతీయ మహాసభ మంచి గట్టిపడ్డది. ఎప్పుడైతే ఆంగ్లవైఖరి కనిపెట్టాడో యిక ప్రయోజనం లేదని దేశాన్ని సిద్ధపరిచి సహాయనిరాకరణాన్ని అవలంబించేటట్టు జాతీయ మహాసభ చేత వొప్పించాడు. ఎదురొడ్డిన వాళ్లనందరినీ, దాసు నెహ్రూ మొదలైన మహామహుల్నందరినీ ఆకర్షించాడు. తన ప్రణాళికకు రాట్నాన్ని ఉపలక్షణంగా చేశాడు. బట్ట వదిలి గోచీ గ్రహించాడు. తురీయాశ్రమం తీసుకుంటేగాని, నాయకోత్తంసుడవటానికి వీల్లేదు! జాతినంతను వకవిధంగా ఉజ్జూతలూగించేశాడు. ఆయన తర్కానికి లొంగనివాడు లేడు. కులకక్షలన్నీ—వకక జస్టిసుపక్షం తప్ప—అన్నీనశించినై! ఎప్పుడైతే జాతంతా యేకీభవించేట్టు కనపడిందో ఆంగ్లదొరలు నిర్బంధవిధానాన్ని అమలులో పెట్టారు. స్వరాజ్యకాంక్షకోసం ఇతరరాష్ట్రాలతోపాటు ఆంధ్రరాష్ట్రం కూడా తన రాష్ట్రోద్యమం వదిలి అఖిల భారత సమస్యలో మునిగిపోయింది. సత్యాగ్రహం ప్రారంభమైంది. దేశంలో అన్ని రాష్ట్రాలూ దాన్ని అందుకున్నై. దేశందృష్టంతా రెండు మూడు వత్సరాలు సహాయ నిరాకరణంమీద కేంద్రీకరించడమైంది. కొందరు కవులు దేశభక్తినే విషయంగా చేసుకుని కావ్యాలు రచించారు. కొందరు గాయకులు దేశభక్తినే గానంచేశారు. కొందరు చిత్రకారులు దేశభక్తి పురికొల్పే చిత్రాలనే చిత్రించారు. పాఠశాలలు పాడుబడ్డై! న్యాయశాలలు శూన్యాలైనై! నాయకులంతా వకరితర్వాత వకరు జైళ్ళల్లోకి వెళ్ళారు. వెళ్లినప్రజలకు లెక్కలేదు.

జైలు శ్రీకృష్ణ జన్మస్థానమైంది! ఆదినాలు మళ్లి రావు! స్వర్ణాక్షరాలతో ముద్రించాలశిన దినాలు! అప్పటి ఉత్సాహం, నిర్భయం, దేశభక్తి మళ్లి యీ 20 సంవత్సరాలనించీ చూడలేదు. "ఒకదేశం సాంఘికంగాగాని, మతవిషయంగాగాని, రాజకీయంగాగాని, అలజడికి పాలైనప్పుడు మనుష్యుల హృదయాలు వకవిధమైన కలతచెందుతై." అని మొదట్లో మనవిచేశున్నాను. వీరేశలింగంగారి కాలంకంటె, గిడుగు రామమూర్తిగారి కాలంకంటె, యిప్పుడు యెక్కువ ఆందోళనకరమైన కాలం! ఈ కాలంలో యీ సాహిత్యవీధుల్లో యెట్టి సంచారం జరిగిందో తర్వాత భాగంలో చూదాం!

---

# నవ్యాంధ్ర సాహిత్యవీధులు

## ౧

### జాతీయ వాఙ్మయం :

"కవులు కొందరు దేశభక్తినే విషయంగా చేసుకుని కావ్యాలను రచించారు. కొందరు గాయకులు దేశభక్తినే గానంచేశారు. చిత్రకారులు దేశభక్తి పూరకాలైన చిత్రాలే చిత్రించారు" అని యీ శతాబ్ద ప్రథమ సంవత్సరాలను గూర్చి రాస్తూ మనవిచేశాను. యూరోపు దేశంలో కవికుమారులు సాక్షాత్తుగా కొంతమంది యుద్ధంలో స్వయంగా పాల్గొన్నారు. అవసరం వచ్చినప్పుడు యుద్ధం చేస్తూ గుంటల్లో అవకాశం దొరికినప్పుడు కావ్యాలు రచించారు. తుదకు అక్కడే ప్రాణాలుకూడా వదిలారు. విల్‌ఫ్రెడ్ ఓవెన్ అనే కవి 1918 సంవత్సరంలో ఫ్రాన్సులో యుద్ధంలో పాల్గొంటూ పరమ పదించాడు. అట్లాగే ఫ్రాంజుమారుక్ అనే జర్మన్ లలితకలో పాసకుడు 1916 సంవత్సరంలో యుద్ధంచేస్తూ వీరస్వర్గాన్ని చూరగొన్నాడు. ఈన వక లలితకళాసూత్రభాష్యం రచించాడు. గుంటల్లో తీరిక దొరికినప్పుడు గొప్ప లలితకళాభావాలను అత్యుదాత్తంగా వివరించాడు. ఈవిధంగా అనేక కవులున్నారు. వీళ్ల కావ్యాలు చూస్తూంటే కొన్ని విషయాలు కనపడతై. మొదటి దినాల్లో ఉత్సాహం ధైర్యం పురికొల్పడం; తర్వాత యుద్ధం ముగియక ఆలస్యమైనప్పుడు నిరుత్సాహం, ఎప్పుడు చావువస్తుందో అనే అనిశ్చయం, చూస్తున్న నాశనానికి జుగుప్స; తుదిదినాల్లో యుద్ధం చాలు అనేభావం, అప్పటి యింగ్లాండు రాజకీయవేత్తల కార్యాలు చూస్తూ అసంతృప్తి, మళ్లీ యుద్ధం వస్తుందనే సూచన; ఈవిధంగా మూడంత

స్తులున్నై ఆకాలపు సారస్వతంలో*! మన ఇప్పటి నవ్యసారస్వతంలో అనగా యుద్ధవాఙ్మయంలో వీటిలో యేదీ కనపడదు! ఎందుకు కన పడుతుంది? ఆ అనుభవాలు మనవాళ్లకేవీ లక్షణాలు కనపడ్డానికి! కాని ఆకాలంలో మరివక విధంగా మన కవుల హృదయాలు ప్రవర్తిం చినై! ఆ హృదయ పరివర్తనమే మన కవుల భావనవ్యతగా పరిణ మించింది! తర్వాత వత్సరాల్లో అనగా 1920 సంవత్సరానంతరం మన రాజకీయాందోళనా దినాల్లో వెనకటి ఆంగ్లకవిత్వ యుద్ధలక్షణాలు కొన్ని ఉన్నై! మొదటి సత్యాగ్రహదినాల్లో ధైర్యమూ, ఉత్సా హమూ కనపడుతుంది! తర్వాత త్వరలో రాజకీయసమస్య పరి ష్కారం కాకపోయేటప్పటికి అసంతృప్తి ఆందోళనా కనపడుతుంది! కాని ఆందోళనను పట్టుదలతో అనుసరించటంకూడా కనపడుతుంది! కాబట్టి ఆంగ్లకవిత్వయుద్ధగుణాలు సహాయనిరాకరణ దినాల్లో వెలు వడ్డ కొంత మన సారస్వతంలో కనపడతై! దీనిలో నవ్య లనుకొను వాళ్లుమాత్రం బహుళంగా పాల్గొనలేదు!

♦ ఈ కాలంలో గేయాలనూ, కావ్యాలనూ రాశినవాళ్ళలో బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, గరిమెళ్ల సత్యనారాయణ, బుచ్చి సుందర రామశాస్త్రి వగైరా గార్లను పేర్కొనాలె. లక్ష్మీకాంత కవిగారు "స్వారాజ్యరథం" "స్వరాజ్యసమస్య" అనే అత్యంత దేవభక్తపూరితా లైన ఖండకావ్యాలను రచించి ప్రకటించాడు. ఇవి చాలా హృద యాకర్షకంగా వుంటై. వీటిలో స్వరాజ్యోద్యమమూ, తదాకా రమూ, తత్ప్రచారమూ, తద్వివరణమూ, తిలక్ మహాశయుడు

*"*The men who came home from the war with decorations rubbed shoulders with the mutilated and the dead.*" "*It (Dadaism) expressed protest and resignation, disgust and fury.*" (*Modern German Art*)

♦ ఈ భాగాన్నిగూర్చి రాశేటప్పుడు నామనస్సు సంకోచిస్తున్నది. సారస్వతసేవే ఆశయంగాని మరోటికాక పోవడంచేతనూ, యీ సారస్వతాన్ని వదలడానికి వీల్లేదు కాబట్టిన్నీ, విషయకథనం అత్యవసరం కాబట్టిన్నీ, తదాకారమూ, తత్స్థానమూ తెల పడం నావిధి.

చేసిన సేవా, ఆయన తర్వాత నాయకత్వం గాంధీమహాత్ముడి హస్త గతమవడం ప్రజల కర్తవ్యం మిక్కిలి ఉత్సాహకరంగానూ హృదయం గమంగానూ చిత్రించాడు. సరసమై, నిర్దుష్టమై, వాక్య చిత్రాలతో కూడిన యీ ఖండకావ్యాలు తత్కాలంలో ప్రచారానికొచ్చిన కావ్యా లన్నిటిలోను సారస్వతదృష్టితో చూస్తే గొప్పవి.* ఒక్క పద్య మనువదిస్తాను.

"తరి గాంధీయుగ మేగుదెంచె నిక నేతద్భారతీయ స్వరా
జ్యరథం బాతని సారథిత్వమున వే సాగింపు డంచుర్జ జగ
ద్గురు డేగెన్ దివి లోకమాన్యు డవె యుద్ఘోషించె తూర్యధ్వనుల్
ఉరు తద్దివ్యరథంబు లాగుటకు రండో భారతీయప్రజల్ !"

ఇట్టి ఉద్బోధలతో నిండున్న దేశభక్తి పూరితమైన కావ్యాలివి. తర్వాత గరిమెళ్ల సత్యనారాయణగారి పేరాంధ్రదేశంలో అన్ని మూలలా వ్యాపించివున్నది. ఈన నాకు యల్. టి. క్లాసులో సహా ధ్యాయి. చాలా ఉత్సాహవంతుడు. 1920 డిసెంబరులో తన చదువు మానేశి స్వదేశోద్యమంలో చేరిపోయినాడు. మనిషి యెంతమాత్రం స్ఫురద్రూపి గాడు. బట్ట, కట్టు, జుట్లలో చాలా అశ్రద్ధ! ఎంత చూడ టానికి ఆకర్షణలేదో వాక్కులో అంత రస ముంది. ఈన గేయకవి. ఈన రాశిన గీతాల్లోకల్లా వకటిమాత్రం సర్వాంధ్రదేశం యెన్నటికి మరవని దున్నది. దాని మొదటి పాదాన్నిమాత్రం సూచిస్తాను.

"మాకొద్దీ............" ఈ పాటను 1921, 22, 23 సంవత్సరాలలో పాడని యువకుడు లేడు. యావ దాంధ్రదేశమూ పాకిపోయిన పాటయొక్క కర్త జాతికెంత ప్రియుడో వేరే చెప్ప పని లేదు! ఆంధ్రుల హృదయక్షేత్రాల్లో శాశ్వతస్థానమూ, ఆంధ్రసార స్వతంలో మృతిరహితమైనపేరూ సంపాదించుకున్నాడు. కాని యీన

* ఈన చేయితగిలిన ప్రతి విషయమూ సరసమేనని చెప్పడంలో యెట్టి అతిశ యోక్తి లేదు!

పేదతన మనుభవిస్తున్నాడు. దేశభక్తు లంతా దారిద్ర్యా న్ననుభ
వించటానికి వెనకాడకూడదు. వాళ్ళను భరించాలనే బాధ్యత
దేశం వహించడం లేదు. పైపెచ్చు వీళ్ళను నిందించటం! "ఎవ
రుద్యోగం వదలమన్నా రియన్ని?" అని వకప్రశ్న! వాళ్ల స్వార్థ
త్యాగం వల్లనే తాను సుఖజీవనం చెయ్యడం సంభవిస్తున్నదని యీ
సుఖజీవి కనిపించదు! ప్రపంచ ధర్మం! వెనకటి సహాయ నిరాకరణో
ద్యమంలో సత్యనారాయణగారివలె కష్టపడ్డవారు వేలకువేలున్నారు.
తుదకు కాంగ్రెసువా రధికారానికి వచ్చినప్పుడు కూడా వీళ్లకు
మోక్షం కలగలేదు. వకమారు 1921 సంవత్సరంలో వక సన్నివేశం
కలిగింది. ఆంధ్రదేశంలో నాయకులంతా జైళ్లకెళ్లారు. జాతీయ
విద్యోద్యమంలో పనిచేస్తున్నవాళ్లం మిగిలివున్నాం. మాకు రెండు
పూటలా కడుపునిండా తిండి లేదు. ఆ సరస్వతిని నమ్ముకుని ఉన్నాం.
తిలకు స్వరాజ్యనిధి ఉండే దప్పుడు. దానికి గాంధీగారు సర్వాధికారి.
ఆంధ్రదేశంలోవుండే జాతీయ పాఠశాలోపాధ్యాయులం చాలామందిమి
కలిసి గాంధీగారికి మహాజరొకటి పంపుకున్నాం. అందులో మాకు
శరీరపోషణ చేసుకోడానికి అవసరమని తమకెంత తోస్తుందో అంత
వేతనా న్నియ్యమని విన్నవించాం! "ఆంధ్రజాతీయ విద్యాపరిషత్తు"ని
వక కాంగ్రెసు పోషణలోవున్న సంస్థఉండేది. తత్పక్షాన వెళ్లింది మహా
జరు. గాంధిగారి దగ్గర్నించి వుత్తరం వస్తుందని అనుకుంటున్నాం.
అప్పుడాయన "యంగు ఇండియా" అనే వక పత్రిక ఆంగ్లభాషలో ప్రక
టిస్తూండేవాడు. అందులో వక వారంలో రాశాడు యీ సంగతి.
దాని అర్థ మిది. "ఇటువంటి మహాజ రొకటి నాకు వచ్చింది. నా
సానుభూతంతా వాళ్ళదే! కాని ప్రతిఫలం కోరి వీళ్ళు త్యాగం
చెయ్యలేదు. త్యాగానికి సేవే ప్రతిఫలం. కాబట్టి వాళ్ళంతా చావా
లశిన అవసరం వస్తే చావాలసిందే!" ఇది అమానుషమైన ప్రత్యు
త్తరం. తమవలె సర్వావస్థల్లో సర్వకాలం త్యాగం చెయ్యగలవాళ్లు

అందరూ అయితే భారతదేశానికి స్వరాజ్యమే అక్కర్లేదు. అంద
రక్తమాంసాలూ తనంత స్వార్థత్యాగం కలవి కావు. ఇప్పటికీ అసల
సూత్రం యిట్లాగే వుంది. ఒక్క జవహర్లాలుగారుమాత్రం సంయు
రాష్ట్రాల్లో కాంగ్రెసుసేవ చేసేవాళ్ళకు వేతనాల నేర్పాటు చేయ
టానికి ప్రణాళిక వేశి కొంత అమల్లో పెట్టాడు. గొప్ప గొప్ప నాయ
కులకు కావలసిన సౌకర్యాలన్నీ లభిస్తూనే వుంటై! ఇతరులు తమక
సమస్త సౌకర్యాలు చేస్తారని తెలిసీ, చాటుగా లక్షలు దాచుకు
పైకి పేదవాడని కనపడుతూ, సేవ చెయ్యడం సులువే! వీళ్ళల్లో
కొందరికి సామాన్యవాలంటీరు అనుభవించే కష్టాలు యెంతమాత్ర
తెలియవు. మళ్ళీ వీళ్లు సాధించిన అన్ని కార్యాలూ వాలంటీర్ల
సాధించిపెట్టినవే! అటువంటి వలంటీరు సత్యనారాయణగారు. చిత్ర
కారు డీయనపటాన్ని చిత్రించ లేదు! గొప్ప ఉపన్యాసకుడు కాడు
యెక్కువగా శబ్దం చేసే మనిషి కాడు! ప్రాతినిధ్యాని కేస్థాని
సంస్థకూ నిలవ లేదు! తుదకు సహకారోద్యమంలోకూడా పాల్గొ
లేదు. స్థానిక కాంగ్రెసుల్లోకూడా అధికారం లేదు. ఇక నెవ్వరు
చూస్తారీయన్ని? కాని యివ్వేవీ లక్ష్యం చెయ్యకుండా, మాబోటి
వాళ్ళవలె మెత్తబడి వెనక్కు వెళ్ళకుండా, ఇప్పటికీ యథాశక్తిగా
దేశసేవ చేస్తూనే వున్న దేశభక్తాగ్రేసరుడు! అర్థాన్నం తింటూ దేశసే
చేస్తున్నవాళ్లు నిజమైన దేశభక్తాగ్రేసరులు! పైనున్నవాళ్ళకు సమయ
మొచ్చినప్పుడేదో అవకాశం లభిస్తుంది! అటువంటి స్వార్థవిరహి
తుడు సత్యనారాయణగారు. ధన్యజీవి! ఇంకేం కావాలె? సమ
స్తాంధ్రుల జిహ్వాగ్రంలో వున్న గీతానికి నిర్మాత? నీ జన్మ ధన్యత
పొందింది! భావిఆంధ్రులు నిన్ను గీతగోవిందకర్తవలె నిరంతరగాన
చేస్తూ వుంటారు. మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు
కూడా ఆ దినాల్లో గొప్ప పాటలు రాశి దేశాభిమానం కలగజేసి
వాళ్ళల్లో వకడు. ఈన చూడటానికి ఆహ్లాదకరుడుగా కనబడే

గాని నోరు విప్పేటప్పటికి సమస్తాన్నివదల్లేరు యెదట వున్నవాళ్ళు. పద్యపఠనంలో యీనతో సమానులిప్పు డున్నవాళ్ళలో యెక్కు-వగా లేరు. ఈన రాశిన దేశీయగీతాలకు యీన "సమ్మానం" కూడా పొందాడు. ఈన పాటలు అతి మనోహరంగా రచించి స్వయంగా పాడేవాడు. వక్క- పాద మనువదిస్తాను.

"అంటరానివా రెవరోకారు మా
వెంటరానివారె."

ఈననుగూర్చి మళ్ళి తర్వాత చెప్పుకొనే అవకాశం వస్తుంది. ఇట్లాగే యీ కాలంలో అనేక గేయాలు రచింపబడ్డై! అప్పటి పరిస్థితులు వీటిలో ప్రతిబింబిస్తై! భారతదేశాని కెప్పుడైతే కోప 'మొచ్చినట్టు అంగ్లేయు లనుకున్నారో, భారత ప్రజలకు "నా విష్ణుః పృథివీపతిః" అనే నమ్మకమున్నది కాబట్టి యువరాజును పంపితే దేశమంతా రాజభక్తి పూరితమైపోతుందని, యిప్పుడు రాజ్యత్యాగం చేసిన విండ్సరు ప్రభువుగారిని (అప్పుడు యువరాజుగారు) యిక్క-డికి పంపారు. కాని భారతీయులు యీ సంచారాన్ని ఉదాసీనంగా చూచారు. ఈకింది గేయమందుకు తార్కా-ణము.

"ఏమయ్యో! యువరాజ!
ఎందు కొచ్చావయ్య! ఏమయ్యో!"

ఆ కాలంలో విఠల్‌భాయి పటేలుగారు యెసంబ్లీ ప్రెసిడెంటుగా వుండేవాడు. ఆయన యే విధంగానైనా యీ భారత సమస్యను ఉభయపక్షాల అనుకూల్యంతో పరిష్క-రింప జేదామని రీడింగు ప్రభువును, గాంధీగారితో మాట్లాడటానికి సమ్మతింప జేసి వక సంభాషణ యేర్పాటు చేశాడు. అప్పుడీ సమస్యంతా యిద్దరూ చర్చించారు! తర్వాత నే ప్రయోజనమేం లేక సహాయ నిరాకరణం ప్రారంభించాడు గాంధీగారు.

"రేడింగు గాంధీప్రభువు
మేడ మీాద కూరుచుండి
ఆడినట్టి మాటలకు,
అర్థమేమి తెలుపరోరన్నా ! చిన్నన్న !"

ఇది వక సంభాషణ రూపంగావుంది. గాంధీగారిమీాద దేశ ప్రజలకు నమ్మకం కలగజెయ్యాలె ! ఎట్లా కలుగుతుం దానమ్మకం ? ఆయన్ను ఆంధ్రదేశ మెరగదు ! ఆయన సేవ నుగ్గడించాలే !

"మమ్ముబ్రోవ, మహిని వెలసితివీ
మహాత్మాగాంధీ "

1. క్రూరులైన బోయరుల
ఘోరకష్టముల బడిన
భారతీయుల బాములుడిపితివీ॥
వారందర మొరవిని
భారతీయుల బాములుడిపితివీ॥ మహా॥

ఇది దక్షిణాఫ్రికా సత్యాగ్రహోద్యమోదంతం.

2. పంటలన్నీ మంటగలియగ,
పన్నులియ్యగలేని రైతుల,
విన్నపమాలించి బ్రోచితివీ
ఆ కైరాప్రజల
విన్నపమాలించి బ్రోచితివీ॥ మహా॥

ఇది కైరా రైతుసత్యాగ్రహోదంతం.

3. సహాయనిరాకరణదీక్ష
సాధనమూనూని నీవు
బానిసత్వముబాప నెంచితివీ

మున్నసను మునిగియు తెలియరేమండీ,
కానడామరి ఆఫ్రికాది
ఖండములలో నుండు వారలు
మనల బానిసలని దలంచుచు
మదిని చాలగ నేవగింతురు॥ దేశ॥

బ్రిటిషు సామ్రాజ్యంలో మనకు గౌరవం తక్కువనీ దాన్ని మనం గుర్తించడం లేదనీ దీని భావం.

3. అంటరానితనమె లేదండీ
మన దేశవాసుల
నందరిని నొక రీతి చూడండీ,
కంటి కగపడు నిమ్నజాతుల
నంటుకున్నను దోష మనుచును
కంటగింపక వారి మీా
వంటివారలవలె దలంచుచు॥ దేశ॥

ఇది అస్పృశ్యతానిరసనము: హరిజనసమస్య దీనిలో ఉద్బోధింపబడింది. ఈ విధంగా ఉద్యమాన్ని ప్రచారంచేశా డీ కవికుమారుడు.

ఒక కవి కుమారుడు భరతపుత్రుణ్ణి మేలుకోమని యీావిధంగా ప్రబోధించాడు.

"మేలుకొనుమీా! భరతపుత్రుడ
మేలుకొనుమీా! సుజనమిత్రుడ!
మేలుకొనుమీా! సచ్చరిత్రుడ!
మేలుకొనవయ్యా!
వత్సా!
మేలుకో!"

ఇటువంటి పాటలతో తెల్లవారుజామున స్వచ్ఛందసేవకులు

వీథుల్లో తిరిగి నిద్రమేల్కొలిపేవాళ్ళు. వీటిని "ప్రభాతభేరీ" లనేవారు. భూపాళరాగంలో పాడుతూంటే చాలాఉత్సాహం కల్పించేవీపాటలు. ఆ సంవత్సరాల్లో కాంగ్రెసు సమావేశాల కెళ్ళడ మొక యాత్ర. (మొన్న ఆంధ్రపత్రికలో "ప్రభాతభేరీ" అనే శీర్షికలో బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి వక గీతం రాశాడు. అందులో "ప్రభాతభేరి" అనే మాట రెండు సార్లు వచ్చిందికాబట్టి ఆ పేరు పెట్టాడను కుంటాను. "తడతడ" శబ్దమేతప్ప భేరీశబ్దమే వినపడదు చదివితే! ఇందులోకూడ ప్రణయమే! మెత్తపడిపోయింది భేరీ!)

ఈ కాలంలో కొన్ని పదాలుకూడా పుట్టాయి. ఒకదానిలో పుట్టు పూర్వోత్తరాలదగ్గిర్నించీ చరిత్రవిషయాలన్నీ చాలామట్టుకు మంచి చమత్కారంగా రసవంతంగా చెప్పాడు. భరతమాతకు నమస్కరించి తమ గొడవ చెప్పుకుంటున్నాడు భారతీయకుమారుడు.

"దండాలు దండాలు భరతమాతా
అవ్వ,
అందుకొని దీవించు ,,
రెండు వంద లేండ్లకింద
అల్ల,
కుంపినోడు దిగినాడె ,,
దిగి యూరకున్నాడ ,,
మాకు,
... ... ... ... ... ,,
కట్టలైన కొట్టకుండ ,,
చిన్న,
...... లాగినాడె ,,

* * *

తాటిచెట్లు వాటిపంట భరతమాతా
వాడి
తాతవచ్చి పాతినాడో ,, "

ఈ విధంగా తెనుగు నుడికారాలుగల చక్కని రసవచ్ఛైలిలో రాశా డీ కవికుమారుడు. ఇందులో ఆయుధశాసనం, మద్యపాన సమస్య, దేశాన్ని ఆర్థికంగా బలహీనంచెయ్యడం మొదలైన చారిత్రికార్థిక విషయాలు చక్కగా వర్ణింపబడ్డై!

మరో కవికుమారుడు భారతమాతృ సమాశ్వాసనమని కొన్ని చక్కని గేయాలను రచించాడు. ఈ విధంగా అనేకు లీ వీధిలో సాధనచేశారు. ఒకసాధకు డిట్లా తల్లిని ఓదార్చాడు.

"భరతమాతరో బాయుము, నీదుదుఃఖము,
కొరతేమిరా, కొరతేమిరా,
మనకింకగలుగు సౌఖ్యము"

కొన్నిట్లో నాయకు లొక్కొక్కర్ని ఉల్లేఖించి వారుచేసిన సేవకూడా చెప్పారుకొందరు. మరివక సాధకుడు భారతవర్షంలోవున్న పన్నులు చమత్కారం పేరొక్కన్నాడు చూడండి :—

"దండాలండోయ్, మే ముండలేమండోయ్
బాబు॥ దండా॥
ఉప్పుకును, పన్ను బాబు
పప్పుకును, పన్ను బాబు
కొప్పు కాస్త, దేవుడికి
వొప్పుకుంటె, పన్ను బాబు॥ దండా॥"

ఈ గేయాల్లో కొన్ని భాగాలు వెనకటి యిప్పటి పరిస్థితులలో వుండే భేదాన్ని తెల్పుతై! రాజకీయంలో చూస్తే వక కాలంలో రాజద్రోహం మరోతరంలో కాదు. 1907 సంవత్సరంలో స్వరాజ్య పదం అంటే రాజద్రోహం! తర్వాత అది పరిపాటిపదమైపోయింది.

అట్లాగే ఉప్పుసంగతీని. గాంధీగారు ఉప్పుసత్యాగ్రహం చేసింతర్వాత ఉప్పు పండే స్థలాలదగ్గర వున్నవాళ్లు ఉప్పును తమ స్వంత ఉపయో గానికీ, స్వయంగా నెత్తిమీద మోసుకొనిపోయి వర్తకం చేసుకోటా నికీ సర్కారువారు వొప్పుకున్నారు.

" పన్నెండు దేశాలు పండుతున్నాగాని
పట్టెడన్నమె లోపమండీ
ఉప్పు ముట్టుకుంటె దోషమండీ"

మన భారతదేశంలో 12 రాష్ట్రాలున్నై! బాగాపండుతున్నై! కాని కరువు పరిస్థితులే! ఉప్పు ముట్టుకోకూడదు! ఆ కాలంలో ఉప్పుముట్టుకుంటే తప్పే! అందుచేతనే గాంధీగారు ఉప్పుమీద సత్యాగ్రహం చేశాడు! మరోటి. ఆరోజుల్లో గాంధిటోపి పెట్టుకో కూడదని వక కలెక్టరుగా రుత్తరువిచ్చారు. ఈసంగతి పార్లమెంటు దాకా పోయింది! యెవరైనా రాట్నపరిశ్రమ బళ్ళో పెడితే అదితప్పు! ఇప్పుడు గృహపరిశ్రమ కింద సర్కారువారే దాన్ని వప్పుకున్నారు! ఈ విధంగా మారినై పరిస్థితులు.

" గాంధిటోపీపెట్టి, పాఠశాలల్లోకి
రావద్దు రావద్దంటాడు,
రాట్నం బళ్ళో పెట్టవద్దంటాడు,
రాజద్రోహమంతా, రాట్నములో వున్న

ఇది చరిత్రవిషయమైపోయింది. తుద కా కాలంలో గాంధి నొక దేవుడిగా భావించి ఆయనకు దేవుడికి పాడినట్టు హారతులు కూడా పాడేవారు.

" జయ గాంధిదేవా మంగళం
జయ మంగళంబు నీకు ॥జయ॥
1. సత్యాగ్రహాశ్రమతాపసా
శాంతస్వభావమానసా ॥జయ॥

2. అరవిందసంస్తుతిపాత్రమా
వర షౌకతాలిమిత్రమా ॥జయ॥

3. ...... పరిభవఖేదనా
నవ్యభారతీయపాలనా ॥జయ॥

4. స్వారాజ్యమంత్రవ్యాపనా
కస్తూరిసాధ్వీవల్లభా ॥జయ॥"

ఇందులోకూడా అప్పట్లో ఉండీ యిప్పుడు అంతరించిన సత్యాగ్రహాశ్రమసంగతి, అప్పుడు గాంధీగారికీ షౌకతాలీగారికీ మిక్కిలి స్నేహ ముండేదని ద్యోతకమవుతున్నది.* మరిన్నీ అరవిందఘోషు గారుకూడా గాంధిగారిని తమ రౌనర్చే సేవకై కొనియాడినట్టుకూడా తెలుస్తున్నది. ఈ విధంగా ఆ కాలంలో తాత్కాలికపరిస్థితులను గూర్చీ, చారిత్రకరాజకీయార్థికవిషయాలనుగూర్చీ, కాలోచితంగానూ, ఉత్సాహజనకంగానూ, రసవంతంగానూ పాడి యితరులచేత పాడింపించారు కొందరు కవులు. నాయకులు చెప్పే ఉపన్యాసాలకంటె యీ పాటలూ పద్యాలూ చాలా ప్రచారంచేసినై! మా అప్పారావు కూడా ఆ కాలంలో యీ ఉద్యమప్రచారం చేశిన మనిషి.

"కొల్లాయి గట్టితే నేమి
మా గాంధి
కోమటై పుట్టితే నేమి?"

మొదలైన గేయా లప్పటివే! అత నీ ఉద్యమంలో మునిగిపోయి వృత్తినికూడా వదిలేశి తిరిగాడు! భావోన్మాదికాబట్టి యీ ఉద్యమమాయన్ని ఆకర్షించింది! ఈ విధంగానే కొందరు మద్యపాననిషేధాన్నిగూర్చి గేయాలను రచించారు. మరికొందరు పాఠశాలాబహిష్కారాన్నిగూర్చిన్నీ యింకా కొందరు యితర విషయాలనుగూర్చి

*"మహాత్మగాంధికిని, మౌలానాషౌకత్లీ మహమ్మదాలికి జై జై జై!"

చాలా హృదయంగమంగా పాడారు.* వీరు యీ పాటలను పాడుతూ వక వూరునించీ మరివక వూరికి పోతూవుండేవారు. ఎక్కడ నైనా పెద్ద సభ జరిగేటప్పు డీ పాటలను పాడుతూ ద్వారందగ్గర వాలంటీర్లు నిల్చునిఉంటే ఉపన్యాసవేదికదగ్గరకంటె యీ గేయాలను వింటూ అధికసంఖ్యాకు లుండేవారు. అట్లా ఆకర్షించే వీ గేయాలు!♦

## ౨

## నవ్యసాహిత్యం, అనువృత్తి, అభివృద్ధి :

†సాహితి వెనకటి సంచికలు తిరగేస్తే యిదివరలో నేను మనవి చేసిన సాహితీసమితి సభ్యులేగాక అనేక వ్రాయసగాండ్లు కన పడతారు. సాహితీసమితిసభ్యులు కొందరు చెప్పుకునేవాండ్లుకారు. మరికొందరు చాలా గర్వంతో ఆసంగతి చెప్పుకునేవాళ్ళు. వెనక పేరొకన్నవాళ్లుగాక నూతనుల్లో కొన్నిపేర్లు మనకు చాలా ఆదర

* దువ్వూరి రామిరెడ్డిగారు "రాట్నపుపాట" మొదలైన కొన్ని గేయాలు రచించాడు.

♦ వీళ్లే గాక దామరాజు పుండరీకాక్షుడుగారు ఆ కాలంలో దేశభక్తిపూరితాలైన నాటకాలను రాశాడు. నటకు లాడితే ప్రజలు ఆనందించారు. విశాఖపట్నం రోజ న్నీలో సీతారామరాజనే క్షత్రియు డొక "పతూరీ" లేవాడు. ఆయనమీద కొన్ని పాటలు రచించారు కొందరు.

† నోరి నరసింహశాస్త్రిగారు నవ్యకవులలక్షణా లివి అని యీ క్రిందివిధంగా సెలవిచ్చారు.

"అందులో మొదటిది లాక్షణికులమీద దండయాత్ర. పాశ్చాత్యకవిత్వపద్ధతుల మీద ఆదరం. పూర్వకవిత్వంమీద నిరసన లేకపోయినా నిరసనవలె స్థూలదృష్టికి కన పడే మాటలు వాడడమూ. ఆధునికులమీద అభిమానము. కవుల నిరంకుశత్వము చాటిం చడమూ". ఈ వ్యాసంలోనే తర్వాత చదివితే "భావకవిత్వము" "నవ్యకవిత్వము" అనే మాటలుకూడా వక లక్షణమని కనపడుతుంది. ఇవన్ని రాయప్రోలువారి గ్రంథాల పీఠికల్లోనించి గ్రహించినట్లుకూడా చెప్పారు.

పాత్రులవి. వేమల, విశ్వనాథ, కొమాండూరు, దువ్వూరి, పెనమర్తి, నాయని, అడివి, మొదలైన సుప్రసిద్ధ నవ్యాంధ్రసాధకులు కనపడతారు. వీళ్ళలో కొందరు గద్యపద్యవీధుల్లో రెండిటిలోను సాధన చేసినవారున్నారు. వేదుల, విశ్వనాథ, కొమాండూరు, నాయని గార్లలో అప్పటికే తర్వాత సిద్ధహస్తులయ్యే పోకడలు కనబడుతున్నై! భాషాభావమూ కూడా వ్యక్తిత్వాన్నిపొంది, నవ్యతను చూపుతూనే వున్నై! ఉభయసాధకులుగావున్నా కొందఱు తర్వాత తమ ప్రత్యేకతను యేదోవకటిదాన్లోనే చూపారు. కొందరు రెంటిల్లోకూడా తమ శక్తిని వ్యక్తీకరించారు. ఈమార్గసాధకుల్లో కొందరప్పటికే కావ్యాలను ప్రచురించారు. దువ్వూరి రామిరెడ్డిగారు కొన్ని రచించారని వెనక మనవిచేశాను. 1921 నాటికే యీన చకటని "కృషీవలుడ"నే జానపదకావ్యం వ్రాయగలవాడని రామలింగారెడ్డి ప్రభృతులు చెప్పారు. ఆయన ఆవిధమైన సాధనలో కృషిచేస్తూనే వున్నాడు. రెడ్డిగారిట్లాఅన్నాడు యీన్నిగూర్చి,

"ఈ గ్రంథమునందు పొలముకాపులయు, కాపుటిల్లాండ్రయు, దైనందిన చర్యలతో ఋతువర్ణనములను కవి బహు చమత్కారముగా సమన్వయించియున్నాడు.......... ఇందు గ్రామాంతర నివాసము, వ్యవసాయవృత్తి, ఇత్యాది ప్రకృతి సామీప్య జీవితమునకును మనుష్యస్వభావ ప్రవృత్తికిని ఉండు సంబంధము చూపబడియున్నది." 1920 నాటికే నాల్గు పెద్దకావ్యాలను రాశాడు.

నోరి నరిసింహశాస్త్రిగా రప్పటికే "సోమనాథ విజయ"మనే నాటకం రచించి ప్రచురించాడు. ఇది మహమ్మద్ గజినీ సోమనాథ దేవాలయ ముట్టడిని కీర్తించిన కావ్యం. ఈగ్రంథంమీాద విమర్శనలో వున్న దీ వాక్యం.

"భగవంతుడు దీనరక్షకుడే అయినప్పటికీ, నిరంకుశులగు మహంతులు, అర్చకులు, భాగ్యవంతులు, మొదలగువారి మూలమున

దేవాలయములలో బంధింపబడి పేదవాండ్లకు అందుబాటులో లేకుం డుటను పలుమారు చూస్తూ వచ్చిన గ్రంథకర్త హృదయావేదనయే యీ నాటకమును రచించుటకు పురికొల్పినట్లున్నది." చూచారా కర్తగారి యీ తిరుగుబాటభిప్రాయం! నాటకం చాలా హృదయం గమంగా వుంటుంది. రచనలో నరసింహశాస్త్రిగారు, నైతికధర్మాల నుంచుకుని రాశేవాళ్లలో వకడు. చెప్పేదికూడా చక్కని సరసశైలిలో లలితభావాలలో, చెప్పగల సమర్థుడు.* కొమాండూరు కృష్ణమా చార్యులుగారు అప్పటికే సిద్ధహస్తత్వం చూపుతున్న కవికుమా రుడు. ఆయన "కుసుమాంజలి"నే పేరుతో వక ఖండకావ్య సంపుటి ప్రచురించాడు.♦ ఈన్ను గూర్చి అప్పటి విమర్శకులు రాశినారు యీ కింది వాక్యాలను.

---

* ఈనకు కర్ణాటభాషా పరిచయంకూడా వుంది. ఈన "మహిషాసురమర్దనం" అనే పేరుతో వకగొప్ప గ్రంథం రచిస్తున్నట్లు వినికిడి. ఈన "గీతమాలిక" తర్వాత ప్రకటింపబడ్డది. "నేటి ఆంధ్ర సాహితీలోకంలో సంస్కృతాంధ్రాంగ్ల సాహిత్యా లను విశేషంగా జీర్ణించుకొన్నవాళ్లలో వకడు" (వా. సో. ప్రతిభ. సం. 6 సం. 1) పాపం! యీనవి అనేక కావ్యాలను తగులబెట్టించి పుణ్యం కట్టుకున్నాడు సభాపతి గారు. చూడండీ కింది గీతం.

> "రూపుమాత్రపుం బూలెన్నొ రూపుమాసి
> పోయిన సెకాని పిందెపూల్ పుట్టబోవు
> పిందెలెన్నియొ నాశంబు నొందిగాని
> పూర్ణఫలమొండు నిలువగా బోదులతను".

ఈన వకమారు తనసహజ సరళప్రకృతికి తాత్కాలికంగా స్వస్తిచెప్పి "సిరో పాట"ని వక భీభత్స ఖండకావ్యం రచించాడు. అది చదివితే కవికృత్రిమచిత్తవృత్తి తెచ్చిపెట్టుకుని రాశినట్టే కనిపిస్తుంది.

♦ ఇంకా సంస్కృతంలోనించి "పాదుకాసహస్రం" "హర్షచరిత్రం" అనే గంథాల నాంధ్రీకరించాడు. ప్రాకృతంలోనించి "సేతుబంధ" కావ్యాన్ని తెనిగిం చాడు. ఈన్ను విద్వత్కవి అనచ్చు. పూర్వపు పండితులలో నవ్యత అలవడ్డవారిలో వకడు. ఇది చాలా అరుదు!

"విషయానుగుణ్యమగు శైలి నవలంబింపగల సమర్థుఁడీ కవి. ......ఇంత కఠినముగా వ్రాసిన కలమే యెంత కోమలముగా మార్ధవముగా మేఘమునకు స్వాగతమిచ్చుచున్నది!" ఈన చక్కని శైలిలో ఔచితిని సంపూర్ణముగా నిర్వహిస్తూ, నవ్యభావభూయిష్ఠమై రసవంతములైన కావ్యాలను రచియించగల సమర్థుడు. వీరేగాక వీరరాఘవస్వామిగారి కపాలకుండల యిప్పటికే రాసి ప్రచురించాడు. ఈ కాలానికి వారిదృష్టిలోనే నవ్యమార్గంలో సాధనచేసి ప్రోత్సాహం లేని కవుల పట్టికలు యిచ్చారు సాహితీపత్రికలో :—

"ఆధునిక కవులలో రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, రాయప్రోలు సుబ్బారావుగారు, అబ్బూరి రామకృష్ణారావుగారు, చిట్టావూరు కామేశ్వరరావుగారు, పాతూరి అంజయ్యగారు, బసవరాజు అప్పారావుగారు, పాటిబండ అప్పారావుగారు, దువ్వూరి రామిరెడ్డిగారు, నండూరు సుబ్బారావుగారు; (పైవారు సాహితీసమితిసభ్యులు కారన్నమాట.) ఇంకా సాహితీసమితి సభ్యుల్లో, చింతా దీక్షితులుగారు, వేదుల సత్యనారాయణశాస్త్రిగారు; దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, నోరి నరిసింహశాస్త్రిగారు మొదలగువారెంతమందియో చిత్తాకర్షకములగు కవితలు రచించగలవారుండియు, ప్రోత్సాహపరచువారు లేక, వారి కావ్యములనేకములు ప్రకటింపబడకుండుట, నవీనాంధ్రభాషావిదులకు తెలియని విషయముకాదు." ఈ అనువాదంతో వక్క విషయం తేటపడుతున్నది. ఇందులో రెండు లిస్టులున్నై!*

* ఈ రెండు లిస్టులలోనూ అడవి బాపిరాజు లేడు. కాని 1915 సంవత్సరం నించీ ఆయన పాటలు రాయడం ఆరంభించాడు. నకూ ఈప్రమోదఘటర్జీకీగల సంబంధం వెనక స్పృశించాను. ఈన కళాప్రియుడైన కూల్డ్రేదొరగారి శిష్యుడు. ఈ యిద్దరి దగ్గర లలితకళాప్రావీణ్యం గడించాడు. ఈన చిన్నప్పటినించీ "వెన్నెలబాల" అనగా "శశికళ" అనే వక ఉపాస్యదేవత నారాధించాడు. ఈన ఆజన్మలలితకళాజ్ఞాని. దేశభక్తుడు. ఆ దేవత ఈన కుజ్జీవిని. ఒక్కొక్కప్పుడు తల్లిగా, వకప్పుడు ప్రేయసిగా, మరొకప్పుడు దేవతగా ఈనభావనలో కొచ్చేది. తుదకీయన "శశికళా" తంత్ర

వాళ్లో మొదటి లిస్టులోవారు సాహితీసమితి సభ్యులుకారని ధృవ పడుతున్నది. అటువంటి మార్గదర్శకులగు రచయితలే సాహితీసమితిలో సభ్యులు కాకపోవడం చాలా ఆశ్చర్యాం! దాదాపు వీరినందరినీ — వకరిద్దరుతప్ప - నేనుకూడా పేర్కొ-నే ఉన్నాను. ఆకాలంలో సారస్వతవీధి సంచారంచేశే భాషాకుమారుల్లో వీరు ముఖ్యులు.

భా ష :

వీరి అప్పటి పై రాతలవల్ల రెండు విషయాలు తేలుతున్నై! మొదటిది, అప్పటి కీ దేశంలో వీరికి ఆదరణ సంపూర్తిగా కలగ

---

మొకటి కనిపెట్టి తత్సాధనలో పడ్డాడు. అనేక గీతాల్లో ఆ "శశికళ" నుద్దేశిస్తాడు. ఈన లలితకళాజ్ఞానం సర్వతోముఖం. ఈన అప్పారాయ మార్గానుయాయి. నండూరు మార్గాన్ని కూడా కొంత అనుసరించాడు. ఈన తన "శశికళ" ను గూర్చి చెప్పిన కొన్ని వాక్యా లనువదిస్తాను.

"నన్నుగన్న యీ పుణ్యాంధ్రభూమి నా ఉపాస్యదేవతయైన "శశికళ" కు విహారభూమి......ఈ తెలుగుతల్లి మూర్తి అర్థచంద్రాకృతి......సౌరబార్హస్పత్యము కాని చాంద్రమానం ఆంధ్రులకు కాలమానం. చంద్రప్రియ యగు రోహిణి నాకు జన్మతార. నా జాతకమున చంద్రునకు ఉచ్చస్థితి...... యీ ఆంధ్రమహావైభవ మంతా నా శశికళాదేవి విలాసవిన్యాసాలుగా కలలుగంటూ, కావ్యగాన శిల్పాకృతియైన నా వుపాస్యదేవతకు రూపకల్పన చేసుకుంటూ వుంటాను."

ఈన కవి, చిత్రకారుడు, నాట్యవేత్త. ఇదేమిటి, అదేమిటి, అన్ని లలితకళల్లోనూ విజ్ఞానవంతుడు. మెత్తని హృదయం, మంచి విగ్రహం కల్గి, చూచేవాళ్ళకు యీన కళాసక్తి యీన చేసే ప్రతి చేష్టలోనూ, కనపడుతుంది. అప్పారావు దానివలెనే వెన్నవంటి మనస్సు. మైత్రి - ఒకే యీనదానినే చెప్పాలె. ఈన కథలుకూడా చాలా హృదయంగమంగా వుంటై. వాటిలో వస్తువులుగా అన్ని లలితకళలనూ గ్రహించాడు.. ఈయన తనవీ నండూరు బసవరాజులవీ గీతాలు పాడుతూంటే ముగ్ధులై పోవలసిందే! నండూరు బసవరాజులతో అన్నివిధాలా దాదాపు సమానుడు. ఇతని చిత్రాలు కొన్ని చాలా ఉత్తమా లున్నై! ప్రతిభతో, ఊహాతో, సంస్కారంతో, విజ్ఞానంతో, ఆదర్శస్వరూపాలను చిత్రించగల సమర్థుడు. ఇన్ని ప్రజ్ఞలూ కలవా డాంధ్రుల్లో యిత డొక్కడే! గర్వపడవలసినవాడు దేశానికి!

లేదని! ఆంధ్రసాహిత్యపరిషత్తు చాలా బలమైన సంస్థగా వుంది. గిడుగువారి సహాయంతో వీరెంత శ్రమపడ్డా, యింకా దేశీయుల దృష్టి పూర్తిగా వీరివైపు తిరగలేదు. కాని బలంమాత్రం కూరుతున్నది. సుబ్బారావుగారి, అప్పారావుగారి నవ్యమార్గాలను రెండింటిని సంచరించేవాళ్లందరికీ వకవిధమైన సోదరత్వం కలిగివారందరూ సమానమైన భాషాసేవ చేస్తున్నారనే భావం కలగడం రెండోది! ఈ రెండోవిషయం చాలా గొప్పది! ఈవిధంగా యీ సమ్మేళనంలో కృషిచేశిం దీ సాహితీపత్రిక. ఈపత్రికా, సమితీకూడా యీ సోదరసాధకత్వం వీరిద్దరి మనస్సుల్లో కలగచెయ్యడం గొప్ప భాషాసారస్వతసేవ! కాబట్టి రెండురకాల భాషా గ్రాంథికవ్యావహారిక నవ్యులకుపాదేయమేననీ, భావనవ్యతే ముఖ్యమనీ, దీనివల్ల తేలుతున్నది. వీరు మళ్ళీ వాక్యాలంకారాలు భాషామతల్లికి నూతనాలంకారాలు కల్పించారు. ఈకాలపు రాతలవల్ల మూడు విషయాలు వ్యక్తమౌతున్నవి. (1) కావ్యం పద్యరూపంగా వున్నప్పుడు దాదాపు అందరూ చక్కని సాధ్యమైనంతవరకు చ్యుతసంస్కారంకానిభాషనే వాడుతూవచ్చారు. (2) గేయం రచించినప్పుడు వ్యావహారికం కొంద రుపయోగించినట్టు కనపడుతుంది. (3) వచనంలోనూ కథలోనూ కొద్దిమందితప్ప బహుళంగా వ్యావహారిక రచననే అనుసరించినట్టు స్పష్టం!* సాహితీసమితి సభ్యుల్లో వ్యావహారిక భాషోపయోగంలో పట్టుదలకలవాళ్ల రాతలు కూడా పద్యవిషయంలో మాత్రం యిట్టి పద్ధతినే అనుసరించినై. మునిమాణిక్యం వక గీతంలో,

---

* 31—7—40 ఆంధ్రపత్రికలో యిట్లా వుంది

"ఇప్పటివారు ప్రబంధరచనకు పూనుకున్న ఛందస్సు, వ్యాకరణం, కథావస్తువు రసపుష్టి గమనించి కవిత్వరచన చేయదగు ననియు, లేదా గేయకవిత్వమైన వ్యావహారిక భాష వాడవచ్చు ననియు"

(శివశంకరశాస్త్రిగారు)

"పాతదన్నది యెల్లను మారుతుంది
కొ త్తదానికి చోటిచ్చి తీరుతుంది"

అని రాశినా ఆగీతమే మిగిలిన భాగాలు చాలావరకు సలక్షణమైన భాషలో వున్నై!

ఎక్కడైనా యడాగమాలు, విసంధి, మొదలైనవాట్లో స్వాతంత్ర్యం వహించినా సామాన్యంగా వీరు భాషాసాంప్రదాయాలు వదలలేదనే చెప్పాలె. వేదులవారినిగూర్చి కందుకూరి రామభద్రరావుగారు రాశిన యీకింది వాక్యం గమనించండి.

"వారి భావనాశక్తి బలమైనది. వారు కవిసమయములను విడువలేదు. తెలుగుగడ్డను బుట్టిన యుత్తమ సాంప్రదాయముల నుల్లంఘించలేదు. వారి భాషకు ప్రాచీనుల పటిమయున్నది." చూచారా! యీన యెంత ప్రాచీన సాంప్రదాయాలను గౌరవించాడో? మునిమాణిక్యం రాసిన,

"పాడినదె పాడుచుంటివి పాతపాట"

అన్నప్పుడు పాటయొక్క ఆకారంగాక, భావమని అర్థంచేసుకుంటే యీనకూడా భావనవ్యతే గాని భాషావిషయమై నవ్యతాభినివేశం లేదనే చెప్పవచ్చు. అట్లాగే,

"నాకుమాత్రము నీగీతి నచ్చలేదు" అన్నప్పుడు కూడాను. చింతా దీక్షితులుగారు రాశిన మొదటిగీతాలలో "చంద్రార్పణము"ని వకటుంది. అది చాలా చక్కగావుంది. భాషకూడా చ్యుతసంస్కారమని చెప్పటానికి వీల్లేదు. మొదటిభాగం గీతము, రెండోది ద్విపద. రెండూకూడా వకేవిధమైన భాషలోవున్నై! కాకపోతే యీ కింది విధంగా,

"ఆడుదము పాడుదము రండు అందరమును" అని విసంధి చేశాడు. అది అంతవిశేషంకాదు. యతిప్రాసలను పూర్ణంగా పాటిం

చాడు. ఈనే గాకుండా దాదాపు అందరూకూడా చాలా నియమాలు పాటించనే పాటించారు. గీతాలు సాధనచేసినవాళ్లు కూడా కొందరు బొత్తుగా యీ విషయంలో యింకా వ్యావహారికభాష సంగీకరించినట్టు కనపడదు :—

"కాశీరత్నం పూసేచోట
పందిరిద్రాక్షలు పాకేచోట
కొండకోనలో
గంగాజలములు
మిలమిలలాడుచు మెఱసేవేళ
కలకలపాడవె, కవితాకన్య !"

పైదానిలో కొడాలి ఆంజనేయశర్మగారు గ్రహించిన నుడికారాలు చాలా హృదయంగమాలుగా వున్నై! "పూయుచోట" "ప్రాకుచోట" అంటే తప్పక భాషాపారుష్యం కలిగినట్టున్నూ యిట్లావుంటే శ్రవణసుఖంగా వున్నట్టున్నూ పాఠకులకు గోచర మౌతుంది.* రాయప్రోలు సుబ్బారావుగారీ విషయంలో యీక్రింది నియమాన్ని సెలవిచ్చారు.

"మృదుల సరళాక్షరముల సమ్మేళనాప్తి
నార్ద్రనవనీత మార్దవమగును నుడువు
శ్రవణసుఖమిచ్చు సలలితోచ్చారణమున;
భంగిమ యటందురీ పదబంధసరణి."

శ్రవణసుఖ మన్నిటికంటె ముఖ్యం నవ్యులకు. దాన్నే భంగిమ అన్నారు. ఈ విధంగా నవ్యులందరూ తమ కావ్యాల్లో ముఖ్యంగా అనుసరించిం దీ శ్రవణసుఖము. దీన్లో నవ్యులందరు దాదాపు సిద్ధహస్తులనే చెప్పాలె! ఈ ఆంజనేయశర్మగారు తమ

* భాషావిషయం వదిలితే యితర అన్నివిషయాల్లోనూ కావ్యంలో గీతం అంతర్భూతంగానే విషయవివేచనం చేశాను.

యితర "పెండ్లికూతురు" మొదలైన అనేక కావ్యాల్లో సలక్షణమైన భాషనే వాడాడు. అంతేకాకుండా యెక్కడా వ్యావహారిక ముపయోగించని గేయాలు కూడా వున్నై యీన కృతుల్లో! శివశంకరశాస్త్రిగారు తమ కావ్యాల్లో సామాన్యంగా సలక్షణ భాషనే వాడాడు. గేయాల్లోకూడా చాలామట్టుకు యెక్కడైనా తప్ప—చాలా అరుదుగా—సలక్షణమైన భాషనే వాడాడు. వేదుల వారు కూడా తమ గేయాల్లో చక్కని భాషను ఉపయోగించాడని వెనకనే చెప్పాను. నాయని సుబ్బారావుగారుకూడా చక్కని భాషే వాడాడు. వీళ్లూ వాళ్లేమిటి దాదాపు అందరూ పద్యకావ్యాల్లో సలక్షణ భాషనే వాడారు!* గేయాల్లోకూడా శ్రవణసుఖం కలగచేసే భాషనే వాడారు.

కవిత్వానికి మూడు ముఖ్యవిషయాలు. ఈ కింది ఆంగ్లలక్షణాన్ని చూడండి.

"Poetry is the artistic expression of human mind in emotional and rhythmical language".

దీనిలో మూడంశాలున్నై.

(1) Artistic expression
(2) Emotion
(3) Rhythmical language

దీన్నిబట్టి చూస్తే మొదటిదిచిత్తాన్ని, రెండోది హృదయాన్ని, మూడోది శ్రవణేంద్రియాన్ని, ఆనందింపజేస్తై యని తేలుతుంది. లోపల చదువుకున్నా చెవుకు వినపడుతూనే వుంటుంది. విననే అక్కర్లేదు శ్రవణసుఖం కనుక్కోటానికి. కాబట్టి శ్రవణేంద్రియం, హృదయం,

* ఇప్పటికింకా పద్యకావ్యాల్లో ఉచ్ఛృంఖల భాషోపయోగం చెయ్యడానికి కవికుమారులు వెనుకముందాడుతున్నారు. అట్లా రాశేవాళ్ళున్నా, వాళ్ళు వీళ్ళు కలిసి వక కుటుంబమనుకునే ఐక్యతే యేర్పడింది వీళ్ళలో. ఇది సాహితీసమితీ పత్రికా చేసిన గొప్పసేవ. ఈ ఐక్యమే నవ్యసాహిత్యపరిషత్తును లేవదీసింది. ఈ సోదరత్వం వుండబట్టే యీ సాహిత్యాని కింతబలం చేకూరింది.

చిత్తం, అనేవి మూడు సుఖపడాలె. వీటినే వెరక భావ, వస్తు, రచన లన్నది. భావం హృదయాన్ని, వస్తువు చిత్తాన్ని, రచన శ్రవణేంద్రియాన్ని, ఆనందింప చేస్తై! కాబట్టి శ్రవణసుఖం చాలా అవసరం! శ్రవణసుఖంకోసం వొక్కొక్కప్పుడు గొప్ప కవులుకూడా కొంచెం సంస్కారాన్ని వదిలేశారు. "పెక్కుచందాలం బండు" అన్నారు పెద్దన్నగారు మనుచరిత్రలో!* అవి పూర్వ కవిప్రయోగా లంటారు మన పెద్దలు! అట్టిదే మరోరు చేస్తే "యేడిశావులే" అంటారు! ఈ విధమైన శృంఖలాబద్ధులు కాకుండా శ్రవణసుఖాన్ని సహాయంగా చేసుకుని నవ్యకవికుమార్లు పాడడం చాలా ప్రశంసించ దగిన విషయం! ఈ దశాబ్ద ప్రథమవర్షాల్లో పంద్యారం వెంకట సుబ్బయ్య, కొత్తపల్లి సుబ్బన్నాచార్యులు, పెనుమర్తి వెంకటరత్నం గార్లు చక్కని శైలిలో బహురమణీయంగా రాశారు. వెంకటరత్నం కొడవటిగంటి వెంకటసుబ్బయ్య పూర్ణశర్మలవలె చాలా అభివృద్ధికి రాదగి, చక్కని ఫక్కిలో రాయడం మొదలుపెట్టి, అభివృద్ధిని సూచిస్తూవున్న దినాల్లో పరమేశ్వరుడు చెట్టును కొట్టేశాడు!♦ ఉద్రేకం చాలా యెక్కువగా వుండేది! భావంతో పొంగి పొర్లుతూ వుండేవి గీతాలు. నేను 1922—23 సంవత్సరాల్లో "విద్యార్థి" అనే పత్రికను బెజవాడలో సంపాదిస్తూండేవాడిని! అప్పుడు వెంకట రత్నంగార్ని అడిగిందితడవుగా పద్యాలు పంపించారు. చాలా ఆనందించి వందనాలతో ప్రచురించాను. అటువంటి వెంకటరత్నం

* "అల్లికజిగిబిగీ, ముద్దుపలుకూ, పదగుంభనమూ" కూడా అన్నింటికంటె ముందు శ్రవణసుఖమిచ్చే మిగిలిన రసాదుల నుత్ప్రత్తిచేశి ఆనందింపచేస్తై. "రాశీ రోయదు" "లేదుండగా" "భక్షింపకాబోయచే" "అంతా మిథ్య" మొదలైన ధూర్జటికవి ప్రయోగాలయొక్క హృదయంగమత్వానికి యీ శ్రవణసుఖమే మూలాధారం.

♦ జననం 1907 — మరణం 1930.

"రత్నాపణ"మనే పేరుతో యీన రాశిన కావ్యాలు ప్రకటితాలైనై. ఈన సోదరుడు కామేశ్వరరావుకూడా వక సాధకుడే!

లేనిలోటు చాలా సంవత్సరాలదాకా అనుకుంటూ వచ్చాం!* చాలా వృద్ధికాముడు! వీళ్లుగాక యికమిగిలిన సాహితీసమితి సభ్యులుకాని వాళ్ళల్లో నండూరు బసవరాజులు తప్ప దాదాపందరూ సలక్షణ భాషనే రాశారు. ఈ యిద్దర్లో బసవరాజు అటూయిటూకూడా రాశాడు. నండూరు మాత్రం కేవల జానపదభాషను గ్రహించి సిద్ధి పొందాడు. సలక్షణభాషకాక, వ్యావహారికమూగాక, కేవల జానపద భాషను గ్రహించి ఆ తరంలో సిద్ధిపొందినవాడు నండూరు వకడే!

భావ నవ్యత : ♦

> "నియతికృత నియమరహితాం
> హ్లాదైకమయీ మనన్యపరతంత్రాం
> నవరసరుచిరాం నిర్మితి
> మాదధతీ భారతీ కవేర్జయతి"

అన్నాడు మమ్మటుడు. కవిసృష్టి విలక్షణం. ఇట్లా లాక్షణికుడు చెబుతూవుంటే యీ వైలక్షణ్యానికికూడా కంచెవేశారు మన వాళ్లు కొందరు. లక్షణానికి అవస్థగాని వైలక్షణ్యానికి వైవిధ్యమే! అంటే మనవాళ్లొప్పుకోరు. ఈ వైలక్షణ్యాన్ని సాధించటానికి మన

---

* "శ్రీ వెంకటరత్నంగారు భావుకులగు యువకులు. వీరిది తెనాలి. వీరి సరస రచనము లాంధ్రవాఙ్మయ వధూటికి నూత్నాలంకారములు."

(భారతి : ప్రమోదూత భాద్రపదం)

♦ ఇప్పటి మన నవ్యులు కొందరు అప్పటి పాశ్చాత్యకవుల గ్రంథములు చదివినట్టు వీరి రాతలవలన తెలుస్తుంది. ఎందుచేతనంటే యుద్ధానంతరం అక్కడ వచ్చిన కవిత్వగుణాలు చాలామట్టుకు మనవాండ్ల రాతల్లోకూడా అనువృత్తాలైనై. "*Despair and its concomitants—satire and irony; realism, matter of factness......; and as a substitute for idealism, escape into a world of fantasy and fairy.*" (నిరాశ, దానితోకూడా వుండే అధిక్షేపం, వక్రోక్తి, యథాదర్శనం; నిజమైన భావనకుమారుగ భావోన్మాదం). ఇవి మన నవ్యులలో బాగా కనపడతై!

కవులు—మన కవులేకాదు యితరజాతి కవులుకూడా—తమ కను కూలమైన కొంత సామాగ్రిని యేర్పాటుచేసుకున్నారు. కొన్ని ఉప మానాలూ, కొన్ని కవిసమయాలూ, కొన్ని విలక్షణమైన హంస ల్లాంటి పక్షులూ, కోకిలావసంతాలలాంటి సహజమైత్రిగల అంశాలూ, మయూర సర్పాలవంటి సహజ శతృత్వంగలవీ, కమలంలాంటి కొన్ని పుష్పాలూ, సూర్య చంద్రోదయాస్తమయాదులూ, శృంగా రాదులైన రసాలూ, యిటువంటి కొంత సామాగ్రిని సేకరించు కున్నారు.* ఇవేగాక పరుషభావాలకూ, సరళభావాలకూ, ఉపయో గించే పరుషసరళశబ్దసామాగ్రికూడా ప్రతి కవీ తన కనుకూలమైన దాన్ని సేకరించుకుంటూ వుంటాడు. ఇవన్నీ అసలు కవియొక్క ప్రత్యేక చిత్తవృత్తిననుసరించి వుండాలశింది. కాని ప్రిబంధకాలంలో వీటిలో కొన్నిటిని మొదటి ప్రిబంధకవులు చాలా యెక్కువగా ఉప యోగించారు. వాటెని వ్యక్తిత్వం లేకుండా తర్వాతవాళ్లందరూ అనుసరించారు. అదే అలవాటైంది. దాన్ని భరించలేనివాళ్లను మన వాళ్ళు తిట్టడం మొదలెట్టారు. అటువంటి భావదాస్యంనించీ కవి త్వాన్ని తప్పించడం యీ నవ్యులు చేసిన వక గొప్పపని. వీళ్లలో యెవరైనా వెనకటి సామాగ్రినే వాడదలిస్తే వీళ్ళ నిషేధమేం లేదు. కొందరు ఆసామాగ్రినే వాడారుకూడాను. కాని వక్కటే సూత్రం. ఏట్లాఅయినా తీసుకురానీ, నవ్యతా, సౌలభ్యమూ తెస్తే చాలు! ఒకొక్కప్పుడు సౌలభ్యం కొరవడ్డా నవ్యతమాత్రం అవశ్య సంపాద్యం. ఈ నవ్యతకొరకు యీ పాతసామగ్రిలో కొన్ని యేరుకో

* ప్రకృతిలో అనంతవస్తువులున్నై. కాని వాటిలోనించీ యేరుకోడంలోనే వున్నది కవిప్రతిభ. అతనికి సహజంగావున్న సంస్కారాన్నిబట్టి యీసామగ్రిలో తనకు సహకారులైనవీ, ఉత్తమమైనవీ, అగపడతవి. వాటితోనే భావనకలిపి వాటికి హ్లాదైక మయతను కల్పిస్తాడు. అన్ని వస్తువులు కవితాసామాగ్రి కాగలవా అనేది వకప్రశ్న. కోలెరిడ్జి అనే ఆంగ్లవిమర్శకుడు రెండువిధాలుగా భాగించాడు. *"Poetic thoughts and thoughts translated into the language of poetry."*

ఇది వక ప్రకృతిదృశ్యము. మరో* ఆయనకు ప్రకృతి శేషము. తాను శేషి. కాబట్టి తా ననుభవించే విషయం! మరికొందరికి తమ కోరికలకు దోహదమిచ్చే సహకారి! కొందరికి తమ తాపాన్ని అభివృద్ధిచేసే వక కృతకశత్రువు. కొందరు యీ ప్రకృతిలో లీనమై పోతూవుంటారు.

"ఏ నొక సమీరబాలుడ నీ ప్రసవము
నాకు సమభాగినిగ కూర్చినా డతండు,
మా పరస్పరమును స్పర్శమాత్రమునన
పులకితబ్రహ్మపథమున బోవగలము."

(గిరికుమార)

ఈన రాయప్రోలువలె కేవల దర్శనమాత్ర, భాషణమాత్ర సుఖమే కాకుండా కొంచెం ముందుకు పోయి స్పర్శసుఖంకూడా వాంఛిస్తున్నాడు.

"లలిత కోమల సౌరభోజ్జ్వలసుమాళి
జెలగు వనముల సుఖ మపేక్షించు నెవడు,
అల్లిబిల్లిగ లత లల్లి చల్లనైన
చలువపందిళ్ళ గోరు నే సజ్జనుండు,
అత డెరుంగు మహానంద మనగ నేమొ
అరయు నాతండె సంతృప్తి యనగ నేమొ

---

*" వెక్కి వెక్కి రోదింతును విసువులేక
విరతిలేక దుర్భర శోకవిషమగీతు
లేడ్చివైతు: ఎలుంగెత్తి యేడ్చివైతు" (*Gloom, hopelessness*)

"కృష్ణశాస్త్రి పాపం నిజంగా బాధపడి వ్రాస్తాడో లేక భావించి వ్రాస్తాడో! ఆ విషాదకవిత్వం ఆయనకు చెల్లింది. కృష్ణపక్షంలో కంటే 'ప్రవాసం ఊర్వశి'లోని శాస్త్రినిచూస్తే 'అపిగ్రావరోది త్యపిదళతి వజ్రస్య హృదయం' అనుకుంటాను" అన్నాడు హనుమదింద్రగంటి.

అతడె నిజముగ ధన్యాత్ముం డనగ నొప్పు
నపరిమిత సౌఖ్యములదేలు నృపులకంటె"

(సుబ్బన్నాచార్యులు)

ఈనకు ప్రకృతి సంపూర్ణసౌఖ్యమిచ్చే శేషి. విశిష్టాద్వైత సిద్ధాంతానికి వక మెట్టు తక్కువ! ప్రకృతిమానవుల కున్న యీ సంబంధాన్ని పరమేశ్వరుడికీ మనకూ వర్తింపచేస్తే అదే విశిష్టాద్వైతసిద్ధాంతం. కాబట్టి యీన అనుభవంద్వారా ఆనందం పొందాలని కోరేవాళ్లల్లో వకడు!

"సహజసౌందర్యసద్వస్తుచయము జూచి
పరగ మది నుబ్బి సమ్మోదబాష్ప వారి
కణము లొలికింపని యతండు గణనసేయ
కడిదికలుబండయే యగుగాని నరుడె"

(పంద్యారం)

ఈనకు ప్రకృతి హృదయాన్ని కరిగించే వస్తువు. ప్రకృతిని చూచి ఆనందించనివాడి నెట్లా తిడుతున్నాడో చూడండి! కాని యీనకు ప్రకృతిలో వున్న అన్ని వస్తువులూ యిట్లాగే సహజసౌందర్యంతో కనిపిస్తాయా? అన్నిట్లోనూ యీ హాయి ననుభవిస్తాడో లేదో?

"అలరు చక్కదనంబు దయావిహీన
మయిన, నది నిష్కలంకమ్మె, హానికరము,
కానిచో దాని గాంచుటకంటె జగతి
కాముకున కిష్టతర మేమి గలదు చెపుమ?"

ఈన కాముకుడు. కాబట్టి యీనకు ప్రకృతిలో చక్కదనమున్నా ఒకొక్కప్పుడా చక్కదనంలో దయలేదు. దీనిలో వుండే పవిత్రత కాముకుడికి అటంకము.

"ప్రత్యుషఃఫుల్లనీరేజప్రసవమందు
హర్షసంగీతమును షట్పదాళి పాడె,
రాగ మెడలిన తనదు వియోగగీతి
చలితపత్రాళి వెలిదాల్చె కలవపూవు"

(పెనుమర్తి)

ఈనకు ప్రకృతి సుఖదుఃఖోభయమయము. ఈ విధంగ ఒక్కొక్క కవికి తచ్చిత్తవృత్తి ననుసరించి ప్రకృతి కనపడుతూ వుంటుంది.* మొత్తంమీద యీ విధంగా ప్రకృతిమీదికి దృష్టి సంపూర్తిగా మళ్లింది కవికుమారులకు. ఈ ప్రకృతి కొందరికి సరళగానూ, కొందరికి పరుషగానూ కనబడుతూవుంటుంది. అది కూడా వీళ్ల చిత్తవృత్తి ననుసరించేవుంటుంది. చిత్తవృత్తి అనుభవం మీద ఆధారపడివుంటుంది. వీళ్లు మొత్తంమీద ప్రకృతిరసానుభవం చేశినవాళ్లనటంలో యెట్టి అభ్యంతరం లేదు!♦ వేదులవారు, చూడండి యేమన్నారో!

"తృణము తృణమున శాంతివిరిసెను
దిక్కుదిక్కుల కాంతి నెరసెను"

---

*"కొందరు ప్రకృతిని దర్శించి పసిపిల్లలు ఆనందించినట్లుగా ఆనందించి, ఉన్నది ఉన్నట్లుగా వర్ణిస్తారు. ప్రకృతిలోని పదార్థ జాలాన్ని, కొందరు కవులు యింద్రియ సంబంధమైన వ్యామోహాన్ని పొంది ఆమె బాహ్యసౌందర్యాన్ని అభినందిస్తారు. వస్తువు కనుగుణమైన ప్రకృతిస్థితిని తీసుకుని నేపథ్యచిత్రణంచేస్తారు కొంతమంది. ఉపమా రూపకాలంకారాల కుపయోగించికొని అంతతో ఆమెకు స్వస్తిచెబుతారు కొంతమంది. ప్రకృతిలోని అతీంద్రియమైన శక్తిని గ్రహించి జగదేకమాతగా పూజిస్తారు కొంతమంది." (వా. సో. ప్రతిభ. సం. 6 సం. 1.)

♦"భావకవులందరూ అంతో యింతో ప్రకృత్యోపాసకులే! ఏ విషయాన్ని విస్మరించినా యీ కవుల ప్రకృతి కావ్యాలుమాత్రం ఉదాత్త భావబంధురములై, ఉత్తములై, ఆంధ్రవాఙ్మయానికి శిఖరప్రాయములుగా వున్నవనడంలో సాహసంగానీ అత్యుక్తిగాని యేమీలేదు" (పాటిబండ మాధవశర్మ)

ఈన వొక్కొక్కప్పుడు,

> "ఈ వ్యథాక్లిష్ట జీవితకావ్యమునకు
> నంతిమాశ్వాస శాంతిసమాప్తి యెప్పుడో ?"

అని భావంలో కలిగియేడ్చినా, మొత్తంమీద ఆమెను మృదుల బంధంలో చేర్చాలని తోస్తూ, శాంతీ కాంతీ కనపడుతూనేవుంటాయి. ♦పైన నేను మనవిచేసినవి ఆ కవుల సామాన్యచిత్తవృత్తులు! ఒక్కొక్కప్పుడు వీరికికూడా కొంత అశాంతి, నిరాశ,* భయము, కష్టము, అనేవి మనస్సులోకి రావచ్చు. వచ్చినా అసలుచిత్తవృత్తికి సహజమైన ప్రకృతి వచ్చేటప్పటికి యథాప్రకార ప్రవృత్తి కలిగిపోతుంది. ఈ విధంగా ప్రకృతిలో నటించి తత్సాన్నిధ్యంవల్ల తమ హృదయాల్లో కలిగే "స్వానుభవభాష్యాలను"† విప్పిచెప్పి తద్వారా

---

♦ ఆషాఢ మేఘానంతరం శరదుత్సవం శాంతినిస్తుంది. దేవులపల్లివారికివలె మోహన సంగీతంలో రోదనధ్వనులు వినపడవు. ఇదివరకు చిత్తవృత్తి యింతే! కాని యిటీవల కొంతమార్పు కనపడుతున్నది. 2—11—40 కృష్ణాపత్రికలో "దీపావళినాడు"లో విషాదం కనపడుతున్నది. లోకమంతా సంతోషిస్తూంటే యీన హృదయంలో "అణచుకొనియున్న ఘోరదుఃఖానలమ్ము" రగులుకొన్నదట! "గొంతువిప్పి లోలోన కుమిలికుమిలి యేడ్చినా" యెడద పగిలిపోలేదట! తాత్కాలికంగా కాకుండా తాను "శైశవమాదిప్రేమ స్మశానమన"ని చెప్పినాడు!

*(వేదులవారి "ప్రవాసి"

మొదలైనవి.)

† "కొందరు ఆధునికుల ఖండికలలో ఆత్మపరమైన రహస్యప్రపంచం, సంజ్ఞారూపకమైన నిగూఢానుభూతి, ఉత్కృష్టరసోద్దీపకములైన భావచిత్రాలూ పాదు తేర్చుకుచుకోగలవని చెప్పచ్చు."

(మల్లవరపు, భారతి 1939 యేప్రిల్)

"*The Poet is he who sees life newly, assimilates it emotionally, and contrives to utter it musically.*"

(*Buchanan*)

ఊసరక్షేత్రాలకుకూడా ఏకవిధమైన దోహదంచేశారు. మే మందరమూ వీరికి కృతజ్ఞులం. ఈ విధంగా ప్రకృతిని అర్చించేవాళ్ళూ, అనుభవించేవాళ్లూ, చూచి ఆనందించేవాళ్ళూ, తన్మయులైపోయే వాళ్ళూ అయి, ప్రకృత్యంతస్సును తమరు గ్రహించినదాన్నీ, గ్రహించ గలిగినదాన్నీ, గ్రహించా మనుకున్నదాన్నీ, మా కందచేశారు! ప్రకృతి అనంతలీల కలది. ఒకళ్లకు పూర్ణంగా అందేదా? అంతేగాక శివుడంత చిత్తసంస్కారం కలవాడినీ, అంతర్ముఖుడినీ, జితేంద్రియుడినీ, లోబరుచుకుని వశుడుగా చేసుకున్నది! కాని తత్కాలానికి వశుడైనట్టు కనపడ్డా, తుదకు ప్రకృతిని తానే యేలిన మహానుభావుడాయన! శివ శక్త్యైక్యమైతేనేగాని సృష్టి లేదు! అలాగే యీ కవికుమారులుకూడా తమతమ జీవశివులతో బాహ్యప్రకృతిని మేళవించి కావ్యసృష్టి సాధించారు! ప్రకృతి తత్కాలానికి వాళ్లకు వశఅయి పోయినట్టు కనపడుతుంది!

*ప్రణయం, సామగ్రి, పదజాలం:

ఇక వీళ్ల కవితాసామగ్రినిగూర్చి కొంచెం మనవిచేస్తాను. వీళ్ళల్లో చాలామందికి ప్రణయమే వర్ణనీయవస్తువు. ♦ఈ ప్రణయాన్నే ప్రకృతిలో చూస్తూవుంటారు. రాయప్రోలుగారికి యీ ప్రణయం ప్రపంచమూలసూత్రం. మిగిలినవాళ్లకుకూడా ప్రణయభావమే ముఖ్యం. దీనిలో సుబ్బారావుగారికి అమలిన శృంగారమంటే అభినివేశం. కాని మిగిలినవాళ్ళకు విప్రలంభ మెక్కువ ప్రీతిగా కనపడు

* "నవ్యకవులకు ప్రత్యేకమైన కవితాసామగ్రి ఉన్నదని అందరికీ తెలుసును." (నోరి నరసింహశాస్త్రిగారి ప్రతిభలోని వ్యాసము యీ భాగమున కుపకారకమైన వాట్లో వకటి.)

♦ "గిరికుమారు"నికి వేరే వస్తువే లేదు! ఈ పేరు పెట్టుకుని రాశింది విశ్వనాథ వారని బాపిరాజు నాతో చెప్పాడు. నమ్మక తప్పింది కాదు. ఇప్పటికీ ఆయనదగ్గిర యీ పేరుతో రాశి అముద్రితాలుగా వున్న గీతా లున్నాయట!

తుంది. సంయోగమే లేని విప్రలంభం కొందరికీ, సంయోగానంతర విప్రలంభం కొందరికీ, ఊహావిప్రలంభం కొందరికీ, ప్రియంగా కనపడు తుంది.♦ ఈ ప్రణయానికి వీళ్ళుకూడా యెంత పూర్వులను తిట్టినా,

---

♦రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు పూర్వులకూ ఆధునికులకూ భేదం చెబుతూ, పూర్వులు తమ కెంత వైరాగ్యమున్నట్టు కనపడతారో, సమయమప్పుడు అంత భోగ వాంఛ వాళ్ళవద్ద కనపడుతూవుంటుందనీ, వాళ్ళు ఆ వాంఛను తీర్చుకోటానికి కావల సిన శరీరమనోదార్ఢ్యాలు కలిగివుండేవాళ్ళనీ ఉగ్గడించి, యిప్పటివాళ్ళకు దుర్బలత్వం చేతనో, చిత్తైకాగ్ర్యరాహిత్యంచేతనో ఆ పట్టుదల లేక సంపూర్ణంగా అనుభవించేశక్తి లేకుండా దుర్బలులై వున్నారని చెప్పారు! ఇది సత్యంవలెనే కనపడుతుంది. ఈ కవి కుమారులు కొంతమంది ప్రేయసిని చూస్తేనే చాలనేవాళ్ళూ, కొందరు చూచి చేతగాని తనంచేత ఆనందించుకోలేక వాపోయేవాళ్ళూ, మరికొందరు పైచేష్టలచేతనే తృప్తిపొందే వాళ్ళూ, యింకా కొందరు వచ్చిన అవకాశాన్ని పోగొట్టుకుని దుఃఖించేవాళ్ళూ, యిట్లా పరిపరివిధాలుగా కనపడతారేగాని, వచ్చిన అవకాశాన్ని వశంచేసుకుని అనుభ వించి "తృప్తాఃస్మః" అనుకునేవాళ్ళొకళ్ళూకూడా కనపడటంలేదు. (*no climax*) ఆధునికుడిది భ్రమరవృత్తి! నిలకడా లేదు! సంపూర్ణానుభవమూ లేదు! ప్రేయసిని "అన్యత్రానురాగం" లేకుండాచేయగల శక్తీ, సామర్థ్యమూ అనేకులకు లేదు. అందుకనే వెనకటివాళ్ళకు ప్రేయసి స్వాధీన! వీళ్ళకు స్వచ్ఛంద! అందుకోసం వకప్పుడు వీళ్ళుకూడా స్వచ్ఛందులు కావలసివచ్చింది! ఇది సరిగా యిప్పటి యువతీ యువకుల చిత్తవృత్తి! ఉభయులకూ వివాహమంటే గిట్టదు! తుదకు యే కొద్దిమందోతప్ప "భుజాశ్లేషబంధన" మనుభవించినవాళ్ళుకూడా యెక్కువగా కనపడరు! ప్రేయసిని యేమి చేసినా క్షమించి స్త్రీకి అత్యంత స్వేచ్ఛనిచ్చారీ నవ్యులు. ఆమెకు స్వాధీనులైపోయినారా అనిపిస్తుంది. "కామ్యవాదిని యగు మోహపుబొమ్మగా మెలగిన స్త్రీ నవ్యకవిత్వంలో 'ప్రేమజీవన విభాతకైశికీగీతిగా' 'ఆశాపథాంతరాళపారిజాతముగా' 'తపఃకల్పవల్లిగా' పరిఢవించినది" (వంగల శ్రీరామావధాని, ఆంధ్రపత్రిక, 7-12-41). ఇది కొందరి అభిప్రాయం. వీళ్ళలో కొందరిలో ప్రణయాన్ని త్రోసిపుచ్చి ప్రేయసి యితర స్థలాలకు వెళ్ళినా, కొన్నాళ్ళుండి మళ్ళీ వచ్చినా క్షమించగల మనశ్శాంతి వున్నది. "ప్రేయసి అట్లా చేస్తే నేనుమాత్రం చేస్తేయేమి" అనే వికల్పమూ మొదలైనవికూడా కొందరిలో కన పడతై. భావోన్మాదులై "నాకుకూడా యెప్పుడైనా సౌఖ్యాన్నిస్తోందంటే చాలనే" మన స్తత్వంకూడా కొందరిలో కనపడుతూవుంటుంది.

పవనకుమారుడినీ, చంద్రాతపాన్నీ, కోకిలగానాన్నీ, శారదరాత్రు లనూ, నదీసైకతాలనూ, లలితకుసుమాలనూ, వాట్లో పరిమళాన్నీ, చిన్నిముద్దులనూ, మురళీరవాన్నీ, సహకారవృక్షాన్నీ, వసంతశోభనూ, మావిచిగుళ్ళనూ, శాద్వలాలనూ, — యీ విధంగా లెక్కించడానికి మొదలుపెడితే అంతు లేదు—వాళ్ళు ప్రణయసాధనసామగ్రిగా చేసు కున్నారు. ప్రణయసామగ్రిని యేదోవిధంగా, అనేక భంగులుగా కీర్తించడంలో మాత్రం చాలా హృదయంగమంగా గానంచేశారు.

> " పవనపులకిత చంద్రాతపప్రఫుల్ల
> చారుశారదయామినీ సమయమందు."
> " మంజుకుసుమామృతములోని మధురిమంబు "
> " ప్రకృతి పులకింప యమునాస్రవంతి పొంగ "
> " ఆనుకూల్యంబుతో శారదానిలమ్ము "
> " చారుచంద్రకరస్మేర కైరవమ్ము "
>
> (వేదుల)

ఈ విధంగా యీ సామగ్రి యిట్టిది. దుఃఖం పల్లవిగా చేసు కున్న కృష్ణశాస్త్రిగారు;

> " ఏడుపు చెలికడకా ? సంజపడతికడకా ? "
> " సౌరభము లేలజిమ్ము పుష్పవ్రజంబు ? "
> చంద్రికల నేల వెదజల్లు చందమామ ! "
> " మావిగున్నకొమ్మను, మధుమాసవేళ
> పల్లవముమెక్కి కోయిల పాడనేల ? " *

ఎంత దుఃఖంచేవాళ్ళకూడా కొన్ని ఆనందఘటిక లుండకుండా వుండవు ! ఒకవేళ అట్లా పైకి కనపడుతున్నా హృదయం చూస్తే తప్పక వుంటవి ! వాళ్ళకట్టు, బొట్టు, జుట్టూ, యితరచేష్టలూ బాహ్యా

* " చంద్రికాశీతల మనోజ్ఞ జాలకముల "

చిహ్నాలు అంతరానికి. కాబట్టి వాకొక్కప్పుడు వీళ్ళ గీతాల్లో వీళ్లు చెప్పిన దుఃఖమంతా తెచ్చిపెట్టుకున్నట్టు కనపడుతుంది!

దానిగానం నచ్చకపోయినా కోయిలనే తన గానవస్తువుగా గ్రహించాడు మునిమాణిక్యం.

" మెక్కి మావిచిగుళ్ళను మిక్కుటముగ
పాతపాటలనే యేల పాడెదీవు?
కొత్తపోకట నీకడ నుత్త దకట "

పాప మీాయనకు వసంత నవనవోన్మేషత్వం మనస్సుకు రాలేదో! పొడకట్టలేదో! ఈయనకు పొడకట్టకపోయినా యీాన రాతలలోమాత్రం పాఠకులు "క్షణక్షణనవ్యతాగోచరత్వం" మాత్రం అనుభవిస్తున్నారు? ఇక నోరి నరసింహశాస్త్రిగారు;

" బింబఫలముల బోలు నీ పెదవు లెపుడు
లీనమై పోతివీ దివ్యగానసుధను "
" రూపమాత్రపు పూలెన్నో రూపుమాసి "
" పచ్చనిబయళ్ళ నడుమగా బయలువెడలి "

ఈ విధంగా కొందరు యీా వెనకటి సామగ్రినే గ్రహించారు. "అనుతాపం" "ఆశ" "కాంక్ష" "ఉత్కంఠ" యిటువంటి శృంగారరససామగ్రినీ, సాత్విక సంచారిభావాలనే తీసుకుని గీతాలను రచించారు వేదుల మొదలైన అనేకులు. ములుగు చంద్రమౌళిగారు "చైత్రలక్ష్మి" అనీ, "చంద్రార్పణ" మని చింతా దీక్షితులుగారూ, "తరంగమాలిక" ని పూర్ణశర్మగారూ, "శరద్రాత్రి" అని చామర్తి రాజశేఖరరావుగారూ, "విప్రలబ్ధ" అని కొడాలి ఆంజనేయశర్మగారూ, "స్వాధీనపతిక"అని సుబ్బన్నాచార్యులు గారూ, యీా ప్రకారంగా పూర్వసామగ్రినే గ్రహించి రాశారు. ఋతువులూ, వాటిలో కలిగే ప్రకృతిభిన్నతా, మొదలైనవి కొందరికి కవితాసామగ్రి అయినవి. "సభాపతి"గారు "పుష్య పూర్ణిమ"ను

గ్రహించి రాశారు. కొందరికి ప్రణయం, రతిగానో, భక్తిగానో, సఖ్యంగానో కనపడి ఆ విధంగా కీర్తించారు. "ప్రేయసీ" అని దేవుల పల్లిగా రన్నారు! "తల్లిని" కీర్తించారు నోరి నరసింహశాస్త్రి, నాయని గార్లు. "హరీంద్రకుమారుడ"నే శీర్షికకింద మైత్రిని గానంచేశాడు శివ శంకరశాస్త్రిగారు. ఈ సందర్భంలో వారి యీ మైత్రీకీర్తనంలోనించి కొన్ని ఉదాహరణా లిస్తాను.

"ఏలనోగాని నిన్ను వీక్షించినంత
ప్రాణములు లేచివచ్చినపగిది నుండు"
"ఏమి యీ ప్రేమ తెలియదోయీ కుమార
ప్రాక్తనభవమ్ములందలి బాంధవమ్మొ ?"
"కానగ వచ్చి స్వప్నముల గ్రమ్మభవద్వదనారవిందమ
న్న్యానముగా ముదంబొసగుచున్నది కొన్నిదినాలనుండియున్"

తుది రెండు పాదాలూ కొడవటిగంటి వెంకటసుబ్బయ్యనుగూర్చి చెప్పిన గీతంలోవి! *ఈ విధంగా వీళ్ళుసామగ్రి పూర్వత్వాన్ని బొత్తుగా విడవలేదు. ఈ వస్తుసామగ్రి వెనకటివాళ్ళకు రసానికి సహకారైన సామగ్రిఅయితే, వీళ్ళ కది "విషయ"రూపంగా మారింది. ఇది సమంజసమే! వెనకటితరంలో మొత్తంమీద రసదృష్టేగాని,

---

* సుబ్బారావుగారీ సఖ్యాన్ని ప్రణయశిరస్సుగా గ్రహించాడు. తృణకంకణంలో చివరభాగమంతా దీని కీర్తనమే !

"కనుల నొండొరులను చూచుకొనుటకన్న
మనసు లన్యోన్యరంజనగొనుటకన్న
కొనరి 'యేమోయి' యని పిలుచుకొనుటకన్న
చెలుల కిలమీద నేమి కావలయు సఖుడ ?

ఈ సఖ్యం ఈనకు అకారణం, అవ్యాజం, స్వార్థరహితం. కొందరు నవ్యుల ప్రణయానికీ యీన ప్రణయానికీ మాలిన్యమే భేదం! గురజాడ అప్పారావుగారుకూడా దీనిని తిలకించాడు కొంతవరకు.

"మగడు వేల్పన పాతమాటది; ప్రాణమిత్రుడ నీకు" (కాసులు)

అంగాలమీద (అవయవాలు కావు) అంతగా దృష్టి పడలేదు. ప్రకృతిని, సౌందర్యాన్ని, భావాల్ని విడదీసి పరీక్షించేకాలంలో యిట్లా వుండడం సహజమే !*

ఇక పదజాలాన్ని యెత్తుకుంటే కొంత వెనకనే యీ విషయం వచ్చింది. పదాలు లేకుండా కవితాసామగ్రి వుంటుందా? పదాల చేత ప్రతి సామగ్రిని నిర్వచించాలశిందేకదా? సందర్భోచితపద జాలం వీళ్ళ నాకర్షించింది. ఈ విధమైన వాక్చిత్రాలే వీళ్ళు నిర్మించింది. చక్కని నుడికారం. ఒకొక్కప్పుడు అర్థగాంభీర్యాదులు లేకపోయినా పదాలు చక్కగానూ, లలితంగానూ, వుండి శ్రవణసుఖాన్నిస్తై! మళ్లి వెనకటి శ్రవణసుఖమే సేవ్యమైన దిక్కడకూడా! ఈ కవుల రాతలు చూస్తే—కొందరు—తెనుగు నుడికారాన్ని, జాను తెనుగుపదాలనూ, దేశ్యాలనూ యెక్కువగా గ్రహించి వాడినట్లు కనపడుతుంది. ఇది భాషకు వీళ్ళల్లో కొందరివల్ల కలిగిన గొప్ప ఉపకారం. కొందరు యీ శబ్దసమ్మేళనసందర్భంలో కొంత నవ్యత కనపర్చారు. వెనక మనం ఆనందబాష్పలనో దుఃఖబాష్పాలనో యెరుగుదుముగాని "విశ్వాసవిరక్తిబాష్పా"ల నంతగా యెరగం. ఎందుకంటే సుఖ దుఃఖాలనే వెనకటివాళ్లు తలచారు. కాని "సఖ్యా"న్ని అంత యెక్కువగా వాళ్ళు కీర్తించలేదు. ఒకవేళ కీర్తించినా అన్ని రకాల బాష్పాలనూ "ఆనందాశ్రువుల" కిందికే తెచ్చి కీర్తించారు. మన యిప్పటివారిలో రాయప్రోలువారు.

"సకియ! విశ్వాసబాష్పముల్ చాలు నాకు,
లేదు వేరాస ప్రణయవల్లీమతల్లి!"♦ అన్నాడు.

---

* "నేటి కవులు యెప్పుడూ రసానికి అశ్రయములుగా వుండే ప్రేమ-విరహం-హాసం-రోషం-మొదలైన విషయాలనే తీసుకుని కావ్యాలు వ్రాస్తున్నారు."
(ఇంద్రగంటి, భారతి 1939 మార్చి)

♦ "మామకీన ప్రణయ మధుకణముల
విడిచెదు, విరక్తిబాష్పముల్ విడుచుపోల్కి"

మరెన్నీ సువర్ణరజతకంకణాల నెరుగుదుమేగాని "తృణకంకణ" మెన్న డైనా విన్నామా? భావం మెక్కడినించీ తీసుకున్నారని వకవేళ అన్నా తీసుకోడంలోకూడా వారి ప్రతిభానవ్యతను చూపారు!

ఈన తర్వాతవాళ్ళకు యిటువంటివి యింకా సులభంగా కన పడ్డై! ఆ దోవలో కొన్ని నూతనాలుకూడా కనిపెట్టారు! వాటినికూడా గ్రహించారు. ఆదిలో "ప్రేమతపస్సని" వకరు రాస్తే తర్వాత మరో ఆయన "ప్రేమసన్యాసులు" అన్నాడు. ఒకాయన "తృణకంకణ" మంటే మరో ఆయన "తృణశయ్య"ను పేర్కొన్నాడు. "తృణానిశయ్యా" అన్నాడు చాలా పూర్వమే భర్తృహరి.* కొన్ని స్థలాల్లో వీళ్ళ శబ్దజాలం వినటానికి చాలా హృదయంగమంగా వుంటుంది కాని విడదీసి అర్థం చెప్పబోతే చెయిజారిపోతుంది అర్థం.♦ వీళ్ళ నుడికారాల్లో వక విశేష మిది. "పదముల అన్యోన్య మైత్రీ కల్పనం"లో అనగా "శయ్యలో" వీళ్ళు చాలా ప్రవీణులు. వీళ్ళను వెనకటి రీతివాదుల్లో చేర్చవచ్చు! కాని రీతి యేకదేశమే గాని రస గోళం కాదు. మరీ యీరీతి రాయప్రోలువారి చేతుల్లో పరిణతి పొందింది. "పేశలరాగలాలిత స్వాంతదళీపుటంబులు" "అశ్రుకణి కావ్యాసంగము" "ప్రాణప్రబంధాశ్వాసాంతము"❨ "ఆశాభంగ కఠోర శస్త్రికలు" "బాష్పజ్ఞాన విద్యార్థి" "పూలసంకెళ్లు" మొదలైన

*కృష్ణశాస్త్రిగారికి "వీక్షణపరిమళములు" వచ్చినై.

"నేత్రపానం" మొదలైనవి పాతవే!

"ప్రత్యూషహర్మ్యాంగణాంతం" (మల్లవరపు)

♦ "చిన్నచిన్న పదాలన్నీ అర్థమైనా భావము గోచరించకుండా చెప్పే కవిత్వానికి కూడా వారే (రాయప్రోలువారు) అక్కడక్కడా దారి చూపించారు."

(నోరి నరిసింహశాస్త్రి)

❨ "అంతిమాశ్వాసశాంతిసమాప్తి" (వేమల)

అసంఖ్యాకాలైన పదబంధా లిట్టివే!* కొందరిలో యీ పదబంధాలు కొంచె మింకా పొడుగై, జటిలాలై పోయినై. కృష్ణపక్షకర్త్రవి కొన్ని చాలా పొడుగైన, గాఢపదబంధాలు. ఈన రాతలు ఆంధ్రమహా మహుల హృదయాల్లో 20 యేండ్లనించీ వున్నై. అనేకయువకుల జిహ్వాగ్రాలమీద నటిస్తున్నై! మచ్చుకు రెండు అనువదిస్తాను.

"ప్రబల నీరంధ్రాభ్రజనిత గాఢధ్వాంత
నిబిడ హేమంతరాత్రీకుంతలములలో—చుక్కేలా?"

"క్షుభితమృత్యుకఠోరవికట పాండురశుష్క-
వదన దంష్ట్రాగ్నిలో—నవ్వేలా?"

ఇంతమాత్రంచేత యీన సులభంగా రాయడనటానికి వీల్లేదు. రాస్తాడు! రాశాడు! అయితే యిక్కడ యిట్లా రాశా డేమని వక ప్రశ్న! పై రెండుదాహరణాలు చూస్తే అందులో పరస్పర విరుద్ధ విషయాలు ఏకకాలావచ్ఛేదకాలుగా వుండటం పేర్కొనబడింది. ఈ విరుద్ధ విషయైకదేశవర్తిత్వం ప్రకృతిసిద్ధం. ఒకవంక దుఃఖము, అందులో క్వాచిత్క-సుఖము! దుఃఖం జటిలం! సుఖం సరళం! అట్టి సందర్భాల్లో కర్కశభావమూ, వస్తువూ కర్కశమైన పరుషాక్షరదీర్ఘసమ్మేళనంతో వర్ణిస్తేతప్ప రసవత్త కలదు. సుఖాంశ ఆనందకరమూ, స్వల్పకాలవర్తిని. కాబట్టి హ్రస్వ పదాలతో వివక్షితమైంది. "చుక్క" "నవ్వు" రెండూకూడా సరళ వస్తువులే! ఈ పరుషసరళవస్తువుల వైధర్మ్యమూ, అయినప్పటికీ యేక దేశవర్తిత్వమూ, చక్కగా శబ్దజాలరూపంగా హృదయంగమంగా స్ఫురింపజేసాడు కవి. కృష్ణశాస్త్రిగారు తమ అంతులేని దుఃఖాన్ని వొకొక్కప్పుడు దీర్ఘసమాస భూయిష్టమైన శైలిలో ప్రతిబింబింప

---

* ఇటువంటి పదబంధాలు, చాలామందిలో ఉన్నై. దేవులపల్లి, వేదుల, మొదలైనవాళ్ళల్లో చాలా చూపించవచ్చు. విశ్వనాథవారిలో యివి చాలా గంభీరాలు, క్లిష్టాలు, అయిపోయినై.

జేశా డనుకుందాం! వేదులకూడా కొన్నిచోట్ల యెందుకు పొడుగుగా రాశాడు? దానికి కారణ మడగడానికి వీల్లేదు. ఒకొ్కక ప్పుడు సరళభావాలుకూడా దీర్ఘసమాసబంధాల్లో వస్తవి.

"అరుణ రాగోదయోన్మీలితాంబుజమ్ము
చారుచంద్ర కరస్మేర కైరవమ్ము
పవన పరిరంభ పులకిత ప్రసవచయము"

ఈ పాదాల్లో ఉల్లేఖించిన వస్తువులు చాలా సరళమైనవి. అందమైనవి. హృదయంగమమైనవి. "సూర్యుడు," "చంద్రుడు," "గాలి," వీటితో సహజమైత్రిగల "కమలం" "కలవ" "పుష్పం". చక్కని వస్తుసమూహం! అకారణ సహజమైత్రీ సమ్మిళితం! పొడుగాటి సమాసాలతో చెప్పడ మెందుకూ అనకూడదు! అట్లా అనటానికి మనకధికారం లేదు! వచ్చినై. కవికుమారు డేంచేస్తాడు?* వెనకటి కవికుమారులు పెద్ద సమాసాలు రాశినప్పుడు మన నవ్యులు వాళ్ళనాక్షేపిస్తూవుంటారు. ఇతరుల ననడమే కాని కవి భావ పూర్ణహృదయం మనంచెప్పినట్టు వింటుందా? అందుచేత దుఃఖా కాలంలో "యిటువంటి ద్రావిడప్రాణాయామంలో యేడ్చాడా" అనడం చాలా తెలివితక్కువపని!♦ సహృదయు డనవలసిన మాటకాదు.

---

*జటిలంగావున్నా కర్కశత్వంలేదు! సరళపదాల్లోనే వచ్చినై!

♦"కవిత్వం అందరికీ అర్థమయ్యేటట్లుగా వ్రాయాలంటే యెవ్వరూ వ్రాయలేరు. 'ఓచతురాస్య వంశ కలశోదధి పూర్ణశశాంక' అని వ్రాయడం యెందుకు? 'ఓ! బ్రాహ్మణుడా?' అనిగాని, 'ఓ ప్రవరయ్యా' అనిగాని వ్రాస్తే చాలదా అంటే, శ్రీశ్రీ చెప్పినట్టు ఆ '*mood*' అనేది యిప్పటికవులకే గాక అప్పటి వాళ్ళకు కూడా వుంది. ఆ 'పటీరాచల పశ్చిమాచల హిమాచల పూర్వ దిశాచలంబులన్' అని సిద్ధుడిచేత చెప్పించాడంటే ఆపట్టున అట్లా వ్రాస్తేగాని ఆ అందం రానేరాదు. అనమానం యెందుకు వేశాడో ఆ శిల్పాన్ని గ్రహించలేనంతమాత్రాన అది పనికిరా దనటం వివేకం కాదు." (విశ్వనాథ - ఆంధ్రపత్రిక 22-9-40)

అటువంటి కాలంలోనే వెనకటి సౌఖ్యానికీ అప్పటి దుఃఖానికీ వైధర్మ్యం కన పడి తోచేది.

పైన వైధర్మ్యసహితంగా దుఃఖం యెంత జటిలసమాసరూపంగా కవికుమారుడి హృదయగహ్వరంలోనించి వచ్చిందో కృష్ణశాస్త్రి గారిరాత చూశాం! ఈ కిందిసమాసం చూడండి.

"హతవిధిక్షుభిత ప్రథమానురాగరేఖాపరిభూత యౌవనసుఖ స్పృహాలక్ష్" (వేదుల). ఇటువంటివి సహృదయులకే కొంచెం కష్టం కలిగిస్తై! కాని వాళ్ళకు్కూడా అసహజాలుగా కనపడవు. "మెల్లిఁసు ఫుడ్ తత్వాలకు" కనపడచ్చు! వాళ్ళకు నా సానుభూతిని అంద చేస్తున్నాను!

## కవిసమయాలు, అలంకారాలు :

వీళ్లుపయోగించే కవిసమయాలనూ, అలంకారాలనూ కొంచెం పరామర్శిద్దాము. వీళ్లకు కవిసమయాలంటేనూ, అలంకారా లంటేనూ, నైరస్యమని మొదటమొదట చెప్పుకునేవాళ్లు. ఇటువంటివి ఉపయోగించకపోవడమంటూ వుండదు. ఎందుకంటే వాటి ఉప యోగం మానవప్రకృతిలోనే వుంది.* ఒక కవికుమారు డంటాడు,

"స్తనభారమున నృత్యమొనరించు కౌనున
బంగరొడ్డాణంబు బహు చిత్రగతి గ్రాలఁ"

"ఆశ్రోణిపర్యంతవిశ్రుతశిరోజరా
జితశోభనాంగియై... ... ..."

(సుబ్బన్నాచార్యులు)

పై రెండలంకారాలు యెంత పాతవో చెప్పడానికి వీల్లేదు! అధమం వెయ్యేండ్ల వయస్సుంది వీటికి! ఈ కింది వేదులవారి గీతంలో,

---

*"ఇప్పటి కావ్యాలలోనూ ఉపమాది అలంకారాలు లేకపోలేదు. కాని వాటినిచెప్పే విధానం కొత్తగావుండచ్చు" (ఇంద్రగంటి, భారతి 1939 మార్చి)

"ఒంటిగా వేడి ని
ట్టూర్పు లెగబోయుచును,
జంట దొరగిన పడుచు
చక్రవాకి విధాన"

కవి సమయంకూడా వాల్మీకి అంతపాతది!

"పెదవు లెడసేసి దంతకౌముదులు పర్వ"
ఇదికూడా ఆదికవి అంత పాతదే!

"బింబఫలములబోలు నీ పెదవులెపుడు" అన్నప్పుడు నోరికవికి తమరు వెనకటివాళ్ల ఉచ్ఛిష్టాన్నే గ్రహిస్తున్నానని తట్టకపోదని నా ఊహ!

"అబ్ధిగర్భోజ్వలద్బడబాగ్నిశిఖల" అన్నప్పుడు వేదులకవి కూడా అట్లాగే అనుకున్నాడో లేదో? కాబట్టి కవిసమయాలంటే వీళ్లకు యేవగింపు పైకేకాని, అసలు హృదయంలో లేదని తేలుతున్నది.* ఇటువంటి దృష్టాంతాలు అనంతంగా చూపించవచ్చు. వెనకటివాటిని గ్రహించడమే కాకుండా నూతన కవిసమయాలూ, అలంకారాలూ కొన్నిటిని సృష్టించారు.

"పుడమిపడంతి కోడెతనపుంజిగినా మొలకెత్తు పచ్చికర్"
రాయప్రోలువారి ఉత్ప్రేక్ష యెంత హృదయంగమంగా వున్నది! కాని స్త్రీకి "కోడె" జిగి తెప్పించాడు. ఆ మాటకు "యవ్వనమునకు సంబంధించిన" అని మాత్రమే అర్థం చెప్పుకోవాలె. నండూరు;

---

* "వొనలచ్చి మనిపించు నా యెంకి" అన్న నండూరివాక్యంకూడా యిట్టిదే! ఇట్లాగే మా అప్పారావులోనించీకూడా చూపచ్చు!

"కలువరేకుల నీ కన్ను గవకరంగ"

(మల్లవరపు)

"పగబట్టు పాముల్లె"*

అన్నాడు వెంకివెంబడివేళ్లే ప్రియుణ్ని! ఎంత రసవంతమైన ఉపమానం! భావంలోనూ, ఆకారంలోనుకూడా సామ్యం! లోతుకు దిగితే కొంచెం వైధర్మ్యం కనపడుతుంది! కాని అలంకారాలు ఆపాతతః విషయగ్రహణసాధకాలై ఆనందింపచేస్తై!

వేదులవారిది యీ కిందిది.

"కళ్లుచీల్చిన ధారుణీగర్భమందె
కోమలాంకురములు నాటుకొనునుగాదె"

ఈన అర్థాంతరన్యాసం ఉపయోగిస్తున్నా ననే భావం ఉందో లేదో! పడిపోయింది!

"తొలకరిపాటపాటజడితుంపరలన్ పైపై గ్రసింపగా
దలచి బలాకలున్........"

కవి సమయసహితాలంకారం కూడాను, పైది! ఈ విధంగా ఉదాహరణా లియ్యొచ్చు. మొత్తంమీాద వీటి సన్నిటిని చూస్తే పిండితార్థంగా తేలే దేమిటి? "వెనకటివాళ్లు వీళ్లను నిందించడమూ, వీళ్ళు వాళ్లంకంటె పొడిచి గెలిచామనీ" అనుకోడమే కాని దాదాపు వెనకటి వాళ్ల సామగ్రిని, పదాలను, సమయాలను, అలంకారాలను ఉపయోగించారు. కాని వాటి సమ్మేళనం లోనూ, యేరుకోడంలోనూ, దృక్పథంలోనూ, భిన్నత్వంచూపి

*"వడలు తెల్లనిత్రాచు పడగలానిగసింది"
"ఏటికడుపునదాగి తోటనిదురోయింది"
"పతిగుట్ట మొగిలితోడున"
"పోనుపో స్వేచ్ఛనై తేలుకొన్న, మనోహరుని ప్రేమపోలిక"
"తదుతాత్త సమాధి మృత్తికన్" ఇవి మచ్చుకుమాత్రమే!

కొన్ని నూతన కల్పనలు చేశారు. * ఈ కాలంలో నూతనపద జాలం వచ్చి భాషను విశాలం చేశింది. నాగరకతతోకూడా నూతన భావాలు ఆవహిస్తున్నాయి. కాబట్టి ఆభాషను ఆభావాలను తెల్పడంలో గ్రథనం నూతనమైంది! ఇదోవిచారానికీ, నిరసనానికీ పాత్రం యెప్పటికీకాదు! తిక్కనాదులకంటె శ్రీనాథాదులు నూతనత్వం చూపలేదా? అంతకంటె నూతనత్వాన్ని చూపారు పెద్దనాదులు! అంతకంటె నూతనులు వీరేశలింగం పంతులుగారు! రాయప్రోలువారు యీ నూతన సంఘర్షణయొక్క పరిణామం! ఆయనదోవకూడా పాతగిలుతున్నట్టు కనపడుతున్నది. ఈ నవ్యత సహజంగా మెల్లెక్కి వచ్చినట్టే కనపడుతున్నదిగాని హఠాత్తుగా ఆకాశంనించి పడ్డదని అనుకోడానికి యెంతమాత్రం వీలు లేదు. †

## గ్రథనం:

ఈ నవ్యతారహస్యాన్ని వెనకటి లాక్షణికుడు నిర్వచించనే నిర్వచించాడు. చూడండి,

> "తఏవ పదవిన్యాసాః తా ఏవార్థ విభూతయః
> తథాపి నవ్యంభవతి కావ్యంగ్రథన కౌశలాత్"

---

* నోరి నరసింహశాస్త్రిగారిట్లాగన్నాడు వకచోట. "ఈ లోకంలో చిత్రమేమంటే పాతదే మళ్ళీ మళ్ళీ కొత్తగా కనపడుతూ వుంటుంది. అటువంటి నూతనత్వమే యీ కాలపు తెలుగుకవిత్వములో వున్నది." ఇది సమంజసమే! "క్షణేక్షణే యన్నవతాముపైతి" అన్నప్పుడు లాక్షణికుడిదృష్టి యిదే!

"పూర్వాలంకారికులు చెప్పిన మార్గాలకు ఇప్పు డవలంబించే మార్గాలకు వివరాలలోనే భేదంగాని అసలు ప్రధానంలో లేదు. ఎప్పుడూ అట్లాంటి భేదము లేదు. ఉండదుకూడాను." (విశ్వనాథ. ఆంధ్రపత్రిక, 27—9—40)

† "కాబట్టి నేటి కాలపుకవిత్వం కొందరన్నట్టు భాషరాని అపండితుల అర్థం లేని గోష్ఠి కాదనీ, కొంద రన్నట్టు యిది కేవలం పూర్వకవిత్వంతో సంబంధం లేకుండా, పూర్తిగా యిప్పటివారి ప్రజ్ఞావిశేషంవల్ల సృష్టింపబడిన అపూర్వవస్తువయిన్నూ కాదనీ తోస్తుంది." (భారతి, 1939 మార్చి)

వీళ్లు నూతన పదాలను సృష్టించారా? లేదు. కాకపోతే వ్యావహారికంగావున్న కొన్ని పదాలనూ మరికొన్ని పరభాషాపదాలను సారస్వతంలోకి చేర్చారు. ఈ పదాలకు వీళ్లు సృష్టికర్తలు కారు. ఉన్నపదాలకు ఉన్న అర్థంకంటె భిన్నార్థాలు కల్పించారా? లేదు. ప్రతిపదానికీ సహజమైన అభిధార్థమూ, అదిపట్టకపోతే వుండే లక్షణార్థమూ అట్లాగేవున్నై!* పోనీ వ్యంజననేమైనా యెక్కువగా వాడి పదాలకూ పదబంధాలకూ నూతనరసవంతమైన అర్థాలను సహృదయులలో కలగజేశారా అంటే వీళ్లలో వ్యంగ్యంకంటె వాచ్యమెక్కువ. అవేపదాలై, అవేఅర్థాలైతే యిక నవ్యత యెక్కడ వున్నది? వాటి గ్రంథనంలో వున్నది విశేషమూ నవ్యతాను. ఈగ్రథనం కావ్యానికిముఖ్యం. ఈ గ్రథనంవల్ల పదసమ్మేళనానికి వక అపూర్వతా, నవ్యతావస్తుంది. ఆ నవ్యతే యిప్పుడీ నవ్యుల నవ్యత! రెండుదాహరణాలిస్తాను. సూర్యాస్తమయవర్ణన:

> "పశ్చిమాశాని కషసువర్ణరేఖ
> లొకటొకటి చెరపుచు బోవుచుండె ప్రొద్దు
> గగనదుర్గపు తూర్పు బంగారు తలుపు
> తెరవబడియె రేరాజరుదెంచునంచు" ♦

(వేదుల)

---

* ఇంద్రగంటివారన్న మాటలు చూడండి:

"మాటలూ, అర్థములూ పూర్వపువేఅయినా, కూర్పు నేర్పువల్ల కావ్యాలను నవ్యములుగా చేయవచ్చునని సాహిత్యవేత్తలన్నారు."

(భారతి, 1939 మార్చి)

♦ "తెరచుకొనె తూర్పుతల్పు బంగరు వెలుంగు
దెసలమసిమంప నొకవింత తేరుకదలె"
..................................
"గములుగా జిమ్ముకొనుచు చీకటుల పొగలు" (శివరామం)

రెండు దిక్కుల రాగము. వకటి తగ్గుతున్నది. రెండోది క్రమాభివృద్ధి పొందుతున్నది. మొదటి క్రమ హ్రైస్వ్యాన్ని ఒక్కొక్క రేఖనే పొద్దు చెరుపుతూ పోతున్నదనీ, రెండవక్రమాభివృద్ధిని తలుపు తెరచేటప్పుడుండే క్రమంగా చిత్రించడమున్నూ దీనిలోవున్న నవ్యత ! ఈమాటలు విడివిడిగా మనమెరిగినవే ! కాని వీటి సమ్మేళనంవల్ల యెటువంటి నవ్యతవచ్చిందో చూడండి ! ఇంకొకటి.

"పక్షివలె నాకాశనిర్మల
పథవిహార స్వేచ్ఛకోరితి
పక్షములు లేవంచెరుంగక
ప్రాకులాడుచు పొగిలితిన్" *

(కృష్ణపక్షం)

ఎగరాలెననే కోరికా, రెక్కలు లేవని జ్ఞాపకం లేకపోవడం; జ్ఞాపకంవచ్చేటప్పటికి అయ్యో అని దుఃఖము ! "ప్రాకులాడితి" అనే మాటచేత యత్నమూ; విఫలత్వమూ, దుఃఖమూ, స్ఫురిస్తున్నై ! ఈ గ్రథనమే కావ్యానికి రమణీయత నిచ్చేది. ఈ నవ్యతే మన నవ్యకవులు సాధించింది ! కాబట్టి వాటికి రమణీయత్వ మొచ్చింది ! కావ్యత్వం సంపూర్ణంగా సిద్ధించింది !

---

*దీనికి మాతృక 1906 ప్రాంతంలో వుంది చూడండి. పాల్ క్లీ (*Paul klea*) అనే వక చిత్రకారుడు "*The hero with the wing*" అనేది చిత్రించాడు ! దాన్ని గూర్చి విమర్శకుడంటాడు. "*The one-winged human being who yearns to fly and is for ever rising into the air and crashing, martyr, invalid,...... and fool.*" (*Modern German Art*) ఇందు వక్క రెక్క. మనదేవులపల్లికి రెక్కలే లేవు ! అక్కడ యెగరడానికి ప్రయత్నం, పతనం సకారణం. ఇక్కడ పక్షాలే లేకుండా యెగ్గరాలనుకోడం అజ్ఞానమో యేమిటో !

దువ్వూరి* :

ఈన చిన్నప్పటినించీ వ్యవసాయము చెయ్యకపోయినా తత్సాంప్రదాయంలో పుట్టాడుకాబట్టిన్నీ, చిన్నప్పటినించీ కవితాశక్తి కలవాడౌటచేతా, నూతనభావాలు గాటంగా హృదయంలో నాటి తదనుగుణంగా గ్రామీణుల జీవనాన్ని చిత్రించాలనికోరిక పొడమింది. కాబట్టి వాళ్ళ వేషభాషలూ, వాళ్ళ నాగరకతా గమనించాడు. ఆయన రాశిన కావ్యాల్లో యిటువంటి పదసామగ్రి అనంతంగా కన పడుతుంది. "గిడ్డి" "పలుపు" "మేపుట" "అదల్చుట" మొదలైన జాన పదుల, అందులో కాపుల, నుడికారాలతో, వారి జీవితాంశాలు చక్కగా హృదయంగమంగా వర్ణించాడు. ఒక్కొక్క-చోట జానపదనాగరక జీవి తాల తారతమ్యం చెప్పినప్పుడూ, విశేషాన్నించీ సామాన్యాన్ని సమ ర్థించినప్పుడూ వచనంలో రాస్తేనే బాగుండేదేమో అనిపిస్తుంది.

"నేటి నాగరకత నీ మేలుగోరక

యప్పుచేసి బ్రతుకు మని విధించు,

---

* ఈయనకు 1915 సంవత్సరంలోనే కవిత్వము అంకురించినట్టు చెప్పుకున్నాడు. ఈప్రథమకాలంలో కొన్ని ప్రబంధాలు రాశాడు. ఒకదానిలో విమర్శకకృత్యాన్ని హృదయంగమంగా చెప్పాడు. ఈనకు్కూడా లాక్షణికుడంటే అసహ్యం యిందులో కనపడుతుంది. విమర్శకుడు "వ్యాకృతీ, లక్షణలక్ష్యాలూ, జిడ్డుకట్టేటుతిని అజీర్ణపుగాలి త్రేస్తాడట!"ఆయనకు బ్రహ్మ "సరసాత్మ, కోమలతా, లోపముచేశా"డట! ఈవిధంగా విమర్శకుడిని చిత్రించాడు. ఉన్మాదంతో యిష్టమొచ్చినట్టు రాశే కవికుమారుడి మాట లను విమర్శకుడు లెక్క-చెయ్య నవసరంలేదు! ఈన కాళిదాసు ఋతుసంహారమూ, పుష్ప బాణవిలాసభాణమూ భాషాంతరీకరించాడు. ఈన కథలపొంత బోలేదు. వచనం నాట కాల్లోతప్ప రాయలేదు. చక్కని సలక్షణభాషను 99 వంతులు రాశినవాడు. చాలా హృదయంగమమైన శబ్దసౌష్టవం! ఈనకు డాక్టరుకజిన్సు అనే పేరుగల గొప్ప ఐర్లాండు కవి ప్రోత్సాహమిచ్చినట్టు విశ్వనాథవారు చెప్పారు. ఈన తన కొన్ని కావ్యాలు "*voice of the reed*" అనే పేరుతో ఆంగ్లంలోకి పరివర్తనంచేసి ప్రచురించాడు.

నాయవృద్ధికన్న నావశ్యకపదార్థ
సంఖ్యహెచ్చ జిత్తశాంతియున్నె ?"

ఈ ఆర్థకశాస్త్రసిద్ధాంతంలో యెంతమాత్రం కావ్యత్వం లేదు. ఇటువంటివే వేదాంతఘట్టాలు కూడా అనేకంగా వున్నవి. ఈన దృక్పథం సమస్త రంగురంగుల ప్రకృతి వర్ణనముగాక దరిద్ర కృషికజీవిత సంబద్ధాలైన ప్రకృతివిశేషాలను చిత్రించడంమీదికీ అక్కడక్కడా తత్వశాస్త్ర సామ్యవాదాలమీదికీ పోయింది !* ఈన కూడా తాను వర్ణించే వస్తువుకూ, భావాలకూ అనుకూలమైన పద జాలాన్నీ వస్తుజాలాన్నీ సంగ్రహించాడు. ఈనలో భావనాశక్తి "జల దాంగన"లో చక్కగా చూడవచ్చు. ఈన **1918–21** మధ్య కొన్నీ, **1921-25** మధ్య కొన్నీ ఖండకావ్యాలురచించాడు. కొన్నిటిని వెనకటి అధ్యాయంలో చెప్పాలశింది. కాలం మనకు సాకల్యాత్తుగా ఆవ శ్యకం కాదు కాబట్టి యెక్కడ చెబితేనేమి ? ఆ ఖండకావ్యా లన్నీ "నక్షత్రమాల" "నైవేద్యము" అనే పేర్లతో ప్రచురించాడు. నక్షత్ర మాలలో మొదటి "కవిమనోరథమూ" కృష్ణశాస్త్రిగారి కృష్ణపక్షం ప్రథమగేయమూ కొన్ని సమాన భావాలతో నిండున్నై. రామిరెడ్డి గారు పరమేశ్వరుడు తనను "జలదార్భకుడుగా" "తుహినాంబుకళి కగా" "మలయూట కాల్వగా" "కలువగా" "మురిపెంపుచుక్కగా" యేల సృజించలేదని చాలా విచారపడ్డాను! దేవులపల్లి తానేం కావా లని చెప్పాడో చూడండి. "ఆకులో ఆకు" "పూవులో పూవు" "నును లేతరెమ్మ" "చిరుగాలి కెరటం" "నెలపాటలో తేట" "తెరచాటు తేటి" "చిన్నారి సిగ్గు" "జలదంపునీలంపునిగ్గు". ఈ విధంగా వుం దీన

*ఒకఖండకావ్యంలో పిల్లలనుకోల్పోయి కూడులేక మలమలమాడుతున్న "మునలి మాలెత" యొక్క ముష్టెత్తడాని కిష్టం లేకపోవడమూ, కష్టంచేసి పొట్టపోసుకోవాలనే యిచ్ఛా, కూలి దొరికినప్పు డామె సంతోషమూ చాలా రసవంతంగా వర్ణించాడు. 1921 సంవత్సరపు జాతీయోద్యమం యీనను కొంచెం కదిపింది. "రాట్నపుపాట" 'జాతీయగీతమూ'' మొదలైన ఖండకావ్యాలను రాయించిం దీనచేత.

సామగ్రి. ఇప్పు డున్నట్టుకాక మరోవిధంగా అయిపోదామనే యిచ్ఛ యిద్దరికీ సమానం! ఒకాయన "జలదార్భకుడు" కావాలనుకుంటే, రెండో ఆయన "జలదంపునీలంపునిగ్గు" అయిపోవాలని అనుకుంటు న్నాడు. ఒకరు "మలయూటకాల్వ" కావాలనుకుంటే రెండోవారు "సెలపాటలో తేట" కావాలనుకుంటున్నాడు! చూశారా సామ్యం! కవికుమారుల ఊహాసామ్యమంటే యిదే! ఆ కాలపు భావైక్యాన్నీ, ప్రకృతిప్రణయాన్నీ తెల్పుతున్నది! ఏకకాలంలో భిన్నవ్యక్తుల్లో, భిన్నస్థలాల్లో, భావైక్యత తత్కాలమహిమ!* ఈ ప్రథమఖండ కావ్యాల్లోనూ, తర్వాతవాటిలోనూకూడా, కవియొక్క మృదుహృదయమూ, ప్రకృతిప్రీతీ, మొదలైనవన్నీ సమానధర్మాలుగా కనపడుతూనే వున్నై. ఈన "కుసుమాశ్రువు"లని రాయప్రోలువారి శబ్ద సామగ్రికి మరోరకం అశ్రువులను చేర్చాడు! పూలనుంచీ కారే హిమాంబువులకీ చక్కని పేరునిచ్చాడు కవికుమారుడు! ఈనలో కూడా అక్కడక్కడా వితర్కమూ, భావనా, గవేషణమూ, కనపడుతూనే వుంటాయి. ఈనదికూడా చక్కని "రీతి". శ్రవణసుఖమే యీనకూడా ప్రాప్యం. సరళభావాలను పొడుగాటి సమాసాలతో చెప్పడం వేదులవారివలె యీనకూడా అక్కడక్కడా కలుగుతుంది! ఈనకూడా హృదయ మతి కోమలమవడంచేత "ప్రేయసిని" శ్రమపెట్టడు! "ప్రేయసిం దన కవుంగిట నొత్తు"టతోనే, తృప్తిని పొందుతాడు.♦

---

* 16 శతాబ్దంలో వక్కాకాలంలో పింగళి సూరన మాయానలకూర రంభలను సృష్టిస్తే షేక్సిపియరు "కామెడీ ఆఫ్ ఎర్రరుస్" (*Comedy of errors*)అని వకే పోలిక వ్యక్తులను గూర్చిన నాటకం రాశాడు.

♦ ఒక్కొక్కప్పు డదిగూడా ఉండదు. చూడండి,

> "అభిశప్తజీవన్నుండైన నేనేడ
> సకీయకంఠాశ్లేషసౌఖ్య మది యేడ?"

ఈ విషయంలో వెనక నేను చెప్పినవారితో సమానుడే యీనకూడాను!

తరవాత కాలంలో అనగా 1921—25 సంవత్సరాలమధ్య యీన రాశిన ఖండకావ్యాల్లో కొన్ని పద్యసంభాషణారూపాలుగా వున్నై !♦ ఈనకూడా వాక్చిత్రకల్పనలో చాలా ప్రజ్ఞచూపాడు. చూడండీ కిందిరూపకము.

> "విజ్ఞానమయమైన విస్ఫులింగమున
> నంటింపు నా హృదయంపు గప్పూరము"

ఇదివరక నవ్యకల్పన ! ప్రేయసి యీనరమ్మన్న కాలానికి రాలేదు ! ఆ సందర్భంలో,

> "ఇంక మాకు బరస్పరేక్షణప్రాప్తి
> కలుగుట నిజమేని, కన్నీరుబొట్ల
> మాలను రచియించి, మాయలమారి
> చేడియ కర్పించి, శిక్షగావింతు"

అన్నాడు.

ఇందలి తుదిపాదము మిక్కిలి రసవంతము. ప్రేమకు పరమావధి ! కన్నీటిచే శిక్ష యొనర్చుట ! గాంధీగారి అహింసాతత్వం వలె ఉందియిది ? ప్రియురాలికి ప్రియుడి కన్నీరుగాక వేరే శిక్షకావలెనా? ఈ కాలపు యీనరాతల్లో కొంత ద్విపద చక్కని శైలిలోవుంది. తుదిదశలో అనగా 1925-30 సంవత్సరాలకు మధ్య యీనకు ఆపత్పరంపర వచ్చినట్టున్నూ, తద్వారా కొంత దుఃఖం కవితారూపంగా వెలువడ్డట్టున్నూ కనపడుతుంది. జీవితం భారమైపోయింది. ప్రియావియోగం, శిశువియోగం, హృదయాన్ని కలచినట్టున్నూ,

---

♦ ఈన యీ కాలంలోనే కొన్ని నాటకాలుకూడా రాశాడు. బాగానే వున్నై! ఒక్కొక్కచోట యీనరాతల్లో ఇంగ్లీషుప్రతిబింబా లున్నై !

> "కాలిగుర్తు లనంతకాలసికతముల
> బూర్వవీరుపోల్కి ముద్రించిపొమ్ము"

"*foot-prints on sands of time*" కు ప్రతిబింబమిది.

కవితకు కావలసిన మనశ్శాంతి లేనట్టున్నూ చెప్పుకుంటున్నాడు. ఈ అధ్యాయానికి "భగ్నహృదయుడ"ని పేరుపెట్టాడు. ఇందులో అక్కడక్కడా దేవులపల్లి పోకడలున్నా ఆ దుఃఖఝురి యిందులో జలజలా పారు సెలయేరైంది! ఇది కూడా బాష్పాలను తెప్పిస్తున్నా, ఆ "వెక్కి-వెక్కి" యేడ్పుకిందయిది ఆగదు. అది దుఃఖహృదయహిమవన్నగం మీదినించీ దుమికే బాష్పగంగ! ఇది కరుణహృదయ సహ్యాద్రిలోనించీ ప్రవహించే కన్నీటి కావేరి! అదీభేదం! ఈ భాగంలో కొన్ని పోకడలు చాలా రమణీయాలున్నై!

"హృదయమును దొంగిలించిన రీతిగానె
స్మృతిని సైతము నీవు హరింపుమతివ"

ఇది చదివినప్పుడు కాళిదాసు "ప్రసక్తే నిర్వాణే హృదయ పరితాపం ప్రజసికిం" అనే శ్లోకపాదం జ్ఞప్తికి వస్తున్నది. కొంచెమీ భాగంలో భీభత్సం కూడా కనపడుతున్నది.

"........... కాటిదరివెచ్చగ నూర్చుచు గూరుచుండి నీ
లలిత మనోహరాకృతి నిలాతలమందున బారజూడ బొ
గ్గులమసి భగ్నశల్యములు గోచరమయ్యె నికేమిచెప్పుదున్"

ఆహా! రతిజుగుప్సల కెంత సమీప వైధర్మ్యాన్ని తెచ్చాడు!* దీని తర్వాత యిక యితనిగూర్చి రాయడానికి మన సొప్పడం లేదు! ఈ కాలాంతానికి పరిణత ప్రజ్ఞుడు కావడానికొక మెట్టు తక్కువైంది. కాని వాఙ్మయంలో చిరజీవిత్వం పొందాడు! తర్వాత క్వాచిత్కంగాతప్ప యీన యెక్కువగా రాయలేదు. 14 సంవత్సరాల తర్వాత ద్వితీయ భార్యాప్రోత్సాహంతో, వార్ధక్య

* రతి జుగుప్సగామారింది! ఈన తన వియోగాన్ని ఉదాత్త దృష్టితో చూడగల ఔన్నత్యం అప్పట్లో కోల్పోయినాడు. "ఉల్లమున తత్త్వబోధ కాలూనగలదె?" అని చెప్పడంతో యీన భావనాశక్తికి పరమావధియైపోయినది. ఈన్నతస్థానం పూర్తిగా చేరలేక పోయినాడు. దుఃఖాన్నికూడా సుఖంగా భావించ లేకపోయినాడు!

విహ్వాంగా వెడలిన "నెరసిన వెంట్రుక"తో, యీనకు మళ్ళీ కవితా జ్యోతి పునరుజ్జ్వలమై, 1942 సంవత్సరం ప్రారంభించి మళ్లి రాయటం మొదలుపెట్టాడు. "పలిత కేశం" (భారతి. 1942 జనవరి, ఫిబ్రవరి.) చాలా హృదయంగమంగావుండి, ఆయనకవిత్వాని కున్న సహజగుణాలతో వొప్పుతూ, మళ్లీ యీన నవ్యసాహిత్యంలో తన యథాస్థానం తీసుకుని భాషామతల్లిని అర్చిస్తాడనే ఆశ భావుకులకు కలగజేస్తున్నది. దీనిలో అనర్గళధార, భావనచేత స్వల్పవస్తువును విస్తరించడం, మృదువైన హాస్యం, తత్వోపదేశం, మొదలైన ఆయన కవిత్వాని కుండే సహజగుణాలు నశించలేదనీ, ఉద్బుద్ధాలైతే వెనకటి నిశితత్వంతో రాగలంత నాటుకుని ఉన్నయ్యనీ గట్టిపడుతున్నది. ఇంకా అనువృత్తిగా చాలా రాశే ధోరణికూడా గోచరిస్తున్నది. "గులిస్తాఁ"ను భాషాంతరీకరించినట్టుకూడా వింటున్నాము. ఈన "ఫారసీ" చదువుకున్నాడు. "ఖయ్యాము'' ను "పానశాల'' అనే పేరుతో మాతృకను చదివి తెనిగించాడు. అలాగే యిప్పు డీ "గులిస్తాఁ" ను కూడాను. ఈన నూతన కావ్యాలు యెప్పు డెప్పుడు వస్తాయా అని భావుకు లువ్విళ్ళూరుతున్నారు. "పలిత కేశం" లో మదరాసుబీచి వర్ణనవంటి స్వాభావిక రమణీయవర్ణనలు చాలా అరుదుగా ఉన్నవి యీ కాలంవాటిలో !

పర్యవసానం :

వెనక వివరించిన పేర్లవాళ్ళల్లో దాదాపు అందరిని స్పృశించాను. ఏ వేళ యెవ్వరైనా వకరిద్దరు మిగిలితే వెనక చెప్పినమాటలే వాళ్లకుకూడా వర్తిసై.

రాయప్రోలు, బసవరాజు, నండూర్ల కవితాస్రవంతి ప్రవహిస్తూనేవుంది. రాయప్రోలువారి కావ్యాలు ఒకదాని వెనక వకటి వస్తూనేవున్నై. బసవరాజు "సెలయేటిగానం" అచ్చైంది. మిగిలినవి తయారౌతున్నై. నండూరువారి "యెంకిపాటలు" దేశమంతా యువ

కుల నోళ్లల్లో మారుమోగుతున్నై. అప్పారావుగారి ముత్యాల సరాలూ నీలగిరిపాటలూ దేశమంతటా పునఃపునః పఠనంచేసి కవికుమారులు వాటి ననుకరిస్తున్నారు. కృష్ణపక్షమొచ్చింది. దేశాన్ని దుఃఖంలో ముంచేశింది. వేదులవారి కవితాధారను పత్రికల్లో చదివి దేశం ఆహ్లాదిస్తున్నది. దీపావళి తయారౌతున్నది. రామిరెడ్డిగారు తమ సహజ కవితా ధురీణాలైన కావ్యాలను రచించి అచ్చేయించి ఆనందింపచేస్తున్నారు. కొందరు కీర్తిశేషులై దేశం తమ్ము స్మరించుకునేట్టు చేశిపోయినారు. సభాపతిగారు నూతన మార్గాలనన్వేషిస్తూ తాను స్వయంగా దారి చూపిస్తూ, హృదయేశ్వరీత్యాది రసవద్గ్రంథాలను రచిస్తూ, యీ నూతనోద్యమానికి క్రమక్రమంగా బలం చేకూరుస్తూ వున్నాడు. ఈకాలాంతానికి అనగా 1930 నాటికి కొందరికప్పుడే కవితా జ్యోతి కొంచెం తగ్గుతున్నట్టు కనపడుతున్నది. పైన పేర్కొన్న వాళ్లలో 1930 తర్వాత కవితాసాధన చేసినవాళ్ళు తక్కువ! శివశంకరశాస్త్రిగారి జ్యోతి యితోధికంగా వెలిగి, తర్వాత తరానికూడా తేజస్సు నిచ్చింది. పింగళి కాటూర్ల కవితా స్రవంతి "సౌందరనంద"కావ్యకర్తృత్వంలో వినియోగ మౌతున్నది. వీళ్ళకు ముట్నూరివారి ప్రోద్బలం వుంది. ఈమార్గాన్ని సంపూర్ణంగా అవలంబించలేక బౌద్ధవాఙ్మయంమీదికి దృష్టి మరల్చారు కొందరు. అరవిందుడి యోగసాధన దీనికి కొంచెం దోహదమిచ్చింది. జాషువా నక్షత్రం క్రమక్రమంగా తేజోవంత మౌతున్నది. కొడాలి సుబ్బారావుగారు చిన్నతనంలోనే చాలా అభివృద్ధిని సూచించాడు. కాని పరమేశ్వరు డాయుర్భాగ్య మియ్యలేదు. పింగళి నాగేంద్రరావు "నారాజు"ను సాహితిద్వారానే పూర్తి చేసుకున్నాడు. యువకులు కొందరు లక్షణశాస్త్రం చదివి యీ నూతన కావ్యాలను సానుభూతితో విమర్శించడం మొదలెట్టారు. వీళ్ళ యీ పని యీ కవితా ప్రచారానికి చాలా సహాయం చేశింది. ఇట్లా వుంది పద్యకవిత 1930

సంవత్సరంనాటికి! సాహితీపత్రిక నెంత ఉత్సాహంతో నడిపినా, కవికుమారులు పోషించినా అంతరించడం విచారకరం. ఇంతలో బందరులో "శారద" లేవదీసి కవుతా శ్రీరామశాస్త్రిగారు యీ నవ్యసాహిత్యస్రవంతికి జాలు కల్పించాడు. అందులో వెనకటివారిలో చాలామంది సాధన చెయ్యటం మొదలెట్టారు. పంచాగ్నులవారు సారస్వతరంగంలో ప్రవేశించి క్రమంగా యీ నవ్యసాహిత్యోద్యమానికి బలం చేకూరుస్తున్నారు. ఇది చాలా గొప్ప విషయం. ఈ నవ్యసాహిత్యానికి పండితాదరణ లేదనే లోటు చాలా తీర్చారు శాస్త్రిగారు. వీరి సహాయం నవ్యసాహిత్యానికి పెట్టనికోటై ప్రతిపక్షులను నిరాయుధులను చేశింది.

భావగద్య :

వీళ్ళలో కొందరు "భావగద్యం" (Prose Poetry) రాయడానికి ప్రయత్నించారు. ఇట్లా ప్రయత్నించినవాళ్ళల్లో మునిమాణిక్యం, అడివి, విశ్వనాథ ముఖ్యులు. కాని మునిమాణిక్యంమాత్రం పద్యంలోగాని యీ భావగద్యంలోగాని మెట్టి అభ్యున్నతి పొందలేదు. కథను గ్రహించి దానిలో సిద్ధహస్తుడైనాడు. మిగిలిన యిద్దరూ తర్వాత పద్య గద్య వీధిసంచారం చక్కగా చేయడంలో సిద్ధిపొందారు! వకటి రెండుదాహరణ లిస్తాను. "కవి, ఆనంద" మనే పేరుతో మునిమాణిక్య మిట్లా రాస్తున్నాడు. "పట్టణములు భగభగమండిపోనీ! ఆకరాళజ్వాలామాలికాచయము, ఆదవాగ్నికీలలు, ఆదవానలోద్భూతధూమశకలములు, ఆ కాలవహ్ని న న్నానందింపజేయును! నే నాడుదును! వీణాగానమొనరింతును!" యెంత భీభత్సము! కవికేమి! పట్నాలు మండితే నష్టపడేవాళ్ళు వేరు! అటువంటి దృశ్యం, నిజంగాచూస్తే దుఃఖించక ఆనందంపొందే కవి రాక్షసిగాని మానవుడు కాడు! ఆ దుఃఖించే నిజమైన కవిరాతలు చదివి ఆనందించేవాళ్ళం సహృదయులం మేము! ఇదే చాలు యీన యీమార్గంలో సిద్ధుడు

కాదని చెప్పడానికి తార్కాణం. దుఃఖదర్శనంచేత వాల్మీకికి "శోకః శ్లోకత్వమాగతః"; కాని యీనకు యితరులబాధతో కలిగిన "ఆనందః శ్లోకత్వ మాగతః"! ఎందు కీకృత్రిమ చిత్తవృత్తులు! ఈన పద్యం రాయడం మానేశాడు! బ్రతికిపోయినాం! అంతేగాక స్వభావహాస్య ప్రకృతిఅయిన యీన యిటువంటి ప్రకృతికి తగనివాడు! అడివి :—

"నాకు రెక్కలేయుండిన యడల గౌతమీవీచికా నఖశిఖరంబుల నంటీ యంటనట్లు, సూర్యకిరణపుంజెలిమి పుట్టు, ఇంద్రధనుస్సులలో నెగిరిపోవువాడ. నే మీనంబనైనచో గౌతమీ స్రవంతికానీల గభీరప్రదేశంబుల నీదుచు, క్రిందికి నింకివచ్చు నీ రెండవెలుగుల చెలగాటలాడుచు జలహిమస్పర్శలో పరవశుడనై యుండువాడ :—"
వెనకటి భీభత్సం లేకపోయినా, అంతకంటె లలితంగావున్నా, మొత్తం మీద తెచ్చిపెట్టుకున్న భావనగావుందిగాని సహజంగా యేదోదృశ్యం చూచి హృదయావేదన పొందినట్టు యెంతమాత్రం కనపడటంలేదు! భాషకూడా మిట్ట పల్లాలుగా వుంది. "చెలిమిపుట్టు" అనే చోట "చెలిమిచేతపుట్టు" అని అర్థంచేసుకోవాలె! వీచికలకూ సూర్యకిరణాలకూ సంయోగంవల్లకదా ఇంద్రధనుస్సు పుడుతుంది! ఇక్కడో విప్రతిపత్తు! ఆకాశంలో ఈసంయోగం కలిగితేగాని ఇంద్రధనుస్సు పుట్టదు! ఇలా శాస్త్రదృష్టానికి భిన్నంగావుండకూడదు వస్తువు! విశ్వనాథవారిని కొంచెం గమనించండి:- రంగం. కృష్ణానదీతీరము, వక యువకుడు, ఒక బిచ్చుకత్తె వచ్చింది. "ఒకబిచ్చపుది! ప్రౌఢవయః పరిపాక! మేని చినుగుపుట్టముదికి యెన్నేండ్లైనదో? డబ్బు లడుగు కొనుచున్నది. ఇచ్చినవారిచ్చిరి! లేనివారు లేరు! ఆమె దీనములైన కనులతో నతనికడకు వచ్చినది. అతడు కనులెత్తి చూచినాడు. ఇద్దరిచూపులు కలిసినవి. ఆమె వదనాంత మనోజ్ఞరేఖాంతరమ్ముల మన్మథుడు నివాసమున్నాడు. ఆ కనులయందము రతికి తలవంపు"

కొంత ముచ్చటగా వుందిది! వక విధమైన అవ్యక్తమధురమైన శ్రావ్యతేకాకుండా, హ్రస్వవాక్య పరంపరలో, వాట్లో సమానాంతాల్లో, వక మధురమైన లయ వున్నట్టు గోచరమౌతున్నది. "వదనాంత" "రేఖాంత" పదాలూ, "ఇచ్చినవారిచ్చిరి, లేనివారు లేరు." మొదలైనవాట్లో వక అవ్యక్త మాధుర్యముంది. "మన్మథుడు నివాసమున్నాడు" "రతికి తలవంపు" యీ నుడికారాలు పద్యాల్లో వుండాలశినవి. అందుచేత పద్యవాతావరణం కలగచేశినై గద్యానికి. గణాలుగాని, మాత్రలుగాని, లేకపోయినా, వకవిధమైన శబ్దసామ్యముండడంవల్ల ఆ పదసమ్మేళనానికి కంత సౌందర్యమొచ్చింది. ఈన యీ శక్తితర్వాత యీనరాతల్లో కంఠోక్తిగానూ, సహజంగానూ, హృదయంగమంగానూ, రసవంతంగానూ పాఠకులు చూస్తారు. అడివి కూడా తర్వాత వదిలినట్టే కనపడుతుందీ మార్గం! సాధిస్తే సిద్ధహస్తుడైయేవాడే! ఈ మార్గంలో సిద్ధిపొందటం సులభసాధ్యంకాదు.

## రచనలో చేసిన కొన్ని మార్పులు :*

పద్యాల్లోనూ గీతాల్లోనూ కూడా కొన్నిమార్పులు కనిపిస్తై! కొన్ని యెత్తిచూపిస్తాను. ముఖ్యంగా మార్పు కలగజేసినవాళ్లల్లో సభాపతీ, కృష్ణపక్షకర్తా, కూడా వున్నారు.

**1. సమవృత్తాల్లో నాలుగుపాదాలుకాకుండా రెండేశేరాయుడం.**

"ఈహామహాశపగం దొడరి యీదుచునుండ జలాంగనాస్వయం
గ్రాహనిబద్ధ దివ్యతరగాత్రుడవై వసియింతె లోతునన్॥

ఇది "అజ్ఞాతమిత్రము"నే ఖండకావ్యవైఖరి. రెండేసి పాదాల నొక వృత్తంగా విభజించాడు శివశంకరశాస్త్రిగారు. ప్రాస రెండేసికే ఉంచాడు. ఈ రెంటిలోమాత్రం యతిప్రాసలను పాటించాడు. ఈ ఖండకావ్యశీర్షిక నాకు కొంచెం బాగుండలేదు! కాని కవిగారు బుద్ధి

*ఈ మార్పులు 1930 వరకు వర్తించేవి. తరవాత యింతకంటె చాలా ముఖ్యమైన మార్పులు కలిగినవి.

పూర్వకంగా వైధర్మ్యం గల రెండు భావాలను కలపదలచుకున్నా రేమో తెలియదు. ఈ పద్ధతి గీతం మొదలైన దేశీయ ఛందస్సుల కూడా వర్తింపజేశాడు.* దానితో వారి ఉద్దేశ్యం (ఛందోభంగం) కనపడుతున్నది. ఈ ఛందోభంగ మొక నూతనమార్గం.

**2. ఇష్టమొచ్చినట్టు పాదాలను గణనియమంగాని, మాత్రా నియమంగాని లేకుండా విభాగం చెయ్యడం.** చూడండి కింది గీతం ♦

" 1. భయగర్జితములు
2. వినవచ్చుచున్నవి
3. ఆశామందహాసములు
4. కనవచ్చుచున్నవి.

* * *

5. నా హృదయవీణకు
6. ఒక్కటియె తీగ
7. ఓసఖీ
8. నా కవితాదేవికి
9. ఒక్కటియెపాట
10. ఓసఖీ
11. నాకు,
12. ఒక్కటియె వస్త్రము

---

*"పద్మావతీ చరణచారణ చక్రవర్తి" చూడండి.

♦ ఇటువంటివిషయంలో ఆల్డసుహక్స్లీ అనే వక ఆంగ్లవిమర్శకు డిట్లా అన్నాడు:

"*Metres whose rhythms............are strong, resistant and practically invariable offer the poet a kind of short-cut to musicality. They provide him both a ready-made, reach-me-down music. He does not have to create a music appropriately modulated to his meaning; all he has to do is to shovel the meaning into the moving stream of the metre and allow the current to carry it along..............*"

13. ఓసఖీ
14. నాకు,
15. ఒక్కడే శ్రోత
16. ఓసఖీ

*        *        *

17. చీకటి గుహాలో
18. నల్లనినది
19. ఒక్కటి
20. పారుచున్నది
21. దాని
22. రాతిగట్టుపై
23. ఒక్కడు
24. కూర్చున్నాడు
25. సూర్యుడంతవృద్ధుడు
26. అంతకన్నవృద్ధుడు
27. ఆతడు
28. ఇంద్రధనురంబరముల
29. నేయుచున్నాడు.

*        *        *

దీన్నేమనాలో నాకు తెలియకుండా వుంది! దీన్ని స్వామీ శ్రీ ఆనంద ఆచార్య అనే ఆయన రాశాడు. ఈ విధమైన రచన యిప్పుడు కాలంలో చాలా కనపడుతున్నది. ఇటువంటిదానికి పునాది 1923 సంవత్సరంలో పడ్డదని దీనివల్ల తెలుస్తున్నది. ఇది యింగ్లాండులో యుద్ధానంతరం వచ్చినమార్పు. ఇదేగాక ఛందస్సును పాటింపక పోవడం, శబ్దసామ్యంమాత్రమే పాటించడం (Rhythm), గణవిభజనం మీాద బొత్తుగా దృష్టివుంచక పోవడం, మొదలైనవన్నీ ఆచారమై పోయినై యింగ్లాండులో యుద్ధమైనతర్వాత! ఈ కింది వాక్యాన్ని

గమనించండి. "Poets juggled with new words and new forms. They tried new Rhythms in all kinds of combination possible and imposible." *

దీన్నిబట్టి పరీక్షచేస్తే సరిగా అట్లాగేవున్నై పైబంతులు. పాద సమతను గనక ఆలోచిస్తే 2, 4 బంతులు సమాలు. 5, 6, 7 ళ్లు 8, 9, 10 లకు క్రమంగా సమాలుగావున్నై! 11, 12, 13 ళ్లు 14, 15, 16 లకు సమాలుగావున్నై! అక్కడినించీ అల్లరి మొదలెట్టింది. సమతకూడా, ఉంటేఉంది లేకపోతేలేదు. గీతమంతా యిట్లాగేవుంది. అంత్యనియమాన్ని చూదాం. 1, 3 కలిగున్నై; 2, 4 లు కలిగున్నై; "వీణకు" "దేవికి" విభక్తిసామ్యం; "తీగ"కూ "పాట"కూ అక్షర; సంఖ్యాసామ్యం; తర్వాత శబ్దసామ్యం కొంతవుంది. "ఓసఖీ" 4 మార్లు "నాకు"రెండుమార్లువచ్చినై. తర్వాత మళ్లిఅడివి. ఈ రచన నవ్యంలో నవ్యం. ఇదొక నూతన గీతమార్గం.•

---

*"*What is that mother?*
*That, dear, is a wood.*
*Can we go in?*
*Yes, if you like.*
*What's this mother*
*That's is a tree, dear.*
*And this? And this? And this?*
*All trees dear.*
*And this?*
*That's is a tree, too, I think only it has run a little wild.*
*Oh mother, where's the wood gone to?*
*It is still here, dearest. We are in it;*
*but you can't see for the trees."*

ఈఉదాహరణం ఛందస్సుకు మాత్రమే, పై అనువాదంలో "*wood*" కూ "*trees,*" కీ భేదం చక్కగా తెల్పాడు కవి.

• *Metrical confusion*

**3. దేశీయ ఛందస్సులను వాడటం:** గేయాలలో బహుళంగా మాత్రాఛందస్సునే వాడారు. ఇతరాలలోకూడా దేశీయాలైనగీతం, మొదలైనవాటికే ప్రాముఖ్యాన్నిచ్చారు. ఒక్కొక్కప్పుడీ ఛందస్సులు సంకరంగాకూడా వుండటంకద్దు. భిన్నఛందస్సులను సమవిషంగా ఉపయోగించడం ఉంటుంది. ఈవిధమైన రాతలు చాలామంది రాశారు. ఆంగ్లంలో కొన్ని ఛందస్సు లున్నై యిటువంటివి. వాటి ననుకరించడం మొదలుపెట్టారు వీళ్లు.

"చిన్నిపూలేవాడెనా ?
తన
కన్నెవలపుల వీడెనా ?
తన
చిన్నెలన్నియు వన్నెలన్నియు
మున్నులో గోల్పోయెనా ?"

ఇది అసమమాత్రాఛందస్సు గల గేయం! బాగానే వుంది. తర్వాతది చూడండి.

"కాంతు నెరుగని కన్నెగాదా ?
సిగ్గువీడని మొగ్గగాదా ?
మొన్నమొన్ననె ముద్దువల్లిని
మొసలు ౹దీరెనుగా !"

ఇది మరోరకం! ఇలా ఛందస్సమ్మేళనం ! "కన్నీటి కెరటాలలో వెన్నెలేలా" అనే గీతంలో యెన్ని రకాల ఛందస్సుందో చదువరు లెరుగుదురు ! ఈ కింది వేదులవారి గీతం తిలకించండి.

"తూర్పువాకిటిగూట తొలిదివ్వె వెలిగించి
తొగరుపావడసంజ తొలగిపోయెడువేళ,

---

* దీనికికూడా "పద్మావతీ చరణచారణ చక్రవర్తి"లో చాలా ఉదాహరణాలున్నై.

"ఒంటిగా వేడి ని
ట్టూర్పు లెగబోయుచును,
జంటదొరగిన పడుచు
చక్రవాకి విధాన,
ఈ సముద్రతటాన ఏ సఖునికోసమై
గాసిజెందుచునుంటివో సఖీ! ప్రియసఖీ!"

ఈ కిందిదికూడాను :

'నాలోనె నేడు బృందావనము విరిసినది,
నాలోనె నేడె యమునాతటిని మొరసినది,
ఏ వసంతానిలమొ
ఏ గాన కలకలమొ
ఈ నా యెడదనిండా నిండిపోయినది
ఓ దివ్యగాయకా?
ఓ ప్రాణనాయకా?
ఏది యింకొక్కమా యూదరా నీ మురళి?"

మనోహరమాత్రా చందోగానం! ఈ విధంగా అసమపాదా లుగలా, ఒక్కొక్కప్పుడు సమతలేనీ, ఒక్కొక్కప్పుడు సమవిష యాలు సామ్యము గలిగీ, మరొకప్పుడు, రెంటిమూటి వ్యవధానంగా సమతకలిగీ, సామాన్యంగా అంత్యనియమం వుండేరచనకు ప్రారం భించారీ కవికుమారులు. గురజాడవారి ముత్యాలసరాలు చాలా మంది అనుకరించారు. ఈ గీతరచనం సుబ్బారావుగారుకూడా అనుస రిస్తున్నారు ఇప్పుడు. ఈవిధమైన గీతీ వైవిధ్యం, చాలా యెక్కువైంది. లయప్రధాన మవడంచేత యీ మార్పు ప్రశంసనీయం.

**4. ఛందస్సులను బొత్తుగా వదలడం.** ఈ కవికుమారులు వెనకటివాళ్లలాగాక పద్యవాక్యాల్లో గద్యను బొత్తిగా తీసేశారు. ఇది

వక గొప్ప మార్పు. మనకు మొదటినించీ చంపువులుగా ప్రబంధా లుండడ మలవాటు! దాన్ని వీళ్లు మార్చడం సమంజసం! ఇదికూడా యింగ్లీషు అనుకరణమే!

**5. పద్యసంభాషణలు; పద్యకథలు.** వెనక రామిరెడ్డిగార్ని గూర్చి చెప్పినప్పుడు పద్యసంభాషణలనుగూర్చి చెప్పాను. ఈకాలానికి దగ్గిరగానే "కోకిలాకాకం" అనే శీర్షికతో వక కవికుమారుడు పద్య కథను రాశాడు. సభాపతిగారీ దోవన చాలా సాధనచేశాడు. ఆయన పద్యనాటిక లిప్పటికి దాదాపు 10 కి మించినై! పద్మావతీ చరణ చారణ చక్రవర్తిత్యాదులు ఆంధ్రదేశంలో యువకుల కందరికీ పరిచి తాలే!

**6. పద్యపాదసంఖ్య కంతులేకపోవడం.** ఇదేంతప్పూ కాదుగాని, పాఠకుడిలో వకవిధమైన విసుగును కలగచేస్తుంది కొంతచదివిన తర్వాత. ఇదికూడా ఆంగ్లసారస్వతం మనకిచ్చిన ఊహే!

**7. గద్యనాటకాలు.** ఒకవంక పద్యనాటకాలు సభాపతీత్యాదులు రాస్తూంటే, యింకాకొందరు కేవలగద్యనాటకాలు రాయటానికి పూనారు. ఆంగ్లసారస్వతంలో గద్యనాటకాలు రచిస్తున్నారు కవ్వలీ కాలంలో. వెనక పానుగంటివారినిగూర్చి చెప్పినప్పుడు యీ విషయం కొంచెంచెప్పాను. గద్యపద్యనాటకాల పరస్పర గుణాగుణాలు చెప్పడమనవసరం. రసపోషణ పద్యముంటేనేగాని జరగదనటానికి వీల్లేదు. కాని భావం లయసహితంగా వెలువడడం సహజం. గద్యనాట కాలు సర్వజనం తెలుసుకోడానికి వీలుంటుంది. పద్యంకూడా భావ ప్రధానంగా వున్నస్థలంలో యెక్కడైనా వుంటే నాటకంలో రసపుష్టి కలగచేస్తుంది. దీనికి దారిచూపినవాళ్ళు పూర్వయుగంలోనే వున్నారు. కాని నవ్యులు యీ విషయంలో బహుళంగా కృషి మొదలుపెట్టారు. చింతా దీక్షితులు మొదలైనవారీ కృషిచేశారు. కాబట్టి యీకాలంలో

మూడు రకాల నాటకాలూ సాధించారు సాధకులు. ఈ నాటకాల్లో వెనకటివలెగాకుండా చిన్నవి, ఏకాంకికలు వీళ్ళు సాధించటం మొదలెట్టారు. ఇది సమంజసమే! ఎందుకంటె హ్రస్వకావ్యకాలమిది! పొడుగాటి పద్యకావ్యంగాని, గద్యకావ్యంగాని చదవటానికి పాఠకులకూ, రాయడానికి కవులకూ కావలసిన ఓపిక లేదు. ఖండకావ్యం, చిన్నకథ, అభివృద్ధిపొందినకాలంలో ఏకాంకికలూ, నాటికలూకూడా లేచాయనడం చాలా సమంజసం! సాహితీసమితి సంచికల్లో "వరూధిని" "కైలాస శిఖరం" అనే యేకాంకికలున్నై! వాటిని వెనకటి ఆకాశంమీదనించీ భూమికి దింపా రీ కవులు ?

## కొన్ని యితర గుణదోషాలు :

వీళ్లు ఉపయోగించే కొన్ని ఉపమానాలూ, పదబంధాలూ అప్రయుక్తాలు. కొందరు తాము చెప్పదలచుకున్న భావాన్ని స్పష్టంగా చెప్పలేనివాళ్ళున్నారు. అందుచేతదాన్ని అపుష్టార్థమనవచ్చు. చ్యుతసంస్కారం చాలామందికి మతమే! అర్థానుస్వారాలను కొందరు పాటించారు. కొందరు లేదు. చాలామంది విసంధిని ఆమోదించి ఉపయోగించారు. శకటరేఫను అవసరమైన స్థలాల్లో — అనగా ద్విత్వాల్లో వేస్తూనే వచ్చారు. కాని, సామాన్యంగా భేదం చూపించలేదు. ఇక ఛందోభంగాలకు మితిలేదు. వెనక చూశాం! ఈ ప్రకారంగా లాక్షణికులు చెప్పే కావ్యదోషా లున్నాయని వొప్పుకోవలశిందే! కాని యివన్నీ బుద్ధిపూర్వకంగా చేశేవాళ్ళ నేమంటాము? అంతే గాక కొన్ని యిందులో గతానుగతికంగా దోషా లనడమేకాని వీటిని అనేకులు పూర్వులే పాటించలేదు! మరిన్నీ భాషా, భావమూ, సులభమై నూతనమయ్యే దినాల్లో అప్రయుక్తాలని కూచుంటే భావ్యమా? నన్నయాదులు వాడని యెన్ని మాటలూ, పదబంధాలూ భాషలోకిరాలేదు? కాబట్టి వక కాలాని కప్రయుక్త

[illegible] యింకొక కాలానికి ప్రయుక్త మౌతుంది. చ్యుతసంస్కారం గి[illegible]వన్నారి భాషాసంస్కార వాదాంతర్భూతం. నియమ శృంఖలలను తెంచేశే రోజుల్లో ఛందోభంగ మొక లోపమా? సభాపతి మొద మైన వాళ్ల పట్టుదలచేత యింకా సాధకులు యతిప్రాసలను వదల లేదు! అందుకు వాళ్ళను అభినందించాలె! ఆధునికులు కొందరు యీ యతిప్రాసలు పద్యానికిగాని, గీతానికిగాని, వక విధమైన గమ నాన్నిస్తాయని వదలకపోవడమే నియమంగాకూడా పెట్టుకున్నారు. కొందరు వీరిలో యెంతకాలంకిందో ఉపయోగింపబడి యిటీవల వద లిన పదాలనూ ప్రయోగాలనూ చేయడంకూడా కనపడుతుంది.* మచ్చుకు వేదులవారిలో వక ఉదాహరణాన్నిస్తాను.

"నాకడనె నేర్చె ప్రణయ హేవాక కేళి!"

"హేవాక" శబ్దమీామధ్య యెవ్వరూ ఉపయోగించింది కాదు.

"పూజారివాఁడుగో! పువ్వు బెత్తులను" అన్నాడు.

"వాఁడుగో" పదం మానేసి చాలా దినాలైంది మనవాండ్లు. "అదుగో" అనేది పూర్ణంగా వాడుకలో కెక్కిపోయింది. ఇది రామి రెడ్డిగారి నిర్దుష్టభాషకు సమంజసమే! యీవిధంగా లోపాలను స్పృశించినతర్వాత కొన్ని గుణాభాసాలను స్పృశిస్తాను.

## గూఢత (మర్మకవిత): †

ఇది ఈ యుగాని కొక ముఖ్యం! ఈ శతాబ్దంలో దీనికి

* విశ్వనాథ యీ పద్ధతికి పట్టుగొమ్మ అయినాడు.

† Mysticism అనేమాటకు "భావయోగం" అనే మాట వాడాడు భారతిలో "జీవకళ" వ్యాసం రాశిన "శాస్త్రి" అనే గూఢనామధేయుడు. కాని ఆ పదం వాడితే, వాడిన ప్రతిచోటా పక్కనే ఇంగ్లీషుపదం వాడాలశొస్తుందని నేను వాడలేదు. ఈ పదం బాగానేవుంది. (భారతి : విక్రమాషాఢం) కాని నేను వాడింది "అన్యాప దేశం, విషయనిగరణం" అనే అర్థంలో. అర్థంకాకపోవడమే నవ్యుల రాతల్లో ఉన్న mysticism. ఇది "భావయోగం" యెప్పటికీకాదు.

చాలా బలమొచ్చింది. ప్రకృతిశాస్త్రాలపారంగా పెరిగిపోవడంచేత ప్రతివాళ్ళూ వస్తువుల అంతస్సును పరీక్షించటం మొదలుపెట్టారు. అంతస్సు యెంత వెదికినా అసలు కనపడటంలేదు! ఈ కన పడకపోవడం కవిత్వానిక్కూడా పట్టింది. పద్యంలో భావమేమిటో తెలియకపోవడం! తెలియకపోయినా చదివితే వక అవ్యక్తార్థం స్ఫురించి ఆనందం కలగచ్చు లేకపోవచ్చు! పైకి మాటలుమాత్రం సులభంగా వుండడం! ఇట్లా రాశే కవుల కందరికీ తాము చెప్పే విషయాన్ని లోతుదాకా దిగి పరిశీలనం చెయ్యడం, తమలో ఉత్పత్తయ్యే అవ్యక్తభావాలనుకూడా వర్ణించడం వకపని! బంగాళీ కవీంద్రుడగు రవీంద్రు డీ పద్ధతిలో దిట్ట! ఈన భక్తుడు. ఆ భక్తిభావాన్నీ, శేష శేషిభావాన్నీ, మిక్కిలి హృదయంగమంగానూ, గూఢంగానూ, వర్ణించాడు! ఆయన కవిత్వాన్ని "ఈట్సు" అనే ఐర్లాండు కవిమహాశయుడు చదివి ఆనందించాడు! ఇద్దరూ వకేరకంవా ళ్లవడంచేత ఆయన రవీంద్రుడి భావాలకు ముగ్ధుడై, ఆయన "గీతాం జలి"కి ఉపోద్ఘాతం రాశాడు. ఈట్సుమహాకవి ప్రపంచం కళ్లు తెరిచే టప్పటికి రవీంద్రకవనం ప్రపంచమంతా మెప్పుపొందింది. 1912-14 సంవత్సర ప్రాంతంలో "గీతాంజలి" చేతిలో పట్టుకోనివాళ్లులేరు! అదివరలో ఆయన్ను కనిపెట్టలేని భారతీయులకుకూడా ఆయన ప్రవక్తైపోయినాడు. ఆయనకు నోబిల్ బహుమానం లభించింది! ఈగూఢత వెనకటితరంలో చాలాఉన్నతికొచ్చింది! కాని యూరపుఖం డంలో యుద్ధ మొచ్చి యీ గూఢతకు దెబ్బతగిలింది! బాహిరత్వం (ఉన్నదున్నట్టు చెప్పడం) కవిత్వానికి లక్షణమైంది యుద్ధానంతరం! కాని యుద్ధం మనదేశానికంతగా దెబ్బకొట్టలేదు కాబట్టి యీ గూఢత మనకు వ్యాపించింది! ఇది బొత్తుగా మనకు కొత్తదికాదు. దీన్ని మన వాళ్ళొకకాలంలో "అన్యాపదేశమన్నారు" చెప్పదలచిన విషయాన్ని గూఢంగానూ, దేనిమీదో అప్రస్తుతంమీదపెట్టీ చెప్పడం! వెనకటి

శతాబ్దంలో మన దేశంలో కొన్ని భక్తిసిద్ధాంతాలు బయలుదేరినై! వాటిలో "అచల" సిద్ధాంతం వకటి! ఈ "అచల" సిద్ధాంతం ఆంధ్ర దేశంలో చాలా ప్రచారంలో వుండేది! ఈ సిద్ధాంతప్రచారంకోసం కొన్ని పాటలుకూడా రచితాలైనై.

"గూట చిలకేదిరా ?
చిన్నన్న ?
గూడు చినబోయెరా !"

గూడు దేహమూ, చిలక ఆత్మ, ఆత్మలేని దేహం చిన్నబోయింది! గూఢతనగా యిట్టిది! "తొమ్మిది ద్వారాలకొంప" అన్నారనుకోండి! నవరంధ్రాలూ, అవికల శరీరమూ అన్నమాట! * ఈగూఢత నీ నవ్యకవులు పట్టుకున్నారు. రాయప్రోలువారి దగ్గిర్నించీ దీనికి లోబడిపోయినారు! రవీంద్రాదులు భక్తికి దీన్ని అన్వయింపజేస్తే యీ నవ్యులు దీన్ని ప్రణయానికి అన్వయింపజేశారు!♦ ఇందుకోసం కొంత పదసామగ్రినికూడా సేకరించారు! కొందరిలో యీ గూఢత మిన్నుముట్టిపోయింది! అస్పష్టతని మరోటుంది. అంటే కవి చెప్పదలచిన భావాన్ని స్పష్టంగా చెప్పలేకపోవడం. ఈ అస్పష్టతా, గూఢతా అప్పచెల్లెండ్లు! ఇటువంటి రాతల్లో పదాలకు నిగూఢంగా వున్న అర్థాలు తెలుసుకోడానికి, అటువంటి చిత్తవృత్తిలో ప్రవేశిస్తేగాని సాధ్యంకాదు. ఈకవి హృదయప్రవేశానికి, వెనకటి లక్షణ

---

* "ఈ మూలంలేని బట్టబయలు యేమీలేదు" వంటివెన్నోవున్నై దృష్టాంతాలు. పోతులూరు వీరబ్రహ్మమనే ప్రవక్త బహు శిష్యగణం కలిగి అనేక పాటలను రచించాడు యిటువంటి గుణంకలవాటిని.

♦ పవిత్రమైన శరీరాత్మసంబంధానికీ, జీవేశ్వర సంబంధానికీ, ఉపయోగించే నిజమైన గూఢత (mysticism) లో దీన్ని చేర్చడానికి వీల్లేదు. ఇది "విషయనిగరణం" "అన్యాపదేశం" వంటిది. కాబట్టి యీ "గూఢత" శబ్దం యీ సంకుచితార్థంలో వాడాను.

శాస్త్రపఠనం వక అభ్యంతరంగా వుంటుం దొకప్పుడు. పైపెచ్చు యీపద్ధతి అసహ్యాంగా కనబడుతుందికూడాను కొందఱకి. కాని కవిని సానుభూతితో చదివి, కవియొక్క భావసన్నివేశం గ్రహించి, కవి హృదయాన్నిగనక ప్రవేశిస్తే యిది అంత బొత్తుగా తెలియకపోదు. కాని ప్రతి పాఠకుడూ యింత శ్రమపడతాడా? శ్రమపడితేనమాత్రం కొంత ఫలండుంది. దువ్వూరుగారు "మర్మకవి" అనే శీర్షికతో వకఖండ కావ్యం రాశాడు. దానిలో మర్మకవిత్వలక్షణాలు కొన్ని చెప్పాడు. ఈనకు మర్మకవిత్వమందు చాలాప్రీతి. ఈన కవిత్వమంతా కాక పోయినా చాలామట్టుకు యీరకానికి చేరింది వున్నది! ఒక్కొక్కప్పు డిట్టి కవిత్వం మాటలపోగుగా కనపడి, అర్థం పట్టుకుందా మంటే దొరకదు.

"………గగనంబునందు
యెగిరిపో యెదవోయి, యెటులబట్టినను"

నిజంగా మొదట యీ మర్మకవిత్వముయొక్క పునాది భూమిమీద వున్నట్టు కనపడదు కాని అర్థము తెలిసిన తర్వాత,

"…………నీకావ్య
పుష్పకంపు రసార్ద్రి పులకితాత్ములను
జీవనయాథార్థ్యసీమలందుండి
కొనిపోవు నందనవన గంధవహాము
నీ తెంచుకల్పనా శీతనగంపు
కడపటశృంగంబు కడకొక్క తృటిని."

కావ్యపుష్పకా న్నెక్కినవాళ్ళను యీప్రపంచంనించీ కల్పనా హిమవంతంయొక్క మిక్కిలి యెత్తైన శిఖరాన్నధిష్ఠింపజేసి, అక్కడ నందనవన పరిమళా న్నాఘ్రాణించేట్టు చేస్తుందట! మర్మకవిత్వ ఫలా న్నిట్లా చెప్పాడు,

"......... యెన్ని కష్టముల
మరచి సుఖింతు నీమహిమంబువలన".

కావ్యానందం ప్రత్యనీకరహితమని పెద్దలు చెబుతారు. చూడండి కవికుమారు డేమంటాడో!

"కవికులాభరణ, నీకావ్యమాధురికి
వినిమయంబుగనీయ విశ్వంబునందు
నేమియు గన్పట్టదీ డైనయటుల"

అసలు నిజమైంది పరనిర్వృతి! అది అసాధారణలభ్యం! కాబట్టి "యిాసద్యః పరనిర్వృతే" అసలు "పరనిర్వృతికి" ప్రత్యామ్నాయం! ఇదే కావ్యానందం! దీనికి ప్రత్యామ్నాయ మింకేమున్నది? ఈ పద్ధతిలో కొందరిరాతలు సహృదయులకూడా అందని వైపోయినై.* కొన్ని గూఢత కుదాహరణాల నిస్తాను. "దీపనిర్వాణమ"నే శీర్షికతో రామిరెడ్డిగారి ఖండకావ్యం వకటి ఉన్నది. అందులో తానొక యెడారిల్లో వక ఒంటెనెక్కి వెళ్లుతున్నట్టూ, అంతా అంధకారమైనట్టూ, చుక్కలుకూడా కనపడనట్టూ, అంతా నిశ్శబ్దమైనట్టూ చెప్పి దారి తెలియడంకోసం,

"పలుమారు నాచేతి బంగారుదివ్వె
వెలిగింతుగాని, కంపిలియూనిమేష
మందె, పయ్యెరవీచి, యారిపోయెడిని."

---

* ఆంగ్లంలో *Imagination* (కార్యకారణసహితమైన హృదయంగమ భావం) *Fancy* (చిత్తవిభ్రమం) అని రెండు పదా లున్నై. వీటిలో రెండోది చాలా కింది మెట్టుది. మన నవ్యులలో యెక్కువగా కనపడేదిది. మొదటిది కొందరిలో అల్పసంఖ్యాకుల్లోనే కనపడుతున్నది. *Imagination* లో స్పష్టత, నిర్దిష్టత, ఉన్నై. *Fancy* లో సంకీర్ణత, అస్పష్టత యెక్కువగా ఉన్నై. *Imagination* లో పునాది ఉంటుంది. *Fancy* లో భ్రాంతి యెక్కువ అంశ. *Imagination* లో భావం పని చేస్తూవుంటుంది. *Fancy* కేవలం భ్రమ ఆధారంగా కలది.

అన్నాడు. ఇచ్చట "తనలో నున్న జ్ఞానంవల్ల యీ సంసార మనే యెడారిని దాటాలని యత్నిస్తూవుంటే మాటిమాటికీ అజ్ఞానం ఆ జ్ఞానాన్ని ముంచేస్తున్నదని" అర్థంకావచ్చును. ఆ అజ్ఞానాన్నే "విధి" అన్నాడని యీ కింది వాక్యాలవల్ల తెలుస్తున్నది.

"........విధి యీడ్చు తెరగులనెల్ల
ధూళి ద్రుంగుచు నేడు ద్రొక్కుచున్నాడ!"

జీవికి స్వతంత్రత లేదని సిద్ధాంతీకరించి, దీనికి అంతెప్పుడా అని ఆశిస్తున్నాడు కవికుమారుడు. ఒకనాడు తాను వక చెరువుగట్టున కూర్చుండగా వక స్వప్నమొచ్చిందని చెప్పాడు. ఆ స్వప్న మిట్లా వుందట!

"మావితోటను పర్ణమంటపమందు
జనరంజకంబైనసభ యొండు జరిగె"

* * *

"రారాజు క్రొంబచ్చ తాగద్దె డిగ్గి
యందరితో బాటె యవని గూర్చుండె."

పూర్వ మొకప్పుడు యుద్ధంచేసి యిప్పుడు తుప్పుపట్టిన తుపాకితో వక సిపాయీ, బురదబట్టలు కట్టుకొన్న రైతూ, నిరుపేదా, రాజపరివారమూ, అంతా వకే సరిబంతిలో కూర్చున్నారట! ఈ విధంగా ప్రపంచం యికముందు యెట్టి మానవభేదం లేకుండా సర్వ సమమైపోతుందని దీని అర్థం అనుకుంటాను. తదనుగుణంగా "భవిష్యద్దర్శన"మని దీనికి పేరుపెట్టాడు. ♦ఈవిధంగా అనేక గూఢతావిశిష్ట

---

♦ ఆర్థర్ సిమన్సు (Arthur Symons) అనే ఆంగ్లవిమర్శకు డిట్లా అన్నాడు 1893 లో.

*"The most representative literature of the day, the writing which appeals to, which has done so much to form, the younger generation, is certainly not classic, nor has it any relation to that old antithesis of classic, the romantic. After a fashion it is no doubt a decadence; an intense self-consciousness, a restless curiosity in research; an over-subtilising refinement upon refinement, a spiritual and moral perversity.*

ఈ పరిస్థితులు క్రమంగా మన సాహిత్యంలో వస్తున్నవి.

కావ్యాల నీ రామిరెడ్డిగారు రచించారు. నోరి నరసింహశాస్త్రిగారి కావ్యంలో మృతకళేబరాన్నిగూర్చి యిట్లా వున్నది.

"*　　　*　　　*

తలపుప్రాణము లీ రెండు తలగిపోయె,
కారుచీకటు లింటిలో గ్రమ్ముకొనియె,
కాంతి సుంతయు కిటికీల గానరాదు,
అన్నివేళల 'కిరుకిరు' మనెడి తలుపు
తెరచియున్నట్టి చప్పుడే తెలియరాదు"

శరీర మిల్లు, కిటికీలు రంధ్రములు, కిరుకిరుశబ్ద ముచ్ఛ్వాస నిశ్వాసము. చూశారా గూఢత! వేదుల తాను ప్రపంచంలో మంచినే చూడలేదనీ, ప్రజలు వెనకటి ఔన్నత్యాన్ని స్మరించుకుంటూ నెమరువేసే పశువులవలె వున్నారనీ, రాజులు మత్తులై యున్నారనీ, దేవుడు విగ్రహాల్లో చిక్కుకునిపోయినాడనీ, ప్రజలకు దారి దొరకడంలేదనీ, కాబట్టి యీ పూర్వనాగరికతనంతా నశింపజేయటానికి ప్రయత్నించమని ఉద్బోధించి, యీ నాశనంలో నించీ సుందరమైన భవిష్యత్ప్రపంచం పుడుతుందనీ, మొదలైన భావాలతో,

"వెలిగించు కాగడా వెలిగించవోయి
ప్రళయరుద్రుని ఫాలభాగమ్మునందు"*

అంటూ వక చక్కని గూఢార్థగీతాన్ని రాశాడు. క్రిష్ణశాస్త్రిగారి యీ కింది గీతి చూడండి :—

"నవవసంత శుభోదయానంద వశత
ప్రకృతి నూతన జీవలావణ్యమొంద,

* అక్కడ నిప్పు ఉంటుంది. ఆయన సంహారక ర్తకూడాను.

రాయిరప్పయు కంఠస్వరంబుదాల్చి
నైజగుణము త్యజించి గానంబుచేయ
పికమ! పాడకుమనుచు శపించినారు!
పక్షినని పాడగలనని, ప్రణయవీధి
నిత్యలీలావిహారముల్ నెరపుదునని
పక్షములదూల్చి, బంధించి పంజరాన,
గానమును, ప్రాణమును హరింప బూనినారు"

ఇందులో కాలం మారిందనీ, కవికుమారుడనైన నేను గానం చేస్తానంటే, యీ పూర్వాచారపరాయణులు కవిత్వాన్ని లక్షణాల్లో బంధించిపెట్టి, మాబోటి రాయసగాళ్ళను తిట్టుతున్నారనీ, నామీద అధికారం కలవాళ్ళు బొత్తుగా నిషేధిస్తున్నారనీ, గూఢార్థమేమైనా వుందేమో పాఠకులకు వదలుతున్నాను! కిందటి దశవర్షకాలంలో యీ గూఢత సహృదయుల జుట్లలోనుంచి వెళ్ళిపోయింది. ఇప్పుడు కొందరు రాస్తున్న కవిత్వం వాళ్ళకూ వాళ్ళ స్నేహితులకూ తప్ప యితరులకు తెలియకుండా వుంది.* ఇక్కడ యీ గూఢతా సందర్భంలో తుది సిద్ధాంతం మనవిచేస్తున్నాను. వెనక నేను "గూఢాలని" మనవిచేసిన అన్యాపదేశ సందర్భాలన్నీ కేవల భౌతికప్రపంచభావనా సంబద్ధాలుకాబట్టి, యివి నిజమైన, పవిత్రమైన "గూఢత" (mysticism) లో చేర్చడానికి వీల్లేదు. ఆధ్యాత్మికభావనకు సంబంధించినంతవరకే తన్నామానికర్హత! వీటికన్నిటికి "అన్యాపదేశమ"నే నామకరణం సమంజసం! గూఢతంటే నా యీ నిర్వచనం రవీంద్రకవీంద్రుని గ్రంథం వకటి చదివితే తెల్లమౌతుంది. రాయప్రోలు ధ్యాన గీతం చదవండి. ఆయనయొక్క భావనా ప్రపంచం తిరిగితిరిగి పరమాత్మ స్వరూపాన్ని చూడగోరితే తుదకు,

---

* *Appeal to a limited circle.*

"వినబడియె నొకట-సూక్తి హృద్వివరమందు
స్మృతులుమూసి, ముక్కోటిదేవతల వదలి,
బ్రహ్మవిష్ణుపరంపర త్యజించి,
అగ్నిముఖమందె అమృతమ్మనందుమంచు."

"నియతం కురుకర్మత్వం" అనే శ్రీకృష్ణ వాక్యాని కిది ప్రతిబింబమా? లేక "మోక్ష మీ జన్మలోనే లభ్య"మనియా? లేక "కష్టంలోనే సుఖమున్నద"నియా? లేక "ఈకర్మలోనించీ అగ్ని పరీక్ష అయిపోయినతర్వాత అమరత్వం వస్తుంద"నా?*

క్లిష్టత:

పింగళి సూరన కవిత్వలక్షణం చెబుతూ "తలపెల్ల నక్లిష్టతను ప్రదీపితముగాక" అన్నాడు! ఈనూతన కవిత క్లిష్టమని చెప్పటంలో యెట్టి తప్పూలేదు. ప్రతి పాఠకుడికీ తెలియకపోవడమేగాక సహృదయుడిని కూడా తిప్పలు పెడుతుంది వొక్కొకప్పుడు. ఇక్కడ రెండు కష్టాలున్నై! అన్వయం దొరకక వకకష్టమూ, భావం అంతు పట్టక రెండోకష్టమూ! ఇటువంటిదాన్నే నేను "క్లిష్టత" అన్నది. ఈ క్లిష్టతా, వెనక చెప్పిని గూఢతా, అస్పష్టతా, యివన్నీ పరస్పర సంబద్ధాలే! కవి చెప్పదలచిన విషయాన్ని సహృదయుడికి తెలిశేట్టు చెప్పటమే "అక్లిష్టత" అంటే! ఈ భావాన్వయక్లిష్టతలకు పరశ్శత దృష్టాంతాలియ్యొచ్చు! ఎవరో కొందరి రాతలు తప్ప బహుళంగా యీదోషం కలవే! శివశంకరశాస్త్రిగారు స్వచ్ఛంగా ప్రకాశించే కవితాసామర్థ్యం కల సాధకుడు. ఈనరాతల్లో యెక్కడా క్లిష్టత కన

* "గూఢతయు జాటుతనంబునులేకయుండ చెప్పిన నదెపో కవిత్వమనిపించు" అన్నాడు పెద్దన్నగారు. ఇది అన్యాపదేశం, అస్పష్టతలాంటిదే! ఈ గూఢత కేవల ప్రాపంచిక భావనాసమన్వితమవటంచేత అపకర్షాహేతువుగాకూడా వుంది! మన నవ్యులనుకునే గూఢత అంటే "చాటుతనానికి" వ్యతిరేకమైందని తోస్తుంది.

పడదు.* మిగిలిన చాలామందిలో మాధురీ, రసమూ, వేదండామా మెంతమాత్రం వీల్లేదు! కాని క్లిష్టత సామాన్యపాఠకుడిని విముఖుడిని చేస్తుంది. గూఢతా, అస్పష్టతాకూడా అంతే! ఇవన్నీ కలిసి పాఠక ప్రపంచాన్ని సంకుచితంచేస్తై! ఇప్పుడు నవ్యకవిత్వానికీ, కవులకూ, దేశంలో అంతటా సంపూర్ణ సానుభూతి లేకపోవడానికిది వకగొప్ప కారణం! అంతే వీటిని గుణాలు అనుకోండి, దోషాలనుకోండి, యివే యీ రాతలకు విశిష్టతనిచ్చిన కొన్నివిషయాలు? అందుచేత వాళ్ళు దాన్ని వదలటాని కెంతమాత్రం వీల్లేకుండావుంది. వదల కూడదు కూడాను. ఈ క్లిష్టత రాయప్రోలువారిలోకూడా కనపడు తుంది.

"హృదయమోహనమయి ప్రేమమృదులమైన
తావకీన లీలాదాన దళపుటంబు,
మామకీన ప్రణయభంగమధుకణముల
విడిచెను విరక్తిబాష్పముల్ విడుచుపోల్కి"

పాఠం చెప్పేటప్పుడు నేనీపద్యాన్ని మననంచేసి అర్థంచెప్పినా యిప్పటికీ నాకే తృప్తిలేదు. కవిగారి ఉద్దేశితార్థాన్ని చెప్పలేదనే నా ఊహ! కొంతరాశిన తర్వాత యీ గూఢతాక్లిష్టతలు కవినే కష్టపెడతై! కవితాజ్యోతి త్వరలో ఆరిపోవడానికి గాని, తర్వాతి కావ్యాలకు అపకర్ష కలగచెయ్యటానికిగాని, మార్గా లౌతై! శివశంకరశాస్త్రిగారి కవితాస్రవంతి స్వచ్ఛమై, సహజమై యిప్పటికీ, రసవత్ప్రమోదసదృశమై ప్రవహిస్తూవుండటానికీ, ఆయనకంటె చిన్ని వాళ్ళైన అనేకమంది కవితాస్రవంతులు (వేదులవారు, దేవులపల్లి)

*మల్లీ పేలవత్వమూలేదు. చక్కగా పెద్దన్నగారి పరిశుద్ధ [illegible] మైనదీన కవిత. భావనాశక్తికీ, ఔచితికీ యెక్కడలోటూలేదు. "[illegible] పులినా"వలె స్వచ్ఛతాభాసురమై, పాఠకపిపాసను తీర్చి ఆనందింప జేస్తుంది.

వారు, నండూరు వారు మొదలైనవారివి) అంత ధారావాహికగా ప్రవహించకపోవడానికి కారణం వీరి కవితా స్రవంతులు గూఢతాక్లిష్టతాసికతాతపాల్లో ప్రవహించడమే! "శివశంకరశాస్త్రిగారిజీవితానికీ సాహిత్యానికీ లంకె" అన్నాడు విశ్వనాథ. దేవులపల్లి మొదలైనవాళ్లేవో చిల్లరకావ్యాలు రాశినా, వెనకటి భావౌన్నత్యం కనపడటం లేదు. చూచారా వయఃపరిపాకం రాకమునుపే వీళ్ళ కవితాజ్యోతికి తైక్ష్ణ్యం తగ్గిపోయింది.* ఏ శక్తైనా అతిగా దాన్ని కష్టపెడితే కొంత కాలమైన తర్వాత యెదురు తిరుగుతుంది! ఈజీవుడికీ, శరీరానికీ కూడా యింతని వక నిర్ణీతశక్తివుంది భౌతికంగా ఉపయోగించడానికి. శరీరానికి లేదుగాని జీవుడికిమాత్రం ఆధ్యాత్మికంగా కలశక్తి అనంతం! కాని ఆధిభౌతికంగా నిర్ణీతం. ఆనిర్ణీతాన్ని కష్టపెట్టి ఖర్చు అయ్యేటట్టుచేస్తే అది యిక పనిచెయ్యదు! ఈసంగతి వక ముఖ్యంగా గమనించదగిన విషయం! ఈరాతగాళ్ళలో కొందరు తమ చిత్తవృత్తులను కృత్రిమ పరిస్థితుల్లో పెట్టుకోటం మొదలెట్టారు. సహజమైతే తప్ప, చిత్తవృత్తి కృత్రిమమైనప్పుడు అందులోవుండే సూక్ష్మాంశాలు అసహజాలవడంచేత నిష్కృష్టంగా చెప్పడానికి వీల్లేకుండా వుంటై! అందుచేత యీఅపుష్టార్థ దోషం వస్తుంది. వెనకటి అస్పష్టతా, క్లిష్టతా కూడా వాకొకప్పుడిట్టి కారణంవల్లనే కలగవచ్చు కూడాను. కాబట్టి యివన్నీ చాలా సన్నిహితాలైన విషయాలు! మరోటుంది! ఈకవులు తమకు మనస్సులో పైకి వచ్చే భావాలేగాక, వాటికింద అవ్యక్తంగావుండి, కలగాని, మూర్ఛగాని, వచ్చినప్పుడు వచ్చే పరోక్షానుభూతిని కూడా చెప్పడానికీ, వర్ణించడానికీ, ప్రయత్నించడంలోకూడా వస్తుందీ అస్పష్టతా, అపుష్టార్థమూను! తమకే సంపూర్ణంగా అనుభవంలేని భావాలను పాఠకుడికి

* విశ్వనాథదిమాత్రం క్రమాభివృద్ధిపొంది తైక్ష్ణ్యం అభివృద్ధిపొందుతూవచ్చింది. ఇప్పుడు మధ్యాహ్నకాలం కావచ్చింది.

విప్పిచెప్పడమెట్లా ? కాని అవి అబద్ధాలందామా ? కావు ! స్వప్నాలూ కావు! ఇటువంటి సందర్భంలో వాళ్ళకున్నట్టీ, వచ్చినట్టీ, అనుభవంకాని దాన్ని చెప్పడంలో యీ విప్రతిపత్తి కలుగుతున్నది ! ఇటువంటి పద్ధతిని ఉమాకాంతపండితుడు "అయోమయ" మని నామకరణం చేశాడు ! కాని ఆయనచేసిన హేళనానికి తగరీ కవికుమారులు ! అప్పుడు వాళ్ళకుండే చిత్తవృత్తి, తద్భావాలూ, స్తనశల్యపరీక్ష కాగవు ! వాటినే తదనురూప చిత్తవృత్తితో మనం పరీక్షిస్తే వాళ్ళతో మనం సానుభూతిని పొందుతాం ! అట్లాగే గాకపోతే అపరిణతబుద్ధుల కందనట్టీ, మంత్రద్రష్టల కగపడినట్టీ, భావాలను మనం కూడా ఉమాకాంత పండితుడన్నట్టు అనాలశోస్తుంది ! అది అకార్యకరణం ! కాబట్టి అటువంటిదానికి పరీక్ష యాథార్థ్యంతో పోల్చటం కాదు ! అటువంటి చిత్తవృత్తిని సాధించి పరీక్షించడం కర్తవ్యం ! ఈసంగతి కొంతవరకు "సర్ రియలిజం" దగ్గర చెబుతాను.

స్వేచ్ఛ :

ఇది నవ్యులు కొనియాడే వక గొప్పవిషయం. కాని స్వేచ్ఛకు అంతున్నది. ఇదికూడా జీవుడికీ, శరీరానికీ, పరిమితం ! వేటిచేత పరిమితం ? అని అడుగుతారేమో ! అనేక విషయాలచేతేగాక, తుదకు తమ ఉపాస్యదేవతైన ప్రకృతిచేతనే పరిమితం ! వెనక దేవులపల్లి వారు రెక్కలు లేవని మరచి యెగరడానికి ప్రయత్నించి దుఃఖించడం చూశాం ! ప్రకృతిని దాటే స్వేచ్ఛ భౌతికంగా లేదు జీవికి ! ఆధ్యాత్మికంగా శక్తి సంపాదించుకోవచ్చు ! కాని యీసాధకులలో బహుసంఖ్యాకులు ప్రకృతిని దాటటానికి ప్రయత్నించినవాళ్ళు లేరు. అటువంటి అప్పుడు తమశక్తికిమించిన స్వేచ్ఛను కలిగి ఉన్నామనుకోడం వట్టిభ్రమ. రెండోవిషయం సంఘం ! సంఘోపద్రవమైన స్వేచ్ఛను గ్రహిస్తే సంఘం ఊరుకోదుసుమా ! ఒకటి కవితావిషయాల్లోనే కాదీపరిమితి ! రాజకీయం గ్రహించండి ! స్వాతంత్ర్యం

ంతున్నాము మనం! ఎట్టిదీ స్వాతంత్ర్యం! మనయిష్టమొచ్చిన పని
య్యటాని కధికారముండడం కాదు స్వాతంత్ర్యమంటే! మనయిష్ట
స్థలంలో వంతేలు పోసుకోడమా? ఇష్టమొచ్చినవాండ్లను కొట్ట
గా? ఇష్టమొచ్చిన స్థలంలో యెనుటివ్యక్తి సమ్మతి లేకుండా
వతంత్రం తీర్చుకోడమా? లేక యిష్టమొచ్చిన యితరుల వస్తువు
గ్రహించడమా? ఈ చెప్పినవన్నీ పీనల్ కోడు కిందికొచ్చి శిక్షా
తనిస్తై! అలాగే, స్వేచ్ఛని, తినగల దానికంటె యెక్కువతింటే కడుపు
డుతుంది! కాబట్టి స్వేచ్ఛ పరిమితం! ఈ సంగతి నీనవ్యులు గమనించి
టు తోచదు. సంఘనీత నేది వకటుంది! ఆ నీతి మన స్వేచ్ఛ నరికట్టు
ంది. మన కిష్టంలేకపోయినా దానికి లోబడక తప్పదు. సంఘమే
ప్పనుకుంటే దిద్దటానికి ప్రయత్నించాలె కవికుమారుడు! అంతే
గాని సంఘంలో అవినీతి ఉందని దానిని యెక్కువచెయ్యటానికిగాని,
ోమలయువకహృదయాలను ఆ దుర్నీతిలో మునగమని ప్రోత్సహించ
ంగాని, సంఘోన్నతికొరకు పుట్టిన "కవిబ్రహ్మ"కు న్యాయం కాదు.
ట్టిది స్వేచ్ఛ కాదు. విశృంఖలత! ఇది దాదాపు చాలామంది నవ్య
వికుమారులు గమనించవలసిన విషయం! *

కావ్యం:

మన లాక్షణికులు వ్యంగ్యప్రధానమైంది ఉత్తమకావ్యమని
ర్వచించారు. ఈ ఉత్తమత్వాన్ని అనేకమంది అనేకవిధాలగా పేరు
ట్టారు. వైయాకరణులు దీన్ని స్ఫోటమన్నారు. రసవాదులు రస
న్నారు. ధ్వనివాదులు ధ్వనన్నారు. కొందరు వ్యంగ్య
న్నారు. ఏ పేరుతో చెప్పినా తుదకు వకటే. "జీవితం వ్యంగ్య
భవం" అన్నాడు లాక్షణికుడు. ఇప్పుడు కొందరు నవ్యులు
క్షణశాస్త్రం బాగా అవలోడనం చేసి "కావ్యాత్మ" యేది అనే
న్నను చాలా చర్చిస్తున్నారు. "రసం" కావ్యాత్మని నిర్ధారణ

* కవితకూ నీతికీవున్న సంబంధం తర్వాత మనవి చేస్తాను.

చేశారు కొందరు. వ్యంగ్యమూ, ధ్వనీ అని మరికొందరు. ఈ వ్యంగ్యం మొత్తంమీద పురాతనాధునాతన లాక్షణికు లందరూ చాలా కొనియాడారు. ఇదికూడా వక శబ్దశక్తిగా అంగీకరించారు తర్కమూలంగా లాక్షణికులు. ధ్వనన్నా వ్యంగ్య మన్నా వకటే! శబ్దానికి మూడుశక్తులున్నై! ఆ మూడు శక్తులవల్ల వచ్చే అర్థం కూడా మూడురకాలు! వాచ్య, లక్ష్య, వ్యంగ్యార్థాలని వాటి పేర్లు. దార్శనికు లంతా వాచ్యలక్ష్యాలనే వొప్పుకున్నారు. కాని లాక్షణికులు వ్యంగ్యాన్నికూడా వొప్పుకోడమే కాకుండా దానికి యెక్కడలేని గౌరవ మిచ్చారు ధ్వన్యర్థమే వ్యంగ్యార్థం! దీన్నే తాత్పర్యార్థమనీకూడా అన్నారు! ఈ ధ్వన్యర్థా న్నీవిధంగా నిర్వచించారు.

"యత్రార్థశ్శబ్దోవా తమర్థముపసర్జనీ కృతస్వార్థా ?
వ్యంక్తః కావ్యవిశేషః సః ధ్వనిరితిసూరిభిః కథితః॥"

శబ్దాలూ, తత్సంబంధాలైన అర్థాలూ, తమ స్వార్థాలను అణచిపెట్టుకుని, మరో హృదయంగమార్థాన్ని స్ఫురింపజేసినప్పుడు, ధ్వని అంటారు. కాబట్టి శబ్దాలకుండే సామాన్యార్థంకాదు ధ్వనంటే. దాని మీద ఆధారపడే దూరానవున్న వకహృదయంగమమైన అర్థం వ్యంగ్యం. దీన్నే యింగ్లీషులక్షణశాస్త్రంలో "Suggestion"అంటారు! ఈ శక్తి చాలా గొప్పది! ఇది ప్రతికవికీ వుండదు. అందుకోసమే దాని ప్రాధాన్యాప్రాధాన్యాలనుబట్టి లాక్షణికులు కవులనూ, కావ్యాలనూ విభజించారు. వ్యంగ్యప్రధానకావ్యాన్ని ఉత్తమకావ్యమన్నారు. వ్యంగ్యం అక్కడక్కడా వుండీ యెక్కువగా వాచ్యమైతే వాన్ని మధ్యమకావ్యమన్నారు. కేవల వాచ్యాన్ని అధమకావ్యమన్నారు. లాక్షణికులు కాళిదాస భవభూతులను తారతమ్య చర్చచేసి భవభూతి ఉత్తరరామచరిత్రను వాచ్యంకింద నెట్టేశారు. భవభూతే వాచ్యప్రధానుడైన కవైతే మిగిలిన అనేకమంది గతేమిటి? ఈ విష

యంలో యిటువంటి పట్టుదల చూపారు మనపూర్వులు! అది సమంజసమే! సాక్షాత్తుగా చెప్పినదానికంటె యెక్కువఅర్థం స్ఫురింపచేసే కవి గొప్పవాడా? ఉన్నదెంతో అంతే అర్థంతో తృప్తిపడే కవి గొప్పవాడా? మొదటిరకంవాడే గొప్పవాడనడంలో యేమైనా సందేహముందా? కాబట్టి అది ఉత్తమలక్ష్య మనడంలో యెట్టి అభ్యంతరం లేదు. అంతా అట్లా వుండేట్టు రాయడం సామాన్యం కాదు. అట్లా ప్రతిపద్యం వ్యంగ్యంగారాశిన కవే లేడని చెప్పవచ్చు!* అందుచేతనే యిదిసగం అదిసగం రాశినవాళ్లను గొప్పకవులన్నారు! వ్యంగ్యం అప్రధానంచేసి యెక్కువగా వాచ్యాన్ని గ్రహించినకవులు అంతకంటె యెక్కువసంఖ్యాకులు! ఇక మూడోరకం—అనగా వాచ్యాన్నే గ్రహించినవారు—ముప్పాతికమంది వాళ్ళే! ఈ పరీక్షతోగనక వకమారుచూస్తే నవ్యుల్లో లెక్కకువచ్చేవాళ్ళెందరు? ఒక్కపొరబాటు పడకూడదు. వెనక గూఢత అన్నానే దాన్ని వ్యంగ్య మనకూడదు! అన్యాపదేశానికీ గూఢతకూ సమానార్థాలుగా వాడినా కొంచెం భేదమున్నది! గూఢతలో శబ్దాలకుండే అర్థాలకూ గూఢార్థాలకు భేదముంటుంది. సామ్యం గమ్యంగా వుంటుంది. ఈసామ్యం గూఢార్థస్ఫోరకం. ఇది రెండోరకం.♦ అన్యాపదేశంలో ప్రస్తుతాప్రస్తుతాలుంటై! ఒక ఉదాహరణం! "మాళవికాగ్నిమిత్రం"లో రాజు పండితకౌశికిని ఉభయ నాట్యాచార్యుల తారతమ్యపరీక్ష చెయ్యమన్నప్పుడు ఆమె "పట్టణముండగా పల్లెలోనా రత్నపరీక్ష?"అన్నది. అంటే రాజులగు తమరుండగా సన్యాసినిని నేనా నాట్యపరీక్ష చేయటం? అని అర్థం. ఇక్కడ పట్టణ

*తుదకు విసికి లక్షణకూడా ధ్వని భేదంగానే అంగీకరించారు.

♦సాంకేతికంగా వకమాట కింకోఅర్థమౌతుంది. వెనక ఉదాహరణంలో "గూడు" అంటే ఒకవస్తువుండే మూయబడ్డచోటు. చిలుకఅంటే ఎగిరేవస్తువు! ఒకదానిలో వకటుంటుండడం సామ్యం. ఈ సామ్యంచేత గూడంటే శరీరమూ, చిలుకఅంటే ప్రాణముండేచోటూ అని సాంకేతికంగా అర్థంచేసుకోవాలె.

గ్రామాలూ, రత్నపరీక్షా అప్రస్తుతాలు! ఆ అప్రస్తుతాలమీద పెట్టి ప్రస్తుతాన్ని చెప్పటంచేత అది వకదాన్ని అపదేశించి మరొకదాన్ని చెప్పటమైంది!* ఇట్టిదానికీ వ్యంగ్యానికీ చాలా భేదముంది. ఇక్కడ ప్రస్తుతాప్రస్తుతాలు లేవు, ఔపమ్యమూ లేదు. వ్యంగ్యార్థం దూరంగా వుంటుంది. ఆ అర్థం అత్యంత రమణీయంగా వుంటుంది. ముఖ్యార్థం అప్రదానమైపోతుంది. ఒక పెద్దరాయి యెత్తి చెరువులో పడేశారనుకోండి. పెద్ద చప్పుడుతో నీళ్లు పైకి లేచినై! ఈ లేచిన నీళ్ళు పక్కఉన్న నీళ్ళలో వక్కతరంగాన్ని కలగజేశినై! ప్రథమతరంగంతర్వాత క్రమంగా గోళరూపంగా వొక్కొక్క తరంగం పుట్టి గోళవిస్తీర్ణ మెక్కువౌతూ తుదకు వొడ్డుకొచ్చి తాకినపుడు ఆ తరంగం "జిలజిల"ని చక్కని హృదయంగమమైన చప్పుడుచేస్తూ, చూడటానికానందం కల్గచేస్తూ, నీళ్ళల్లో కాలుపెడితే వక విధమైన స్పర్శసుఖాన్ని కలగచేస్తుంది! ఈతుదితరంగం ధ్వన్యర్థంఅనగా వ్యంగ్యార్థం వంటిది! మొదటి ప్రథమసంక్షుభితతరంగం వాచ్యార్థం! దానిమీదే అనుక్రమణికగా యీ తుదితరంగం ఆధారపడి వుంది! కాని దాని ఘోషకంటె, ఛిన్నత్వంకంటె భిన్నమైన సౌందర్యమూ, శబ్దమూ, మృదుస్పర్శా, కలిగివుంటుం దీ తుదికూలస్పర్శి తరంగం! జన్మస్థానం రెండర్థాలకూ వకే శబ్దం! ముఖ్యార్థం యీ నూతనార్థాన్ని పుట్టించి తాను వెనక వుంటుంది. ఈకింది ఉదాహరణం లాక్షణికు లిస్తారు!

"గచ్ఛగచ్ఛసిచేత్కాంత
పంథానస్సంతు తే శివాః।
మమాపి జన్మతత్రైవ
యత్ర భూయోగతి స్తవ."

ఇది దూరదేశ ప్రయాణోన్ముఖుడైన నాయకుడితో నాయిక అంటున్నది. ప్రయాణమూ తప్పేట్టులేదు. తనకా యిష్టములేదు!

* "హనుమంతుడిముందు కుప్పిగంతులు" మొదలైనవికూడా యిటువంటివే!

వద్దనీ చెప్పగూడదు! అది అపశకునం. కాబట్టి యీవిధంగా చెప్పింది! "ఓ కాంతుడా! నీవుపొమ్ము! నీమార్గము మంగళప్రదమగుగాక! ఏ వెక్కడికి వెళ్ళుచున్నావో నే నక్కడే పునర్జన్మము నొందుదును" అని దీని అర్థం. మొదటి రెండుపాదాలు వెళ్ళుమనివున్నది. చూడండి తర్వాత రెండుపాదాలు! పునర్జన్మ మొందేదెప్పుడు? చచ్చినతర్వాత! కాబట్టి "నేను పునర్జన్మాన్ని పొందుతాను" అంటే "నీవువెళ్ళితే నేను చచ్చిపోతాన"ని తాత్పర్యము. కాబట్టి "నీవు వెళ్ళవద్దు" అని మొత్తంమీద అర్థం! చూచారా వెళ్ళమనేదానికి వెళ్ళవద్దనే అర్థం క్రిందికి దిగింది. ఇది వ్యంగ్యమంటే! ఇట్టి వ్యంగ్యార్థాన్ని లాక్షణి కులు గౌరవించారంటే ఆశ్చర్యమేముంది. ఒకొక్కప్పుడు విపరీ తార్థమే రావచ్చు! అల్లరిపిల్లవాడొక డున్నాడనుకోండి! వాడొక ప్పుడు అల్లరి అమితంగా చేశినప్పుడు, "ఎంత బుద్ధిమంతుడివిరా! నాయనా!" అన్నామనుకోండి! మన అభిప్రాయం "బుద్ధిమంతుడని కాదు, బుద్ధిమంతుడు కాడని". కాబట్టి "బుద్ధిమంతుడు" అనే పదా నికి "అల్లరివాడు" అనే విపరీతార్థ మొస్తున్నది! ఇదికూడా వక విధమైన వ్యంగ్యమే అన్నారు! ఈవిధమైన పరీక్షచేస్తే యేటు వంటి కావ్యంగూడా సంపూర్ణంగా ఆగదు! యీక్రింది తిక్కనపద్యం చూడండి:

"నీవు సుభద్రకంటె కడు నెయ్యము గౌరవముం దలిర్ప సం
భావనసేయు దిట్టినను పంకజనాభ యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై వెనుపొందిన వేణిబట్టి యీ
యేవురుచూడగా సభకునీడ్చె కులాంగన నిట్లొనర్తురే!"*

ఇందులో "పంకజనాభ" అనే సంబోధనా, "ఒకండు" అనే సంఖ్యావాచక సర్వనామమూ చూడండి. సుభద్ర కృష్ణుడికి చెల్లెలు సాక్షాత్తుగా! కృష్ణు డెవరు? మహావిష్ణువే! మహావిష్ణువు

* కులాంగన లిట్టులోర్తురే! (పాఠాంతము)

అవతారమైన శ్రీకృష్ణుడు తన స్వంత చెల్లెలైన సుభద్రకంటె ద్రౌపది కెక్కువ చనువూ గౌరవమూ యిస్తాడట! ఇది ద్రౌపది యొక్క గొప్పతనాన్ని చెప్తున్నది. ఆ గొప్పతనానికి అవధిలేదు. పరమేశ్వరుడే తన స్వంత సోదరికంటె యెక్కువ గౌరవిస్తాడన్నప్పు డామెయొక్క గొప్పతనము తలచినకొద్దీ యెక్కువౌతున్నది! "అట్టి నను" అంత గొప్పదాన్నైన నన్ను! "ఒకండు" ఇక్కడ పేరు చెప్పకపోవడంచేత ఆశబ్దవాచ్యుడగు వ్యక్తి పేరుచెప్పదగని నీచుడనీ, లెక్కసేయదగినవాడు కాడనీ, తుదకు ఫలానా అని నిర్దిష్టంచెయ్యగలవాడు కాడనీ, ద్రౌపది కవమానం కలగచేసిన వ్యక్తియొక్క నైచ్యాన్ని వెనక ద్రౌపదినిగూర్చి చెప్పిన గొప్ప తనంతో వైధర్మ్యంచూపుతూ, ఒక్కమాటతో తిక్కన నిర్వచించాడు చూడండి. "అట్టినను" అనేమాటకు సామాన్యంగా "పూర్వోక్త గుణవిశిష్టయైన నన్ను" అని అర్థంచెప్పుకోవాలె. "నను"లో ఉన్న గర్వం ఊరికే సర్వనామంలో లేదు! వెనకటి మాటలతో కూడేటప్పటికీ "నను"కు ద్రౌపదీ గర్వకోపద్యోతకత్వం కలిగింది. ఆగర్వ మెట్లా తుదకు పరిణమించిందో చూదాం! "అటువంటి గొప్పతనంగల నన్ను" యెవరు పరిభవించింది? "ఒకండు" నామనిర్వాచ్యతకు తగని వక నీచుడు! "ఎవడో వకడు, వెధవ! వాడిపే రెందుకులెండి" అన్నట్టుంది. "ఈయేవురు చూడగా" అనేమాటల్లో పాండవులయొక్క చేతకాని తనమూ, సంఖ్య ఉండీకూడా వాడినేం చేయలేకపోయినారనీ, సిగ్గు లేక తలయెత్తుకు తిరుగుతున్నారనీ, ఆనాడు చూస్తూ ఊరుకున్న వాళ్లు వీళ్ళేననీ, ప్రగల్భాలేకాని వీళ్ళేమిచేయ లేరనీ, కళ్ళయెదుట చూచినదానికి ప్రతీకారము చేయలేకపోయినారనీ, వీళ్లు యేమైనా చెయ్యగలరని తనకు నమ్మకం పోయిందనీ, యీవిధంగా యెన్నెన్నో హృదయంగమాలైన అర్థాలు స్ఫురిస్తున్నై!

"కులాంగన నిట్లొనర్తురే!" ఇక్కడ పాఠభేదాల్లో నేను గ్రహించిం దిది. ఇది నాకు వక శాపంగా ద్యోతక మౌతున్నది.

"పతివ్రతనైన నన్ను యిట్లా చేసినాడా [illegible] వాడు! చూడండి! నశి ్గాడు" అని నాకు అర్థమౌతున్నది. ఇక్కడ వెనక "నేను" ను అన్వయించుకోండి. ఆమె తాను పతివ్రతననే గర్వమూ, కోపమూ, పురస్కరించుకొని, "కులాంగన నగు నాకిట్టి పరాభవం చేసినవాడు నశించుగాక" అని శపించినట్టు కనపడుతున్నది! వ్యంగ్య మంటే యిట్లా వుంటుంది.

గూఢతనూ, అన్యాపదేశాన్నీ, వ్యంగ్యమని భ్రమపడవద్దనీ, వ్యంగ్యమంటే యిట్టిదనీ, ఉదాహారణంతో చెప్పడంచేత, వకవేళ యీ నవ్యుల్లో అట్టిది ఉన్నట్టు చెబితే, పాఠకులు దాన్ని సంపూర్ణంగా పరీక్షించి నిర్ణయించటానికి శక్తి కలుగుతుందని, యింత వివరంగా చెప్పాను. నాకు చదివినంతవరకు యీ నవ్యుల్లో వ్యంగ్యంకంటె వాచ్యం బహుళంగా కనపడుతున్నది. ఉత్తరరామచరిత్రలో భవభూతి రాశిన "శ్రితాసి చందనభ్రాంత్యా దుర్విపాకం విషద్రుమం" అనే మొదలైన చక్కని కల్పనలనుకూడా వాచ్యాలకింద లాక్షణికులు కొట్టేశినప్పుడు వీళ్ళ రాతల్లో వ్యంగ్యం మృగ్యమని చెప్పడమే భావ్యమని నాకు తోస్తున్నది. ఇతరత్రా యెక్కడైనా వ్యంగ్యంగా వుందని యెవరైనా రాస్తే అప్పుడు దాన్ని గూఢతాన్యాపదేశాలతో పరీక్షించి విమర్శిద్దాం!

సాదృశ్య బాహుళ్యం (ఉదాహారణ పరంపర):

లలితకళ లన్నిటిలోకూడా నిజమైన కళావేత్తైతే తన చిత్రాలను, కొద్ది గీతలతోనో, కొద్ది మాటలతోనో చిత్రిస్తాడు. కాని చెప్పిందే చెప్పిగాని, రాశిందేరాశిగాని భాషాచిత్రాన్నిగాని, ఆకృతి చిత్రాన్నిగాని, చిత్రించడానికి యత్నించడు. మొదటి గీతలలో పోలిక తేలేకపోతేగాని, మొదటవచ్చిన శబ్దజాలంతోనే భావచిత్రాన్ని కల్గించలేకపోతేగాని, తర్వాత యెన్నిమార్లు గీతలుగీచినా, యెన్ని శబ్దాల నుపయోగించినా యెంతమాత్రం ప్రయోజనం లేదు. ఒకవేళ మొదటిదానిని స్వల్పంగా సర్దవలశివస్తే సర్దవచ్చు తర్వాత! రం

గులు ఊరికే పాముడంచేత ఆకృతిచిత్రం కల్పిస్తాడనటంగాని శబ్ద జాలాన్ని యెక్కువగా ఉపయోగించి భావచిత్రాన్ని కల్పిస్తాడనటం గాని పొరబాటు! ఇదొక విషయం! జ్ఞాతంద్వారా అజ్ఞాతానికి వెళ్లాలె! నిజమే! కాని యీ అజ్ఞాత విషయాన్ని తెల్పటానికి ఉపయోగించే ఉదాహరణాలూ, సాదృశ్యాలూ అసంఖ్యాకాలుగా యిస్తే వకప్పుడుకాదు-యెల్లప్పుడు-గారెలెక్కువగాతింటే వెగటైనట్టు వెగటౌతుంది! చెప్పిన భావాన్నే చెప్పడం, ఉదాహరణాల నంతులేకుండా యియ్యడం, యీనవ్యులకొక అలవాటు! ఇదేం జామెట్రిప్రాబ్లెమా, లెక్కా, గట్టిగాచెప్పి బుర్ర కెక్కించటానికి? కుంచెతో కొన్ని గీతలతో ఆకారం తేలేనివాడు తొట్టిలో ఉన్నరంగంతా ఉపయోగించినా తేలేడు. అట్లాగే కవికూడాను. ఈవిషయాన్నే ఉమాకాంతపండితుడు "పులుముడ"న్నది. ఈ ఉదాహరణ పరంపరనూ, భావపౌనః పున్యాన్నీ, చూడాలంటే ఉమాకాంతపండితుడి "నేటికాలపుకవిత్వం" చదవమని మనవి. ఆయన చక్కగా హాస్యరసపూరితంగా విషయాన్ని చర్చించాడు. ఇది వీళ్ళ చిత్తవృత్తికి తగిన విషయం. ఉదాహరణాలియ్యడం మొదలెడితే పుస్తకాలు పుస్తకాల ననువదించవచ్చు! మాటల పోగులు! చదవటానికి బాగుంటై కాని లోతుకు దిగితే అనేక అనవసరమైన పదాలుకనపడతై! ఈనిరర్థక పదప్రయోగమూ, ఉదాహరణపరంపరా, భావపౌనః పున్యమూ, వీళలో సామాన్యంగా చాలామంది వ్రాతల్లో కనపడతై! శివశంకరశాస్త్రిగారిలో యిది కొంచెం తక్కువ. మరీ భావపూర్ణహృదయులైనవాళ్లల్లో యిది మితి మీరిపోయింది. ఇది యీ నవ్యసాహిత్యానికొక అపకర్షాహేతువు. ♦

♦ మనపూర్వలాక్షిణికులుకూడా యీవిధమైన కవిత్వాలనూ కవులనూ, సూచించనే సూచించారు. చూడండి కవులను 7 విధాలుగా విభాగం చేశారు. వాళ్ళపేర్లూ కవిత్వగుణాలూ యీకింది విధంగా యిచ్చారు.

(1) వాచకుడు=పదాడంబరం. (2) ఆర్థుడు=మితశబ్దం, అర్థవిస్తారం. (3) శిల్పకుడు=యమకాదులు, సుశబ్దం. (4) రౌచికుడు=కథారుచి. (5) భూషణార్థి=అలంకారప్రియుడు. (6) మార్దవానుగతుడు=సరళశబ్దములు, విరళార్థములు. (7) వివేకి=శృతిస్మృతిశాస్త్రాలంకారప్రియుడు.

## 3

థానిక*—(ప్రథమ సోపానం) :

ఈ వీధిలో సాధకులు చాలా సిద్ధిని పొందారు. ఈ కథానికా చనంలో సాధకులు అధిక సంఖ్యాకులు వ్యావహారికాన్నే ఉపయో ంచారని అనడం భావ్యం.‡ చ్యుతసంస్కారంకాని గ్రాంథికంవాడిన గాళ్లుకూడావున్నారు. ఇటువంటి వాళ్ళలో యీవిషయంలో గిడుగు గారి శిష్యులుకూడా వుండడం ఆశ్చర్యకరం. వెనక చింతా దీక్షితులు గార్ని గూర్చి, ఆయన రచించిన ఖండకావ్యాలనుగూర్చి, వాటిలో గాధ్యమైనంతవరకు ఆయన సలక్షణమైన భాషనే వాడటాన్నిగూర్చి, మనవిచేశాను. మచ్చుకు ఆయన కొన్నికథల్లో ఉపయోగించిన భాషనుగూర్చి చెబుతాను. సాహితి మొదటిసంచికల్లో ఈన "స్వేచ్ఛ" అని వకకథ రాశాడు. దానిలో సంభాషణలో వాడిన భాషను వదిలి, థావస్తువును కవి చెప్పేటప్పు డుపయోగించిన భాషను యెత్తి చూపుతాను.

---

* "కథను కావ్యభాషవల్ల జీవకళ చెదిరిపోతుంది. వాడుకభాష వాడితేనే వర్చస్సు.......గు. అప్పారావుపంతులుగారు వాడుకభాషలో చెప్పిన "దిద్దుబాటు" అనే కథవల్ల తెలుగులో వెలుగు బయలుదేరింది." (త. శి. శా.)

సభాపతిగారు 1915 లోనే "ఆఖ్యాయిక" అనే పేరుతో సచిత్ర మాసపత్రిక ప్రకటించటానికి యత్నించినట్టూ సాగకపోయినట్టూ చెప్పాడు. రేణికిరాని అనేక కథలను పరామర్శించాడు. కథాస్వరూపాన్ని నిర్వచించాడు.

(భారతి-ప్రమాది-భాద్రపదం)

‡ శేషాద్రి రమణకవులు కూడా సాహితిలో తాము రాసిన "ఇల్లాలుమాట తప్పుతుందా" అనే కథలో వ్యావహారికాన్ని రాశారు.

"జాగరూకతతో క్రిందకు దిగిన దొంగరాముడు, జవానులకు ప్రతిబంధకమైన గాలిదుమారము నావంతయు లక్ష్యము జేయక, దుబ్బులచాటున లేడివలె పరుగెత్తుకొని పోజొచ్చెను. జవాను క్రింద కురుకునప్పటి కాతడప్పుడే సుమారొక ఫర్లాంగుదూరము పోయెను. అతనిజాడ గనుగొనునప్పటికి జవానుల కైదునిమిసములు పట్టెను. అప్పటికైన నయ్యది జవానుల చాకచక్యమువలన గాదు. జైలుగోడ కరమైలుదూరములోనున్న గుట్టపై నాతడునిల్చి వెనుకకు దిరిగి తన్నెవరైన (అ)నుసరించి వచ్చుచున్నారేమో (అ)ని చూచు టచే జవాను లతడేగినమార్గమును గనుగొనగలిగిరి." చూచారా యీ వచనం! ఇందులో చకటని సలక్షణభాష ఉపయోగించాడు కర్తగారు. "క్రిందకు" "అయ్యది" అనే పదాల నుపయోగించడ మాశ్చర్యమే! "కిందికి" అనాలశింది. "అది" అనాలశింది. ఇది నవ్యులమార్గం. పైనచూస్తే నిత్యసంధులు పాటించినట్టూ, ద్రుతసం ధులు చేసినట్టూ, సరళాదేశాలు చేసినట్టూ కనపడుతుంది. అర సున్నలుమాత్రం ఉపయోగించ లేదు. రెండుస్థలాల్లో బ్రాకెట్లుపుంచిన చోట్ల విసంధిఉంది.* చూశారా అప్పటికింకా కథల్లోకూడా వెనకటి పద్ధతినే నవ్యులు కొందరు అప్పుడప్పుడూ ఉపయోగిస్తున్నారు!♦ పూర్తిగా గ్రాంథికా న్నుపయోగించిన వాళ్ళుకూడా వున్నారు. త్రిపు రారిభట్ల వీరరాఘవస్వామిగారూ, వాసుదేవరావుగారూ, మంచి భాషను వాడారు. విశ్వనాథకూడా సలక్షణభాషనే చాలావరకు వాడాడు. వకటటిమాత్రం స్పష్టం! సౌలభ్యంకొరకు ప్రయత్నిం

* వెనకటి "స్వీయచరిత్ర" "గాలిపాట" అనే కథల్లోభాష యింతకంటె యెక్కువ వ్యావహారికం.

♦ వ్యావహారికం సంపూర్ణంగా యిట్టిదని యిప్పటికి స్థిరపడలేదు. మునిమాణిక్యం గారికి వకవిధమైన గృహవ్యావహారికం పట్టుపడ్డది. కథల్లో మొదట్నించీ అయన వ్యావహారికాన్నే వాడినట్టు కనపడుతుంది.

చారు. అవసరమైన స్థలాల్లో వైశద్యంకోసం విసంధి చెయ్యటానికి వెనుదీయలేదు. ఈపద్ధతిని కొందరే అవలంబించారుగాని బహుళంగా వ్యావహారికాన్నే పూర్తిగా వాడారు. అటువంటివాళ్ల సంఖ్య యెక్కువగాఉంది కాబట్టి పేర్లు చెప్పట మనవసరం. ఈ కథకులు కొందరు యింగ్లీషులోవున్నవాటిని అనుకరణాలు చెయ్యటం మొదలెట్టారు. ఈ కథానికామార్గం మనకు కొత్తదికాబట్టి, యింగ్లీషులో వాటి ననుకరించటం సమంజసమే! కొందరు ఆ వాతావరణంతీసుకుని కథలను కల్పించారు! కొందరు కథలనే గ్రహించారు! మరి కొందరు "యెవ్వరు చూడవస్తారు" అని వాటినే ఉన్నవాటి నున్నట్టు స్వభావసిద్ధమైన మన భాషలో రచించి, స్వతంత్రాలా అన్నట్టు చేశారు! "చలంగా" రున్నారనుకోండి. ఆయన శైలీ భాషాకూడా మిక్కిలి స్వభావసిద్ధం, సహజం! వ్యావహారికం రాశేవాళ్ళలో యీన చాలా ప్రవీణుల్లో వకడు!* ఈన కథలు చదువుతూంటే స్వతంత్రాలుగా కనిపిస్తై! కాని చాలా యితరభాషల్లోనించీ గ్రహించినవే! మొపాసాం (Mopassant) మొదలైనకొందరికథలు యింగ్లీషులోకి తర్జుమాచేశున్నై! ఫ్రాంసు యూరపుఖండానికెట్లా జ్ఞానాన్నిచ్చిందో, అట్లాగే స్త్రీ పురుషుల స్వచ్ఛందప్రవర్తనాన్ని ప్రసాదించింది.♦ ఈ రెండూకూడా క్రమక్రమంగా వ్యాపిస్తూ మన దగ్గిరికూడా వచ్చినై! దాన్ని వక గొప్ప మతమల్లే మనవాళ్లు కొంతమంది గ్రహించారు! దీనికి కొందరు దాసులైపోయి, ఆ విధమైన వాఙ్మయాన్ని మన సారస్వతంలోకి తెచ్చి దాన్ని ఫలవంతం చెయ్యడానికి పూనారు. అట్లా వాళ్ల కథలను చాలావాటిని మార్చో, కొంత

*ప్రకృతి తత్వవివేచనమూ, స్వభావోన్మీలనమూ, చిత్తవృత్తి పరిశోధనమూ యీనవలె తెనుగుకథానికా రచయితలలో చేయగలవాడు లేడు.

♦ మొపాసాం కథల్లో చాలా చమత్కారం మొదలైనవి వున్నా, కించెమో గొప్పో "అశ్లీలం" లేని కథ వుండదు.

కలిపో, కొంత తీశోశో చాలా కథల నీ "చలం" గారు రచించాడు. తర్వాతతర్వాత స్వతంత్రాలుకూడా రాశాడు. ఒక్క-భారతి—అదీ తర్వాతదినాల్లో—తప్ప యీనకథలు ప్రచురించని తెనుగుపత్రిక లేదు. కొన్నికథలు "పాపం" అనే పేరిట ప్రకటించాడుకూడాను. ఈన "శశిరేఖ" "చిత్రాంగి" మొదలైన నాటకాలుకూడా రాశాడు. వాటిలోకూడా ఆయన మామూలుమార్గాన్నే వెళ్లాడు. ఉదాత్త తంటూ లేదు. అశ్లీలమూ, పూర్వసంప్రదాయ నిరసనమూ, యీ రెండు యెక్కడచూచినా కనపడుతూ ఉంటై యీనకృతుల్లో! చిన్న నాటి కలు కొన్ని కలిపి నమ్మాళ్వార్లు "నాటికాగుచ్ఛ" మని ప్రకటిం చారు. సారస్వతంలో అన్నిరకాలు వుండాలశిందే! సారస్వతం జాతి యావజ్జీవితానికీ ప్రతిబింబం! కాబట్టి యిటువంటి జీవితానికికూడా ప్రతిబింబంగా ఉండాలశిందే! అందుకనే తారాశశాంకవిజయ రాధికా స్వాంతనాది గ్రంథాలు పాఠకుల నాకర్షిస్తున్నై! ఇటువంటివాట్ని, అధమకావ్యాలన్నా, మొత్తంమీద కావ్యాలే! ఆ విధంగా యిటు వంటి కథానికావాఙ్మయాన్ని మనదానిలోకి కష్టపడి తెచ్చినవారిలో "చలం" గారొకడు! ఆయన్ను మనం వక విధమైన సారస్వతానికి బ్రహ్మగా అంగీకరించాలశిందే! అనేకుల యువకులూ, యువతులూ, బాలవితంతువులూ—చాలా శిష్టకుటుంబాల్లోవాళ్ళు—యీన కథ లను, "వినోదిని లో"నో మరో చేడపత్రికలోనో రహస్యంగానైనా తెప్పించుకుని చదువుతూ వుంటారు! చూచారా? యిటువంటి సాధకుడిని—సంఘంలో వకభాగం పైన యింతపలుకుబడివున్న సాధ కుడిని—మనం నిరాదరణ యెంతమాత్రం చెయ్యకూడదు.

మానవుడిలో పశుత్వం, మనుష్యత్వం, దేవత్వం, అనే మూడంశలు వున్నై! వీటిలో మొదటి రెండూ సహజాలు! మూడోదిమాత్రం గూఢంగావుంది. దాన్ని అభివృద్ధిచేసుకోడానికి చాలా ప్రయత్నం కావాలె! మానవత్వం బాహిరం! పశుత్వం

కూడా గూఢమేగాని దాన్ని పూరిక తాకితచాలు అది ప్రజ్వరిల్లు తుంది. జ్ఞానంలేని పశువులకూ, మానవుడికీ, సమానమీఅంశ! ఈ అంశాన్ని ఉపయోగించటంలో జాగ్రత్తకు దారిచూపేది మానవత్వం! అటువంటి మానవత్వం, తన జ్ఞానంతో పశుత్వాన్ని దాని సరిహద్దుల్లో వుంచకపోతే, అది వ్యక్తికిచేసే అపకారం యింతని చెప్ప టానికి వీలులేదు. ఆ అంశను యెక్కువగా విడిస్తే అధఃపతితుడై పోతాడు మానవుడు! పైస్థితికి వెళ్ళడం మంచిదో, నీచత్వం లోకి పోవడం మంచిదో ఆలోచించండి! ఈఅంశను బొత్తుగా విడవ డానికి వీల్లేదు. ధర్మ సంతానానికి మూలసూత్రమిదే! కాని యిది ధర్మబద్ధంగా వుండడం సాంప్రదాయసిద్ధం! పొరపడడం కూడా మానవుడికి సహజమే! అక్కడనేవుంది సంఘాన్ని అభివృద్ధికి తేవలశిన కవికృత్యమూ, వ్యక్తి ప్రయత్నమూను! పొరపాటును ప్రోత్సహించక పోవటం కవిపని! దాన్ని సాధ్యమైనంతవరకు తప్పించుకోడం వ్యక్తి పని! సంఘంకూడా వకప్పుడు పొరపడవచ్చు! దాన్నికూడా దిద్దడానికి ప్రయత్నించడం "కవిబ్రహ్మ" పని! ఎన్ని చెప్పినా మంచి చెడ్డలు యేక కాలావచ్ఛేదకంగా యెప్పుడూ వుంటై! అట్లాగే యీ పశుత్వం కూడానని మనస్సు సరిపెట్టుకుంటే వెళ్లిపోతుంది! కాని, అట్లా కాకుండా, సంఘంలోవున్న యీకుళ్ళు సహజమని, ఉన్న భిన్న రూపాలనన్నిటినీ ప్రచారంచేశి, ఉత్సాహకల్పనంమూలంగా యువతీ యువకుల చిత్తవృత్తులను మాత్రం కలచడం కవిఅయి జ్ఞానవంతు డైనవాడు చెయ్యవలసిన పనికాదు.* ఈధర్మోపన్యాసం అంతా అప్రస్తుతం! కవి మనం చెప్పినట్టువింటాడా! అందులో తాను

* "ఆయన సిద్ధాంతాలు నామనస్సుకు వేరుగా ఉంటై" అన్నాడు విశ్వనాథ. అంతేగాక స్త్రీకి యెక్కడలేని గౌరవ మిచ్చామని చెప్తుకుంటూవుంటారు నవ్యులు. అటువంటి దానికి యీనరాతలు విపరీతాలుగా ఉంటై! ఈనరాతలుచూస్తే ప్రపంచంలో శీలమంటూ ఉందా అనేగాక. శీలం అవసరమా అనికూడా అనుమానం కలుగుతుంది.

అటువంటి సారస్వతానికి కర్తై, సంఘాన్ని వుద్ధరిస్తున్నాననే "అహం ప్రత్యయం"తో రాస్తూంటే, అతన్ని ఆపడం యెవరికి సాధ్యం? శిష్య గణంకూడా దేశంలో పోగైన తర్వాత మరీకష్టం! కాని యిట్టి అవస్థలో మునిగిపోయి కొట్టుకుంటున్న వాళ్లకు వైరాగ్యం చాలా త్వరగా పట్టుబడుతుంది. "లీలాశుకుడిని" చూడండి! అట్లాగే యీ విధమైన రాతలు అనేకం రాశిన "చలం"గారు రమణ మహర్షిగారి శిష్యులై చిత్తశాంతి పొందటానికి యత్నిస్తున్నారని విని చాలా సంతోషించాను. బహుశః లీలాశుకుడివలె యీన ముక్తి పొందుతాడని నానమ్మకం! ఈన కథలనుగూర్చి నవ్యసాహిత్య పరిషత్పత్రికైన "ప్రతిభ" విమర్శిస్తూ యిట్లాఅన్నది.

"తెలుగుదేశంలో గు. వెంకటచలంగారు ప్రసిద్ధులు. వీరికథలు నాటకములు, ఆంధ్రదేశంలో పాఠకులు, కొత్తసిద్ధాంతాలవారు, పాత సిద్ధాంతాలవారు, ఆతురతతో చదువుతారు...... వెంకటచలంగారికి పాత్రల సంభాషణవ్రాయుటయందు మంచినేర్పుకలదు......... ఈ కథలు వయసువస్తూవున్న స్త్రీ పురుషులు చదువదగినవికావు. వీటిని చదువుటవల్ల, స్వచ్ఛమై సరళమై పవిత్రమైన ప్రేమాంకుర ములుపుట్టి విజృంభించి పెరుగవలసిన మనసులలో, తుచ్ఛమై హేయమై నీచాతినీచమైన విషవృక్షాంకురము లుదయించి ప్రబలును.........అసభ్యవర్ణనకు యింతకంటె పరమావధి ఉండదు." వాళ్లవాళ్లే అనగా ఆయనతో సమానమైన నవ్యులే ఆయనకథలను గురించి యిట్లా రాయడంకంటె ఆశ్చర్యమేమైనా వుందా?*

మొదటి మొదటి కథకుల్లో పరీక్షించినట్లైతే తర్వాత ఉత్తమ కథ్యకు చెందబోతారనే సూచనలను చూపినవాళ్లున్నారు. వాళ్లలో మునిమాణిక్యం, చింతా, మొక్కపాటి, విశ్వనాథగార్లు

* "చలం గారి కలం" అని కొన్ని కథలు ప్రచురించారు బరిగగునించీ.

ముఖ్యులు.* మునిమాణిక్యంగారి కాంతం 1921-22 సంవత్సరం నాటికే పుట్టి పెరిగి పెనిమిటితో సంసారంచేస్తూ, ఆయనచేత "టీ"ని మాన్పించి నగలు చేయించుకున్నది. ఇంకా తర్వాత యెన్నెన్ని పనులు చేశిందో, యెంత పతిప్రేమగలదో, పాఠకు లెరుగుదురు. కాంతం ప్రతిబింబాలు యింటింటా ఉన్నై! ఇటువంటి కుటుంబకథలు చాలా అరుదుగావున్నై! తాగుడు, వ్యభిచారం, బీదల కష్టనిష్ఠు రాలు, యింకా యితర విషయాలు కథావస్తువులుగా రాశినవాళ్లు చాలామంది వున్నారుగాని, ప్రతి సంసారంలోవున్న చిల్లర కల్లలూ, వాటివల్ల కలిగే తాత్కాలిక మనస్తాపాలూ, మళ్లీ అతుకోడాలూ, మొత్తంమీద సంసారశకటం సాగుతూవుండి సుఖమిస్తూనేవుండ టమూ, వకరి చిత్తవృత్తి నొకరు కనిపెట్టి నడుస్తూవుండటమూ, మొద లైనవాటినిగూర్చి రచించినవాళ్లు చాలా తక్కువ. ఈ విషయంలో మునిమాణిక్యాన్ని చెప్పి మరొకరిని చెప్పాలె. కాంతంకథలు "క్లాసి కల్" అయిపోయినై!♦ ఎటువంటి హాస్యరసం! మెత్తని హృదయం గమమైంది. పానుగంటివారిదానివలె నవ్వించేపద్ధతికీ దీనికీ చాలా భేద ముంది. ఇంద్రగంటివారిలక్షణం, యీన కథలకు వర్తింపచేస్తే అచ్చంగా అందులో చెప్పినట్టే వుంటై! అందుకనే అంత హృదయంగ

*30—7—40 ఆంధ్రపత్రికలో యిట్లావుంది.

"కథానిక రచనలలో చింతావారివి మునిమాణిక్యంవారివి స్వతంత్రరచనలు కావనియు" (రామానుజరావు నాయుడుగారు)

"చింతా మునిమాణిక్యంవారి రచనలు స్వతంత్రమైనవని తాము రుజువుచేయ గలమనిన్ని" (సభాపతిగారు)

♦ "కాంతం కథలు", "నేనూ, మా కాంతం", "కాంతం కైఫీయతు", "మునిమాణిక్యం కథలు" మొదలైనవి యీన కథాసంపుటాలు. ఇతర నాటకాలు రాశాడు గాని యీన ప్రత్యేకస్థానం కథానికలోనే! యువదంపతుల దగ్గిరినించీ ప్రారం భించి, వృద్ధదంపతులదాకా, దంపతుల ప్రేమయొక్క క్రమపరిణామం చిత్రించాలనే ఆశించాడు. గాని భార్యమృతి నిరుత్సాహం కల్గించినట్టు తెలుస్తుంది.

మాలైనై! కొందరు "కర్తగారి స్వానుభవాలా యివి" అని భ్రమ పడేటంత నిజంగా కనిపిస్తై! పాఠకుడి అనుభవానికి సరిపోయినప్పుడూ, కవిహృదయం ప్రవేశం చేసి రసమాస్వాదించినప్పుడూ, వచ్చే ఆనందమే నిజమైన కావ్యానందం!♦ ఈ మార్గంలో, లోకవృత్తంలో జరిగే సామాన్యవిషయాలను యథాసంభవంగా చిత్రించడంలో మొనగాడు మొక్కపాటి నరసింహశాస్త్రిగారు. ఈనకూడా హాస్యానికి పెట్టింది పేరు. ఆ హాస్యంలోనూ అతి సూక్ష్మమైంది సుమా! ఈ కాలంలోనే బారిష్టరు పార్వతీశానికి పునాదులు పడుతున్నై! ప్రథమసాహితీదినాల్లో యీన రాశిన "పిలక" అనే కథ చదివితే నవ్వువద్దనుకున్నా వస్తుంది. ఈన ప్రకృతే హాస్యప్రకృతి.¶ సామాన్యంగా మాట్లాడుతూఉంటేనే చాలా సంతోషంగా వుంటుం దాయనతో! సభాపతిగారి కుమారుడైన కృత్తివాసతీర్థులకు తన కుమార్తెనిచ్చి తన నవ్యసాహిత్య సంబంధాన్ని గట్టిపరుచుకున్నాడీయన. ఇంగ్లాండు వెళ్ళివచ్చిన దేశీయులలో ఆకుపొందకుండా పోకపొందకుండా తిరిగేవాళ్ళలో యీన వకడు. కాని వెళ్ళివచ్చి హాడిచి గెల్చానుకునేవాళ్ళకంటె చాలా గొప్పవాడు. గుండ్రడిసిమనిషీ, పొట్టిగా రసురా, చక్కని భాషోచ్చా

♦ ఈ రెండోది మళ్లీ రెండుమెట్లకింద ఉంచి ముందు తెలుసుకుంటాము.

¶ మేమిద్దరం ఒకమారు యేలూరులో జరిగిన వక కాంగ్రెసు కమిటీమీటింగుకు వెళ్ళాము. మధ్య యింటర్వెల్ లో కాఫీ హోటలుకెళ్ళి కాఫీతాగి బయటకొచ్చేటప్పటికి యిద్దరు జట్కావాళ్ళకు పోటీతగిలి, అందులో వకడు "శనివారప్పేట యెవళ్లైనా రండి! వూరికే తీసుకుపోతా" నంటున్నాడు. రెండోవాడు "నేను అరటిపండ్లు యిస్తానుకూడాను" అంటున్నాడు. అప్పుడు మిత్రుడు నరసింహశాస్త్రి "సీతారామయ్యగారూ! శనివారప్పేట వెళదాంరండి ఊరికే తీసుకుపోతాడట!" అన్నాడు. "మనకక్కడేం పనుంది? అనవసరంగా యెందుకు" అన్నాను. అప్పుడు "మనకిటువంటి భేరం మళ్లీ వస్తుందా? రండి పోదాం నామాటవిని" అని బలవంతం చేయడం సాగించాడు. పొట్టచెక్కలయ్యేటట్టు నవ్వొచ్చింది! దామరాజు లక్ష్మమ్మగారి కాఫీ హోటల్లో చేశిన అల్లరి—హాస్యరసపూరితమైన అల్లరి—యెప్పటికీ మరువరాదు.

గణా కలిగి యెప్పుడూ చిరునవ్వు మొగంలో తొలుకాడుతూవుంటుంది. కే నెప్పుడు మద్రాసు వెళ్ళినా తలవనితలంపుగా యెక్కడో కనపడతాడు! మాట్లాడటం మొదలుపెడితిమా యితరపనులన్నీ మరిచిపోయి గంటలుగంట లట్లాగే నిలిచిపోవడ మలవాటు.! బసలో మాకోసం కనిపెట్టుకోడమే! ఇది మా మైత్రి! ఈన "బారిష్టరు పార్వతీశం" 1925 నాటికే ప్రథమముద్రణ మైంది. అప్పటినించీ యిప్పటి వరకూ అది పాఠకుల కానందం కలగచేస్తూనే వుంది. నామట్టుకు నేను అనేకమార్లు చదివాను. అందులో పట్నంహోటలు, పార్వతీశం తెలివితక్కువపనులు, తలుచుకుంటూ వుంటేనే నవ్వొస్తూ వుంటుంది. పార్వతీశంవంటి అమాయకుడిని సృష్టించడం ఆంధ్రదేశంలో యెవ్వరిచేతా కాకపోయింది! ఇది సర్వకాలం భాషాకుమారుల కుత్సాహం కలగచేశే గ్రంథం. నాటకాల్లో కన్యాశుల్కం మాక్రమించే స్థానంకంటె యిది నవలల్లో అనండి, కథల్లో అనండి, చాలా గొప్పస్థాన మాక్రమించుకున్నది! తుదకు సినిమా రంగంకూడా యెక్కింది! ఈనరాశిన కాలంలో ఏలూరు జాతీయ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగా పప్పు పార్వతీశంగారనే ఆంగ్లదేశం పోయివచ్చిన వక విద్యాధికుడు, స్వార్థత్యాగి, నిగర్వచూడామణి ఉండేవాడు. నామసామ్యంచేత ఆయనే యీ పార్వతీశమని పొరపడేవాళ్లు పాఠకజనం! ఆలోచిస్తే యీ పేరు ఆయనకు కొంత అన్యాయం కలగజేశిందని మాలోమేమనుకునేవాళ్ళం! కవిమాత్రం అట్టివిషయ మే హృదయంలో కలవాడుకాడు! ఇది కేవల నామసామ్యం! ఆంధ్రరత్నం, పార్వతీశం, నరిసింహశాస్త్రి గార్లు ఇంగ్లాండులో వక్క కాలంలో వున్నారని నాకు జ్ఞాపకం! ఈ గ్రంథం వక్కటి చాలు నరిసింహశాస్త్రిగారి పేరును సాహిత్యంలో శాశ్వతంచెయ్యటానికి. కొందరాయన్ని "బారిష్టరు పార్వతీశ" మని ఆయనపుస్తకంపేరుతోనే పిలుస్తారు.

రియలిజం, ఐడియలిజం :

"బ్రహ్మాండమునందొక అంశామాత్రమో, ఒక దిక్కో, కేవలము ఉపరిభాగమో యనదగు నీ వాస్తవలోకమే స్థూలదృష్టికి పూర్ణసత్యముగ గన్పట్టును. కవు లెప్పుడును దాని నతిక్రమించుటకే చూచుచుందురు. దాని కావలనున్న వెలుగులు వారి నాహ్వానించు చుండును. వాస్తవలోకాతిక్రమణము భావశబలతకు ముఖ్యలక్షణము. దీనినే పాశ్చాత్యులు "Idealism" అందురు. రసభావస్ఫూర్తిచే బుద్ధియం దంకురించు వ్యక్తిగతసంస్కారవిశేషమునే పాశ్చాత్యులు "ఐడియలిజం" అందురు. అంతియేకాని వారి కది ప్రత్యక్షానుభవవిషయము కాదు. వారి భావనాశక్తి వాస్తవలోకమును విడిచి ఎక్కువదూరము పోజాలదు. చాలవరకు దాని పొలిమేరలందే విహరించుచుండును. ప్రవృత్తిప్రధానమగువారి సభ్యతగూడ వ్యావహారిక ప్రపంచమును విడనాడు సాహసమును వారి కొసగజాలదు. వారిసభ్యతయందు, సంస్కారమునందు, కొరవడిన యీ "ఐడియలిజం" వారి కవితయందు కొంత గోచరించు ననుటకు సందియము లేకున్నను, అది (subjective) వ్యక్తిగతమైన చిత్తసంస్కార విశేషమే కాని అం దపరోక్షానుభూతి లేదు.

భారతకావ్యజగత్తు దీనికంటె భిన్నమైనది. భారతధర్మము నివృత్తిపూర్వకము గావున, ఆధ్యాత్మిక జ్ఞానసంపద, భారత జాతీయ జీవనమును లోపలను బయటనుగూడ తరతరములనుండియు, నావరించి ప్రకృతిగతమై పాదుకొనిపోయినది. భారతకవిత అట్టిజాతీయ సంస్కృతియందు పుట్టిపెరిగినదగుటచే భారతకవుల "ఐడియలిజం" ప్రత్యక్ష విషయము. పాశ్చాత్యుల "ఐడలిజం" వలెనది ఊహాకల్పితమైనది కాదు. భారతకవి రసభావవివశుడగుటతోడనే, వాస్తవ జగత్తు నతిక్రమించి ఆనందరససింధువున నిమగ్నుడగును. అప్పు డూర్ధ్వలోకములన్నియు వివృతద్వారములై కవికి అమృతాభిషేచ

నము చేయును. ఇయ్యది అప్రయత్నోపపన్నము. ఉపాసనాబల ముచే సిద్ధించిన ఆత్మప్రతిభ. ఆర్యఋషుల కృపాకటాక్షముచే జేకూరిన నిస్తులభాగ్యము.

భరతవర్షములోగూడ ఆర్యధర్మచ్యుతులైన కుకవులు లేక పోలేదు. జుగుప్సాకరములైన నీచకావ్యము లెన్నియో యిచటకూడ వెలసినవి. ముద్రణా సౌకర్యములే లేనియెడల నవి యేనాడో మక్షికములకు భక్ష్యము లయ్యెడివి. అంతియేకాని భారతప్రకృతి వానిని జీర్ణము చేసికొనజాలదు ... ... ... ... ఆ నీచకావ్యములయందుగూడ భారతీయుల కాణాచియగు రసానుభవము అచ్చటచ్చట కన్పట్టు చుండుటచేతనే వానికి కావ్యశబ్దవాచ్యత కలిగినది. రసవిచారము యీ దేశములోవలె నెచ్చటను పరిణతిపొందలేదు. ఇటీవల నీ శాస్త్రము బిరుసెక్కి ఘనీభవించినను రసజగత్తుయొక్క విస్తీర్ణతను గభీరతను దెలిసికొనవలెనన్న భారతీయుల రసశాస్త్రమువలె నుపకరించకలిగినది మరియొకటి లేదు.*

(సమీక్ష — ము. కృ.)

దీన్నిబట్టిచూస్తే మూడు మెట్లు కనిపిస్తున్నై! వాటి నీ కింది విధంగా చూపుతాను.

1. వాస్తవానుభవం = (రియలిజం)

♦ 2. భావసంచారం = వ్యక్తిగత సంస్కారం - (పాశ్చాత్యుల ఐడియలిజం)

---

*ఈ రసాన్ని యీ విమర్శకుడే కింది విధంగా మరొకచోట నిర్వచించాడు. "రసము ఇంద్రియరాజ్యమునందు జన్మించి, అతీంద్రియరాజ్యమున లీలను చూపుచున్నది." కాబట్టే యీ రసమనునది విలక్షణము. సామాన్యమైన యింద్రియానందం వంటిదికాదు. కవిసృష్టిని విలక్షణమన్నాడు లాక్షణికుడు. బ్రహ్మసృష్టికంటె విలక్షణమైనదీ కవిసృష్టి. ఈ విషయం వెనక కొంచెంగా మనవిచేశాను.

♦ఈ 2. 3 రకాలనే కలిపి వెనకనేను "కవిహృదయ ప్రవేశంచేస్తే" నని ఉల్లేఖించినది.

3. రసానుభవం = అపరోక్షానుభూతి. మన భారతీయ కవుల రసజగత్తు.

ఈ విధంగా పరీక్షిస్తే మన నవ్యకవుల్లో ముప్పాతిక మూడు వంతులు మూడో మెట్టులోవాళ్లూ, కొద్దిమంది రెండో మెట్టుదాకా వచ్చారేకాని దాన్ని దాటినవాళ్లు చాలా అరుదు. వాస్తవజగత్తులో నించీ కాల్పనికజగత్తుద్వారా అపరోక్షానుభూతిని పొంది పాఠకుడిని రసానుభవంలో ముంచడం ఉత్తమకవి కృత్యం! వాస్తవానుభవ చిత్రంవల్లకూడా వకవిధమైన ఆనందం కలుగుతుంది. కాని అది కింది మెట్టు. కథకులలో మునిమాణిక్యమొక్క-పాట్యాదులు కలిగించిన ఆనందం యిట్టిది! సంపూర్ణ రసానుభవము మన ప్రత్యక్షాన్ని దాటిపోయి, కాల్పనికజగత్తునుకూడా దాటిపోవాలె! మనం వెనక గమనించిన నవ్యతంతా పాశ్చాత్యవాసనాఫలం కాబట్టి దానిలో సాధకులంతా పాశ్చాత్యులు పోగలిగిన రెండోమెట్టు దగ్గిరికి మాత్రమే పోగలిగారు. వెనక మనవిచేసిన బసవరాజు, నండూరు, దేవులపల్లి, వేదుల, దువ్వూరిత్యాదులంతా యిటువంటి చిత్తపరిణతిపొంది, "రసభావస్ఫూర్తిచే బుద్ధియం దంకురించు వ్యక్తిగత సంస్కార విశేషము"ను పొందిన సాధకులు. వీరు రెండోమెట్టును చేరారు. ఇది వాళ్ళ చిత్తపరివర్తనంచేత వాళ్లు కల్పించిన జగత్తు. మనను తీసుకెళ్ళి వాళ్ళ కాల్పనికజగత్తులో సంచరింపచేశారీ మహామహులు. మన వందనాలు వారికి ఇంతమాత్రం చిత్తసంస్కారం మనలో కలగచేసినందుకు! ఖండకావ్య కర్తల్లో, యిప్పటికి నేను ఉల్లేఖించినవాళ్ళలో తృతీయ సోపానానికి మార్గం చూపడంలో మొక్కవగా దారిచూపినవాడు రాయప్రోలు! గట్టిపోలికలు కనిపిస్తై నాయనిలో! సఖ్యము మనసవ్యుల కందరికీ ఉపాదేయమే అయినా, చాలామంది యీ సఖ్యాన్ని ప్రేయసీద్వారాగా చూశే

వాళ్ళేగాని, ప్రేయసికంటె భిన్నంగా దీన్ని గమనించేవాళ్లు కారు.* కాబట్టి వాళ్లకు కేవల సఖ్యం పరమావధికాదు. ప్రేయసీ ప్రణయమే ప్రాప్యం! కాని రాయప్రోలు అట్లాగాక సంయోగ వియోగాత్మకప్రణయంకంటె సఖ్యాన్ని ప్రణయానికి పరమావధిగా చేశాడు. చూడండీ విమర్శకవాక్యం!

"సంసారమున నీసఖ్య వాత్సల్యాది సంబంధములున్నను రసానుభవము మాత్రము దుర్లభము. ఈ సంబంధములకు రెండు విశేషములుకలవు. (1) తరళత (2) ఆనందము. తరళతయనగా సర్వత్ర సంచారముచేయునది, అందరిలోను ప్రవేశించునది. ఆనందము సంచరించుచోట సుఖము ఉత్ఫుల్లమగును. సర్వసంచార శీలము, సర్వానందదానము, రసముయొక్క ముఖ్యధర్మములు. ఈ ధర్మము లించుక సంసారమునందు గలవు............కాని వానికి వికాసము లేదు. ఆ సంబంధములు దేహ ప్రాణ మనఃపర్యంతమైనను పూర్తిగ వ్యాపింపలేకున్నవి. ఇక నతిక్రమింపజాలవని వేరుగ చెప్ప నేల? దేహప్రాణమనముల నాక్రమించి, వాని నతిక్రమింప నంత వరకు, వానిని రసములని యనుటకు వీలు లేదు.♦ సఖ్యరసమును చూడుడు!......పంచేంద్రియములును సఖుని బొందుటకు వ్యాకులపడుచుండును! మనస్సు అవిరాగముగ సఖునిరూపమును ధ్యానించుచుండును! రెండు దేహములలోను ఒక్క ప్రాణమే స్పందించును! సుఖదుఃఖములందు ఐక్యత యేర్పడును!............ఇంద్రియములకును,

* "మగడు వేల్పన పాతమాటది
ప్రాణమిత్రుడనీకు.........."

(కాసులు. గు. వేం. అ)

సభాపతిగారి "అజ్ఞాతమిత్రం" వకటి ఉన్నది.

♦ఇదియే కవిసృష్టియొక్క విలక్షణత. సంసారమునకు అనగా బ్రహ్మసృష్టికి సుఖదుఃఖాత్మకమైన అనుభవమే కాని ఆనందరూపమైన రసానుభవములేదు. కవిసృష్టి యట్టిదికాదు. అందు సుఖదుఃఖములు లేవు.

అతీంద్రియములకునుగల భేదము సమసిపోవును! ఆత్మ దేహధర్మ మును, దేహము ఆత్మధర్మమును బొందును!.........ఎవడు సఖ్య రసము నొక్క కణమునైనను ఆస్వాదించునో వాని కిది కల్పన కాదు!"♦ ఈ విధంగా యీన సఖ్యాన్ని పరమావధిగా దాన్నే మూడో మెట్టుగా పేర్కొన్నాడు. ఈ ఆనందము వ్యక్తిగతసంస్కారం (Subjective) కాదు! ప్రపంచమంత విశాలం! ఇదే నిజమైన ఉత్తమకవి గ్రహించి మన కందచేశేరసం! ఈ కింది రాయప్రోలు పద్యం చూడండి :—

"కులశుభాంగీ వయోధీర కుసుమమందు
మోహమధువె గవేషించె మున్ను సుకవి,
సాత్త్వికప్రేమ కోశపేశలములైన
వత్సలామృతరుచులను వలచె నేడు!"

రెండురకాల ఆనందాన్నుల్లేఖించి వాటిలో తనది రెండోదని చెప్పా డీ కవికుమారుడు! ఇది పరిణతమార్గం!

దీన్నిబట్టి కథానికను పరీక్షిస్తే యీ యుద్ధానంతరదశ వర్ష కాలంలో వెనక మనవిచేశిన మునిమాణిక్యం, మొక్కపాటి గాక చింతా విశ్వనాథల్లో, యీ తృతీయసోపానానికి బీజాలు కనపడతై. ఇద్దరూకూడా మధ్యమెట్టుదగ్గిరకు యీ కాలంలోనే వెళ్లినవాళ్లన టానికి కావలసిన తార్కాణా లున్నై! చింతా దీక్షితులుగారు "శ్యామల" అనే కథలో యీకింది వాక్యాలను రాశాడు.

"బ్రహ్మసృజించిన వస్తువులందు ప్రణయమే లేకున్న సృష్టి కెంతలోపము వచ్చియుండునో?.......... ఆమె విగ్రహము చూడడమే నాకు తృప్తిగా వుండేది. ఆమెతో మాటాడటం సహిం తం లేదు. ......... ఆమె విగ్రహమును వీక్షించుటకై ఎప్పుడును నేను ఉవ్విళ్లూరుచూ వుండువాడను" అంతేగాక శ్రీధరరావు శ్యామ

♦ (సమీక్ష)

లకు రాశిన ఉత్తరంలో "ఈయాదరము స్నేహముగా పరిణమించుటకు నే నాశించుచున్నాను" అనివుంది. ఇదంతా వెనక చెప్పిన సఖ్యం యొక్క ఛాయే! అంతేకాకుండా ఆ కథయొక్క పరిణామం, అనగా ఆమె చనిపోయినతర్వాత శ్రీధరరావు అవివాహితుడుగా వుండి తన సఖ్యాన్ని జీవితమంతా జ్ఞాపకముంచుకోడంకూడా సఖ్యాన్ని పోషించడమే! కాబట్టి యీనరాతల్లో సఖ్యంయొక్క బీజాలున్నై! ఇక విశ్వనాథను గనుక తలిస్తే ఆయన 1923 నాటికి రాశిన "పరిపూర్తి" అనే కథలో నాయకుడు యీ సఖ్యవాత్సల్యాలను తన ప్రవర్తనలో చూపించిన ఆదర్శక స్నేహితుడు! నా కొకప్పుడు ఆ కథ అసంభవంగాకూడా తోచింది. కాని ఆలోచించగా చంద్రశేఖరుడిపాత్ర అలౌకికంగా యీ ప్రపంచంలో కాకుండా యెక్కడనో వున్నట్టు గోచరిస్తుంది! అతని బుద్ధిపరిణతీ, స్వార్థరాహిత్యమూ, తోడివారికి ఆనందం కలగజెయ్యాలనే ఆదర్శమూ, అందులో దైవంచేత వంచించబడ్డ మందభాగ్యుల యెడల ఆచరణపూర్వకంగాచూపే అనుకంపా చూస్తేనూ; ఆయన భార్యయొక్క అమాయకత్వమూ, స్వచ్ఛప్రకృతీ, భర్త తా నందకత్తె అని చెప్పినప్పుడు వచ్చే సంతోషమూ, మొదలైనవీ చూస్తేనూ; వకటి దైవికపాత్రగానూ, రెండోది పసిపిల్లపాత్రగానూ విజ్ఞానవైధర్మ్యం కనపడుతుందిగాని, సమన్వయించుకునేటప్పటికి, కర్లే రసానుభూతి మూడోమెట్టుకు దగ్గిరగా వున్నట్టు స్పష్టమౌతుంది. నల్లని దేహమూ, యేమాత్రం సౌష్టవంలేని అవయవ విన్యాసమూ, తుదకు గుడ్డితనమూ, కలిగిన స్త్రీని పరిణయం కావడంలోనే చంద్రశేఖరుడి వైశిష్ట్యమూ, చిత్తపరిణామమూ కనపడుతుంది. పెద్దఆస్తి వస్తుందనిగానీ మరే ప్రతిఫలాశా లేదు! కేవలం దైవోపహతురాలికి సంతోషం కలిగించటమే ఆశయం! సంతోషం కలిగించటమేగాక హృదయపూర్వకంగా ప్రేమించడం

అతని పాత్రకు యెక్కడలేని ఔన్నత్యం కలిగించింది.* ఈ విధంగా మొదలుపెట్టింది యీనాన భావౌన్నత్యం.

ఈసఖ్యం యెక్కడిదా అని భ్రమపడవద్దు! ఈనవ్యులు నూతనంగా దీన్ని కనిపెట్టలేదని వెనకటి విమర్శకుడి రాతలే సాక్ష్యం. కాని యీనవ్యులు దానికి ప్రాముఖ్యమిచ్చారు. మనలాక్షిణికులు రససంఖ్యానిర్వచనంలో మూడు తెగలుగా వున్నారు. అష్టరస వాదులు, నవరసవాదులు, దశరసవాదులు. భరతుడు అష్టరస వాది. తర్వాత కొందరు లాక్షణికులు శాంతం వకటిచేర్చి తొమ్మిది రసాలని అన్నారు. తర్వాత కొందరు ఆధునిక లాక్షణికులు తొమ్మిదికి మరివక భక్తిని కలిపి పదిరసాలు చేశారు. ఈ భక్తికి వాత్సల్యాన్ని స్థాయిభావం చేశారు. ఇదే రూపాంతరంలో సఖ్యమైంది. దీన్నే పోతనమహాకవి "తనుహృద్భాషల సఖ్యముఙ్" అన్నాడు ప్రహ్లాదుడి విషయంలో! అందుచేత "సఖ్యం" పదోరసమైంది. దీన్ని నవ్యులు గ్రహించారు. దీనికిటీవల చాలా గొప్పదనం వచ్చింది! చైతన్య మతంలో భక్తీ, విశిష్టాద్వైతంలో శేషశేషీభావమూ క్రైస్తవ బ్రహ్మ సమాజమతాల్లో "Doctrine of Divine Spouse" అనేదిన్నీ, యీ సిద్ధాంతం యొక్క రూపాంతరాలే! వెనకటితరంలో యీ విధమైన భక్తివాత్సల్యాలకు పానుగంటివారి "రాధాకృష్ణ" ప్రసిద్ధిచెందింది. అక్కడ భక్తిరూపంగా ఉన్నది యిప్పుడు "సఖ్య"మైంది. స్థాయీభావ మొక్కటే "వాత్సల్యం" వీటి రెండిటికీ! ఇది రసానుభావానికి తుది మెట్టు. సంయోగంకంటె విప్రలంభం గొప్పది! దాన్ని మన నవ్యులు

* ఇక్కడ చంద్రశేఖరుడియొక్క భోగం కేవల మానుషంగిక మేగనక అప్రధానం! ఇతరులకు ఆనంద ప్రదానం చేయవలెననే యిచ్ఛ స్వసుఖాన్ని అతిక్రమించింది! తర్వాత యీన "ఏకవీర" అనేపేరుతో రాశిన భావపూర్ణమైన నవలలో ప్రణయం సఖ్యంగా మారడం వకవైపూ, దానినించీ చ్యుతమైనందుకు పాపాన్ని కడుక్కోడానికి జలార్పణంచేసుకోడం మరోవైపూ చిత్రించాడు.

చాలామంది గ్రహించారు. అంతకంటె గొప్పది సఖ్యం! వెనక నే నుల్లేఖించిన అమలినశృంగారం యిటువంటిదే! ఈ అమలిన శృంగా రాన్నే (స్త్రీపురుషుల మధ్యైనప్పటికీ కామవివర్జితమైతే) సఖ్య మన వచ్చు. ఇటువంటి సఖ్యమే వెనకటి విమర్శక వాక్యంలో ఉల్లేఖిం చింది.* కాబట్టి సారాంశ మేమిటంటే! అమలినశృంగారమన్నా, సఖ్యమన్నా, భక్తిఅన్నా, పాత్రభేదమేగాని, అనుభవించే రస మొక్కటేనని సమన్వయము! ఈ రసానుభూతిలో, గ్రంథం పఠించే సహృదయుడికేగాక, పాత్రలకూడా సుఖమేగాని దుఃఖస్పర్శే లేదు! ఆ సుఖంకూడా శాశ్వతసుఖంవంటిదే! సృష్టి, పాత్రలు, సహృద యులు అందరికీ ఆనందానుభూతే! ఇంతకంటె కవిసృష్టికి వైలక్షణ్యాం వుందా? "హ్లాదైకమయీం" అనే లాక్షణికుడి వాక్యానికిదే అర్థం! ఇది కావ్యానికి పరమపరీక్ష! చలంగారి రచనఅంతా విమర్శక వాక్యం ప్రకారం "ఆర్యధర్మచ్యుతం." కాని అక్కడక్కడా రసాను భవంయొక్క మెట్లలో యేదైనా తగులుతున్నందున హానికికూడా కావ్యత్వసిద్ధివుంది. మొదటిమెట్టు తరుచు, తగులుతూవుంటుంది.

సాహితీ ప్రథమసంచికల్లో "శతావధాని శివరామకవి" అనే పే రుతో కొన్నిగీతాలున్నై! ఈ రచయిత వేలూరి శివరామశాస్త్రిగారని నా ఊహ. క్షమించాలె! అయితే యీ నవ్యమార్గంలోకి యీ కాలా నికి యీనకూడా వస్తున్నారని తేలుతుంది. తర్వాత యీన కథా కథానికలను గ్రహించి సాధనచేసినట్టు మనకు తెలుసు. ఈ ప్రథమ

---

* భక్తుడి యెడల పరమేశ్వరుడు సఖ్యాన్ని చూపుతాడు. కుచేలుడే దీనికి తార్కాణం. పరమేశ్వర సాన్నిధ్యమెట్లా భక్తుడు విడవలేడో, భక్తసాన్నిధ్యం పరమేశ్వరుడూ వదలలేడు.

"నాహంవసామివైకుంఠేన యోగి హృదయేరవౌ,
మద్భక్తాయత్రగాయంతి త త్రతిష్ఠామి నారద!"

చూశారా పరమేశ్వరుడు భక్తప్రియుడు!

గీతాల్లో యీాన ద్విపదను గ్రహించాడు. సాహితిలో రాయని వక కథకుడిని తప్పక ప్రశంసించాలికూడ. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. ఈన కథాకథనంలో సిద్ధహస్తుడు. ప్రబుద్ధాంధ్రపత్రికకూ యీానకూ అవినాభావ సంబంధం. ఈన "ఆంధ్రోద్యమం"లో మునిగి పోయిన వ్యక్తి. భారతస్వరాజ్యం రాకపోయినా ఆంధ్రరాష్ట్రమొస్తే చాలీయనకు. ఈనకథలు ఆంధ్రదేశంలో అభిరుచికలిగించినై. 1921 నాటికే "శ్మశాననాటికా"ది నవలలూ, అనేక పూర్వరాజుల కథలూ రాశి ప్రశస్తిని పొందాడు. తర్వాతతరంలో "పూలదండ" మొదలైనవి రాశి కీర్తి గడించాడు. కథాకథనంలో శాస్త్రసమ్మతమైన పద్ధతిలో, భావపూర్ణంగా, ఉత్సాహం కలగచేశేటట్టూ, పూర్తిగాచదివిన తర్వాత వెంటనే మరవకుండా కొంతకాలం మననంచేశేటట్టూ, రాయగలసమర్థుడు. ఈన ఆంధ్రరాజుల అనేక సన్నివేశాలను కథలుగా అల్లి ఆంధ్రాభిమానం కలగచేశాడు. "(వీరి) సంఘసంస్కారమూ, ఆంధ్రరాష్ట్రమూ, యీా రెంటినీకలిపి వ్రాసినకథలూ వ్యాసాలూ భాషాదృష్టితో చూస్తే వాడుకభాషకు క్రొత్త అలంకారాలు." అన్నాడు విశ్వనాథ. ఈన "వారకాంత" వంటి సాంఘిక నాటకాలూ, "వీరపూజ" అనే ఉూత్రంతో నిండిన సంపుటి వంటి గద్యగ్రంథాలూ రచించాడు. ఈన "ప్రబుద్ధాంధ్ర" అనేక జన్మల నెత్తింది. దేశంలో ఆంధ్రాభిమానం కలగజేసిన పత్రిక !

౪

"శారద" సాహిత్యానువృత్తి :

పూర్తిగా సాహితీపత్రికె అంతరించకపూర్వమూ కొంతవరకు తర్వాతాకూడా "శారద" వీళ్ళకు స్థానమిచ్చింది. వెనకటివాళ్లు

కొందరూ, కొందరు కొత్తవాళ్ళుకూడా యీ మార్గానుయాయులు కనపడతారు యిందులో. వెనకటి వాళ్ళలో ప్రథమవింశతి వర్షాల్లో రాశి, తర్వాత ఆగిన అబ్బూరి మళ్లీకొంచెం గోణిగాడు. "ఎర్రగన్నేరు" అనే పేరుతో పద్యావళిరాశాడు. విశ్వనాథ, అడివి, బాగా తేలుతున్నారు. "శారద"లో అడివిగారి "హిమబిందు" అనే నవల ప్రచురణంకావడం మొదలెట్టింది. విశ్వనాథ పత్రికల్లో క్వాచిత్కంగా కనపడ్డా "ఆంధ్రప్రశస్తి" "కిన్నరసాని"యింకా యితరకావ్యాలురాశిన కాల మిదే!* విశ్వనాథ మొదటి కావ్యం నేను చదివింది, ముత్తరాజు సుబ్బారావుగారి నిర్యాణమైన తర్వాత ఆయనపైన

* వకమారు తెనాలిలో తమ కావ్యగానంజరిపారు. అప్పుడు నేను తెనాలిలో వృత్తిలోఉన్నాను. నేనాసభకు అగ్రాసనాధిపత్యం వహించాను. తమకావ్యాల్లోనుంచీ అనేక భాగాలు చదివారు. అప్పటికింకా యీ నవీనమార్గంలో నాకు పూర్తి అభినివేశం కలగకపోవడంచేతా, ఆయన రాశిన కొన్నికృతులు సంకేతాలతో నిండివుండటంచేతా వాటిలో ఉండేరసాన్ని నేను ఆస్వాదించ లేకపోయాను. అది నాలోపమేకాని కవిది యెంతమాత్రంకాదు. సంపూర్ణసహృదయత్వం సంపాదించుకుని మరోమారు తత్కావ్య పఠనంచేసి ఆనందిస్తానని నాఉపన్యాసంలో మనవిచేశాను. అట్లాగే తర్వాత గ్రంథ పఠనంచేత నిజమైన సహృదయత్వం కొంచెంగా అలవడ్డప్పుడు ఆయనకావ్యాలు చదివి చాలా ఆనందాన్ని పొందాను. ఇప్పటికీ వాటిని అప్పుడప్పుడూ పఠిస్తూనే వుంటాను. నవ్యుల్లో నాకుమిక్కిలి ప్రీతిగలకవులు, రాయప్రోలు, నాయని, బసవరాజు, నండూరు, విశ్వనాథ, దువ్వూరి, అడవి, కాటూరు, మాధవపెద్ది, తుమ్మల, జాషువాలు. వీళ్ళ కావ్యాలను పునఃపునః పఠిస్తూవుంటాను.

"ఆధునిక కాంధ్ర సారస్వతంలో కృష్ణశాస్త్రి, నాయని, రాయప్రోలు, విశ్వనాథ, ఆదిగా అరుదుగా వున్నారు కవులు. కాకిబంగారం మెరుపుతో కూర్చిన పద్యసంపుటమును కావ్యం అనమంటే అనలేం!" (హనుమదింద్రగంటి)

రాశిన "బాష్పాంజలి".♦ ముత్తరాజు సుబ్బారావుగారీయన గురువు లలో వొకడు. ఈనకేగాక అనేకమందికి ఆయన సహృదయత్వమూ, నాట్యకళాభినివేశమూ మొదలైనవి కలగజేశాడు. పింగళివారు, మొదలైనవారు చాలామంది కాస్తోకూస్తో ఆయన ప్రోద్బలం కలవాళ్లే! ఈ సుబ్బారావుగారు స్వయంగా కవి. శ్రీకృష్ణ తులాభారేత్యాది నాటకాలు రాశాడు. ఈన "తులాభారం" యిప్పుడు చాలా ప్రశస్తిలో ఉంది. "రాజ్యశ్రీ" అనే నాటకంకూడా బందరులో ప్రదర్శిస్తే చూశాను. ఈన నవ్యులలో కొంతమందికి చిత్తవికాసం కలగ జేసినవాడు. విశ్వనాథ తన కృతజ్ఞతను, గురుఋణాన్ని "బాష్పాంజలి"ని సమర్పించి తీర్చుకున్నాడు. ఈ కాలంలో దువ్వూరి పెనమర్తులు యింకా రాస్తూనేవున్నారు. ఈ పేర్లిచ్చినవాళ్లు గాక కొందరు నూతనులున్నారు. తర్వాతవాళ్ళనుకూడా ఆంధ్రదేశం కొందరిని బాగా యెరుగును. సన్నిధానం, కవికొండల, పంచాగ్నుల, నాళం మొదలైనవాళ్లు ఆంధ్రదేశంలో ప్రశస్తిపొందిన వారే! వీరిలో పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారిని గూర్చి వెనక మనవి చేశాను. వీరు తమ వ్యాసరచనచేతా, తమ సాన్నిధ్యసహకారాల

♦ ఇంతకు చాలా పూర్వమే 1912–13 సంవత్సరం నాటినించే కవితచెబుతూ చక్కని ఖండకావ్యాలను రాశినట్టు విన్నాను. సాహితి సం. 5 సం. 1 లో "నాపాట" అని వక గీతముంది. అది విశ్వనాథ సత్యనారాయణశాస్త్రి అనిపేరుతో వున్నది. నానమ్మక మీనదేనని. ఆపాట చదివితే అప్పటికింకా విరివిగా కావ్యగానం చేయనట్టు కనపడుతున్నది. గీతి ఉత్పన్నమై తన్నేవరించిందట! ప్రకృతిలో నిలవలేకపోయిందట! బహుశః బయటికి రావాలెనని శ్రమపడే రోజులని తోస్తుంది. "ఉపసంహృతమైన యస్త్రమట్లు" అనే బింబప్రతిబింబభావంతో కూడిన పూర్ణోపమ సత్యనారాయణ గారిదే యీగీతమని కొంతవరకు ధృవపరుస్తున్నది. వైదికోపమలూ, మొదలైనవి యీనలో విశిష్టాలు! ముత్తరాజు సుబ్బారావుగారిమీద రాశిందీ యిదీ దాదాపు వక్కకాలానివే! అప్పటికే యీన కవిత్వానికి సహజగుణమైన క్లిష్టత పొడకడుతున్నది. "ముషితబుద్ధి" అనే గీతం చూడండి!

చేతా, నవ్యకవితకు గౌరవమిచ్చిన రసావేశం గల వ్యక్తి. పండితులు నవ్యసాహిత్యానికి నైచ్యాపాదనచేసే రోజుల్లో తానీ నవ్యులకు బాసటై నిలిచి, తమ శాస్త్రజ్ఞానాన్ని తద్రక్షణకొఱకై వినియోగించిన సహృదయులు. నవ్యులు వీరి కెన్నివందనాలిచ్చినా తక్కువే! వీ రా కాలంలో చేసిన పని కొక్క ఉదాహరణం చాలు! వీరు వాత్స్యాయన కామసూత్రాలను సవ్యాఖ్యానంగా, సోదాహరణంగా, అనేక నూతన విషయాలతో వ్రాసి అచ్చు ప్రారంభించారు.♦ ఈసంగతి తెలిసి అనేకమంది వీరి కార్యభంగం చెయ్యడానికి ప్రయత్నించారు. వారిలో యెవ్వ రెవ్వ రున్నారో మన కప్రస్తుతం. ఆ దినాలలో శృంగారం పచ్చిగావున్న గ్రంథాలు ప్రకటించకూడదనీ, అమ్మకూడదనీ, ఒకవేళ అట్లా చెయ్యాలశివస్తే, అటువంటి భాగాలు లేకుండాచెయ్యాలనీ, కొందరు మహామహులు సర్కారుకు పురికొల్పి సర్కారుచేత ఉత్తరువులను ప్యాసుచేయించారు.* దీనికింద తారాశశాంక విజయమూ, రాధికాసాంత్వనమూ, శుకసప్తతికథలూ, వైజయంతీవిలాసమూ—తుదకు తిరుపతి వేంకటేశ్వరుల శ్రవణానందమూకూడా—నిషిద్ధాలైనై!

♦ "ఆర్యభారతీ గ్రంథమాలిక"ని పకటి స్థాపించారు. దీనిలో రాజశేఖర కవిరాజ విరచితమైన గ్రంథాన్ని "కావ్య మీమాంస"నే పేరుతో అనువదించారు.

* *"About 30 years ago there was a Government Telugu Translator, who, in consequence of an unhappy domestic occurence, resorted to an intensive drive against obscenity. Classical works in Telugu became forbidden literature. Their publishers were faced with prosecutions. In one instance the magistrate below acquitted the publisher. Government appealed to the High Court and secured a conviction. Another publisher who made profits out of obscenity had his wings clipped by an undertaking to publish expurgated editions only. There was trouble over the undertaking. Telugu authors and patrons went on a deputation to Governor. Zeal to demolish literature in the interest of morals proved a passing phase."* (*Indian Express.* 8—5—1941.)

చూచారా మనవాళ్ళ తెలివి, భాషాసేవా! ఇందుకిందికి దిగింది. ఉద్గ్రంథాలన్నీ ఉటంకులతో ప్రచురణం కావలశొచ్చింది! పూర్వ కవులమీదకూడా చెలాయించా రీమహామహులు అధికారాన్ని! వాత్స్యాయనకామసూత్రా లచ్చొతున్నయని, ఆ గ్రంథం ప్రచురణం కాగానే నిషేధించటానికి ఉత్తర్వు రాశి సిద్ధంచేయించారు అధికార్ల చేత! పాపం శాస్త్రిగారు చాలా రహస్యంగా తన పనిని నిర్వర్తిస్తు న్నారు. తమరు స్వయంగా అచ్చు కూర్పుచేశి, దాన్ని వక మిషన్ మీద అచ్చేయించుకుని యీ విధంగా పుస్తకం పూర్తిచేశారు. చాలా ఖర్చైంది. దానికి 10 రూపాయలు విలువ ఉంచి, ప్రకటించ డానికిపూర్వమే కొన్ని ప్రతులు స్నేహితులకు విక్రయించి, కొంత ధనం సేకరించుకున్నారు. ఇప్పటికీ చాలా ప్రతులు మిగిలిపోయినై! వీరు శ్రమపడకపోతే యీ గ్రంథం బయట కొచ్చేదికాదని నేను గట్టిగా చెప్పగలను! ఇప్పుడు ఆ నిషేధమంతా తొలిగిపోయింది. వకటూమా రా గ్రంథం చదివితే, అది అనేక నూతనాంశాలతో కూడిం దని ప్రతివాళ్ళకూ తెలుస్తుంది. ఆ గ్రంథం ప్రచురించినందులకు ఆంధ్ర దేశంవారికి కృతజ్ఞమై ఉండాలె! ఇదే గాక గౌతమధర్మసూత్రాలను సర్వమంగళావ్యాఖ్యతో ప్రచురించారు. ఆ గ్రంథానికి శాస్త్రిగారు రాశిన పీఠికను చదివి నేను నూతనవిషయాల ననేకాలను నేర్చుకు న్నాను. శాస్త్రిగారి పాండిత్యం అపారం! ఇది ఆయనన్ను నవ్యమార్గాన్నించి విముఖుడిని చెయ్యకపోవడం చాలా ప్రశంసకు తగిన విషయం. ఇది వారి హృదయ పరిణతిని తెలియచేస్తుంది. వారి పేరును నమస్కృతులతో తలుచుకుంటూవుంటాను నేను! వీరినిగూర్చి విశ్వనాథ అన్న మాటల నిక్కడ అనువదిస్తున్నాను.

"ఆదినారాయణశాస్త్రిగారు పండితులు. వాడుకభాషావా దులు. తెలుగుకవులనుగురించి వక మెచ్చుకునే గీతం వ్రాశారు. ధృతరాష్ట్రుని పశ్చాత్తాపమని వక గేయం వ్రాశారు. కాని జైనుల

మతకథలు అని వ్రాశారు. ఆ కథలలో వున్న వాడుకభాష దానికదే సాటి! అవి యింకా వ్రాసి పుస్తకరూపంగా ప్రకటిస్తే సంస్కృతంలో ఆచార్యదండి కేస్థాన ముందో, వాడుకభాషలో ఆదినారాయణశాస్త్రి గారి కా స్థానం ఉంటుంది."

కవికొండలవారు ప్రథమ సాహితీ సంచికల్లో మెరుకువగా రాశినట్టు కనపడదు.* కాని యీాన మొదట్నించీ యీ నవ్యసార స్వతంతో ఉద్భూతలూగినవాడే! ఈన గీతం, కథ, ఖండకావ్యం, అన్నీ సాధించినవాడే! విశ్వనాథ యిట్లా అన్నాడీయన్నుగూర్చి.

"(ఈన) వ్రాయని పద్ధతిలేదు. ఆయన కవిత్వంలో గొప్ప ప్రకృతి పరిశీలన ఉంటుంది. గోదావరిజిల్లా పాటకజనం 'యాస' ఉంటుంది. సూక్ష్మతమమై గ్రహించరాని భావుకత్వం ఉంటుంది." ఈనలోకూడా వెనక నేను మనవిచేసిన గూఢత కనపడుతుంది. ఈన కూడా దాదాపు ముప్పైసంవత్సరాలనించీ తన వృత్తిలోవుంటూ, తమ సాహిత్యంతో ఆంధ్రదేశాన్ని రసాస్వాదం చేయిస్తూవున్న వ్యక్తి! సన్నిధానం నాకు చాలా సన్నిహితుడవడంచేత ఆయన్ను గూర్చి రాయడానికి కలమాడటంలేదు. ఆయన పండితుడు. ఆయన కూడా దాదాపు యిరవై సంవత్సరాలనించీ రాస్తున్నవాడే! ♦ కొన్ని ఖండకావ్యాలు రాశాడు. తాను నవ్వ్యుడనుకోకుండా, నవ్యులలోవుండే నవ్యతను నవ్వుతూ, తన్మార్గంలో ప్రవర్తించిన వ్యక్తి! ఈనపాండిత్యం నవ్యతను గ్రహించడానికొక ప్రతిబంధకమైంది.

---

* 10–9–40 తేది ఆంధ్రపత్రికలో కవికొండలవారు తమనుగూర్చి యిట్లా చెప్పుకున్నట్టుంది. "ఆంధ్రోద్యమము, బీసెంటుగారిచే నడపబడిన హోంరూలుద్యమము, కమలో స్వాతంత్ర్యబీజములను నాటినవనియు, తమ భావములను గీతములద్వారా లోకమునకు తెలియబరచుకొంటిననియు నుడివిరి."

♦ సాహితిలో "బాల్యస్మృతి" అనేపేరుతో వక ఖండకావ్యం రాశాడు. పరమేశ్వరసాన్నిధ్యాన్ని కోరుతున్నా డీయన యీ గీతంలో!

మిగిలినవాళ్ళల్లో దేన్ని నవ్యతన్నామో అది యీన ఖండ కావ్యాల్లో వుంది. కాని దాన్ని తెలుసుకోలేకుండా వున్నాడు. "ముండ్లకొమ్మ"మీద వక ఖండకావ్యం రచించడంలో దాని స్వగతం కొంచెమున్నది. అవి ముండ్లకంపభావాలా, తనవా? ఈ విధంగా తాను పరోక్షుడి ననుకుంటూ రాశిన భావాలన్నీ తనవి కావని భ్రమ పడుతున్న వ్యక్తి! ఈనకుకూడా కొన్ని సన్నివేశాలలో చిత్తవికారం కలిగి ఖండకావ్యంగా వెలువడ్డట్లు స్పష్టం. "పువ్వులతోట" "కావ్య మంజరి" చదివితే యీ సంగతి స్పష్టమౌతుంది. ఈయన గోవర్ధనా చార్య సప్తశతిని తెనుగులోకి పరివర్తనం చేశాడు. చక్కని గ్రాంథిక భాష రాస్తాడు. ఈన నవ్యతను గ్రహించకపోవడాని కీయన తృణ కంకణంమీద రాశిన విమర్శనమే సాక్షి. అది చదివితే యీన శుష్క వైయాకరణిలాగా కనిపిస్తాడు. కాని చిత్తసంస్కారమున్నట్టు తనకు తెలియని వ్యక్తి. ఈన భాషకు చేశిన వేరేసేవ చెప్పుకోడానికి మళ్లా తావు వస్తుంది!* నాళం కృష్ణారావుగారు నిష్ణాతుడైన కవి. ఈన కావ్యాలు దాదాపు 30 సంవత్సరాలనించీ ఆంధ్రదేశంలో ప్రచా రంలో ఉన్నై! చక్కని రసవంతమైన భాష. నా చిన్నతనంలో "ఆంధ్రమే" అనే మకుటంతో ఆంధ్రదేశంయొక్క గొప్పదనం

---

* "నడుమంత్రపుసిరి" అనే ఖండకావ్యాన్ని యెవరినో ఉద్దేశించి అన్యాప దేశంగా రాశాడని వకప్రతీతి ఉన్నది. ఈన నవ్యకవిత్వానికి ప్రత్యర్థిగా రాశేవాళ్ళల్లో వకడు. ప్రాచీనంలోవున్న రసాన్ని గ్రహించగలడని యీన వ్యాసాలే సాక్షి. ఈన నవ్యసాహిత్యంలో వున్న రసాన్ని గ్రహించలేకపోయినట్టు కనపడతాడు. "రసము, రసజ్ఞత, తెలిస్తే శబ్దంచేత వాచ్యమైనా అవాచ్యమైనా, అలంకారములు హెచ్చుగా వున్నా తగ్గుగావున్నా కవిత్వములోవుండే అందాన్నీ ఆనందాన్ని గ్రోలగల్గుతాడు. రసమనేది హృదయంలోకాక కవిత్వం కుంటుగా వుందనడం సరికాదు" అన్నాడు విశ్వనాథ వకమారు. (ఆంధ్రపత్రిక 22-9-40). ఈమాటలు సన్నిధానం వారికి వర్తించవు. ఈన తప్పక సహృదయుడే! కాని తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళని బుద్ధిపూర్వకంగా హృదయం విముఖం చేసుకున్నట్టు వకప్పుడు తోస్తుంది!

తెల్పుతూ రాశిన పద్యాలు పునః పునః పఠించేవాడిని. ఈన వైశ్య జాతికి మకుటాయమానుడు. లక్ష్మీపుత్రుడు. సారస్వతవేది. తర్వాత నవ్యపథసంచారంచేశి సిద్ధిపొందినవాడు. రాజమహేంద్రవరంలో ప్రతి సారస్వతోద్యమంలో యీన తప్పక పాల్గొంటూవుంటాడు. ఈన చేసిన సారస్వతసేవలో "గౌతమీగ్రంథాలయ"సేవ చాలా గొప్పది. దానికొరకాయన తన ధనాన్నీ, కాలాన్నీ, పలుకుబడినీ వినియోగించి దాన్ని చిరస్థాయిచేశాడు! అదే యీన భావిశరీరం! ఈన గొప్ప సంఘసంస్కర్త. "దేశమాత పరిదేవనము" "భక్తసంజీవని" మొదలైన గ్రంథాల ననేకాలను రచించాడు. ఈన న్యాయంగా ప్రాచీన మార్గంలో వుండదగినవాడు. కాని కొమాండూరివలె నవ్యతను చూపాడు. ఖండకావ్యాన్ని సాధించాడు.* నే నెన్న డెరగని విషయం వకటి కనపడ్డది "శారద" పాతసంచికలను తిరగేస్తూంటే! నడింపల్లి వెంకట లక్ష్మీనరసింహారావుగారు ఖండకావ్యాన్ని సాధించడం ఆశ్చర్యకరం. సముద్రాన్నుద్బోధిస్తూ, "సంద్రమా! తెల్పు నీ ఘోషసారమంత" అనే మకుటంతో వక ఖండకావ్యం రాశాడు. ఇంకా "మంగళగిరి లక్ష్మీనృసింహస్తోత్ర" మని వక స్తోత్రాన్నికూడా రచించాడు. "పూని గోవిందు భజించు మూఢమనస" అనే మకుటంతో

* ఈన నిరాడంబరజీవి. చూడండి "చిన్నిపువ్వు" అనే ఖండకావ్యంలో

> "వన్నెచిన్నెలు గలపువ్వు లెన్నియున్న
> నిన్నె ప్రేమింతు మనసార చిన్నిపువ్వ!
> నీ నిరాడంబరవివిక్త నిష్కలంక
> జీవనంబును నలవడజేసికొనగ" అన్నాడు.

ఈనకు దేశం "మధురకవి" అనే బిరుదిచ్చింది. ఇది చాలా నిజము. మధుర శైలికలకింద యీన కావ్యాలన్నీ కొన్ని సంపుటాలుగా ప్రచురింపబడ్డై! ఈనకు షష్ఠిపూర్తిమహోత్సవం జరిపి చరితార్థమైంది ఆంధ్రదేశం! చిరంజీవై వర్ధిల్లుగాక! చక్కని గద్యపద్య వ్యాస సంపుటి "కృష్ణరాయాభ్యుదయ సంచిక" అనే పేరుతో ప్రచురించి యీయన్ను బహూకరించారు!

శంకరాచార్యులవారి "భజగోవిందా"న్ని భాషాంతరీకరించాడు. పద్యాలు చక్కగానే వున్నాయి. ఆంధ్రరత్నంగాలి వూరికేపోలేదు. కవిత్వంచెప్పించిం దీనచేత! ఈ విధంగా "శారద" యీసాహిత్యానికి చోటిచ్చింది. 1924 సంవత్సరం జనవరి నెలనించీ విశ్వదాతగారు "భారతి"ని స్థాపించారు. ఈ భారతీస్థాపనం యీ నవ్యసాహిత్యానికి వక గొప్ప ఉత్సవం. కృష్ణాపత్రికకూడా యింతకాలమూ యీ నవ్యకవితకు ప్రోత్సాహమిస్తూనే వున్నది. ఈ 25 సంవత్సరాలనించీ యీ పత్రిక ముట్నూరి కృష్ణారావుగారి పోషకత్వంకింద యీ నూతనకవిత కిచ్చిన దోహదానికి విలువలేదు. ఆయన స్వయంగా గొప్ప విమర్శకుడు. ఆయన అప్పుడప్పుడు రాశిన విమర్శక వ్యాసాలు కొన్ని 1937 సంవత్సరంలో "సమీక్ష" అనే పేరుతో వక సంపుటిగా ప్రకటించాడు. భారత సారస్వత విశిష్టత "సమీక్ష"లో చిత్రించినట్టు యెవ్వరూ చెప్పలేదు. ప్రాచ్య పాశ్చాత్య ప్రణయసిద్ధాంతాలూ, రససిద్ధాంతాలూ, తారతమ్యచర్చ చేసి, ఉదాహరణ పూర్వకంగా రాశి, భాషకు మహోపకారం చేశాడు. ఇప్పుడు భాషలో వుండే గొప్ప విమర్శన గ్రంథాల్లో యిదివకటి. ఈన ప్రాపున చాలామంది నవ్యకవులు తమ రచనలను సాగించారు. ఈ కృష్ణాపత్రికకు బాసటగా సాహితీ, శారదలు పనిచేసి అస్తమించినై. భారతి బయలుదేరింది. మొదటినించీగూడా యీ పత్రిక నడకే గాక అచ్చు, మొదలైనవికూడా చక్కని పోలికలతో వున్నై! కాకినాడలో దేశీయమహాసభ జరుగుతుండగా భారతి ప్రథమసంచిక వచ్చింది అందులో "వాఙ్మయచక్రం" అని యీ గ్రంథకర్త దొకవ్యాస ముంది ఇప్పటినించీ యీ భారతీపత్రికద్వారా బయటికి వచ్చిన సాధకులను గూర్చి ముచ్చటించుకుందాం.

౨౫

## భారతి, సాహిత్యసాధన :

"భారతి" పత్రిక తీసి అప్పటి సంచికలు అనగా 1924-30 లకు సంబంధించినవిగనక చూస్తే యీ ఖండకావ్య మనే "అంటుజాడ్యం" పెద్దలకూడా తగిలినట్టు కనపడుతుంది. ప్రభవ ఆశ్వయుజమాస సంచికలో కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారొక ఖండకావ్యం "కోకిల" మీద రచించినట్టుంది. వీరు సుప్రసిద్ధ విమర్శకాగ్రేసరులే అయితే వారికి నా నమస్కారాలనూ అభినందనాలనూ అర్పిస్తున్నాను. ఈ పద్ధతిని వా రామోదించినట్టే యిది తార్కాణం! ఇది యేమీ ఆశ్చర్యం లేదు. సలక్షణభాషలో కావ్యం "మహా"గానీ "ఖండం" గానీ, రచిస్తే యెవ్వరి కేం అభ్యంతర ముంది? వెనకటి భాషా ప్రథానుల కసలే ఉండదు. పెద్దల్లో కొందరు యీ పత్రికాసంచికల్లో కొన్ని గ్రంథాలు పూర్తిచేసుకున్నవాళ్ళున్నారు. వేటూరు ప్రభాకరశాస్త్రిగారు తమ "భగవదజ్జుక" "ప్రతిమానాటకాది" కావ్యాలూ యింకా యితర "చిన్నినాటిముచ్చట్లు" అనే కొన్నీ పూర్తిచేసుకున్నారు. వీరిని గూర్చి వెనక మనవిచేశాను. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రదేశంలో యిప్పుడున్న వైయాకరణులలో సహృదయత్వం యెక్కువగా వున్నమనిషి. శుష్కవైయాకరణులకు మనకు లోటు లేదు. కాని సూర్యనారాయణశాస్త్రిగారికి సామాన్య భాషా తత్వముల నెరిగిన వాడవటంచేత మన భాషలో తత్తత్కాలాల్లో కలిగిన మార్పులను చారిత్రకదృష్టితో చూడగల చిత్తస్వాస్థ్యముంది. ఆయన శుష్కవైయాకరణి కాదనటానికి ఆయన రాశిన కావ్యాలేసాక్షి. ఈరెండుశక్తులు కలిసివుండటం చాలాఅరుదు. ఈసంచికలు తిరగేస్తే ఆయన రాశిన "ప్రేమతత్వము" అనేకావ్యం క్రమంగా పూర్తైనట్టు కనపడుతుంది. పురాణం సూర్యనారాయణ తీర్థులు ఆంధ్రదేశానికి చిరపరిచితులేకూడాను. ఈన యీభారతి

సంచికల్లో "కుమారుడు" అనే నీతికావ్యం పూర్తిచేసుకున్నాడు. కూచి నరిసింహంగారినిగూర్చి వెనక వకమారు మనవిచేశాను. ఆయన "రామచంద్రప్రభో" శతకాన్నొకదాన్ని పూర్తిచేసుకున్నాడు. ఈ సంపూర్ణకావ్యాలు గాక అనేక ఖండకావ్యాలున్నా యీ పురాతన మార్గావలంబులవి. ఉమర్ ఆలీషాగారు "లేఖిని" అనే గీతమాలికనూ, త్రిపురాన వెంకట సూర్యప్రసాదరావు దొరవారు "రతి విలాపము" అనే ద్విపదఖండకావ్యాన్నీ, నల్లాన్ చక్రవర్తులవారు "వేమన తారావళి" అనే ప్రశంసాఖండకావ్యాన్నీ, యీ విధంగా అనేకులు రచించారు. ఈ రచించినవారిలో నడకుదుటి వీర్రాజు, చింతలపూడి సీతారామయ్య, పెమ్మరాజు లక్ష్మీపతి*, శ్రీపతి త్ర్యంబకరావు, మక్కపాటి వెంకటరత్నం, జనమంచి సీతారామస్వామి, తురగా వెంకట్రామయ్య, దీపాల పిచ్చయ్యశాస్త్రి♦, దంటు సుబ్బావధాని, సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి మొదలైనవారున్నారు. మొసలికంటి హనుమంతరావుగారు "స్వర్భంగం" అనే పేరుతో యింగ్లీషులో మిల్టన్ మహాకవి రాశిన "పారడైస్ లాస్ట్" (Paradise Lost) అనే కావ్యాన్ని భాషాంతరీకరించాడు. తూములూరి శివరామయ్యగారు "తిక్కనకవి ప్రశంస" అని వక ఖండకావ్యంలో ఆ మహాకవిని ప్రశంసించాడు. మంగిపూడి వెంకటశర్మగారు తమ లేఖినిని సాగిస్తూనే

---

* ఈన "నేను, నీవు" అనే ఖండ కావ్యంలో రాశిన వక్కవాక్య మనువదిస్తాను.

"నేను నీవను భేదమేలేని స్నేహ
మున బ్రవర్తిల్లి.........."

ఇదికూడా సఖ్యచిహ్నమే!

♦ ఈన మేఘదూతం తెనుగు పరివర్తనంచేశాడు. ఈనేగాక, గుఱ్ఱం వెంకట సుబ్రహ్మణ్యం, భీమరాజు సత్యనారాయణ, మాడభూషి మతం వెంకటాచార్యులుగార్లు కూడా చేశారు. (చూ. ప్రతిభ)

వున్నారు.* శేషాద్రి రమణకవులుకూడా తమ కవితావినోదాలు సల్పుతూనేవున్నారు. వాటిలో కొన్ని భాషాదేశాభిమానాలు పురికొల్పే "ప్రతాపరుద్ర చక్రవర్తి" మొదలైన వున్నై!

కంఠోక్తిగా నవ్యులమని అనుకునేవాళ్ళు కొందరు కొన్ని సంఘాలుగా చేరినట్టు కనపడుతున్నది. ఈ సంఘాలలో కొన్ని పేర్లను మనవిచేస్తాను.♦

(1) ఆంధ్రసాహిత్యసమితి
(2) సంస్కృతాంధ్ర సాహిత్యసమ్మేళనము
(3) కవితాసమితి
(4) సారస్వతసమాజము
(5) సారస్వతమిత్రమండలి
(6) యువకవిమండలి
(7) సారస్వతసమితి
(8) వాణీసేవాసంఘం
(9) రవీంద్రసమాజము
(10) సారస్వతగ్రంథమండలి
(11) సాహిత్యమండలి
(12) వాణీసమితి
(13) కళాసమితి

మొత్తముమీద భాషాసేవ యీవిధంగా చాలా జరిగింది. ఇక యీ సాధకులు దాదాపు అన్నివిషయాల్లో ప్రథమ నవ్యసాహిత్య సాధకుల మార్గాలే అనుసరించారు. వాళ్ళ ప్రకృతిప్రణయాలే ముఖ్య కావ్యవస్తువులు. కవితాసామగ్రి మొదలైనవికూడా అవ్వే!

* "గోవిలాపము"నే చక్కని ఖండకావ్యం రచించాడు. ఈన గోప్రీతీ, సంఘసేవా, సారస్వతసాధనా, అనితరతుల్యాలు.

♦ ఈ యిచ్చిన పట్టిక ఉపలక్షకమేగాని సంపూర్ణం కాదు. ఇవి గాక యింకా అనేక సంఘా లున్నవి.

కొందరు కొన్ని వైశిష్ట్యాలు చూపారు. నండూరు వెంకటసుబ్బా రావుగారి యెంకివలె అధికార్ల సూర్యనారాయణగారికి "జానకి" నాయిక. "యెంకిపాట"ల ఉపోద్ఘాతంలో సుబ్బారావుగారు యీనను "జానకీపతి"అని నిర్వచించాడుకూడాను. ఈ సాధకుల్లో వెనకటిపేర్ల వాళ్ళుగాక నూతనులు చాలామంది వున్నారు. వెనకటివాళ్ళు అనగా వేదుల మొదలైనవారు క్వాచిత్కంగా రాశినట్టు కనబడుతుంది. శివ శంకరశాస్త్రిగారి లేఖిని చలాయిస్తూనేవుంది. కృష్ణశాస్త్రిగారుకూడా క్వాచిత్కంగానే రాస్తూవచ్చాడు. కవికొండలవారుకూడా అప్పు డప్పుడూ గానంచేస్తూనే ఉన్నాడు. విశ్వనాథ గానం వెనకటికంటె తరుచైంది! దానికి వెనకటికంటె పటిమ అభివృద్ధి అయిన కొద్దీ భావ భాషాక్లిష్టతలు అలవడుతున్నట్టు కనపడుతున్నది. కాని చాలా లోతుకు దిగి రాస్తున్నట్టూ, నీత్యాదర్శాన్ని వదలలేదనీ కనపడుతున్నది.*

* ఈ కాలంలోనే కోలవెన్ను రామకోటేశ్వరరావుగారూ యీనా కలిసి వక ఆంగ్లమాసపత్రిక వక తెనుగుమాసపత్రిక స్థాపించి నడిపారు. రామకోటేశ్వరరావుగారు "త్రివేణి"కిన్ని సత్యనారాయణగారు "జయంతి"కిన్ని సంపాదకత్వం వహించారు. "త్రివేణి"మాత్రం యిప్పటికీ దేశభాషాసేవలు చేస్తూనేవుంది. "జయంతి" శారదతో కలిసి స్వర్గరాజ్యంలో ఆంధ్రభాషాప్రచారం చేస్తున్నది. విశ్వనాథ "కిన్నరసాని"నడక ఆంధ్రులకందరికీ ముద్దులుమూటకట్టుతున్నది. సందర్భోచితాలైన ఆ నడకలకు ఆంధ్ర దేశమంతా జోహారుచేస్తున్నది. ఇతరులు చాలామంది కిన్నరసానిని నడకలో అనుక రించాలనుకొని బోర్లపడుతున్నారు. దీనికి "బాపిబావ" చిత్రాలు చాలా దోహద మిచ్చినై! ఇంతలోనే కోకిలమ్మ పెళ్లికూడా చేయించాడు. ఆంధ్ర ప్రశస్తికూడా యీ కాలందే ననుకుంటాను. రామకోటేశ్వరరావుగారు ఆంధ్రభాషకు పరభాషాకుమారుల మెప్పును తీసుకురావాలని ప్రయత్నించిన వారిలో ముఖ్యుడు. ఈన సంపాదిస్తున్న 'త్రివేణి' పత్రికలో ఆంధ్రాభ్యుదయాన్ని గూర్చి, ఆంధ్రుల సాహిత్య చిత్రకళా కౌశలాలనిగూర్చి, ప్రచురించిన వ్యాసాలవల్ల తెనుగంటేనూ, తెనుగుజాతి అంటేనూ, తెనుగు సాహిత్య శిల్పాలంటేనూ, తెలియనివాళ్ళనేకులు కళ్ళుతెరిచారు. ఈనకూడా "కేవరుప్రధాని" మొదలైన ఉత్సాహకల్పకాలైన పుస్తకాలను రచించాడు. జాత్యున్నతికి చాలా పాటుపడ్డ ధన్యుడు. పట్టిన కార్యంకోసం అనగా "త్రివేణీ" పత్రికా నిర్వహణంకోసం సర్వస్వం అర్పించిన స్వార్థత్యాగి. ఎన్నికష్టాలువచ్చినా వెనకంజవెయ్యని ధీరుడు!

ఇప్పుడప్పుడు ఆంధ్రులచరిత్రలోనించి కొన్ని సన్నివేశాలు తీసుకుని చిత్రమైన సంభాషణలను కల్పించినట్టుకూడా కనపడుతుంది. "ప్రోల రాజని" వక కల్పనవుంది. కాకతీయ శౌర్యాన్ని తెలియచేస్తున్నది. ఇటువంటివే కొన్ని కల్పనలను యితరులు కొందరుకూడా యెత్తుకున్నారు. మద్దిపట్ల వెంకటరమణయ్యగారు "స్థానేశ్వరయుద్ధమనీ" "ఝరీతరణమనీ" కొన్ని వీరకృత్యాల నుగ్గడించాడు. రెండోది చాలా రసవంతంగావుంది. హాల్దిఘాటు యుద్ధానంతరం రాణాప్రతాపసింగు వక నదిని దాటడమనే అతిసాహసకృత్యాన్ని తన గుఱ్ఱం సహాయం చేత చేయడం, ఆ జంతువు ఆ పనిచేసి ఆయాసంచేత మృతిపొందటం, అందుకు రాణా దుఃఖించడం, చాలా హృదయరంజకంగా చిత్రించాడు కవి.* కొత్తపల్లి జగ్గయ్య చౌదరనే ఆయన సంగ్రామసింహుని దాసి "పన్నా" అనే ఆమె రాజుయొక్క చిన్న కుమారుని కష్టాలకోర్చి రక్షించిన కథను చాలా రసవంతంగా రచించాడు. జాషువా కోకిల కంఠం విడివడుతున్నది. ఈనఖండ కావ్యాలనుగూర్చి వచ్చే దశవర్షవృత్తాంతం చెప్పేటప్పుడు ముచ్చటిస్తాను. నాళం కృష్ణారావుగారు "పాపాయి" మొదలైన కొన్ని లలిత కావ్యాలను రచించారు. తుమ్మల సీతారామమూర్తి చౌదరనే వక సహజకవికుమారుడు "ఆత్మార్పణం" అనే కావ్యాన్ని రచించాడు. దీనిలో భారతదేశంయొక్క వైలక్షణ్యానికి మూలభూతాలైన కొన్నిధర్మాలను చెప్పాడు చక్కని శైలిలో. భారతదేశానికి సహజంగా అతిధిపూజా, అపకారం చేసినవాళ్ళకు కూడా ఉపకారం చేయడమూ, మొదలైనవి అలంకారాలైన

---

* "చైతకా! చైతకా! యంచు క్ష్మాతలేశు
డనుగుమోమును తన యొడియందుజేర్చె,
కనుల నీరొల్క పుల్కుపుల్కుమనిదొరను
కాంచియా తేజి కడసారి కన్నుమూసె"
ఆ చూపులలో "సఖ్యము" తాండవిస్తున్నది.

గుణాలని రసవంతంగా వక కథ సృజించి చెప్పాడు. వక వ్యాధుడికి ఒక కపోతం, తనయొక్క ప్రియురాలి నా వ్యాధుడు వలలో పట్టుకొనుండగా, గాలివానవల్ల చలితోనూ ఆకలితోనూ వాడు బాధ పడుతూవుంటే, తన గూటిపుల్లలను చలి మంటగానూ, తన దేహాన్ని వాడి ఆకలి తీర్చటానికి ఆహారంగానూ అర్పించిందట! శిబిచక్రవర్తి కథవలెఉంది. చక్కని రసవచ్ఛైలిలో రచించి ఆహ్లాదంకలగచేశాడు. ఈన యితర ఖండకావ్యాలుకూడా చాలా రసవంతాలుగా ఉంటై!* ఈన నవ్యరచయితల్లో పేర్కొన తగినవాడు! పింగళి కాటూర్లు యేనాడు తొలకరి రచించారో మళ్లీ వాళ్లకు సరస్వతీకటాక్షం కలగక, ఆలస్యంగా కలిగినపుడు "నాటికి నేడు" అనే ఖండకావ్యాన్ని రచించారు. అందులో యిదివరకు కలగనందుకు వేదన, యిప్పుడు వచ్చినందుకు సంతోషం చక్కని వాక్చిత్రాలతో చిత్రించారు. ఈ కాలమే "సౌందరనందానికి" పునాది పడ్డకాలం.♦ అనంతపంతుల రామలింగస్వామిగారి "శుక్లపక్షం" తయారౌతున్నది. ఈనశైలి చాలా అంతరర్థం కలిగివుంటుంది. ఒక్కొక్కచోట తాను భావకవి ననిపించుకుంటూ భావకవిత్వాన్ని నిందచెయ్యడం కనిపిస్తూ వుంటుంది. శ్లేషప్రధానమైనదీ కావ్యం!‡ జనమంచి వెంకట్రా

* ఈన ఆత్మకథను కొంతభాగాన్ని పద్యకావ్యంగా రచించాడు. దానిలో గాంధీగారి బొమ్మ వెయ్యకపోయినా తన బొమ్మ మంచిపోజుతో వేసుకున్నాడు.

♦ సౌందరనందంలో వెంకటేశ్వరరావుగారి చేయి యెక్కువగా పనిచేసిందని చెప్పుకుంటారు. ఈమధ్యకాలంలో వీరు విక్టరు హ్యూగో కవియొక్క "బగ్ జార్గల్"ను ఆంధ్రీకరించారు. కాటూరు "నల్లకలువ" అనే పేరుతో డూమాసు (*Dumas*) "*Black Tulip*" అనే నవలను పరివర్తనం చేశాడు.

‡ ప్రతిభలో యీనకవిత్వాన్నిగూర్చి విమర్శకుడు యిట్లా అన్నాడు. "వ్యాజనింద వీరికి అభిమానపాత్రమని తోస్తుంది. వెనక "శుక్లపక్షము"లోనూ యీరీతి రచనే సాగించారనుకుంటాము."

"ఈగ్రంథమున ధ్వనులనేకములు గలవు. శ్లేషాద్యలంకారములకిది బరణి. హాస్యమునకిక్క. విచిత్రకల్పనలకు తావు. ఇట్టి ప్రౌఢ కావ్యములు తెనుగున నింతవరకు లేవని చెప్పుట సత్యదూరముకాదు." (భారతిలో విద్వాన్ విశ్వనాథ నరసింహం.)

మయ్యగారు వక అంతర్ముఖుడైన కవికుమారుడు. ఈన రాశిన "నవ్యకుసుమాంజలి" అనే ఖండకావ్యసంపుటిని విమర్శిస్తూ విమర్శకుడు "ఈన మానసము సౌందర్యమునుండి సత్యముదెస తిరుగుతున్నది" అన్నాడు. శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు తమకు వచ్చిన ఐహికసన్నివేశాలచేత దేవుడిని తల్చుకునే చిత్తశాంతి లేదని అన్యాపదేశంగా "నిష్కాసము" అనే వక ఖండ కావ్యం రాశాడు! దేవుడిని వెళ్ళగొట్టాడు ప్రపంచంలో యెక్కడా చోటెయ్యకుండా! * కొందరు వెనకటితరంలోవలెనే మంచి అభివృద్ధికి వచ్చే దినాల్లో దేవుడు సన్నిధికి లాక్కున్నాడు. వాళ్ళల్లో ముఖ్యులు మద్దిపట్ల వెంకటరమణయ్య, జంధ్యాల శివన్నశాస్త్రి, కొంపల్లె జనార్దనరావుగార్లు ముఖ్యులు. వీరిలో శివన్నశాస్త్రిగారు "సంస్కృతాంధ్రాంగ్ల హిందీ బెంగాలీ భాషాకోవిదుడు." కొంపల్లె జనార్దనరావు మంచి పండితవంశంలో పుట్టిన స్ఫురద్రూపైన యువకుడు. కొంతకాలం "ఉదయిని" అనే పత్రికనుకూడా నడిపి భాషాసేవ చేశాడు. కాని యితను వక విధమైన సులభంగా అర్థంకాని భాషను అలవడచేసుకున్నాడు! చాలా అభివృద్ధికి రాదగినవాడు! వీళ్లుగాక మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు చక్కని రసవత్కవిత్వం రాయగలిగి తన వంశానికి పేరుతెచ్చిన ప్రతిభాశాలి! శివసాయుజ్యం పొందాడు! చాలా దుఃఖించాము! మిగిలినవారిలో మల్లాది వెంకట విశ్వనాథశర్మ, శిరిపి ఆంజనేయులు, భమిడిపాటి రామసోమయాజులు, నిడుమోలు కనకసుందరం, కొప్పర్తి నారాయణమూర్తి, మల్లాది చంద్రశేఖరరావు, వెంకటకాళిదాసకవులు, విన్నకోట వెంకటరత్నశర్మ, వెలువోలు సీతారామయ్యచౌదరి, పూరిపండా అప్పలస్వామి,

---

* ఈనరాతలను మొదటినించీ చదివితే వక్కటి కనపడుతుంది. ఆస్తిక్యంలో నించీ క్రమంగా మెట్లుదిగి నాస్తిక్యంలోకి దిగినట్టు నిదర్శనాలు కనపడతై! విశ్వనాథ తాము పుటకతో తెచ్చుకున్న ఆస్తిక్యమూ, ధర్మమూ, క్రమంగా బలమౌతూ వచ్చినై! ఈవైధర్మ్యం వీళ్ళరాతల్లో వ్యక్తమౌతూ వుంటుంది.

తన్నీరు కృష్ణమూర్తి, అన్నంరాజు శర్మ, చిర్రావూరి కామేశ్వర రావు, తాపీ ధర్మారావు, దివాకర్ల వెంకటావధాన్లు మొదలైన అనేకమంది చక్కని శైలిలో ఖండకావ్యాలు రాశినవాళ్ళున్నారు. కొందరు రాజకవు లున్నారు. ఇంకా శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు, వెంకటాద్రి రామచంద్రఅప్పారావుగార్లు, వత్సవాయి వెంకట నీలాద్రిరాజుగారు మొదలైనవాళ్లున్నారు. నీలాద్రి రాజుగారు కాళిదాసుని శాకుంతలాని కొక పరివర్తనం రాశాడు. చాలా రసవంతంగా వుంది. అది పాఠంచెప్పే అవకాశం కలిగింది నాకు. రామచంద్ర అప్పారావుగారు నిరంతర సాధన చేస్తూవున్న రాజకవి. "సాహిత్య సామ్రాట్టు" గారి సంగతి వెనక మనవిచేయనే చేశాను. వీరేగాక యింకా అనేక సాధకు లున్నారు పేర్కొ-నని వారు. వీరందరూ వెనకటి సాధకుల మార్గాలనే అనుసరించారు.

ఇక గేయాలను సాధించినవాళ్లలో వెనకటితరంలో వాళ్లుగాక పైనచెప్పిన వాళ్లలో కొప్పర్తి నారాయణమూర్తి,* విన్నకోట వెంకటరత్నశర్మ, పూడిపెద్ది వెంకటరమణయ్య, జనమంచి వెంకట్రామయ్య, త్రిపురాన దొరవారు మొదలైన వారున్నారు. వీళ్లలో దొరవారు "అజవిలాప" మనే పేరుతో మంచి గీతాన్ని వకదాన్నీ, వెంకట్రామయ్యగారొక చక్కని జానపద గీతాన్ని "బండిచక్రము"నే పేరుతోనూ రాశారు. కొందరు మారుపేర్లతో రచించారు. "తిరుగుబోతు" అనే పేరుతో వకాయన "నీతరువాత" అనేది వకటి వ్యావ

---

* "మృత్యువు" లో :

"మరలివచ్చితి నిదురలెమ్మిక
మరణ మెరుగదు జీవ మెన్నడు,
మదినినమ్ముడు రాత్రి వెడలగ
నుదయ మరుదెంచుచున్."

చాలా బాగున్నది. "ఎరుగడు జీవియెన్నడు" అంటే [illegible] దేమో! రాయప్రోలు పోకడ కనపడుతున్నది.

హారికంలో రచించాడు.♦ ఇది బావకూ మరదలికీ సంవాదరూపంగా వుంది. ఇంకా నరహరిసెట్టి వెంకటరత్నం, సోమంచి సూర్యనారాయణ, ఏనుగు తిమ్మరాజు, జయదేవారెడ్డిగార్లు మొదలైనవారనేకులున్నారు. జయదేవారెడ్డిగారి "లవంగలత" జాన్‌లిలీ (John Lily) అనే వక ఆంగ్లకవి కావ్యానుకరణం. తిమ్మరాజుగారు "శివపూజ"నుగూర్చి రాశారు. ముద్దుకృష్ణగా రొక నూతనవ్యక్తి యీ కాలంలో రాశినవాళ్లల్లో.* ఈనకూ నాకూ 1920 సంవత్సరంలో కీ॥ శే॥ సముద్రాల అప్పలాచార్యులుగారి ద్వారా పరిచయమైంది. అప్పటికి యింకా విద్యార్థిదశలో వున్నట్టు జ్ఞాపకం! నిగూఢంగావుండి యీ కవితాశక్తి విజృంభించటానికి ప్రారంభిస్తున్నది. ఈ విధంగా గేయసాధకులు సాధనచేస్తూవచ్చారు. వీళ్ళకు వెనకటివాళ్ళనుగూర్చి చెప్పినమాటలే వర్తిస్తై! కొందరు వీళ్ళలో సామాన్య ప్రపంచంలోనించీ ఔపమ్యాలనూ రూపకాలనూ గ్రహించారు వెనకటి వాళ్ళల్లేనే! కవిసామర్థ్యం సామగ్రి యేరుకోడంలోనే వుంది అసలు! చంద్రుడితో మొగం పోల్చడం అనాదినించీ వుందని యిత్తడి శిబ్బితోనూ, జడను సర్పంతో పోల్చడం అనాదిసిద్ధమని యినపగరిటెతోనూ పోల్చాడనుకోండి! ఇది నవ్యతా? విపరీతనవ్యత! హాస్యంకోసం రాస్తే యిట్టి కల్పనలు కావ్యోపస్కారాలు కావచ్చు! గాడేపల్లి అనంతంగారు "హృదయపటమ"ని వక గీతం రచించాడు. అందులో,

> "కాంత! నీకై దుఃఖోదకములలోన
> తడిపియుంచితి హృదయవస్త్రమ్మురమ్మ,

---

♦ ఇంకో ఆయన "హరితుడనే" పేరుతో "ఎమో" అని వకటి రచించాడు.

*ఈన గీతాలు సాహితిలోకూడా కొన్ని కనబడతై! "వానాలప్ప" వక బాలగీతం. ఇటువంటిదే "జోలపాట" కూడా. లయ కనపడుతున్న దిందులో! కొన్ని కథలుకూడాఉన్నై! "దయ్యాలున్నాయా?" అనేది మొదలైనవి.

నీట హృదయమ్ము బరువెక్కె- నీదు మృదుక
రమ్ముల హృదయమ్ము పిడిచికొమ్ము, చివికి
చినిగిపోవకమున్నె, అశేష సౌఖ్య
వీచికల నారగట్టుమో ప్రియసఖుండ !"

(కాంత ! ప్రియుడా !) అని రాశాడు. గుడ్డనానపెట్టడం, పిండటం, యిది చాలాజుగుప్సాకరం! రూపకం చాలా నవ్యంగా వుందనుకున్నాడు కాని కవికుమారుడు, "హృదయమ్ము పిడిచికొమ్ము" అన్నప్పుడు జుగుప్సాకరమైన అర్థం వస్తున్నదని యెంతమాత్రం దృష్టి లేకపోయింది.* అందుకనే కవితాసామాగ్రి యేరుకోడంలోవుంది కవి ప్రతిభ ! లాక్షణికు డీ సందర్భంలో చెబుతూ యీ కిందిది స్వభావోక్తి కాదన్నాడు.

"మాహిష్మతీ పురీమధ్యే
ముహుర్వాఘ్రాయ మేదినీం,
ఏకపాదం సముద్ధృత్య
శ్వామూత్రం విసృజత్యహో !"

పై గీతం సరీగా ఇట్లాగేవుంది. కవిత్వం సులభం కావచ్చును గాని భావోదాత్తత కొరవడకూడదు ! ఇటీవల రాతలన్నిట్లో ఛందస్సాంకర్యాది వెనకచెప్పిన కొన్ని లక్షణాలున్నై ! యస్. జి. ఆచార్యగారు తమ అసమఛందస్సులో రాస్తూనేవున్నాడు. మరిచాను. ఈకాలంలోకూడా పాపినేని వెంకటేశ్వర్రావుగారనే ఆయన భావగద్యం రాయటానికి యత్నించాడు.

* ఎటువంటి జారిణీకూడా యిట్లా బహిరంగంగా మాట్లాడదు. కిందటితరంలో ఇంగ్లాండు ఆస్థానకవి ఆల్ఫ్రెడ్ ఆస్టిన్ (Alfred Austin):

"*Poetry is the transfiguration of life, an imaginative representation of whatever men perceive, feel, think, or do.*"

"కోయిలా! నన్ను పరిహాసించెద వేల? తియ్యమామిడిచివురు జొంపములయందు కూరుచుంటివనియా! లాలిపాటలపై తేలిపోవు చుంటివనియా! విశ్వకుమారిని మేలుకొల్పుచుంటివనియా? పరిహ సించిన పరిహసింతువుగాక! నాకేమి యుడుకు".

దీన్ని పరీక్షించడం చదువరులకే వదులుతున్నాను. "కోయిల" అనేకులకు—అనగా దాదాపు సగంమంది కవికుమారులకు—గానవస్తువైంది. ఏవో కొన్నితప్ప అన్నీ చాలా పేలవంగావున్నై! కోయిల పేరెత్తగానే కవులమౌతామని కొందరు భ్రమపడ్డారు! చిత్త సంస్కారం అన్నిటికంటె ముఖ్యం! ఎరువుసొమ్మువలె దాన్ని తెచ్చి పెట్టుకుంటే వెంటనే స్వభావ విరుద్ధంగా కనపడుతుంది!

కథను యెత్తుకుంటే చాలామంది సాధకులు కనిపిస్తారు. ఇక్కడ వెనకటి తరంలోవలెనే భాష బహుళంగా వ్యావహారికమే రాశారు. కొందరు, కొత్తపల్లి సూర్యారావుగారివంటి మడికట్టుకున్న వాళ్ళుకూడా లేకపోలేదు. వేలూరి వంటివాళ్ళు అటూయిటూకూడా వున్నారు. ఈనకథల్లో కొంచెం బిరుసుదనం కనపడుతుంది. కాని పండిత కథకుల్లో వకడు. ఈన చిత్తపరిణామాన్ని ఆనుపూర్విగా పరీక్షించడం వక గొప్పకార్యం! ఈకథకుల్లో కొందరు వెనకటివాళ్లు కనపడుతున్నారు. మునిమాణిక్యం మొక్కపాట్లతో సమానమైన వకవ్యక్తి యీకాలంలో బయటపడ్డాడు. భమిడిపాటి కామేశ్వరరావుగారి కథాకథనం వక విశిష్టమార్గం. అందులో మంచిప్రకృతి పరిశీలన, చక్కని వ్యావహారికం, హృదయరంజకమైన హాస్యం వుంటై. ఈన కథలు భాషకు అలంకారాలు! వెనకటి వాళ్ళలో వేదుల "అనితమ్మ" అని వక చక్కని కథను రాశాడు. పీరేగాక విశ్వనాథ పద్యాల్లో యెట్లా విజృంభించాడో కథల్లోకూడా అట్లాగే విజృంభించాడు. కొన్ని ప్రత్యేకతలు చూపాడు. "తస్మాత్! నగలమీద ఆమె నిరాదరణ" అన్నాడొకచోట! ఈనయెప్పుడూ భావ, శీల వైవిధ్యంగల

పాత్రలను చిత్రించటంలో చాలా సమర్థుడు. ఈకాలంలోనే "ఏక వీర" రచించాడు. ఎల్లప్పుడూ నైతికాదర్శం ముందు చుక్కానివలె నడుస్తూవుంటుంది. "తిరోధాన" మనే వక కథలో యెంత ఐహికంలో దిగిపోతే అంత ఆముష్మికానికి దూరమౌతామనే నీతి చక్కగా పోషించాడు. భమిడిపాటి రామసోమయాజులు, వెంపటి నాగ భూషణం, బులుసు వెంకటరమణయ్య, యస్. వి. రామమూర్తి, మల్లాది రామకృష్ణశాస్త్రిగార్లు చక్కని శైలిలో ప్రకృతి సిద్ధంగా కథలను రచించారు. మాడపాటి హనుమంతరావుగా రీకాలంలో "ప్రేంచెందు" అనే హిందీకథకుడి కథలను కొన్నిటిని పరివర్తనం చేశాడు. వాటిలో "ఇక కావలసినదేమి" అనేది వకటి. వీరు హైదాబాదు నివాసి! సాంఘికంగా, రాజకీయంగా, వైజ్ఞానికంగా, జాతి నభివృద్ధిలోకి తీసుకురావలె ననే ఆదర్శానికి జన్మ ధారపోశిన వ్యక్తి! చింతా శంకరదీక్షితులనే పేరుతో కొన్ని కథలున్నై! చింతా భీమశంకరం, దీక్షితులుగార్లూ కలిసి యీసమిష్టినామం గ్రహించారట! ఇది నిజమో కాదో నాకు తెలియదు. ఈ భీమ శంకరంగారు కూడా సారస్వతసేవ చేశినవాడే! ఇప్పుడు స్కూళ్ళ యినస్పెక్టరుగా వున్నాడు. ఇప్పుడు భావం యింకి పోయినట్లు కనపడుతుంది. మొదటి సాహితీ సంచికల్లో "మారుతి" అనేపేరుతో రాశింది యీనేనని ప్రతీతి!

ఈ పై మార్గాలలో స్త్రీలుకూడా కొందరు సాధన చెయ్యటానికి పూనుకున్నారు. వారిలో "అమల" అనేపేరుతో "విషాదగీతి" అని వకఆమె గీతం రాశింది!(అమల అంటే నేను స్త్రీ అనుకున్నాను. పురుషుడైతే క్షమించాలె!) టి. సరస్వతిగారు "సందేశము"నీ, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు అప్పట్లో చనిపోయిన మాగంటి అన్నపూర్ణాదేవిపైన "స్మృతి" అనీ, కవితిలక [illegible] గారు "శ్రీరామస్తవము" న్నూ, వా[illegible]

"వైరాగ్యోదయము" నీ, రాజేశ్వరిగారు "ధర్మపత్ని" అనీ, యీ విధంగా కొందరు చక్కని హృదయంగమమైన ఖండకావ్యాలను రచియించారు.* కథలు రాశినవాళ్ళలో గుమ్మడిదల దుర్గాబాయమ్మగారు కూడా యెన్నదగివుంది! ఈమె "పశ్చాత్తాపం" అనే వక నీతిదాయకమైన కథ రాశింది. తుదకు కథలో నాయికకు పశ్చాత్తాపం కలిగి భర్త కాళ్ళమీదపడి క్షమించమని వేడుకుంటుంది! ఆధునిక యువతులకు కొందరికి చాలా నీతిదాయకం. ఈకాలంలోనే మద్రాసులో వున్న కేసరి కుటీరం స్థాపకుడైన కె. యన్. కేసరిగారు "గృహలక్ష్మి" అనే వక మాసపత్రిక స్త్రీలకోసం పెట్టి నడుపుతున్నాడు. నవ్యమార్గాల్లో సాధనచేస్తున్న స్త్రీలు చాలామంది దానిలో రాయడం మొదలుపెట్టినందుచేత భారతిలో రాశే స్త్రీలసంఖ్య తక్కువైంది!

కొందరు యువకులు గురజాడ అప్పారావుగారి కన్యాశుల్క మార్గాన్ని అవలంబించిన వాళ్లున్నారు. వాళ్ళల్లో కొల్లూరు ధర్మారాయకవి "ప్రాక్టికల్ కవిత్వము"ని అప్పారావుగారి గిరీశాన్నే ఉల్లేఖిస్తూ రాశాడు! వెంపటి పురుషోత్తంగారు "భాగ్యరేఖ" అనేదొకటి రాశారు? కాని అప్పారావుగారి పటిమ రాలేదనే చెప్పాలె! ఏవో మాటలను కలిపి నవ్వుపుట్టించడమా అప్పారావుగారి ఆదర్శం? పెమ్మరాజు లక్ష్మీపతి అనే ఆయన "బార్డోలీ విజయ"మనే పేరుతో అప్పు డక్కడ జరిగే విజయవంతమైన వక సన్నివేశాన్నిగూర్చి పాడాడు. "వీరమ్మ పేరంటాలు" అనే వక వీరగాథను ఉన్నవ లక్ష్మీనారాయణగారు చక్కనిజానపద వ్యావహారికంలో రచించాడు. ఈన పేరెత్తితే "మాలపల్లి" జ్ఞాపకమొస్తుంది. ఈ "మాలపల్లి" అనేది వక అద్భుత నవల. ఈ కాలానికి ఇదే ఉత్తమమైన నవల అని చెప్పాలె. దీన్ని ఈన జైల్లో వుండగా రాశాడు. బైటి

* వెనకటి తరంలో మొసలికంటి రామబాయమ్మగారు సాహితిలో "హృదయవీణ"నీ "యేడ్వవలదన్న ఏసినాటి యెలవేళ" అనీ కొన్ని ఖండకావ్యాలు రాశారు.

కొచ్చి ప్రచురించాడు. ఇందులోసామ్యవాదంవున్నదని వెంటనేసర్కారు వారు దానిమీద ఆంక్ష పెట్టారు. తర్వాత కొన్ని సంవత్సరాలకు పునర్ముద్రితమైంది. ఈనరాశిన యేగ్రంథంలోనైనా ఆంధ్రాభిమానం పొంగి పోర్లుతూవుంటుంది! ఈన సారస్వతసేవేకాకుండా సాంఘిక, రాజకీయ, విద్యాసేవచేస్తున్న ధన్యజీవి. గుంటూరులోవున్న "శారదా నికేతనము" నే సంస్థ యీానసేవకు సజీవోదాహరణం! ఈనతో ఈన ధర్మపత్ని లక్ష్మీబాయమ్మగారు కూడా సేవ చేసి చిరస్మరణీయ అయింది! ఇద్దరూ అనేకమార్లు శ్రీకృష్ణజన్మస్థానానికి వెళ్ళివచ్చి పవిత్రులైనారు. ఒక కవికుమారుడు జస్టిసుపక్షాన్ని కవిత్వంలోకి తెచ్చాడు. బ్రాహ్మణులు మొదటినించిచేశిన, దుర్మార్గాల నన్నిటినీ గుదిగుచ్చి బుద్ధిచెప్పాడు "అధిక్షేపం" అనే ఖండకావ్యంలో. ఈన పేరు వెలగపూడి దానయ్యచౌదరి. ఈన కమ్మవారికి చెందినవాడు. బ్రాహ్మణ నిరాస నీవిధంగా కావ్యరూపంగా రాశిన కవికుమారుడు మరొకడు కానరాడు. ఈన హృదయతాప మిందులో గోచరిస్తున్నది.

సెట్టి లక్ష్మీనరసింహంగారు గిడుగువారి శిష్యుడు. అప్పారావు గారి మార్గానుయాయి. అనేకఖండకావ్యాలు రాశాడు. తర్వాత మానేశాడు. శ్రీశ్రీశ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారికి ఆప్త మిత్రుడు. ఆయనను కృతిపతిని చేశాడుకూడాను. ఈనచేశిన వకగొప్ప కార్య ముంది. రవివర్మ చిత్రించిన సుప్రసిద్ధచిత్రాలకు ఆంధ్రాను వాదాలను పద్యరూపంగా రాశాడు. "దమయంతి హంస" "విశ్వా మిత్ర తపోభంగం" "గంగావతరణం" మొదలైన చిత్రాలను సార స్వతంలోకి తెచ్చాడు. ఎవరైనా యీనపద్యాలనూ, రవివర్మ చిత్రాలనూ, కలిపి అచ్చువేస్తే దేశభాషాసేవ చేశినవాళ్లౌతారు.

నాటకం సంగతి రెండుముక్కలు చెప్పుకుందాం. చిన్నచిన్న నాటకాలు అనగా రెండు మూడు రంగాలువుండేవి వదిలేస్తాను. నాటక కర్తలు సామాన్యంగా గ్రాంథికాన్నే వాడి, పాత్రోచిత

భాషకు ప్రాముఖ్య మిచ్చారు. కొందరు యిందులో బొత్తిగా పద్యాన్ని వాడనివాళ్లున్నారు. వాడినవాళ్లుకూడా వున్నారు. సి. కామేశ్వరరావుగా రనే ఆయన "కుచేలుడ"ని వక నాటకంలో గ్రాంథికాంధ్రాన్నే వాడాడు. పింగళి నాగేంద్రరావుగారు "నారాజు" అనే నాటకం రసవంతంగానే రచించాడు. అందులో ఆయన చ్యుత సంస్కారంకాని భాషనే ఉపయోగించాడు.* కాళ్ళకూరి గోపాల రావుగారు కూడా చక్కని శైలిలో నాటకాలు రాశారు. "వాల్మీకి" అని వకటీ, "తిమ్మరుసు" అని వకటీ, యీ రెండూ చాలాబాగావున్నై! "వాల్మీకి" మన స్తత్వం ప్రధానంగావున్న నాటకం. వాల్మీకియొక్క మొదటి వృత్తీ, ఆయనకు నారదాదులు వచ్చి జ్ఞానం ప్రసాదించడం, దానివల్ల వచ్చిన మార్పు, అది వచ్చేటప్పుడు కలిగే చిత్తవికార వైవిధ్యం, కుమార్తెయొక్క ప్రవర్తనా, మొదలైనవి చాలా హృదయంగమంగా రచించాడు. ఒక స్థలంలో అనగా తండ్రియొక్క ఆకార దర్శనమైనప్పుడు చదువుతూవుంటే షేక్స్పియరు "హామ్లెట్" అనే నాటకంలో దయ్యపురంగం చదువుతున్నట్టు అనుభవిస్తాము. వాల్మీకి ఆ రంగంతర్వాత పునర్జన్మను పొందినట్టు భావిస్తాడు. గోపాలరావు గారుకూడా అనేక ఖండకావ్యాలను రచించాడు. విశ్వదాత ఆదరానికి చాలా సంవత్సరాలు పాత్రుడైనవాడు. దివంగతుడైనాడు. "తిమ్మరుసు" కూడా చక్కని శైలిలోనేవుంటుంది. పాత్రలయొక్క శీలపోషణంలో యీన మిక్కిలిదిట్ట! అనేకులవలె యెట్లాగో మొదలెట్టి నడపడంకాకుండా, ముందే నాటకావయవాలన్నిటినీ కూర్చుకుని రచించే దీర్ఘదర్శి! "హరిశ్చంద్ర" "సావిత్రి" అనే పేర్లతో ఆ కథల్లో భావపూర్ణ వస్తుయుతాలైన తుదిభాగాలను వ్యావహారికంలో రచించాడు కాశీ సోమయాజుల సుందరరామమూర్తిగారు అనే ఆయన.

* ఈన యిప్పటికీ రచనలు సాగిస్తూనే వున్నాడు. ఇటీవలనే "వింధ్యారాణి" అనే వకటి వెలువడ్డది.

ఈయన తన ఉపోద్ఘాతంలో, గ్రాంథికాంధ్రంపట్ల తమకాదరం లేకపో లేదనీ, కాని, వ్యావహారికంలో రాస్తే రససిద్ధికాదా అనే పరీక్షకోసం తానీ నాటకాలను రచించాననీ, శ్రీశ్రీశ్రీ జయపురం మహారాజులుం గారికి చదివి వినిపించాననీ, ఆయన చాలా మెచ్చుకున్నాడనీ, అందు చేత ప్రకటిస్తున్నాననీ, రాసుకున్నాడు. సహృదయులను బలవంత పెడితే వాళ్ళేమంటారు? బాగుందంటారు! తొలిపలుకుకూడా రాస్తారు! శిఫారసుకూడా యిస్తారు! ఈ నాటకాలు, ప్రచారంలో వున్న లక్ష్మీకాంతకవిగారి "హరిశ్చంద్రం"త రసస్ఫూర్తిగాని, సచ్చిదానందశాస్త్రిగారి "సావిత్రి" అంత ఆహ్లాదంగాని, కల్గివున్నయో లేవో తెల్చుకోడం చదువరులకే వదులుతున్నాను. చాలా సాహసించా డీయన! ఒకటిసంగతి చెప్పదలచాను. గద్యంలో రససిద్ధి కాదని నాఆశయంకాదు. అట్లాగైతే పానుగంటివారిని తోశిరాజనాలశి వస్తుంది! కాని భావపూర్ణంగా హృదయమున్నపుడు పద్యం వెలువడ్డంత సులభంగా గద్యం వెలువడదు.* పద్యం భావప్రధానం, గద్యం వైశద్యప్రధానం! వాల్మీకికి "శోకం శ్లోకరూపంగా వచ్చింది". ఏసారస్వతంలోనైనా చూడండి. ప్రథమగ్రంథాలు పద్యరూపంగా వున్నై! ఋగ్వేదంపద్యరూపం! హృద్గతమైనభావాలు పైకొచ్చేటప్పుడు వకవిధమైన"లయ"లో వస్తై. ఎవరైనా చనిపోయినప్పుడు వాళ్ళఆప్తులు యేడవడం యెప్పుడైనా యీ గ్రంథకర్త విన్నాడో లేదో! వినేవుంటే అందులోవుండే "లయ"ను ఆయన తెలుసుకో లేక పోవడం చాలా విచారం! ఆధునికులు చాలామంది గేయంలో యతిప్రాసలు "లయ" నిస్తైయని వాటిని పాటిస్తున్నారు! ప్రకృతిలోనే వకవిధమైన లయ అంతర్బహిర్వ్యాప్తమైవుంది! కాబట్టి అసామాన్యమైన వ్యక్తి తప్ప అట్టి సందర్భాల్లో పాడిమాటలతో రసస్ఫూర్తి చేయలేడు! ఈన యీసాధన యీరెండు నాటకభాగాలతో పూర్తైంది! ఇంకా

*"భావోద్రేకాన్ని ప్రకటించడానికి గద్యంకంటె పద్యమే ఉత్తమము" సభాపతి.

యీవిధంగా రాయలేదు ! బహుశః ఈయనకే తెలిశిందేమో యీ సంగతి !

## విమర్శనం - పరిశోధన - చరిత్ర :

ఈకాలంలో విమర్శనం చాలా పెరుగుతున్నది. నాటకరచనా, ప్రదర్శనమూ కూడా విమర్శకుల పరీక్షకులోనైనై ! కవిత్వతత్వం కూడా చర్చకు పాలైంది. 1914 సంవత్సరంలో రామలింగారెడ్డిగారి గ్రంథం తర్వాత అక్కడక్కడా వ్యాసరూపంగా విమర్శకులు రాయడం మొదలెట్టారు. కాని విరివిగా సమస్త విషయాలూ చర్చించిన సమగ్ర గ్రంథం వెలువడలేదు. పురాణం సూరిశాస్త్రిగారు చాలా చిత్త సంస్కారం గల వ్యక్తి. లలితకళాసూత్రాలను బాగా జీర్ణించు కున్న విమర్శకుడు. ఈన తానొక గృహాన్ని నిర్మించదలచి దానికి పునాదినించీప్లానూ, కట్టడమూ, కూడా స్వయంగా నిర్వహించుకున్న వేత్త! ఈయన మూడు విమర్శన గ్రంథాలు రచించాడు. నాట్యం మీదా, నాటకంమీదా, "నాట్యాంబుజ నాట్యోత్పలాలూ" విమ ర్శనంమీద "విమర్శక పారిజాత"మనీ. ఇవి చాలా ఉద్గ్రంథాలు. "సంఘ సంస్కరణోపన్యాసాల"తో నిండి ఉండక, విషయమే ప్రధా నంగా రాశినవి! పాశ్చాత్యకవిత్వతత్వాన్ని ఉగ్గడిస్తూ, మనదానితో సాధ్యమైనంతవరకు సమన్వయిస్తూ పోయినాడు. కాని యీనకూడా సంస్కృతంలోవున్న రసశాస్త్రం కొంతవరకు అచుంబిత మవడంచేత్త పూర్తిగా చెయ్యలేక పోయినాడు. కాని "శేషం కోపేణపూరయేత్" అనేపనిమాత్రంచెయ్యలేదు. అప్పటికాలంలోవుండే నాటకకంపెనీలు, సుప్రసిద్ధనటులు, వాళ్ళ విశిష్టతా, మొదలైనవన్నీ చాలాబాగా చర్చించి నటకులకూడా వకస్థానాన్నిచ్చాడు. నాట్యకళకు యీపుస్త కాలవల్ల వకవిధమైన గౌరవంవచ్చింది. ఇవిగాక యీన పత్రికల్లో యీ విషయాలనుగూర్చి అనేకవ్యాసాలుకూడా రాస్తూండేవాడు. ఇటీవల

ఈనకీర్తిశేషుడైనాడు.* కోరాడ రామకృష్ణయ్య, రంగస్వామిసరస్వతి, పరవస్తు రామానుజస్వామి మొదలగువారు భాషాతత్వవిమర్శనం చేశారు. బాలకవి భోగరాజు నారాయణమూర్తిగారు "ఆంధ్రకవిత్వ చరిత్ర" ను రాశారు. తేకుమళ్ళ అచ్యుతరావుగారొక వాఙ్మయ చరిత్రకు పునాది వేస్తున్నాడు.♦ గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు తమ నాటకరంగగ్రంథానికి దోహదంచేస్తూ అప్పుడప్పుడూ వ్యాసాలు రచిస్తున్నాడు. నాగలింగం వెంకటేశ్వరశాస్త్రి మొదలైనవాళ్ళు విమర్శనవ్యాసాలు రాస్తూ వుండేవాళ్ళు. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారీకాలంలోనే తమ భావిభాషాసేవకు సాధన చేసుకుంటున్నాడు. ఆంగ్లంలో ద్రావిడభాషాతత్వాన్నిగూర్చి వక గ్రంథంకూడా రాశాడు. చాలా విమర్శనంతోకూడి వున్నది అది. కోరాడ రామకృష్ణయ్యగారు మద్రాసు విశ్వవిద్యాలయ పరిశోధకులుగా నియమింపబడి, పరిశోధనకు మంచి అవకాశం కలిగి, మహాభారత కవితా విమర్శనం మొదలైన అనేక పరిశోధన గ్రంథాలను రచించాడు. పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రాచీనవాఙ్మయ పరిశోధనం చేసి, తమ పరిశోధనాఫలాలను దేశాని కందచేస్తున్నాడు. మానవల్లి, వేటూర్లు తాము పరిశోధనలో చూచిన నూతన విషయాలను దేశానికి సమర్పిస్తూనే వున్నారు. మల్లంపల్లి భావరాజులు తమ శాసనపరిశోధనలను చరిత్రకు సహాయం యిస్తూనేవున్నారు. మామిడిపూడి వెంకటరంగయ్యగారు సంస్కృతంలో వున్న "కామందకీయ రాజనీతి" ని తెలుగులోకి పరివర్తనం చేశాడు. చిలుకూరు వీరభద్రరావుగారు భారతిపుటలను తమ పరిశోధనలతో అలంకరిస్తూనే వున్నాడు. డాక్టరు నేలటూరు వెంకటరమణయ్యగారు తమ చరిత్ర పరిశోధనలను చేసి చరిత్రను సత్యకథనంగా చేయటం సాగాడు.

---

* ఆకాలంలో పింగళి కాటూర్లూ, పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి, కోట ఆంజనేయులు, పారుపల్లి సుబ్బారావు మొదలైనవాళ్లు చాలామంది యీనకు కవి నట మిత్రులుండేవాళ్ళు. నాటకవిషయాల్లో సంప్రతింపులు జరుగుతూవుండేవి!

♦ "విజయనగర సామ్రాజ్యాంధ్ర సారస్వతం" మీద యింగ్లీషులో వకచరిత్ర తర్వాత ప్రచురించాడు.

మిగిలినవాటికేంగాని పెండ్యాలవారి పరిశోధన చాలా చమత్కా-
రంగా వుంటుంది. మామూలుదోవకు కొంచెం భిన్నంగా వుంటుంది.
ఈన చాలా మేధాశాలి. చాలా గ్రంథాలను రచించాడు. నేత్ర
దృష్టి కొరవడింది. అయినా పరిశోధనం మానలేదు. ఆపస్తంబుడిని
గూర్చి చాలా శ్రమచేసి పరిశోధించాడు. చెప్పదలచిన విషయం
కుండ బద్దలు కొట్టినట్టు చెప్పెయ్యటమే కాని ఒకరికి కోపంగాని
తాపంగాని వస్తుందని ఆలోచించడం లేదు. ఆయనంత పరిశోధకుడికి
తప్ప అంత స్వాతంత్ర్యం ఉండటం కష్టం.

"వ్యాసము" కొంచెము తలయెత్తుతున్నది. ముట్నూరి కృష్ణా
రావు, కొలవెన్ను రామకోటీశ్వరరావు, అడివి శంకరరావు,
మానవల్లి రామకృష్ణయ్య, వేటూరు ప్రభాకరశాస్త్రి, దిగవల్లి
వెంకటశివరావు, బెజవాడ గోపాలరెడ్డి, వల్లూరు సూర్యనారాయణ
రావు, తణికెళ్ల వీరభద్రుడు మొదలైనవారు చక్కని వివిధలక్షణ
లక్షితాలైన వ్యాసాలను రచించి యీ విధమైన సాధనకు మార్గ
దర్శకులైనారు. ఇవిగాక యితరశాస్త్ర వాఙ్మయంకూడా విరివిగా
పెరగడం సాగింది. కొందరు యితరభాషల్లో వృద్ధిపొందుతున్న బాల
వాఙ్మయంచూశి అటువంటిది మనభాషలో లేకపోవడం చింతించి
ఆలోటు తీర్చడానికి కృషిసల్పటం మొదలెట్టారు. గురజాడ అప్పా
రావుగారే యీ విషయంలోకూడా మార్గదర్శి.* ఈ పంథను గ్రహించి
అనేకులు చిన్నపిల్లలకొరకు గేయాదులను రచించారు. చింతా దీక్షి
తులుగారీ విధమైన గేయాలు చాలా రాశాడు. గరిమెళ్ల సోమన్న
గారీ విధమైన దసరాపద్యాలు పిల్లలకు విజ్ఞానదాయకాలుగా రచిం
చాడు.♦ కూచి నరిసింహంగారీ విధమైనకృషి యిటీవల చేస్తున్నం
దుకు ప్రశంసనీయులు.

---

* పిల్లలకొరకు "మిణుగురుల" నే చక్కని చిన్ని చిన్ని గేయాలను రచించాడు

♦ శేషాచార్యులుగారనే ఆయన 1904, 5 ప్రాంతంలో బెజవాడ స్కూలులో
మేష్టరుగా ఉండి యిటువంటి బాలవాఙ్మయం కొంత రచించినట్టు జ్ఞాపకం.

౬

రెండు విశేషాలు :

ఈ శతాబ్దాంతానికి జరిగిన రెండు సంగతులను ఉల్లేఖిస్తు న్నాను. కడపమండలవాసి డి. రాజశేఖర శతావధాని అని వక మహామహు డున్నాడు. ఆయన గొప్ప దేశభక్తుడు. అసహా యోద్యమంలో శ్రీకృష్ణజన్మస్థానానికి వెళ్ళి తన దేశభక్తిని వెల్లడిచేశాడు. ఈన చక్కని లక్షణయుతమైన, రసవంతమైన, కవిత్వం చెప్పే ప్రావీణ్యం కలవాడు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు జైలులో వున్నకాలంలో "మాలపల్లి" రాశినట్టు, ఈన శ్రీకృష్ణజన్మస్థానంలో "రాణా ప్రతాప చరిత్ర" అనే ఉత్తమ చారిత్రక కావ్యం రచించాడు. రాజవంశచరిత్రలూ, వాటిలో చిత్తూరు రాజవంశచరిత్రా, ప్రతాప సింగుయొక్క శౌర్య పరాక్రమాలూ, అక్బరు ప్రతాపసింగును లోబరచుకోవలెనని నయానా భయానా చేసిన ప్రయత్నాలూ, కొం దరు రాజపుత్ర ప్రభువులు మహమ్మదీయులకు లోబడడమేగాక వాళ్ళతో సంబంధబాంధవ్యాలుకూడా జరపడమూ, నౌరోజుత్స వమూ, హిందూరాజుల ధర్మచ్యుతీ, అక్బరువంటి వాళ్ళ ద్వారా ప్రతాపసింగును లోబరుచుకోటానికి ప్రయత్నించటమూ, చిత్తూరు ముట్టడీ, ప్రతాపునిరాజ్యచ్యుతీ, తత్కాలంలో ఆయనపడివ కష్టాలూ, ఆయనకుటుంబానికి వచ్చినముప్పులూ, భిల్లనాయకులప్రాపూ, దినైక గండంగా కాలంగడపడమూ, తుదకు దేశం వదలడానికి ప్రయత్నించ డమూ, "భామాసాహి"దర్శనమూ, అతని ద్రవ్యసహాయంచేత జయిం చడమూ మొదలైన ఉదాత్తవిషయాలతో కూడిఉన్న ఉత్తమకావ్యం. ఈ గ్రంథం చదువుతూవుంటే భారతం చదువుతున్నట్టుంది.* యుద్ధవర్ణ

* "జీవ కవిత్వం చెప్పిన ప్రతీ కవికీ యీ (పైనచెప్పిన) తన్మయత్వం స్ఫురిస్తూనే వుంటుంది.........నేను స్కూలు పండితుడుగా బందరులోవున్న కాలంలో ఆయీ మొల్లరామాయణ ఘట్టం (సీతా రావణ సంవాదం) పాఠం చెప్పవలసి

నలు చదువుతూవుంటే, యెలాగైతే తిక్కన యుద్ధవర్ణనలు వకదాని కంటె వకటి నూతనంగావుంటయ్యో అట్లాగేవుంటై. అడివిలో ప్రతాప సింహసంసారము పడినశ్రమా, అయనభార్య పాతివ్రత్యమూ, పిల్లల శౌర్యమూ, తలదాచుకుంటూవుండగా తురకలదండు రావడంవల్ల సపుత్రకళత్రంగా ఆయన పడినశ్రమా, గడ్డిరొట్టెలు తినటమూ మొదలైన ఘట్టాలు చదువుతూవుంటే వొళ్లు జలదరిస్తూవుంటుంది. వీరమాతైన పాటేశ్వరీదేవి శీలమూ, వీరుడై యేకపత్నీవ్రతస్థుడైన ప్రతాపుడి శీలమూ, వీర యువకులగు సంతానంయొక్క యుద్ధోత్సాహమూ మొదలైనవి చాలా రసవంతంగా వర్ణింపబడ్డై.♦ ఈపాత్రలు సీతా

---

వచ్చింది. అప్పుడు తన్మయత్వంతో చదివిఆనందిస్తూవుంటే, యితర తరగతులవిద్యార్థులే కాదు, కొందరు టీచర్లుకూడా రావడమేకాకుండా, "యిదేమిటి! ఈయన యిలా చదువుతున్నాడు ? ఇది స్కూలనుకున్నాడా, స్వగృహం అనుకున్నాడా?" అనుకోవడంకూడా జరిగేది. ఈ తన్మయత్వాన్ని గూర్చి కీ॥ శే॥ ఈమని లక్ష్మణస్వామి గారు (నటక సార్వభౌముడు) బాగా వ్యాఖ్యానంచేశారు. కవులలో యిట్లు తన్మయత్వం కలవారు కొందరే వుంటారు. ఆధునికులలో యీ రాజశేఖరకవి తన్మయత్వం కల కవి అని రచన వ్యాఖ్యానిస్తూవుంది. ఉదహరించవలసివస్తే 100 కి 50 పద్యాలేనా ఉదహరించవలసివస్తుంది." (చళ్ళపిళ్ళవారు. ఆంధ్రపత్రిక 23—3—41.)

♦ "ఈ రాణాప్రతాపచరిత్ర రామాయణంలాగా చాలా వ్యాపించదగ్గది." "సిపాయిలేశాలకేమి ? అవిలేని కవియెవడు ? ఈనాటి ధన్యకవులలో యీయన చిటికిని వేలిమీదికి వచ్చేవాడేగాని అల్లాటప్పావాడుకాడు." ( Ibid ఆం. ప 6–4–41)

దానిలోనుంచి కొన్ని పద్యాల నుదహరిస్తాను.

"ఇరువదేండ్లుగ నుత్తమపరికరముల
భక్తిఁగూర్చి నాపావన స్వాంతమందు,
తల్లి! నే గట్టుకొనిన స్వాతంత్ర్యవజ్ర
భవనరాజంబు కన్నిటివరదమునిగె."

"విశ్వపావనమైన వృత్తివర్తించు గోబ్రాహ్మణులకుఁ దగ్గుపాటుకలిగె,
ధాతృనిభుల్ మునుల్ స్థాపించు వర్ణాశ్రమాచారవిధు లడుగంటిపోయె,

రామ కుశలవులకు తులతూగుతున్నై! ప్రతాపసింహుడు దేశం వదిలి వెళ్లడాని కుద్యుక్తుడైన సందర్భంలో దేశమాత కిచ్చిన వీడ్కోలు యెంతటి పాషాణహృదయాన్నైనా కరిగిస్తుంది. ఈ గ్రంథం వక-మాటు మొదలుపెడితే యిక వదలబుద్ధిపుట్టదు. ఉపోద్ఘాతంలో భావకవిత్వమనే దాన్ని కొంచెం హాస్యంతో వర్ణించాడు. ఈ గ్రంథం ఈ దశాబ్దిలో వ్రాయబడ్డ ఉత్తమకావ్యాల్లో వకటి. ఈ గ్రంథకర్త గారు యావదాంధ్రుల కృతజ్ఞతకు పాత్రులు.

ఈ దశాబ్దాంతానికి దగ్గిరే భావినవ్యాంధ్రసాహిత్యమార్గదర్శి శ్రీరంగం శ్రీనివాసరావుగారు భారతిలో ఖండకావ్యరచన ప్రారంభించాడు. ఈన అప్పటి రచనలను చూచినవాళ్లు యిప్పుడాయన రాశే కావ్యాలవంటివి రాస్తాడని అనుకునివుండరు. ఇతర ఖండకావ్యకర్తలగు నవ్యులవలెనే యీనకూడ భావగీతాలు కొన్ని రచించాడు. భారతీ సంపుటాల్లో కొన్ని ఖండకావ్యాలు వక కథ కనపడుతున్నై. వాట్లో

---

మంగళలక్ష్మి సమానకాలాసాధ్వుల సౌశీల్యగరిమ కార్ష్యంబునందె,
పెట్టని కోటలై వెలసి నిన్గొల్చు వీరులపౌరుషము గంగ గలిసిపోయె,

వేయియేండ్లుగ వ్రేటుపై వ్రేటు తగిలి,
చిక్కి, ససిదక్కి, స్రుక్కి, కృశించి, నాదు
పాలనమున మంచముపట్టి, డీలుపడగ
పాలుపడితివె? తల్లి మేవాడలక్ష్మి!"




"భాను కులగౌరవమునిల్పంగ నోడి,
త్యాగమునఁ గుంటుపడి, నీ పదములగొలుచు
పున్నెములులేక, దూరభూములకునేగు
మమ్ము మావేళ్ల లోకంబు మరచుగాత!"

"నేనేగాక, మరొక్క ధీరుడెవడేనిన్, నిన్నుసేవింప నెం
తేనిన్ బూనిన, వానిపుణ్యమున నేనిన్ దల్లి! మేవాడ
లక్ష్మి! నిత్యోత్సవనిత్యమంగళ జయశ్రీ నిత్యసౌభాగ్యరే
ఖానిత్యప్రభ లెల్ల నీకుగలుగుంగాకంచు కాంక్షించెదన్."

మొదటిది శివతాండవంమీద "ప్రళయనర్తనమ"నే పేరుతో వుంది. చక్కని సలక్షణ భాషాశైలీని. గౌడీ రీతిలోవుంది. ఈన తన ప్రథమ గీతంలోనే శివుడిని తాండవంచెయ్యమనే కోరిక చాలా చిత్రంగావుంది. ఇప్పుడున్నసృష్టిమీద నిరాశో, ప్రళయానంతరం మంచి సృష్టి వస్తుందనేఆశో దీనికి ప్రేరకం తెలియదు. నాశనం పునస్సృష్టికి పూర్వరంగం. కాబట్టి లోపంలేని స్వచ్ఛమైనసృష్టి కావలెనని కవికుమారుడు కోరుతున్నాడా అనిపిస్తుంది. భావమాత్రం మిక్కిలి హృదయంగమమై, సన్నివేశానికి తగిన పారుష్యం కల్గివున్నది. తర్వాతది "అహర్ముఖం" అనే గేయం. తెల్లవారుజాము. వక కలకన్నాడు. పూర్వ భారతదేశావస్థ కళ్లకు కట్టింది. వెనకటి ఋష్యాశ్రమాలు, మునులు, ఋగ్వేదగానం, కనపడ్డై వినపడ్డది. కాని తన కేమీ అర్థంకాలేదట! ఈ గేయంకూడా చక్కని సలక్షణ భాషలోనేవుంది. వస్తువుకూడా పూర్వ భారతౌన్నత్యం కాబట్టి మనస్సు నాకర్షించేదే! మూడోది "అంధకారం" అనే శీర్షిక కలది. సంధ్యాకాలవర్ణనం. కవికుమారుడు సంధ్యకూ, అంధకారానికీ, నక్షత్రాలకూ సంభాషణకల్పించాడు. ఇది కూడా గేయమే! అంధకారానికీ నక్షత్రాలకూ అవినాభావసంబంధం కలిగిన సఖ్యం. ఈ సఖ్యాన్ని చక్కని యీ కింది గీతంలో వర్ణించాడు.

> "నిలువలేనే నీవు నిలచియుండని వేళ
> వెల్గులేనే నీవు విస్తరించనివేళ,
> నీ కాటుకలచేత నా కను లివ్వికసించు,
> నీకు నేనే నాకు నీవె యీ లోకాన"

ఎంత అందంగా వుంది! చీకటిని "కాటుకలు" అనే పదంతో వివక్షు చెయ్యడం చాలా హృదయంగమంగా వుంది. ఇది చాలా ప్రకృతిసిద్ధం. నేత్రరోగం వచ్చినప్పుడు కాటుకచేత కంళ్లు విస్తృతాలవుతై! ఇది వైద్యశాస్త్రంమీద ఆధారపడ్డ అభేదాధ్యవసాయము!

ఇది యీకాలంలో క్రమంగా అభివృద్ధి అవుతున్న వక పద్ధతి. శాస్త్రాల్లో నించి సాదృశ్యకల్పన. తుదిపాదంలో సఖ్యం చక్కగా ఉగ్గడించాడు కవికుమారుడు. సఖ్యంలోవుండే అన్యోన్యాశ్రయం, వకరు లేకుండా రెండోవారు ఉండలేకపోవడం చక్కగా నిర్వచించాడు. చాలా రస వంతంగా వుందీ గీతం. ఈ గీతంలో యీన సఖ్యమనే పరమావధికి దగ్గిరిగా వెళ్ళాడు. నాల్గోది "అంతస్సమాధి" అనే శీర్షికగలది. ఇది కూడా "అహర్ముఖం"లాగు వక కల. కలలో కృష్ణరాయలసభను చూచాడు కవికుమారుడు. అప్పటి భారతదేశౌన్నత్యం వకటి-మాటు కళ్ళకు కట్టింది. అప్పటివైభవం మళ్ళీ యెన్నటికైనా వస్తుందా అని కవి చాలా శోకిస్తాడు. ఇదికూడా దేశభక్తిస్ఫోరకమైన గీతం. తర్వాతది "నిశీథసాంత్వనం" అనే శీర్షికతో ఉన్నది. ఇదీకూడా సామాన్యంగానే వుంది గాని విప్లవద్యోతకంగా యెంతమాత్రం లేదు. తుదిగీతం "సుమార్చన" అనేది. దీనిలో పూలన్నీ కొయ్యడం పర మేశ్వరార్చనం జరపాలని. ఇదికూడా చాలా భక్తిరసస్ఫోరకంగా వుంది. పరమేశ్వరార్చనకు సుమచయం సేకరించటంకంటె సత్కార్య ముంటుందా ? ఇంతవరకు యీన కావ్యాల్లో మామూలుకంటె భిన్న మైనమార్గాలు యెట్టివీ కనపడలేదు. ఇక కథసంగతి చూస్తే అది "సోములు చెప్పినకథ" అనే శీర్షికతో వుంది. లోకవృత్తంలో కన పడుతున్న శృంగారమే దీనిలో వస్తువు. ఇక్కడకూడా విప్లవం యేమీ కనపడటం లేదు. చక్కనిభాష, శైలి, చక్కనిభావన, మనో హరమైన వస్తువు. యీ విధంగానే వుంది సందర్భం. మల్లవరపు విశ్వేశ్వరరావుగారుకూడా యీ దశాబ్ది ఆఖరులో రాత మొదలుపెట్టినట్లు కనపడుతుంది. ఈన "స్వప్నభంగము"నే పేరుతో వక ఖండకావ్యం రాశాడు.* ఇది గేయం. ఇందులో ఛందస్సులో వక విశేష ముంది. పచాలూ సమాసాలూ వెనకటి పాదంలోనించీ

* భారతి, శుక్ల, ఆషాఢం.

తర్వాత పాదానికి ప్రవహించే గుణం పెట్టాడు. ఇది వెనకటివాళ్ళల్లో అక్కడక్కడా కనబడుతుంది♦ కాని దీన్లో దాదాపు ప్రతిపాదమూ అట్లాగే వుంది. ఆంగ్లంలో "Run on verse" అంటే "అనువృత్తగీతి" అందాం యిటువంటిదాన్ని.* ఈన వెనకటి కవిసమయాలనే అలంకారాలనే ఉపయోగించినట్టు కూడా కనపడుతుంది.

"సుఖశంప మెరగించి
శోకాంబుదమె పెంచి"

చూస్తే యీనకు కొంత కృష్ణపక్షకర్తయొక్క అంశవున్నట్టు తోస్తుంది. శోకం మేఘమూ, సుఖం మెరుపూ, మెరుపు క్షణభంగురం. ఇంతకంటె శోకం చిరకాలవర్తి! ఈవిధంగా వచ్చేతరంలో కవితావిప్లవానికి మార్గం తీసిన వాల్లీదశాబ్దిలోనే తలెత్తటం మొద

♦ గురజాడ అప్పారావుగారి "కాసులు"

"వినుము ధనములు రెండు తెరగులు
ఒకటి మట్టిని పుట్టినవి; వే
రొకటి హృత్కమలంబు నారభ
మ్మ, దియు నిది యొకె ॰డను గలుగుట
యరుదు;.......... ..........."

* వకాయన "సింహావలోకనం" మన్నాడు." మొత్తంమీద "గచ్ఛకచ్ఛలి" తో వున్నదన్నమాట.

"సమోహ్మమానస్వప్న
సంతతానంద ప్ర
పంచమ్ములో సృష్టి
నింతకాలముదాక,
................
వింతవింత సుఖప్ర
వంతీజలాలలో
దేలియాడుచు నింద్రి
యాలు సల్పెను కేళి."

లెట్టారు. కాని అటువంటి చిహ్నమే... యిప్పటికి కనపడటం లేదు. ఇప్పటికి వీళ్లిద్దరుకూడా సంప్రదాయాన్ని యెంతమాత్రం ఉల్లఘించ లేదు. కొత్త "Inspiration" రాలేదు. ఇది యెప్పుడు రావటానికి మొదలెట్టిందో! -

**జయంతి, సుజాత పత్రికలు:**

"జయంతి" సంగతి వెనక కొంచెం తెలుసుకున్నాము. ఈ పత్రిక చాలా గొప్పగా వుండేది. దీనిలో రాశేవాళ్లను చూస్తే వెనకటి ఉన్నవ లక్ష్మీనారాయణగారివంటి వేత్తలూ, నాయని సుబ్బారావు, కృష్ణశాస్త్రి గార్లవంటి నవ్యులూ, పంచాంగ్నులవారివంటి పండితులూ, భావరాజు, మల్లంపల్లి వంటి పరిశోధకులూ, కనపడతారు. వాళ్ళనుగూర్చి వెనక మనం తెలుసుకునే ఉన్నాం! పోతే ఒకవిషయం మాత్రం యెక్కువగా కనపడుతుంది! విశ్వనాథ భావస్వాతంత్ర్యానికి దారి యేర్పడిందని. ఈనలో సహజంగావున్న "శక్తి" క్రమంగా వికసిస్తూ పూర్ణంగా స్వతంత్రంకావడానికి దగ్గరకొస్తూవుందని. ఈ ఆత్మవిశ్వాసబీజాలు వెనకనే కొంచెం మనవి చేశేవున్నాను. ఇంతేగాక యీన "పెంకెతనం" కూడా వికసిస్తూ వుందని కూడా తెలుస్తుంది. ఈ గుణం గొప్పకవికి సహజంగా వుంటుంది. శ్రీనాథుడి "పెంకెతనం", పెద్దన "పెంకెతనం", యింతకుపూర్వం నన్నయ తిక్కనల "పెంకెతనం" గనక పరీక్షిస్తే అది తెనుగుసాహిత్యాని కెంత ఉపకారంచేశిందీ తెలుస్తుంది. గురజాడ గిడుగువార్ల "పెంకెతనమే", రాయప్రోలు దేవులపల్లి వేదుల బసవరాజు నండూర్ల "పెంకెతనమే" తుదకు సభాపతిగారి "కనపడని పెంకెతన"మే, నవ్యసాహిత్య దోహదమైందని వెనకటి చరిత్రవల్ల తెలుసుకున్నాము. ఇటువంటి "పెంకెతనమే" విశ్వనాథకు వస్తున్నట్టూ వెనకటి నవ్యులందరి కంటె యీ అంశ యీనదగ్గిర యెక్కువపాలుగా ఉన్నట్టూ కూడా తెలుస్తుంది. తుదకు "మారుమూల పదాల" నుప

యోగించే పద్ధతిని సాధించుకోడ మంత పెంకెతనం కూడా అలవడు తున్నదని స్పష్టపడుతున్నది. ఈ "పెంకెతనం" యీనకు అనితర సులభ స్థానమిచ్చింది. ముఖ్యకారణ మేమిటా అని ఆలోచిస్తే యీనలో ధర్మ బీజముంది ! ఈ ధర్మబీజమే "పెంకెతనమ"నే దుకూలం ధరించి, చుట్టూ బహుళంగా కనపడుతున్న తిరుగుబాటనే నగ్నతనించీ, అర్ధ వస్త్రధారణాన్నించీ, యీన కవిత్వాన్ని విలక్షణం చేశింది. ఈ ధర్మ బీజంవున్న రాయప్రోలు కృతులూ విశ్వనాథవీ వెనకటి దశవర్ష కాలానికీ యీ దశవర్షకాలానికీ మండనాయమానాలు. మిగిలినవి యెన్నైనా వన్నెచిన్నెలు గలిగిన దివ్యాప్సరసల వంటివి. ఇవి స్వచ్ఛప్రకృతి రూపులైన "శ్రీవాణీ గిరిజల" వంటివి. మూడో రకం సానెలవంటివి అసంఖ్యాకాలు.*

"సుజాత" సంగతికూడా కొంచెం తెలుసుకుందాము. ఇది నిజాంరాష్ట్రంలో హైద్రాబాదులో పుట్టింది. ఈ రాష్ట్రభాగానికి తెలంగాణమనిపేరు. ఆంధ్రదేశంలో పుట్టిన సాహిత్యపిపాస యిక్కడికికూడా పాకింది. ఇక్కడకూడా యీ దశవర్షకాలంలో ఆంధ్రదేశ భాషాభిమానాలు తలెత్తినై! "గోలకొండ" వారపత్రికస్థాపించబడింది. ఇది ఇప్పటికీ అవిచ్ఛిన్నంగా జరుగుతూ దేశభాషాసేవలు చేస్తూనే వున్నది. చాలా సంతోషం! దీర్ఘాయువై యిత్తోధిక సేవచేయుగాక! "సుజాత"ని వకచక్కని మాసపత్రికేగాక "నీలగిరి" మొదలైనవి మరి కొన్ని పుట్టి అంతరించినై ! "సుజాత" 4 సంవత్సరాలు భాషాసేవ చేసింది. ఇందులోకూడా చలంగారివంటి కథకులూ, మల్లాది అవధాన్లు గారివంటి రాతగాండ్లూ, మనం వెనక తెలుసుకున్న పేర్లవారు కొందరూ కనపడుతూనే ఉన్నారు. వెనకటి మార్గాలకంటె చెప్పుకోదగ్గ యింకా నూతనమార్గాలేమీ యిందులో కనపడటంలేదు. "సుజాత"ను తలిచేటప్పటికి వక్క ఆంధ్రయువకుడిపేరు జ్ఞప్తికివస్తుంది. సిరుగూరి

* సాహితిలో ప్రణయగీతాలురాశే గిరికుమారుడు జయంతిలోకొచ్చాడు.

జయరావు చక్కని ఖండకావ్యాలు రాస్తూండేవాడు. ఇంగ్లాండుపోయి సివిల్‌సర్వీసుపరీక్షలో ఉత్తీర్ణుడై మధ్యరాష్ట్రీల్లో కలెక్టరుద్యోగం చేస్తూ మృత్యువుచాత పడ్డాడు. చాలా అభివృద్ధికి రాతగిన యువకుడు. వృద్ధులైన తండ్రిగారు ఆయన తర్వాత కొద్దికాలంలోనే పుత్రశోకంతో పరమపదించారు. హైద్రాబాదు నిజాంకాలేజిలో చరిత్రాచార్యుడుగా వున్న సిరుగూరి హనుమంతరావుగారీ జయరావు అన్నగారు.

౭

## ఆంధ్ర విశ్వవిద్యాలయస్థాపనం :

ఈ కాలంలో ఆంధ్రులకు వక చాలా ఉత్సాహజనకమైన అంశం జరిగింది. ఏనాడు ఆంధ్రమహాజన స్థాపించినప్పుడు ఆంధ్ర విశ్వవిద్యాలయమూ ఆంధ్రరాష్ట్రిమూ కోరామో, అప్పటినించీ చాలా దినాలు ఆందోళనచేశాం. తుదకు 1921 సంవత్సర జాతీయోద్యమంలో లీనమైపోయిందీ రాష్ట్రోద్యమం. ఈ కాలానికి దగ్గిరిగా "జస్టిసుపక్షం" యెన్నికలలో గెలుపొంది శాసనసభలో అధికసంఖ్యాకమైంది. అప్పట్లో యింగ్లాండు యిండియాకు ప్రసాదించిన రాజ్యాంగ సంస్కరణలప్రకారం కొన్ని మంత్రిపదవులు మనవాళ్లకిచ్చారు. ఈ జస్టిసుపక్షనాయకుల కీమంత్రిపదవులు లభించినై. మొదట 1921 సంవత్సరంలో శాసనసభలను బహిష్కరించిన కాంగ్రెసువారు తమ అభిప్రాయాన్ని మార్చుకుని స్వరాజ్యపక్షమనే పేరుతో యెన్నికలలో నిలిచి మళ్ళీ శాసనసభల్లో ప్రవేశించారు. ప్రభుత్వానికి యీ స్వరాజ్యపక్షం ప్రతికక్షిగా వుండేది మద్రాసు శాసనసభలో. అందులోవున్న వాళ్లల్లో వక నాయకుడుగావుండేవాడు రామలింగారెడ్డిగారు. ఈన గొప్ప విద్యాధికుడనీ, వక్తనీ, వెనక మనవిచేశాను. 1925 ప్రాంతంలో సర్. ఏ. పి. పాత్రోగారు విద్యాశాఖ మంత్రిగా వుండేవాడు. ఆయ

నకూ ఇంకా ప్రభుత్వవర్గంలో అందరికీకూడా రెడ్డిగారు పక్కలో బల్లెమై పోయినాడు. ఈయన చర్చలో చూపే కౌశలం, ప్రతిపక్షులను వేశే ప్రశ్నలూ, వాళ్ళను చాలా కష్టపెడుతూ వుండేవి. ఎట్లా కని పెట్టారో కనిపెట్టారు యీయన కుద్యోగ మొకటిస్తే యీ శ్రమ తప్పించుకోవచ్చునని! ఇది కనిపెట్టడంలో వాళ్ళ పరేంగితజ్ఞానాన్ని మెచ్చుకోవచ్చు. ఆలోచించి "ఆంధ్రవిశ్వవిద్యాలయం" స్థాపించడానికి నిశ్చయించారు. అప్పట్లో పానుగల్లు రాజాగారు ముఖ్యమంత్రిగా వుండటంచేత దృష్టి కొంచెం ఆంధ్రులమీాదికి తిరిగింది. ఈ పానుగల్లు రాజాగారే తిరుపతి దేవస్థానాదాయం విద్యకు వినియోగించడానికి మొదట అంచనావేసిన దూరదర్శి. ఆయన చనిపోకపోతే తిరుపతి దేవస్థానం ఆంధ్ర దేశంలో ఆంధ్రుల చేతిలో వుండేది. సి. రాజగోపాలాచారిగారి హయాములో అక్కడ ప్రాచ్య విద్యాలయ నిర్మాణం జరిగింది. పరిశోధన చేయిస్తున్నారు. ప్రాచ్యవిద్యా పాఠశాల స్థాపించారు. దానిలో తెనుగు విద్వాన్ పెట్టడానికి మనవాళ్లు ఆందోళనచేసి పెట్టించేటప్పటికి కృత్యాద్యవస్థ అయింది! ఇప్పుడు ఆంధ్రదేశంలో కొంతభాగం యితరరాష్ట్రాలు కలుపుకోనీ, ఆంధ్రభాషకు విశ్వవిద్యాలయంలో ప్రాముఖ్య మియ్యక పోనీ, తుదకు ఆంధ్రులకు గొప్పనష్టంరానీ, యావద్భారతోద్యమంలో పడి వీటిని లెక్కచేసేస్థితిలో లేము! ఈ విశ్వవిద్యాలయంకూడా మన వాళ్లు కోరితే వచ్చింది కాదు. సర్కారువారు స్వయంగా ప్రసాదించింది. పానుగల్లు రాజాగారి దానం! కాని యిందుకు పురికొల్పింది, రెడ్డి గారి బారినించీ శాసనసభలో తప్పించుకోవలెననే ఉద్దేశం. అప్పట్లో మన మహానాయకులకు విశ్వవిద్యాలయంమీాద దృష్టే లేదు. చిల్లరవాళ్లు పోట్లాడుకోటం మొదలెట్టారు. మా వూరంటె మా వూరని తగవులు ప్రారంభించినై! గుంటూరువారూ బెజవాడవారూ వకటై బెజవాడకు వోటిచ్చారు. రాజమండ్రివారికి బెజవాడ యెంత

మాత్రం గిట్టలేదు. మొత్తంమీద యీ పోట్లాటకు ఫలంగా విశ్వ విద్యాలయం విశాఖపట్నం వెళ్ళిపోయింది. దత్తమండలాలు బయటికి వెళ్ళిపోయినై ! రాష్ట్రసమస్య వెనకటికంటె క్లిష్టతరమైంది. రెడ్డిగారు వైస్‌చాన్సెలరైనాడు. ఆ పదవి పోయ్యేకాలంలో కాంగ్రెసులో చేరాడు. మళ్ళీ విశ్వవిద్యాలయోపాధ్యక్షపదవి ఖాళీ అయ్యేటప్పటికి మళ్ళీ కాంగ్రెసును వదిలేశాడు. మాబోటివాళ్ళం విశ్వవిద్యాలయం రావడం, దానికి విద్యాధికుడైన రెడ్డిగారుపాధ్యక్షుడు కావడం చూశి జాత్యభ్యున్నతికి చాలా యీ సంస్థ తోడుపడుతుందని ఆశించాం. కాని యీ పదిహేడు సంవత్సరాల నించీ చాలా నిరుత్సాహం కలిగింది. అదివరలో విశ్వవిద్యాలయంయొక్క ఆశయాలనుకున్నవి వక్కటయినా సఫలం కాలేదు.*

---

* రెడ్డిగారు యిటీవల 7—12—40 (ఆంధ్రపత్రిక) తేదీన యిచ్చిన ఉపన్యాసంలో యీ కిందివిధంగా చెప్పాడు.

"ఈ విశ్వవిద్యాలయము "సైన్సు, అప్లైడుసైన్సు" కు ప్రాముఖ్యవ. నొసంగునదై యున్నది. వాఙ్మయము, సారస్వతము, మున్నగునవి అంత ప్రాధాన్యముగా నెంచబడుట లేదు."

ఆంధ్రదేశమంతా యీనకూ, విశ్వవిద్యాలయానికీ కృతజ్ఞం. ఇక ఆంధ్రులు యేడవవలసిన అవసరం లేదు. "మీ సంస్కృతికోసం కాదీ సంస్థ" అన్నప్పుడు యిక దుఃఖ మెందుకు ? "ఈ విశ్వవిద్యాలయము వక్క పార్టీది కాదనియు, ఒక్క కులమువారిది కాదనియు, ఒక్క జిల్లాది కాదనియు ప్రజలు తలచుచున్నట్లు ఈ విరామములు స్పష్టము చేయుచున్నవి." ఆంధ్రప్రజలది కాదన్నప్పుడు యీ మాటల కర్థం లేదు. ఈ పై మాటలుచేతలతో నిదర్శనంగా చూపాలె ! ఈ కింది వాక్యాలు చూడండి "*We must introduce our students to the great basic intellectual and social achievements of our race, and to forces shaping contemporary Society*" (*Dr. Nelson, O. Mead. President of City College, New York.*)

ఖండాంతరాల్లో యిట్లా ఉంటే మన సంస్కృతికి స్థానం లేదంటున్నారు మన విశ్వవిద్యాలయాధికారులు.

ఎన్నిసంవత్సరాలనించీ మన నాయకులంతా ఉన్నతవిద్యను దేశభాషలలో గరపాలెనని ఆందోళనచేస్తున్నారు? ఉస్మానియా విశ్వవిద్యాలయం యీ విషయంలో కృషి చేసింది. ఇంకొక విశేషం. ఈ విశ్వవిద్యాలయాన్ని స్థాపించేటప్పుడు విద్యాధికుడైన రెడ్డిగారి సలహా తీసుకున్నారట! అటువంటివారు ఉపాధ్యక్షులు డయ్యేటప్పటికి మాకందరికీ తెనుగుకు అభ్యున్నతి కలుగుతుందనే ఆశకలిగింది. ఈ మార్పు వచ్చేటట్టు లేదు. త్వరలో వచ్చేసూచనే లేదు. వెనక వకమారు విశ్వవిద్యాలయ కనీసకర్తవ్యం మనవిచేశాను. ఇప్పటికి ఉపాధ్యక్షులుగావచ్చిన వారిద్దరూ గొప్ప అంతర్జాతీయ విద్యాధికులు. అటువంటి వాళ్ల హయాంలోనే అవసరమైన మార్పులు రాకపోతే నిరుత్సాహం కాక యింకేమున్నది? తెనుగుకు ఆనర్సుక్లాసు పెట్టడంతప్ప చేసిన ఉపకారంలేదు! సంస్కృతంమీద సవితితల్లిప్రేమే! పరిశోధన మనేది తలపెట్టినట్టు కనపడదు. మద్రాసు విశ్వవిద్యాలయం చేసినమాత్రం కూడా తెనుగుకు ఆంధ్రవిశ్వవిద్యాలయం చెయ్యలేదు. తంజావూరు లైబ్రరీలోవున్న తెనుగు గ్రంథాల పట్టిక తయారుచెయ్యడం వీరుచేసిన వకగొప్పపని. వకఉత్తమ నవలకు బహుమతిస్తామని ప్రకటిస్తే "నారాయణరావు" "వేయిపడగలు" బయటికొచ్చినై. "నారాయణరావు"కు రావలసిన పారితోషికం ప్రచురింపబడక పోవడం వల్ల పూర్తిగా ముట్టలేదనీ, "వేయిపడగలు"

ఈన ఆంధ్రరాష్ట్రాన్నిగూర్చి యిప్పుడు చెప్పేమాటలు ఆబాలగోపాలం కోపకారణాలుగా ఉన్నాయి. ఈన కాకినాడలో నాట్యకళాపరిషత్తులోనూ అంతకుపూర్వం తన షష్టిపూర్తిమహోత్సవ సందర్భంలోనూ చెప్పినమాటలు చాలా నిరుత్సాహంగా వున్నై! మచ్చుకు రెండువాక్యాల నిస్తాను. "*The question of forming a separate province has gone to rocks. There will be no use of salvaging it.*" (*21—1—41 Speech at Madras*) ఈ అర్థాన్నే విచారంతో చెబితే కొంచెం నయమే! "ప్రజామిత్ర" యీనకు వక బహిరంగలేఖ రాశింది!

మాత్రం శంభుప్రసాదుగారి దయచేత బైటికొచ్చింది కాబట్టి దానిది ముట్టిందనీ చెప్పుకుంటారు. ఇటీవల "ఆంధ్ర సాహిత్య చరిత్రను" కూడా యిట్లాగే పోటీ పారితోషిక మిచ్చి రాయించాలననుకున్నారు విశ్వవిద్యాలయంవారు. ఇట్లాగున్నది యీచరిత్ర! చేశేపనికంతకూ వోట్లూ ఉద్యోగాలూ ప్రతిఫలంగా చూడడమైతే, యిక యితరానికి చోటే లేదు. నిజమైన ఆంధ్రాభ్యుదయం కోరేవాళ్ళకు చాలా ఉత్సాహ భంగమైందనీ, ఆంధ్రుల భావ్యభివృద్ధికి వలయు వకపనైనా జరగటం లేదనీ చెప్పి యీదుఃఖకరమైన ప్రశంస నాపి వేస్తాను.*

## ఆంధ్రనాటక కళాపరిషత్తు:

వెనక కొన్ని సంవత్సరాలుగా నాటకకళకు కొంచెం దోహదం కలిగిందని చెప్పాను. మన ప్రముఖులంతా నాటక కళోద్ధరణం విషయమై అభిప్రాయాలు మార్చుకోటానికీ, అవసరమైన కొన్నివిషయాలు నిర్ధారణ చేసుకోటానికీ, సంఘమొకటి అవసరమని తలచారు. అటువంటి పరిషత్తునొకదాన్ని స్థాపించారు. ఇందులో బళ్ళారి రాఘవాచార్యులుగారూ, వసారస గోవిందరావుగారూ చేసిన కృషి చాలా గొప్పది. వక ఆదర్శక నాట్యశాల నిర్మించాలనీ, ఆదర్శక నటకులను తయ్యారు చెయ్యాలనీ, చకని నాటకాలను రాయించాలనీ, యువకులకు నాట్యంలో తర్ఫీతునియ్యాలనీ, మొదలైన ఉన్నతాదర్శాలు వీళ్లకు మొదటఉండేవి! వీటి అన్నిటికంటే పూర్వం స్త్రీలు నాట్యరంగ మెక్కాలనే ప్రశ్న పరిషత్తు నాకర్షించింది. విశ్వదాతవంటి వాడు కూడా ప్రవేశించాలనే అభిప్రాయం పొందాడు. పత్రికల్లో వాదోపవాదాలు కలిగినై! ఈ విషయంలో

* 1941 సంవత్సరం నవంబరు నెలలో సర్. విజయగారి యాజమాన్యంకింద జరిగిన ఆంధ్రమహాసభలో సరియైన ఆంధ్రచరిత్ర రాయటానికి గట్టి ఉపసంఘం వకటి స్థాపింపబడిందని తెలుస్తుంది. దీనిలోవాళ్ళందరూ అన్ని ముత్యాలు.

చాలా గొప్పవ్యక్తులు పాల్గొన్నారు. సంసారులైన పురుషుల్లో యిది మొదట చాలా కలవరం కలగచేశింది! ఈపని చెయ్యడంలో కొద్ది మంది సంసారస్త్రీలు కొంచె ముత్సాహం చూపారు. కాని మొత్తం మీద చాలామంది మాత్రం దీన్ని అనుసరించలేదు. తెనాలిలో (1929) జరిగిన ప్రథమ పరిషత్సభకు కీ॥ శే॥ ఆచంట వెంకట్రాయ సాంఖ్యాయనశర్మగారు అధ్యక్షత వహించారు. అప్పుడు నేను కూడా పాల్గొన్నాను. విశ్వదాతగారు కూడా వచ్చి యీ పాత్రధారణాన్ని గూర్చి గంభీరోపన్యాసమిచ్చారు. ఈ పరిషత్తు వకప్పుడు చాలా ఉత్సాహంతో పనిచేసింది. ఇప్పుడు ఏదోబతక లేకా చావలేకా వుంది. ప్రతి సంవత్సరం కాకపోయినా అప్పుడప్పుడు కలవడం, కొంతవాగ్వివేచనం, తండులధ్వంసంచెయ్యడం, కొన్ని నాటకాలను ప్రదర్శించడం, యెవళ్ళపనిమీద వాళ్లు పోవడం కలుగుతున్నది! సినిమావచ్చి యీ ఉద్యమానికి దెబ్బతగిలింది. వేషం వేయతగిన స్త్రీలంతా సినీమాల్లో నటత్వంలో వుండటంచేత, సమర్థులైన పురుషులుకూడా సినిమారంగాన్ని ఆశ్రయించాలశొచ్చింది.

ఇటీవల "నాట్యకళ, సినీమాకళ" అని పెద్దలొక ఉపన్యాసమిచ్చారు. (ఆంధ్రపత్రిక 23-1-41) అందులో కొన్ని అభిప్రాయాల నిక్కడ యిస్తాను. గిడుగు సీతాపతిగారన్నారు. "నాటకంలో సంగతులూ, నవలలో ఉన్న వర్ణనలూ, రెంటినీ చూపవచ్చుట చలన చిత్రంలో! ప్రేక్షకుడి ఊహకు విడిచిపెట్టే కొన్ని విషయాలనుకూడా చూపవచ్చుట?" ఇదికళాస్వభావంకాదు. అన్ని లలితకళల్లోనూ ఊహనండి, వ్యంగ్యమనండి, ధ్వననండి, రసమనండి, ప్రధానం! అదిలేకపోవడమే సినిమాలో గొప్పలోపం! సీతాపతిగారుకూడా "కొన్ని"శబ్దంతో, కొన్నివిషయాలింకా చూపకూడదని వప్పుకుంటున్నారు.* అంతే

*డైరెక్టరు గోపాలరావుగారు ఈ క్రింది మాటలతో సీతాపతిగారి వాదాన్ని ఖండించారు. "సినిమాలో డైరెక్టరు కొన్నిసంగతులు చెప్పకుండా ప్రేక్షకుల ఊహకు

గాక సినిమాలో ప్రేక్షకుడేడీ? అదిగూడా వక గొప్ప లోపము! ప్రేక్షకుడున్నప్పుడు నటులులేరు! నటులు నటించేటప్పుడు ప్రేక్షకులులేరు. చూపవచ్చునంటారేః! ఫొటోగ్రాఫీలో తీయడానికి వీల్లేని విషయాలుంటాయా? అట్లా అన్నివిషయాలూ చూపటంచేత సినిమా కళ కళకాక సంసారమైపోతున్నది. "నటకుడి భావప్రకటనం బాగుండే వరకు డైరెక్టరు చెప్పి చేయించగలడట!" ఈ మాటల్లో డైరెక్టరే సర్వసామాజక స్థానంలోవున్నాడని వొప్పుకుంటున్నారు. "స్వగతంలో నాటకంలో అల్లే నటుడు గొంతుచించుకొని అరవక్కర్లేదట!" ఇటు వంటి స్వగతాలు సినిమాకళలో ఉండవా? ఉంటే ప్రేక్షకులకు విన పడనక్కరలేదా? "ఆదివరకు తమ శీలాన్ని కాపాడుకోగల"పవిత్రులు యీ పరిశ్రమలో చేరితే యిందులోకూడ కాపాడుకోగలరు. ఈ వాక్యం చాలా భావగుంభితంగావుంది. నేనుకూడా దాన్ని అట్లాగే వదులుతున్నాను. డైరెక్టరు గోపాలరావుగారి యీ కింది ప్రసంగం విచిత్రంగావుంది. "మానవుడిదృష్టి దేవుడిమీాదినించీ తగ్గి, తనమీాదికే మరలుతున్నదట! దేవుడిమీాదినించీ దృష్టిమరలించి ఎలాబాగు పడాలనే సమస్య ఉదయించిందట! అది పరిష్కరించుటకు కళ తోడ్పడాలట!" దేవుడిని మానవ జీవితంలోనించీ వెళ్ల గొడుతున్నాడీన! అంత సులభంగా గోపాలరావుగారి ఆజ్ఞాను వర్తియై వెళ్ళిపోడు దేవుడు! గోపాలరావుగారికంటె చాలాకాలం కిందటినించీ మానవజీవితంలో తిష్ఠవేసుకుని కూచున్నాడు దేవుడు!

---

వదిలిపెడతాడు. నవలలో స్పష్టంగా వ్రాసిచూపిస్తాడు. కావున నవలకన్న సినిమా ఉత్తమశ్రేణికి చెందింది." అంతకంటె చాలా ముఖ్యమైన విషయాలను ప్రేక్షకుడి ఊహకు వదిలేనాటకం యింతకంటె ఉత్తమశ్రేణికి చెందిందని యీవాదమే ధృవపరుస్తుంది! దీన్నే నాటకంలో సూచ్యార్థ సూచనమన్నారు. "*It is generally forgotten that on the screen as on the stage, what is left out is as important, and often even more important than what is let in.*"

(*Indian Express 6—8—41*)

యుద్ధాలు, విప్లవాలు, మొదలైనవి దేవుణ్ణి తాత్కాలికంగా మరపించినా, మానవజాతి మళ్ళీ దైవసన్నిధిలో ఓనమాలు చదువుకుంటూంటే, సినిమాకళా గోపాలరావుగారూనా ఆయన్ను మానవ జీవితంలోనించీ వెళ్ళగొట్టడం !

సినిమాకు కావలసిన టెక్నిక్కు వేరు ? అది వొకప్పుడు నాటకంకంటే చాలా భిన్నం. వకట ఉదాహరణ మిస్తాను. నాటకంలో సభ్యులను చూస్తూ మాట్లాడాలె, ప్రతిభ ఉపయోగించి నాట్యంచెయ్యాలె! ఒక్కొక్కప్పుడు నటుడు సభనుచూచి ఉత్సాహం పొందడమో భయకంపితుడు కావడమో తటస్థిస్తుంది. కాని సినిమాలో నటుడిప్రతిభ అక్కర్లేదు. డైరెక్టరుంటాడు. వాడుచెప్పినట్టు చెయ్యాలె! ఎదురుగా ఎవ్వరూ వుండరుకూడాను. ఎదటమనిషి లేకుండా నవ్వాలె, యేడవాలె, పనిచెయ్యాలె! ఇదిసన్నివేశంలేకుండా, వాతావరణంలేకుండా నటించడం. వినీ, చూశీ, బాగావుండ లేదనిగానీ, బాగావుందనికానీ, చెప్పేవాళ్లు ఫిలింతయారుచేస్తున్న వాళ్ళేగాని సభాసదులు కారు. సభాసదులంటూవుండి, వాళ్లు ఆమోదమో, వైముఖ్యమో చూపిస్తూంటే పాత్రధారికి నేర్చుకునే విషయాలుంటై !* ఇక్కడ డైరెక్టరు సర్వజ్ఞుడు! ఎప్పుడూ వై. వి. రావు, గూడవల్లి వంటి డైరెక్టర్లు దొరుకుతారా ? కాబట్టి మన తెలుగు ఫిల్ములిట్లావున్నై ! సినీమా కళలోవున్న అసలు లోపమేయిది ! రసం కొంతవరకు చంపేశింది !♦ ప్రజలను యెందుకూ పనికిరాని దద్దమ్మలనీ, మనం

*డాక్టరు గి. సీతాపతిగారు సినిమాకళలో నాటకంకంటె కొన్ని విశేషాలున్నై అన్నా యీ విషయంలో మాత్రం యేకీభవించారు. (ఆంధ్రపత్రిక 23-1-41)

♦ప్రథమదర్శనమేగాని పునర్దర్శనం రసోత్పత్తిచెయ్యదు. అంటే "క్షణేక్షణే యన్నవతా ముపైతి" అనే గుణం లేదు. రమణీయతలేనిది రసమెక్కడిది? గ్రామఫోనువంటిదే నన్నమాట. జీవమూ, ప్రాణమూ లేని కళకు స్థాయిత్వం యిచ్చిం దీపరిశ్రమ. "మ్యూజియంలో చచ్చిన జంతువుల శవాలవంటిదని" వక విమర్శకుడన్నాడు. అంతక్రూరంగా చెప్పడం న్యాయం కాదు. వ్యక్తిప్రతిభా తత్పరిణామమైన క్షణక్షణ నవ్యతా లేదని

యెట్లా చేసినా పర్వాలేదు, ప్రజ మెచ్చుతారు, హాళ్లు నిండుతారనీ, కొన్ని సన్నివేశాలూ, కొంత సంగీతమూ, కొన్ని స్త్రీపురుషసమావేశాలూ, కొంత భావప్రకటనమూ, కొంత శరీర స్పర్శా, కొంత చుంబనాదికమూ, కొంత విలక్షణనే పథ్యయుక్తనాట్యమూ, చూపితే చాలనీనుకోడం !* అవ్వే ప్రతి ఫిలింలోనూ, అవసరమున్నా లేక

మాత్రం గట్టిమాట. గ్రామొఫోనులు మూలబడ్డట్టు సినిమా కళకూడా యెప్పుడన్నా మూలపడవచ్చు. రాఘవాచార్లుగారేమన్నారో చూడండి :—

"గాంధిగారు చెప్పినట్లు దేవుడు, సత్యం, సౌందర్యం, కలిశివుంటాయి. కాని 'ఆజ్ కల్' దినాలలో దేవునిబదులు దురాశయు, సౌందర్యం బదులు రూపాయి లణాలు పైసలు, సత్యం బదులు అడ్వర్ టైజుమెంటు స్థావర మేర్పరచుకున్నవి. ఎంత, ఎక్కువ ప్రకటన చేస్తే అంత పెద్ద స్టారులు, లేదా ప్లానెట్లు అవుతారు. సినీమాలలో ప్రదర్శింపబడునది బూటకపు సౌందర్యం. భారతసంఘముయొక్క మర్యాదయు గొప్పతనము యీసినిమాలవలన, నాశనం చేయబడుచున్నది. మన స్త్రీజనంయొక్క సభ్యత నిరసింపబడి వికృతాకారముతో ప్రదర్శింపబడుచున్నది. కనుక మీరెవ్వరూ సినిమాలకు పోరాదనియే నా సలహా" ఎంత గట్టిగాచెప్పారు ! (ఆంధ్రపత్రిక 24-1-41)

పద్మావతీదేవిగారివి యీమాటలు : "ఆంధ్రులలో అనుకరణం యెక్కువ. 'సోజావో రాజకుమారి' అని సైగలు పాడినమట్టుతెచ్చి, 'చాలు యీసరసాలు చాలు' అని మన సినిమాల్లో యెక్కిస్తే, యిదేమి సరసంరా అని దిగులేస్తుంది."

(ఆంధ్రపత్రిక 24-1-41)

(2-5-41 ఆంధ్రపత్రికలో జమ్మలమడక మాధవరామశర్మగారి వ్యాసాన్నికూడా చదవమని కోరిక.)

దీనిపేరే '*Mob*' మాబ్ ఓేస్టు అన్నాడు కొడవటిగంటి.

"...మాబ్ ఓేస్టు ! అది కావాలె !"

"ప్రతీ నటుడూ ఆమాటే అన్నాడు.

కవి ఆమాటే అన్నాడు.

మ్యూజిక్ డైరెక్టరు......

పెట్టుబడిదార్లు......

ఆర్టిస్టు ......

పోయినా పడెయ్యడం! ఇట్లా సినిమాకళవచ్చి నాటకానికీ, రంగానికీ, దెబ్బకొట్టింది! ఈ పీడ ఎప్పుడు వదలుతుందో తెలియదు! ఇందులో కళ యేముంది? సూచ్యార్థ సూచనం, దృశ్యార్థదర్శనమంటూ లేదు! ప్రతిదీ దర్శనీయమే! కర్మంజాలక చావొస్తే, వాకిట్లో కూచోబెట్టి నీళ్లు పొయ్యడం దగ్గరనుంచీ, కాటిలో దహనంచేశి, యింటికొచ్చిందాకా—యేడ్పులు పెడబొబ్బలూ సహా—చూపాలశిందే! ఎంత జుగుప్స! నేను కొంచెం అతిశయోక్తిగా చెప్పానేమో! మళ్లీ నాటకకళకు యెప్పటికి గౌరవ మొస్తుందో తెలియదు. స్త్రీలు నాటకరంగాని కెక్కడమనే సమస్య యిప్పుడు యెక్కువగా చర్చించటం లేదు. ఈవిషయంలో తెలుసుకోగోరినవాళ్లు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి "నాటకోపన్యాసాలు" చదవమని మనవి. ఇక యీ సినీమా సారస్వతాన్నిగూర్చి యెంతతక్కువ చెబితే అంతమంచిది. అది సారస్వతం కాదు. చెత్త! దీన్నే పోగుచేసి కుప్పలు చేశారు మా లక్ష్మీకాంతం అన్నగారూ, మొదలైనవాళ్లు! నవ్యుల్లో త్రిపురారిభొట్లు వంటివాళ్లకూడా యీగాలి తగిలింది! అనుసరిస్తూన్న సంగీతం తీసేస్తే, భావంకల పద్యంగాని, పాటగాని, నాకు కనపడలేదనటంలో నామనస్సులోవున్నదాన్ని మనవిచేస్తున్నాను! గవ్వైపాటవచ్చి తెనుగు సినిమారంగాన్ని ముట్టడేశింది!♦ ఆపాడేది తెనుగో, ఉర్దూవో, హిందీవో,

---

క్లాప్‌బాయ్ ......"

(ఆంధ్రపత్రిక 20-9-40)

"ప్రొడ్యూసర్లు దీనిని (ప్రజల సినిమాసక్తతను) అవకాశముగా తీసుకుని చెత్త ఫిలుములు వారి తలలమీద రుద్దరాదు."

(జాక్ అలెగ్జాండర్, ఆంధ్రపత్రిక 31-1-41)

♦ టాకీయంత్రముల మూలమున మానవ కంఠస్వరమును విపరీతముగా అతిశయింపజేసి పెద్దగా విన్పింపజేయుటవల్ల సహజ కంఠస్వరములోని మార్దవమున్నూ హెచ్చుతగ్గుల వొదుగులున్నూ అంతర్ధానమైనా, నాట్యాభినయములలో అర్థసంభరితమై అవయవ విన్యాసములు సందర్భశుద్ధిగా చూపబడును. కాని టాకీలలో కొన్ని విన్యా

తెలియటానికి వీల్లేకుండావుంది! సంగీత స్వరాల్లో మాటలు మునిగి పోతున్నై!* మిగిలింది నిర్భావహాసం! పకపకలు కదులుతై!

సములను మాత్రమే చూపగల్గుచున్నారు. ఏదో ఒక్క విన్యాసమునే ఒక్కొక్క సందర్భములో ప్రధానముగా పెద్ద బొమ్మగాజేసి చూపుచున్నారు. ...... ఇటువంటి యంత్ర చమత్కార ప్రభావములవల్ల మానవులకుండెడి సహజ రసగ్రహణశక్తికూడ నశించి, సహజభావప్రకటనా సామర్థ్యముకూడ జనులకు నశింపగలదు."

(డాక్టరు కజిన్సుగారు – ఆంధ్రపత్రిక. 25-10-40)

"ఫిల్ములు మూలంగా సంస్కారం జరగగలదని నేననుకోను"

(వై. వి. నిత్యానంద, ఆంధ్రపత్రిక, 27-12-40)

కొమ్మూరి పద్మావతీదేవిగారు పట్నంలో ఉపన్యాసమిస్తూ నాటకాన్ని నీతి బోధచేస్తుందని ఉగ్గడిస్తూ యిట్లా చెప్పింది.

"ఇలాగే (పైనచెప్పినట్టు) నాటకాలద్వారాకూడా ప్రబోధం చేయవచ్చును. ఇలా ప్రచారంచేసే నాటకాలు ప్రస్తుతం లేవనే అనాలి. తగిన సహాయంలేక యింత వరకూ ప్రచారం చేసేవి యేవీ మనదేశంలో రాలేదనే చెప్పాలిశివస్తుంది." పద్యాల ద్వారా పాటలద్వారా, నీతిని బోధించటంకంటె నాటకాల ద్వారా సినీమాలద్వారా యెక్కువగా బోధించొచ్చునని యీమెఆశయం. అట్లా బోధించే నాటకాలు లేవన్నప్పుడు, సావిత్రి, హరిశ్చంద్ర, వేణీసంహారం, పాదుక, మొదలైన నాటకాలు జ్ఞప్తికి రాలేదు కాబోలు దేవిగారికి! హరిశ్చంద్ర నాటకంవల్ల ప్రపంచంలో సత్యం యెంత బోధ అయిందో, సావిత్రివల్ల యెంత పాతివ్రత్యం బోధఅయిందో దేవిగారికి తెలియని విషయం కాదు! చెప్పేమాటలకూ, వినే కావ్యానికీ, చూచే నాటకానికీ, నడిచే నడవడికీ, సంబంధం వుండటం చాలా అరుదు! అట్లా సంబంధంవుంటే అది "*Art for art's sake*" కాదు.

*"ఆంధ్రగాయకులు హిందూస్థాని సంగీతాన్ని అనుసరించి కర్నాటక సంగీతాన్ని యీసడిస్తున్నారు." (త. శి. శా. ఆంధ్రపత్రిక 22-1-41)

"మద్రాసులో తెలుగు, తమిళ, చిత్రాలు చాలా ప్రాథమికస్థితిలో వున్నందున ప్రజల కింకా సన్నిహితంగా వున్నవని చెప్పచ్చు. వాటిలో బ్రాహ్మణద్వేషంకూడా మిక్కుటంగా కనిపిస్తుంది. అయితే వాటిలో బొంబాయి కలకత్తా ఫిల్ముల్లో వుండే శిల్పసౌందర్యం లోపిస్తుంది ......ద్రవ్యాపేక్ష వుండనేవుంది...."

(జాక్ అలెగ్జాండరు. ఆంధ్రపత్రిక 31—1—41.)

కంఠంలోనించీ లయతోకూడా శబ్దమొస్తుంది! కాని అది నవ్వుగా ముఖంలో కనపడదు! ఇది భావప్రకటనకు మచ్చు! ఈ దినాల్లో నాట్యకళాపరిషత్తు జరపడానికి ప్రయత్నించటమంత వెర్రిలేదు! సినిమా కళాపరిషత్తు వచ్చింది! వాళ్లే నాట్యకళాపోషకులు! నాట్యరంగం మూలబడ్డది! సినిమా ద్రవ్యం లభింపజేస్తున్నది! ఇక వీళ్ళకు నాట్యరంగంమీద శ్రద్ధవుండమంటే యెట్లావుంటుంది? ఆంధ్రపత్రికలో "రాజు" యిట్లా వాపోయినాడు. "ఆదర్శ నాట్య మందిర నిర్మాణం, ఆధునిక నాటకరచనా ప్రయత్నం, ఉత్తమనాట్య శిక్షణాలయం, యీ మొదలైన పరిషత్తాశయాలు ఈడేర లేదు.

---

సినిమా అడ్వర్ టైజుమెంటు యెటువంటి నిరర్థక, అసభ్య, ద్వేషపూరిత, సంప్రదాయ నిరసనపూరిత, చివరకు—మాటలతో నిండుంటై! మచ్చుకి—

"ముడుపులు, నిలువుదోపిళ్ళు, పదహారు బాహువుల్తో నిలబెట్టినారే, వారి విలాసాలకు యేర్పాటుచేసుకున్నవి! డబ్బులేకపోతే వారికి మకరకుండలాలు, సింహతలాటాలు, ఛత్రచామరాలు, బహుపరాకులు, పవళింపుసేవలు యెలావస్తాయి?"

(ఆంధ్రపత్రిక 31—1—41)

ఇట్లా రాయకపోతేనూ, ప్రజలను మోసంచేసే చిత్రాలనూ, సంభాషణలనూ కల్పించకపోతేనూ, సినిమా డైరెక్టర్లకు భవనాలూ, మోటార్లూ, యితర ప్రాపంచికానందాలూ యెట్లావస్తై? సినిమాలు రాజకీయ, సాంఘిక, నైతిక సమస్యలను తీరుస్తై అని ప్రకటనలు! వక్కటిమాత్రం నిశ్చయం. కొందరి ఆర్థికసమస్యలను మాత్రం తీర్చినై! తీరుస్తున్నై! ప్రచారం, అడ్వర్ టైజుమెంటు, నాగరకతాప్రారబ్ధాల్లో కొన్ని.

*1941 October "Torch"* పత్రికలో సినిమాకళయొక్క ప్రస్తుత అపాయస్థితిని గూర్చి సంపాదకుడు యిట్లారాశాడు.

*"A new terrorist type of vile opportunists have come into existence in our land, and their power to delude and exploit the masses is growing day by day. They are the educated malcontents. They take particular pride in parading their morbid modernism, and pose themselves as the leaders and liberators, philosophers and guides of a new India. They are a greater danger to our culture and country than the old-fashioned and but-disappearing priests and plutocrats."*

కొంతకాలం నడిచి పరిషత్పత్రికకూడా మధ్యనే నిల్చిపోయింది.” “క్షీణిస్తూవున్న నాటకరంగాన్ని (కంట్రాక్టునాటకాలవల్ల)టాకీలువచ్చి వక్కతన్ను తన్నాయి. అంతటితో ఆంధ్రనాటక రంగానికి వెన్నెముక విరిగినట్టు అయింది.” “టాకీలు మనదేశానికి కొత్తగావచ్చిన విజ్ఞాన సాధనాలవటంచేత మొదటిరోజుల్లో ప్రజలమీద మచ్చుమందు చల్లగలిగాయి. ఇప్పుడిప్పుడే ప్రజలా మైకంనించీ తేరుకుంటున్నారు.” ఈన యిట్లాఅన్నాడు గాని నాకింకా నమ్మకంలేదు. కాని మద్రాసులో కె. లక్ష్మయ్యగారి సంపాదకత్వం కింద మళ్లీ “నాట్యకళ” పత్రికప్రచురణసాగింది. చాలా సంతోషం. బెజవాడ రామచంద్రా రెడ్డిగారి వంటివారు తలుచుకుంటే తప్ప యీ ఉద్యమం అవిచ్ఛిన్నంగా జరగదు. సంపాదకులు, వ్రాయసగాండ్లు దొరుకుతారు. కాని “తండులాలు” సమకూర్చే లక్ష్మీపుత్రు లవసరం! సి. ఆర్. రెడ్డి ప్రభృతులు సందేశాల నంపారసడం యేమీ ప్రయోజనకారి కాదు. ఇటువంటివారి, ఆశీర్వాదాలు పొందిన చాలా సంస్థలు అంతరించినై. తుదకు పత్రిక ఊరికే పంపాలశిందే గాని కొనను కూడా కొనరు వీళ్లు. పునరుద్ధరించడం చాలా సంతోషం. ఇక అంతరించకుండా ఉండటం సాహిత్యసేవకుల ఆశయం! టాకీ యుగంలో యీ నాటక కళోద్యమం యేటి కెదురీత! సినీమాకళనూ, నాటకకళనూ, సమ్మేళనచేసి వక నూతనకళను సృష్టించుట మవసరమని నీలంరాజు శేషయ్య చెప్పాడు. అన్నిమార్గాల్లో నూతనత్వం కావాలనే యువకులు చేయవలసిన పని అది! నాటకకళ యొక్క సంపూర్ణనాశనం కావచ్చు దీనివల్ల! ఈ పరిషత్తూ, పత్రికా, మళ్ళీ వాద ప్రతివాదాల్లో కొచ్చింది. (23–11–40 తేది కృష్ణాపత్రిక, 29–11–40 తేది ఆంధ్రపత్రిక, 27–12–40 తేది ఆంధ్రపత్రిక, చూడండి). ఈ సందర్భంలో పరిషత్తు కర్త

వ్యాన్ని గూర్చి 24-1-41 తేది ఆంధ్రపత్రికలో ఓగిరాల వెంకట సుబ్బారావు, మల్లాది వెంకటేశ్వర్రగార్ల వ్యాసాలు చూడండి. కాకినాడలో శ్రీ కట్టమంచివారి, పిఠాపురం ఉయ్యూరు యువరాజు గార్ల యాజమాన్యంకింద ఆంధ్రనాట్య కళాపరిషత్తు జరిగింది. దానివల్ల యెట్టిప్రయోజనమూ లేదని 26-2-41 తేది ఆంధ్రపత్రిక రాశింది.

## వ్యావహారిక భాషోద్యమోద్దేశం:

ఇప్పుడింత చెప్పినతర్వాత నాకొకటి-విషయం తడుతున్నది. ఈ తిరుగుబాటుద్యమానికి మూలమేమిటి? వెనకటి కవులరాతలను సామాన్యప్రజలు అర్థంచేసుకోలేకుండా వున్నారనీ, అవి సామాన్య ప్రజల దైనందిన జీవనాన్ని చిత్రించడంలేదనీ, కవులు యెక్కడో స్వర్గంలోనో, నందనోద్యానంలోనో, మన మనస్సు కందనిచోట్ల కొత్త మనుషులతో విహరిస్తున్నారేగాని, ప్రతిదినమూ మనం చుట్టూచూసే సన్నివేశాలు వాళ్లనాకర్షించటంలేదనీ, కవి పాఠకుణ్ణి సాక్షాత్తుగా యెదటవుంచుకుని మాట్లాడటంలేదనీ, కవి తన అనుభవాలను చెప్పటం లేదనీ, మొదలైన అభిప్రాయాలన్నీ కలసి యీ తిరుగుబాటుద్యమాన్ని సృష్టించినైయని మనం తెలుసుకున్నాం. పరిణామాన్ని వకటి-మాటు మనస్సుకు తెచ్చుకొని పైన చెప్పినవాటిలో యెన్నిటిని యీ నవ్యసాహిత్యం సాధిస్తున్నదో చూస్తే, అసలు మూలోద్దేశాలు సఫలం కాలేదనే చెప్పాలసొస్తుంది. చక్కని శబ్దచిత్రాలనూ, నవ్య గ్రథనాలనూ కల్పించారు. వీటిలో సామాన్యప్రజల కర్థమయ్యే వెన్నున్నై? వెనక సహృదయులకే క్లేశం కల్గించేవాటిని చూశాం! వీళ్ళవి చిన్నగీతాలూ ఖండకావ్యాలూకూడా, గూఢంగా ఆపాతతః అర్థంకాకుండా వుండడం వక విశిష్టగుణం! గూఢతా క్లిష్టతాదులీ నవ్యపద్యసాహిత్యానికి కాఠిన్యాన్నిచ్చినై గాని సౌలభ్యాన్నియ్య లేదు! సంగీతంతో పాడినంతమాత్రాన సౌలభ్యం వస్తుందా!

పాడినసంగీతం హాయినియ్యొచ్చు! కథసంగతి ఆలోచిద్దాం! కొందరు మాత్రం గుడిపాటి వెంకటచలం, మునిమాణిక్యం, మొకపాటి, చింతా మొదలైనవాళ్లున్నారు. వాళ్ల రాతలు సామాన్యంగా చదవ లేక వినేవాళ్ళకూడా అర్థమై సంతోషాన్ని కలగజేస్తై! కాని అందరి రాతలు యిట్లా అనడానికి వీల్లేదు. సంస్కృతపద సమ్మేళనం! చిట్ట చివర ప్రత్యయం మాత్రం తెనుగు! ఇటువంటి రచన సామాన్యుల కెంతమాత్రం అర్థంకాదు. అనేకమంది రాతల్లోనించీ చూపవచ్చు. వేదులవారు పద్యం భావగూఢంగారాశినా, ఆయన "అనితమ్మ" కథలో వచనం మాత్రం చాలా సాఫీగావుంది. సౌలభ్యానికి ఆదర్శ ప్రాయంగా వుంది. వేలూరి శివరామశాస్త్రిగారి రాతలవంటివి వకప్పుడు శబ్దజటిలాలే కాకుండా, అన్వయకాఠిన్యం కలిగి కొన్ని వేళల కట్టెలల్లే బిగిసిపోయివుంటై.* ఈవిధంగా పరిశీలిస్తే యీ నవ్యసాహిత్యం మొత్తంమీద గిడుగువారివంటివాళ్ళ ఆశయాలు పూర్తిచెయ్యలేదనే నాకుతోస్తుంది. కాని ఆయన మాత్రం వీళ్ళకు చాలా ప్రోత్సాహమిచ్చి వీపుమీద తట్టుతూనే వుం డేవాడు. దానికి కారణం వాళ్ళరాతలు మొత్తంమీద చ్యుతసంస్కా రాలుగావుండటమే! ఆయనకు పూర్వవ్యాకరణాన్ని నిరాదరించడమొక అవశ్యకార్యం! ఆయన వొకొక్కప్పుడు అటువంటిభాషనే వాడేవాడు! ఆయన శిష్టవ్యవహారం వాడమనే ప్రోత్సాహం చేశేవాడు. ఇట్టిదే శిష్టవ్యవహారభాషైతే యిది సామాన్యజనానికి సులభగ్రాహ్యం కా దనే చెప్పాలె! ఇక గిడుగువారి ఆదర్శమేమైందో ఆలోచించండి! ♦

* శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి రచనకూడా చక్కగావుంటుంది. కొంపల్లె జనార్దనరావుగారి గద్యశైలి నాకు అర్థమయ్యేదికాదు.

♦ వ్యాసం మొదలైనవాట్లలో యిటువంటి శైలే రాస్తున్నారు కొందరు. అందులో సాహిత్యవ్యాసాలు కొందరివి, జమ్మలమడక మాధవరామశర్మ మొదలైన వాళ్ళవి విషయవిమర్శకాలుగా వుంటాయిగాని క్లిష్టాలుగానూ, అర్థకాఠిన్యం కలవి గానూ ఉంటాయి. అయితే విషయాన్నిబట్టి భాష ఉపయోగించాలశోస్తుంది. మరి వాళ్ళేం చేస్తారు!



కళకు కళయే ప్రయోజనము (Art for the sake of art):

ఈ సూత్రమిాకాలంలో అమల్లోకి వచ్చింది. వెనకటి వింశతి వర్షకాలంలోనే మొదలెట్టి కొంచెం కొంచెం వ్యాపించి యీకాలంలో నవ్యులలో చాలామందిలో గట్టిపడ్డది. సభాపతివంటివాళ్ళు తాము మౌనం వహిస్తూ శిష్యులచేత చెప్పిస్తూవుంటారు. అసలు యిట్టి విషయం మన పూర్వలాక్షణికులకు తట్టిందో లేదో చూదాం! వాళ్ళు చెప్పిన కావ్యప్రయోజనాల్లో రెండూ వున్నై! "కావ్యం యశసే, అర్థకృతే, వ్యవహారవిదే, శివేతరక్షతయే, సద్యఃపరనిర్వృతయే, కాంతాసమ్మితతయోపదేశయుజే." ఇక్కడ రెండు భాగాలుగా అవుతుం దీ సమస్య.

(1) కవికి తన స్వానందమేగాక పరానందంకూడా ప్రాప్యమూ ఆదర్శమూనా? లేక కోకిలపాటల్లే తనకూ, యితరులకూకూడా నిరర్థకమై సహజమూ?

(2) కళకు అందులో కావ్యకళకు నీతి ఆదర్శంగా వుండాలా? అక్కరలేదా?

పై సంస్కృత లాక్షణిక వాక్యంలో రెండూ ఉన్నై? 'సద్యఃపరనిర్వృతయే' అన్నప్పుడు యెవ్వరి నిర్వృతి? రచయితదా? పఠితదా? పై వాక్యంలో అది వివరంగా లేదు. ఇద్దరి ఆనందం అనే చెప్పాలె. ఇది సమంజసం! ఎందుకంటే, కవి తా ననుభవించే ఆనందం యితరులకు కలగజేస్తాడు. తాను ముందానందంపొంది తదనురూపానందం యితరులలో కలగ చేస్తాడు. ఇక్కడే నటకుడికీ కవికీ భేదముంది. ఇద్దరికి చాలా పోలికలున్నై. కాని పై విషయంలో మాత్రం కొంచెం భేదముంది. ఎప్పుడూ నటుడు తాను నటిస్తున్నాననే భావం మరవ

కూడదు. కాని కవి తాను వర్ణిస్తున్న వస్తువులో రసంఆస్వాదించవచ్చు, ఐక్యం పొందవచ్చు. తాను సృష్టించిన రాతల్లో లీనుడుకావచ్చు. ఈకింది విమర్శక వాక్యం చూడండి. "ఇంద్రియములు రసస్నిగ్ధములై నప్పుడు విషయరాజ్యము ఆనందరసముయొక్క విలాస భూమిగ గన్ప ట్టును"(సమీక్ష). కళాకర్తల కందరికీ యింతే. ఇంతశ్రమపడి వాళ్ళు రచించే గ్రంథంగానీ, చిత్రంగానీ, అనుకరణమే! ఎందుచేత? అందులో పాత్రలు అసలువాళ్లుగారు. వారికి మేదోమాంసాలులేవు. వాక్చిత్రం చేత కావ్యంలోనూ, ఆకృతిచిత్రంచేత చిత్రకళలోనూ, ఉన్నట్టు కన పడతారు.* మొదటిది మనోగోచరం! రెండోది యింద్రియగోచరం! మనస్సు బాహిరంగాక ఆంతరమైనా, దానికికూడా యింద్రియత్వం యిచ్చారు మనవాళ్లు! "మనష్షష్ఠానీంద్రియాణి" అన్నాడు శ్రీకృష్ణ పరమాత్మ! అనగా సాక్షాదింద్రియం కాకపోయినా యింద్రియ గుణాలు కలది. ఇంద్రియాత్మలమధ్య తార్పకర్తె మనస్సు! "ఆత్మామనసాసం యుజ్యతే, మనఇంద్రియేణ, ఇంద్రియమర్థేన" అన్నాడు శాస్త్రకారుడు.

"విశ్వముయొక్క బహిర్ద్వారములు బంధింపబడి యుండుటచే, విశ్వాంతరమున నిర్మల కాంతితో వెలుంగు నాత్మానందము సామా న్యులకు ప్రాప్యముగాకున్నది. ఈ బహిర్ద్వారములను తెరచి-యం వలి యాత్మస్వరూపమును చూపగల తాలపు చెవియే-విశ్వాత్మయొక్క

*అడివి బాపిరాజొకచోట యిట్లా అన్నాడు. "కవిత్వమునందున్నూ, సంగీతము యందున్నూ అనుకరణము అనలేలేదు. ప్రకృతి వున్నది వున్నట్లు చెప్పడం అనుకరణంకాదు." పాపం యీ వాక్యంలోనే కాదంటూ అవునని చెప్పాడు. "ఉన్నది ఉన్నట్లు చెప్పడం" అనేదాన్లోనే అనుకరణమని తేలుతున్నది. మాతృకవున్నది. ఉన్నట్టు చెప్పడం అను కరణం. ఉన్నట్టు చెప్పడంచేత ఉన్నది కాదిది. ఉన్నదాన్ని చెప్పడంచేత అనుకరణ మైంది. ఇక్కడ సంగీతం సంగతి మనకక్కరలేదు. తర్వాత వాక్యంలో యింకా స్పష్టంగా చెప్పాడు. "అది వర్ణించడం". అంటే అసలుదికాదు వర్ణన అన్నమాట! అంటే మళ్ళీ అనుకరణమే! చిత్రంకూడా యింతే.

*Vide*-(లలితకళలు లక్ష్మణరాయ వ్యాసావళి)

మూర్తిస్ఫురణమును చర్మచక్షువులకు గోచరింపజేయు జ్ఞానాంజనమే-యీ కళా గ్రహణం చర్మచక్షుస్సుచేతనే అయినా యీ ఆనందం అనుభవించేది మనస్సుద్వారా ఆత్మే! కాబట్టి ఆత్మ స్వరూపాన్ని తానుచూచి యితరులకు చూపేవాడు నిజమైన కవి!

యీ కళవల్ల ఆనందం యిద్దరికీ ప్రాప్యమే! నవ్యులు తమను కోయిలలుగా చిత్రించుకోడం వక పరిపాటైపోయింది. ఆంధ్రజాతికి వసంతకాల మొచ్చింది. ఆ వసంతంలో తాము కోయిలలు. ప్రకృతి సిద్ధంగా పాడుతున్నారు. పాడడానికి కారణం వసంతాగమనం కోయిలకు. వీళ్ళక్కూడా జాతిలో ఉత్పన్నమైన నూతనశక్తే కారణం. ఇంతవరకే సరిపోతుందిగాని సామ్యం తరవాత పట్టదు. ప్రకృతి జడం. కోయిల అజ్ఞాని. కాబట్టి యీ సాదృశ్యం పూర్తిగా వర్తించటానికి వీల్లేదు. జాతిజడం యెంతమాత్రం కాదు! తమను కోకిలల వలె అజ్ఞానులనుకునేటట్టైతే అది ఆత్మవంచనే! కోకిలపాటకు సంపూర్ణసాదృశ్యం తీసుకుంటే మరో విప్రతిపత్తుంది. కోకిలకు మనం వింటున్నామనే జ్ఞానం లేదుగాని మనంమాత్రం వింటున్నాము. అట్లాగే కవి మనకోసం పాడకపోయినా అతనిపాట మనకు వినపడి ఆనందమో జుగుప్సో పొందుతూనే వున్నాము. దానివల్ల మన చిత్తవృత్తిలో కల్గిన మార్పును మనం వెల్లడిచేస్తే, కోకిలకు యేం తెలియనట్టు కవికూడా యేమీ తెలియకుండా వుంటాడా? అట్లా వుండేటట్టైఅయితే యీపద్యాలద్వారా తమ ప్రచార మెందుకు? తమ యీప్రవర్తనే యితరు లనేమాటలకు తమరు సమ్మతో అసమ్మతో తెలుపుతున్నారని నిరూపిస్తున్నది! కాబట్టి యీవాదం చెయ్యడమే తమవాదానికి బలహీనం తెచ్చిపెడుతున్నది. ఉదాహరణం కారణ మెప్పటికీకాదు. అది సాదృశ్యకల్పనతో విషయగ్రహణ సహకారేగాని, అంతకంటె యెక్కువపని చెయ్యలేదు. కోకిలాసాదృశ్యాన్ని ఏళ్ళాలంకారికంగా చెబుతున్నారని గట్టి పడుతున్నది! ఇంతమాత్రం

చేత ఏకమూలసూత్ర నిర్ధారణంచెయ్యటంయెంతమాత్రం పనికిరాదు. అజ్ఞానైన కోయిలతో తమను పోల్చుకోటమే ఏకలోపము! పైగా దానిని ఏక కారణంగా గ్రహించడం అంతకంటె గొప్ప పొరబాటు! వసంతా గమనమూ, తత్కార్యమైన కోకిలాగానమూ, రెండూకూడా అవినా భావసంబంధంకలవి. ఇలాగే యిటువంటి సంబంధమున్న అనేకవిషయా లున్నై! కాని కోకిలాగానం చెవులకింపుగావుంటుందనీ, వసంతం యెప్పటికప్పుడు నూతనత్వం కలది కాబట్టేన్నీ, దీన్ని గ్రహించారని నా అభిప్రాయం. అంతకంటే యీ సాదృశ్యాన్ని దూరం తీసుకుపో గూడదు. కావ్యం, గానంచేసే కవికీ, చదివే పాఠకులకీ ఆనందం కలగ చేస్తుంది. కోకిలాగానంవలె వినేవాళ్ళకుమాత్రము కాదు. నిరర్థకమూ గాదు. తెలియకుండా గానంచేసే కోకిలాగానం వంటిదీకాదు. కార్లై లను మహాకవి కవిని ప్రవక్త (Prophet) అన్నాడు. ప్రవక్తంటే ఏక సందేశాన్నిచ్చే వ్యక్తి అన్నమాట. ఏక సందేశమూ, యిచ్చేవారూ, పుచ్చుకునేవాళ్లూ అనే మూడువస్తువులున్నై!* లోకంలో ప్రతి వ్యక్తిచేసే అన్ని కార్యాలూ యితరులకు సంబంధించినవి కాక పోయినా వాటిలో కొన్నిమాత్రం స్వసంతోషానికే కాకుండా పర సంతోషానికూడా చేస్తూవుంటాడు. భార్య భర్తసంతోషం కోసం పాటుపడుతూవుంటుంది. భర్త భార్యా సంతోషంకోసమూ, తల్లి తన పిల్లవాడికి సంతోషంకూర్చడానికీ, యీవిధంగా యితరుల సంతో షంకూడా కర్తకు ప్రాప్యంగా వుంటుంది. తుదకు బట్టకట్టుకోడం తనకొరకూ యితరులకొరకూ కూడాను. బుద్ధిపూర్వకంగా నగ్నతను ఆచరణలో పెట్టేవాడు, వేదాంతైనా, పిచ్చివాడైనా కావాలె!♦ ఇటువంటివాళ్లు అత్యల్ప సంఖ్యాకులు. కాబట్టి "ప్రయోజన

---

* ఈ అనుబంధత్రయం మోక్షుందాకా అను వృత్తం.

♦ ఇప్పుడు యీ రెండూకాని నగ్నవాదులు జీవితవిషయంలోనూ; కళా విషయంలోనూ వున్నారు! ఇక్కడ వాళ్ళను నేను గ్రహించడం లేదు.

(*Dadaism, Nudism.*)

నునుద్దిశ్య నమందోపి ప్రవర్తతే" అన్నట్టు ప్రయోజనం కోరకుండా యెవ్వడూ యేపనిని శ్రమపడి చెయ్యడు. ఆ ప్రయోజనాన్నే స్వ పరుల నుద్దేశించి చేసేది కావ్యం! ప్రేయసికోసం పరితపిస్తూ, దుఃఖ పడుతూ, ఆహ్వానమిస్తూ, ప్రేయసినే వస్తువుగా గ్రహించినకవి, నా తృప్తికొరకే నేను పాడుతున్నాననడం, నేను పాడుతున్నదాని అర్థం నాకే తెలియదనడంకంటె హాస్యాస్పదమైన విషయం లేదు. కవి పాఠకులు పరస్పరం అవినాభావసంబంధం కలవాళ్లు. ♦

♦ భామహదండివామనులు పూర్వభారతీయ లాక్షణికుల్లో కావ్యప్రయోజనాల్లో కర్తకు కీర్తిన్నీ పాఠకుడికి ప్రీతిన్నీ నిర్ణయించారు. ఇందులో కవితోపాటు పాఠకుడికికూడా యీ లాక్షణికులు కావ్యప్రయోజనాల్లో సమభాగిగా చేశారు. సహృదయుణ్ణి వదిలితే కవికి గతిలేదు. అల్లసానివాడు "ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్ దొరకిన గాక, ఊరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే!" అన్నాడు! అలౌకికానందం కావ్యప్రయోజన మన్నప్పుడే సహృదయుణ్ణికూడా కలుపుకున్నట్టు స్పష్టం! ఆర్నాల్డు బెన్నెటు అనే ఆంగ్లవిమర్శకుడు "సహృదయత్వం" (*Literary taste*) లో *The aim* అనే అధ్యాయం చదివితే సత్యం తెలుస్తుంది. కవికి కావ్యం రాయటానికి యెంత విజ్ఞానం కావాలో సహృదయుడికి కవిహృదయ ప్రవేశంచేసి తానానందంపొంది యితరులకు కవి సందేశం చెప్పటానికి అంత విజ్ఞానమూ హృదయవికాసమూ, కావాలె! కార్లైలేమన్నాడో చూడండి.

"Criticism must be like an inter-preter between the inspired and the uninspired, between the prophet and those who hear the melody of his words." (ఉద్రిక్తులకును, ననుద్రిక్తులకును మధ్య అనగా ప్రవక్తకును, నాయన వాక్యరసమును విను సామాన్య ప్రజలకును, మధ్య వ్యాఖ్యాతవలె విమర్శకుడుండ వలెను.) ఈ వాక్యంలో విమర్శకకృత్యాన్ని ఉగ్గడించాడు కార్లైలు! విమర్శకుడనేటప్పటికే సహృదయుడు రంగంమీదికొచ్చాడు.

కోరిలెడ్జి యేమన్నాడో చూడండి. "Not the poem that we have read but that to which we return possesses the genuine quality of poetry."

"మనము చదివిన గ్రంథముగాక యేగ్రంథము పునఃపఠింతుమో యది యుత్తమ కావ్యమనదగినది."

ఇందులో "We" అనే పదంతో వాచ్యులెవరు? పాఠకులన్నమాట! ఏజాతి వాఙ్మయంలో విమర్శనమెక్కువగా పెరుగుతుందో అది ఉత్తమమైందనిగుర్తు! విమర్శన మంటే సహృదయకృత్యం!

ఇక రెండో సంగతి కొద్దాం. శాస్త్రకారుడు యిదికూడా "కాంతాసమ్మిత తయోపదేశయుజే" అని చెప్పాడు. ధర్మబోధ కావ్యప్రయోజనాల్లో వకటని మొదటి లాక్షణికులు కంఠోక్తిగా చెప్పారు. తర్వాతవాళ్ళు చాలామంది వప్పుకున్నారు. కాని యిటీవల అనగా 200 సంవత్సరాలమధ్య వున్న కొందరు నవ్యలాక్షణికులు యీ ధర్మబోధకత్వాన్ని కొంచెం రెండో రకంకిందికి దింపారు. మొదటి మొదటి లాక్షణికులు ధర్మంమీద చాలా వ్రాశారు. వారిలో భామహుడు మిగిలిన శాస్త్రాలవలెనే దీన్ని చేసి మోక్షం ప్రాప్యమనికూడా రాశాడు. తర్వాత లాక్షణికులు కొంచెం యీ అభిప్రాయాన్ని వెనకపెట్టి అలౌకికానందాని కెక్కువ ప్రాముఖ్యమిచ్చారు. వీరు రసవాదులు. వీరికి ధర్మంకంటె రసం ప్రధానం కాబట్టి దానికి ప్రాధాన్య మిచ్చారు. కాని వెనకటి "కాంతాసమ్మిత తయోపదేశయుజే" అనే అంశాన్ని బొత్తుగా వదలలేదు. ఈ ఆనందం ఆంగ్లలక్షణ కర్తలయొక్క అభిప్రాయానికి దగ్గరకొస్తుంది. ఈ వాదాన్ని మన నవ్యులు అనుకూలంగా వుందని గ్రహించారు. ఈ వాదానికి ఆధునిక విమర్శకుల్లో ముఖ్యుడు కట్టమంచి.

"కావ్యము, శిల్పము. నీతిశాస్త్రముకాదు. ధర్మశాస్త్రము కాదు. శిల్పముయొక్క యుత్కర్షనికర్షముల నేర్పరుపవలయునన్న దానిరచనాసంవిధానములబట్టి నిరూపింపనగునేగాని, భగవద్గీతల యంతపారిశుద్ధ్య మిందులోలేదు. రామానుజభాష్యమువలె ముక్తిదాయకముకాదు. అని వాపోవుట నిర్నిమిత్తప్రలాపము. ... ......... శిల్పముయొక్క ముఖ్యోద్దేశము మనసును హరించుట. ఈ వశీకరణశక్తియుండినయెడ నీతిలేకున్న నేకొదువయు లేదు. అదిలేనిచో నుపనిషత్తుల నుడుకబెట్టి ధృతియంతయుతీసి యందునించినను నేఫలమునులేదు. కావున మన భాషకు నీతి ముదురునట్లు చికిత్సదోహదము, ప్రాయశ్చిత్తము చేయవలయునను పరమ పారిశుద్ధ్య

పురంధరుల కొకదండముపెట్టి దూరముగ బొమ్మనుటయే కర్తవ్యము"
ర్కంతో పాటు దూషణతో తన వాదాన్ని సాధించటానికి ప్రయత్ని
స్తున్నాడీన! నీతి అంటే యీాన కంత కంటకమై పోయింది. తానొక
సంఘంలోవుండి సంఘ నీతిని తృణీకరించడం భావ్యంకాదనీ, యేదో
ఒక సూత్రానికి బద్ధుడుకాని వ్యక్తి సంఘానికి ఉపద్రవకారనీ మనవి!
ఇప్పుడు (1) నీతిప్రాధాన్యం, (2) నీత్యప్రాధాన్యం, (3) అవినీతిబోధ
అనే మూడు అంతస్తులున్నై! అవినీతిని బోధించమని మాత్ర మీాన
చెప్పలేదు. అందుకు యీానకు వందనాలు. లేకపోతే యీాన మార్గా
నుయాయులగు నవ్యుల కావ్యాలన్నీ అవినీతిబోధకాలయ్యేవి! నీతిని
సంతో క్తిగా బోధించనక్కరలేదన్నారు. ఒప్పుకున్నాం! అది ప్రధానాం
శంగావుండనక్కరలేదు! ఇది మనలాక్షణికులు "అలౌకికానందవాదులు"
నొప్పుకున్నదే! కాబట్టి అక్కడకూడా విప్రతిపత్తిలేదు. ఇక మిగిలిన
దేమిటి? నీతి అనేది ప్రధానంగా ఉండనక్కరలేదు. ఈ విషయాన్ని
చెప్పటానికింత కాఠిన్యమెందుకు? నీతి, ధర్మము, అని రెండుపదాల
నుపయోగించాడు. నీతి ధర్మాంతర్గతం. ధర్మమనేది చాలా గొప్ప
విశాలమైనపదం. ఇందులో మానవుడి ప్రవృత్తిఅంతా యిమిడివుంది.
శిల్పంకాబట్టి కావ్యానికి ప్రాప్యం "మనసును హరించుట" అన్నాడు.
ఈ హరించటం నీతిబోధ ద్వారాగాని ధర్మబోధద్వారాగాని కాదు!
మాకూ యిష్టమే! అవినీతీ అధర్మం బోధిస్తూకూడాకాదు! అదికూడా
ఈనకు అసమ్మతేననుకుంటాను! ఇక మిగిలినది "నీతిలేకున్న నేకొదవా
లేదు." అనే వాక్యంలోవున్నది ఈన సిద్ధాంతం. ఇది "అనలంకృతీ
పునఃక్వాపి" అనే మమ్మటవాక్యం వలె వుంది. అక్కడెట్లాగైతే "అవస
రాన్నిబట్టి" అని అర్థం చేసుకున్నామో, అట్లాగే యిక్కడకూడా "అవ
సరమైతే నీతిని బోధిస్తూ" అని యీానవాక్యాలకు నేను భాష్యం రచి
స్తున్నాను. "మనసును హరించుట" "రససంపోషణము" అనే మాటలు
వక్క అర్థంలో ఉపయోగించాడనుకుంటాను. "రసానుభవం" అన్నదాని

కంటె "మనసును హరించుట"అనడం చాలా పేలవంగావుంది. "మనసు" అన్నచోట రసానికి కావలసిన అలౌకికత్వం బొత్తుగాశూన్యమై చాలా కిందిమెట్టులో వుంది. "రసంవల్ల కలిగేది ఆనందం. దాన్ని పొందేది ఆత్మ." అంటేగాని ఆ అలౌకికత్వంరాదు. "పరనిర్వృతి" కాజాలదు. భార్య ఉందనుకోండి! మాటలచేతా విలాసాలచేతా "మనసును హరిస్తుందను"కోండి! కాని ప్రవర్తనలో కొంచెం స్వచ్ఛందనుకోండి! తత్కాలానికి "మనసును హరిస్తు"న్నదికదా అని ఆమె శీలాన్నిగూర్చి కళ్లు మూసుకుని ప్రవర్తించగలడా భర్త? కాబట్టి "మనస్సును హరించటమే" ముఖ్యమైనప్పటికీ, ఆమె ప్రవర్తనలో నీతినికూడా, యెట్లా ఆశిస్తామో, అట్లాగే కావ్యానికి రసమే ముఖ్యమైనప్పటికీ నీతినీ ధర్మాన్నీకూడా అట్లాగే ఆశించటం కర్తవ్యం. వకవేళ తత్కాలానికి "మనసును హరిస్తే" చాలని "సద్యః" శబ్దంచేత గ్రహిస్తారేమో నాకు తెలియదు! ఆశబ్దం యీకావ్యపఠనంవల్ల వచ్చే ఆనందం మోక్షంకంటె భిన్నమని చెప్పడం కోసముపయోగింపబడ్డది! అంతేకాని ధర్మబోధకత్వాన్ని కొట్టివెయ్యడానికికాదు. ఇక్కడ లాక్షణికుడి కొన్నివాక్యాల ననువదిస్తాను.

"యథాకామినీ, కటాక్షవీక్షణాదివిలాసైరేవ కామినమావర్జయంతీ, 'మమేదమభిలషితంకురు అనభిలషితంమాకురు' యిత్యనుక్త్వైవ సర్వం సంపాదయతి, తథాకావ్యశ్రీరపి వ్యంజనావ్యాపారమాత్రపరత్వేన ఉపసర్జనీ భూతశబ్దార్థతయా...సహృదయ హృదయాహ్లాదికారిణా వ్యంజనావ్యాపారేణైవ 'రామాదివద్వర్తితవ్యం నతురావణాదివత్' యితిపుంసః కర్తవ్యేప్రవర్తయతి నివర్తయతి చాకర్తవ్యాత్ యిత్యస్యాః కాంతాసమ్మితత్వమవగంతవ్యం" వ్యంజనద్వారా రసప్రధానమై నీతిబోధకత్వం అప్రధానంగా ఉండచ్చు కావ్యంలో అంటే వీరికి సమ్మతమేననుకుంటాను!

కవులనుకూడా అలౌకికులు (బ్రహ్మలు) లౌకికులు అని రెండు.

భాగాలుగా భవభూతి విభాగించనే విభాగించాడు "వశ్య వాక్కులు వాగ్వశ్యులు"నని. ఈ సందర్భంలో మరోవిమర్శకుడి వాక్యాలుకూడా మనవిచేస్తాను. "మనస్సునకు చమత్కారమును నానందమును గూర్చుటయే కళల ముఖ్యోద్దేశమైనచో వాని స్వతంత్ర ధర్మమే నశించును. కళల ప్రయోజన మింతకంటెను నెక్కువ యున్నతమైనది. సత్యము సుందరమైనప్పుడు, భావము పంజరమునుండి మొగయు విహంగమువలె విముక్తినొంది యనంతపథమునకు ప్రాకును. మానవప్రకృతి యుజ్వలితమైన వెంటనే ప్రాణము నృత్యము సేయును. ఆత్మయొక్క నిజసౌందర్యము బహిర్గతమగును. భవబంధములనుండి విముక్తినొందు భావము - ప్రాణవిలసనము మూలమున వ్యక్తమగు నాత్మ సౌందర్యము - కళలయందు మూర్తీభవించియున్నది. కళయన రససృష్టి! కళయన విశ్వాంతరాళమునుంచి వెలికివచ్చు నమృతకలశము" (సమీక్ష). ఇక్కడ చూశారా యీ కళకు వెనకటి ఆయన వలెగాక యెంత ఉదాత్తత యిచ్చాడో! ఇటువంటి దృష్టిలో నీత్యవినీతులకుగాని, ధర్మాధర్మములకుగాని, తుదకు యెట్టి ద్వంద్వాలకుగాని చోటులేదు. కళ వీటి కన్నిటికీ అతీతమైందని యీ విమర్శకుడి అభిప్రాయం. "మనసును హరించుట" అనేది చాలా నీచమైనకళాప్రయోజనం. అదిలౌకికమేగాని అలౌకికంకాదు. అను వాదం మొదటి వాక్యంలోనేవుంది కళాప్రయోజనం "మనసును హరించుట" మంత నీచంకాదని. ఈ ఆనందం మనస్సునుదాటి యెప్పుడు ఆత్మసంబంధి అవుతుందో అప్పుడది అలౌకిక మవుతుంది. ఈ కింది మాటలను చూడండి. "ఈవిశ్వము జడముకాదు. జడత్వము మనమనస్సునందున్నది. మన మనస్సుయొక్క వ్యభిచార దోషమువలన రూపమాధుర్యముల యందుండు దివ్యసుందరుని జడునిగజేసి విశ్వము జడమని చెప్పుచున్నాము." చూశారా మనస్సుయొక్క పరిమితి. ఆత్మఅట్లాగాదు. అది అవిచ్ఛిన్నమైన ఊట వంటిది. స్వచ్ఛము, విజ్ఞానమయము. మనస్సుఅనేది సామాన్యజ్ఞానాన్ని

యింద్రియములద్వారా గ్రహిస్తూ వుంటుంది. మరొక అనువాదం చూడండి. "మానవుని సామాన్యజ్ఞానమునకు విశ్వములోని యనంత రహస్యము గోచరముకాదు. ప్రకృతిగతమైనయాత్మకును మానవాత్మకును ననవరతము జరుగుచుండు రమ్యక్రీడ శుద్ధ మానవచింతకు గోచరమగు విషయముకాదు." కాబట్టి యేది మనుష్యుడు జ్ఞానమనుకుంటున్నాడో అది సామాన్యజ్ఞానము. అదిమనస్సుకు సంబంధించినది. ఆత్మ దీనికిపైది. హృదయమే ఆత్మకు స్థానం. "పద్మకోశ ప్రతీకాశం హృదయం చాప్యధోముఖం.........తస్యాం తేసుషిరం సూక్ష్మం... ......తస్యమధ్యే మహానగ్నిః......తస్యమధ్యే వహ్నిశిఖా...... నీవారశూకవత్తన్వీపీతా......అణూపమా...... తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మావ్యవస్థితః" అంటున్నది శ్రుతి. ఇది ఆత్మ. ఇక్కడ సత్యనీతులూ, ధర్మాధర్మాలూ మొదలైన ద్వంద్వాలు లేవు. అది కేవల ఆనందమయం. కవి యెటువంటివాడో యిట్లా చెప్పాడు. "ఎవరు స్వకీయ జీవనమునందలి సత్యమును సాక్షాత్కారమొనర్చుకొనగలరో, యెవరిచిత్తము భగవదాయత్తమై, పరానురక్తిప్రవాహమున నిమగ్నమై యుండునో, యెవరిభావము దేహమనఃప్రాణముల నతిక్రమించి ప్రేమరసమున పారవశ్యమునొందునో, వారే కళావిదులు, వారే రసస్రష్టలు, వారే కవులు, శిల్పులు, గాయకులు, చిత్రలేఖకులు, విగ్రహనిర్మాతలు కాగలరు." అట్టివాడు నిజమైన కవి అంటేను. అటువంటి కవిహృదయాన్ని ప్రవేశించే సహృదయుడిసంగతి ఆలోచించండి. రూపలాలసతోనూ, భోగవాంఛతోనూ నిండి, బాహ్యప్రకృతిని యింద్రియాలతో క్రోలి ఆనందించేవాళ్ళు ఆపై మెట్టుకు చెందిన వాళ్ళుకారని స్పష్టం. కాని వీళ్ళకుకూడా తాత్కాలిక లౌకికానందాన్ని యిచ్చే శక్తి వుండటంచేత ఆ నామకరణం యిస్తున్నాము. ఇట్టి లౌకికకవులు "రియలిజం"లో తేలి ఆడుతూవుంటారు. ఇంకా కొంచెం ఉపజ్ఞకలవాళ్లు పాశ్చాత్యుల "ఐడియలిజం" దగ్గ

ికి పోగలరు. కాని నిజమైన కవులు రసానుభవంచేత తృతీయావస్థను చెంది సహృదయులనుకూడా ఆ ఆనందంలో పాల్గొనేటట్టు చేస్తారు. ఈ మూడో అవస్థలో సత్యము, అసలుసత్యము. "మన బుద్ధికి గోచరమగుసత్యము సతతము మారునదేగాని నిర్వికల్పకమైన అఖండసత్యము కాదు." (సమీక్ష) ఇటువంటి నిర్వికల్పకమైన సత్యానికి తాళముచెవినిచ్చి సహృదయునికి చూపేవాడు నిజమైన కవి. "విశ్వముయొక్క బహిర్ద్వారములు బంధింపబడి యుండుటచే విశ్వాంతరమున నిర్మలకాంతితో వెలుంగు నాత్మానందము సామాన్యులకు ప్రాప్యము గాకున్నది. ఈ బహిర్ద్వారములను తెరచి యందలి యాత్మస్వరూపమును చూపగల తాళపుజెవియే—విశ్వాత్మ యొక్క మూర్తిస్ఫురణమును చర్మచక్షువులకు గోచరింపజేయు జ్ఞానాంజనమే—యీ కళ." (సమీక్ష).

ఈ పై మెట్టునించీ కొంచెం దిగితే మన మామూలుకవుల స్థానం వస్తుంది. అక్కడ నీతీ సంఘమూ మొదలైన వన్నీ వస్తై! వాటినిబట్టి ఆ కవులరాతలను పరీక్షించడం మొదలెడతాం. గత్యంతరం లేదు. "విషయభోగములందు చిక్కుకొనిన జనసామాన్యమునకు నీతి మిక్కిలి ప్రయోజనకారి యనుటకు సందియము లేదు" అన్నాడు విమర్శకుడు. కాబట్టి జనసామాన్యాని కుద్దేశింపబడే కావ్యాలు నీతినియమములు పాటించటం అవసరమని తేలుతున్నది. ఈ సామాన్యకక్ష్య దాటిపోయిన కవులకూ రసపిపాసకులకూ నీతి అవసరం లేదనేమాటా, ధర్మం అక్కరలేదనేమాటా, నిజమే! శ్రీకృష్ణపరమాత్మ "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అన్నాడు. అది అధికారిభేదాన్నిబట్టి వుంటుంది. సామాన్యజనం యొక్క చిత్తవృత్తి చాలా చంచలంగా వుంటుంది. కొందరు "పెద్దల" యొక్క చిత్తవృత్తికూడా అట్లాగే వుండవచ్చు! అట్టివాళ్ళకు నీతి తప్పక అనుసరించదగినదే! శ్రీకృష్ణవాక్య మట్టివాళ్ళకు వర్తించదు.

ఒకవేళ పూర్వజన్మపరిపాకంచేత ఒకొక్క వ్యక్తికి తదనుకరణమే యీ జన్మలో కర్తవ్యం కావచ్చు! అటువంటివారు సామాన్యుల కనుకరణీయులు కారు.* ఈ సందర్భంలో నవ్యుడైన కొడవటిగంటి కుటుంబరావు రాతలోనించికూడా కొంచెమనువదిస్తాను.

"దేశభక్తిగాని, దేవుడుగాని, కళగాని నీతికి అతీతమంటే యేమీ లాభంలేదు. వాటన్నిటికీ యేదో ప్రయోజనం ఉండటం మూలంగానే వాటికి మన జీవితంలో స్థానం యేర్పడుతున్నది. ప్రయోజనం అంటూ వున్న తరువాత, ఆప్రయోజనం తాలూకు మంచి చెడ్డలు వాటిని అంటకుండా ఉండవు.

కాని కొద్దిమంది ప్రపంచంలో అపూర్వవ్యక్తులు యెప్పుడూ ఉంటారు. ఇతరులు సాధనలుగా ఉపయోగించుకునేవి వారికి ప్రయోజనాలుగా ఉపయోగపడతై. వారిని specialists అనాలె. గణితం వకసాధనం. కాని కొందరికదే పరమార్థం. ......... భగవాత్ముణ్ణి

---

* నవ్యుడైన నోరి నరసింహశాస్త్రిగారు "కావ్యప్రయోజనం" అనే వ్యాసంలో.

" కావ్యంలో ఉపదేశం లేకపోతే అది నిరర్థకం.........ఇది వింటే చాలా మందికి విభ్రాంతి కలగవచ్చు. కాని కొంచెం ఆలోచిస్తే యిది సమంజసంగానే కనపడుతుందని నా మనవి.........ఇప్పటికి నవనాగరికులైన విమర్శకులుకూడా, యెవరన్నా గొప్పకవి వక డున్నాడు అంటే " అతనికి సందేశ మేమిటి " అని ప్రశ్నిస్తారు. కాబట్టి అట్టివారి దృష్టిలోకూడా నిజమైన గొప్పకవికి యేదో వక సందేశ ముండవలెనని, అంటే ప్రతికవీ యేదో ఉపదేశించవలెనని. అనగా నిజమైనకవి వక మహర్షి (*Sage, Seer, Prophet*) వంటివాడని స్పష్టమవుతున్నది. 'ఏదో వకటి ఉపదేశించడానికి నాకు అధికార మున్నది. అది ఉపదేశిస్తున్నాను. ఈ ఉపదేశానికి సంస్కృతమైన నా అంతరాత్మ ప్రేరేపిస్తున్నది. అందువల్ల యీవిధంగా లోకసంగ్రహం జరుగుతుంది' అని అయినా పోని చెప్పగల కవు లెంతమంది దేశంలో వున్నారు? "

*" It is well to remind ourselves that literature is first and last a means of life, and that the enterprise of forming one's literary taste is an enterprise of learning how best to use this means of life."*

(*Literary Taste. Arnold Bennet*)

కనుక్కోటానికి ఉద్యమించి, ఆఖరుకు భగవంతుణ్ణిగురించి తమ అన్వేషణాప్రయత్నంలోనే తమ ముక్తిని చూసుకోగలిగినవారున్నారు. (వీళ్లే వెనకటి ఆదర్శసాధకులు.) ఈ అపూర్వవ్యక్తులు తమ బుద్ధి కుశలతను వినియోగపరచి కళను దాని ప్రయోజనంనించి వేరుచేసి ఆనందించ గలుగుతారు. వారికి బూతుబొమ్మలలోవున్న అందాన్ని చూచేటప్పుడు, యితరులకు కలిగే జుగుప్సగాని ఉద్రేకంగాని కలగదు. (వీరే సత్యాన్ని తెలుసుకున్నవారు.) వారు పాము సౌందర్యాన్ని కనుక్కునేటప్పుడు దాని విషదంష్ట్రలను స్మరించలేరు." వారి ఆత్మజ్ఞానం మూలంగా సర్వం ప్రేమమయమైపోతుంది. "అందుకనే నాకు Art for the sake of art" అనే సూత్రాన్ని అవలంబించేవాళ్ళతో సానుభూతిలేదు. ప్రయోజనాన్ని పూర్తిగా నిరసించిన కళాప్రయోజనం నాకు హాస్యాస్పదంగా వుంటుంది. ఎంత దుఃఖములో ఉండీకూడా యితరులకు నవ్వువచ్చేటట్లు యేడ్వడం యెంతనగుబాటు విషయమో, ఏమీ కారణం లేకుండా అత్యద్భుతంగా యేడ్వడంకూడా అంతనగుబాటుపనే! నేనీపని నెందుకు చేస్తున్నానో నీకవసరం లేదు, నాశిల్పం మాత్రం చూడు, అందులో కళవున్నదో లేదో చూడు, అని యేకళాకారుడూ అనరాదు. అతనికీ కళను గురించి యేమైనా తెలిసివుంటే అట్లా అనలేదు. (ప్రతిభ)

నవ్యులుకూడా నీతి ప్రయోజనాలను వదల్లేదు. ఇక్కడే మన సాంప్రదాయానికీ పాశ్చాత్య సాంప్రదాయానికీ భేదముంది. వెనక విమర్శనాన్నిగూర్చి చెప్పినప్పుడు అది సంప్రదాయ సిద్ధంగా వుండాలని చెప్పాను. ప్రాచ్య సంప్రదాయంవేరు. పాశ్చాత్య సంప్రదాయాలు వేరు. మూలసూత్రాలు కొన్నిట్లో సామ్యం వుండచ్చు. ప్రాచ్యుల్లో అందులో భారతదేశంలో ధర్మం మూలం జగత్తుకు. ఈ ధర్మాని కన్నీ లోబడటం భారతీయపద్ధతి. మన నవ్యులు కొందరు

సుఖం పరమావధైన పాశ్చాత్య దేశాలువెళ్లొచ్చి అక్కడ సంపాదించిన జ్ఞానంతో విమర్శనం ప్రారంభించేటప్పటికి యీ విభేదం కనపడుతుంది. భారతదేశం రాజుకంటె సన్యాసిని యెక్కువగా గౌరవించేది! ప్రవృత్తిలో నివృత్తుని చూచేది! నిరభిసంధి కర్మానుష్ఠానం పరమావధిగాకలది! ఈ ధర్మబద్ధత భారతీయజీవనంలో జీర్ణించిపోయింది. ఇందుకు మన్వాదులనూ, వర్ణాశ్రమాలనూ తిట్టి యెంతమాత్రం ప్రయోజనం లేదు! కవికూడా ధర్మబద్ధతే చూపాడు. ఈ ధర్మం మన రక్తంలో జీర్ణమై ఉంది.

"భారతీయుల ప్రకృతి బయట నెట్టివిషయలంపటమున జిక్కుకొన్నను, వారిలోపల దాగియుండుధర్మనిరతియు, వైరాగ్యబోధమును పూర్తిగ లోపింపజాలవు. భారతవాణి అంతరముననుండి మేఘగర్జనమువలె "నఖలు, నఖలు," అని ధర్మఘోష చేయుచునేయుండును. రోమనుల విషయలంపటత్వమునకును భారతీయుల భోగపరాయణతకును, భేదమిచ్చటనే కలదు. రోమనుల కామప్రవృత్తి వారి రాజ్యమును, సభ్యతను, తుదకు జాతినికూడ విచ్ఛిన్నముచేయువరకు వదలలేదు. భారతీయుల భోగపరాయణత వీరి యంతః ప్రకృతిని సంఘపటిష్ఠతను, పూర్తిగ నభిభవింపలేకపోయెను. కావుననే భరతవర్షమున ఆర్యధర్మము యేనాడును నిశ్శేషముగ లోపించలేదు. దాని అప్రతిహతశక్తి నిరంతరము సాగివచ్చుచునేయుండెను. కావుననే యీదేశము కర్మభూమియని పేరొందినది. భారతసభ్యతయందు యిహపరములను సమన్వయము చేసుకొనగల చైతన్యశక్తికలదు. అర్థకామములు సంఘముపైబడి కొల్లగొట్టకుండ ధర్మమోక్షములు సామికులవలె హెచ్చరికకలిగియే యుండెను." (సమీక్ష) ప్రాచ్యపాశ్చాత్యాల కెంతభేదమున్నదో చూడండి! ఈ సంప్రదాయం ప్రకారం మన విమర్శనం సాగించాలె! ఇది నావంటి మందాధికారి చేయతగిన పనికాదు. నవ్యులలో యిప్పుడు చక్కగా లక్షణశాస్త్రాలు

సాధనచేస్తున్నవాళ్ళున్నారు. ఏరందర్నీ కలిపి యీ [illegible]న్ని పరీక్షచేసి నిర్ధారణ చేయవలసి[illegible] శాస్త్రం సమగ్రం కావాలదనీ మనవిచేస్తున్నాను.

***జీవము, శిల్పము :**

ఈ సందర్భంలోనే మరోసంగతికూడా చర్చించాలె. నోరి నరిసింహశాస్త్రిగారు జనవరి 1938 "ప్రతిభలో" "నవ్యకవిత్వము"ని వకవ్యాసం రాశారు. అందులో నవ్యకవిత్వంలో నవ్యతను పరీక్షించి శిల్పమూ, జీవమూ అనే రెండుగుణాలు కవిత్వానికి ముఖ్యాలనీ, వెనకటి వెయ్యిసంవత్సరాలనించీ శిల్పంకోసం కవులు పాతర్లాడారనీ, జీవం జానపదగీతాల్లో పదాల్లో అణిగివుందనీ, శివకవులు రెంటినీ సమ్మేళనంచెయ్యటానికి ప్రయత్నించి సిద్ధిని పొందలేకపోయినారనీ, ఆపనిని యీ నవ్యకవులు ప్రయత్నించి సిద్ధిని పొందుతున్నారనీ కాలమే దీన్ని తేల్చగలదనీ చెప్పాడు.♦ వకచోట జీవాన్నీ, ప్రాణాన్నీ సమానార్థకాలుగా వాడాడు. కాబట్టి జీవమంటే ప్రాణమన్న మాట! ఈ అర్థంలోనే "ఉద్రేక" పదంకూడా వాడాడు. ఈ వ్యాసంలో చాలా అసందర్భ వాక్యాలున్నై! అసలు సిద్ధాంతమే ప్రమాదమని తోస్తుంది. అన్నికళలూ శిల్పాలే! అన్నికళలూ అనుకరణాలే! శిల్పమంటే కళాకౌశలం. కళలో అవయవాలను

---

* ఈ శీర్షిక మహారాష్ట్రానుకరణమని నేననుకుంటూను. ఎందుకంటే మహారాష్ట్ర సారస్వతంలో "జీవనము, కళ" అనే సారస్వతచర్చ జరుగుతున్నది. శాస్త్రిగారు జీవనాన్ని జీవాన్నిగా మార్చినట్టు కనపడుతుంది.

♦ ఇటువంటి అభిప్రాయాలు నవ్యులు యిటీవల చాలాయెక్కువగా వెలిబుచ్చుతున్నారు. అందుచేత యీ వ్యాసమిక్కడ చర్చించాలివచ్చింది. నాకు సహజంగా నరసింహశాస్త్రిగారంటే చాలాగౌరవం. నవ్యులలో తలతిరగనివాళ్ళల్లో యీన వకడు. అదీ కారణం నాగౌరవానికి. కాబట్టి ఆయన్ని విమర్శించడం నాకు ఎంత మాత్రం యిష్టంలేదు. అయినా తప్పనిసరివచ్చింది.

వాటి వాటిస్థానాల్లో ఉండేట్టు రచించే సామర్థ్యం. కళలన్నీ అను కరణాలైనప్పుడు నిర్జీవాలన్నమాట! "జీవమున్నచోట శిల్పముండ దట! శిల్పమున్నచోట జీవముండదట!" ఇది వక విపరీతసిద్ధాంతం! తాజ్‌మహల్లో ఉన్నది శిల్పమా? జీవమా? రెండూనా? అజాంతా శిల్పాల్లో వున్నది శిల్పమా? జీవమా? రెండూనా? తిక్కన భార తంలోవున్నది శిల్పమా? జీవమా? రెండూనా? ఇది చాలా సాహసం! కళకు జీవాన్నిచ్చేది శిల్పమని నామనవి! కవిత్వాన్ని తీసుకుందాం! కవి యేరుకున్న వస్తువు, దాని నిర్వహణమూ, సృజించిన పాత్రలు, వాటిశీల పోషణమూ, కావ్యంలో ఉపయోగించే పదగ్రథనమూ, అనగా మొత్తంమీద భావవస్తు రచనలు, చేరి వక కావ్యానికి జీవా న్నిస్తై! అంటే అవి యేది యెట్లా ఉపయోగించాలో సరిగా చూచి ఉపయోగించటం అన్నమాట! అదేశిల్పం. కవియొక్క యీ పనితనం (శిల్పం) కళకు జీవమిస్తుంది. ఈప్రకారంగానే చిత్రమూను. ఇన్నివేల సంవత్సరాలెప్పుడైతే యీగ్రంథాలూ, చిత్రాలూ, జీవించినయ్యో అదే జీవానికీ, శిల్పానికీ, పరీక్ష! వాటిలో యెప్పటికప్పుడు కనపడే నవ్యతే రమణీయత! ఈరమణీయతే రసాన్నిస్తుంది కావ్యానికి! ఈ రసం సహృదయుడిని ఆనందింపజేస్తుంది! ఏవో కొత్తమాటల నుప యోగించి ఆత్మవంచనా లోకాన్ని మోసంచెయ్యడమూ వద్దు! కాలం చేసిన పరీక్ష కావ్యానికి ఉత్తమమైన పరీక్ష! దానికి నిలిచిన కావ్యాల్లో కళ కొరవడలేదని తార్కాణం! అనుకరణమైనకళల్లో సహృదయుడికీ, పరిణతబుద్ధికీ, కలిగే రసాస్వాదనానికి మార్గం జీవము. అదే రమణీయత! భౌతికంగా చూస్తే కళల్లో జీవముండటానికి వీల్లేదు. ప్రతిమలో, చిత్రంలో, కావ్యంలో, జీవముంటుందా? ఉండదు. కాని లక్షణచేత, వాట్లో ద్రష్టకుగాని, శ్రోతకుగాని రసానుభవం కలగ జేసే అంశను జీవం అందాం! కాబట్టి జీవం అంటే ప్రతి శిల్పంలో ఉండేగుణం. అది లేకపోతే దానిలో చిరకాల స్థాయిత్వం ఉండదు.

ఇప్పుడు అజాంతా చిత్రాలు మొదలైనా వాట్లోనూ, మహాభార
తాది గ్రంథాల్లోనూ ఉండేది అదే! దాని సత్వమే వాటికి చిరస్థాయి
నిస్తుంది. ఇక్కడ వక్క విషయముంది. సామాన్యజనం తమ చుట్టు
ఉన్న సన్నివేశాన్ని దాటలేక పోవటంచేత, ఎవరైనా సామాన్య
కవి అటువంటి సన్నివేశాలనుగూర్చి పాడితే, ఆసామాన్యులకు ఆ
సన్నివేశం ఉత్సాహజనకమౌతుంది. అట్లా ఆప్రాంతంలో వాళ్ళకు
తరతరాలుగా వుండచ్చు. విషయంయొక్క విశేషాన్నిబట్టి స్వల్ప కాల
స్థాయిగానైనా ఉండచ్చు ఆ ఉత్సాహం. వ్యాసంలో నరసింహ
శాస్త్రిగారు చెప్పిన బుర్రపాటలు మొదలైనవి అటువంటివి. అవి
సర్వజాతికీ సంబంధించినవైతే చావవు. కాని నిజమైన జాతీయకవి—
అనగా మొదటిరకం కవిగాని, రెండోరకం కవిగాని — అటువంటి
దాన్ని గ్రహించి ఉత్తమకావ్యం గనక రచిస్తే అది చిరస్థాయిగా
వుంటుంది. "బసవపురాణం" "పండితారాధ్యచరిత్ర" మొదలైన ఉద్గ్రం
థాలు బతికుండి జాతికంతకుచెందిన గ్రంథాలై వుండడానికి కారణమిదే!
మిగిలినశివతత్వాలూ, పాటలూ, తన్మతానుయాయులలోనేవుండతగినవి
గాని పైగ్రంథాలల్లే సకలజాతికి ఆనందంకలిగించేశక్తి వాటిలో లేదన్న
మాట! అంతేగాక యీ పాటలచేతా పద్యాలచేతా కల్గింపబడే ఉద్రే
కమూ ఉత్సాహమూ మిక్కిలి స్వల్పకాలస్థాయి. ఉత్తమ కావ్య
కళల్లే చిరస్థాయియైన భావాలను కల్పింపజాలవు.* త్యాగరాయకృతు
లల్లేనూ, అష్టపదులల్లేనూ, యితర పాటలూ పద్యాలూ ఆనందం
కల్పించడం, సమస్త జాతి ప్రీతిపాత్రాలుకావడం, చిరస్థాయిలుగా
వుండటం కల్గుతుందా? ఎందుకు కల్గుతుంది? అవి కళాకౌశలం
కలవి. అందుకనే కీట్సుమహాకవి "A Thing of beauty is a joy
for ever" అన్నాడు. అట్టి సుందరకావ్యాలుగాని, సుందరచిత్రాలు

* "— — *Dialectical poems cannot have a wide range of effective publicity, nor will they have a long life.*"

(కట్టమంచివారి రైతుబిడ్డ పీఠికలో)

గాని జీవంకలవి ! కాలపురుషుడు గొప్ప పరీక్షకు డందరికంటె ! ఈ పరీక్షకుడి పరీక్షకు నిలవగలదే నిజమైన జీవం కలది. గ్రీకు లాటిను సారస్వతాలూ సంస్కృత సాహిత్యమూ, మన వెనకటి తెనుగు మాన్యకవులూ" అటువంటి పరీక్షలో ఆగ తేరినై ! ఉనికి క్షతి కలిగి, నవ్యుల "జీవశిల్ప" సమ్మేళనం ఫలంగాకలిగిన సాహిత్యం కాల క్రమంగా దీన్ని మించుతుందనుకోడం కంటె భ్రమా, ఆత్మవంచనా వేరే లేదు ! అదెట్లా వుందంటే "తెనుగు ఓ,నా,మాలు రాకుండా యితర జాతీయ వాతావరణంలో పెరిగి, తర్వాత యే కొద్దో గొప్పో తెనుగు నేర్చుకుని, వెనకటిదంతా చెత్తని అనుకోడంలాగుంది." ఇప్పటి మానవుడు వెనకటి ఋషులకంటె గొప్పవాణ్ణని అనుకోడంకంటె హాస్యాస్పద మేమైనా వుందా ? చిరస్థాయిత్వం కలగచేసే జీవంలేదు కాబట్టే వెనకటి శివకవులరాతలు నశించినై ! వేదం తూ, చా, తప్పకుండా యెన్ని వేలసంవత్సరాలనించో వుంది ! దానికి క్షతి వుందా ? పరమేశ్వరుడు బోల్లివిస్టు ! నిమ్నోన్నతాలను యెప్పటి కప్పుడు సరిచేస్తూ యేది చిరస్థాయిగా ఉండతగిందో నిర్ణయిస్తాడు ! ఈ విషయంలో గర్వపడిగాని అభిమానపడిగాని ప్రయోజనంలేదు. "శిల్పంమీద వారిదృష్టే ఆకవులచేత నిర్జీవప్రతిమలను తరుచుగా సృష్టిచేయించింది" అనే మొదలైన వాక్యాలన్నీ లెక్కచెయ్యక్కర్లేదు. "నవ్యకవుల్లో విలాసము కోసమూ, వినోదము కోసమూ, కవిత్వం చెప్పేవారు ఉండరు" "కవితోద్రేకము లేనిది వారు సామాన్యముగా వ్రాయరు" మొదలైన వాక్యాలు గర్వోక్తులు కాబట్టి నిరర్థకాలు.* ఏడుస్తూ వుండటమో, ఆనందంపొందుతూ వుండటమో గాక, విలాస వినోదాలుకూడా కవితోద్రేకానికి కారణ జాతంలోవని సవినయంగా మనవిచేస్తున్నాను. శృంగారకరుణలే రసాలని శాస్త్రిగారు భ్రమపడుతున్నాడుగాబోలు ? "కవులు

*"ఉబుసుపోకకై చేయు వీరి కావ్యములు కావ్యములుకావు"
(వేదాల వరదాచార్యులు ఆంధ్రపత్రిక 17–11–40)

జీవించవలెనంటే ప్రధానంగా సామాన్యజనంమీాద ఆధారపడవలెను" అనడంకంటె జాతి జీవించాలనంటే కవులమీాద ఆధారపడవలె నని అనటం సమంజసం. ఈ క్రింది మహామహావాక్యం చూడండి. A Nation whose language becomes barbarous, must be on the brink of barbarism in regard to every-thing else. A nation which allows her language to go to ruin is parting the best half of her intellectual independence and testifies her willingness to cease to exist." జీవించడంకోసం సామాన్య జనులవెంబడిబడేవాణ్ణి కవిగా భావించడం శాస్త్రిగారి సంకుచిత దృష్టిని తెలియజేస్తున్నది. "ఆంధ్రాభిమానమువల్ల మన కవీశ్వరు లను జగత్తులోని ఉత్తమకవులతో పోలిస్తే రసికబృందంలో మనం హాస్యాస్పదులమవుతాము." అనేవాక్యం భాషా జాత్యభిమానంలేని వారిమాటే కాకుండా సత్యదూరం.* తిక్కన పోతనలుగల సాహిత్యం యెంతమాత్రం సిగ్గుపడనక్కర లేదని మనవిచేస్తున్నాను.♦ నవ్య కవులది సాధించలేకపోతే తెనుగుజాతి నిర్వీర్యమైనదనీ తెనుగువాణి నీరసమైనదనీ మరొక్కసారి రుజువౌతుంది." అనటంకంటె భ్రమ వేరే లేదు. అవి అట్లా ఎప్పుడూ కాలేదు. తెనుగుజాతికి వీర్యమూ,

*సభాపతిగారుకూడా యిలాగాఅనడం నేనువిన్నాను. *Intentionally making great things small).* కాని విశ్వనాథ "మన పూర్వాధునిక కవులు, యితర దేశ పూర్వాధునిక కవులతో తూగలేరని కొందరివుద్దేశం. షేక్స్పియరు తెనుగుదేశం లోనూ, తిక్కన యింగ్లండులోనూ పుట్టడం ప్రకృతిధర్మం కాదేమో! ఎక్కడా కవులు కొద్దిమందే! వారిలో శక్తివుంటుంది." అన్నాడు.

♦వీళ్లు సాహిత్యసేవ చేయటంలేదనీ, తెలుగుతల్లికి నూతనాలంకారాలు కల్పిం చటంలేదనీ, వీరు నూతనమార్గాల్లో భాషాసేవ చేయడంలేదనీ నా ఆశయం కాదని నేను వెనకచెప్పిన దానివల్ల తెలిసేవుంది. కాని పూర్వులకంటె మనం గొప్పవాళ్లమనీ, వా రెందుకు పనికిరానివాళ్లనీ అనుకోటం బాగుండలేదని నామనవి. ఈ గర్వం పోగొట్టు కుంటే వీరి రాతల కిప్పటికంటె యెక్కువ ప్రాశస్త్య మొస్తుందని నామనవి!

తెలుగు వాణికి రసమూ, అదివరకే ఉన్నై! ముందుఉంటై! వీళ్ళు తెనుగుజాతికి వీర్యం తెస్తున్నారనేది అబద్ధం!!

## దేశభక్తి :

ఈ విషయాన్ని గూర్చి కొంచెం ముచ్చటిస్తాను! ఇది యిటీవల నవ్యులు చాలామంది చెబుతున్నారు. 23-7-40 ఆంధ్రపత్రికలో నండూరు బంగారయ్యగారు యీ విధంగా చెప్పినట్టు చదివాను. "వీరు (నవ్యకవులు) ప్రకృతిని ఉపాసించుటలో అపూర్వ వివేచనా శక్తి ప్రదర్శించుచున్నారు. దేశభక్తి నుద్బోధించుటలోను, సామాన్య జీవితముల చిత్రించుటలోను, వీరి శిల్పనైపుణ్యము ప్రశంసార్హము." పై వాక్యంలో వున్న సంగతులు పరీక్షిస్తే ప్రకృతిని నవ్యకవులు ఉపాసించారనీ, కొందరు సామాన్య జీవితాన్ని చిత్రాంచారనీ అనేవి వొప్పుకోవచ్చు.* కాని దేశభక్తిని వీళ్లందరూ ఉద్బోధించారని వప్పుకోవటానికి వీల్లేదు. ఈ దశ వర్షకాలంలో భారతదేశం చాలా రాజకీయాందోళనంతో నిండివుంది. అది యేమిన్నీ యీ కవుల రాతల్లో ప్రతిబింబించివుందా అని గనకచూస్తే, వొకట్రెండో చాలా క్వాచిత్కంగాతప్ప లేదనే చెప్పాలె. ఏ అప్పారావో, రామిరెడ్డో కొన్ని స్థలాల్లో దేశభక్తి నుల్లేఖించారు. మిగిలినవాళ్ళల్లో రాయప్రోలుగారూ, విశ్వనాథవారూ తుమ్మలవారూ మొదలైనవారు ఆంధ్రాభిమానాన్ని పురికొల్పారు.♦ అంతేగాని మిగిలినవాళ్ళంతా వాళ్ళ ప్రేయసులేమో, పరితాపమేమో, దుఃఖమేమో, ఆనందమేమోతప్ప దేశాన్ని స్మరించినవాళ్లు యొకట్రెవగా

---

* బంగారయ్యగారు తాను దేశభక్తిని పురికొల్పారు కాబట్టి అందరూ అట్లా చేశారనడం సరికాదు.

♦ "గురజాడ దేశభక్తి రాయప్రోలులో రాజుకుని, రగిలి, స్ఫులింగాలను విసిరింది. విశ్వనాథ సత్యనారాయణగారు జాజ్వల్యమానం చేశాడు."

(జ. రు. శాస్త్రి, ఆంధ్రపత్రిక 22-9-40)

లేరని చెప్పడానికి సాహసించనవసరం లేదు. ♦ 1921 సంవత్సరంలో ప్రారంభించిన సత్యాగ్రహసమరం చాలా సంవత్సరాలు అనువర్తించడమేకాకుండా మరివక నూతనసత్యాగ్రహతరంగంకూడా దేశాన్ని అన్ని మూలలా కలవరంపొందిస్తున్నది. దాన్నేమైనా కీర్తించి ప్రజకు దోహదమిచ్చారా? ప్రథమదివసాల్లో గరిమెళ్ల సత్యనారాయణగారు మొదలైనవారు కొన్ని గీతాలు రచించి ఉద్బోధించి జైళ్ల నలంకరించారు. వారి స్వంత పనులూ, స్నేహితుల పనులూ సవిరించడమే కాని, దేశీయ సమరానికి దోహదమిచ్చినవాళ్ళు చాలా తక్కువ. సభాపతి, అడవి బాపిరాజు, కొడాలి ఆంజనేయులుగారు, మాత్రం చిరంజీవులై వర్ధిల్లుగాక! శ్రీకృష్ణ జన్మస్థానానికి వెళ్ళివచ్చారు. లీలలతో కాలం గడుపుతున్న వీళ్ళకు దేశం జ్ఞాపకమే రాలేదనడం సత్యదూరం కాదు. ఇంగ్లాండులో యుద్ధానికిపూర్వం రాశిన కవులరాతలు చూస్తే వాళ్ళ దేశభక్తీ, ఉత్సాహమూ, యుద్ధానికి పురికొల్పడమూ కనపడుతున్నది. అనేక కవులు స్వయంగా ఫ్రాంసుదేశంలో గుంటల్లో కూచుని పోరాడినవారున్నారు. మనవాళ్ళు జైళ్ళలోకి వెళ్ళినవాళ్ళను మరిచిపోయి, వాళ్ళవంతుకూడా బయటే తాము సుఖం అనుభవించటం కనిపిస్తుంది. వీళ్ళలో ఉద్యోగాల్లో వున్నవాళ్ళను వదిలినా కొందరు విడిగావున్న వాళ్ళైనా యీ విధంగా పనిచేసినవాళ్లు కారు. న్యాయంగా వీళ్లు నిజమైన దేశభక్తితో తమ హృదయాలు నిండి అత్యంతంగా పాడి ఉద్యమానికి సహకారులై నడవవలసినవాళ్లు! మొదటిసమరంలో పోనీండి! రెండోదాన్లోనైనా తప్పు సవరించుకున్నారా? అప్పుడు గాదు యిప్పుడు! ఇప్పుడుకూడా ఎక్కడో తప్ప దేశభక్తిని పురికొల్పుతున్నవాళ్లు చాలామందున్నారా? ఇంకా దేశానికి స్వాతంత్ర్యంరా లేదుగా! వీళ్ళలో ఆ విధమైన ఆందోళనకూడా వున్నట్టు కనపడదు. నిందించకుండా చెప్పాలంటే వీళ్ళు భాషాసేవల్లోనూ,

♦ కాని తెనుగువారి శౌర్యం లేమికీ, తెనుగు తల్లి తీపి లేమికీ, దుఃఖించడం వక మామూలై పోయింది నవ్యులకు.

కావ్య నిర్మాణంలోనూ మునిగిపోయి ఉన్నారనాలె! అప్పారావు రామిరెడ్డిగార్లు ఆ కాలంలో రచించిన దేశభక్తి గీతాలను గూర్చి ఆయా స్థలాల్లో చెప్పాను. రాయప్రోలు, విశ్వనాథలు మాత్రం చక్కని పద్యాల్లోనూ గీతాల్లోనూ ఆంధ్రుల పూర్వాన్నిత్యాన్ని కొనియాడి, ఉత్సాహాన్ని కల్పించి తమ కర్తవ్యంలో కొంతభాగం నిర్వర్తించారు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు కూడా యీ ఆంధ్రాభిమానాన్ని పురికొల్పటంలో చాలా పాటు పడ్డాడు.* ఇంతమాత్రంచేత నవ్యులంతా యీపని చేశారని విశిరెయ్యడం సమంజసంకాదు. మరీ నరిసింహశాస్త్రిగారు చెప్పినట్టు "తెనుగుజాతికి వీర్యం తేవడానికి ప్రయత్నించార"నడం మిక్కిలి సత్యదూరం! ఈ విషయంలో వాళ్లు తమకర్తవ్యాన్ని నిర్వర్తించలేదనే చెప్పాలె! కాబట్టి బంగారయ్యగారి వాక్యం వొప్పుకోడానికి వీల్లేదు! కాలానుగుణమైన పని చెయ్యకపోవటమూ, తత్కాలపరిస్థితులు వీళ్ల రాతల్లో ప్రతిబింబించక పోవడమూ చూస్తే వీళ్ల హృదయాల్లో వున్నట్టు చెప్పిన సుఖదుఃఖాలు కృత్రిమాలుగా కనపడతై! చుట్టు వున్న సన్నివేశాలతో సానుభూతిపొందని కవి నిజమైనకవికాడు. పెద్దలయెడ భక్తి, రాజభక్తి, దేశభక్తి, దైవభక్తి, మొదలైన యేభక్తీ వీళ్ల దగ్గిర వున్నట్టు కనపడదు. "జనసామాన్యం" "జనసామాన్యం" అనే వీళ్ల పలుకులు చిలకపలుకుల్లాగు వినబడుతూవుంటై! జన సామాన్యానికి అవసరమైన రాజకీయ స్వాతంత్ర్యం, యేదిగనక లభిస్తే వాళ్ల

* వేదుల మొదలైనవారికి తమ "ప్రాణధనమానముల పూజాప్రసవములుగా 'ఆమె' మహోజ్వలపాదపీఠి నుంతుమని" బుద్ధి పుట్టింది. ప్రణయంతో కాలం గడపకుండా, రాజులసేవ చెయ్యకుండా, నీచపుదాస్యవృత్తి చెయ్యకుండా "మాతృదేశసేవాచరణమ్మునం దసువు లర్పణ" చెయ్యాలనుకున్నాడు. కాని అల్లా జరగలేదు. కారణం తెలియదు.

దారిద్ర్యమూ కష్టాలూ తొలుగుసతాయో అట్టి స్వాతంత్ర్యం, వీళ్ళకు కవితావస్తువు కాకపోవడం చాలా విషాదకరం! *

*దీనికంతకూ వక్క ప్రబలకారణం నాకు తట్టుతున్నది. వీళ్లలో చాలామంది, బ్రహ్మసమాజ సంపర్కం కలవాళ్లవడం. ఆవాసన తగిలితే వాళ్ళకు సర్వాంగ్లత్వపక్షపాతం కలుగుతుంది! బ్రహ్మసమాజంలోవాళ్లు భారతదేశం మొత్తంమీద అసహాయోద్యమంలోయెక్కువగా పాల్గొనలేదు.

"తనదొడ్డిలోనె పండినప్రత్తి సమకూర్చి
తనుసొంతముగ నేకులసురచించి
తనచేతితోవడికిన నూలు తనయూరి
సాలెనేసినయట్టి చేలగట్టి
తనచేనిలోఫలించిన పంటదినుసులు
తనయింటి పాడినే యనుభవించి
తనజన్మ భూదేవతలను చాలప్రేమించి
తనబాసలో పాండితిని గడించి
తనదు మతసాంప్రదాయపద్ధతిని నడచి
తనదు తనువుపరార్థదత్తము నొనర్చి
మించినసత్కీర్తిచే ప్రకాశించునట్టి
జనుడె చరితార్థుడాతని జన్మెజన్మ"

(మంగిపూడి)

7, 8, సంవత్సరాలనించీ కథకులు కొంచెం కృషిజీవికగలవారిజీవనమూ, దారిద్ర్యమూ, మొదలైనవాటిని చిత్రించటం మొదలెట్టారు. కొందరు నబ్నీవీస్ గురునాగరావుగారివంటివారు దేశాన్ని నాయకులనూ మరవకుండా కీర్తించటం మొదలుపెట్టారు. అయినా యిప్పటికీ వెనకటి కవితాసామగ్రే అనువృత్తంగా వస్తున్నది. ఇక ముందైనా యీతప్పు సవరణచేసుకునే సూచనలు కనపడటం లేదు! ఇంతలో యిమిటేషన్ బోల్షివిజంవచ్చి రక్తాన్ని, కండలను, అస్థులను, మాంసపిండాలను చిత్రిస్తున్నది. ఈ అంతర్జాతీయ భీభత్సం సుందర "అస్మత్" పదసే అంతరించేట్టుంది! కాని మళ్లి ప్రపంచయుద్ధమొచ్చి ఆశయాలను మార్చేటట్టు కనపడుతుంది.



నవ్యులాదరించ్ని భాషాసిద్ధాంతాలు :

1920 సంవత్సరంలో సాహితీ పత్రిక వెలువడ్డప్పటినుంచీ 1937 సంవత్సరం వరకు తమకు వచ్చిన అనుభవాన్నిబట్టి సభాపతి గారు నవ్యులనుసరించిన భాషాసిద్ధాంతాలను, తాను రచించిన "నాలోమార్పు" అనే వ్యాసాంతానికి గుదిగూర్చారు. కావ్యానికి శబ్దార్థాలు రెండూ అవసరాలేకాబట్టి అర్థమూ దానియొక్క నవ్యతా, శబ్దమూ వీళ్లు గ్రహించిన భేదాలు, అక్కడక్కడా మనవిచేశాను. కాని ఆధికారికంగా సభాపతిగారభిప్రాయాలిస్తే నిష్కర్షఅయిపోతుందనీ, అవన్నీ ఒక్కచోట ఉండటం మంచిదని యిక్కడ యిస్తున్నాను.

"అదివరకు మనకు వున్న వ్యాకరణ గ్రంథాలన్నీ పద్యభాష నిరూపించడానికేకాని, వచనభాషకోసం కాదని యేమాత్రం సమీక్షాదృష్టి వున్నవానికైనా గోచరిస్తుంది. అయితే పద్యాలమధ్యవున్న వచనంసంగతి ఏమని సంశయం కలగవచ్చు. కథాసంధికోసం, సామాన్యవిషయ ప్రతిపాదనకోసం వుపయోగించే భాష ఛందోబద్ధం చెయ్యడం యిష్టంలేక వెనకటికవులు గద్యరూపంగా వుంచారు. అయితే యీభాషకూ, పద్య భాషకూ విశేష తారతమ్య ముంటే, యెగుడుదిగుడుగా వుంటుందనీ సమత్వం సమకూరదనీ ఆప్రకారం చేశారు. కాబట్టి ఆభాష వచనానికి ప్రమాణంగా ఎంచుకోకూడదు. వ్యాకరణమో సమగ్రంగా లేదు. చిన్నయసూరి వ్యాకరణం నిష్కారణంగా ప్రమాణగ్రంథం అయిపోయింది. దాన్నిబట్టి భాషయావత్తు దిద్దుతామంటారు ప్రాచీనపద్ధతిలో తయారైన విద్వాంసులు.

"ఎంత గొప్ప వైయాకరణి అయినా ఒక భాషకు సమగ్రమైన వ్యాకరణం చెయ్యలేడు. వృద్ధికావడం మానివేసిన సంస్కృత భాషకు వ్యాకరణం అనుశాసించిన భగవాన్‌పాణినిమహర్షి అతః

పూర్వం అనేకమందివ్యాకృతులను స్వీకరించి అష్టాధ్యాయి చేస్తే అదికూడాసమగ్రంకాలేదు. అటువంటి స్థితిలో సామాన్య విద్వాంసు డెవరో జీవద్భాషకు ప్రమాణభూతమైన అనుశాసనం చేశాడంటే అస్మదాదులం అంగీకరించలేము. వాఙ్మయంలోవున్న గ్రంథజాల మంతా ప్రచురం కాలేదు. అయినదాన్నికూడా వకడు పరిశీలించ లేడు. గ్రహణశక్తి చాలకగాని, భ్రమప్రమాదాదులవల్లగాని అనేక శబ్దరూపాలు ప్రత్యక్షంకావు.

"భాషాభివృద్ధి అంటూ చాలామంది చిలకపలుకులు పలుకు తున్నారు. నిజంగా వృద్ధి కోరినట్లైతే వ్యవహారంలోవున్న భాషను స్వీకరించి తీరాలె. ఎంతమహాకవైనా భాష యావత్తు తన గ్రంథాల్లో యిముడ్చుకోలేడు. వెనకటి కవులు ఉపయోగించిన భాష ఆకాలంలో వారికి తెలిశిందే! గ్రాంథిక శబ్దాలుకూడా వెనక మనుష్యుల నోట వచ్చినవే కాని ఆకాశంనుంచి ఊడిపడ్డవికావు! అంతకంటె యెక్కువ భాష మనం వాడకూడదంటే భాషాభివృద్ధికోరడం లేదని అర్థం! "కితాబీ"వాఙ్మయం "జమీందారీ కవిత్వం" చెయ్యడం కోసమైనా వెనకటి వాఙ్మయం చాలదు. మనం యీకాలం జగత్కుటుంబులని యెంచుకుంటున్నాము. అనేక భావతరంగాలువచ్చి తాకుతున్నాయి. మన ప్రకృతి మునుపటివలెలేదు. నవీనసన్నివేశాలకు, సంఘర్షణలకు, సమస్యలకు, ఉచితవ్యక్తీకరణానికి నూతనపదజాలమూ, అన్వయాలూ కావాలె. దానికి లోకమే శరణం. శబ్దసిద్ధి లోకంవల్ల కలుగుతుందని నన్నయభట్టారకుడుకూడా చెప్పాడు.

"వైయాకరణి అయినా, కవైనా, కొత్తమాట స్వయంగా సృష్టించలేడు. అది లోకం చెయ్యవలసిన పని. అవసరంవచ్చినప్పుడు కొత్తశబ్దం బయలుదేరుతుంది. మొన్నటి (1919) యిరోపా సంగ్రా

మంలో "Camaflouge" అనే మాట పుట్టింది.* అంతా వాడు తున్నారు. సాహిత్యవృద్ధి చెయ్యాలంటే అర్థవంతమైన అనేక శబ్దాలు వాడాలి. గ్రంథస్థం కాకుండా వ్యవహారంలో ఆంధ్రదేశం మొత్తం మీద లక్షలకొద్దీ శబ్దాలున్నవి. అవి గ్రహించవలసిన బాధ్యత మన మీద వున్నది.

"ఎటువంటి పదాలు, ఉపాదేయములు ? ఇక్కడ మతభేదాలు యేర్పడతవి. కేవలము అనాగరకులు—అనగా పట్నాలకు బహు దూరంలో వుండేవారు, అడవుల్లో సంచరించేవారు, సత్తావల్లగాని మరి యేవాఙ్నిరోధమువల్లగాని ఉచ్చారణ చెడినవారు, అసభ్య వ్యవహారం చేస్తున్న వాళ్ళు—ఇటువంటివాళ్ళ మాటలు అంగీకరించ నక్కరలేదు. స్వీకరించిన శబ్దాలకు అన్వయం యెలాగు ? భాషా తత్వం వాక్యరూపాన్ని నిర్ణయించేవున్నది. దాన్ని గమనిస్తేచాలు. కొండవీటి చాంతాళ్ళవలె దీర్ఘవాక్యాలు మట్టుకు పనికిరావు. కర్మణి ప్రయోగాలు కూడవు.

"మాండలీకశబ్దాలు మనకర్థం కావని విచార పడకూడదు. క్రమంగా అర్థం తెలుసుకుందాం.......వెనకటి పుస్తకాల్లోభాష యెంత కష్టపడి నేర్చుకున్నాము ? ఇది నేర్చుకోనడం అక్టే కష్టంకాదు.........♦

"గ్రంథకర్తలకు సంశయం కలుగుతూ వుంటుంది, వాక్యాలు వ్రాయడం యెలాగనీ, ప్రమాణము యేదీ అనీ. ఆత్మప్రమాణమే ప్రమాణమని నా ఆశయం. లోకవృత్తం బాగా గ్రహించి, జాతీ

* ఇప్పుడు అనేక మాటలు పుట్టినై. "బ్లిట్జ్ క్రిగ్" (Blitzkreig) "లుత్ఫవాఫ్" (Lutfwaffe) "క్విస్లింగు" (quisling) మొదలైన విట్టివే !

♦ "ప్రాంతీయ శబ్దాలు భాషాదేవి విస్తారమైన తనువు" అవి తీశేస్తే ఆవిడ గుజ్జు అయిపోతుంది." అన్నాడు జయంతిలో విశ్వనాథ. డాక్టరు రెడ్డిగారు "రైతుబిడ్డ"ను గూర్చి రాశిన అభిప్రాయంలోకూడా మాండలీకాన్నిగూర్చి చెప్పినమాటలకిదిసమాధానం?

యాలు, లోకోక్తులు, సందర్భశుద్ధులు, మొదలైనవన్నీ గ్రహించి తనకు నచ్చినట్టు వ్రాస్తే చాలును. పెద్దలతోగాని, గురువులతోగాని, సభారంగంమీదగాని, జాగరూకతతో ప్రసంగించే పద్ధతి అవలంబించ తగ్గది. తన యిష్టానిష్టాలనుబట్టి గ్రంథకర్త కొన్ని రూపాలు స్వీకరిస్తాడు. కొన్ని విసర్జిస్తాడు. భాషలో అనేక రూపాంతరాలు వున్నవి. గమనంలో చాలా వైకల్పికాలు వున్నవి. ఇలా కొంతకాలం రచనలు సాగితే అప్పటికి వక standard యేర్పడవచ్చు.

"నియమాలను వ్యతిక్రమించకుండా గ్రంథం చేసిన కవిలేడు. Standard అనేది ఊహామాత్రమే! కాని తెన్నుదాటి విచ్చలవిడిగా సంచరించవలసిన అవసరం వుండదు. ఉచితజ్ఞుడైనవాడు యేవో నియమాలకు లోబడే వుంటాడు.

"ఇటువంటి భావాలు కలిగి ఆరోజుల్లో నేను వచనరచనకు పూనికొని చాలామంది మిత్రులను ప్రోత్సాహించాను. నవ్యసాహిత్యం ముందంజ వేసింది. పూజ్యులైన ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారు 'మాలపల్లి' వ్రాసిన తర్వాత వాడుకభాషకు యెక్కువ గౌరవం వచ్చింది."

పండితుడై రసికుడై విశాలహృదయుడౌటచేత సభాపతిగారు యీపనిని నెగ్గించ గలిగాడు. ఆయనవలె పండితుణ్ణికాకపోయినా, నా అభిప్రాయాలుకూడా సరిగా యిటువంటి పరివర్తనా న్నేపొందినై! ఇది చదివితే పద్యరచనకు సాధ్యమైనంతవరకు చ్యుతసంస్కారం కాని భాషనూ, గద్యానికి వ్యావహారికాన్నీ వాడమని సభాపతిగారి ఆశయమైనట్టు కనపడుతుంది. * ఇది వక సలహా మాత్రమేగాని,

* అన్నాడు విశ్వనాథ "జయంతిలో" అయితే "భారతభాగవతాలు యీ భాష (వ్యావహారిక) లో వ్రాయవచ్చునా? అని అడిగారు. నేను కాదన్నాను. వాడుకభాషకు అంత సామర్థ్యంలేదు. నేడు రామాయణం యీ భాషలో వ్రాయాలని కాదు. ఈ భాషలో వ్రాసినా, ఆభాషలో వ్రాస్తే యే అందం వచ్చిందో ఆ

కవి నిరంకుశుడు! రసం కోసం స్వతంత్రిస్తాడు. రసం మనకు కావలశింది!

**ఆంధ్రభాషానుశాసనము:**

విశ్వనాథ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి ఆంధ్ర భాషానుశాసనాన్ని నవ్యసాహిత్యంలో చేర్చవలసిందేనని అన్నారు. అది సమంజసమే! వెనక ధారావాహికగా ప్రవహించే భాషకు వక శాశ్వతమైన వ్యాకరణాన్ని రచించడానికి వీల్లేదని పెద్దల అభిప్రాయాలను చూపాను. ఎప్పటికప్పుడు శిష్టవ్యవహారంలోవున్న భాషకూ, గ్రంథస్థమైన భాషకూ, సన్నిహితసంబంధముండాలె! గిడుగువారి వాదంలోవున్న సారాంశమిదే. శబ్దసిద్ధి! లోకంవల్ల కలుగుతుంది. ఆ శబ్దాలను వైయాకరణి పరిశీలించి వాటిని సూత్రిస్తాడు. ఈ విషయమేమన తెలుగు వ్యాకరణాలను యెప్పటికప్పుడు పరిశీలిస్తే కనపడుతుంది. ఎందుకోగాని చిన్నయసూరిగారి తర్వాత ఘనీభవించిందీవిషయం. త్రిలింగలక్షణశేషం కొంతపని చేశింది. తర్వాత భాషలో జరుగుతున్న మార్పులన్నీ పరీక్షించి గద్యగ్రంథస్థభాషనూ, వాడుకలోవున్న భాషనూ, పరిశీలించి వక నూతన వ్యాకరణం రాయాలని వీరేశలింగంపంతులుగారికే తట్టిందని సూర్యనారాయణీయ పీఠికలో శాస్త్రుర్లుగారు రాశారు. శ్రీ వీరేశలింగం పంతులుగారు స్వీయచరిత్రలో యిట్లా రాశారట! "పూర్వవ్యాకరణములన్నియు పద్యకావ్యములకొరకే! వచనకావ్యములు లేనికాలమున బుట్టినవగుటచే నందలి లక్షణము లనేకములు వచనకావ్యాభి

---

అందం రాదు. ఆ రెంటి తారతమ్యానికీ బొబ్బిలికథను రంగరాయ విజయంతో పోల్చి చూస్తే తెలుస్తుంది." పిడుక్కూ బియ్యానికీ వకే మంత్రం వద్దని సహృదయులైన నవ్యుల అభిప్రాయంకూడా నన్నమాట! వకచోట కంఠోక్తిగా యిట్లా చెప్పాడు "పాట యేభాషలోనైనా ఉండవచ్చు! పద్యం గ్రాంథికభాషలో వుండాలె! గద్యం వాడుకభాషలో వుండాలె!" ఇప్పుడట్లాగే వున్నై!

వృద్ధికి తగవనియు, నిప్పటికాలమునకు తగినట్టుగా వ్యాకరణమును మార్చుకోవలయు ననియు నేననుకొని, యీ కాలమునకును, వచన రచనాభివృద్ధికిని దగినట్లుగా నొక నూతన వ్యాకరణమును వ్రాసి దానికి లక్ష్యముగా నొక వచనకావ్యము చేయవలెనని పలుమారు తలపోసితిని." చూశారా వీరేశలింగంగారి అభిప్రాయం! ఈ కాలానికి తర్వాత ఆంధ్రదేశంలో పండితుల అభిప్రాయం చాలామారి పోయిందని యీకింది సూర్యనారాయణీయ పీఠికాభాగంవల్ల విశదమౌతున్నది.

"కీ॥ శే॥ వేరి కాశీనాథశాస్త్రిగారు 1912 లో చెన్నపురమున జరిగిన పండితసభలో 'శిష్టవ్యవహారమునందున్న తెనుగుభాష సంస్కారార్హమని' యుపన్యసించిరి. ఈ యభిప్రాయమునే మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారు "ఆంధ్రభాషా సంస్కరణమనెడి వ్యాసమున సయుక్తికముగా, సప్రమాణముగా, వివరించిరి. 1914 లో ఎలమంచిలిలో జరిగిన విద్వత్సభలో 'శిష్టవ్యవహారమందున్న భాష గ్రామ్యమనుట శాస్త్రవిరుద్ధమ"నెడి యుపపాదనమును శ్రీవఝుల చిన సీతారామశాస్త్రిగారు మొదలగు విద్వాంసు లనేకు లామోదించిరి. 1915 లో బందరు కళాశాలలో జరిగిన పండితసభలో తర్కపండితులవలెనే యర్వాచీన కవిప్రయుక్తములైన యనేకశబ్దములు గ్రామ్యములగునని చెప్పుచు నాసతీర్థ్యులగు శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు 'ఈ ప్రయోగములలో గొన్ని నిర్దుష్టములయ్యు నిటీవలివారి యపరిశీలకత్వము వలన నపప్రయోగములుగా నెన్నబడుచున్నవి. ఏది ఎట్లైనను ఆయా విచారము కవులకుగాని, సామాన్య రచయితల వ్రాతలయందు విశేషించి చూడగూడదను వాదము సత్యదూరము కాదు" అని అభిప్రాయ మిచ్చిరి. 1915 లో కాకినాడలో జరిగిన పండితసభలో సభ్యులైన అత్తిలి సూర్యనారాయణగారు 'కేవల గ్రాంథిక

భాషాభిమాని నైయుండియు సత్యము గ్రహించిన పిదప నా పూర్వాభిప్రాయమును మార్చుకొని సర్గాంధ్యము సజ్జన గ్రాహ్యమే యగునని నా యభిప్రాయమును వెల్లడించుచున్నాను' అని వ్రాసిరి. 1916 లో కొవ్వూరిలో జరిగిన సారస్వత మహాసభలో సభ్యులును నానతీర్థ్యులును కీర్తిశేషులు నగు శతావధాని దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు, కీ॥ శే॥ రాజా కొచ్చర్లకోట వెంకట కృష్ణారావుగారు, కీ॥ శే॥ వీరేశలింగం పంతులుగారు, కీ॥ శే॥ తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు, శ్రీ చిలుకూరు వీరభద్రరావుగారు, మొదలగు ననేక విద్వాంసులు "తెనుగు మాటల సాధుత్వాసాధుత్వములు స్పష్టముగా బోధించే తెలుగు వ్యాకరణము లేకుండుటచేతను, ఉన్నవి పరస్పర విరుద్ధములుగాను అసంపూర్ణములుగాను ఉన్నందు చేతను, వ్యాకరణమునకు మూలము ప్రయోగము లగుటచేతను, తెనుగు గ్రంథములలోని ప్రయోగములను ప్రమాణములుగా అంగీకరింపక తప్పదు. నేటి వాడుకలో నున్న పదములు నూరు సంవత్సరములనుండి పెద్దల వాడుక చొప్పున ఉన్నట్లు నిదర్శనము లున్నపుడు అవి నిర్దుష్టములుగా యెన్నవలెను. నేడు తెలుగుదేశ మందంతటను పెద్దల వాడుకలో ఏకరూపములుగ నున్నపదములు పూర్వకాలపు గ్రంథములలో కనపడకపోయినను నేటి గ్రంథములలోనున్న యెడ సాధువులే" అను తీర్పు నంగీకరించియున్నారు. 1916 లో చెన్నపురమునందలి కళాశాలలోని పండితులు దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారు, నరిసింహాం పంతులుగారు మొదలగువారు, అర్వాచీన కవిప్రయోగము లనేకములు సాధువులనియు గ్రాహ్యములనియు నంగీకరించిరి. ఇట్లే బ్ర.శ్రీ. ప్రయాగ వెంకట్రామశాస్త్రిగారు ననేక పండితులభిప్రాయముల నిచ్చియున్నారు."

చూచారా గిడుగువారి వాదానికి పండితులెట్లా అభిప్రాయా న్నిస్తున్నారో! ఈపద్ధతి ననుసరించి నూతన వ్యాకరణం చారిత్రిక

పద్ధతి ప్రకారం రాయడం అవసరమైంది. ఈఅవసరాన్ని మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు గ్రహించి చక్కని పద్ధతులతో వ్యాకరణాన్ని నిర్మించారు. చిన్నయసూరిగారి కంటె అనేక విషయాల్లో విలక్షణంగా రచించారు. ఇది రచించటంలో వారి ఆశయాన్నిట్లా చెప్పారు. "......భాషాసంప్రదాయ జిజ్ఞాసతో తొల్లి లౌకిక భాషగానున్న సంస్కృతమునకు సంస్కారానుగుణముగా ననుశాసనములుచేసిన మునిత్రయమువారి సంస్కారపక్షవాక్యములను మననముచేసియు, ప్రయోగదృష్టితో నాంధ్రభారతము మొదలుగా ప్రాచీనార్వాచీనకావ్యము లనేకములు పఠించియు, లక్షణదృష్టితో నాంధ్రశబ్దచింతామణి మొదలుగా ప్రాచీనార్వాచీన వ్యాకరణములు పరిశీలించియు, దేశకాలభేదమున లౌకిక భాషలకు మార్పునైజమనియు మారిన శబ్దములను పూర్వపూర్వకవులు ప్రమాణముగా నుత్తరోత్తరకవులు వాడుట సహజమనియు, నట్టివానికి నయ్యాకాలమున లక్షణకర్త లనుశాసనముచేయుట యాచారమనియు గ్రహించి, 'నన్నయాది ప్రాచీనులు వాడినదే గ్రాంథికభాష కాదు, పెద్దనాది యర్వాచీనులు వాడినదియు నాంధ్రమే' యని నిశ్చయించుకొని యర్వాచీనకవి ప్రయుక్తములైన బహుశబ్దము లసాధువులనెడి వాదము సముచితముకాదని తలంచితిని." ఇది చారిత్రిక పద్ధతి. ఈపద్ధతి ననుసరించి మనవాళ్ళ గ్రామ్యాలనే శబ్దాలకు అనేకాలకు సాధుత్వం కల్పించారు శాస్త్రిగారు. ఇందులకు శాస్త్రిగారి యెడల సకలాంధ్ర లోకం కృతజ్ఞం. శ్రీ రామలింగారెడ్డిగారివంటివాడీ వ్యాకరణాన్ని మెచ్చుకున్నాడంటే యిక వేరే సర్టిఫికేటక్కరలేదు. ఆయన దీనికి పీఠిక వ్రాశాడు. అందులోకూడా కొంత సంఘసంస్కరణోపన్యాసంచేశాడు. తుదకు శాస్త్రిగారి పద్ధతిని మెచ్చుకున్నాడు. "శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారి పద్ధతి నవీనము, స్వతంత్రము.........ప్రతి ప్రకరణమునందును చారిత్రక దృష్టియు, అసాధారణ యోజనాశక్తియు విస్పష్టములు."

శ్రీ శాస్త్రిగారు చెప్పినట్లు యీ వ్యాకరణము యింకా "సమగ్రము కాదు." "వివిధ మండలములలో వేరు వేరు తెరగుల వాడుకలోనున్న యపార శబ్దజాలమున కాయా మండలములలోని పెక్కండ్రు కలిసి చేయతగిన యనుశాసన మొక్కమారుగా సమగ్రముగా చేయట నా కొక్కనికి సాధ్యమును గాదు" అన్నారు శాస్త్రిగారు. ఈ వ్యాకరణము సంపాదించిన విశిష్టత యేమిటంటే చిన్నయసూరి కట్టిన ప్రాకారాన్ని భేదించింది. గచ్ఛద్భాషకు ప్రాకారాన్ని నిర్మించకూడదని సిద్ధాంతీకరించింది. ఈ వ్యాకరణం గిడుగువారి ఆశీర్వాదాన్ని పొందింది. ఇద్దరు సహృదయులే కాబట్టి వకరిచేసినపని కొకరు సమ్మతించారు. శాస్త్రిగారు గిడుగువారిని గూర్చి ప్రతిభలో రాశిన వ్యాసంలో తమ అభిప్రాయాన్నీ గిడుగువారితో తమ సంబంధాన్నీ చెప్పారు. "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమం" అన్నారు పెద్దలు. ఈ వ్యాకరణం నవ్యాంధ్ర సాహిత్యాని కలంకారభూతమైందని అందరూ గ్రహించారు. వ్యాకరణం తత్కాలభాషకు దగ్గరకు రావలెననే సిద్ధాంతాన్ని రుజువు చేశింది.

**వైయాకరణ పారిజాతం:**

ఈ కాలానికి సంబంధించిందే వఝలవారి "వైయాకరణ పారిజాతం" కూడాను. ఇదివరకే యీన "మార్గోపదేశిక" రాశి దేశానికిచ్చారు. దానిలో విద్యార్థుల కవసరమైన చాల విషయాలు సులభంగా గ్రహించేట్లు బోధించారు. ఈ నూతన వ్యాకరణభాష్యం పెద్దలకోసం. దీనిలో వీరవలంబించిన శాస్త్రపద్ధతి చాలా ప్రశంసనీయం. "నన్నిమాథర్వణీయం" అన్నారు దీన్ని. నన్నయ సూత్రాలకు అథర్వణుడు వార్తికం రాశాడని గ్రహించారు వీరు. అది నిజమే! కాబట్టి ఆ రెండింటిని జోడించి కలిపి భాష్యం రచించడం ప్రారంభించారు. ఇంకా పూర్తికాలేదు. త్వరలో పూర్తిచేసి భాష కుపకారం చేస్తారని ఆశిస్తున్నాను. ఈన మనకున్న గొప్ప వైయాకరణుల్లో వకరు. "ఆంధ్ర శబ్ద చింతామణి" నన్నయకృతమేనని రుజువుచేస్తూ

ఈన చాలా వ్యాసాలూ, గ్రంథ పీఠికలూ రచించారు. ఈన గొప్ప వ్యాఖ్యాత కూడాను. హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్యను పరిష్కరించి చక్కని విమర్శక పీఠికనురాసి ప్రకటించారు. ఇందులో రామ రాజభూషణ భట్టుమూర్తుల ఐక్యతను సమంజసంగా చర్చిస్తూ శ్లేష భేదాలను సోదాహరణంగా నిరూపించారు. ఈన గొప్ప పండితుడు. మద్రాసు విశ్వవిద్యాలయం నించీ తమ స్థానాన్ని శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారికిచ్చి, ఆంధ్రవిశ్వవిద్యాలయాని కెళ్లారు. ఇప్పు డుపకార వేతనం పొంది సారస్వతసేవ సాగిస్తున్నారు.

ఇటీవల వాచస్పత్యగ్రంథ నిర్ణేతలైన కొట్రశ్యామల కామ శాస్త్రిగారు "వ్యాకరణ సర్వస్వ"మని సమగ్ర వ్యాకరణం వ్రాసి ప్రచురిస్తున్నట్టు తెలుస్తున్నది. హైద్రాబాదు నివాసి సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు తత్సమచంద్రికాదులే గాక సంస్కృత వ్యాకరణ సామగ్రిని కౌముద్యాది గ్రంథాల్లోనించీ తెనుగుకు సంబంధించినంతమట్టుకు విడదీసి వక గొప్ప వ్యాకరణం రచించినట్టుకూడా తెలుస్తున్నది.*

ఒక్కమారీ కాలాన్ని సింహావలోకనం చేస్తే సారస్వత క్షేత్రంలో ప్రసరించిన వీధివిన్యాసం చాలా హృదయంగమంగానూ సర్వతోముఖంగానూ కనపడుతున్నది. ఖండకావ్యవీధి చాలా రస వంతంగా ప్రసరించటం సాగింది. గద్యపద్యనాటక రచన సాగుతూనే వుంది. కొందరు విశ్వనాథవంటి సార్వకాలికకవులు క్రమంగా వికసిస్తున్నారు. వృక్షం కొమ్మలలో బదనికలు పుట్టినట్టు వకమూలనుంచి అతినూతన మార్గాలు పుట్టే సూచనలు కనిపిస్తున్నై. గద్యం సర్వ మార్గాలా ప్రసరించి ప్రజలకానందసంధాయకమూ, జ్ఞానదాయకమూ అవుతున్నది. వ్యావహారిక భాష, గేయానికీ, కథకూ స్థిరమైపోయింది. భాషావిషయంలో పండితుల అభిప్రాయాలు కూడా మార్పు పొందుతున్నవి. వ్యాసంచక్కని పరిణామం పొందుతున్నది. నవ్యులలో కొందఱు

* ఇది అచ్చౌతున్నది. ఈ గ్రంథం పూర్తిఅయ్యేటప్పటికి అదీపూర్తిఅవుతుంది.

యువకులు చక్కగా వెనకటి లక్షణశాస్త్ర సిద్ధాంతాలను ఆధునిక భావాలతో పరీక్షించి పరిష్కరించడంసాగించారు. పరిశోధనం అనంత ముఖాల ప్రసరిస్తూనేవున్నది. చరిత్రలో చక్కనినిర్దుష్టతకోసం ప్రయత్నాలు జరుగుతున్నై. అనేకుల దేశభక్తుల, గొప్పవారి జీవితచరిత్రములు వ్రాయబడుతున్నై. నవలలు వ్రాస్తూనేవున్నారు! వెనకటి నమూనా నాటకాలుకూడా రాస్తూనేవున్నారు. నాటకప్రదర్శనాలు సినిమాసంఘర్షణచేత వెనకపడుతున్నై! యీవిధంగా అన్ని సారస్వత వీధుల్లోనూ భాషాకుమారులు సంచారం చేస్తున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయాన్నిగూర్చి ఉత్సాహం పొందినవాళ్లు నిరుత్సాహాన్ని పొందారు. పెద్దదైనస్వరాజ్యాందోళనలో ఆంధ్రులు నిమగ్నులైపోయినారు. కవులు దేశాన్నంతగా కీర్తించడంలేదు. ప్రణయానికి యిచ్చినంత ప్రాముఖ్యం దేశభక్తికియ్యటంలేదు. కొందరు యువకులచిత్తాలలో మొలవకూడని అంకురాలను మొలిపిస్తున్నారు. వాళ్ళ రాతలకు కొందరు తమవాళ్ళే వైముఖ్యంచూపటం చాలాసంతోషకరం. రాయప్రోలు, విశ్వనాథలు యీమికులల్లే మళ్లీ చిత్తవృత్తిసంస్కారాన్ని యథాస్థితిలో పెట్టడానికి చాలా శ్రమపడుతున్నారు. వెనకటి కొందరికి సృష్టి వెనక్కుతగ్గింది, తగ్గుతున్నది. కథానికమాత్రం సంపూర్ణపరిణామం పొందేసూచనలు పొడకట్టుతున్నై! నవ్యసాహిత్యానికి స్థైర్యమొచ్చింది. దేశంలో అన్నిమూలలనించీ దీనికి ఉత్సాహం కనపడుతున్నది. పెద్దలుకూడా దీనికిసుముఖులవుతున్నారు. వాళ్ళల్లో కొందరు రాతలుకూడా రాయడం మొదలెట్టారు. వాటిలో శ్రీ చెళ్లపిళ్లవారిరాతలు దేశందృష్టిని మార్చటంలో చాలా ఉపకారకాలైనై! కొందరు చిన్నతనపుచేష్టలను చూపటానికుద్యుక్తులవుతున్నారు. కాని యింకా సంపూర్ణంగా ధైర్యం వహించటం లేదు. కొందరు పెద్దలు వీళ్ళకు ప్రోత్సాహమిస్తున్నారు. ఈ కుర్రవాళ్ళు యింగ్లాండులో యుద్ధానంతరం వచ్చిన సాహిత్యంలో మార్పులన్నీ మనకు తెచ్చిపెట్టటానికి అంచనాలువేస్తున్నారు. తమ చిత్త

వృత్తులను ఆ కృత్రిమవాతావరణంలోకి తెచ్చుకుని లేని ఉద్రేకానికి పాలై ప్రపంచమంతా మునిగిపోతున్నట్టు భావిస్తున్నారు. మరికొంద‌రు జాతిలోవున్న నిమ్నోన్నతాలకు తావిచ్చి వాటిని సమంచేయటానికి ప్రయత్నిస్తున్నారు. పూర్వమార్గంకూడా బొత్తుగా లేదనిఅనుకోవద్దు. అక్కడక్కడావాళ్లుకూడా చక్కనిరాతలు రాస్తూనేవున్నారు. రాజశేఖరశతావధానిగారి ఉదాహరణ మిచ్చేవున్నాను. అన్ని లలిత కళలలోనూ యంత్రమొచ్చి వాటియొక్క లాలిత్యాన్ని దెబ్బకొట్టింది! ఇది చాలా విషాదకరం. ఆంధ్రదేశంలో అందరు కవులు జోక్యం కలగజేసికోక పోయినా జాతీయాందోళనానికి వలసిన ఉత్సాహం కొరవడలేదు. ఇతర రాష్ట్రాలతోపాటు యిందులోకూడా తీసిపోలేదు. కులకక్షుల వాతావరణం యింకా అట్లాగేవుంది. కాని యీ కులకక్షులు దేశభక్తితో యేకకాలావచ్ఛేదకంగానూ, వొక్కొక్కప్పుడు యేకవ్యక్తిగతంగానూ వున్నై! నవ్యుల్లోనే కొందరిలో పూర్వసంప్రదాయాభిమానం కల్గి తత్ప్రచారం కొంచెం సాగించారు. నోరి విశ్వనాథలవంటి ముఖ్యులు సంప్రదాయానుసారంగా నవ్యతను తెచ్చి భాషా సారస్వతాలను వెలయించాలని ప్రయత్నిస్తున్నారు. చాలా ప్రశంసనీయం. మాలపల్లిలో భాషా, నవలావిధి సిద్ధి పొందినై! ఇది భాషామతల్లికి నవ్యాభరణం. దేశదృష్టి పూర్ణంగా సారస్వతం మీదికి ప్రసరించటానికి వీల్లేకపోయింది. రాజకీయం బలవత్తరంగా ప్రబలిపోయింది. పత్రికలు కొన్ని కొత్తవి పుడుతున్నై! పాతవికొన్ని అంతరిస్తున్నై! ఆంధ్ర కృష్ణాపత్రికలు మాత్రం యథాశక్తి దేశభాషాసేవలు చేస్తూనేవున్నై!* భారతి నవ్యసాహిత్యానికి చాలా ఉత్సాహం కల్పించింది. ముట్నూరి కృష్ణారావుగారు తమ రాతలతో యువకుల చిత్తాలను దోవ తప్పకుండా కాపాడుతూనే వున్నాడు. జాషువాకవి సారస్వతసేవకు మతం అడ్డుకాదని గొంతెత్తి చాటడం ప్రారంభించారు. ఇది వక గొప్ప భాషాసేవ అని నాఅభిప్రాయం.

*ఈరెండు పత్రికలకూ బెజవాడలో బ్రహ్మాండమైన రజతోత్సవ సన్మానాలు జరిగినై.

సాహితి అంతరించింతర్వాత నవ్యసాహిత్యానికి పత్రిక లేకపోవడంచూచి సభాపతీత్యాదులు కృషిసల్పుతున్నారు. గిడుగువారుతమ ఉద్యమం దేశంలో బలంచేకూర్చుకోవడంచూచి చాలాఆనందం పొందుతున్నారు. ఆయనకు షష్ఠిపూర్తి చెయ్యాలని దేశమంతా ప్రయత్నిస్తున్నారు. పింగళి కాటూర్లు తమ గురుదక్షిణను సేకరించుకుంటున్నారు. విశ్వనాథలో "వక్రసాక్షీ" పంథలు రెండూ కలిసి ఆయనరాతల కొక పార్థక్యం కలగచేస్తున్నై! శ్రీ శ్రీ గారూ వారి శిష్యులూ రాబోయ్యే వర్షాకాలానికి మేఘాలవడానికి తయారౌతున్నారు. వెనకటి వసంతకోకిలాలు కొంచెం కొంచెం వెనకబడుతున్నై. రాయప్రోలువారి కంఠం తరుచు వినపడకపోయినా వినపడ్డప్పుడు దేశానికి ఉత్తేజకరంగానేవుంది. సభాపతిగారు తమ సహజ మధుర కావ్యరచనను సాగిస్తూనేవున్నారు. నండూరువారు చాలా తక్కువగా బయటపడుతున్నారు. నవ్యపక్షబాహుళ్యంచేతనో యేమో అల్పసంఖ్యాకులుగా వుండేరోజుల్లో కనపడ్డ స్నిగ్ధత కొంచెం తగ్గినట్టు కనపడుతున్నది. పంచాగ్నులవారు తమ చేయూతను నవ్యసాహిత్యానికిస్తూనేవున్నారు. ఈకాలాంతానికి సారస్వత మీాస్థితిలో వుంది. ఖండకావ్యకథానికలు వకవిధమైన స్థైర్యాన్ని పొంది యింకా అభివృద్ధికి పొయ్యే సూచనలు కనపడుతున్నై!

అక్కడక్కడా కొందరు త్యాగజీవులు శనివారపు సుబ్బారావు ముదిగంటి జగ్గన్నశాస్త్రిగారివంటివాళ్లు దేశభక్తినిపురికొల్పే గ్రంథాలను ప్రచురించడానికి పూనారు. వీరిలో శనివారపు సుబ్బారావుగారు వయోజనవిద్యను తరిచి దాన్ని ప్రచారంలోకి తెచ్చాడు. దేశానికి సంబంధించిన అనేక ఆర్థికవిద్యావిషయక లెక్కలను యెత్తి చూపాడు. చాలా ఉత్సాహమ్మూ పట్టుదలా కల మనిషి. జీవించి ఉంటే యెంతో దేశసేవ చేశేవాడు.

జగ్గన్నశాస్త్రిగారు తణుకులో పల్లెటూరు గ్రంథమాల స్థాపించాడు. కాని ఆదరణ తక్కువై పోయింది. "1925 లగా

యతు 1931 వరకు పల్లెటూరు గ్రంథమండలిపేరిట సుమారు 15 పుస్తకములను వ్రాసి ఆంధ్ర భాషామతల్లిని సేవించితిని." వేలూరి శివరామశాస్త్రిగారు విశ్వదాత ప్రేరణవల్ల గాంధీగారి "ఆత్మకథ"ను భాషాంతరీకరించాడు. జగ్గన్నశాస్త్రిగారు స్వయంగానే జవహర్లాలు నెహ్రూగారి "ఆత్మకథ"ను అనువదించాడు. ఇది మొదటిదానికంటే సాఫీగాఉంది. ఈ రెండో గ్రంథం శైలినిగూర్చి డాక్టరు పట్టాభిగారిట్లా అన్నారు. "ఆంగ్లగ్రంథములను తెనిగించునప్పుడు, తెనుగు తర్జుమా వలెనుండక, మూలమే తెనుగా అనిపించవలెను." జగ్గన్నశాస్త్రిగారు అనేకమార్లు శ్రీకృష్ణజన్మస్థానానికి పోయినవాడు !

ఈకాలంలో మరికొందరు ప్రాచీన పురాణగ్రంథపరివర్తనాలను బొత్తుగా వదలలేదు. అటువంటివారిలో మామిత్రులు చిప్రకుల అప్పయ్యశాస్త్రిగారు "గర్గభాగవతా"ది గ్రంథాలను రచించి భాషాసేవ చేశారు. వీరు సనాతనధర్మవాదులు. మతంలో, భాషా విషయాల్లోకూడా సనాతనవాదులనడంలో యేమీ తప్పులేదు. కాని సహృదయుడు. వ్యావహారికమన్నంతమాత్రాన గ్రంథాన్ని నిరసించేటంత సంకుచితదృష్టి కలవాడుకాడు. వీరి "గర్గభాగవతం" యీ కాలంలో రచింపబడ్డ ఉద్గ్రంథాల్లో వకటి. చక్కని నిర్దుష్టశైలి. ఇతర గ్రంథాలు బాలనీతి, వేంకటేశ్వరవిన్నపములు మొదలైనవి ప్రచార విలువగలవి కొన్నున్నై! ఈన సనాతనమతప్రచారానికి "దివ్యవాణి" అనే వారపత్రిక స్థాపించి నడుపుతున్నారు. సికిందాబాదాంధ్రులలో మకుటాయమానులలో నొకరు.

పత్రికలు చిత్రకారుల కవకాశమిస్తే చిత్రకళకు చాలా దోహదం చేసినై. చిత్రకళకూడా కావ్యనిర్మాణంతోపాటు అభివృద్ధి పొందుతున్నది. దామెర్ల రామారావుగారూ, అడివి బాపిరాజుగారూ యింకా యితరులూ యీవీధిలో చాలా కృషిచేశారు. తలిశెట్టి రామారావుగారి చిత్రాలను భారతిలో చూచినవాళ్లు వారు చిత్రకళద్వారా యీకాలపు ఆచారవ్యవహారాలను చిత్రించడంలో కనపరచిన ప్రతిభను తెలుసుకునేవుంటారు.

# నవ్యాంధ్ర సాహిత్యవీధులు

## ౧

### కాలపరివర్తనం, స్వభావం :

వెనకటి దశవర్షకాలారంభంలో యెట్లాగైతే రాజకీయాందోళనతో ప్రారంభించామో అట్లాగే యిప్పుడుకూడా ప్రారంభించాము. 1931 సంవత్సరములో రెండో సత్యాగ్రహ సమరం ప్రారంభమైంది. మళ్ళీ నాయకులంతా జైళ్ళలో కెళ్లారు. దేశం గందరగోళంతో నిండి వుంది. ఈకాలంలో వెనుకటట్లె ఉత్సాహం కల్గచెయ్యడం అవసరమంతగా లేకపోవటంచేత వెనకటి దేశీయగీతాలే వినియోగించినై ! కవుల కంఠము వినపడకపోవడానికిదో కారణం. ఈరెండో సమరం గట్టి గింజలనూ తాలునూ వేరుచేశింది. గట్టిగింజలు నిలిచినై! తాలు గాలికెగిరిపోయింది. అస్మదాదులు యెగిరిపోయినాము. నవ్యకవులలో చాలామంది తమ ప్రణయంలోనూ, ప్రకృతివర్ణనల్లోనూ, యింకా యితరాంశాల్లోనూ, మునిగిపోయి దేశాన్ని మరచిపోయినారు. కొద్దిమంది మాత్రం ఆంధ్రరాష్ట్రమంటే ఉద్రేకం కలగ చెయ్యడానికి ప్రయత్నించటం మొదలెట్టారు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వంటి వాళ్లు కాంగ్రెసునూ, దేశం గౌరవిస్తున్న నాయకులనూకూడా విమర్శిస్తూ, ఆంధ్రరాష్ట్రం మీద దృష్టిలేని ఆంధ్రనాయకులను దూషించడానికి వెనుదియ్యకుండా యిష్టమొచ్చినట్టు రాయటం ప్రారంభించారు. యువకుల్లో కొందరుకూడా యీ చిత్తవృత్తిని గ్రహించినవాళ్లున్నారు. ద్వితీయ సత్యాగ్రహ సమరానికి పరిణామంగా గాంధీ ఇర్విను వడంబడిక జరిగి జైళ్ళల్లో వున్నవాళ్ళంతా బయటికొచ్చారు. బయటికొచ్చినవాళ్ళల్లో సారస్వత ప్రియులు, పత్రికలకు వ్రాతగాండ్లగానో, పరిత్రగంథ రచయితలగానో, ఇనూస్య

రెన్నో యేజెంట్లుగానో, వర్తకులుగానో పొట్టపోసుకోటం మొదలెట్టారు. ఏం చేస్తారు మరి? "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అని ఆర్యోక్తి! కొంతమంది వ్యక్తులకోసం కొన్ని యిన్స్యూరెన్సు కంపెనీలే స్థాపింపబడ్డై! ధనమూ, పలుకుబడీ, అదృష్టమూ, వున్నవాళ్ళు నెగ్గుతూనేవున్నారు. కొందఱు న్యాయవాదులుగా మళ్ళీ చదివి పరీక్షలై ప్రాక్టీసుచెయ్యటం మొదలెట్టారు. రెండు సత్యాగ్రహ సమరాల ఫలంగా దేశంలో ఉత్సాహం క్షీణించింది. జైళ్లల్లోకి వెళ్లి వచ్చినవాళ్లంతా విశ్రాంతిని కోరారు. ఇంతలో మళ్లీ శాసనసభలకు వెళ్ళాలనే పక్షం ప్రబలింది. ఇంకేం! అందరికీ మళ్ళీ చేతినిండా పని దొరికింది. బుద్ధిప్రతిభగల వాళ్ళకు వాటిని చూపించే అవకాశ మొచ్చింది. దేశంలో కాంగ్రెసుకే పలుకుబడి వుండటంచేత వోట్లు అధికంగా కాంగ్రెసు అభ్యర్థులకే వచ్చినై! జిల్లాబోర్డు, మ్యునిసిపాలిటీలు, శాసనసభలు ఖద్దరువాలాలతో నిండిపోయినై! వెనకటి కులకక్షల కుళ్ళంతా ఖద్దరుచాటున ప్రబలటం మొదలెట్టింది. నిజమైన త్యాగంచేసినవాళ్ళు యెక్కడైనా ఆశ్రమాల్లోనో జాతీయ స్కూళ్ళల్లోనో తలదాచుకోవలసి వచ్చింది. మళ్లీ అవే జస్టిసు సూత్రాలు, అవే బ్రాహ్మణ బ్రాహ్మణేతరకక్షలు! పాతసారాయే! సీసాలు మాత్రం కొత్తవి! ఈకాలంలో కాంగ్రెసువారి పరిపాలనను గూర్చి యెంత తక్కువచెబితే అంత మంచిది. ఈప్రకారంగా యిప్పటికీ రాజకీయ వాతావరణ మిట్లాగేవుంది. కాంగ్రెసు అధికారం వల్ల వచ్చిన పరిణామం యేమిటంటే దేశంలో వెనకటికంటె కుల కక్షలూ, పరస్పరవైరమూ యెక్కువైంది. తుదకు కాంగ్రెసులోనే అంతఃకలహాలు ప్రబలినై! వాటితోనే యిప్పటికీ వాతావరణం నిండి ఉన్నది. ఇంతలో యుద్ధం వచ్చింది! కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా నిచ్చినై! కాంగ్రెసు ప్రభుత్వంవల్ల దేశంలో గొప్పగా చెప్పుకోతగ్గ విశేషాలేం కలగలేదు. విశ్వవిద్యాలయం మరోకొందరు

వ్యక్తులకు రంగస్థలమైంది. ఈమధ్య ఆర్థికదుఃస్థితి వచ్చి మళ్లీ కొంచెం దేశం రెకొ్కన్నది. ఇప్పుడు మళ్లీ అంతరాత్మను నమ్ముకున్నవాళ్లకు తావు చాలా తక్కువగా వుంది. సినిమారంగమొచ్చి కొందరు కవులకూ, సంస్కర్తలకూ, పెద్దమనుష్యులకూ, పని కల్పించింది. ఖద్దరు కట్టుకునేవాళ్ళూ, క్రాపింగు దువ్వుకునేవాళ్ళూ, ధోవతిజుబ్బాలూ మాత్రమె తొడుక్కునేవాళ్ళూ, 35 వత్సరాలకు లోపలవయస్సున్న వాళ్ళల్లో ప్రతి సినీమాచిత్రానికీ వెళ్ళనివాళ్ళు చాలా అరుదు. కాఫీ హోటళ్ళూ, చుట్ట బీడీ సిగరెట్టు కిల్లీదుకాణాలూ, రైల్వేలూ, సినిమాలూ వీటికిమాత్రం నిత్యాగల్యాణం పచ్చతోరణం! వినోదినీ, ఢంకా, మొదలైన అణా బేడ పత్రికలకున్న ప్రచారం ఇతరవాటికి లేదు. ప్రజామిత్ర యెలక్షన్లకోసంపుట్టి, సినీమాలతో బతుకుతున్నది. జనవాణికూడా యెలెక్షన్లల్లో పుట్టింది కాని కమ్మవారి పత్రిక కాక పోవడంచేత నశించింది. రాజకీయం హెచ్చుతగ్గులతో రాజకీయపత్రికలకు పలుకుబడి హెచ్చుతగ్గులుగావుంటుంది. ఇక నవ్యసాహిత్యంకోసం పుట్టిన వైశాఖి, సఖి, ఉదయిని, చంద్రిక మొదలైన పత్రికలు కొన్నాళ్ళు నడిచి అంతరించినై! ఉత్సాహవంతులకు ద్రవ్యంలేదు! ఉత్సాహం లేనివాళ్ళదగ్గిర ఉండి లాభంలేదు! కాని దేశానికి యథాశక్తిగా యేదోవకశాఖలో సేవచేయాలనే ఆశ చాలామంది యువకుల్లోవుంది. నాట్యంలో అభిరుచి వున్నవాళ్లు దాన్లో యేదోవకపని చేయడం మొదలెట్టారు. కవికుమారులు యేవో తమకు తోచిన వెర్రొమొర్రో వేసుకునే పత్రికలకు పంపుతున్నారు. కథకులు యేదో కథలు రాస్తున్నారు. సభలుజరిపి వాట్లో మాట్లాడి కొందరు బుల పాటం తీర్చుకుంటున్నారు. పత్రికల్లో తమ పేర్లచ్చొతున్నయ్యని కొందరు సంతోషిస్తున్నారు. కొందరు రాతగాండ్లు అన్యోన్యాభినందనాలతో వాళ్ళరాతలను వీళ్లూ, వీళ్లరాతలను వాళ్లూ మెచ్చుకుంటూ కాలం గడుపుకుంటున్నారు. కొందరుపెద్దలు తామెప్పుడో ఆర్జించిన

కీర్తితో వర్తకం జరుపుకుంటున్నారు. కొందరు ఆంధ్రరాష్ట్రంకోసం యెంతైనా త్యాగంచేస్తామని ప్రగల్భాలుకొడుతున్నారు. కొందరు కాంగ్రెసును విమర్శించడంతో తృప్తిపొందుతున్నారు. కొందరు అసలు తమరెవ్వరో మరిచిపోయి సూటులు లాగూలువేసుకుని చాలా గొప్ప విజ్ఞానవంతులమని గప్పాలుకొట్టుకొంటూ, కాఫీహొటళ్ళకూ సినిమాలకూ పోతూ, యెట్లా ద్రవ్యం తెస్తున్నారో తెలియకుండా సంచరిస్తున్నారు. బ్రిటిషిండియాలో యెక్కడా ఉద్యోగాలు లభించకపోవడంచేత, లభించేచోట్లకు దూరమనుకోకుండాపోతూనేవున్నారు. రైళ్లుపట్టకుండా ప్రయాణీకులు! సీజనుజోన్ టికెట్లుపెట్టి రైల్వే కంపెనీలు ద్రవ్యం ఆర్జిస్తున్నై! కాఫీహొటళ్ళలో ఖాళీ కుర్చీలుండటంలేదు. ప్రయాణాలు చెయ్యటం వక ఫాషనైపోయింది! బస్సుల్లో చోటే దొరకడంలేదు! ఎక్కడ చూశినా పిపీలికాదిబ్రహ్మపర్యంతం చర్చలే! రైళ్ళల్లోవింటే అంతర్గ్రామం దగ్గర్నించీ అంతర్జాతీయందాకా చర్చలే! ఎవ్వాళ్ళకూ ఎవ్వాళ్ళయెడలా యెట్టి భక్తిశ్రద్ధలూ కనపడటంలేదు. స్కూళ్లూ కాలేజీలూ యెన్నికొత్తవిపెట్టినా చాలడంలేదు. గ్రాడ్యుయేట్లసంఖ్య నానాటికి హెచ్చుతున్నది. ఉద్యోగాలుదొరకక నిరుద్యోగపిశాచం దేశమంతాఆవరించింది. యువతీయువకులు పెండ్లంటే భయపడుతున్నారు.* స్త్రీపురుషుల కట్లు, బొట్లు, జుట్లు మొదలైనవాట్లో చెప్పడానికి వీల్లేని మార్పులొస్తున్నై! వాటికి

---

* *"A number of factors such as the dis-organisation brought about by the last war, economic conditions favouring late marriages, The passion for self-expression, weakenad parental control, in-adequate sex-education, Fruedian psychology, and the knowledge of the methods of birth-control which saves us from the fear of natural Consequences, have brought about a laxity in standards."*

*"Economic independence with freedom from the ties of marriage and the responsibilities of motherhood is the ambition of many a young woman of the growring Smart set."*

*"Kalki" Sir Radhakrishnam.*

సినిమాకంపెనీలు ఫాషన్లుదిద్దుతున్నై! కూరకొనుక్కోడమైనా మానేశి ఫేసుపౌడరు వేసుకునిసినీమాకెళ్ళడం ప్రబలిపోయింది!* గ్రంథకర్తలకు అచ్చుఖర్చులు గిట్టడంలేదు. పుస్తకాల్లో సఖం స్థలం కాళీయే! ప్రతి వాడు యేదోపనిఉన్నట్టు పిలిస్తే పలకకుండా నడుస్తూవున్నాడు! మోటార్లు మేఘాలమీద పోతున్నై! ప్రజలు ఊరికే యిటూఅటూ కదులుతూ వుంటారు. కారణమేమిటంటే చెప్పరు! కొద్దివాళ్ళకూ గొప్పవాండ్లకూ వాళ్ళకు తగినట్టు అప్పులు! ప్రతివాడూ ఆదాయా నికిమించి జీవిస్తున్నాడు. సమయమొచ్చినప్పుడు అవసరమైన దాని కంటే యెక్కువ ఖర్చుచేస్తున్నాడు. బంగారం ప్రియమవడంచేతా, కొత్తసొమ్ములమీద బుద్ధిపోవడంచేతా, చెంబమ్మి కంచం, కంచ మమ్మి చెంబు చేయించి పనివాళ్లకు పని కల్పిస్తున్నారు! దేశంలో ఆర్థిక దుస్థితి యెంత యెక్కువగా ఉందో అంత బ్యాంకుల సంఖ్య యెక్కు వైంది. ప్రతివాడూ యితరుల ద్రవ్యం వాడుకుందామనే! కొన్ని బ్యాంకులు, డైరెక్టర్లు ద్రవ్యం యిష్టమొచ్చినట్టు వాడుకోవడంచేత దివాలాలుకూడా తీసినై! కంపెనీల సంఖ్య యెక్కువైనై! టీ, కాఫీ, కంపెనీలు ఆవస్తువులకు ప్రచారం యెక్కువ చెయ్యడానికి డిపార్టుమెంట్లు స్థాపించారు! వాటిని తాగని స్త్రీ పురుషుల సంఖ్య చాలా తక్కువ! ఇన్స్యూరెన్సు యేజెంట్లు ప్రజలమీద దయచూపి తమ ప్రచారం చేస్తున్నారు! సనాతనులను చూస్తే సంస్కార చికీర్షువులకు గిట్టదు! వాళ్లనుచూస్తే వీళ్లకు అసహ్యం! శారదా చట్టమొచ్చినా కట్నాలు తగ్గలేదు! ఎంత చదువెక్కువైతే అంత యెక్కువ మొత్తం! సిగ్గేస్తుంది యిటువంటి సంగతులు చెప్పటానికి! విజ్ఞానానికి ఫలం నేపథ్యాదికం కాదనీ, హృదయ వికాసమనీ యెవ్వరూ గ్రహించడంలేదు. అన్నిటికేంగాని వకటిమాత్రం గర్హించ

* ప్రజలలో కళాప్రీతి యెక్కువై పోయింది! కాని ఆత్మవికాసానికి సంబం ధించిందే కళ అని మాత్రం యెవ్వరకీ తోచటంలేదు!

వలసిన విషయం. తుచ్ఛకామానికి (sex) ప్రచారం చాలా హెచ్చింది. *దానికి కొన్ని పత్రికలూ కొందరు వ్యక్తులూ ప్రచారం చేస్తున్నారు. ప్రతిపత్రిక ముఖపత్రమూ స్త్రీ చిత్రసంకలితమే! అందులో కొన్ని అశ్లీలపూరితాలు. ప్రతి సినిమా ప్రకటన స్త్రీ పురుష ప్రేమనటనసమన్వితమే! బట్టలమీద బొమ్మలుకూడా యిటువంటివే! పత్రికల్లో వేసే కథల్లో ముప్పాతికవాటికి యిదే వస్తువు! అదీ న్యాయమైన భార్యాభర్తృ ప్రణయం కాదు. సినిమా చిత్రాలు కూడా దీనికి దోహదం చేస్తున్నై! ఈ విషయంలో సంగతులన్నీ తలుచుకుంటే చాలా జుగుప్సాకరంగా వుంటుంది. యువతీయువకుల హృదయక్షేత్రాలు మలినాలైపోయిన తర్వాత జాతిశీలం భద్రంగా వుంటుందా?♦ ఈవిషయం పిన్నలూ,

* "నేటి మన (సినిమా) చిత్రములలో అవినీతి ప్రచారము తలయెత్తుచున్నది. ఇది సంఘమునకు విషకీటకము వంటిది. దానిని పెరుగకుండ అణచివేయు బాధ్యత చిత్రదర్శకులమీద నేయున్నది. ధనార్జనము మాత్రమే ప్రధానముగ భావించి పామరజన పూరితమైన మన ప్రస్తుత సంఘమునకు ప్రదర్శించుటకై అవినీతి ప్రచార చిత్రముల నిర్మించుట మిక్కిలి హేయము, గర్హ్యము, నీతిబాహ్యము."

(ఆంధ్రపత్రిక 25-10-40 చిట్టారామకృష్ణారావు)

*"Looseness (of sexual life) is commended in good fiction and accepted in high society..............Many 'sin' not so much out of fashion, as owing to a feeling that a married woman ought to have lovers. Sexual promiscruity is getting to be regarded as a social duty."*

(*Kalki*)

♦ "ప్రతిభ" రేమంటున్నదో చూడండి.

మనదేశంలో యిప్పుడు పత్రికల సంఖ్యావిషయంలో యేమీ కొదువలేదుగాని, అవి నిర్వహిస్తున్న పని మాత్రం యేమీ తృప్తికరంగాలేదు. కథలకు వస్తువు శృంగార విషయమొక్కటే అని, హాస్యానికల్లా మూలము స్త్రీలజీవితము అవినీతికరంగా ఉన్నట్లు నిరూపించి అతివిస్తారముగా అసభ్యవర్ణన చేయడమనీ, యీ మొదలైన అభిప్రాయాలు యిప్పటి చిల్లర (కాదు గొప్ప) రచయితల్లో వ్యాపించియున్నవి. జుగుప్సా

పెద్దలూ, ఆలోచించవలసివుంది. మహర్షులూ, ప్రవక్తలూ, చాలా యెక్కువై పోయినారు. తన్మతాలు సులభమోక్షసాధకాలుగా కనపడడంచేత అనుయాయులు చాలా హెచ్చుగా చేరుతున్నారు. సన్యాసులు ఆశ్రమాలను స్థాపించడం యెక్కువైంది! భక్తిసిద్ధాంతాలకు ప్రచారం చాలా హెచ్చింది. సుఖసాధనాలు మనుష్యుల చిత్తాలను ఆకర్షిస్తున్నై! సుఖమే పరమావధిగా పరిగణింపబడుతున్నది. రాజకీయంలో సామ్యవాదం హెచ్చుమందికి నచ్చుతున్నది. వకవైపున కొందరు పేదవారిపైనా, కర్షకకార్మికులపైనా సానుభూతి చూపుతూంటే, మరికొందరు కేవల దైహిక మానసిక సౌఖ్యంకోసం యత్నిస్తున్నారు. క్రికేట్ టెన్నిసుపందెమంటే రైలుచార్జి యెంతైనా వెళ్ళాలిసిందే! ప్రతి ఫిల్ము తప్పక చూడాలిసిందే! భరతనాట్యమూ, కత్తాకాలీ, అయితే తెలియకపోయినా తలలూచాలశిందే! ద్రవ్యం లేకపోయినా యితరుల ద్రవ్యంతోనైనా టీ కప్పు చప్పరించాలిసిందే, సిగరెట్టు, పఫ్‌పీల్చాలశిందే! కొందరి పాండిత్యమిందులో క్యాటలాగు పాండిత్యం! సంభాషణ చేస్తూచేస్తూ తాజా క్యాటలాగులోనించీ సేకరించిన వక పుస్తకంపేరు విసిరి "...ది చదివావు" అనడమూ యెదటివాణ్ణి దంగుచేయడమూ! మాటల్లో వకదానికీ యింకోదానికీ సందర్భం లేకుండా మాట్లాడి చాలా గొప్పవాళ్ళమనుకోడం!* ఈ ప్రకారంగా వున్న సంఘంసారస్వతంలో

కరమైన వ్రాతలూ, వాటి కనుగుణముగా వుండే చిత్రపటములూ ప్రకటిస్తూవున్న పత్రికలు చెలామణీ అవుతూ వుండడము విషాదకరముగా వున్నదనీ, ఇట్టి వాఙ్మయమూ చిత్రలేఖనమూ అరిష్టదాయకములనీ, స్త్రీలవిషయమై వ్రాసేటప్పుడు, మాతృభావమూ, ఉత్కృష్టప్రేమభావమూ, మనసులోపెట్టుకుని రాయవలెననీ గాంధీజీ సెలవిచ్చినారు."

* ఈకాలంలో ఆటలమీదా, పాటలమీదా, నాట్యంమీదా యిష్టమేకాకుండా సులభంగా ధనార్జనచేసే మార్గాలు వెతకడం కూడా వకటికల్గింది యువకచిత్తవృత్తుల్లో. అందుకని అనేకులు "cross word puzzles" "solve" చెయ్యడం మొదలెట్టారు. ఇది సాహిత్యంలోకి కూడా యెక్కింది!

ప్రతిబింబిస్తూనే వుంది. ఎంత ప్రతిబింబిస్తున్నా కొందరు వ్యక్తులు ధృవనక్షత్రాలల్లే దోవచూపిస్తూనే వున్నారు. వారికి దేశమంతాకృతజ్ఞంగా వుండాలె !

**సాహిత్య స్థితి :**

ఈ దశవర్షకాలంలో జరుగుతున్న సాధన యింత అని చెప్పటానికి వీల్లేదు ! అచ్చవుతున్న పుస్తకాలూ, ప్రచురింపబడుతున్న పత్రికలూ చూస్తే విషయవైవిధ్యం చెప్పనలవికాదు. కాని ఖండాంతరాల్లో శాస్త్రాలన్నీ అపారంగా పెరిగిపోతున్నై ! వాటిమీద అసంఖ్యాకాలైన గ్రంథాలు పుడుతున్నై ! మనం యీ విషయంలో యింకా చెయ్యవలసిన పని చాలావుంది. ఇందులో మన భాషాకుమారులు స్వతంత్రులుగా వుండటానికి వీల్లేదు. తప్పక యితర భాషల్లో గ్రంథాలనువదించాలశిందే ! అందులో పరిభాషది వక గొప్పచిక్కు ! ఇప్పుడు ప్రచురిస్తున్నవి స్కూళ్ళల్లో ఉపయోగాని కనుకూలించేవే గాని ఉద్గ్రంథానువాదం వకటైనా బయలుదేరలేదు. శాస్త్రపాండిత్యం కలిగి, భాషాజ్ఞానం కలిగి, రచనాసామర్థ్యం కలిగినవాళ్లు చాలా తక్కువగా ఉన్నారు. ఫిజిక్సులో బోసు మొదలైనవాళ్ల పరిశోధనలూ, రామన్ మొదలైనవాళ్ల పరిశోధనలూ మనస్సుకు పట్టించుకున్నవాళ్ళే చాలా తక్కువ. అటువంటివాళ్లల్లో ఉపజ్ఞతో రాయగలవాళ్లు బొత్తుగా లేరనే చెప్పాలె ! ఇక యెట్లావస్తవి ? ఈ విషయంలో ఉస్మానియా విద్యాలయం దారిజూపింది. దేశభాషల్లో ఉన్నతవిద్య గరపడం ప్రవేశపెడితే కదా యీ గ్రంథాలకవసరం అని అంటున్నారు ! నిజమే ! ఉస్మానియాలో వాళ్ల కవసరమైంది. వక భాషాంతరీకరణ సంఘాన్ని నియమించి అన్ని శాస్త్రాల్లో వున్న ఉద్గ్రంథాలు పరివర్తనం చేయించడానికి మొదలెట్టారు. అదే సరియైన పద్ధతి. మన విశ్వవిద్యాలయం యెప్పుడు మొదలెడ

తుందో! ఆపద్ధతి, అసలు మొదలెడుతుందో లేదో తెలియదు! ఇంగ్లాండులో విశ్వవిద్యాలయాలపని చూస్తే ఆశ్చర్యమేస్తుంది. సమస్త శాస్త్రాల్లోనూ అవి చేసినపనికి మేరలేదు. మన విశ్వవిద్యాలయాధికారులు యెన్నికలకూ, ఉద్యోగాలకూ తంటాలుపడటమేగాని విజ్ఞానవృద్ధి వాళ్లకి పక్కవాద్యం! నిజమైన వైజ్ఞానికుల చేతిలోకి రావాలె యీ సంస్థలు. అప్పుడేమన్నా మార్పుకలగాలె! శాస్త్రాలిట్లా వున్నవి. మిగిలినరాజకీయార్థికాలు యెట్లావున్నై! వాటిలో కొంచెం యింతకంటె నయమే. కాని అనేకమంది రాశే వ్యాసాలను సంపుటీకరణంచేసి గ్రంథరూపంగా ప్రచురించడంలేదు. వ్యాసాలు పత్రికలతో అంతరించిపోతున్నై! ముందు రాబోయే రాతగాళ్లకు వెనకటి పత్రికలను శ్రమపడి తిరగేసుకోడానికి అవసరంలేకుండా చెయ్యడానికి వాటినన్నిటినీ సంపుటీకరణం చెయ్యాలె. పుస్తకప్రచురణకర్తలీ విషయం శ్రద్ధ వహించాలె! ఈవిషయంలోకూడా విశ్వవిద్యాలయాలు చెయ్యతగినపని అపారంగా వుంది. గొబ్బూరి వెంకటానందరాఘవరావుగారు మొదలైనవాళ్ళు ఖగోళశాస్త్రాన్నిగూర్చి చేసేపని చాలా అపారంగావుంది. దాన్నంతనూ సేకరించి గ్రంథరూపంగాచేస్తే తప్ప అదంతా నశించిపోతుంది. జాతికి నష్టమొస్తుంది. చావలి వెంకటహనుమంతరావుగారు మొదలైనవాళ్ళు రాజకీయార్థికాలమీద వ్రాసేవన్నీకూడా గ్రంథరూపం పొందాలె! చరిత్రవిషయంలో మల్లంపల్లి, భావరాజు, రాళ్ళబండి, మారేమండ మొదలైనవాళ్లు చేశేపని అంతాకూడా గ్రంథస్థం కావలసిన అవసరం నేను యెంత నొక్కిచెప్పినా తీరదు. గ్రంథకర్తలకంటె లక్ష్మీపుత్రులైన ప్రచురణకర్తలీ విషయంలో శ్రద్ధవహించాలె! ఈ పనులు కొన్ని విశ్వవిద్యాలయానివి! 1932 సంవత్సరంలో భారతిలో శాస్త్రి మనకు విజ్ఞానం లేకపోవడాన్నీ కిందివిధంగా చెప్పాడు.

" ప్రపంచ పరిణామమును తెలుసుకొందమన్న ఖండాంతరదేశ

ముల చరిత్రలు మనభాషలో లేవు. భరతవర్షపూర్వోన్నతి నెరుగుటకు తదంతర్గతదేశముల యితిహాసములు లేవు. 'ఆంధ్రులన నెవరు, మన మెప్పుడెట్టి యున్నత్యవనతులుపొందినాము, నేటికి మనస్థితి కారణము లైన సన్నివేశములెట్టివి ?' ఈ విషయముల నవగాహనము చేసికొను టకు నేటివరకును సమగ్రమైన మనచరిత్రములే లేకపోయినవి. ఆంధ్రదే శముయొక్క భౌతిక స్వరూపమునైన తెలిసికొనుటకు మనకు భూగోళ శాస్త్రము లేదయ్యె ! జాతకగ్రంథములు పంచాంగములు నసం ఖ్యాకములు ! కాని ఖగోళశాస్త్రము ప్రకటింపబడదయ్యె ! మనకు గణితశాస్త్రము లేదు. ఇంజనీరింగు గ్రంథములు, సముద్రమునకు, భూగర్భమునకు, గనులకు లోహములకు సంబంధించిన గ్రంథము లును లేవు. కొన్ని ప్రకృతి శాస్త్రములకు ప్రవేశికలే గాని, విపుల పరిశోధనములు తెలుపు నుద్గ్రంథములు లేవు !...... యువకులకు శీల నిర్మాణమునకు దారిచూపు మహాపురుషుల జీవితములు ఒకటి రెండుతప్ప తగినన్ని లేవు. మహాపురుషుల యుపదేశములును, రచనలును లేవు. ......... సంగీతశాస్త్రముయొక్క వికాసమును తెల్పు యితిహాసము లేదు. ............... విపులమైన కవుల చరిత్రలేదు. సమగ్రమైన వాఙ్మయ చరిత్రలేదు. మనకింతవరకు సమగ్రమైన విజ్ఞానసర్వము, నిఘంటువులెవ్వి ?........ ఇట్లెటు చూచినా మన వాఙ్మయము వికాసము లేక, ఎదుగుబొదుగులులేక మూరాకువేయక, సభ్యవాఙ్మయముల గణమున స్థానము లేక గుంటపూవులు పూయుచున్నది. మహాపురుషులను సృష్టించగల జాతియొక్క నాగరికతకు నికషమైన వాఙ్మయము విషయమున మన ప్రముఖులు యేమియు తలపక, ఏమియు చింతింపక, ఏమియు పట్టించుకొనక, దేశమును, జాతిని, నాగరికతను, సభ్యతను వెనుకకు నెట్టుచున్నారు. కాని ఆంధ్రులు ముందంజవేసినారని యొక కేక విన బడుచున్నది. ఎందు ? అనుకరణమునందా ? అడుగులో అడుగు వేయుటయందా ?"

పై చిత్రం చాలా విషాదకరమైనా చాలామట్టుకు నిజమేనని వప్పుకోక తప్పదు. ఇది అంతా విశ్వవిద్యాలయం మూడువంతులు చేయవలసింది! ఈ విషయం యెక్కువగా తల్చుకుంటే కష్టంగా వుంటుంది కాబట్టి విశ్వవిద్యాలయాన్ని యెక్కువగా స్పృశించను. పరీక్షలు చేసి డిగ్రీ లిస్తున్నది! మెత్తని పదవులను కొందరికి కలగజేసింది! పై మాటలు 1932 లో రాశినా యిప్పటికీ చాలా వరకు వర్తిస్తూనే ఉన్నై! పైన శాస్త్రి ఉల్లేఖించినవికాక యింకా అనేకవిషయాలున్నై ఆంధ్రులిప్పటికీ తాకనివి. వాటినన్నిటిని చెప్పి యెక్కువగా విసిగించను. విద్య జనసామాన్యంలో వ్యాపిస్తేనేగాని పఠనాసక్తి పెంపొందదు. అది పెంపొందితేగాని పుస్తకములు ఖర్చు కావు. అవి ఖర్చౌతూంటేగాని ప్రచురణకర్తలు ప్రకటించరు. వేయి ప్రతులుఖర్చు అయిన గ్రంథాలను వెతికితే తెనుగులో చాలా తక్కువగావుంటై! వాటిలో పాఠ్యపుస్తకాల సంఖ్య యెక్కువ! అవికొనక తప్పదు విద్యార్థిగణం! ఆ గ్రంథప్రచురణంకూడా దేశీయులహస్తాల్లో పూర్ణంగా లేదు. ఏ మాక్మిలన్ కంపెనీయో, లాంగుమన్సు కంపెనీయో గుత్తకుతీసుకున్నవి. ఇటీవలనే మనవాళ్లు కొందరు విద్యాశాఖవారి సానుభూతిని పొందటానికి ప్రయత్నిస్తున్నారు. రామా మొదలైన కంపెనీలు ఆ విషయంలో కృషి చేస్తున్నవి. ఇక్కడ మళ్లీ పోటీ! దీనికంతకూ బీజం దేశభాషల్లో ఉన్నతవిద్య గరపడం! అది జరిగితే తర్వాతవన్నీ జరుగుతై! కాబట్టి మళ్లీ విశ్వవిద్యాలయమిక్కడ స్ఫురణకొస్తుంది! ఈ విధంగా సమస్యంతా అన్యోన్యాశ్రయంగా వుంది! గ్రంథకర్తలు తమ స్వాభిప్రాయల నివ్వటానికి గాని, తాము నిజమనుకునే విషయాలను తెల్పటానికిగాని వీల్లేదు. ఈ సమస్య రాజకీయంలోకి దిగవచ్చుకాబట్టి దీన్ని వదిలేస్తున్నాను! మన ఆర్థికం, రాజకీయం, మన విద్యా, మనచేతిలో కొచ్చిందాకానూ, వచ్చినవి కరుడుగట్టిన సనాతనుల చేతుల్లో వున్నన్నాళ్లూ మనకర్మం యిట్లాగే వుంటుంది! సనాతనులు మతవిషయంలోమాత్రమే లేరు?

అన్ని విషయాల్లోనూ వున్నారు. రాజకీయంలో సనాతనులు ప్రథమ ...డ్డంకి! అది తొలిగితే గాని అన్ని విధాల సనాతనులూ సెలవు ...సుకోరు!

## ౨

### సాహిత్యవ్యాప్తి! అనువృత్తి! అనుకరణము:

ఆధునికులు, 16, 17, 18 శతాబ్దాల్లో ప్రబంధ కవిత్వం గతానుగతికమైపోయిందని చాలా పలవరిస్తున్నారు. అది నిజం కూడాను. ఈకాలం అనగా 1920 నించీ 1940 వరకూ నవ్యసాహిత్యాన్నిచూస్తే పాడిందేపాట! కొత్తవాళ్ళు పాతవాళ్లను అనుకరించటం! ఇదే మార్గం. నవ్యత పురాణత కిందికి దిగింది! వీళ్లలో గవేషణవున్నవాళ్లకు కొంచెం ఆత్మ పలుకుతూవున్నది. ఇదివరలోనే చిత్తానికి చాలా వత్తిడి కలిగించినవాళ్లకు ఊట చల్లారిపోయిందనచ్చు. మధ్యరకంవాళ్లకు అవే ఊహాలు, అదే పలవరింపు, అదే ఆశ, అదే నిరాశ, అదే మాటలపోగు. ఒక కాలానికి నవ్యతన్నది మరొక కాలానికి పాతదై పోతుంది. దేశభక్తి ఎవరిలోనో కొందరిలో తప్ప మిగిలినవాళ్లలో ఆవెనకటి ప్రణయమే, ఆ వెనకటి ప్రకృతే ప్రేరకమౌతున్నది. ప్రకృతియొక్క వైఖరి అనంతమైనా వీళ్లకు వకే విధంగా కనపడడం, ఆకనపడ్డదాన్ని అనేక భంగులుగా వర్ణించడం. ఈ కాలంలో పత్రికల్లో, వెనకటిదశ వర్షకాలంలో పుట్టిన గృహలక్ష్మి చక్కగా భారతి ననుకరించి నడుస్తున్నది. ఒకొక్కప్పుడు దానికంటెకూడా ఆకర్షకంగా వుందా అనిపిస్తున్నది. ఉదయిని చంద్రిక, మొదలైనవి పుట్టి అనేక కారణాలచేత అంతరించినై! *

* "వీణ" అనేపేరుతో పాటిబండ మాధవశర్మగారొక పత్రిక స్థాపించి శ్రమతో నడిపాడు. "సఖి" అనే పేరుతో కొన్నిసంచికలొచ్చినై! "వైశాఖి" అని కొన్ని కూడావచ్చినై! ప్రతిభలోరాస్తూన్న అతి నవీన విమర్శకుడు అన్నాడు చూడండి, "అతినవీనుల రచనలకు తావిచ్చి, బాగా నవీనదృష్టి కలిగించి,

వినోదినీత్యాదుల కెప్పటికీ మోసంలేదు. చుట్ట బీడీ దుకాణాలకూ కాఫీహోటళ్ళకు నష్టంలేదుకదూ! అట్లాగే యివీని! గృహలక్ష్మి కేవలం స్త్రీలకువదిలితే బాగుండేది. కాని దానినిండాకూడా భారతిలో రాశేవాళ్ళ రాతలే! పరిశోధకులయొక్కా, శాస్త్రకర్తలయొక్కా చారిత్రకులయొక్కా, రాతలు చదవడానికి నూతనంగా ఉంటై! కథకులకూడా కొంచెం నూతనత్వం మిగులుతూనేవుంది. కాని యీ ఖండకావ్యకవిత్వం మాత్రం గతానుగతికమూ, అనుకరణమూను! భారతిపేజీలుతిరగెయ్యండి, గృహలక్ష్మి చూడండి, యివ్వేపేర్లు. ఈ వెంకట కాళిదాసకవులే అటుకొన్ని సరస్వతీగ్రంథమండలిలో నవలలూ యిటుకొన్ని ఖండకావ్యాలూ! ఆ జనమంచివారే; ఆ ఓలేటివారే; ఆ బొడ్డువారే; ఆ పూడిపెద్దివారే; ఆ కొంపల్లివారే; ఆ కవికొండలవారే; ఆ కందుకూరివారే; ఆ అధికార్లవారే; ఆ పురాణం వారే! ఒకొక్కప్పుడు పైశీర్షికకింద పేరు చూస్తే చదవ బుద్ధి కూడా పుట్టకపోవచ్చు. గృహలక్ష్మి కొన్నాళ్లు పఠితలకు కష్టంకలగ చెయ్యకుండా ముఖపత్రం చూస్తేనే యేది చదవాలో యేదిఅక్కర్లేదో తేల్చి, పత్రికపేజీలన్నీ తిరగెయ్యనక్కర్లేకుండా చేశింది! నావంటి వాడికి చాలా వీలుగా వుండేది! ఇక కథకుల్లో ఆ మల్లాది మొదలైన వాళ్ళే! ఒకామె పురాణం వినడాని కెళ్ళివచ్చినతర్వాత అక్కడ యేం చెప్పాడని భర్త అడిగాడట! "అక్కడా నీ మొగానే మొద్దులు

---

విశిష్ట సారస్వత సృష్టికి వీణ తోడ్పడితే పత్రిక సార్థక మౌతుంది." మాధవశర్మగారి ఐశ్వర్యపరిమితి నాకు తెలియదు! ఇట్టి కారణంచేతనే వెనకటి సాహిత్యాదులు చచ్చినై యని వీరికి మనవి. గృహలక్ష్మి వకమారు 1933 సంవత్సరంలో "గృహలక్ష్మి కంఠాభరణ" మనే పేరుతో వక చక్కని సచిత్రసంచిక ప్రచురించింది. దానిలో స్త్రీలుకూడా మగవాళ్లలై సరస్వసార్వతవీధుల్లో సంచరిస్తున్నట్లు దృష్టాంతాలు చూపుతూ రసవద్వ్యాసపద్య కథావళులు రచించగలరని నిరూపించారు. కేసరిగారిని అందుకు హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. మార్గం కనపడితే ఉద్రేకం బైటికొస్తుంది. గిడుగువారూ పంచాగ్నులవారూ యీ సంచిక నాశీర్వదించారు. ఈ యిద్దరూ రాయడం "యీసంపుటి గౌరవానికి ఉత్కర్షహేతువులే" అన్నది "ప్రతిభ".

పెట్టమన్నారన్నదట." ఎక్కడికిపోయినా యీ పేర్లే కనపడుతున్నై! ఇట్లా అన్నానని వీటిలో మంచి రచనలూ, కొంత నవ్యతా కనపర్చిన వాళ్లూ లేకపోలేదు.

ఈ కాలంలో కొంచెం కవిత్వమంటే మన ప్రాచీనుల అభిప్రాయమేమిటో తెలుసుకోటానికి కొందరు నవ్యులు ప్రయత్నిస్తూ, లక్షణ గ్రంథాలను రాయించటానికిచేసిన కొందరి ప్రయత్నాలు గ్రంథ రూపం కూడా పొందినై! వెనకటితరంలో అవ్వారివారి గ్రంథాలల్లే మల్లాదివారిదశ రూపకంవలె, సాహిత్యవిమర్శనగ్రంథాలు రాఘువయ్యం గారి అలంకారమంజరి కావ్యాత్మలు, బులుసు వెంకటరమణయ్యా గారి కువలయానందసారము, గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారి ఆంధ్ర నాటకరంగం, భోగరాజు నారాయణమూర్తిగారి ఆంధ్రకవిత్వ చరిత్రము, పసుమర్తి యజ్ఞనారాయశాస్త్రిగారి నటప్రకాశిక, కవిత్వ వేది వాఙ్మయచరిత్రసంగ్రహం, నడుకుదుటి వీర్రాజుగారి నన్నెచోడుడు మొదలైనవి ప్రశంసనీయాలు. ఇక వ్యాసకర్తల్లో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, దువ్వూరి సూర్యనారాయణమూర్తి, మారేపల్లి రామచంద్రశాస్త్రి, వేకుమళ్ళ కామేశ్వరరావు,* పాటిబండ మాధవశర్మ, కీ. శే. అమరవాది హనుమచ్ఛాస్త్రి, కొణిదెన బాలకృష్ణయ్యా, శ్రీపాద కామేశ్వరరావు, రాధాకాంతయ్యా, తాపీ

* వేకుమళ్ల రాజగోపాలరావుగారు ఛందస్సులోనూ, వేకుమళ్ల కామేశ్వర రావుగారు లిపివిషయంలోనూ కొన్ని నూతన సలహాలిచ్చారు. వారు నూతన ఛందస్సు లుపయోగించమన్నారు. వీరు కొన్ని లిపిగుర్తులను సూచించారు.

రామమ్మ = రావఁమ్మ

ఫా = *pharmacy*

ఉ, ఆ, మొదలైనవి.

కామేశ్వరరావుగారు సర్కారుద్యోగి. ఈన పిల్లలకోసం అనేక పాటలు రాశాడు. పాలపిట్ట మొదలైనవి పిల్లలకు చాలా ఉపయోగార్హాలు. ఈనకు ప్రభాకర శాస్త్రి లక్ష్మీనరసింహశాస్త్రిగార్లు తమ "ఆంధ్రప్రతిభ"ను అంకితమిచ్చారు. వీళ్ళు కూడా కొన్నిగ్రంథాలను రచించారు. వాటిలో పుష్పబాణ విలాసమనువాదం; "పుష్ప మాల" ఖండకావ్యం.

ధర్మారావు, రాజా పార్థసారథిరాయనింగారు, ఆచంట బాపిరాజు, ఆకెళ్ళ శేషాద్రి, కట్రి సాంబమూర్తిశాస్త్రి, చిరుమామిళ్ళ శివరామ కృష్ణప్రసాదు, చర్ల గణపతిశాస్త్రి, జ. మాధవరామశర్మ మొదలగువారి రాతలు చాలా ప్రశస్తంగా ఉన్నాయనక తప్పదు. వీరున్నూ యింకా యితరులూ మన లక్షణశాస్త్రాన్నీ పాశ్చాత్యులదాన్నీ సమన్వయం చెయ్యటానికి ప్రయత్నాలు, ప్రత్యక్షంగా కాకుండా, పరోక్షంగానైనా చేస్తున్నారు. తూములూరి శివరామకృష్ణశాస్త్రిగారు తమ ఉభయభాషాపాండిత్యాన్ని తమ "నవ్యాభరణం" మొదలైన విమర్శనవ్యాసాల్లో వ్యక్తీకరించాడు. పూర్వులపాండిత్యం కలిగి నవీనాన్ని సహృదయదృష్టితో చూడటంలో వీరి రసపిపాస, నిష్పక్షపాతబుద్ధి తెల్లమౌతున్నది. రాయప్రోలువారి తృణకంకణానికి పైన పేర్కొన్నవ్యాసం చక్కని విమర్శనం. తెనుగుతల్లిలో పోతన్నను గూర్చిన వ్యాసం చాలా పాండితీసమన్వితమూ, విశేషాంశ సంకలితమూ, మనోహరమూ, అనకతప్పదు.♦ వేదాల తిరువేంగళాచార్యులుగారి ఆంధ్రకావ్యాలంకార సూత్రవృత్తి చాలా గొప్ప గ్రంథం. అనేకాంధ్రగ్రంథాల్లోనుంచీ ఉదాహరణా లిచ్చారు. ప్రతి ఆంధ్రుడు చదవవలసిన గ్రంథమిది.

ఇక శాస్త్రవిషయాల్లోనూ, పరిశోధనవిషయాల్లోనూ, కోరాడ రామకృష్ణయ్య, పరవస్తు వెంకటరామానుజస్వామి, డాక్టరు నారాయణరావు రాజగోపాలరావు సోమయాజులుగార్ల భాషావిషయాల్లోనూ కామరాజు, మల్లంపల్లి, భావరాజు, మానవల్లి; వంగోలు మారేమండ మొదలైనవారు చారిత్రక విషయాల్లోనూ;* గొబ్బూ

---

♦ ఈన "సరసభూపాలీయ వివరణ" మనేపేరుతో బట్టుమూర్తి గ్రంథానికి వ్యాఖ్యానం రచించాడు.

* కవిల కాశీపతి నాగార్జునకొండనుగూర్చి ఆంధ్రజాతికి తెల్పినందుకు ఆయన కాంధ్రమంతా కృతజ్ఞం! బుర్రా వెంకటసుబ్బారాయుడుగారు వేదకాలాన్నిగూర్చి

...త్యాదులు జ్యోతిశ్శాస్త్రంలోనూ; దువ్వూరి బాలకృష్ణమూర్తిగారు మొదలైనవారు వ్యవసాయశాస్త్రంలోనూ; గోటేటి జోగిరాజు మొదలైనవారు ఆరోగ్యశాస్త్రంలోనూ; చిత్రకళలో తలిశెట్టి రామారావుగారూ; చేసిన కృషి చాలా ప్రశంసనీయం. రాజకీయంలో వావిలి వెంకటహనుమంతరావు, మోచర్ల కృష్ణమూర్తి మొదలైనవారు చాలా శ్రమపడ్డారు.♦ విద్యావిషయాల్లో మారేమండవారి భారతీయ విద్యాచరిత్ర, డాక్టరు నారాయణరావుగారి ప్రాచీన విద్యాపీఠములు ప్రశంసనీయగ్రంథాలు. వేదం వెంకటాచలయ్యగారి "కతిపయ శబ్దార్థవిమర్శనం" చాలా హృదయంగమమై విజ్ఞానదాయకమైన వ్యాసావళి. ఈ విషయపరిశోధకుల్లో చిలుకూరివారి పేరూ డాక్టరు పుట్టపర్తివారి పేరూ కూడా ప్రశంసనీయాలే! కాకతీయ సంచికనుగూర్చి గర్భశైత్యా లున్నాయి. భావరాజు మారేమండ లోకమూలా, చిలుకూరు పుట్టపర్తు లోకవేపూ, తగాదా! తెలింగాణా శాసనాలనుగూర్చికూడా యిట్లాగే వుంది.

దిగవల్లి వెంకటశివరావుగారినిగూర్చికూడా యిక్కడ ప్రశంసిస్తాను. ఈన చాలా నిరాడంబరజీవి. విజ్ఞానవంతుడు. దేశభాషసేవాపరాయణుడు పైకి నిగురుగప్పిన నిప్పల్లే కనపడతాడు గాని, లోపల చాలా జాజ్వల్యమానజ్యోతికలవాడు. ఈన "అధినివేశస్వరాజ్యము" మొదలైనవి చాలా గొప్ప గ్రంథాలు. వీటికన్నిటికేంగాని తెనుగులో "పారిభాషిక నిఘంటువు"ను రచించి యావదాంధ్రదేశకృతజ్ఞతకు పాత్రుడైనాడు. ఇందులో వ్యావహారికపదాలూ, పారిభాషికపదాలూ

---

చాలా పరిశోధనం చేశాడు. కంభంపాటి అప్పన్నశాస్త్రిగారు వరంగల్లులోని కాకతీయులకు సంబంధించిన "వేయిస్తంభాలగుడిశాసనాన్ని" గూర్చి చాలా శ్రమచేసి ఒక గ్రంథం రచించాడు.

♦ మొసలిగంటి సంజీవరావుగారు "మహారాష్ట్రస్వాతంత్ర్యవిజృంభణం" రాసి జాతికుత్సాహం కల్పించాడు.

వాటి యింగ్లీషు సమానార్థకాలూ యివ్వబడ్డై. అనేక యితరభాషా పదాలూ పారిభాషికపదాలూ భాషలోకొచ్చినై. ఇంకా రావలశుంది. వాటి సమగ్ర నిఘంటువుకు శివరావుగారు పునాదివేశారు. ఇది యీ దశవర్షకాలంలో వచ్చిన గ్రంథాలలో భాషోపకారాన్నిబట్టి ఉత్తమశ్రేణిలోనిదని చెప్ప సాహసించనక్కరలేదు. ప్రతి ఆంధ్రుడు దగ్గిర నుంచుకొనవలసిన గ్రంథమిది. ఇటీవల బ్రిటిషు యుగంలోని భారతీయచరిత్ర రాశాడు. "ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర" అనే వక పాతతెనుగు వచనకావ్యం పునర్ముద్రించి భాషాసేవచేశాడు. ఈ గ్రంథం మొదట 1838 లో ముద్రితమైంది.

(ఆంధ్రపత్రిక 7-12-41)

కొందరు మహాపురుషుల జీవితచరిత్రలురాశారు. వారిలో ముననంగి లక్ష్మీనృసింహశర్మ, అడివి శంకరరావు, కోన వెంకటరాయశర్మ, కపిల కాశీపతి, జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి మొదలైనవాళ్లున్నారు. ఈసందర్భంలో పై వారుఅవలంబించిన"భాషాచిత్ర"పద్ధతి చాలా ప్రశంసించదగివున్నది. వెనకటి జీవితచరిత్రలల్లేగాక యివి భాషాచిత్రాలు. శీలపరీక్షలు. సత్యనారాయణగారి "ఆంధ్రమహాపురుషుల జీవితము"లూ, అవటపల్లి నారాయణరావుగారి "విశాలాంధ్రమూ" చెప్పదగిన గ్రంథాలు. "విశాలాంధ్రం" పుస్తకం యింకా విశాలమూ కర్త చిత్తం విశాలమూ అయినట్లైతే యింకా బాగుండేది! సత్యనారాయణమూర్తిగారు "మహాపురుషులజీవితాలే" గాకుండా యింకా "సాహిత్యతత్వవిమర్శ" "విద్యార్థప్రకాశిక" మొదలైన గ్రంథాలేగాక యింకా తాను మొక్కడికెళ్ళినా తద్యాత్ర వక గ్రంథంచొప్పున తయారుచేశాడు. ఈనను దినైక గ్రంథనిర్మాత అనవచ్చు. గ్రంథనిర్మాణమంటే యీనకు "నల్లేరుపైబండీనడక". అంతేగాక మొక్కవభావమూ అర్థమూ లేకుండా వందలపేజీలు నింపగల

సామర్థ్యమీనకుందని కొందరంటారు.* ఆంధ్రపత్రిక గ్రంథవిమర్శన శాఖలో వక అగ్రపీఠం అధిష్ఠించున్నాడు. నవ్యసాహిత్యవేత్తలకు తమ "ఆత్మప్రియ"మందు అత్యంతఆదరం! సమకాలికులైన మహా పురుషులనుగూర్చి రాయడం చాలాకష్టం! అటువంటి సందర్భంలో సత్యనారాయణగారి కృషీ చాకచక్యమూ చాలా ప్రశంసించదగినవి.♦

హాస్యరచనలో భమిడిపాటి కామేశ్వరరావుగారు తమ రాతలను భారతి పుటలద్వారా ఆంధ్రావళి కందిస్తునేవున్నాడు. ఈనతోపాటు నందివాడ చిదంబరంగారు ఆశ్రేణిలో చాలా ప్రశస్తిని పొందాడు. "వర్తకమందం" "దేవునిపై విశ్వాసరాహిత్య తీర్మానం" లోని హాస్యం రసపరిణతిని పొందిందనడంలో యెట్టి అభ్యంతరం లేదు. భమిడిపాటి, మొక్కపాటి, మునిమాణిక్యాలతర్వాత యీనకు తప్పక

---

*అది కొంతవరకునిజమే (చూ. ఆంధ్రపత్రికలో భద్రాచలంగూర్చి వ్రాశాడు.)

ఈన చాలా విపులంగా చదివినవాడవడంచేత యీన గ్రంథాల్లో అనేక గ్రంథాల్లోనించీ అనువాదాలు అసంఖ్యాకాలుగా వుంటై. ఈన వక విశిష్టశైలిని సంపాదించాడు. ఆంగ్లంలో కార్డినల్ న్యూమెన్ యొక్క భాషాభావ వైదగ్ధ్యం కొంత వరకు సేకరించి, తెనుగు గద్యశైలిలో పద్యగుణాలుగల గద్యాన్ని వకదాన్ని కని పెట్టాడు. ఈన శైలిలో ముట్నూరి శైలి లక్షణాలుకొన్నున్నై! ఈన అవకాశంవస్తే భారతీయ విజ్ఞానౌత్కృష్ట్యే న్నుగ్గడిస్తూవుంటాడు. చళ్లపిళ్ల, బలిజేపల్లి మొదలైన అనే కుల మెప్పునుపొందాడు రాశేభాషాభావాలకు. బుర్రా శేషగిరిరావుగారిట్లాఅన్నారు. *"This talented young Andhra author——as a prolific writer, attempting new sallies of style, treatment and out look, in Telugu prose, critical descriptive and imaginative after the manner of the foremost of European essayists."* ఈన బహుగ్రంథ నిర్మాతల్లో చేర్చవచ్చు. ఆధునికుల్లో యువకుల్లో ధర్మస్థాపనకై పాటుపడుతున్న కొద్దిమందిలో వకడు.

♦గోవిందరాజు సుబ్బారావు మొదలైనవారు కొందరు, పరమపదించిన మాస్టరు అంజి, పిల్లలమర్రి సుందరరామయ్య మొదలైన నటులజీవితాలనూ వాళ్ళ సామర్థ్యాలనూ స్పృశించారు.

స్థానమియ్యదగినవాడు. ఖాసింఖానుగారు పారశీక వాఙ్మయచరిత్ర రాయడమేగాక, డాక్టరు మహమ్మదు యిక్బాలుగారి భాషాసేవ నుగ్గడించడమేగాక, హాఫీజ్ మొదలైనపారసీకకవుల రాతలనూ, యిక్బాలుగారి రాతలనూ, కొన్నింటిని తెనుగుభాషలోకి తెచ్చి భాషకు అలంకారాలను కల్పించాడు. ఈన నాతోబాటు హైద్రాబాదులో సర్కారుద్యోగంలో, స్వతంత్రరచనకు కాలం చాలకా, రాస్తే ప్రచురించేవాళ్ళుదొరకకా, తంటాలుపడుతున్నాడు. రాతగాడికి రాతే పరమావధిగాని ప్రచురణంకాదు! అదిదేశీయులపని. కీట్సు రాసిన కొన్ని ఖండకావ్యాలను తెనిగించి నాకువినిపించాడు. మిక్కిలి శ్రోత్రపేయంగా ఉండి చాలా ఆనందాన్ని పొందాను. ఖురాన్‌కు సవివరణాంధ్రానువాదంరాస్తూ మొదటిసంచికప్రకటించాడు. చాలాఉద్గ్రంథం. పరమేశ్వరుడీన కుత్సాహమిచ్చుగాక! బాలవిజ్ఞానశాఖకు చింతా దీక్షితులు మొదలైనవారు తంటాలుపడుతూనే వున్నారు.* కొందరు పాతపాటలను పరిష్కరించి భారతిపేజీలలో ప్రకటించారు. కొందరు పెద్దలు మండాపాక ముద్దుకృష్ణేత్యాదులు చిన్న పిల్లలకు పాటలు రచించారు. బాలవిజ్ఞానశాఖ యితరవాఙ్మయాల్లో యెంత పెరిగిపోయిందో చెప్పలేను. మనం చేశింది ఆవగింజలో అరవైయోవంతు లేదు. ఇక్కడకూడా శాస్త్రాల్లో యెంతపని చెయ్యాలనో అంతపని చెయ్యాల శుంది. శాస్త్రాలంటే జ్ఞాపకమొచ్చింది. పూర్వమీమాంసాశాస్త్రాన్ని కాలేజీలో మా గురువులలో వకరగు శ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు ఉపన్యాసాలకింద రచించారు. వీరు యితర దర్శనాలనుగూర్చికూడా రాయటానికి సమర్థులు కాబట్టి యితరాలనుగూర్చి కూడా రాస్తే బాగుండును. వీరు గోదావరిజిల్లా అమలాపురం వాస్తవ్యులు. చాలా నిరాడంబరజీవి! నిగర్వి! ఉపకారవేతనం తీసుకుని విశ్రాంతి ననుభవిస్తున్నారు. భగవంతుడు దీర్ఘాయు విచ్చుగాక!

* తెనాలిలో "బాలకేసరి" అనేపేరుతో వకమాసపత్రిక ప్రకటిస్తున్నారు.

ఈ కాలంలో ప్రకృతిశాస్త్రాలమీద ఒకటంటే ఒకటే ఉద్గ్రంథం వెలువడింది. కాళీపట్నపు కొండయ్యగారి "విశ్వరూపం" యీ యుగాభరణం అని చెప్పచ్చు! వ్యావహారికభాషలో ఉదాత్తశైలి కాది శాస్త్రవిషయాలను అందరికీ అర్థమయ్యేటట్టు రచించి, శాస్త్రాలకూ వేదాంతానికీ సంబంధంకల్పించి, మానవుని విజ్ఞానానికితోడ్పడే యీ గ్రంథం యీ యుగానికి మకుటాయమానమైన వాటిలో ఒక టనటంలో యెంతమాత్రం అభ్యంతర ముండకూడదు. నవ్యకవితంతా ఒక యెత్తు యిది ఒకపుస్తకం ఒకెత్తు! ఆంధ్ర విశ్వకళాపరిషత్తు వారు దీనిని ప్రచురించటంకూడా ఒక విచిత్రవిషయం. పారిభాషిక పదాలకు భాష వెతుక్కోనక్కర్లే దని యీ గ్రంథకర్తగారు చూపారు!

ఇదిగాక హిందూదేశార్థికశాస్త్రంమీద ఒక గొప్ప గ్రంథము వెలువడింది. ఆత్మకూరి గోవిందాచార్యులుగా రొక గొప్ప త్యాగజీవి. ఈన పైకెంత అనాకర్షకుడుగా కనపడతాడో అంత లోపల ప్రతిభావంతుడు. గాంధిగారివలె కొల్లాయిమాత్రమే వస్త్రముగాకల త్యాగశీలుడు. ఎన్ని సత్యాగ్రహాసమరాలైనాయో అన్నిమాట్లూ శ్రీకృష్ణ జన్మస్థానానికి వెళ్లిన కార్యశూరుడు. మృత్యువు కంటబడ్డప్పుడుకూడా భయములేకుండా మనస్సు చలించని పట్టుదలకలవాడు. ఈన పండితుడు, కవి, రాజకీయవేత్త! ఈన రచించిన "హిందూదేశార్థిక చరిత్ర" చాలా గొప్పగ్రంథం. రెడ్డిగారి దానికంటె పరిమితిలో, విషయచర్చలో, ఆధునికతలో, శబలత లేకుండా నిష్కృష్టంగా చెప్పటంలో, చాలా ఉత్కృష్టమైనది. అన్నింటికంటె దానిలో యితరులను నిందించే సందర్భాలు లేవు! రెండు సంపుటాల్లో చక్కని శైలిలో రచింపబడింది. పరిభాషా పదజాలసృష్టిలో ఆచార్యులుగారు చూపిన విశిష్టత చాలా కొనియాడతగింది. కొన్నిచోట్ల కొందరురాశినట్టు ద్రావిడ ప్రాణాయామాలవలె ఉండకుండా పారిభాషిక

పదజాలం ఆపాతతః తెలిశేటట్టుగానూ, సులభముగానూ, పొట్టిగానూ ఉన్నవి. ఈన "ఆనందరామాయణము"నే పేరుతో వక ఉత్తరరామాయణకథాగ్రంథాన్ని పద్యప్రబంధంగా రచించాడు. ఈన "రాజ్యాంగ చరిత్రను" కూడా రాశాడు. ఏదిరాశినా సలక్షణముగానూ, నిమర్కాష్టముగానూ, రసవంతముగానూ రాయగలసమర్థుడు. రెండు శాస్త్రగ్రంథములూ రెండు రత్నములని చెప్పవచ్చు. రామాయణము అనర్గళధారకలిగి యెక్కడా కుంటువడకుండా వక్కమారు చేతపుచ్చుకుంటే విడవశక్యంకాకుండా, ఆపాతమధురమై ద్రాక్షాపాక సంకలితంగావున్నది. పండితపామర జనహృద్యంగావున్నది. ఈనకు సంపూర్ణారోగ్యాన్నిచ్చి యీనచేత యిట్టి గ్రంథాలను రచియింపించమని భాస్కరుడిని వేడుతున్నాను.

మరో రెండుపుస్తకాలనుగూర్చి ముఖ్యంగా ముచ్చటించాలశుంది. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి "సంస్కృత వాఙ్మయ చరిత్ర," డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి "ఆంధ్రభాషా చరిత్ర". ఈ రెండూ భాషకు మండనాయమానాలని చెప్పడంలో యేమీ అతిశయోక్తిలేదు. వాటికి ఆ గొప్పతనాన్నిచ్చింది కర్తల స్వతంత్రపరిశ్రమే! స్వతంత్రపరిశ్రమ యెప్పుడూ వృథాపోదు. శ్రీ శాస్త్రిగారు భాషకు వ్యాకరణంద్వారా చేసినసేవను వెనక మనవిచేశాను. వీరు ఋగ్వేదాదులు పఠించి స్వాభిప్రాయాలను కూర్చుకుని, మాక్డొనాల్డు మొదలగువాళ్ల అభిప్రాయాలను పరిశీలించి సవిమర్శంగా చరిత్రను రచించారు. కొందరు మాక్డొనాల్డుగారి ప్రతిబింబాలను సృష్టించారు. అటువంటివి తాత్కాలిక ప్రయోజనాలు కలవేగాని శాస్త్రిగారి గ్రంథంవలె సార్వకాలికప్రయోజనాలు కలవి కావు. నిర్విమర్శంగా యితరుల అభిప్రాయాలు గ్రహించటం శాస్త్రాల్లోనే సమంజసమూ, అవసరమూగాని, సారస్వతవిషయంలోనూ పరిశోధన విషయంలోనూ, అట్లా చెయ్యటంవల్ల ప్రయో

జనం తక్కువ.* ఇక నారాయణరావుగారి గ్రంథం వారి జీవిత కష్టఫలం! ఆయనకేనాడు కాల్‌డ్వెల్ సిద్ధాంతంమీద నమ్మకం కలగలేదో అప్పటినించీ పరిశోధనం చేయడం మొదలుపెట్టి విష యాన్ని సేకరించడం ప్రారంభించారు. ఆంగ్లంలో "Dravidian Phylology." అనే గ్రంథం రాశాడు. ఇతర పత్రికలలో రాశాడు. తుదకు తన యావత్పరిశోధనాన్ని యీ గ్రంథరూపంగా పెట్టాడు. ఈ గ్రంథాన్ని ప్రచురించి ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు తమ విధులలో వకదానిలో దశాంశాన్ని నిర్వర్తించారు. విజ్ఞాన విష యాలనుకూడా రూపాయలణాలతో తూచేదినాలివి. ప్రారబ్ధం! ఈ గ్రంథం యిప్పటికి ప్రమాణమని చెప్పాలె! ఇంకా యీ విషయంలో ద్రావిడ సంప్రదాయ సనాతనులు మార్పు పూర్తిగా చెందలేదు. వాళ్ళల్లోకి కోరాడవారు♦ గంటివారు ముఖ్యులు. నాసానుభూతిని డాక్టరుగారికే యిస్తున్నాను. పోయి స్వర్గంలో ఉన్నాడు వంగూరి సుబ్బారావుగారు. ఆయన తెనుగు ద్రావిడభాషాభవంఅంటే కొట్టొచ్చే వాడు. ఆయన వాఙ్మయచరిత్రకాలంనాటి కింకా యీచర్చ బాల్యంలోవున్నా ఆయన దాన్ని తల్చుకుంటే ఆపుకోలేకపోయేవాడు. శాస్త్రిగారు, నేటివరకు సంపూర్ణచరిత్రం రాయడానికీ, డాక్టరుగారు తమ సిద్ధాంతాన్ని అందరూ ఆమోదించడం చూడటానికీ, భగవం తుడు దీర్ఘాయుర్భాగ్యాలియ్యాలని ప్రార్థిస్తున్నాను.

*ఈన వాఙ్మయచరిత్రకారుడూ వైయాకరణీ మాత్రమే గాడు! ఈ రెండి టితోపాటు చక్కని కవితాశక్తికలవాడు. 'భవిష్యపర్వము' కూడా వచ్చేశింది.

♦ ఈనకూడా కాల్‌డ్వెల్ సిద్ధాంతాన్ని గట్టిచెయ్యడానికి తెనుగులో సంధి స్వరూపంలో, ద్రావిడచిహ్నా లున్నయ్యని స్పష్టీకరిస్తూ "సంధి" అనే గ్రంథాన్ని రాశాడు. కాల్‌డ్వెలు భాష్యానికిది వార్తికమని చెప్పవచ్చు. ఈ యిద్దరిపరిశ్రమ ఫలంగా తెనుగు నిజస్వరూపం తేలితేచాలు!

కావ్యందగ్గిర కొస్తాను. మొదట కొందరు రాజకవులను పేర్కొంటాను. శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు రాజ్యప్రాప్తికి పూర్వం యెంత కవిపండితులో, కవిపండితపోషకులో, తర్వాతకూడా ఆ గుణాలుఅనువృత్తాలైనై! * వీ రీ కాలంలో అనేక గ్రంథాలు కృతిని పొందారు. వాటిలో చెట్టి లక్ష్మీనృసింహంగారిదిన్నీ కాళ్ళకూరి గోపాలరావుగారిదీ ముఖ్యాలు. గోపాలరావుగారి "సౌందర్యమంజరి" గాఢంగా చదివే అవకాశం కలిగింది నాకు. ఈ గోపాలరావుగారు అనేక గ్రంథాలను రచించాడు. వాటిలో కొన్ని చాలా యెన్నదగినవి. శ్రీవారికి కృతిచ్చినగ్రంథం గాక "వాల్మీకి చరిత్ర" అనే మనస్తత్వప్రధానమైన నాటక మొక టుంది. అది ఒక్కొక్కచోట అనగా ప్రాచేతసుని చిత్తవృత్తిమార్పు, జ్ఞానోదయం కలిగినప్పుడు చదువుతూంటే షేక్సిపియరుకవి నాటకం చదువుతున్నట్టుంటుంది. ఈన కవిత్వం గంగాజలంవలె స్వచ్ఛమై సర్వలక్షణ లక్షితమై ఉంటుంది. కాని కొంచెం ప్రయత్నించినట్టుమాత్రం సూచనగా కనపడుతూ వుంటుంది. "సౌందర్యమంజరి" ఉపోద్ఘాతంలో వారి మతాన్ని చాలా ఉగ్గడించి చెప్పాడు. రసానికీ, ఉపాసనకూ సామరస్యం కలిపాడు. శ్రీ విశ్వదాతగారి పోషణలోవుండి యిటీవలనే పరమపదించి కీర్తికాయుడైనాడు. చెట్టి లక్ష్మీనృసింహంగారు శ్రీవారికి చిరకాల మిత్రులై, శ్రీవారిచేత భ్రాతృనిర్విశేషముగా చూడబడ్డాడు. ఈయన చాలా గ్రంథాలు రచించాడు. వెనక వారి రవివర్మచిత్రపద్యాలను గూర్చి మనవిచేశాను. ఈయన మొదట వ్యావహారిక భాషావాదై తుదకు గ్రాంథికంలోకి వెళ్లిపోయినాడు. నేను కూడా వారి విమర్శనానికి గురైనా నొకమారు. శ్రీవారి

* వీరి విద్యాప్రీతి, తత్ఫలమైన సైకాలజీ [illegible] మిదివరకే యెరుగుదురు.

పాండిత్యసహాయంతో నన్ను విమర్శించాడాయన! చాలా వందనాలనే చెప్పాలె. వీరిద్దరి గ్రంథాల కృతిభర్తైన శ్రీ వర్మగారినిగూర్చి యెక్కువగా చెప్పేదేం లేదు. యేనాడు మానవతీచరిత్రను (వెనుక ప్రశంసించాను) చదివానో అప్పటినించీ అనగా 30 సంవత్సరాలనించీ వీరు రచనలుసాగిస్తూనేవున్నారు. వీరికి సంప్రదాయమూ, నీతీ, చాలా ముఖ్యాలైన విషయాలు. ఆర్యమతంమీద వీరికున్న గౌరవం చాలా గొప్పది. వీరి గీతాల్లోనూ వ్యాసాల్లోనూకూడా యెప్పుడూ సంప్రదాయాన్నీ నీతినీ బోధిస్తూవుంటారు. వీరి "మాయామహత్త్వము" నే ఖండగీతి ప్రకృతిరహస్యాన్ని ఉగ్గడిస్తూవున్నది.* తరువాత (శ్రీ) వుయ్యూరు రాజుగారూ రామచంద్రప్పారావుగారూ, పీఠికాపురం యువరాజుగారూ ప్రశంసించదగినవారు. ఉయ్యూరు రాజుగారు బహు కావ్యనాటకనిర్మాతై కీర్తిగడించాడు.♦

---

* "కేవలము గ్రాంథిక భాషాభిమానులు. అయినను కాలానుగుణమగు సంస్కరణము అంగీకరించెదరు. కావుననే "నేటి తెలుగు" అను వ్యాసములో వాటిని అయితే, కూతురును' యిత్యాదులు గ్రాహ్యములన్నారు. అంతేకాదు. మల్లాదివారి చారిత్రక వ్యాకరణమునకు కృతికర్తలైనారు." (కృష్ణాపత్రిక 14-6-41)

వీరు ఆంధ్రదేశంలో సారస్వత సంచారం చేస్తూ వ్యక్తులకు, సంస్థలకు, మిక్కుటంగా వదాన్యత చూపిస్తున్నారు.

♦శ్రీ వెంకటాద్రి అప్పారావుగారినిగూర్చి "ఆంధ్రి" "భాద్రపది"లో యిట్లా రాశింది "......ప్రభువులై, కవులై, పండితులై భాషాభిమానులై, ఆంధ్రరచయితలలో నొకరుగా నభినుతింపబడు తున్నారు......అష్టపదుల నిటీవల నందమైన యాకృతిలో తీర్చి దిద్ది యాంధ్రీకరించిరి. వచస్సందర్భశుద్ధి నెరింగిన జయదేవుని మధురగేయము లను తెనుగు పాటలుగాను, శ్లోకములను పద్యములుగాను, మార్చి "ఆంధ్రజయదేవుడ" నిపించుకొని సారప్పారావుగారు......అప్పారావుగారి కవితాభిరుచితోపాటు, చిత్ర

రామచంద్రప్పారావుగారు కూడా వక రాజకవి.* నాల్గో వారు పీఠికాపుర యువరాజుగారు. యిప్పటి నవ్యమార్గంలో నడుస్తు న్నారు. ప్రతిభ 1940 సంపుటము వారిరాతతో ప్రారంభమైంది. మూడవ సంపుటంలో "శ్మశానస్వస్తి" అనే ఖండకావ్య మొకటు న్నది. ఉత్తమమైన భాషాభావములు! మృతుని హృదయగహ్వరంలో భావాలను చక్కని భాషలో గుదిగూర్చి చెప్పారు! భారతిలో "అభాగ్యుడు" అనే ఖండకావ్యంలో దుఃఖంయొక్క ప్రకృతిని చక్కగా వివరిస్తూ యీ కింది భావం వెలిబుచ్చారు.

......యేడ్పువచ్చినయప్డు కంటినీళ్లు
తోడురాకున్న బ్రతుకుట దుర్లభంబు"

---

కళారసాభిరతియు నీ కృతిలో నేరులై పారుచుండును......ఈన రాధాకృష్ణ ప్రేమో పాసకుడు. వారి చిత్రకళానికేతనము దీని కుదాహరణముగా చూపవచ్చును........ వీరు జ్యోతిషములలో కూడ నధిగతప్రవేశులు. ''జ్యోతిర్లీల'' నాట కమరసిన దచ్ఛా యలు కొంతవరకు గోచరించును.........ఈ రాజవ్యక్తి నిరాడంబరజీవిక యితర భూవరుల కొరవడి."

* వీరు ''నీలిరత్నాల'' నే ఖండకావ్య సంపుటేగాక ''అమరకావ్య''మనే పేరుతో ఉమర్ ఖయ్యామును అనువదించారు. దీని అనువాదాలు శానావున్నై! దువ్వూరివారు ''పానశాల'' నీ, రాయప్రోలువారు ''మధుకలశమనీ'', యింకా యితరులు అనగా చిలుకూరి నారాయణరావు మొదలైనవారూ భాషాంతరీకరించారు. వీరందరూకూడా మాతృకకు ముగ్ధులై రచించినవారే! ఇవన్నీ బాగున్నయ్యనే చెప్పచ్చు. ఆదిభట్ల నారాయణదాసుగారు కూడా దీన్ని సంస్కృతాంధ్రాల్లోకి అసలు పారసీకభాష లోనించీ పరివర్తనం చేసితారతమ్యం చూపడానికి నాలుగుగ్రంథాలను కలిపి ప్రచురించి చాలా శ్రమపడ్డారు. ఈ శ్రమకు శ్రమే ఫలమైంది! సహజకవులూకూడా వొక్కొక్కప్పుడు తమగ్రంథాలతో రసావిష్కరణం చెయ్యలేకపోవడం మనం చూస్తూవుంటాం!

వివాద తిట్లతో అంతమైనట్టు, దుఃఖం బాష్పాలతో అంత మొందుతుంది! అట్లాగాక కరుడుగట్టి యేడ్వరాని దుఃఖం దుర్భరం! పాంథుడు, వాన, కేక, తుదకు ఆత్మహత్య! చక్కని శోకరస గోళంగా వర్ణించారు! ఇటువంటి కావ్యాల్లో కారణం కోసం వెదక కూడదనేది మాత్రం జ్ఞాపకముంచుకోవలె పాఠకుడు. వీరు రెండు సాంఘిక నాటకాలనుకూడా రాశారు. రెండూకూడా ప్రతిభలో విమ ర్శింపబడ్డై! "స్వార్థత్యాగము" "ఆలోకంనుంచీ ఆహ్వానము." స్వార్థ త్యాగంలో కొంచెం పాశ్చాత్యానుకరణముంది. ఈకాలంలో అది వుండడం లోపం కాదు! రెండోనాటకం విడాకుల సిద్ధాంతం యొక్క రెండువైపులూ చూపడానికి పుట్టినట్లు కనిపిస్తుంది.* వెనకటి దేవులపల్లి, వేదుల, దువ్వూరిత్యాదులు కొంచెం రుద్ధకంఠు లయినట్లు కనపడతారు. దువ్వూరి చాలా క్వాచిత్కంగా "ఖయ్యాం ప్రశంస" వంటివి రాశాడు. వేదులవారు కొన్ని కథానికలు గద్యంలో రచించారు. కృష్ణశాస్త్రిగారు "ఊర్వశి" ప్రకటనం చేసిం తర్వాత ఆట్టే గానం చేసినట్టు కనపడను. ఇది మొదటి విశేషం. సభాపతి గారు తమ పద్యనాటకాలను "పలితకేశం" "ప్రేమపరీక్ష" "మేడూరి వారి కోడలు" "పద్మావతీ చరణచారణ చక్రవర్తి" మొదలైన వాటిని చక్కగా హృదయంగమంగా వకదాన్ని మించినట్టు మరో దాన్ని రచిస్తూ వచ్చారు. కవితలో క్లిష్టతపోయి సౌలభ్యం యెక్కువ కావడం, భావాలు ధారావాహికగా ప్రవహించడం, అప్రయత్న

---

* "చినుకుల చిందులు" అనేపేరుతో సచిత్ర ఖండకావ్య సంపుటి వకటి ప్రకటించారు. దానిలో అదివరకు ప్రకటితాలు కొన్ని, అప్రకటితాలు కొన్ని ఉన్నై. చిత్రాల్లో వకదాన్లో "కేశవ" అనే పేరుంది. దీనిలోకూడా యీనకు కొంచెం [illegible] గారి గాలితగిలినట్టు కనపడుతుంది. వచన పద్య విభాగంలేదు. అక్కడక్కడా "మంటల నాలుకలు" "శ్మశానం" వగైరాలు కనపడుతున్నై! శబ్దధ్వనికోసం చాలా శ్రమ పడ్డాడు. రమణీయత కొరవడుతున్నది. కర్తయొక్క ఐశ్వర్యం మాత్రమే ప్రతిబింబి స్తున్నది.

శరత్

గ్రథనం కనపడడం మొదలైనవి, ప్రజ్ఞా పరిణామ సూచకాలు. ఈ గుణాలన్నీ సభాపతిగారి రచనల్లో బాగాకనపడుతున్నై! ప్రతిభలో ప్రకటితమైన "దీక్షితదుహిత" విమర్శన మొకటి భారతిలో వాఘిలాలవారు రాశారు. దానిలో సభాపతి రచనలయొక్క క్రమ పరిణామం చాలా చక్కగా తెలియజేశారు.* ఈకింది విమర్శకుడి మాటలే నామాటలుగా గ్రహించమని మనవి. "ఆధునికాంధ్ర సాహితీ ప్రపంచంలో వ్యుత్పన్నత, ఉపజ్ఞ, రెంటినీ పొదిగించుకున్న కవులు కడుంగడు దర్లభులు. నూతన రచనాసంప్రదాయాలకు మార్గ దర్శకులై, నవ్యసాహిత్యాచార్య పదవిని అధిష్ఠించిన శ్రీ శివశంకర శాస్త్రిగారు వీరిలో వకరు." ఈయనకు రూపకవిధానంమీద మెక్కువప్రీతి. అందుచేత "సంవాద ఖండికలనూ" "పద్యనాటిక లనూ" మెక్కువ గౌరవించాడు. ఈవిషయంలో పాశ్చాత్యాధునిక నాటక కర్తల ననుకరించాడు. కాని ఈన రచనలు మొదటినించీ, అనగా నవలారచనదగ్గర్నించీ, చివరవరకూ, గ్రాంథికవ్యావహారిక భాషోపయోగంలోనూ, ప్రాచీనాధునాతన భావప్రకటనలోనూ, శబ్దగ్రథనంలోనూ, కాలానుసారంగా, రుచ్యనుసారంగా మారుతూ పూర్వాధునికుల యిద్దరిమధ్య వకవిధమైన వంతెనై, సారస్వతాను వృత్తికి దోహదం చేసినై యని ఘంటాపథంగా చెప్పవచ్చు. రెండు రకాల కావ్యపద్ధతికీ, తద్రచయితలకూ కూడా సామరస్యం కలగ జెయ్యడమే ఈనగొప్ప సారస్వత సేవ. సభాపతిగారి రచనలో ఆయన మనఃపరిణామంకూడా కనపడుతూ వుంటుంది. తుదకు సంప్రదాయం మీద, సహజమానవ క్షమమీద దృష్టి తొలగలేదనీ,వీరి సహజ మనోవృత్తి కాలానుగుణమైన మార్పనీ, యీన చిత్తవృత్తి నిరంతర దుఃఖభాజనం కాకపోవడమే కాకుండా దాని సహజగుణం సంతో

---

* భారతి, విక్రమాషాఢము. ఆంధ్ర పత్రికలో వంగల శ్రీరామావధానిగారుకూడా విమర్శించారు. (ఆంధ్రపత్రిక సారస్వతానుబంధాలు. డిసెంబరు 1941.)

షమే అనీ తెలుస్తుంది. దుర్భ్వారివారల్లే వీరికి భార్యావియోగం "బాష్పలవశిఖభగ్నశల్యములు"గా గోచరించి కవితాస్రవంతి కొంత కాలం ఆగలేదు. ఇక్కడే కవికీ సామాన్యులకూ భేదముండేది! ఈ తత్వమే ఆయన్ని యితరులనించీ వేరుచేశేది. "దీక్షితదుహిత" విషయంలో "అన్నగారూ, నేనెన్నడు అలా యెవ్వరినీ అడగలేదు. మీరు నా గ్రంథానికి తొలిపలుకు రాయాలె సుమీ!" అని నాతో ఆయనన్న వాక్యాలు జ్ఞాపకమింకా ఉన్నై! తద్భిన్నంగా యెందుకు జరిగిందో నాకు తెలియదు. అయినా నేనేమనుకోనని మిత్రుడికి తెలుసు. ఈనకు పరమేశ్వరుడు దీర్ఘాయువిచ్చి యితోధికంగా భాషాసేవ చేయించాలెనని కోరుతున్నాను. * రాయప్రోలు

---

* సభాపతిగారి కృతులలిస్టు చూడండి కొంత :—

**కావ్యమాలిక**

దివ్యలోచనములు, శిష్యురాలు, దీపారాధన, ప్రభుతీర్థము, క్రుద్ధముని, ప్రతాపకుమారి, భానుమతి, గురుశిష్యులు, నైయాయికుడు, పలితకేశం, చిత్రఘటి, చామెకాంబ ప్రభువాక్యము.

పైవిగాక :—
హృదయేశ్వరి — ఉపకావ్యము
ఆవేదన — ఖండికాసంపుటి
పద్మావతీచరణచారణ చక్రవర్తి — పద్యనాటిక
వరపరీక్ష — గీతినాటిక
సాధకుడు — సంవాదము
రత్నాకరము — గీతికాసంవాదము
దీక్షితదుహిత — పద్యరూపకము
రాజజామాత — పద్యనాటిక
నోణకభార్య — గీతినాటిక
కవిప్రేమ — పద్యరూపకము
యక్షరాత్రి — యవనికాంతరము
గృహేందిర — సంకీర్ణకృతి
వకుళమాలిక — గీతికాస్వగతము
ఇటీవల శ్రవ్యనాటికలు కూడా వ్రాస్తున్నాడు.

వారొక ఖండకావ్యంలో వీరిభాషాసేవనుగ్గడిస్తూ వీరికి కవివాక్యంలో రావలసిన అమరత్వాన్ని ప్రసాదించారు. వారికి వీరు "ప్రేమపరీక్ష" నుకృతిచ్చి వీరికి అమరత్వం కల్పించారు. ఇది చాలా సమంజసంగా వుంది. కవిమిత్రులంటే ఇట్లా వుండాలె!

కొందరు యీ అవకాశంలో అవకాశం కలగజేసుకుని తమ గ్రంథాలను పూర్తిచేసుకున్నారు. అటువంటివాటిలో, రాళ్ళపల్లివారి "గాథాసప్తశతి" సన్నిధానంవారి "గోవర్ధనాచార్య సప్తశతీసారం" ప్రశంసనీయాలు. రెండూ చదివేవారికి వారిదృక్పథభేదమూ, వారి భాషాభేదాలూ, వారి ఉపజ్ఞాతారతమ్యం తెలుస్తై! రాళ్ళపల్లివారి గ్రంథం భాషకు అలంకారం! కాని రచనచూస్తే వీరికి పద్యంకంటె గద్యం సహజం అని కనపడుతుంది. సన్నిధానంవారు కూడా మాతృక రసం తెప్పించడానికి శ్రమపడ్డట్టే విశదమౌతుంది. ఇవిగాక కాంచనపల్లి కనకాంబగారి "హంసవిజయం" వకటి. దీని ప్రశస్తి మహారాజులు, కవిరాజులు, విద్యాధికులు, చాలా ఉగ్గడించారు. విశ్వవిద్యాలయ పాఠ్యగ్రంథాల్లో కొచ్చింది. నేను పాఠం కూడా చెప్పాను. నాస్వాభిప్రాయం పెద్దలరాతలకు కొంచెం విరుద్ధంగా వుంది. ఇం దుగ్గడించిన విషయాలనుబట్టీ, వాటిపై విధ్యాన్నిబట్టి, నాటకరచనకంటె, గద్యగ్రంథరచనచేస్తే బాగుండేదేమో అనిపించింది. ఇప్పుడున్న సంఘస్థితంతా చెప్పి చివరకు "శ్రీ తిరుమల శ్రీ త్రిలింగ విద్యాపీఠా"దర్శాన్ని ప్రచారంచేశారు. ఇదివక సంఘవిమర్శన నాటకం. కావ్యదృష్టి చాలా కొరవడ్డది! అయినా కర్త్రి చాలా

పై వాటికి పెట్టిన నామధేయాలు, వాటికూర్పూ వైవిధ్యమూ చూడండి. ఇప్పటికీ "మహాకావ్యం ప్రారంభించవలెననే కుతూహలము" ఉన్నదని 24-9-40 తేదీన నాకు రాశాడు. వార్ధక్యంలో యీనకు సుఖేచ్ఛ యెక్కువౌతున్నట్లు గోచరిస్తున్నది. ఈనకు కవిత్వం ఊపిరివంటిది. "అందమైన అప్సరాలు మధురకంఠంతో గానం చేస్తూవుంటే మైమరచి వింటూవుండాలని" యీన ఆశయమట! (ఆంధ్రపత్రిక 14-12-41) తదన్వేషణంలో ఉన్నాడని తోస్తుంది!

శమపడ్డది. ఇంత శ్రమపడి రాశిందాన్ని నేను బాగుండలేదంటే
ఆమెకూ ఆమె మిత్రులకూ మనస్తాపం కలుగుతుందని దీన్నింతటితో
దులుతున్నాను. ఈమెరాశిన జీవయాత్రకూడా యిటువంటిగుణాలే
లిగివున్నది. కావ్యంద్వారా ధర్మబోధ చెయ్యడంలోనే కవి ఉపజ్ఞ
నపడాలిశింది! అది చెయ్యడానికిదికాదు పద్ధతి అని తెల్పడానికి చాలా
ఉపకరిస్తై యీామె గ్రంథాలు! చిలకమర్తివారు కవిభల్లటశత
కాన్ని సంస్కృతంలోనించీ అనువదించారు. చాలా హృదయంగ
మంగా ఉంది. మాతృకలో ఉన్న అన్యాపదేశాన్ని చాలా సమంజ
సంగా దించారు. మంగిపూడి వెంకటశర్మగారు తమ "మడ్డుకత"
మొదలైన రసవత్ఖండకావ్యాలను పూర్తిచేసుకున్నారు.

కొందరు తమ ఖండకావ్య సంపుటాలలోనించీ భాగాలను
పఠితలను ఆస్వాదింపజేశారు. ♦ అటువంటివాటిలో మండపాకవారి
'తేనెపట్టు" జాషువాగారి "ఖండకావ్యం" గొరుగంతులవారి "పూల
తోట" సోమయాజులుగారి "రామచంద్రుని హంపీయాత్ర" బెళ్లూరి
వారి "ప్రేమతపస్విని" సబ్నివీసువారి "గేయగుచ్ఛం" * మొదలై

♦ పుట్టపర్తి నారాయణాచార్యులుగారి "షాహాజీ" చక్కని పాకంలోపడ్డ
ఖండకావ్యం. ఈన బౌద్ధవాఙ్మయంలో చాలా కృషిచేశాడని వినికిడి.

* ఇందులో దేశభక్తిస్ఫోరాకాలైన గేయాలున్నై! దేశం మరిచిపోని ఆధు
నికుల్లో యీానకొక అగ్రస్థానమియ్యవచ్చు. ఈ గేయగుచ్ఛం చక్కని గీతాలతో
నిండున్నది. భరతమాతయొక్క గొప్పతనం, రైతులస్థితి, దేశముయొక్క పూర్వో
న్నత్యం, అస్పృశ్యత మొదలైన అనేకవిషయాలపైన చక్కని గేయాలను రాశాడు.
ఈన కుమారుడు రామారావు ఆధునిక గ్రామ జాతీయ జీవనం ప్రతిబింబింపజేసే రైతు
బిడ్డనే నాటకం రాశాడు. మాండలికవ్యావహారికంలోరాశి కొన్నిపదాలకు అర్థాలుకూడా
కుదిన యిచ్చాడు. మాండలిక పదాలను ప్రచారం చెయ్యాలిసిన పద్ధతియిదే! ఈనాట
కానికి అభిప్రాయమిస్తూ రెడ్డిగారు అవకాశం చూచుకుని కాంగ్రెసును విమర్శించాడు.
ఈ నాటకంలో కర్త కాంగ్రెసు నిర్మాణకార్యక్రమ ప్రచారంచేసినమాట వాస్తవమే!
ఈ కాలంలో రాశిన చాలా నాటకాలు యేవో అభినివేశాలను ప్రచారం చెయ్యడం
కొరకే అన్నట్లుతోస్తుంది. విశ్వనాథవారి వేనరాజు వగైరాలల్లోకూడా ఉన్న, మంచనండి
చెడ్డనండి యిదే!

నవి మెన్నదగినవి. "ప్రతిభ"ను గూర్చి చెప్పేటప్పుడు మరికొన్నింటిని పేర్కొంటాను. ఇప్పుడు పేర్కొన్నవాటిలో అనుస రింపబడ్డ మార్గాలన్నీ చాలామట్టుకు చర్విత చర్వణాలే! సోమయా జులుగారి "హంపీయాత్ర" యింగ్లీషులో వున్న బైరను రాశిన "Child Harold's piligrimage" అనే కావ్యానికి అనుకరణం. దీనిలో వెనకటి సామ్రాజ్యోన్నతి చాలా చక్కగా చెప్పాడు కవి. రామస్వామి మొదలియారుగారిని రామచంద్రుణ్ణి చేశాడు! ఈకాలంలో కవితకు యెవరో వకరు ఆలంబనం కావడం చాలా అదృష్టం! అందుకు ఫలం జీవితం అడివిగాచిన వెన్నెలకాకపోవడమే! నేనీయన్ని అభినందిస్తు న్నాను. పేర్కొన్నవారు గాక ఖండకావ్యాలను రాశిన వాళ్లలో వెనక దశవర్షకాలంలోవాళ్లు గాక కొత్తవాళ్ళు చాలామంది వున్నారు. జన మంచి వెంకట్రామయ్యగారు, కొల్లూరు ధర్మారాయ కవిగారు, నాదెళ్ళ వెంకట్రావుగారు, మిన్నిగంటి గురునాథశర్మగారు, పెమ్మరాజు లక్ష్మీ పతిగారు, ఓలేటి సీతారామమూర్తిగారు, కోరుమిల్లి వీరసోమ సత్య నారాయణగారు, కుందుర్తి నరసింహారావుగారు, వెంకటపార్వతీశ్వర కవులు, వేంకట కాళిదాసకవులు, శేషాద్రి రమణకవులు పండితారా ధ్యుల నాగభూషణం, మున్నంగి లక్ష్మీనృసింహశర్మగారు, సోమంచి వాసుదేవరావుగారు, తురగా వెంకట్రామయ్యగారు, జనమంచి కామే శ్వరరావుగారు, నిడమర్తి యీశ్వరప్పగారు, దివాకర్ల వెంకటావధాని గారు, ఆచంట సూర్యనారాయణశర్మగారు, అధికార్ల సూర్యనారా యణగారు, అన్నమరాజు శర్మగారు, కాశీభట్ట కృష్ణరాయశాస్త్రిగారు, కొత్తపల్లి సూర్యారావుగారు, అయ్యగారి సత్యనారాయణమూర్తిగారు, కొమాండూరివారు, పంద్యారంవారు, హరి రాధాకృష్ణమూర్తిగారు, సహదేవ సూర్యప్రకాశరావుగారు, కొడాలివారు, అడివివారు, శీరిపి వారు, మేడిపల్లి లక్ష్మీకాంతకవిగారు,* పురాణం కుమార రాఘవ

* ఈన "నాకవనం" అనే వక ఖండ కావ్య సంపుటీ, "జనాబాయి" అనే నాటకమూరచించాడు. శృంగార ప్రియుడు.

శాస్త్రిగారు, పిశిపాటి నారాయణశాస్త్రిగారు, మొదలైనవారి పేర్లు కనబడుతున్నై ! ఇంకా వీరు గాక చాలామంది వున్నారు. కొందరిని గూర్చి కొంచెం ప్రత్యేకంగా ఒకొక్కమాట చెబుతాను. కాటూరు వెంకటేశ్వరరావుగారు ఒకవైపు "సౌందరనంద" సాధన జరుగుతూం డగానే అప్పుడప్పుడు ఉద్రేకం వస్తూండటం "వరలక్ష్మీవ్రతం" లాంటి చక్కనికావ్యాలు రాయడం ప్రకృతిసిద్ధమైన సన్నివేశాలు కల్పించడం కలిగింది. తర్వాత సినిమాకవి కావలసిన సముద్రాల వెంకట రాఘవాచార్యులుగారు అప్పుడప్పుడు దశవర్ష కాలంలో చక్కని కొన్ని ఖండకావ్యాలు రాశారు. "భిక్షు" "శ్రావణి" మొదలైనవి ఒకొక్కప్పుడు గూఢభావసంకేతాలై సహృదయ పఠితకు "సద్యః పరనిర్వృతి"ని కలగజేస్తున్నై ! కుమార రాఘవశాస్త్రి గారు గంగాదేవీకృత "మధురావిజయ"కావ్యం ప్రకటితభాగాన్ని తెనుగులోకి పరివర్తనంచేసి భాషాసేవ చేశాడు. మంచికావ్యశైలిలో, నిర్దుష్ట భాషలో, మాతృకను వెలయించి మించాడు. అయ్య గారి సత్యనారాయణమూర్తిగారు ఆంగ్లంలో షెల్లీకవికృతమైన "Love's philosophy" అనే ఖండకావ్యం "ప్రేమతత్వం" అనే పేరుతో స్వేచ్ఛానువాదం చేశాడు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు "బసవగీత"ని ఒకగేయాన్ని వారి సహజరసవద్ధోరణిలో రాశారు. నవలారచనాశక్తే గాక గీతరచనాశక్తి కూడా వుందని యీన అప్పు డప్పుడూ చూపుతూవుంటాడు. ఈన సర్వతోముఖ ప్రజ్ఞ దేశాని కంతకు విదితమే ! మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు తమ సహజ వినయాన్ని వదలి రచ్చకెక్కటం ప్రారంభించాడు. ఈన గేయాలనుగూర్చి వెనక స్పృశించాను. ఈన కవిత్వం "అతులిత మాధురీమహిమ" గలదని నా అభిప్రాయం. ఈన "సతీస్మృతి" అని భార్యావియోగం కలిగినప్పుడు రాశాడు. చాలా హృదయద్రావ కంగా రచించాడీ ఖండగీతి. ఈన సామాన్యంగా అందరూ అనుకు

నేట్లు "పారడీ" కవి అనుకునే రచనలు కాకుండా చక్కని భావ పూర్ణమై ప్రతిభావంతమైన కవిత చెప్పగలసామర్థ్యం కలవాడని యిటీవల నవ్యసాహిత్య పరిషత్తువారు ప్రచురించిన "పంచవటి" అనే ఖండకావ్య సంపుటివల్ల తెలుస్తుంది. లక్ష్మణుని శీలాన్ని చాలా ఉదాత్తంగా చిత్రించాడు. "బృందావన"మని ఖండకావ్య సంపుటిలో ఖండికలు చాలా రసవంతంగా ఉన్నాయి. ఈన చాటుధారల వంటివి ఆధునికులెవ్వరూ రచించలేరని నా ఆశయం. ఈన పద్యం చదివేఫక్కీ అనితరసాధారణమని వెనక చెప్పాను. చూడ్డానికి యెంత అజ్ఞానిగా కనబడతాడో అంత ప్రజ్ఞావంతుడు. సభను రంజింప జెయ్యటంలో యీనతో సమానులు చాలా తక్కువమంది. ధన వంతుడు కాడు. తన కావ్యాలు చదువుకుని తానే ఆనందించే రస పిపాసి. కావ్యానందంలో కష్టాలను మరచిపొయ్యే కళాభిజ్ఞుడు. "శారద" కూడా మిక్కిలి రమణీయం. "ఓమార్ ఖయ్యాం"లో కొన్ని ఘట్టాలు చాలా రమణీయంగా పరివర్తించాడు. ఈనకు గురువులగు తిరుపతి వేంకటకవులలో వెంకటశాస్త్రిగారు యీనకు "స్వయంవ్యక్తుడ"ని బిరుదిచ్చి శాలువకప్పారు. కడపలో శేషాద్రిశర్మగారు కూడా వీరిని సన్మానించారు. ఈన ప్రకృతిచేత హాస్యప్రియుడు. ఈన చాటుధారలు చాలా హాస్యప్రధానాలుగా వుంటై. ఈన సినిమాతారలమీద రాశిన పద్యాలువింటే పొట్టపగిలేట్టు నవ్వువస్తూఉంటుంది. కాటూరు వెంకటేశ్వరరావుగారికీ యీనకూ జీవికాజీవి. ఈన ఆధునికుల్లో చాలా యెన్నదగినవాడు. ఇక్కడే భార్యావియోగస్థితిలోనే రాశిన విశ్వనాథవారి "వరలక్ష్మీత్రిశతి"ని గూర్చి రెండుమాటలు చెబుతాను. వేణిలో భార్య అస్థులను కలిపే సందర్భంలో దీనిలో పద్యాలూ, "గౌరీపూజ" అనే శీర్షికకిందివీ, హృదయవిదారకాలై సంపూర్ణమైనట్టీ అనిర్వాచ్యమైనట్టీ, ఆనందాన్ని కలగజేస్తై! "కృష్ణార్పణం"లో అస్థికలు కలుపునప్పుడు ఉత్పన్నమైన భావాలు చదివేటప్పుడు

నేనానందంతో అశ్రువులు కార్చానని చెప్పటం కేవల సత్యకథనం!* సూక్ష్మవిషయాలయొక్క అంగాంగీభావంతో కూడిన ఆ వర్ణనం నిరుపమానం! ఎటువంటి స్వల్పవిషయాన్నీ భాషాచిత్రాలు కల్పించి పాఠకుడి మనశ్చక్షుస్సులకు గోచరమయ్యేటట్టు చెయ్యడంలో పరమావధిని పొందినై యని చెప్పడంలో యేమీ అతిశయోక్తి లేదు.♦ గౌరీపూజలో స్త్రీవ్యక్తి ప్రకృతి మాతలో లీనమైన ఘట్టం చదివితే సాక్షాత్తైకైలాసవాసైన పార్వతీరూపం అలౌకికమై సర్వప్రపంచ వ్యాప్తమై హృదయానికి వకవిధమైన పవిత్రానందాన్ని చేకూరుస్తుంది. "గౌరు" అనే ప్రయోగ మక్కడ బంగారంలో రత్నం పొదిగినట్టు తోస్తుంది. అందులో హృదయ నిగూఢప్రేమ, పవిత్రత, మాతృత్వం, స్పష్టమౌతున్నై. ఒక కవి భార్యావియోగం భాషాకుమారుల కందరికీ ఆనందదాన హేతువు కావడం సహజమే! ఈనకీ భార్యావియోగమయ్యే కాలంలో కొంత నిరుత్సాహమూ, నిరాశా, ఆవరించినట్టు తత్కాలంలో రాశిన 'ఆకాంక్ష' మొదలైన ఖండకావ్యాలవల్ల కనపడుతుంది. కాని మళ్లీ దానినించీ, మృతినించీ జన్మ లేచినట్టు సహజమైన చిత్తశాంతి చేకూర్చుకుని ఉత్సాహాన్ని పొందడం ఆంధ్ర సాహిత్యంయొక్కా, భాషయొక్కా భాగ్యమనే చెప్పాలె! దువ్వూరి

---

* "నా తండ్రిచేసిన నానామహాపుణ్యకర్మ లీగతి గంగ గలిసిపోయె"

అన్నప్పు డెవ్వడిహృదయం కరగదు!

"మిగిలినది యొక్కడేనాకు మేగువంత
బరువు నాగుండెలో మధ్యభాగమందు"

అన్నప్పుడు పాఠకుడి హృదయం సానుభూతి తంత్రులతో మోగకమానుతుందా!

♦ ఈ పద్యా లేక్లిష్టాన్వయానికీకూడా పరమావధిగా ఉన్నై! ఉన్నప్పటికీ పాఠకుడికి యెంత తెలిస్తే అంత ఆనందంకల్గే స్వభావంకూడా వాట్లో ఉంది. "కొండవీటి పొగమబ్బులు" కూడా చూడండీవిషయానికి దృష్టాంతంగా 'రాచసిరి ఉడిగిపోయిన శిథిల దుర్గలక్ష్మికి ఆ పొగ మబ్బులుకూర్చిన వెర్రి యలంకృతులే యీకావ్యాన్ని వెలార్చినవి.' అన్నాడు, సంపత్.

వలె తాత్కాలికంగా పతనాన్ని పొందకుండా వుండడంలోనే వున్న దీయనయొక్క విశిష్టత. అదే కవికి పరీక్షాకాలం. అటువంటి దుఃఖంలో నించీ సుఖం కలిగితే ఆయన ప్రకృతిని జయించాడన్న మాట! అదివరకు "ఆకాశదీపం" "విశ్వామిత్రుడు-మేనక" మొదలైనవి ఉదాత్తంగానే ఉన్నై! ఆయన కవిత్వానికి సహజాలైన అన్ని గుణాలు వాటిలో ఉన్నై!* కాని భార్యా వియోగం తరువాతనే యీన కవితాజ్యోతి—బహుశః ప్రథమపత్నీ జ్యోతి ద్వితీయమందు ద్విగుణంగా మూర్తిభవించుట చేతనో యేమో - కాళిదాసు "సరాజ్యం"లో చెప్పినట్టు 'సఃఅధికంబభౌ'.♦ మొత్తంమీద రెండవస్థలూ కలిసి యీయన్ని నవ్యసాహిత్యాకాశ వీధిలో దుర్నిరీక్ష్యుణ్ణిగా చేసినై! ఎట్లా సూర్యుడు ఆపాతతః తీక్ష్ణుడై నప్పటికీ సర్వ సస్యదాతో, సర్వారోగ్యదాయో, అట్లాగే యీనకవిత్వంకూడానూ! ఆపాతతః క్లిష్టమైనా లోతుకు దిగితే అనిర్వచనీయ రసావిష్కరణం చెయ్యగల శక్తీ ధర్మప్రవృత్తికి మార్గదర్శిగా వుండే గుణమూ దానిలో వున్నై!* "తొడ, తొడ" అనే పద్యం చదువుతూ వుంటే భవభూతి "కిమపి కిమపి" శ్లోకం తలపుకొస్తూంటుంది. విశ్వనాథ

*1. దుష్కరప్రాస = హ్మ, ప్రు, ర్వ, క్ష్ణ, ఖ్య 2. క్లిష్టాన్వయము = "ఆకాశదీపము" (పిచ్చితలలు) 3. తెనుగును డికారాలు = "శికరిఖైరి" "యాదాలాపముగ" (మనుష్యుడు) 4. మారుమూలపదాలు = వట్టు, తోరహత్తు 5. ఉదాత్తత 6. నేయార్థం = (కొన్ని పద్యాలకు ఆయనే అర్థం చెప్పాలె)

♦ మరల రేకెత్తిన ఉత్సాహానికి "పరిశోధకుల"నే కథే తార్కాణం.

* తొడతొడనందుకొ నరటితోటలు పెంచెదనంచు, సిజ్జలో
మెడమెడలాని శంఖములు మెల్చెదనంచును, నూహలూహలో
వడివడిపోయి యందములు వాల్చెదనంచును, వెర్రియాసలం
బడిచనినంతలేద, యెడబాటు విచిత్రముగా ఘటిల్లెబో!

వైధర్మ్యం యెంతచక్కగా చెప్పాడో చూడండి!

రాయప్రోలు లిద్దరూ నవ్యసాహిత్యానికి సూర్యచంద్రుల వంటివారు. ఒకరు దుర్నిరీక్ష్యుడు! రెండవవారాహ్లాదకరుడు! ఒకరు మిరు మిట్లు గొలుపుతాడు! రెండవవారు చల్లజేస్తాడు! ఒకడు శాసిస్తాడు! రెండవవారు మిత్రుడల్లే వొప్పిస్తాడు! ఒకరి రాతలు మహోదధీ తరంగ పరంపరలు! రెండవ వారివి అచ్ఛోదసరోవరనీరోపమాన ములు! వీరిద్దరూ ఆద్యంత రక్షకులై నవ్యసాహిత్యాన్ని రక్షిస్తు న్నారు. ఒకరిది ఉపక్రమప్రాబల్యం! రెండవవారిది ఉపసంహార విజయము! ఒకరివద్ద మొదలెట్టిన ధర్మము మధ్య యెన్నో విధాల సంచరించి తుదకు రెండవ వారిలో సాఫల్యం పొందింది! కాబట్టి నవ్యసాహిత్యమంతా యీయిద్దరిమధ్య ఉయ్యాలలూగి యేధర్మంలో బైలుదేరిందో, అదే ధర్మంలో వచ్చి ఆగింది!*

ఉమ్మర్ ఆలీషాగారివలె మరో సయ్యదుబదురుద్దీన్ సాహెబు గారు వక భక్తిగీతం రచించాడు. చక్కగా ఉంది. దాని శీర్షిక "నీ దర్శనమునీ సేవ" ఇటువంటి ముసల్మాను కవులూ, జాషువావంటి

---

* ఋక్కేమంటున్నదో చూడండి.

"యస్తిత్యాజ సచివిదగ్ంనఖాయం
నతస్య వాచ్యపిభాగో అస్తి
యదీగ్ంశృణోత్యలకగ్ం శృణోతి
నహిప్రవేద సుకృతస్య పంథాం"

ధర్మమును వదలినవారి వాక్కున భాగములేదు.

"విద్యాహవై బ్రాహ్మణమాజగామ
గోపాయ మాంశేవధిష్టే హమస్మి
అసూయకాయానృజవేయతాయ
నమాబ్రూయా వీర్యవతీ తథాస్యాం"

"విద్యతనను, అసూయగలవానికిని, ఋజుప్రవర్తన లేనివానికిని, చపలునికిని, యియ్యవద్దన్నదట!"

క్రైస్తవ కవులూ, విజ్ఞానైక్యతను నిరూపిస్తారు కాబట్టి మనకందరికీ వంద్యులు. ఈన కవిత్వంలోకూడా ముసల్మానుచిహ్నాలు భాషలో యెంతమాత్రం లేవు. చక్కగా భాషాకుమారుడు రాశి నట్టే ఉన్నది కావ్యం. కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి ఖండ కావ్య మొకటి వెనకటి దశాబ్దకాలంలో నిరూపించాను. ఈ కాలంలో కూడా ఆయన "గడ్డిపరక" అనే శీర్షికతో దాని యొక్క ఉపయోగాలు, దానిని ప్రపంచం నిరాదరించడం, న్యాయం గాకపోవడం, మొదలైన సంగతులతో రసవంతంగా రచించారు. పీరేగాక వేదం వెంకట్రాయశాస్త్రిగారు "దైవమహిమ" అని వక ఖండకావ్యం రాయడం ఆశ్చర్యం. ఇటువంటివారు రాయడంవల్ల ఖండకావ్యానికి ప్రాచీనులిచ్చిన అంకుశ చాలామట్టుకు తొలిగి పోయినట్టు భావించాలని నామనవి. వీళ్ళ ఆదరణకు చాలా విలువ ఉంది. ఇట్లాగే శివరామశాస్త్రి, ఆదినారాయణశాస్త్రిగారు మొదలైన పండితుల వ్యావహారిక భాషోపయోగం కూడాను కొందరు వీరిలోవీరే అసంతృప్తిపడి తమలో తమకు కొన్ని సలహాల నిచ్చుకున్నారు. మంగిపూడి వెంకటశర్మగారు తమ అనుభవాన్నిబట్టి, కవితకు ప్రయోజనముండాలనీ, చదువరులు జీవితాన్ని దిద్దుకోడానికి పురికొల్పాలనీ, సాధువుల నడతలూ, కార్మికుల చరితలూ, పాటకపు జనుల ఆటపాటలూ, రయితులయొక్క శుభశీలులయొక్క పతివ్రతల యొక్క ఆడుకునే పిల్లలయొక్క చేష్టాదులూ, మాతృప్రేమా, మొదలైనవి కావ్యవస్తువులుగాఉంటే సమంజసంగా వుంటుందనీ, మొదలైన విషయాలను చెబుతూ "కవులకు హితవు" అనే శీర్షికతో చక్కని వక ఖండకావ్యం రాశాడు. జనమంచి కామేశ్వరరావుగారు, కృష్ణశాస్త్రి మొదలైనవాళ్ళ దుఃఖంతో విసుకుచెంది "కవికుమార" అనే శీర్షికతో ఒకకావ్యం రచిస్తూ యిట్లాగన్నారు.

"శోకగీతుల సుప్తవీధుల
ముంచెత్తబోకుమురా!
... ... ... ... ... ...
ప్రియవియోగమె ప్రియకరంబగు"

ఇదే "శరీరనాశోపిసమానురాగ యోః" అన్నప్పుడు కాళదాసు సిద్ధాంతం! ప్రత్యాశలేనప్పటి ప్రణయమే నిజమైంది! స్వార్థరహిత మవడంచేత దానికి పవిత్రత వస్తుంది. కాని అది కవిని కుంగచెయ్యకుండా అతని విజ్ఞాన నేత్రాన్ని తెరవాలె. అప్పుడే అతను నిజమైన కవైపోతాడు. ఈసందర్భంలో వెనక కొన్ని దృష్టాంతాలు మనవి చేశాను. జాషువాకవి "అయోమయము" అనే శీర్షిక కింద నవ్య కవులను సంబోధించాడు. చూడండీ కింది పద్యం!

"కవి సమయమ్ముదప్పి నుడికారపు సొంపును పాడుచేసి నీ
వెవతుక కోసమో కుమిలి యేడ్చెదు, చక్కని తెల్గుకైతకా
యువులు కుదించి యేమిటికయోమయముం బొనరింతువోయి? నీ
కవనము! పాడుగాను చెడుగా యికనేనియు రమ్ముదారికిన్".

కాని యీవర్ణనం నవ్యుల కందరికీ వర్తించదు! కొందరికీ కూడా పూర్తిగా వర్తించదు! చిలుకూరి నారాయణరావుగారు పోతన కవిమీద చక్కని కులుకు బెళుకు లొలుకే ఖండకావ్యం రచించాడు. కావ్యం నడక చాలా సరసంగావుంది. దీనియొక్క ప్రతిధ్వనే హైద్రాబాదులో పోతన జయంతి అధ్యక్షకోపన్యాసంలో కూడా విన్నట్టు జ్ఞాపకం. ఈవిధంగా ప్రణయమో, ప్రకృతో, భక్తో, స్వానుభవమో, సన్నివేశాలో, వస్తువులుగా యీ సాహిత్యమంతా నడిచింది. * స్త్రీలు, గృహలక్ష్మి స్థాపించిన

* వేమమళ్ళ రాజగోపాలరావుగారివంటివారు కొందరు యీ నవ్యులను కొత్త జాతులనూ, వృత్తాలనూ, అనుసరించవలసిందనీ, తెనుగులో నిర్యతి ప్రాసంగా శ్రవణసుఖాన్నిమాత్రం పాటించుకుంటూ "పరుగు కవిత్వం" (*run - on verse*) రాయమనీ ప్రోత్సహించారు. కొందరు దాన్ని అనుసరించారుకూడాను.

(జయంతి 307, 517)

తర్వాత, దాన్ని ముట్టడించిన పురుష కవికుమారులు సంఖ్యకంటె భారతిని ముట్టడించిన కవయిత్రీ సోదరీమణుల సంఖ్య చాలా తక్కువ. అయినప్పటికీ కొందరు చక్కని రచనలను సాగించిన వాళ్లున్నారు. వెనకవాళ్ళు పురుషుల కెంతమాత్రం తీసిపోరని విన్నవించాను. మొత్తంమీద రెండు పత్రికలు చూస్తే వాళ్ళల్లో విజ్ఞానవ్యాప్తి చాలా త్వరగా కలిగినట్టు గోచర మవుతుంది. వారిలో చక్కని ఖండకావ్యాలూ, గీతాలూ, కథలూ, వ్యాసాలూ రచించేవాళ్ల సంఖ్య చాలా పెరిగింది. కొందరు కవయిత్రులను వారి కావ్యాలను పేర్కొంటాను. పరుచూరు భువనేశ్వరీదేవిగారు, చావలి బంగారమ్మగారు, "కర్షకా" "దైవమహిమ" మొదలైన ఖండకావ్యాలను రాశారు. చిలుకూరు లక్ష్మీనరసమ్మగారు పిచ్చికదంపతుల యిచ్ఛావిహారాలు మొదలైనవాటిని తమగీతాల్లో చిత్రించారు. జ్ఞానాంబగారు జహాంగీరు చక్రవర్తియొక్క న్యాయబుద్ధి నుగ్గడిస్తూ వక ఏకాంకనాటకం రచించారు. దుర్గాబాయమ్మగారు వెనకటి దశ వర్షకాలంనించీ కూడా అప్పుడప్పుడూ రాస్తూవచ్చారు. కనుపర్తివర లక్ష్మమ్మగారి పేరూ, ఆమె భాషాసేవా జగద్విదితమే! ఆమె కథలు ఉత్తమకక్ష్యలోవని గట్టిగాచెప్పచ్చు. "చోరగుడి సీతమ్మ గారి జీవితచరిత్ర"ను కూడా చక్కగా ఆదర్శప్రాయంగా రచించా రామె. ఆమె "శారదలేఖలు" చదవని స్త్రీ పురుషులుండరు. ఈమెగారి కొకమారు గృహలక్ష్మి సువర్ణకంకణం లభించింది. దేశమంతా సంతోషించారు. ఈకోటిలోవారే కాంచనపల్లి కనకాంబగారూ, చేబ్రోలు సరస్వతీదేవిగారూ. సరస్వతీదేవిగారు మరల "అభినవమొల్ల" అనిపించుకున్నారు. రామాయణాన్ని ఉత్తర కాండ సహితంగారాశి జన్మ ధన్యత నొందించు కున్నారు. ఇంకా జనమంచి అనంతమ్మ, చిలకపాటి సీతాంబ, బసవరాజు వెంకటరాజ్యలక్ష్మమ్మ మొదలైన అనేకులు విద్యావతులున్నారు. తుదకు సి. యస్. లక్ష్మి

అనేయువతి "నానాజాతిసమితి"ని గూర్చి చక్కని రాజకీయవ్యాసం రాశారు. ఆచంట సత్యవతమ్మగారు కృష్ణశాస్త్రిగారిని చక్కగా అనుకరించి రాశారు.

"చెట్టులో పుట్టనై
పుట్టలో పామునై
మట్టిలో తేమనై
మరచి ఆడితిగాని
ఈజీవితంబులో నింత దుఃఖంబుండెనా ?
దేవనే నిసుమంత దెలియనైతి !

ఇదివాస్తవగీతో, ఉపాలంభగీతో తెలుసుకోడానికి వీల్లేకుండాఉంది. మునిమాణిక్యాదులల్లె సరళాదేవిగారు "గడ్డిపూలు" అని శీర్షికనుంచి గద్యశకలాలను రచించారు. ఆమెఅభిప్రాయం భావగద్యం రాయాలని.

" ప్రయత్నిస్తాను ! ప్రయత్నిస్తాను ! యుగయుగాలు గడిచినా వెదుకుతాను ! ఈ అగాధ విశ్వంలో కాలుపెట్టింది మొదలూ, నీ అన్వేషణమే నా ఉచ్ఛ్వాసనిశ్వాసాలు ! నీ సందర్శనాపేక్షే నాజీవితం! ఎట్లా చిక్కక తప్పించుకుంటావో చూస్తాను !

సంధ్యారుణకాంతులు జారిపోయినట్లు జాడలు పొడకట్టెను ! ఇక నామేను మరపించిన ఆపాటకొరకు వెదకనారంభించితిని ! కాని అంతయు నిశ్శబ్దమే ! ... ... " ఈ ప్రకారంగా సోదరీమణులు " ముగుదల్ నేరువరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్ " అనే కవివచనాన్ని సార్థకపరిచారు. గృహలక్ష్మిలో భాగవతుల లక్ష్మీపతిశాస్త్రిగారనే వక పండిత ప్రకాండుడు తమ వైదికజ్ఞానాన్ని వెదజల్లి దేశం వందనాలకుపాత్రుడైనాడు. యాజ్ఞవల్క్య శాఖకాయన అపర యాజ్ఞ్యవల్క్య మహర్షి అనచ్చు. ఈనయొక్క పరిచయభాగ్యం నాకు కల్గింది. ఈనా నేనూ కలిసి పూనా ప్రాచ్య పండితసభకు వెళ్ళాం.

ఈ పత్రిక విడాకుల చట్టాన్నిగూర్చి ఆంధ్రదేశంలో వుండే నారీమణులు చాలామందియొక్క అభిప్రాయాలను సేకరించి ఆ విషయంలో రెండుపక్షాల వాఙ్మయం కొంత తయారుచేసింది. ఈ పత్రిక స్త్రీలోకానికి చేసినసేవకు మేర లేదు. పురుషలోకానికికూడానూ అంటే తప్పేం లేదని నా ఊహ! చిరంజీవై వర్ధిల్లుగాక! హైదరాబాదులోకూడా కొందరు యువతీమణులు సాహిత్యసాధన చేస్తున్నవాళ్లున్నారు. వీరందరిలో యెల్లాప్రగడ సీతాకుమారిగారు కథ, గేయం, మొదలైనవాటిలో సిద్ధహస్త అయినారు. ఇతోధిక భాషాసేవ చెయ్యగలరని ఆశిస్తున్నాను. కథలసంగతి అట్లాకట్టిపెట్టి స్త్రీలలో ఖండకావ్యాలురాసి గ్రంథాలు ప్రచురించినవాళ్ళల్లో సోమరాజు యిందుమతీదేవిగారు చాలా యెన్నదగినవారు. ఈమె "కావ్యావళి" ఉత్తమకక్ష్యలో చేర్చవచ్చు. నవ్యసాహిత్యంలో కావ్యాలురాసిన పురుషులు రాసిన ప్రణయంకంటె యీమె చిత్రించిన ప్రణయం చాలా పవిత్రమైనదని చెప్పాలె. ప్రణయాన్ని స్త్రీ యెట్లా భావించి చిత్రిస్తుందో యీమె కావ్యాలు దర్శకాలుగా వుంటై!

కథకు వచ్చేటప్పటికి అంత కష్టంకాదు. ఎందుకంటే వెనకటి వ్యక్తులే కథలను తిప్పించి, మళ్లించి, కుదించి, పెంచి, వేరుగా కనపడేట్టుచేసి, భాషాంతరీకరించి, యెక్కడనించో చెప్పకుండాదాచి, యీవిధంగా కథకులమని కొంద రనిపించుకున్నారు. ఈ కథావీధి మాత్రం చాలా సాగిందని తప్పక చెప్పాలె. వీళ్లలో కొన్ని కొత్త పేర్లు కనపడుతున్నై పాతవాటితో కలసి! వెనకటి కవికొండల, పూడిపెద్ది, మల్లాది, శ్రీపాద మొదలైనవారు రాస్తూనే వున్నారు. కొంత వారిలో గతానుగతికత్వం కలిగిపోయింది. శ్రీనివాస శిరోమణివచ్చి నూతనంగా కొంతకలవరం కలిగించి సన్నివేశాల్లో వైశిష్ట్యమూ, మొదలైన గుణాలను తెచ్చిపెట్టాడు. ఈన మన కథకుల్లో ఉత్తమకక్ష్యకు చెందినవాడు. ఇంకా తెలంగాణం

కూడా శూన్యం కాదని కొందరు యిక్కడనించీ యెన్నదగిన కథకులు బయలుదేరారు. వెనక సుజాతపత్రిక వచ్చి తెలంగాణాంధ్రులకు కొంత యీ ఖండకావ్య కథావీథుల్లో అభినివేశం కలిగించింది. ఆశాఖ యిప్పటికీ అలాగే సాగుతున్నది. "గిరి"గారు, పిశుపాటి వెంకటరమణయ్యగారు, మొదలైనవారు వీరిలో ముఖ్యులు. వెనకటి దశాబ్దంలో మాడపాటివారిని గూర్చి తెలుసుకున్నాం. ఈ దశాబ్దంలో పైవారేగాక సురవరం ప్రతాపరెడ్డిగారి పేరు వకటి విశిష్టంగా చెప్పాలె. "గిరి రమణయ్య"లవలె యీనకలం కేవల కథావీథిలో గాక పత్రికా నిర్వహణంలో, గ్రంథరచనలో, రాజకీయ పరిజ్ఞానంలో, సాహిత్య వీథితోపాటు పనిచేసింది చేస్తున్నది. "గిరి రమణయ్యగార్లు" కథావీథిలో చాలావరకు సిద్ధహస్తులైనారని చెప్పవచ్చు. "గిరి"గారి 'సితార' 'ప్రతిఫలం' 'కావేరి' చక్కని కథా సంవిధానంతో హృదయంగమమైన పరిణామంకల్గి ఆహ్లాదం కలగ జేస్తున్నై. "రమణయ్య"గారు హాస్యంలోకూడా చక్కగా రచన సాగించగలరని చెప్పడానికేమీ అభ్యంతరం లేదు. ఈనరాశిన 'ఘటాశ్రాద్ధం — కేశఖండనం' చాలా నవ్వుపుట్టించి నీతిదాయకమై ఉంది. * ఈవీథిలో 'కాశీపతి' కూడా యెన్నదగిన పరిశ్రమ చేశారు. ఈన కథలు సంపుటంగా ప్రచురించి ఉండాలి! పాపం ప్రయత్నిస్తున్నాడో కప్పుడు! మాకు కొందరికి దారిద్ర్యం ప్రతిబంధకంగావుంది! దారిద్ర్యమే కవులకు గుణమైతే మేం కొందరము గొప్పవాండ్లమున్నాము! ఇంద్రగంటివారిచ్చిన లిస్టునిచ్చి యీ వీథికిప్పటికి సలాంచేస్తాను. "సుప్రసిద్ధాంధ్రకథకులు!" అని యీకింది పట్టికనిచ్చారు.

"శివరామశాస్త్రిగారి— "అంతర్నాటిక" "మాలదాసరి" మొదలైనవి.

---

*ఈన అప్పుడప్పుడు కృష్ణాపత్రికాదుల్లో విమర్శన వ్యాసాలుకూడా రాయడం కద్దు. ఈన యిల్లు వక సారస్వత దర్బారు. చాలా సహృదయుడు. సరసుడు. **నవ్యాంధ్రసాహిత్య సాధకులలో చాలామందికి ప్రియమిత్రుడు.**

మొక్కపాటి— "భిక్షువు" "శిల్పిద్వయం" వగైరా

సుబ్రహ్మణ్యశాస్త్రిగారి— "తులసిమొక్కలు" "ఇద్దరం వక్కచోటికే పోదాం" ఇత్యాదులు.

అడివివారి— "తిరుపతికొండ మెట్లు"

కావూరువారి—"గృహకల్లోలాలు."

వెంకటచలంగారి—"వేదాంతం"

శిరోమణిగారి— "ధర్మసంస్థాపనం."

దీక్షితులుగారి— "శ్యామల" "గాలిపాట"

వంటికథలు శుభ్రమైన కథానికలు."

పైసాధికారపట్టికలో విశ్వనాథ మొక్కపాటి కొడవటిగంటి మునిమాణిక్యాలను కలిపితే నాకర్తవ్య మైపోయిందనుకుంటాను. ఈ వ్యాసం రాశింతర్వాత కొన్నికథలు సంపుటాలు ప్రచురణమైనై! హనుమచ్ఛాస్త్రిగారు రాశినప్పటికంటె దేశపరిస్థితులు సాంఘికాదుల్లో చాలామారినై! అందుచేత వాటిని ప్రతిబింబింపచేసే కథానికలు తలెత్తినై!*

---

* ఈదశాబ్దిలో అమరవాది హనుమచ్ఛాస్త్రిగారు పరమపదించి నవ్యసాహిత్యానికి లోటుకలిగించాడు. ఈన చక్కని కవితావిమర్శన శక్తులు రెండూ కలిగిన పండితుడు. భగవంతుడు ఈన ఆత్మకు శాంతినియ్యాలని వేడుతున్నాను.

ఈకాలపు రాతల్లో చాలా సామాన్య పదాలూ, వాక్యాలూ, సాహిత్యంలోకి దూరినై. నవ్యులు, దాదాపు అందరూ, ఆంగ్లభాషా పాండిత్యం కలవాళ్ళు కావడమే కాకుండా, ఆభాషలోవుండే నిగ్గును మనభాషలోకి తేవలెననే ఉత్సాహం కలవాళ్లు కూడా కాబట్టి ఆభాషా భావాలూ అనేకంగా మనభాషలోకి వచ్చినై! చింతా దీక్షితులుగారి లక్కపిడతల్లో పిల్లలు మాట్లాడే అనేక పదాలూ, నుడికారాలూ, గీతాల్లో కెక్కించారు. "తృవ్వాయి" మొదలైనవి తత్స్థానాల్లో చాలా ఆహ్లాదం కలగజేసై! కవి "మశకగానం" అనేకావ్యంలో వైద్యపదాలు "జెటనసు" "సాఫానరించి" "వాకూయ్యము" "పంపుకొట్టడం" (injection) మొదలైన అనేకమాటల నుపయోగించాడు. ఈ విధంగా పరభాషపదాలూ, భావాలూవచ్చి సాహిత్యాన్ని విశాలం

## ౮

## 1933—నవ్యసాహిత్యపరిషత్తు. "ప్రతిభ"

1748 సంవత్సరం భారతదేశచరిత్రలో చాలా ప్రాముఖ్యం గలది. అట్లాగే నవ్యాంధ్రసాహిత్య చరిత్రలో 1933 సంవత్సరం చాలా గొప్పది. నవ్యసాహిత్యమనేది వకటి స్థిరమైపోయేటప్పటికి దానికొక సంస్థ ఉంటే బాగుంటుందని మనవాళ్ళకు తోచింది. అందుకోసం వక ప్రయత్నంచేసి తత్సాధకుల నందరినీ వకచోటచేర్చటం అవసరమైంది. మొదట మంచిపేరు వాళ్ళకు తట్టక దానికి "అభినవాంధ్ర కవిపండితసభ" అనే పేరుతో బరంపురంలో 1933 సంవత్సరం మార్చి 10, 11, 12 తేదీలలో కలిశారు. ఇందుకుగూడా మా గురువర్యులు పంచాగ్నులవారే ప్రథమ సూత్రధారులు. వీరు నవ్యసాహిత్యానికి చేశిన సేవ నిరుపమానం! ప్రతిభలో యీ కిందివాక్యం చూడండి. "ఈ పరిషత్ప్రతిష్ఠాపనమునకు ప్రధానకారకులు గురు భాగవతుల ధర్మారావుగారు, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు మొదలగు బరంపురం వాస్తవ్యులు." వీరిని యీ పరిషత్తు వారధ్యక్షపదవిచ్చి గౌరవించారు. డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు ప్రథమ సభాధ్యక్షులు! ఆసభలో చేసిన తీర్మానాల నీకింద యిస్తున్నాను. వాటివల్ల యీ పరిషదుద్దేశాలు వెల్లడౌతై!

---

చేసినై! విశ్వనాథకూడా "లడాయి, ఫరవా, తగాదా," మొదలైన పరభాషా పదాలూ, "రెణ్ణాలల్" లాంటి వ్యావహారిక పదాలూ పద్యాల్లో ఉపయోగించాడు. (గొంగళీపురుగు) శాస్త్రాల్లో యింకా ఉద్గ్రంథాలెక్కడా లేవడంలేదు. పుస్తకాలసంఖ్యాకాలుగా ప్రకటింపబడుతున్నై! అచ్చుసౌకర్యాలు దీనికి చాలా సహాకారులైనై! సామాన్యసాహిత్యం యెంతైనా అభివృద్ధి అవుతున్నదికాని సాంకేతిక వాఙ్మయానికింకా మంచిస్థితిరాలేదు. కావ్యకర్తలసంఖ్య చాలా యెక్కువైపోయింది. ఖండకావ్యాలు రైసుమిల్లులవలె గతానుగతికాలై పోతున్నై! ప్రతిభ అందరిసొమ్ము కాకపోవడంచేత నిజమైన కవులు వేళ్ళమీద లెక్కింపదగ్గవాళ్లే వున్నారు. వ్యావహారిక భాషాప్రయోగం స్థిరమైంది. నండూరువారి మార్గంలో సిద్ధిపొందినవాళ్ళసంఖ్య చాలా తక్కువ. అడివి కొంతవరకు ప్రయత్నించాడు. ఆసంగతి తరాత తెలుసుకుందాం!

"1. సభా నిబంధనలనూ, తత్ప్రచార క్రమమునూ నిర్ణయించ డాని కొక ఉపసంఘమును నిర్మించుట (సభ్యులు గు. ధర్మారావు సభాపతి చి. నారాయణరావు, పం. ఆదినారాయణశాస్త్రిగార్లు.)

2. సభోద్దేశములను ప్రచారంచెయ్యడానికి వ్యక్తులను నియ మించుట.

3. గ్రాంథికాంధ్రము ఒకానొకప్పుడు పరిమిత ప్రయోజనము కలదైనా, నేడది సర్వజనోప యోగకారికాదు......వ్యావహారి కాంధ్రము అపరిమితప్రయోజనము కలది. ప్రజలలో జ్ఞానభివృద్ధి కలగడానికి యిదే పరమసాధనము.

4. ప్రారంభవిద్య, ఉన్నతవిద్యలను తెలుగు పిల్లలకు చెప్పే టందులకు, సాధనముగా గవర్నమెంటువారేర్పాటు చేసిన గ్రాంథిక భాష అందుకు తగినదికాదు. భాషకున్నూ, బాలురకున్నూ, అందు వల్ల తీరని నష్టము కలుగుతున్నది. కావున జీవద్భాషలోనే విద్యా కార్యమంతా జరపవలెనని గవర్నమెంటును యీసభవారు కోరు తున్నారు.

5. ఆంధ్రవిశ్వ కళాపరిషత్తు, మద్రాసు విశ్వవిద్యాలయముల వారి నిబంధనలలో, ఇంటర్మీడియేటు బి.ఏ. పరీక్షలకు రెండో భాగ ములోని దేశభాషలను బోధించే ఉద్దేశము నవీనభావ ప్రకటనకు అనుకూలమైన భాషను ఉపయోగించేటట్టు చేయడమే, అని స్పష్ట ముగా ఉన్నప్పటికీ, తెనుగుబోర్డు ఆఫ్ స్టడీస్‌వారు ఆ నిబంధనను యిన్ని సంవత్సరముల నించిన్నీ ఉల్లంఘిస్తూ ఉండడం చాలా విచార కరము. కాబట్టి యికముందు నవీనభాషతో ఉన్న గ్రంథాలకు యెక్కువ ప్రాముఖ్యము యిచ్చేటట్లు తెనుగుబోర్డు ఆఫ్ స్టడీసు వారిని కోరవలెనని ఆయాసిండికేట్లవారిని యీసభవారు కోరు చున్నారు." సభాధ్యక్షులు కొందరు నవ్యులపైన కొన్ని అభిప్రాయాలిచ్చారు. పేర్లతో పిలవకుండా తిట్టారనచ్చు.

"పెండ్లిఅయినా కాక, స్త్రీహృదయం యెట్టిదో అయినా తెలియక, ప్రేమగీతాలూ ప్రణయగీతాలూ పాడేవారున్నూ, ఏమీ కారణం లేకుండా కళ్లకు నీళ్లైనాలేకుండా అరవవారి కూలి యేడుపు యేడ్చేవారున్నూ." ఈసభ యేర్పాటు చెయ్యడానికి మూలసూత్ర మీకింద యిట్లాయిచ్చారు.

"ఆంధ్రవాఙ్మయాంధ్రభివృద్ధికోసము ఆంధ్రదేశమున మంచి సంస్థ వక్కటి అయిననూలేదు. ఆంధ్రసాహిత్య పరిషత్తు ఉండియు పరిమిత ప్రయోజనకారి అయిపోయినది."

ఇవి యీ సభయొక్క ఉద్దేశాలు. కేవల సారస్వతసేవ కొరకేగాక యావద్విద్యా విషయాల్లోకూడా పని చెయ్యడం యీ సభయొక్క ఉద్దేశాలలో వకటి. ఇదివరలో ఉన్న ఆంధ్రసాహిత్య పరిషత్తు పరిమిత ప్రయోజనం కలది కాబట్టి దానికి సాహిత్యాది విషయాల్లో యెదురెత్తుగ్గా పుట్టిందీసంస్థ. కాని తర్వాత యీ వుద్దేశాలల్లో కేవలసాహిత్యవ్యాపనమే ముఖ్యోద్దేశమై పోయింది. చూడండి కింది "ప్రతిభ"లోవాక్యాలు.

"నవ్యసాహిత్యరచనచేయడము, నవ్యసాహిత్యము దేశములో యేవిధముగా ఉత్పత్తిఅవుతున్నదో పరిశీలించి అందులోని బాగోగులు విమర్శించడము, నవ్యవాఙ్మయమును గురించిన అపోహాలు తొలగించుటకూ స్వసాహిత్యవ్యాపనముకోసమూ ప్రచారముచేయడము, వచన వాఙ్మయమూ సాధ్యమైనంతవరకు పద్య వాఙ్మయమున్ను ప్రజలకు సుపరిచితమైన వ్యావహారికభాషలో నిర్మించి అందుమూలముగా ప్రజలలో విజ్ఞానము వ్యాపింపజేయడమూ- ఇవి పరిషదుద్దేశములు." ఈ విధంగా ఈ సంస్థయొక్క ఉద్దేశాలుగూడా కేవల వాఙ్మయ వ్యాపనానికే అనువర్తించేట్టు చేయబడ్డై! ఇప్పుడుదీని యీ 7 సంవత్సరాలనించీ జరిగిన కృషిచూస్తే కేవల సాహిత్యవ్యాప

నమేకనపడుతున్నది. ఈ ఉద్దేశపూర్తికొరకు యీ కింది కార్యక్రమం యేర్పాటుచేశారు.

(1) పలుతావులలోవున్న కవులు తరుచు కలిసి సంప్రతించుకోడానికీ, వకప్రణాళిక ననుసరించి గ్రంథరచనకు అవకాశంకొరకూ, సభలూ చర్చలూ సల్పడం,

(2) పరిషదుద్దేశ ప్రచారానికి సమావేశాలూ ఉత్సవములూ యేర్పాటుచెయ్యడం,

(3) పరిషత్తుతరఫున వకపత్రిక ప్రకటించడం,

(4) నవ్యసాహిత్య పుస్తకభాండాగారము నెలకొల్పి, అచ్చట నవ్యగ్రంథవిక్రయశాల, యేర్పాటుచెయ్యడం.

ఈ ఉద్దేశ పరిసమాప్తికోసం యీ కార్యక్రమం ముందుంచుకొని క్రమంగా కృషి సల్పగా సల్పగా తుదకు 1936 సంవత్సరం నాటికి పత్రికాస్థాపనమైంది. ఈ ఉద్దేశసాఫల్యంకోసం 1936 సంవత్సరానికి వెనకటి సమావేశాల్లో నవ్యసాహిత్య పుస్తకప్రదర్శనాలు, గ్రంథపఠనాలూ మొదలైనవాటితో ప్రచారంచేశిందీ సంస్థ. మొదటిపేరు మార్చుకుని "నవ్యసాహిత్యపరిషత్తు" అయింది. ఆపేరుతోనే యిప్పుడిది వ్యవహారంలోవుంది. 1936 నించీ నాల్గు సంవత్సర సంపుటాలు ప్రచురించిందీ "ప్రతిభ". పత్రికమాత్రం మంచి ఉత్తమ శ్రేణిలోవుంది. నిర్భయంగా గ్రంథాలను విమర్శిస్తున్నది. నవ్యుల రచనలనన్నిటిని ప్రచురిస్తున్నది. నవ్యసాహిత్యప్రచారానికి భారతి కంటె కేంద్రమైపోయింది. ఇది స్థాపించినతర్వాత యీ సాహిత్యానికి స్థాయిత్వం యేర్పడ్డది. క్రమంగా గుంటూరులో పరిషత్తుకు స్థావరం యేర్పడ్డది. 1939 ఫిబ్రవరినెలలో తన్మహోత్సవం జయప్రదంగా జరిగింది. మొదటినించీ నవ్యసాహిత్య రజతోత్సవం చేయాలనే సంకల్పముండేది. క్రమంగా అది 1940 సంవత్సరం బెజవాడ పరిషత్సభలో జరిగి, "నవ్యాంధ్ర సాహిత్యనిర్మాత"ల్లో ప్రథముడైన

రాయప్రోలువారికి అఖండ సమ్మానం జరిగింది. ఇంతలో గిడుగు రామమూర్తి పంతులుగారు దివంగతులై ఆంధ్రదేశాన్ని అశ్రుసముద్రంలో ముంచిపోయినారు. ఈన లోటు యిప్పుడు చూడనివాళ్లు లేరు. తత్రాపి నవ్యసాహిత్యాని కిది తీరనిలోటు. తత్స్మారక సంచికకూడా ప్రచురించింది పత్రిక. తన కర్తవ్యం చక్కగా నిర్వర్తిస్తున్నది. గ్రంథసమీక్షమాత్రం చాలా ఉదాత్తంగానూ, నిర్మొగమాటంగానూ చేస్తూండడం చాలా సంతోష కరం. ఈ పరిషత్తూ, పత్రికా సందర్భంలో ముగ్గురు వ్యక్తుల పనిని ప్రత్యేకంగా ప్రశంశించాలశుంది. సభాపతిగారూ, తెలికచర్ల వెంకటరత్నంగారూ, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారూ చేసిన సేవను యెంతచెప్పినా తీరదు. ఇప్పటి కీ పరిషత్తుతరఫున 8 సమావేశాలైనై !

1. బరంపురం — 1933 — చిలుకూరి
2. రాజమండ్రి — 1933 — రాయప్రోలు
3. అనంతపురం — 1934 — సభాపతి
4. కాకినాడ — 1936 — పంచాగ్నుల
5. గుంటూరు — 1937 — గిడుగు
6. బందరు — 1938 — బుర్రా
* 7. బెజవాడ — 1940 — విశ్వనాథ

---

*ఎనిమిదోది చెన్నపురిలో 1941 డిసెంబరు నెలలో అడివి బాపిరాజు అధ్యక్షత పదవికింద జరిగింది. ఇది హైద్రాబాదులో జరగవలసి ఉండెను. కాని అక్కడి వారిలో వుండే గర్భశైత్యాలవల్ల జరగలేదు. విశ్వనాథ సత్యనారాయణగారి ఆధిపత్యం కింద జరిగింది సప్తమ వార్షికోత్సవము (భారతి విక్రమచైత్రము.) కాని పట్నంలో జరిగినదాని ఆహ్వానాలమీద "నవమ సమావేశ"మని ఉంది. గుంటూరులో మధ్యజరిగిన వక సమావేశాన్ని కలుపుకున్నారేమో ? అది నవ్యసాహిత్య పరిషద్వార్షిక సభగా జరిపినట్టు నాకు తట్టదు.

ఈ ప్రకారంగా సభలు జరిపీ, పత్రికను నడిపీ, యీ పరిషత్తు చేస్తూన్న పని చాలా గొప్పగావుంది. కాని పత్రిక సకాలంలో రావటమూ, సభలు నిర్ణీతకాలంలో జరపడమూ పడడం లేదు. ఇప్పుడు పుస్తక ప్రకటనమొకటి చాలా మంచిస్థితిలోవుంది. పరిషత్తు తీసుకున్నదీ ప్రకటనకార్యం. రాయప్రోలువారి కావ్యాలన్నీ ప్రచురించింది. ఇంకా యితర కావ్యాలుకూడా ప్రచురణ అవుతున్నై! చక్కని కూర్పులుగా బయటకు వస్తున్నై! పత్రికాపుస్తక ప్రచురణంలో సభాపతి కార్యదర్శులు చేస్తూన్న కృషికి దేశమంతా వారికి వందనాలియ్యవచ్చు. సభాపతిగారి భార్యా వియోగం వారి నీ కార్యానికి ప్రత్యేకించింది! నిష్కామకర్మాచరణంచేత వారు మోక్షం చూరగొంటున్నారు! భగవంతుడు వీరికి దీర్ఘాయుష్యమిచ్చు గాక!

ఒక్కమారీ పత్రికలో ప్రచురించిన సారస్వతాన్ని స్పృశిస్తాను. వెనకటి కవికుమారుల రచనలు క్వాచిత్కంగానే గాని యెక్కువగా కనపడటం లేదు. విశ్వనాథ కావ్యాలు ప్రతిభలో అంత యెక్కువగా పడటం లేదు.* నే నుల్లేఖించిన సాహిత్య వీధీ సంచారం కనపడుతున్నదీపత్రికలో. పత్రికవారి స్వంతమాటలను ప్రథమ సంవత్సరాంతానికి మనవిచేస్తాను. "మొదటి సంపుటంలో పరిషత్తు నాల్గవ అయిదవ వార్షికసభలలో అధ్యక్షతవహించిన ఆదినారాయణశాస్త్రిగారూ, రామమూర్తిపంతులుగారూ, నవ్యసాహిత్యోద్యమముగురించి చేశిన ఉపన్యాసాలూ, భాషాచరిత్రకు సంబంధించిన వ్యాసాలూ ప్రకటించినాము. సారస్వతశాఖకు సంబంధించినవి పది వ్యాసాలు ప్రకటించినాము. రెండు పద్యనాటికలూ, రెండు గద్య రూపికలూ, ఖండకావ్యములూ, గేయములూ, కథలూ, గ్రంథవిమర్శనములూ యీసంపుటములో ప్రకటితములైనవి." చూడండి యెన్ని

* "రామలింగారెడ్డి ప్రశంస" మొదలైనవి చాలా కొద్దిగా వున్నై!

వీధులలో యీ రచయితలు సంచారంచేశి పత్రికకు వస్తువును కూర్చారో. ఈ పద్ధతిలోనే యిప్పటికీ యీ పత్రిక నడుస్తున్నది. వారికున్న కష్టాలుకూడా వారి నోటినించే విందాం!

"అచ్చుబాగాలేదని కొందరూ, 'గెటప్, తృప్తిగాలేదని కొందరూ, 'సాహితి, సఖి, ఉదయిని, పాటైనావుండద్దా' అని కొందరూ, వ్యాసాలకు చాలపేజీలను విడిచిపెడుతున్నారని కొందరూ మంచి వ్యాసాలురావడం లేదని కొందరూ, పద్యాలు తగ్గించాలని కొందరూ, కొందరి పద్యాలకు వెలివేస్తే బాగుండునని కొందరూ, కథలు చాలవని కొందరూ, విమర్శనలు మరీ ఘాటుగా వున్నవని కొందరూ, యీ విధముగా యెవరికి తోచిన మాటలువారు అంటున్నారు." శ్రేయాంసి బహు విఘ్నాని! ఒక్క మాట మాత్రం మనవిచేస్తాను. సాహితి, సఖి, ఉదయిని, పత్రికలనుమాత్రం ఆదర్శంగా పెట్టుకోవద్దనీ, (త్వరలో అంతరించినై కాబట్టి) ఎటువంటి పనికీ వంకపెట్టేవాళ్లుంటూనే వుంటారనీ, అంతమాత్రంచేత నిరుత్సాహం చెందక కర్తవ్యం నిర్వర్తించవలెననీ, పత్రిక చిరస్థాయిగా వుండే యత్నం మాత్రం చెయ్యవలెననీ ప్రార్థిస్తున్నాను. అదిగనక జరగక పోయెనా నవ్యులకు కబుర్లేగాని కార్యోత్సాహం లేదనీ, బాల నాయక బహునాయకమైందనీ, "మరోమారు రుజువవుతుంది". కాబట్టి అట్లా చెయ్యక విజయంకోసం తలవగ్గమని ప్రార్థన. అందులో యెట్టి అవమానమూ, అప్రతిష్ఠా లేదు. కృష్ణశాస్త్రిగారి కృతులు "నాడు నేడు" 'ఊర్వశి' మొదలైనవి అప్పుడప్పుడూ కనపడుతునై! 'హాఫిజ్' అనే పారసీక కవియొక్క కావ్యానికి ఒక స్వేచ్ఛానువాదముంది.* కొంచెం "అయోమయం"గా వుంది. ఖాసింఖానుగారు చేసిన అదే పరివర్తనం విన్నాను. హృదయంగమంగా వుంది.

---

* "మొగసాల" "జైలులో" అని పకచక్కని కావ్యంకూడా రచించారు.

"పురిపండా, కొండాలి, జాషువా, అడివి, బొడ్డు, కొమాండూరు, కవి
కొండల, మొదలైన పాతపేర్లు కొన్ని కనపడుతూనేవున్నై! సభా
పతి, నరిసింహశాస్త్రి గార్లు తమ చక్కని పద్యరూపికలూ నాటికలూ
రచిస్తూనేవచ్చారు. ఇవి మాత్రం చాలా ఉత్తేజకరాలుగానే వుంటూ
వచ్చినై! మొదలెట్టినప్పటినించీ, సమప్రదేశంలో ప్రవహించి దేశా
న్నంతా నూతనసస్యాఢ్యంచేసే జీవనదులల్లే వీరిద్దరి రచనలూ భాషా
లంకారాలుగా వుంటూనే వున్నై!* కర్షక కార్మికుల జీవనచిత్రాలు,
చిరుమామిళ్ళ విజయపార్థసారధి, రాజమన్నారుగారు మొదలైన
వారూ♦ "పాషాణి" అనేపేరుతో డి. యల్. రాయి నాటకానుకర
ణాలు మొదలైనవీ, "ఎలిజీ"పద్ధతిలో పన్యాల వెంకటరంగనాథరావు
గారూ,† యీవిధంగా కొన్ని నూతనకావ్యాలు వచ్చినై! ఆచంట జాని
కరాంగారు "కచదేవయాని" అని వక రేడియోనాటకం రచించి ఆడిం
పించారు. రేడియో వచ్చి దేశానికి విజ్ఞానం కలగజేసింది. మన
ఆంధ్రుల కందులో స్థానంలభించడం చాలా ఆనందకరమైన విషయం.
మన ప్రముఖులు చాలామంది దానిలోమాట్లాడి విజ్ఞానం వెద
జల్లారు, వెదజల్లుతున్నారు. తమ తండ్రిగారి భాషాసిద్ధాంతాల
నన్నిటినీ గుదిగుచ్చి పద్యరూపంగా "భారతీశతక" మనేపేరుతో
గిడుగు సీతాపతిగారు రచించారు. ఇది చదువుతూంటే నాకు
ధూర్జటికాళహస్తీశ్వర శతకం చదువుతున్నట్టుంది. చాలా సరసంగా
వుందీగ్రంథం! సభాపతిగారుపేరుచెప్పకుండా తమ స్వీయచరిత్రలో
భాషాధ్యాయాన్ని "నాలోమార్పు" అనే శీర్షికకింద రచించాడు.

* షణ్ణవతి, పతంగయానం, యక్షరాత్రి మొదలైనవి—ప్రభువాక్యం, వరపరీక్ష, మొదలైనవి—సభాపతి వకవైపు వచన నాటకాలూకూడా రచిస్తూనేవున్నాడు.

♦ నాటికాగుచ్ఛము.

† ఈన "శ్మశానవాటిక"నే శీర్షికకింద ప్రతిభ సం 5 సం 1లో రాసిన ఖండ కావ్యం జాషువా కావ్యానికి ప్రతిబింబంగా వుంది.

చాలా విషయాలతో నిండి హృదయాకర్షకంగా వుండేరచన. ఆంధ్రా భిమానాన్ని పురికొల్పు తున్నారు మారేమండ రామారావుగారి వంటివారు తమ "తెలుగు వెలుగు" మొదలైన గ్రంథాలతో! చింతా దీక్షితులుగారితో బాటు కూచి నరసింహంగారు కూడా బాలవాఙ్మయంకోసం పాటుపడుతున్నాడు. ఇటీవల "శాలావాఙ్మయ గ్రంథమాల" అనే పేరుతో శికింద్రాబాదులో పుస్తక ప్రచురణం జరుగుతున్నది. ఇతర వాఙ్మయాలను తప్పక యీ విషయంలో అనుకరించవలశియున్నది మనం. సాహిత్య పరిశ్రమ చక్కగాచేస్తున్నారు. జమ్మలమడక, పాటిబండ్ల, గొడవర్తి, కృత్తివాసతీర్థులు కొడవటిగంటి, నోరి, మొదలైనవారి సారస్వత వ్యాసాలు చాలా ఉత్తేజకరాలుగా ఉన్నై. చింతా దీక్షితులుగారి "యక్షగానతత్వనిరూపణము", పుచ్చా వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారి "సంగీతతత్వనిరూపణము", యీ కాలానికి చాలా అవశ్యకర్తవ్యాలుగా వున్నై! మండపాకవారి "సారంగపాణిపదవిమర్శ" వెంపటి నాగభూషణంగారి "మువ్వగోపాలపదములు"కూడా చాలా హృదయంగమంగా వున్నవి. ఈ పత్రిక కలంకారభూతాలైన వ్యాసాలివి. పురాతనకథలను "లలిత కథావళి" "సిందుబాదు కథలు" అనే పేరుతో రాయసంవారూ, మొసలికంటివారూ, రాశిపడేశారు. కథానికావీధిలో వెనకటి, శ్రీనివాసశిరోమణి, కొడవటిగంటి, బొడ్డు, మల్లాది, విశ్వనాథకవిరాజు, మొదలైనవారేగాక 'బుచ్చిబాబుకథలు' అనేపేరుతో కామకథలూ (Sex), "కృష్ణమూర్తికథలు" అనేపేరుతో శాస్త్రపరిశోధన కథలూ, 'యువకథావళి' అనీ 'ఆధారములు' అనీ కార్మికజీవనం తెలియజేసే కథలూ, యింకా నీలకంఠం కథలూ, (సభాపతిగారివని ప్రతీతి) కరుణ కుమారకథలూ, 'సూర్యనారాయణమూర్తికథలూ' 'ముత్యాలశాల' 'ప్రేంచెంద అనువాదాలు' అనే పేర్లతో కొన్ని వున్నవి. అనేక

రకాలుగా యీ వీధి చాలా అభివృద్ధిలో వుంది. "వ్యత్యాసమని" సాంఘిక కథాసంపుటి ప్రకటింపబడింది. "ప్రజాసామాన్యానికి సంబంధించిన యితివృత్తులనే తీసికొని వారి నిత్యజీవితాల్లో, సారస్వతములో, కళలో, ప్రతిఫలించేటట్లు చేయాలని యిప్పటికి అభిప్రాయము. దీనికే ప్రోలిటేరియన్ కళ అని పేరు. దీనిని ప్రజాసామాన్యంలోనించి బయలుదేరిన చిత్రకారులు సృష్టించవచ్చు. లేదా వారిజీవితాన్ని సానుభూతితో గమనించి ప్రశాంతంగా యితరులైనా సృష్టించవచ్చు. మాలపల్లి, యెంకిపాటలు దీనికి నిదర్శనములు. మార్గి (Classical) దేశి (folk) రీతులు, మనసంస్కృతిలో యెల్లప్పుడు ప్రవహిస్తూనే వున్నవి. ఒకదానివలన రెండవదానికి బలము, ఉత్తేజము, కలుగుతూ వుంటుంది."

(కోలవెన్ను రామకోటేశ్వరరావు, ఆంధ్రపత్రిక, 12-11-40.)

ఈ మార్గదేశీవిభాగం కవిత్వంలోనూ నాట్యంలోనూ, సంగీతంలోనూకూడా ఉంది. నన్నెచోడుడు వీటిని సంస్కృతాంధ్రాలకు పర్యాయాలుగావాడాడు. ఈ కథావీధిలో యువకులు, పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి, మొదలైనవాళ్ళు చాలామంది సంచారంచేశారు. ఇటీవల హైదరాబాదులో కొందరు యువకులు వక గ్రంథమాల స్థాపించి తత్ప్రథమాన "కమ్మతెమ్మెరలు" అనే వక కథాగుచ్ఛం ప్రచురించారు. ఎన్నికథలు యెందరు రాశినా వెనక నేనిచ్చిన ఇంద్రగంటివారి లిస్టును మించినవి పుట్టలేదు.

నవ్యులలో కొందరు కారణమేమో తెలియదు బౌద్ధవాఙ్మయంవంక తమ దృష్టిని సారించారు. బహుశః అందులోవుండే

అహింసాసత్యసిద్ధాంతాలు వీళ్ళకు నచ్చినై అనుకుంటాను.* మరోటి కూడా కావచ్చు. వీళ్ళకు వెనకటి సంప్రదాయాన్ని తెంచుకోడాని కిష్టంలేదు. కాని నవ్యల్లో కలవాలనే ఆదుర్దావుంది. అందుచేత వస్తువును వెతుకోగా బౌద్ధవాఙ్మయం దొరికింది వీళ్ళకు. ఇందులో తప్పేమీలేదు. అదీ తప్పక మనభాషలోకి రావలసిందే. ఈ వీధి సంచారంచేశిన వాళ్ళల్లో దుగ్గిరాల బలరామకృష్ణయ్య (బౌద్ధవాఙ్మయ బ్రహ్మత్వం వీరి కబ్బింది), కిళాంబి రంగాచార్లు, చిలుకూరి నారాయణరావు, సన్నిధానం పింగళి కాటూర్లు, వేలూరి చంద్రశేఖరంగార్లు యెన్నదగినవారు. ఈ బౌద్ధ వాఙ్మయలోం పింగళి కాటూర్ల ♦ "సౌందరనందము" వేలూరి చంద్రశేఖరం గారి "కాంచనమాల" సన్నిధానంవారి "జాతకకథాగుచ్ఛము" ఉత్తమాలు. మళ్ళీ వీట్లో సర్వజనులనూ రసంలో ముంచేసిన గ్రంథం "సౌందరనందం". తత్కర్తలకు శాశ్వతకీర్తిని తెచ్చిందనడంలో యెంత మాత్రం అనుమానంలేదు. చక్కని శైలిలో, ఔచితిని పాటిస్తూ, కథను పోషించుకుంటూ, వర్ణనలను అవసరమైతే వదలకుండా, భావ గుంభితంగా రచించారు. ఈ గ్రంథం రచించిన శిష్యులకూ, కృతిపొందిన గురువర్యులకూ కూడా కీర్తిని తెచ్చింది. సూర్యనారాయణశాస్త్రిగారి "జాతకకథాగుచ్ఛం" మంచి ఉదాత్తశైలిలో

* వంగూరు సుబ్బారావుగారు తమ "ఆంధ్రవాఙ్మయ చరిత్ర" లో 1920 సంవత్సరంలోనే యిలారాశారు. "ఇంతవరకేల ? ఇప్పుడాంధ్రదేశమున బౌద్ధ జైన వాఙ్మయముల భాషాంతరీకరించి ప్రచారమొనర్పుడు. వాఙ్మయము తెనుగులో పుట్టిన మరునటిదినమునుండి యాంధ్రదేశమున బౌద్ధ జైన మతప్రీతి, జైనమతస్థులును బయలు దేరుదురు."

♦ కాటూరువారు యె. యస్. పి. అయ్యరుగారి కొన్ని నాటకాలు పరివర్తన చేశారు. ఈ కాలంలో పూర్వపద్ధతిని ప్రబంధాలూ, నాటకాలూ రచించేవారు అడుగంటలేదు. ఒకవేపు అవీ వస్తూనేవున్నై ! హనుమత్సందేశాదులు చక్కని ప్రబంధాలుకూడా పుట్టినై !

పడుస్తున్నది. వీరి కవిత్వంకూడా రాటుతేలి క్రమ క్రమంగా వలసిన సౌలభ్యం అలవడచేసుకున్నది. వీరి గ్రంథపరంపరచూస్తే వీరి కవిత్వంలో కలిగిన క్రమపరిణామం ద్యోతకమవుతూవుంటుంది. ఈన రుక్మిణీకల్యాణకథనుమార్చి "కీరసందేశమ"నీ యింకా "సోరాబు రుస్తుం పరివర్తనమూ, భాసకథావళీ మొదలైనవాటినికూడా రాశాడు." పాఠశాలోపయోగం కోసం సుబోధినీ వ్యాకరణంకూడా రాశాడు. 'కావ్యమాల' అనే పేరుతో వక గ్రంథమాల స్థాపించి కావ్యాలు ప్రచురిస్తున్నాడు. "ఖడ్గతిక్కన" మాత్రం మిగిలినవాటి పాకంలో పడక కొంచెం రసం తక్కువని చెప్పాలిశొస్తుంది.* కాంచనమాలను గూర్చి చెప్పవలసివస్తే దీనికి మాతృక వున్నప్పటికీ చంద్రశేఖరం గారు దీన్ని మంచి రసవత్కథా సందర్భాలతోనూ, మనోవృత్తప్రదర్శనాలతోనూ, సరసశైలితోనూ, కూర్చారనడం సత్యదూరంకాదు.

ఈ కాలంలో ప్రచురింపబడిన కొన్ని నవ్యసాహిత్యగ్రంథాలను గూర్చి ముచ్చటిస్తాను. ప్రేమగ్రంథమాలనేపేరుతో వకటిస్థాపింపబడి ప్రేమను చిత్రిస్తూవున్న "ప్రేమాంజలి" మొదలైన ఖండకావ్యాలు ప్రచురణైనై! వేపకొమ్మ ఆదిశేషయ్యగారు "కురంగీకిరాతమనే" ఖండకావ్యం ఒకటిరాశాడు. వఝుల వెంకటేశ్వరకవిగారు "నౌకాభంగము" అనే పేరుతో ఆంగ్ల కవివరుడగు టెన్నిసను రాశిన ఈనక్ ఆర్డెను (Enoch Arden) అనే ఆంగ్లకావ్యాని కనువాదం రచించాడు. చాలా చక్కగావుంది. "ఏకాంతద్వీపము"లోని వర్ణనలు మొదలైనవి చాలా హృదయంగమాలుగావున్నై! కాని ప్రియుడికోసం వేచి యున్నన్నాళ్లుండి తుదకు పెళ్ళిచేసుకోడం కొంచెం ప్రాచ్యపద్ధతికాదు. బొడ్డు బాపిరాజుగారి "విపంచి," కందుకూరి రామభద్రరావుగారి "తరంగిణి," వఝుల కాళిదాసుగారి "భిక్షావతి," కుందుర్తి నరసింహారావుగారి "యౌవనజ్వాల", వట్టికొండ రంగయ్యగారి "ప్రణయి," మధునాపంతులవారి "తోరణము" "గోభూమి," బెళ్ళూరి శ్రీనివాస

ఈన తత్త్వమచంద్రికను పెంచి వ్రాసిన వ్యాకరణమొక యుద్గ్రంథము.

మూర్తిగారి "ప్రేమతపస్విని," అత్తిలి సూర్యనారాయణమూర్తిగారి "పాలపుంత", సబ్నివీసువారి "గేయగుచ్ఛము," నాళం కృష్ణారావుగారి "విరిదండ" మొదలైనవి చక్కని రసవత్కావ్యాలే. * తుమ్మలపల్లి సీతారామమూర్తి చౌదరిగారు ఆంధ్రోద్యమాన్ని పురికొల్పుతూ "రాష్ట్రగానం" అనే కావ్యం చాలా ప్రశంసనీయంగా రాశాడు.♦ సరిపల్లె విశ్వనాథశాస్త్రిగారు ఒక "సాధకుడు". తమ అభిమాన దేవతైన లలితపైన "లలితాశతకం" గాక ఆంగ్లంలోనించీ మిల్టను రాసిన "కోమస్" అనే కావ్యాన్ని "కామవిలాసము" అనే పేరుతో స్వేచ్ఛానువాదం చేశాడు. విశ్వవిద్యాలయంవారు యం. ఏ. కు పాఠ్యగ్రంథంగా పెట్టి గౌరవమిచ్చారు. "తరంగములు" అనే పేరుతో పిఠాపురం యువరాజుగారు తమ కావ్యగానాన్ని చేశారు. చక్కని భావాలతో నిండివున్నై పద్యాలన్నీ. అడివి బాపిరాజు "గోధూళి" అనే పేరుతో చక్కని జానపదకావ్యాన్ని రచించాడు. చాలా రసవంతంగా ఉంది. కాని నండూరివారి కావ్యానికి ప్రతిధ్వనా అని తోచచ్చు.* వీరు

* కృత్తివాసతీర్థులు మళ్ళీ తండ్రి అయిన సభాపతిగారి ననుకరిస్తూ పద్యనాటకాలు రచిస్తున్నట్లు "రాసలీలానాటిక" సాక్ష్యం.

♦ బోడేపూడి వెంకట్రావుగారి "ఆంధ్రతేజము" ఇది ఒక చక్కని కథాకావ్యం రాశాడు. కీర్తిశేషులయిన వంగూరి సుబ్బారావుగారి 'మణిమేఖల'లోని వీరపత్నికిది రూపాంతరము అన్నాడు కవి. విశ్వనాథ మెచ్చుకున్నాడు.

* "బాపిరాజు" చాలామందికి భావనా గురువు. అత్తిలి సూర్యనారాయణమూర్తిగారు ఆయనకు తన కావ్యాన్ని అంకితం చేశాడు. రుక్మిణీనాథశాస్త్రిగారు యీయను "అలరవీంద్రుడవు నీవె అవనీంద్రుడవు నీవె" అని పేర్కొన్నాడు. తప్పక బాపిరాజు అట్టివాడే! ఇతను చాలా సర్వతోముఖ ప్రజ్ఞకలవాడు. కవి చిత్రకారుడై సినిమా డైరెక్టరై చాలా ఉన్నతమైన శక్తిగలిగి నిగర్వి సంప్రదాయాని కోసం పాటుపడే కొద్దిమందిలో యీన ఒకడు. ఇతని మాటలు పాటలు విన్నవాళ్ళు యితన్ని యెన్నటికి మరువరు. గోధూళేగాక యితను రచించిన "నాగరాజు" మొదలైన పాటలు చాలా ఉన్నై! ప్రచురించడంలో చాలా లుబ్ధు.

గాక యింకా యితర ఖండకావ్యాలు పూరిపండా, ఉమర్ ఆలీషా ఇంద్రగంటి మొదలైన వారు రాశారు. జాషువా "ఖండకావ్యాలు" రెండు సంపుటాలుగా ముద్రింపబడటమేగాక ఆయనరాశిన "ఫిరదౌసీ" మొదలైన యితర కావ్యాలుకూడా యీకాలానే ముద్రింపబడి ఆంధ్ర దేశాన్ని కల్లారుముద్దుగా యియ్యబడ్డవి! అందరం చాలా సంతోషించాం. ఇతనీ కాలంలో నవ్యాకాశంలో తేజోవంతంగా వెలుగుతున్న నక్షత్రం! ఇంకా అనేక కావ్యాలు రచించాలె! ఇతని నుడికారం మిక్కిలి శ్రోత్రప్రేయం. ఇతనికి చక్కని పదజాలమే తటుతుందిగాని శ్రుతి కటు పదజాలం తట్టనే తట్టదు. ఇటీవల సంస్కృతాన్ని నిరాదరణగా మాట్లాడి క్షమాపణ చెప్పుకున్నాడు పట్నంలో! పరమేశ్వరుడు దీర్ఘాయువిచ్చి రక్షించుగాక! భాషాపరిశ్రమ చెయ్యడంలో మత మడ్డురాదని సిద్ధాంతీకరించిన వాళ్లల్లో యీన ముఖ్యుడు. క్రీస్తుమీద రాశిన ఖండకావ్యం చాలా హృదయంగమం. క్రైస్తవుడైనను చిత్తవృత్తి మారకపోయినందులకు యీనకు ఆంధ్రదేశమంతా అభినందిస్తున్నాము. ఈకాలంలోనే విశ్వనాథ శృంగారవీధీత్యాదులైన వెనకటి కావ్యాలుకూడా ప్రచురణ ప్రారంభమై దేశాన్ని ఆనందింప చెయ్యటం మొదలెట్టినై! కొందరు యువకులు మళ్ళీ యీమార్గంలోనే సాధన చేశేవాళ్లు వావిలాల సోమయాజులు, రావూరు సత్యనారాయణ మొదలైనవారు తయారౌతున్నారు. వీరందరిలో వక్క విశేషం కనపడుతున్నది. వెనక సృష్టికీ విమర్శనానికీ విరోధ మనుకుంటూ వుండేవాళ్ళు. ఇప్పటివా రట్లా కాకుండా వీటికి విరోధం లేదని చూపుతున్నారు. "ప్రతిభ"చూస్తే ఖండకావ్యకర్తలేగ్రంథవిమర్శనచేశేవాళ్ళుగాకూడా కనపడతారు. నవ్యసాహిత్యపరిషత్తువారి తరిబీతుకింద జరిగిన గొప్ప విశేషమిది. యిది మొదట్నించీ సభాపతి, నోరి, చింతా మొదలైన వారి ప్రతిభయొక్క అనువృత్తి. వేదులవారు బెజవాడ పరిషత్సభలో యిచ్చిన ఉపన్యాసం సభ్యులెన్నడూ మరవరానిదని చెప్పుకుంటారు.

విశ్వనాథ అధ్యక్షోపన్యాసం వారి విమర్శన శక్తిని ప్రతిఅక్షరం లోనూ వెల్లడిచేస్తున్నది. పింగళివారు అప్పుడప్పుడూ చెబుతున్న విమర్శనోపన్యాసాలూ, తుదకు "వ్యాసమంజరి"కి రాశిన ఉపోద్ఘాతంలోనూ తమ విమర్శనాశక్తినిచూపారు. వెనకటివైనా రామలింగారెడ్డిగారు తమవ్యాసాలనన్నిటిని గుదిగూర్చి "వ్యాసమంజరి" ప్రకటించి ఆంధ్రదేశానికీ, భాషకూ తమ అమూల్య విమర్శకాభిప్రాయాలను దయచేశారు. ఈ విధంగా యీ రెండుశక్తులూ కవులకు కలగడం భాషకు మహోపకారమనడంలో యెట్టి ఆక్షేపణా లేదు. ఈ సందర్భంలో యీ భాషాకుమారులంతా యీవిధంగా పెంచిన వాఙ్మయం యావత్తు వకే ధారావాహికగా వస్తున్నదని వీరిలో ఉపజ్ఞకల వారనుకోడం చాలా సరసంగానూ యువకులకు తెలియజెప్పడంగానూ వుంది. ప్రథములైన రాయప్రోలు మన పూర్వసాహిత్యాన్ని "తెనుగుమాన్యం" అన్నాడు. దానిమీదే మనం అభివృద్ధి చెయ్యాలని వీరి ఊహ. "పరిణతవాకుల, లస్మదనవద్య కళాకవితా పితామహుల్ స్థిరముగ నిచ్చిరి తెలుగు తీయనిమాన్యము" అన్నాడు. ఇటువంటి భావంతోనే నోరి "ఆంధ్రకవిత్వంలోని ఘామన్లు" అనే వ్యాసం రచించాడనుకుంటాను. ♦ అడివి బాపిరాజుకూడా యీ అభిప్రాయాన్నే "కవితాస్రవంతి" అనే పేరుతో రాశిన ఖండ కావ్యంలో చెప్పాడు. వేదాలనించీ మొదలెట్టి, వాల్మీకి, వ్యాసుడు,

♦ కంచుకూరి రామభద్రరావుగారు "తెలుగుతోట" అనే ఖండకావ్యంలో కూడా యిదే అనువృత్తభావం అణిగివుందనుకుంటాను. "యెంత చక్కనిదోయి యీ తెనుగుతోట" అని ప్రారంభించి "నాదుతలపులు రేపు నా తెలుగుతోటలో పాడుకొననిండోయి, పలవింపనిండోయి" అన్నాడు. అప్పటినించీ, యీ తోట వక్కటేననే భావంవస్తున్నది. ఇంద్రగంటివారు 1939 మార్చి భారతిలో రాశిన వ్యాసంలో యిట్లా అన్నారు. "నేటి కాలపు కవిత్వం .........కొందరన్నట్టు కేవలం పూర్వకవిత్వంతో సంబంధంలేకుండా, పూర్తిగా యిప్పటివారి ప్రజ్ఞావిశేషంవల్ల సృష్టింపబడిన అపూర్వ సంస్థ.........కాదని తోస్తుంది. ఇంతేకాక యిది వేదకాలంనించీ ప్రవహించేకవితా స్రవంతి" అనికూడా చెబుతూ పైన ఉల్లేఖించిన బాపిరాజుగారి గీతభావాలతో యేకీభవించాడు.

గుణాఢ్యుడు, కాళిదాసు, భవభూతి, తిక్కన్నల్లోనుంచీ అనువృత్తై తనలోకి దాచుకున్నాడీ కవితాస్రవంతిని. ఇంకా కొందరు కూడా యీ విధంగానే తలచినట్టు కనపడుతుంది. ఇది చాలా సమంజసం! కొందరుమాత్రం తా మెక్కడినించో అంట్లునాటబడ్డట్టు వచ్చి యిందులో పడ్డామని అనుకుంటున్నట్టు తోస్తుంది. ఈ అనువృత్తిభావమే సాహిత్యానికి పునాదని నామనవి. ఇదే సాంప్రదాయ విచ్ఛిత్తి కాకుండా సాహిత్యాన్ని సరియైన త్రోవలో పెడుతుంది. సభాపతి నరిసింహశాస్త్రిగార్లూ కూడా యీభావాన్నే చాలామార్లు నొక్కి చెప్పారు. ఇందుకు మరొక తార్కాణమిస్తాను. వీరు గ్రంథ విమర్శలు చేసినప్పుడు చెప్పే కొన్నిమాటలూ, నిర్వచించే పద్ధతులూ, మన పూర్వుల సంప్రదాయాలతో యెంతమాత్రం భిన్నించడం లేదు. కొన్ని చూపుతాను. గ్రంథ నామాలను గూర్చి చెబుతూ మేఘసందేశ విమర్శలో హనుమచ్ఛాస్త్రిగారు "గ్రంథనామం యింకా కొంచెం స్పష్టమై ఉండడం అవసరం" అన్నారు. ఇంకా 'మరిన్ని' వంటి చ్యుత సంస్కృతులున్నూ అక్కడక్కడ కనబడుతా వున్నాయి" అనడం చాలా ఆశ్చర్యం. ఆ విమర్శించిన కావ్యం చ్యుతసంస్కృతి ఉండకూడని కావ్యం కాబట్టి సమంజసమే! పట్టాభి గారి కావ్యం విమర్శిస్తూ నరసింహశాస్త్రిగారు "...ఈ కవిని అనుకరించి యితరు లెవరైనా కావ్యాలు వ్రాస్తే వాళ్ళను విశాఖపట్నం పంపవలసి వస్తుంది" అన్నారు. ఎంత కఠినము? "రైతుబిడ్డ" అనే నాటకం విమర్శించటంలో వెంకటరత్నంగారు, "కవి పాత్రలమరుగున ఉండడం సమంజసం గాని ప్రచారకుడుగా రంగంమీదికి మాటిమాటికీ ప్రత్యక్షంకారాదు." అని చక్కగా వ్యంగ్యప్రాధాన్యాన్ని నిర్వచించాడు.* ఇవి మెచ్చుకు చాలనుకుంటాను. వీటితోపాటు మాండలిక పదాలనుగూర్చి, కవి రాశే కథావస్తువును గూర్చి, సృష్టించే పాత్రలనుగూర్చి, రాశేటప్పుడు కొన్ని కొత్తవిషయాలను చెప్పడం

* చూ. వెనక.

న్యాయమే! కాబట్టి విమర్శించినదోవ చక్కగా పూర్వాధునిక ఫక్కీల సమ్మేళనం చాలా సమంజసమూ కర్తవ్యమూను! ఇది వీరు నిర్వర్తిస్తే ఆంధ్రసాహిత్యానికి చాలా సేవచేసిన వాళ్లౌతారు. ఇప్పటి సాహిత్య పరిస్థితులనూ, సాహిత్య వాతావరణాన్నీ, సాహిత్య సంపర్కాలనూ, అనుసరించి పూర్వుల సాహిత్య దృష్టికి విపరీతాలు కాకుండా వుండే విమర్శనాపద్ధతులను నెలకొల్పి, రాశేవాళ్లకు మార్గాన్ని నిరూపించడం యీ నవ్యులు ముఖ్యంగా చెయ్యవలసిన పనుల్లో వకటని నా మనవి. ఈ విషయంలో నవ్యుల్లో పండితులూ, సాహిత్యవేత్తలూ అయినవాళ్లు తప్పక ప్రయత్నిస్తారని ఆశిస్తున్నాను. ప్రతిభలో మనవాళ్ళు కొందరు రాస్తున్న సాహిత్యవ్యాసాలు చూస్తే నా కీ ఆశ కలుగుతున్నది. ఉత్సాహంతో ఉప్పొంగుతున్న యువకులు చేయవలసినపని యిది. కాని మానించీ బొత్తిగా విడిపోవద్దని నా ప్రార్థన.

౪

ఇక్కడ రాయడానికి కొంచెం సంకోచంగా వుంది. సమకాలికులనుగూర్చి రాయడమే చాలా కష్టం. తత్రాపి అటువంటివాళ్ళంతా స్నేహితులూ లోకంచేత గొప్పవాళ్ళనిపించుకుంటున్నవాళ్లూ అయినప్పుడు మరీ కష్టం. కాని యిప్పుడు నాకు తోచినట్టు నా కర్తవ్యం నిర్వర్తించట మవసరం. ఇప్పు డున్నమార్గాలను ఈ కిందివిధంగా నిర్వచించవచ్చు.

(1) సామాన్యనవ్యమార్గం.
(2) పూర్వసంప్రదాయ పునర్గమనమార్గం.
(3) * అతినవ్యమార్గం.

---

* "అతివాస్తవ కవిత" న్నాడు. జ. రు. శాస్త్రి. ఈ సర్ రియలిజంలో అనేక విషయాలున్నై! ఇది ఒక్క మార్గమనడానికి వీల్లేదు.

## 1. నవ్యమార్గం:

ఇంతవరకూ యిన్నివందల పేజీలకూ విషయ మీమార్గమే! సుబ్బారాయాప్పారాయోపజ్ఞకమై, పరశశితం కవులచేత అనుసరింప బడి, మొదటికాలంలో ఉదాసీనులుగాఉన్న వారిచేతకూడా తలఊపించ గల సామర్థ్యం కలిగి, యావద్దేశాదరణం పొందిందీమార్గం. ఈ మార్గంలో నిష్ణాతులైన వీరి కావ్యాల నిదివరలో స్పృశించి వాటిలో ఉన్న గుణదోషాలను తెలుసుకున్నాం. ఈ సాహిత్యపరివర్తనం, దేశ కాల పాత్రాల పరిణామమై సహజంగా వచ్చిందని చూశాం. నాగరకతతోబాటు సాహిత్యంకూడా పక్కన నడుస్తూవుండి రెండూ అన్యోన్యాశ్రయాలుగా వుంటై! ఈ నవ్యసాహిత్యంలో మన యీ 40 సంవత్సరాల జాతీయజీవనమంతా కొంత యెక్కువగానో తక్కువగానో ప్రతిబింబితమై ఉందని గమనించాం. ఈ మార్గసంచా రంవల్ల భాషకూ సాహిత్యానికీ వైశాల్యం కలిగిందనికూడా చూశాం. ఇంకా అనేక విషయాల్లో సాహిత్య మభివృద్ధిని పొందాలశుంది. కావ్యరచనం మాత్రం చాలా జరిగింది. ఒకవంక అతిగా పెరగడం యితరవైపుల పెరగకపోవడం సంపూర్ణ సాహిత్యవ్యాప్తి కానేరదు. అభివృద్ధి సర్వతోముఖంగా వుండాలె! అట్లా వుంటేనేగాని బంగాళీ, మరాటీ, మొదలైన యితర భాషాసాహిత్యాలతో మన భాషాసాహి త్యాలుకూడా తులతూగవు. చెయ్యవలసినపని చాలా వుంది. భాషాసాహిత్యాలకోసం భాషాకుమారులు యథాశక్తిగా పనిచేస్తూనే వున్నారు. కాని కావ్యవీధి చాలామంది నాకర్షిస్తున్నది. అందులో కూడా ఉత్తమ మధ్యమభేదాల కవులూ కావ్యాలూ వస్తూనే ఉన్నై! ఈ సామాన్యనవ్యమార్గం పుట్టి పెరిగి యిప్పటికి చాలావరకు పరి ణతి పొందింది. ఖండకావ్యం రాయప్రోలు చేతుల్లో ధర్మబీజంతో పుట్టి కట్టలను తెంచుకుని సంచరించినప్పటికీ, తుదకు విశ్వనాథలో స్థితిని పొందింది. వీ రిద్దరూ ఆద్యంతరక్షకులుగా వున్నారీ

ఖండకావ్యాని కని వెనక చెప్పాను. ఆ ప్రకారంగానే అప్పారావుగారి చేత నాటబట్ట గేయమార్గం కిన్నరసానిపడకల్లో పరిణతి పొందింది! ఈ రెండు మార్గాలను తనలో సమ్మేళనంచేసి పరిణతిని పొందిం వాడు విశ్వనాథ. నవలావీధి వీరేశలింగంగారి రాజశేఖర చరిత్రలో, ధర్మనైరస్యంతోనూ, సంప్రదాయ నిరసనతోనూ ప్రారం భమై, మాలపల్లిలో సామ్యవాదాన్నంగీకరించి, తుదకు సంపూర్ణ ధర్మరక్షణతో వేయిపడగలలో స్థిరత్వం పొందింది. ఈ విధంగా కూడా విశ్వనాథలో యీ మూడువీధులూ కలిసి త్రివేణీసంగమ మైంది! రామాయణ రచనతో పూర్వమార్గంకూడా పరిణతి పొందితే చతుష్పథమైపోతుంది. భావిసాహిత్యసాధకులకు దిక్సూచి అవుతాడీయన! ఇంతకంటె సాహిత్యసేవకుడికి కోరదగిన స్థాన ముందా? ఈ నాల్గు మార్గాలూగాక యితర చిల్లర మార్గాల్లోకల్లా ఉత్తమమైంది కథానిక. దానిలోకూడా అభ్యున్నతిని చూస్తూ వ్యాసమూ, పరిశోధనమూ, మొదలైనవాటిలోకూడా అభివృద్ధిని విమర్శించాం. ఒక్క శాస్త్రాల్లోమాత్రం కృషి చాలదని విచార పడ్డాం. ఈ విధంగా యీ మార్గం వ్యాప్తమైంది.

## 2. పూర్వసంప్రదాయ పునర్గమనమార్గం:

ఏదైనా కొంతకాలం నవ్యంగావున్న తర్వాత పురాతనమై పోయో, లేక విపరీతమైపోయి సాంప్రదాయాన్ని అతిక్రమించో వ్యక్తులకు మనస్సుల్లో మార్పు కలగచేస్తుంది. కాబట్టి మిగిలిన రెండుమార్గాలు యీ రెండుకారణాలతో పుట్టినై. వెనకటి నవ్య మార్గమే చాలాదూరం వెళ్ళిందని కొందరి హృదయాలకు తట్టింది. వెనక కొందరు నవ్యు లనుసరిస్తున్న భాషాసిద్ధాంతాలు గిడుగువారికే దుఃఖం కలిగించినై యని మనవి చేశున్నాను. ఆ అభిప్రాయాలను మల్లాదివారితో వకమాటు వెలిబుచ్చారనికూడా చెప్పాను. కాబట్టి కుమాళ్ళ విపరీతవర్తన, సంస్కారైన తండ్రికే జుగుప్స కల్గించి

నట్టున్న దీ విషయం. కుఱ్ఱవాడు "నీవు నేర్పినవిద్యయే నీరజాక్ష" అని సమాధాన మిస్తాడు. అప్పుడు తండ్రి నిరుత్తరుడు కావలసిందే! భాషావిషయాల్లో గిడుగువారికి దుఃఖం కలిగినట్టే భావవిషయంలో కూడా కొందరికి దుఃఖం కలిగినట్లు సూచనలు కనపడుతున్నై! నరసింహశాస్త్రిగారెంత చక్కగా రాశారు! "అయితే యింతమంది యిన్ని పనులు చేస్తే సాహితీసమితి సభ్యుడ వైన నీ వేమి ఫేషను తెచ్చావని నన్నడుగుతా రేమో? నే నిప్పటి కేఫేషనూ తీసుకునిరాలేదు! కాని వక్కటిమాత్రం ఫాషను చెయ్యాలని ప్రయత్నిస్తూన్నాను. నేను వేదాలంటే, శాస్త్రాలంటే, చెప్పకోలేదు. కాబట్టి వాటిమీద నాకు ప్రమాణబుద్ధి యెక్కువ.* ఈ ప్రమాణబుద్ధి, అంటే సనాతనత్వము ఫాషను చేయవలెనని ప్రయత్నిస్తూన్నాను. ఎదురీతగా ఉన్నది. ఈ నవనాగరక ఫేషను లన్నీ పోగాపోగా కొన్నాళ్ళకు యీ ప్రమాణబుద్ధి మాత్రం ఫాషను కాదా అని నా ఆశ! నవనాగరికులకు మొదట వెలమ వారి మీసాలు, తరువాత తిరుపతి వేంకటేశ్వరుల కత్తెర మీసాలుగా మారి, వాటిని కత్తిరించి, కత్తిరించి, కోసి కోసి, చివర కిప్పుడు మొత్తంమీద శుద్ధ శ్రోత్రియమైన Clean shave ఫాషను లోకి రాలేదా? అల్లాగే ప్రమాణబుద్ధిమాత్రం యేకాలానికో ఫాషనుకాకపోతుందా?" చూచారా వినోదవాక్యాలకింద యీన చిత్తక్షోభం యెట్లా ప్రతిబింబిస్తున్నదో! యీన రచనలుకూడా నిదానించి ఆలోచిస్తే యీ మార్గానికే ప్రచారం చేస్తున్నట్టు కన పడుతుంది. ఈ అభిప్రాయం యీన వక్కడిలోనేగాక యితరుల్లో కూడా కనపడుతుంది. సభాపతిగారికికూడా దృష్టి కొంత మారిన సూచనలు కొన్ని సంవత్సరాలనించీ కనపడుతున్నై.♦ మళ్ళీ

* తెలిసినదానిమీద అప్రామాణ్యం తెలియనిదానిమీద ప్రామాణ్యం!

♦ ఈన చిత్తవృత్తి వకప్పుడు అందనట్టు కనపడుతుంది. ద్వంద్వప్రవృత్తి కల వాడుగా కనపడతాడు.

యీ ప్రమాణబుద్ధి కలగజెయ్యడంలోకూడా విశ్వనాథ చాలా కృషి చేస్తున్నట్టు ఆయన గ్రంథాలవల్ల ఋజువౌతూనే వుంది. ఆయన నవలలేమి, నాటకాలేమి, — వేనరాజు మొదలైనవి— యీ ప్రమాణబుద్ధి కలగజెయ్యడం మూలసూత్రంగా పెట్టుకుని రాశినట్టు గట్టిగాకనబడతై! మొదటి ధర్మమార్గమూ, యీప్రమాణబుద్ధి కలగచేసేమార్గమూ, పరస్పరం సంబద్ధాలుగానే కనపడుతున్నై! మొదటిదానిలో యీ యత్నం కంఠోక్తిగా లేదు. రెండోదానిలోఉంది. ఈ రెంటికి ముఖ్యభేదమది. మొదటిదానిలో మధ్యమధ్య మార్గం వంకరగావెళ్ళి మళ్ళీ సరియైన నడకలోకి రావటం కనిపిస్తుంది. రెండోదానిలో వంకరే లేదు. ముక్కుకుసూటి! కాని దీనిలో ప్రత్యయం కలగజెయ్యడం చాలాకష్టం! అందుకే నరసింహశాస్త్రిగారుచెప్పారు "ఎదురీతగావుంద"ని. తప్పక యీమార్గం అటువంటిదే.

3. (సర్రియలిజం, మనస్తత్వం, మణిప్రవాళం, భీభత్సం.)

* వెనక యూరపులో యుద్ధానంతర పద్ధతినిగూర్చి కొంచ ముల్లేఖించి దానికి కారణాలుచెప్పి అటువంటి కారణాలు మనకెప్పటికీ వర్తించవని మనవిచేశాను. వకమారు ఇంగ్లీషు సారస్వతంకేసి చూస్తే యీబాపతు కవిత్వగుణాల నీ కిందివిధంగా చెప్పచ్చు. ♦

1. అల్లరిచిల్లరతనం (Scrappiness and disorder)
2. నిరాశ (Gloom and hopelessness)
3. పురోభాగిత్వం (Cynicism)

---

* నరసింహశాస్త్రిగారు "అహంభావ కవిత్వధోరణి- చిత్రకవిత్వము" అనే వ్యాసం ప్రతిభలో రాశాడు. చాలా ఉదాత్తంగా ఉంది. దాన్ని యీ భాగంతో సంపుటీకరణంచేసి చదువుకోమని మనవి. ఇలియట్, ఎజ్రాపౌండు, మొదలైనవాళ్లు ఆంగ్లంలో తెచ్చిపెట్టిన నవ్యమార్గాలూ, ఇమేజిజం సింబాలిజం, మొదలైన కవితారీతులూ చక్కగా చెప్పారు.

♦ నరసింహశాస్త్రిగారు 21 లక్షణాలిచ్చారు. ఇవీ, అవీ చాలా కలుస్తై.

4. కోపం. అది తీర్చుకునే మార్గం లేకపోవడం.

5. సంపూర్ణ పరిణామాభావం (ఉద్దేశరాహిత్యం) (No climax)

6. అందరు గొప్ప అనుకునే వాటిలో యేమీ లేదనటం. (Intentional making great things small)

7. ఎక్కడైనా సౌందర్యముంటే కర్షించాలక దాన్ని పాడుచేయడం (Avoiding of beauty and spoiling it)

8. నేయార్థం కొద్దిమందికే ఉద్దేశించడం (Appeal only to a few)

9. ఛందస్సు తారుమారు చెయ్యడం (Metrical confusion)

10. విరుద్ధభావ సమ్మేళనం (Contradictary ideas)

11. మన స్తత్వానికిప్రాముఖ్యమిచ్చామనుకోడం (Psychology)

12. శబ్దార్థ క్లిష్టత (Recondite language)

13. సంకేతము. (Symbolisim) ఇక్కడ మన లాక్షణికాభిప్రాయానికీ దీనికీ భేదముంది. ఏదో మాట ఉపయోగించడం! దీనిలో ఇంత అర్థ ముందనడం! ఆ అర్థం ఉండచ్చు లేకపోవచ్చు!

14. అచ్చులోనూ రాతలోనూ విప్లవం! (Culture=kulture (Ezra Pound)

15. అవసరాన్నిబట్టి పదాలనూ వాటి ఉచ్చారణనూ తారుమారు చేయడం!

ఈ మూడోరకం కవిత్వాన్ని పక్కమారీ పైదాన్నిబట్టి పరీక్షించండి! పైలక్షణాలన్నీ వెనకా ముందుగా ప్రస్ఫుటమైనా అనే చెప్పాల శొస్తుంది! యీ మూడో మార్గానికి ప్రవక్త శ్రీశ్రీగా రంటారు కొందరు. మొదట "జ్వాల" పత్రికలో మొదలైంది

వాదం.* ఇటీవల యీన ప్రవర్తైనాడేగాని యీ మార్గానికి పునాది 1923 సంవత్సర ప్రాంతాల్లో దాదాపునే పడ్డది. పై గుణాలల్లో కొన్ని యిదివరలోనే నేను స్పృశించాను. ఛందస్సు తారుమారు చెయ్యడానికీ, పురోభాగిత్వానికీ, దుఃఖానికీ, నిరాశకూ, సంపూర్ణపరిణామాభావానికీ, అందరూ గొప్పనుకొనేవాటిలో యేమీ

* ఈయన్నుగూర్చి కృష్ణాపత్రిక (30–3–40) యిట్లా అన్నది.

"నిజానికి ముందుకువచ్చి 'నేను నవకవిని' అని చెప్పుకోతగినవ్యక్తి శ్రీ శ్రీ. అతనిలో యెంత పెనుగులాట! ఎంత బాధ! ఎంత ఆవేదన!—ప్రతిక్షణం కొట్లాడుతూ ఉంటయ్యో—అతని రచనలవల్లనే తెలుస్తుంది. .........భావకవి. అక్షరాలా ఆధునిక కవి. అతనిలో సౌఖ్యంకన్న కష్టమే కవనానికి దోహదమిస్తుంది. వెన్నెలకన్న చీకటే ఆనందాన్నిస్తుంది. ఆశకన్న నిరాశే నిశ్చలత కూరుస్తుంది. దేశంలో చెప్పుకోతగ్గ కొద్దిమందిలో అతడొకడౌతాడనే ఆశ మనకు కలిగించగలడు. అతడు పరిషత్తుకు గొప్ప కానుక." ఈ అతినవ్య కవిత (అనగా 1940 సంవత్సరంలో ఆయన రాశిన గీతాలలో నిర్వచించినది) — ప్రారంభించకపూర్వం, యింకా ప్రతిభ మొదటి సంచికలో ప్రకటించిన "దూరభూరేఖా"ది గీత త్రయానికి పూర్వం అప్పుడప్పుడూ కొంచెం బాధ అనుభవించాడు. కాని తర్వాత "అంత బాధ" వున్నట్టు తోచదు. "కొంటె కోణాలు" "Decompositions" "టాం, టాం" రాశిన కవిని చూస్తే, నిజంగానే వెనక "ఆవేదన," "బాధ" ఉన్నట్టైతే, యింత త్వరలో వాటిని యెట్లా గెలిచి హాస్యంలోకి దిగిపోయినాడా అని ఆశ్చర్యమేస్తుంది. అప్పటికింకా "ఈలలు వేస్తూ యెగురుతూ పోతూ" ఉన్నాడు. కాని తన చిన్నతనం వెళ్లిపోయెనే అని మాత్రం కొంచెం దుఃఖిస్తున్నాడు. ప్రతిభావంతుడనటంలో యేమీ అభ్యంతరం లేదు. "జ్వాల" యిట్లా అన్నది యీన్నిగురించి "ఇతను వృత్తాదుల్లో ప్రౌఢమైన కవిత్వం చెప్పినవాడు. చక్కని ఆంధ్రభాషాజ్ఞానం అలవరుచుకున్నాడు. గ్రామ్యమేటుగాక యింగ్లీషు కవిత్వం అభిమానంతో చదివినవాడు." ఒకవేళ ఆయనే చెప్పుకున్నట్టు "అవసరం కలిగి, వినాశంవల్ల లోకాన్ని ముందుకు తీసుకువెళ్లవలసి ఉంటుందని" భావించి యీ బాపతు కవిత్వ రచనలోకి దిగాడేమో? "తన ప్రజ్ఞాతిశయంవల్లనూ తన సంప్రదాయాలను విధించాలని" ఆశిస్తున్నాడుకాబోలు? కావచ్చు!

లేదని తృణీకరించడానికీ, ఉదాహరణాలను కొన్ని వెనక సూచించే వున్నాను. అదిగాక మిగిలిన గుణాల నీ మార్గానుయాయులు పూర్తి చేశారు. కావ్యసౌందర్యాన్ని తృణీకరించడం యింతవరకు ప్రపంచంలో ఉన్న అన్నిజాతుల సాహిత్య సిద్ధాంతాలకు వ్యతిరేకంగా నడవటం!

ఈ మార్గానికి అన్నిమూలాలలనించీ వస్తున్నై వినుతులు. వక విమర్శకుడు యిప్పుడున్నవారిలో వక్క శ్రీశ్రీగారికే "Verse libre" ఉందని రాశాడు! కావచ్చు! విశ్వనాథ యేమన్నాడో చూడండి. నవ్యసాహిత్యంయొక్క అయిదవ దశను వివరిస్తూ "ఇందులో జాషువాగారి మధురకోకిలత్వం స్థిరపడ్డది. శ్రీరంగం శ్రీనివాసరావుగారి ముక్తకంఠం వినపడ్డది. ఆయన చాలా కొత్తదైన వకమార్గం నవ్యసాహిత్యంలో సృష్టించాడు. విశ్వభారతిలో చదువుకొని వచ్చిన మల్లవరపు విశ్వేశ్వరరావుగారు "కల్యాణకింకిణి" తో గోపాలరెడ్డిగారిపెండ్లి చేయించాడు." విశ్వనాథ యీనవ్యమార్గాన్ని శ్రీ శ్రీగారు సృష్టించాడన్నారుగాని నేను మాత్రం"తెచ్చినాటాడు"అని అంటాను. మల్లవరపు విశ్వేశ్వరరావుగారు వెనకటి సామాన్యనవ్యతే యెక్కువపాలుగా ఉన్నట్లు కనిపిస్తాడు. శ్రీ శ్రీ గారు తమ సాహిత్య తత్వాన్ని నిర్వచిస్తూ భారతిలోనూ అక్కడా వ్యాసాలు రాశాడు. రేడియో సంభాషణలిచ్చాడు.* వాటిలో యేవేవో "సర్రియలిజం"మొదలైన కొన్ని కొత్తమాటలను వాడాడు. వాటినిచూచి భ్రమించవద్దని భాషాకుమారులకు హెచ్చరిక. వెనక "రియలిజ" మంటే మనవి చేశాను. దాదాపు మనచుట్టు కనపడే ప్రపంచం, తత్పరిణామం, మానవుల మనస్సులలోనించీ సాక్షాత్తుగా పైకివచ్చిన భావాలు వగైరాలన్నీ దీనికిందికొస్తై. ఈ అతినవ్యుల్లో కొందరనే విషయాల్లో వకటేమిటంటే, యింతకంటె ప్రతివస్తువుకు, ప్రతి భావానికికింద కొంత వస్తుతత్వమూ,

* "నేటి తెనుగుకవిత—కొత్తపోకడలు"

(భారతి. ఫిబ్రవరి 1939)

మన స్తత్వమూ, ఉందనీ, దాన్ని తామూ కూడా సాక్షాత్కారింగా నిరూపిస్తున్నా మనీ, అంటారు. ఇది మన స్తత్వమూర్గ. "Sur" "సర్" అంటే "in" "లోపల" అన్న అర్థమని కొందరంటారు. దీన్ని బట్టిచూస్తే "సర్ రియలిజం"లో వక పద్ధతి మనకు కనపడే బాహ్యప్రపంచానికి పునాదైన నిమ్నోన్నతభావప్రపంచకథన మన్నమాట! మరికొందరు "sur" అనే పదం "super" యొక్క సంక్షిప్తరూప మనిన్నీ, "sur-realism" అనగా యథాదృష్టాన్ని చాలా అతిశయోక్తిగా చిత్రించటమూ యథాభావనను కూడా చాలా ఎక్కువచేసి చిత్రించటమూ అంటు న్నారు. ఇంతకూ మనవాళ్ల "sur-realism" వక నిర్దిష్టపద్ధతికాదు. దానిలో యథాదర్శనం (realisın) దగ్గర్నుంచీ సహ్యత (uglyism) దాకా వున్నై! యథాదర్శనం దాని కేంద్రం. దానిచుట్టూ యీ "యిజములన్నీ" వేలాడుతున్నై! ఈ మార్గానుయాయులు చేసే పనిని కిందివిధంగా చెప్పాడు వక విమర్శకుడు. "The sur-realist artists took a world disorganised by lack of planning and mirrored it in exaggerated detail, as if they had studied it with microscope, and by a process of psycological analysis." అంటే యీ సిద్ధమైన కవులు యిప్పుడు పైకి కన పడే బాహ్యప్రకృతిలో వక సంక్లిష్టపద్ధతి లేదనీ, తామూ ప్రకృతి లీలలను భూతఅద్దంతో చూచి అందులో వుండే అవయవ విన్యాసాన్ని అంతా తప్పిన్నల్లోనూ, మన స్తత్వశాస్త్రరీత్యానూ పరీక్షించినట్టునూ చిత్రిస్తారు. ఈ తప్పిన్నల్లు నిజమా అని అడిగితే మళ్లీ యేమో అంటారు. ప్రకృత్యంతస్సు వకవిధంగా ఉంటుందా? ఉన్నది మనకు తెలుస్తుందా? అందరికీ వక్క విధంగా వుంటుందా? కాబట్టే వీళ్లందరూ వకర్నివకరు యేమీ అనుకోరు.

మరోవాక్యంచూడండి. " That man alone is an artist who n ad dition to being able to see nature with his own eyes, possesses the ability to reproduce this original vision "

మన మనస్తత్వశాస్త్రవేత్తలు సామాన్యంగా జ్ఞానానికి (మన
స్సుకు) ద్విక్షణావస్థాయిత్వం చెప్పారు. ఇంద్రియార్థసంపర్కం
వల్ల కొన్ని సంస్కారాలు కలుగుతాయనీ, ఆ సంబంధమైన
వస్తువు మళ్ళీ కనపడ్డప్పుడుగాని, భావం వచ్చినప్పుడుగాని, ఆ సంస్కా
రాలు ఉద్బుద్ధాలౌతయ్యనీ చెప్పారు. కాబట్టి ప్రకృతిని చూచినప్పుడు
ఒక భావన కలిగి ఒక విధమైన సంస్కారం కలుగుతుంది. మళ్ళీ అది
ఉద్బుద్ధమైనప్పుడు సరీగా యెట్లా కనపడ్డదో అట్లా మాటల్లో
కూర్చడం వీళ్ళ పననుకుంటారు. ఇది చాలా గొప్ప పనీ, కష్ట
మైన పనీని! * ఇటువంటి పని ఒక కవికుమారుడు చేస్తూవుంటే
యితరులు కాదనటానికి వీల్లేదు! నీకు ప్రకృతి అట్లా కనపడటం
లేదని యెవరు చెప్పగలరు? కాబట్టి యీ అతి నవ్యమార్గంలో
కూడా అర్థం లేకపోలేదు. 18, 19 శతాబ్దాలలో పూర్వం యూరపు
ఖండాని కంతకు విజ్ఞాన చక్షుస్సునూ, విమర్శనా సూత్రాలనూ
యిచ్చింది ఫ్రాన్సు. ఆవిధంగా ఆమార్గం మారుతుండగా యుద్ధం
వచ్చింది. అప్పుడు ఇటలీ మొదలైనదేశాల్లో యీవిధమైన మార్గం
పొటమరించింది. క్రమంగా యీ దృష్టి♦ అనేక మార్గాలు చెంది
"సర్-రియలిజం" కిందికివచ్చింది. ఇది ప్రథమంలో చిత్రకళకోసం

---

* 1. జ్ఞానానికి పరిమితిలేకపోవడం. 2. దాన్ని ఉన్నదున్నట్టు నిర్వచించడం కష్టంకావడం. 3. అందరిలో సమానానుభవం లేకపోవడం. 4. చెప్పేపద్ధతిలో భిన్నత్వం. 5. జ్ఞానం యితర జ్ఞానంతో కలిసి ఉద్బుద్ధం కావడం మొదలయిన కారణాలవల్ల.

♦సర్ రియలిజంగా పరిణమించేలోపల యీకళాదృష్టి అనేకమార్పులు పొందింది. డాడాయిజం యుద్ధమైన వెంటనే వచ్చిన విపరీతమార్పు. సాంప్రదాయంయొక్క విపరీతమైన నిరసనం. అదివరకుండే యథాభావన యథాదర్శన మొదలైన మార్గాల ద్వారా నడిచింది కళాదృష్టి. తుదకు సర్ రియలిజంగా పరిణమించింది. ఇందులో సమస్తమార్గాల కళలూ ఉన్నై! అనహ్యత(Uglyism) భావచిత్రం (Imagism) మనస్తత్వం (Psychology) కళలుకూడా దీనిలో వున్నై!

పుట్టి సాహిత్యానికి అనువృత్తమైంది.♦ కాని కొన్ని సంవత్సరాలనించీ, అదికూడా మారిపోయినట్లు కనపడుతుంది. రాజకీయంలోనూ, సాహిత్యంలోనూ, యింకా కొన్ని యితర విషయాల్లోనూ, మనకు మార్పుచాలా ఆలస్యమవడమే కాకుండా, మనకామార్పు కలిగేటప్పటికి అసలామార్పు పుట్టినచోట నశించడంకూడా కనపడుతుంది.‡ ప్రకృతి కవిత్వంచూడండి. మనకువచ్చిన 1908, 1909 సంవత్సరాలకు యింగ్లాండులో "విక్టోరియనుయుగం" వెళ్ళిపోవచ్చింది. ఆనగా మనం దాదాపు వకశతాబ్దం వెనకపడ్డాము. అట్లాగే యీ "సర్-రియలిజం" విషయంలోకూడా 20 సం॥ వెనకపడ్డట్టు నాకు తోస్తూంది.* మరొకటి వుంది. ప్రతి జాతికీ ప్రత్యేక సాంప్రదాయమూ మొదలైన ప్రత్యేకత లుంటై! మార్పులను వాటికి వ్యతిరేకంగా చెయ్యటం అనుచితమని నా మనవి!† అయినా నాకీ అభినివేశమెందుకు ? కాల పురుషుడు చూడక మానడు. ఆతడు ఫామన్ను తీరుస్తాడు! ఇప్పటికి

♦ వక జర్మన్ కళాభిజ్ఞుడు 1914 సంవత్సరంలో యిట్లా అన్నాడు. (To-day we are breaking up the chaste, ever-desceptive phenomena of nature, and re-assembling them according to our will" (Franz Marc) ఈ అంత ర్దృష్టి, మొదట "యక్సరే" కనిపెట్టడంతో నిశ్చయమై, తర్వాత, "రేడియో, టెలివిజన్" (దూరశ్రవణ, దూరదర్శనయంత్రాలు) వల్ల గట్టిపడింది. కాని అంతస్సింకా సంపూర్ణంగా బుద్ధికి అందనట్టే కనపడుతున్నది. ఒకవేళ యీ యుద్ధంవల్ల సర్వనాశనం అయినతర్వాత అందుతుందేమో తెలియదు!

‡ "*German art is held in contempt and suppressed in the country where it has grown up.*" (*Modern German Art*)

* రషియన్ 'ఫ్యూచూరిజం' అంటే మబ్బులోవుంది. దాని ధోరణి యిప్పుడు చెప్పడానికి వీల్లేనిది. 'ధ్వనులే సంగీతం, మాటలే కవిత్వంరంగులే శిల్పచిత్రాలు' మూడు ముక్కలలో యిది దానితత్వం. యిటువంటి దాన్ని కొందరు "అగ్లియిజమ్ (Uglysim) అన్నారు. డాడాయిజం, యింకా అసహ్యమయింది. (అసహ్యత, పరమాసహ్యత.)

† వెనక యీట్సుకవి అభిప్రాయన్ని అనువదించాను.

మాత్రం యీ పద్ధతి మన సాహిత్యంలోకొచ్చింది. ఇదికూడా సాహిత్యచరిత్రలో పరివర్తనకాలంలో వచ్చే మార్పనీ, కాలక్రమేణా యీ మార్గం మళ్ళీ మరోదానికి దారితీసి సాహిత్య విస్తారానికి సహకారాతుందనీ, మనవి. ఇంగ్లాండులోకూడా యీ పద్ధతి ఉంది. దాన్నిగూర్చి రెండభిప్రాయాలున్నై! వాటిని కొంచెం మనవిచేస్తాను.♦ మన స్తత్వ మార్గాన్ని చూదాం.

"The poet is now seeking to find and establish that central calm, a point from which he may begin to work outward again, and in the process he is bound to be obscure, for he is talking to himself and his friends, to that tiny temporarily isolated unit with which communication is possible, with whom he can take a number of things granted............In modern poets, there is a perpetual interplay of private and public meaning; the inner circle of communication- the poets communication with his own arbitrarily isolated social group is perpetually widening into and become identified with the outer circle of environment" *

(Cecil Day Lewis in "A hope of poetry")

---

♦ ఈమార్గం అనుసరించేపద్ధతులు ఆంగ్లాను కరణాలు. కాబట్టి ఆంగ్లంలో పొడుగాటి అనువాదా లియ్యాలశొచ్చినందులకు చాలా విచారపడుతున్నాను.

* అంతరానుభవం మీదా, మన స్తత్వంమీదా, యీ మార్గం ఆధారపడివుంది. కాబట్టి, యీ అనుభవసంస్కారమై తర్వాత ఉద్బుద్ధమైనప్పుడు యితరానుభవాలతో కలిసివుంటుంది కాబట్టిన్ని, తదనురూపసంస్కారం కలవాళ్ళకే అది తెలుస్తుంది. అందుచేత యీ రకం కవుల రాతలు కవికి చుట్టూ ఉన్న సంకుచిత వాతావరణంలోవున్నవాళ్ళకే ఉద్దేశింపబడ్డాయి! ఒక్క ఉదాహరణం. ఒక స్నేహితుడికి కందిపచ్చడిష్టమనుకోండి! అతనికి స్నేహితులందరూ 'కందిపచ్చడని' పేరు పెట్టారనుకోండి. ఈ స్నేహ బృందంలో లేనివాళ్ళకు కందిపచ్చడంటే ఫలానా స్నేహితుడని తెలియదు. ఇప్పుడు మన శ్రీశ్రీ వగైరాలుపయోగించే కొన్ని 'సంకేతా' లిటువంటివే!

"My aim is to evoke an object in deliberate shadow without even actually mentioning it; this evocotion may be a single word sometimes."

"What matters is the under-meaning which the specially chosen and oddly-assorted words evoke............ This meaning may not appear to be cogent and the thoughts may be confusing and unconnected. But examined, there is a vague connection among them. There is no strict logical censorship in the kingdom of sub-conscious mind. It is called a "wonderland irresponsibility." This expression of the idea may be one sentence, one half sentence, or may be one word. Grammer does not matter-grammer for the conscious, but not to the sub-conscious."*

(Spender)

"In place of logic they have emotional sequence. That is the method of approach". (Martin Gilkes)

* వస్తువులు కలగజేసే సంస్కారాలందరిలోనూ ఒక్కవిధంగా వుండవు. వెనకటికి గుడ్డివాళ్ళు నలుగురికీ యేనుగునుగూర్చి నాల్గురకాల సంస్కారాలు కలిగినట్లు! అన్నీ నిజమే! కాబట్టి యిక్కడకూడా ఒక వస్తుదర్శనంచేతగాని, భావనచేతగాని, భిన్నుల్లో కలిగే సంస్కారాలు భిన్నాలుగా ఉండవచ్చు. ఉంటై. ఒక్కడికే ఒక్క అనుభవాన్నిగూర్చిన సంస్కారాలే భిన్నరూపాలుగా ఉద్బుద్ధాలుకావచ్చు. "సంవత్" యిట్లా అన్నాడు. 'ఒకొక్కప్పుడు హృదయమంతా ప్రబోధమునకు సంస్పందించి పవిత్రావేశంలో సముద్రిక్తమౌతుంది. కాని, బాహ్యహేతువులు తమస్సులై పైకొని ఆయావేళమును క్షణికంగా మార్చివేస్తాయి. ఆ కెరటము దాటిపోయిన తర్వాత మనము నగ్నముగా నిల్చిపోతాము". పోయినట్టు అనుకుంటాముగాని లోపల మనస్సు పనిచెయ్యకుండావుండదు. కాని చేస్తున్నట్టు మనకు తెలియదు. అటువంటి మనోలయం అలవడితే యిక కవిత్వమే చెప్పుము.

• అంటే యిక్కడవుండేపద్ధతి కార్యకారణభావపద్ధతికాదు. ఉద్రేకానుభవ పద్ధతి. కాబట్టి వైవిధ్యము. పైకివచ్చినమాటకే తర్కంగాని సంస్కారాల కాతర్కం వర్తించదు. ఎందుచేత ? అది అంతరానుభవంకాబట్టి.

"Poets juggled with new words and new forms. They tried new rhythms in all kinds of combinations possible and impossible, and sometimes no apparent rhythm at all.... Some abandoned punctuation altogether ; some went so far as to play tricks with the inoffensive print itself"*

ఈ మార్గం యిష్టంలేని కొందరి మాటల ననువదిస్తాను,

"After all there is no necessity that all poetry in order to be good should also be easy, only that there should be found in it, something for you and me and for every-one, not for a special-coterie only. I find it impossible to believe that any poet not entirely crotinous (idiotic) would deliberately choose to limit the audience to which he wishes to appeal. Art in this respect is an exhibition—mania, as you soon find out if you talk to any of our modern poets even the most eclectic of them.....................
When only the poet himself or a narrow circle of intimate friends, and perhaps a few others with peculiarly agile brains are able to understand what he is trying to say, then he becomes 'obscure'; then the poem exits and can exist only for an extremely limited public with special knowledge. But 'wherein dear Brutus' lies the fault ? Surely not in 'force of circumstances' or any 'state of culture' which necessitates the poet's withdrawl into his own private cloud, but in the poet himself. He has bungled 'the new technique' and made a smudge instead of an intelligent mark."†

(Gilkes)

* వీటికి వెనక ఉదాహరణాలక్కడక్కడా చూపిస్తూనే వచ్చాను.

† కవిత్వానికి సార్వజనీనత లేక పోవడం, చుట్టువున్న యేకొద్దిమందికో తెలియడం, పొందలైన వాటిచేత కవికే తాను చెప్పదలచుకున్న పద్ధతి అస్పష్టంగా వున్నదనీ, భావసాంకర్యం పరిణామంగావున్నదనీ, పొగలాగ ఆవరించిందనీ చెప్పుతున్నాడు.

ఈ నూతన పద్ధతిలో భిన్నభావాల సమ్మేళనాన్ని గూర్చి, శబ్దార్థసంబంధం లేకపోవడాన్ని గూర్చి, ఇట్లా అన్నాడు వక విమర్శకుడు.

"Suggestion (ధ్వని) is a recognised method by which poetry obtains its effects. This free association of ideas is said to be an extention of suggestion...............In symbolism this suggestion is left to the *word* or *thought*. But here the free association is rationalised by psychology. Therefore the method of evocation becomes sometimes outrageous, or strained or, extravagent." *

సాహిత్యానికి సార్వజనీనత అవసర మని చెబుతూ యీ మార్గంలో దానికి అటువంటిది లేకపోవడాన్నిగూర్చి ఇట్లా చెబుతున్నాడొక విమర్శకుడు.

"Have they the general character in the mind of every reader who responds to the evocation. If they have, the reader will not feel as if he were listening to some one talking in his sleep. If he does feel that, then the poet has made one of the two mistakes and possibly both. Either he is trying to suggest a range of associated ideas which is petty, small and peculiar to himself (or his own little world), or he has bungled the key to the evocation, making it a symbol which has significance only for himself or a reference in some language with which the reader happens not to be acquainted, or it may be a reference in

* ఇక్కడ బయటికివచ్చే అనిర్దిష్టభావపరంపర విషయంలో "సంకేత మే" కాని "ధ్వని" లేదు. ధ్వనికి అర్థానువృత్తి వుంటుంది; అంగాంగిభావముంటుంది. ఇక్కడ దేసంకేతానికది స్వతంత్రం. కాబట్టే చదివేటప్పుడు "ఉద్బోధన" అయ్యే భావాలకు పరస్పర సంబంధం ఉండడం కష్టం. సంబంధకల్పనం బాధాకరం కూడాను.

our language so recondite that no ordinary reader could be expected to come across it."*

వీళ్ళ పదప్రయోగపద్ధతి సూత్రపద్ధతి వంటిది. అంటే పదాల ఉపయోగం కొద్ది, వాటిలో ఉండే అర్థం అంతులేకుండా వుండడం♦ దీన్నిగూర్చి వక విమర్శకు డన్నాడు.

"...........the motto is 'minimum of means to produce maximum of effect' Logically therefore the ideal poem should consist of a series of isolated ejaculations, preferably highly evocative single words." ‡

దీనికి మన సహజసంభాషణాన్ని ఉదాహరణంగా తీసుకుంటున్నాడు.

"We talk no longer in graceful periods, but in ellipse, a kind of clipped speech, and a great many of its abruptnesses are highly evocative, just as in the new poetry." §

మన కొందరు నవ్యుల సంభాషణ సరిగా యిట్లాగే వుంటుంది. ఈ కవిత్వంలో వుండే అవ్యక్తమైన ఊపు, అనిర్దిష్టతా మొదలైన వాటినిగూర్చి యీ కింది వాక్యాలు చూడండి.

---

* అప్రయుక్తం, నేయార్థం, మొదలైన కావ్యదోషాలవంటివే యిందులో చెప్పినవి.

♦ దీన్ని "ఉద్బోధనపద్ధతి" అందాం! (Method of evocation) అనగా ఆపదం అనేటప్పటికి తెలిసినవాళ్ళకు దాని చుట్టూ ఉన్న వాతావరణమంతా వెనకటి సంస్కారానికి సంబంధించి ఉద్బుద్ధమౌతుంది. దీన్ని సంకేతమనికూడా అనవచ్చు.

‡ స్వతంత్రాలైన పదాల ఉచ్చారణమే ఉత్తమ కావ్యమట! వాటిలో చుట్టు భావపరంపరకలిగి దాన్ని ఉద్బోధనచేయగల ప్రత్యేక పదాలే ఉత్తమకావ్యమట!

§ సామాన్య సంభాషణలో, గ్రంథస్థభాషవలె మనం పదమైత్రికీ, అర్థసంపదకూ మొదలైనవాటికి ప్రయత్నించకపోవడం సామ్యంగా గ్రహిస్తున్నాడు.

"Human nature before actually acting wavers, 'this way and that', but old writers only chronicled the acting. But the present ones depict those waverings also, 'cloud of contradictions that hover in the back-ground, and the continuous presence of unconscious forces in him.*

తుదకయ్యేదేమిటంటే ఉపయోగించే మాటలకర్థమే లేకపోవచ్చు, లేదా అనేకర్థాలుండవచ్చు.♦

"Taken literally the words have little or no meaning (or they have too many possible meanings), and they have no obvious connection with one another, or with what has gone before, or what follows after."

ఈ భాషా భావాల అల్లరినిగూర్చి వక విమర్శకుడు యీ కింది విధంగా అన్నాడు.

"Viewed in retrospect it reminds one of those regrettable incidents which do occur at times even in best regulected prisons. A group of mutineers established on the roof gleefully hurling slates at law and order down below, and very well aware that every gesture is in full view of a scandalised world outside the walls. The poets were out of hand, "O! Dear! O! Dear!" the outside world exclaimed, "How crude! How un-

---

* *Sur-realism has led us into the realms of magic, into the borderlands of sub-conscious, between madness, mental twilight and the dream, its goal being to achieve the realisation of achieving something new.*

*(Modern German Art.)*

♦ ఈ పద్ధతియొక్క ఉద్దేశం తిరుగుబాటేగాని, ఆ చెప్పింది నిజమా, అబద్ధమా, పిచ్చా, ఊహా, కలా అనే సంగతి అనవసరం. చూస్తే గారడీవాడి పనివలె వుంటుంది. అంటే దానివల్ల కలిగే చిత్తవికారం చాలా కిందిదనీ స్పష్టమౌతున్నది.

disciplined! How positively wanton! New movements never used to be so violent, so completely law-less............†

కావ్యం సహృదయుల కందరికోసం గాక కొందరికొరకు మాత్రమే కాకూడదంటూ యిట్లా అన్నాడు విమర్శకుడు.

" It may be a world of great beauty, of infinite subtlety and almost irresistable charm. Nevertheless it has no real spaciousness. It is as much as a 'Hortus inclusus' as the little world inside a monestery wall, which is by no means coincident with the larger world outside."

ఇట్టి ప్రతికవియొక్క ప్రపంచమే వేరు. అతని భాషే వేరు. అతని కవిసమయాలే వేరు. అతని సామగ్రే వేరు.

" Every modern poet has a world of his own, which he depicts to a world around him, a limited circle. Each has a jargon, his own allegories, his own metophors and his own technique of expression. One does not depend upon another. Each is an enigma. Un-understandability by the common reader is the common feature. Beyond this there is no similarity. Each has his or her peculiar circle to whom he or she is writing........"

తుదకు వీళ్ళకు కళయొక్క పరమావధి యేమిటంటే !

" Art for modern is communication of truth, not only factual truth but that further truth which vision only can discern."*

(New signatures)

---

† డాడాయిజం (Dadaism) యొక్క కళల్లో యిదివకటి. ఇదికూడా మన నరికొత్తపోకడల్లో కనపడుతున్నది. అల్లరి బుద్ధిపూర్వకంగానే చెయ్యడం! ఈ అల్లరి అందరుచూస్తూ చేస్తూంటే ఆనందం! మేమే చేస్తున్నాము కదా అని గర్వమూ అహంభావమూ కూడాను!

* " The art to come will be the concretion in form of a scientifi conviction.

**(Franz Marc)**

వీళ్ళ ఉద్దేశ్యంలో కావ్యపరిమితి చూడండి !

" A poem is an image or a succession of images, and an image is that which presents an intellectual or emotional complex in an instant of time..........The simplest (poem) should be one syllable."

చాలా విశిగించాను. క్షమించాలె ! ఇప్పటికి యీ అతినవ్య మార్గంయొక్క సంగతి సందర్భాలన్నీ సవిమర్శంగా తెలిసివుంటాయి అని నానమ్మకం. మొదట్లో నేనుల్లేఖించిన కొన్ని గుణాలు వెనకటి సామాన్య నవ్యమార్గంలోకూడా వున్నై ! కాని అసలు కావ్యలక్షణాల్లో వాళ్లు పూర్వసాంప్రదాయాలను బొత్తిగా నిరసించలేదు. వాళ్లకు శబ్దం, దానికి శ్రవణసుఖం వుండడం, శబ్దార్థసంబంధంవుండడం, ఆ అర్థానికి రమణీయతా, హ్లాదరామణీయకాలుగా, రసమూ, ఉపాదేయాలుగానే కనపడ్డై! భాషనుగూర్చి కొందరికి వ్యావహారికం ఇష్టమైంది. ఛందస్సు, శబ్దసమ్మేళనం, స్వేచ్ఛ, వాచ్యవ్యంగ్యాలు, గూఢత, నేయార్థం, మొదలైనవాట్లో వాళ్లకు అభిప్రాయభేదాలున్నా, మొత్తంమీద సంప్రదాయంలో మార్పుకోరేవాళ్లేగాని పూర్తి సంప్రదాయ మూలచ్ఛేదం చెయ్యటానికి తలపెట్టలేదు. కాని యీ అతినవ్య మార్గందగ్గర కొచ్చేటప్పటికి సహృదయులంతా నిర్విణ్ణులౌతున్నారు. సంప్రదాయ లాక్షణికసూత్రాలూ, యీ అతినవ్యులనుసరించే సూత్రాలూ, పూర్తిగా తల్లకిందులుగావున్నై ! వెనక ఆంగ్లానువాదాలవల్ల యీ మార్గానుయాయులకు కవితా సౌందర్యమక్కర్లేదనీ, యెక్కడైనావస్తే దాన్ని బుద్ధిపూర్వకంగా చెడగొడతారనీ, తెలుసు

కళ అంటే శాస్త్రతత్వనిర్వచన మన్నమాట !

" In the course of search for inner core, for the unexplainable original foundation of things, the mind easily becomes entangled in the contradictions of transcendentalism."

ప్రకృతి అంతస్సును పరీక్షించడంలోనూ, దాని అంతర్భావాలను నిర్వచించటంలోనూ, అతీంద్రియవిషయాల్లోనూ, మనస్సు చిక్కుపడటం సహజమే.

మన్నాం. శబ్దం అర్థావబోధ చెయ్యనక్కర్లేదు. కావ్యానికి అర్థముండనక్కరలేదు. అసలు కళ సత్యకథనమే కాని యెంతమాత్రము అనుకరణం కాదు* భావవైరుధ్యం అవశ్యంగా వుండదగింది. ఛందస్సక్కరలేదు. తుదకు భావాలయొక్క వాక్యాలయొక్క పరిసమాప్తికూడా అక్కరలేదు. భావప్రకటనం మన స్తత్వశాస్త్ర ప్రకారం. కాబట్టి "రమణీయార్థ ప్రతిపాదకశబ్దః కావ్యం" అనే మన నిర్వచనంలో వున్న అంశాలేమీ అవసరంలేదు. శబ్దానికి అర్థం ఉండక్కరలేదు. రమణీయతా అక్కరలేదు. అంటే రసంతో ప్రసక్తి యేమీలేదు. ఇక సహృదయుడైన విమర్శకుడికి గతేమిటి! కాబట్టి యీ కవిత్వమూ, తత్పద్ధతి మన విమర్శనానికి విషయం కాదు. నేను చెప్పిన విషయాలను వీరి గీతాలనించి వ్యక్తంచేస్తాను: ఈ కిందివి మూలసూత్రాలు.♦

---

*"మనోహరత్వమనునది లలితకళల (వాస్తుశాస్త్రము, చిత్రలేఖనం, సంగీతం కవిత్వం త. శి. శా) యొక్క ముఖ్యధర్మము......... లలితకళలనుకరణములుగా నుండునేగాని మూలములుగ నుండవు. యుద్ధముయొక్క రసవంతమైన వర్ణనము కావ్యమగునేగాని ఆయుద్ధము కావ్యముకాజాలదు.........కళ కళగ ననుభవించుటకు, నయ్యది యనుకరణమన్న జ్ఞానము చూచువారికిగాని వినువారికిగాని యత్యంతావశ్యకమనినమాట మరచిపోగూడదు.........కళలకు కళాత్వము లోపించునంత తన్మయత్వము జెందినయెడల నొక్కొక్కప్పుడా భాసమునకు కారణమగునని మాత్రము మరవరాదు.........ఈ అనుకరణము చిత్రలేఖనమందును కవిత్వమునందును చాలా అవసరము, సంగీతమున అప్రధానము" (లక్ష్మణరాయ వ్యాసావళి. లలితకళలు.)

♦ ఈ పద్ధతికి కవికొండలవారూ, వినాయకపండితుడూ దారితీస్తున్నట్టు "నవమిచిలుక"కు విమర్శరాసిన గోపీచంద్, బి. యే., బి. యల్. గారన్నారు. ఈ సంగతి చెబుతూ "యీ సంగతి కవికొండలవారికే తెలియకపోవచ్చున"న్నారు నరిసింహశాస్త్రిగారు. పూర్తిగా కాకపోయినా అప్పుడప్పుడూ యిటువంటి నిరర్థక గీతాలను రాసినట్టే కనిపిస్తారు కవికొండల.

I. సూత్రం-

"ఛందో బందోబస్తులన్నీ
ఛట్ ! ఫట్ ఫట్ మని త్రెంచి
Damnit! ఏమిట్రా ఇ? దంటే
Pray! It's poetry అందాం."

ఇందులో ఛందస్సక్కర లేదనీ, అయినా పొయిట్రీ ఔదేననీ మొదటిసూత్రం.

II, III. సూత్రాలు-

"అర్థాన్ని అధ్వాన్నపు అడవిలోవదలి
గద్యాన్ని పద్యానికి పెళ్ళిచేదాం,
కాదన్న మాదన్న♦ యెవడన్నా వుంటే
వేమన్న యేమన్నాడో చూడమందాం."

అర్థం అక్కరలేదు. శబ్దం అర్థంతో సంబంధించి వుండను. అది స్వతంత్రం. శబ్దసామ్యమూ తదలంకారం మాత్రం గ్రాహ్యం.* ఇది రెండో సూత్రం. గద్య పద్యభేదం లేను. గణఛందస్సు లేక పోయినా, మాత్రాఛందస్సైనా ఉందా అంటే అదీ లేదన్నారు వెనక. ఇప్పుడు గద్య పద్యభేదమే లేదన్నారు. వకే కావ్యంలో గద్య పద్యాలు రెండు రకాలూ కలిసివుండవచ్చు! ఇది మూడో సూత్రం. ఉదాహరణం "వేమన్న". వేమన్న అర్థం అక్కర్లేదనీ,

♦ (పొగరు) "......పాతకాలపు వ్యక్తి యిదంతా తన కర్థం కాదంటాడు. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు. ఆధునిక కవిత్వం అర్థం కాలేదంటే ఇతనికి ఆధునిక జీవితమే అర్థం కాలేదన్నమాట. ఇతడు కళ్ళుమూసుకున్నాడు. వెనుకపడిపోయాడు."

(భారతి 1989 ఫిబ్రవరి)

* ఈ అతినవ్యమార్గాన్ని భామహుడి అలంకారమార్గంలో చేరుద్దామంటే శబ్దాలంకారాలవరకు బాగానేఉంది గాని అర్థాలంకారాల దగ్గర మళ్ళీ అభావమే! "అర్థాన్ని అడివిలోనేగా వదలడం!"

గద్య పద్యభేదం అక్కరలేదనీ, యెక్కడైనా అన్నాడేమో నే నెరగను.

IV. సూత్రం :

"హూమ్! హుూమ్! హుూమ్! హూమ్! అని కేకలువేసి కావ్ కావ్! మ్యావ్ మ్యావ్! అందాం గమ్మత్తుగా."

సౌందర్య మక్కర్లేదు. సౌందర్యరహితాలైన శబ్దాలుకూడా కావ్యం కావచ్చు. అంతేకాకుండా బుద్ధిపూర్వకంగా, సౌందర్యరహితాలైనా, అల్లరిచిల్లరగా వుండేవీ, నిరర్థకాలైనా, శబ్దాల నుపయోగించ వచ్చు.

"న ... న ... న ... న ... న త్తిమాటలుకూడా
మ ... మ ... మ ... మ ... మన వ్రాతల్లో వుండచ్చు!"

పై నాలుగుపాదాలు కలిసి నాల్గో సూత్రం.*

---

* ప్రతిభ సంపుటం 5, సంచిక 1 లోకూడా "కనుమలోనిది—కొ-కొ-కొలిమి etc.
(శ్రీ శ్రీ)

"నీసాల్వర్సాణ్" కంటె "నిరయోసాల్వర్సా" నని స్పష్టంగా అంటే యింకా బాగుండేదేమో నన్నాడు వక డాక్టరు సోదరుడు. అశ్లీలస్ఫురణం జుగుప్సాకరంగావుంది. స్వీయచరిత్ర చెప్పుతున్నాడేమో తెలియదు. కాని వక అనన్యూతమైన అర్థ ముంది, భీభత్స మున్నా! ఇదో విశేషం. కవిగతి సాల్వర్సాన్ యింజక్షణ్ కిందికి దిగింది! అది మళ్ళీ కవిముఖాన వినడం! ఇందులో డాడాయిజంయొక్క ఛాయ ఉంది! ఈ కిందిది యింగ్లీషు డాడాయిజం కవిత్వం!

"*in your inside there are smoking lamps the swamp of blue honey*
*cat crouched in the gold of a flemish inn, boom, boom,*
*lots of sand-yellow bisyclist chateauneuf des pepes*
*man hatten there are tubs of excrement before you*
*mbaze, mbaze, baze—baze, mleganga, garoo.*
.........................."

నిరర్థకపు "హుమ్హుమ్" లాంటి కేకలు, అశుద్ధపుబొక్కానలు, మొదలైనవీ; పద్యపాదాలు పెద్దక్షరాలతో మొద లెట్టాలనే నియమాలు మొదలైనవి లేకపోవడమూ;

ఈ నాల్గుసూత్రాలలో "రమణీయత" "అర్థం" "శబ్దం" ఈ మూటిసమ్మేళనం "కావ్యం" అనే సిద్ధాంతం పూర్వపక్షమైపోయింది! ఇక మనకేముంది వాదసామ్యం వీళ్ళతో? కాబట్టి వీళ్ళకు నమస్కరించి మనదోవన మనం వెళ్ళటమే కర్తవ్యం! ఇక "కవితాసనాతనాధునాతనుల వాదనిర్వచనం" వినండి!

---

వగైరాలన్నీ కనిపిస్తున్నై! ఒక గొప్ప డాడాయిస్టు యీ క్రిందిప్రశ్నల్లో తన అభిప్రాయాన్ని చెప్పాడు.

"*What is beautiful? What is ugly? What is great, strong, weak? What am I? Don't know! Don't know! Don't know!*"

"*Dada was a violent protest against art, literature, morals, and society.*"

"*In Dada and sur-realism magazines the subject of suicide evoked keen interest.*

"*To Dada the past was dead and the future was powerless to be born.*"

ఒకమారొక డాడాప్రదర్శనం జరిగిందట. అక్కడ జరిగిన విషయాల్లో యీ క్రిందివి కొన్ని:—

(1) డాడాసిద్ధాంతం స్త్రీ పురుషభేదం లేదని

(2) బాక్సింగు (ముష్టియుద్ధం)లో నెత్తురు కారుతూంటే అయ్యో అనకుండా చూడటం

(3) చివరకు మాంసపుముద్దలూ టొమాటోలు పెట్టి ప్రేక్షకులూ ప్రదర్శకులూ కొట్టుకోటం (వాళ్ళు తమ వెంట్రుకలు పీక్కుంటామని ప్రచురించారటగాని చూపలేదట!) ఒక ప్రదర్శనాన్నిగూర్చి యిట్లా వున్నది.

"*One of them (exhibits) was the printed reproduction of Mona Lisa with a pair of moustaches painted on her face and leaving an inscription underneath 'Lhooq' (look)*"

మరి ఒక ప్రదర్శనం:—

"*The visitors had to pass through a public lavatory in order to enter the gallery. Inside, the spectators were provided with hatchets with which they could attack the exhibits. At the end of the gallery, a young girl stood reciting obscene poems————and the exhibition had to be closed down by the police.*"

"అచ్ఛా ! స్వేచ్ఛాజీవీ !
ఐతే, కైతే, నీ వ్రాతని
Argument కోసం ఒప్పుకున్నా,
పానుగంటివారు ఒప్పుకోరు."

గ్రాంథికవాదైన పానుగంటివారిమీద దెబ్బ యిది !

"పానుగంటివారు ఒప్పుకోకపోతే
పాముపంటిదానికి విరుగు డుంది.
ఇంద్రగంటివారి నడిగితే,
ఏమిటంటారో తెలుసునా ?"

ఇంద్రగంటివారీ మార్గానికి లక్షణకర్తలు కాబోలు !*

"పులికి పిలక లేదనడం
చలికి తెలుగు రాదనడం !
శ్రీనివాసరావు వ్రాస్తున్నది
"మానిషాదగీతం"లో వున్నది !"

ఇక్కడ కవి హృదయ ప్రవేశం చెయ్యలేకుండా వున్నాను. "పులికి పిలక లేదనడం", "చలికి తెలుగు రాదనడం", వంటిదట !" "శ్రీనివాసరావుగా రీరకం కవిత్వానికి వాల్మీకివలె ఆదికవి" అని చివర రెండు పాదాలకూ అర్థమనుకుంటాను ! ఈ పైన చెప్పిన పద్ధతి "సర్ రియలిజ" మని యీ కింది తుది చరణంతో తెలుస్తున్నది.

"జీబ్రాకి, Algebra చిహ్నాల
లాంకోటూ, పాంకోళ్లూ తొడిగి

---

* 1989 సంవత్సరం మార్చి భారతిలో "పాతసీసాలలో కొత్తపానీయము" అనే శీర్షికగల వ్యాసంలో ఆయన అభిప్రాయాలను చూస్తే ఆయన యీ "రసం" తో పనిలేని కవిత్వానికీ, "శబ్దానికీ అర్థానికీ సంబంధం లేద" నే వాదానికీ ప్రవక్తని నమ్మటానికి వీల్లేదు.

సాహిత్య పౌరోహిత్యం యిస్తే
వెఱ్ఱికాదు, sur-realism రా సోదరా !*

ఇది వీరిమార్గం. ఈ మార్గానికి వీరికి ప్రేరణయిచ్చిన విషయాలతో వకగీతం రాశారు.

"Charlie Chaplain,[1] Joseph Stalin[2]
Walt Disney,[3] George Hugnet[4]
Greta Garbo,[5] Pirandello[6]
ఇటీవల మా Inspiration.
Sigmund Freud,[7] Harold Lloyd[8]
Albert Einstein,[9] Jacob Epstein[10]
హారీన్ చట్టో,[11] గి. రాం. మూర్తి[12]
ఇటీవల మా Inspiration." ♦

పైదానివల్ల, మా పద్యాల్లో హాస్యమూ, యితరులను వెక్కిరించడమూ, పియానో వాయింపువంటి నడకా, మనస్తత్వ శాస్త్ర రహస్యాలూ, భౌతికశాస్త్ర విషయాలూ, చిత్తంవచ్చినట్టు భాష నుపయోగించడం, పూచీలేకుండా వుండటం, మొదలైన విషయాలన్నీ కలిసి ఉంటయ్యాని చెప్పినట్టు నాకర్థమౌతున్నది. వీరికి యిష్టమైన విషయాల నీ కింద రెండుపద్యాలలో యిచ్చాడు;

---

* "కొంటె కోణాలు" ప్రతిభ IV 170.

♦ 1. హాస్య సినిమా నటుడు 2. రష్యా నియంత 3. హాస్య చిత్రకారుడు (micky-mouse గాడు) 4. నవీనమార్గకవి, చిత్రకారుడు. 5. సినిమా నటి 6. గొప్ప యిటాలియన్ కథకుడు. నోబిల్ బహుమాన ప్రతిగ్రహీత. కొన్ని యీన కథలు "Better think twice about it" అనే పేరుతో ప్రచురించబడ్డై! 7. మనస్తత్వ శాస్త్రవేత్త. 8. ఈన కూడ హాస్య సినిమా నటుడు. 9. గొప్ప భౌతిక శాస్త్రవేత్త 10. గొప్ప సర్ రియలిస్టు 11. హారీంద్రనాథ్ ఛట్టోపాధ్యాయ్, కమలాదేవి భర్త. సరోజినీ దేవిగారి తమ్ముడు. 12. వాగనుశాసన గిడుగు రామమూర్తిపంతులుగారు.

"కథాకాలీ,[1] కూచిపూడీ[2]
జావానాట్యం, Russian Ballot,[3]
Jazz, Rumba, Carioca,[4]
హుషారిస్తాయ్, నిషాచేస్తాయ్.
Don Bradman,[5] Mohan Bagan,[6]
Walter Lindrum,[7] Vines,[8] Cochet[9]
కొంచెం Carroms, కాస్త Ping-pong
ఒక కప్ కాఫీ, ఒక పఫ్ Cigarette."*

నాట్యమంటే, ఆటలంటే వీరికి చాలా యిష్టమన్నమాట! అవి ఆడుతూంటే కాఫీ తాగుతూ సిగరెట్ పీలుస్తూ వుంటారన్నమాట వీళ్లు! ♦

వీరికి సంకేతాలు చాలా యిష్టం.
"ఆటవెలది ద్విపద కర్తగారు.
5; 3; 2; ఆముక్తమాల్యద!"

వీళ్లు శబ్దప్రధానవాదులు. అలంకార ప్రియులు;

"తురాయికంటె! ఆ
కురాయికంటె కీ
చురాయికంటె, హిమాం
శురాయి గొప్పవాడు."

---

*(1) మళయాళనాట్యం (2) కూచిపూడివారినాట్యం (3, 4) రకరకాల సంగీతసహిత నాట్యం (5, 8) క్రికెట్టు ఆటగాళ్లు (6) ఫుట్‌బాల్ ఆడటంలో పేరుపొందినజట్టు (7) గొప్ప బిలియర్డ్సుఆటగాడు (9) టెన్నిసుఆటకాడు.

♦ ఒక ఖండకావ్యంలో యెవరేమన్నా తాను
"గానం, ధ్యానం, పానం, లాసం"
కానిస్తానన్నాడు. (కళారవి)

"............
హాంగ్‌కాంగులో
కింగ్‌కాంగుతో, ఒ
రాంగుటాంగ్ ఆడిన
పింగుపాంగ్ లాగు !!!"*

ఇందులో ఉపయోగించిన శబ్దాలనే మనం తీసుకుని వాటి పునరాగమనంచేత శ్రోత్రేంద్రియానికి కలిగే ఆనందంతో తృప్తిపొంది వీలైతే రసమనుభవించాలె! తప్పక రసానుభవం వస్తే అనుభవిస్తాం!♦ అనేక భావసమ్మేళనానికి వేరే యెక్కడికి పోనక్కర్లేదు. ప్రతి శబ్దంలోనూ ప్రతిబింబించే వుంది! ఈన సహాధ్యాయుల్లో వకాయన యీన్ను మించాడు కొన్ని విషయాల్లో! ఈన గద్యానికీ పద్యానికీ పెళ్ళిచేస్తే ఆయన చూశారా యేంచేస్తాడో!

* ఒక ఆధునిక కవికుమారు డీవిధంగా రాశాడు.

"రాతల్ చాతల్ కాక
పప్పుల్ గొప్పుల మనుకొని
పండ్లను, ఫట్, ఫట్ కొరికితె
కవిత్వమానా!
పిచ్చి రాతలతో
ఇచ్చి వదుల్చుకుంటే—
చచ్చిచావని శవమల్లే
అనహ్యమేస్తుంది!
పెడర్థమే అర్థమైతే
అభాసే భావమైతే
నీరసమే రసమైతే
పొయిట్రీ కాదది
తొయిట్రీ."

♦ వేదంవలె వీరి గీతాలు శబ్దప్రధానాలు. కాని ప్రభు సమ్మితాలని భ్రమ పడద్దు! ధర్మప్రబోధకాలు కాకపోవటంచేత! వీళ్లకు తమదితప్ప మిగిలినదంతా బూర్జువా కవిత్వం!

"నా యీవచన పద్యాలనే దుద్దుకర్రల్తో
పద్యాల నడుముల్ విరుగదంతాను!"

వ్యాకరణాన్నేం చేస్తాడో వినండి;

"చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని చాల దండిస్తాను."

ఇంకా కింద చూడండి;

"ఇంగ్లీషు భాషాభాండారంలోనుంచి
బందిపోటుంజేసి కావల్సిన
మాటల్ను దోస్తాను,
నాయిష్టం వచ్చినట్టు చేస్తాను,
అనుసరిస్తాను నవీనపంథా, కాని
భావకవిన్మాత్రం కాన్నే
నహంభావకవిని"

ఈమార్గం భావ కవిత్వం కాదని యీన కంఠోక్తిగా చెప్పాడు. వందనాలు! ఈన కొన్ని కొత్త "ఫామన్లను" తెచ్చిపెట్టాడు చూశారా?

"క్రొన్వడ్డ పజిల్సులాగున్న
నీకన్నులను సాల్వుచేసే మహాభాగ్యం
ఏమానవునిదో కదా!"

ఇది "నజానేభోక్తారం కమిహాసముపస్థాస్యతివిధిః†" అనే కాళిదాస వాక్యాని కనువాదం! ఈన చేసిన పనిలో వక భేదముంది. ఇంగ్లీషు పదాలను తెనుగు లిపిలోనే రాశాడు. ఈన ఎట్లా రాశినా అడగడానికి వీల్లేదు! ఈ కిందిది అచ్చుపద్ధతి!*

† ఇలాగే కొత్త కమిసమయాలు కల్పనలు!
"ఓ భోగించాజా! నీవు
సంఘానికి శెక్సుపేవరు బాస్కెట్టువా!"

* "*Tricks with in-offensive print*"

"అన్యోన్యమగు దమ్పతులుకూడ"

... ... ... ... ...

"మ్యియారేజ్జేసుకొ౯నావుగదా ! స్వీట్ హార్ట్"

అచ్చుకూడా మామూలు పనికిరాదన్నమాట కొందరికి! ఈ గ్రంథకర్తగారు మొదట మొదట మృణాళిని రాసినప్పటి "పట్టాభి"గా వుండి నవ్యుల్లో నవ్యుడై "పఠాభి" అయినాడు. పై గీతా లున్న గ్రంథం పేరు "ఫిడేలు రాగాల డజన్". వెల "డజన్ అర్ధణాలు". అంకితం "మృణాళినికి, కాదు కల్యాణికి, కాదు యిరువురికి." ఇది వక "వచనపద్యాల సంపుటి". "ప్రతిభ" పత్రికవారే దీన్ని చూచి దిగ్భ్రమచెందారు ! ఇటువంటివే "ఉమామహేశు కావ్యా"లునై౩! "నవ్యత్వానికి దీన్ని మించగల కావ్యము ఇప్పటికి తెలుగులో పుట్ట లేదు" అన్నాడు నరసింహశాస్త్రిగారు సమీక్షిస్తూ! ♦

♦ ఈన సహాధ్యాయులు ఉమామహేశ్ సోరీసుగాళ్లకు యీమార్గం అవగాహనం కాలేదు. ఎందుకంటే వాళ్లరాతల్లో అనువృత్తంగా వస్తున్న అర్థముంది. అనేకార్థసాంకర్యమూ అనిర్దిష్టతా లేదు! భావసాంకర్యమూ, అనిర్దిష్టతా, మనస్తత్వమూ, నేయార్థమూ మొదలైనవి యింతకుపూర్వం స్పృశించిన నవ్యకవిత్వంలోకూడా వున్నై! కాని అర్థం వుంది దానిలో! అదీ భేదం. ఈ అతినవ్యమార్గంలో సిద్ధిపొందడం చాలాకష్టం. కాబట్టి యెక్కువమంది యింకా రచనలు సాగించలేదు. శ్రీశ్రీగారుకూడా ఉద్బోధనప్రకారం (*evocation*) లో సంపూర్ణశక్తి సంపాదించలేదు. ఈన తన కవిత్వంలో మనస్తత్వ మణిప్రవాళభీభత్సాలూ, యింకా యథాదర్శన యథాభావనమార్గాలూ, అన్నీ కలిపి కలగాపులగం చేశాడు. దానికి కారణం తాను అనుసరించబోయ్యే మార్గమింకా యీనకు ఉపస్థితికిరాలేదు. ఆంగ్లంలో భాష భిన్నం కాదు కాబట్టి అక్కడ వక సౌకర్యముంది. ఈన భాషాసాంకర్యంకూడా తెచ్చిపెట్టాడు. అందుచేత యీ యిబ్బంది కలిగింది. ఉమామహేశు 'విష్ణుధనువు'కు 1988 సంవత్సరంలో సభాపతి విశ్వనాథ మొదలైనవాళ్ళ మెప్పుకూడా పొందాడు. అప్పటికింకా సరిగా మార్గం తెలియకపోవటంవల్ల వాళ్ళట్లా చేశా రనుకుంటాను. ఉమామహేశుగారికి నరసింహశాస్త్రిగారు చాలా గౌరవ మిచ్చాడు. తుదకు 1938 కి పూర్వమే యీన యిటువంటి కావ్యాలు రచిస్తే సభాపతిగారు చూశారు కాబట్టి "తెనుగులో ఈ రకం కవిత్వం చెప్పినవారిలోకూడా

మణిప్రవాళపద్ధతి యిదివరలో మనలో హాస్యంగా కొంత ప్రచారంలోవుంది. రెండుభాషలు కలిపిరాయడం.*

---

ప్రథముడని ఊహించడానికి కవకాశమున్నది'' న్నాడు. ఈనలోనించీ ఆయన అనువదించిన వక్క గీతం కింద యిస్తున్నాను.

" ఇటు వెన్నెల, అటు వెన్నెల
నడి శిరసుకు శ్రీవెన్నెల
ఇటువెన్నెల అటు వెన్నెల
చిరునవ్వుల కల వెన్నెల"

ఇట్లా ప్రారంభించి 16 పాదాలయ్యేటప్పటికి

"ఇటువెన్నెల అటు వెన్నెల
పిచ్చెత్తే వళ్ళంతా, వెర్రెత్తే, దిక్కులకై
పరుగెత్తే నామనసున
వెన్నెట్లో ప్రేయసిలేక
అమావాస్య! అమావాస్య! అమావాస్య!
మహాలయ అమావాస్య! "

అయిపోయింది. దీన్ని నోరి చాలా మెచ్చుకున్నాడు. మిగిలిన సంగతులెట్లా వున్నా యిందులో సంపూర్ణపరిణామం, అనునయ్యాత్మకమూ ఉంది. కాని యింత తొందరలో ఆశంతా నిరాశ కావటానికి తగిన కారణం మాత్రం కనపడటంలేదు. "ఆ జాబిల్లివెలుంగు వెల్లువల" అనే పద్యంలో యేమువల్లే అకారణమైన 'అమావాస్య' మాత్రం నాకు తోస్తున్నది. ఈన అనేక వేష్లు ధరించి రాశాడు. ఈ మార్గాను యాయుల్లో యేకమార్గానుయాయిత్వం కనపడటంలేదు. కాని అన్నీ యీ అతినవ్య కవితలో అంతర్భూతాలే! భావచిత్ర, యథాదర్శన, సాంకేతిక, భావిభావన, నగ్న, మొదలైన అన్నిమార్గాల చిహ్నాలూ కనపడుతూ వుంటై!

* అరవంలో కొందరు కవులు యీ పద్ధతి ననుసరిస్తూవున్నారు. మళయాళంలోకూడా "తుళ్లాల"నే నాట్యం చేసేటప్పుడు పాడటానికని కుంజన్ నంబియార మణిప్రవాళమార్గంలో పాటలను రచించాడు.

"తండులాలు గృహమందు నసంతి
తిండికై తె బహుమంది వసంతి."*

ఇది రథోద్ధతావృత్తంలో వుంది. శ్రీశ్రీగారి భుజంగప్రయతాన్ని చూడండి

"భుజంగప్రయాతం, బభుక్షాభిఘాతం,
చలంగారిపాపం, ప్రజామిత్రకోపం,
జరుక్‌నాథ Zam-buk, మిణీశాస్త్రి Humbu(k)
లతాంతార్ద్రిరాగంబు లంబాడిలంగా......"

భుజంగప్రియతాన్ని తీసుకోడం అబ్బూరు అనుకరణం. "లతాంతార్ద్రిరాగం" అబ్బూరు స్వంతసొమ్ము. "లంబాడిలంగా" మాత్రం శ్రీశ్రీగారిది. ఇది తప్పక "లంబాడిలంగా" వలెనే వున్నది! ఇందులో కూడా కళ లేదనటానికి వీల్లేదు. కాని ఆ కళ అడివిలో చెట్లు అడ్డదిడ్డంగా పెరిగినట్టు, కొండప్రదేశంలో రాళ్లగుట్టలున్నట్టు, అతిస్వాభావికంగా వుంది! కాని (k) యిట్లా రాయటానికి కారణం బహుశా అక్కడ (g) ఉండాలె కాబట్టి అనుకుంటాను! ఈ మార్గంలో రుక్మిణీనాథశాస్త్రిగారుకూడా సాధనచేశారు.♦

భీభత్సపద్ధతి కొన్నాళ్ళనించీ చాలామంది అనుసరిస్తున్నారు. భీభత్సపద్ధతి కొన్ని సంవత్సరాలనించీ పిలకా గణపతిశాస్త్రి,

* "Go to కడె
Buy some వడె
Eat it To-day
Without తడె"
(గ్రామ్యాదేశ నిరసనం)

"టంగుటూరు ప్రకాశ మ్రింగవచ్చిన దాది డింగిఫీవరుచేత క్రుంగిపోయె" (ఆంధ్రరత్న, ఢిల్లీ కాంగ్రెసు).

♦ ఈన కవిత్వాన్ని "కోతికొక్కిరాయి" కవిత్వమన్నాడు నరిసింహశాస్త్రిగారు వకమారు. పాపం యీన తనపైన చేసే విమర్శను యీవిధంగా వాపోయాడు. "పారడీలుకూడా నిరసనకూ వెక్కిరింతకూ నోచుకున్నవే! ఆ ఆ కవులను యేకడానికి నేనల్లా రాశాననుకోడం పొరబాటుకదూ!" (ఆంధ్రపత్రిక 22-9-40)

శ్రీరంగం నారాయణబాబు మొదలైనవాళ్ళు రాస్తున్నారు. వీళ్ళల్లో కొందరు పరుష సరళభావాలను సమవిషమంగా ప్రయోగించటముంది. మరికొందరు కావ్యాలు కావ్యాలూ భీభత్సపూరితాలుగా చెయ్యడ ముంది. ఈ పద్ధతిలో [illegible] కృష్ణశాస్త్రిగారి "దుఃఖ" పద్ధతి ననుకరిస్తున్నారు. ఈ భీభత్సకవిత్వానికికూడా శ్రీశ్రీగారే ప్రవక్తని అనుకుంటారు. ఆయనే యీ పద్ధతికి కావలసి యేరుకున్న సామగ్రిని యీవిధంగా చెప్పాడు. *

"సిందూరం, రక్తచందనం,
బంధూకం, సంధ్యారాగం,
పులిచంపిన లేడినెత్తురూ,
ఎగరేసిన ఎర్రనిజండా,
రుద్రాలిక నయనజ్వాలిక,
కలకత్తా కాళికనాలుక,
కావాలోయ్ నవకవనానికి."

పైవన్నీ ఎర్రని వస్తుసమూహం. ఇక మిగిలినవి చూడండి:—

"ఘాటెక్కిన గంధకధూమం,
పొంగెత్తిన సప్తసముద్రాల్,
రగులుకొనే రాక్షసిబొగ్గూ,
బుగులుకొనే బుక్కా-గుండా,

---

* మన పూర్వులూ వీటినన్నిటినీ సమయానుకూలంగా కవితాసామగ్రిగా స్వీకరించారు. "జయకుంజరకుంభసింధూరసంధ్యాయమానసలిలయా" అన్నాడు బాణుడు వేత్రవతిని వర్ణించినప్పుడు. కాళిదాసుకూడా మేఘదూతంలో చర్మణ్వతినీ రక్తప్రవాహాన్ని ఉల్లేఖించాడు. బంధూకం ఆరుణ్యం చెప్పాలనొచ్చినప్పుడు కవులు సాదృశ్యంకింద తీసుకున్నారు. ముద్రారాక్షసంలో "కబళితగజరక్తసుందరమని" మృగరాజ ఆననాన్ని వర్ణించాడు. కాని యివ్వే కవితాసామగ్రి అనిమాత్రం యెవ్వరూ అనలేదు. అదేభేదం వీళ్లకూ వాళ్లకూ. కాకపోతే కొంత భీభత్ససామగ్రిలో కొత్తలు కూడావున్నాయి. అదీగాక భీభత్సం క్వాచిత్కంగా చిత్తాన్ని ఆకర్షిస్తుందిగాని యితర రహితంగా అదే ఉంటే దుర్భరమౌతుంది.

వికసించిన విద్యుత్తేజం,
చలరేగిన జనసమ్మర్దం,
కావాలోయ్ నవకవనానికి."

క్రింది సంపూర్ణ భీభత్సం చూడండి !

"రాబందుల రెక్కల చప్పుడు,
పొగగొట్టపు భూంకారధ్వని,
అరణ్యమున హరీంద్ర గర్జన
పయోధర ప్రచండ ఘోషం
ఖడ్గమృగోదగ్రవిరావం
ఝంఝానిల షడ్జధ్వానం
కావాలోయ్ నవకవనానికి."

ఈ కవిత్వానికి అనుయాయులైన గణపతిశాస్త్రిగారే దీన్ని "శ్మశానకవిత్వ" మన్నారట! ఈ పద్ధతిలో శ్రీరంగం నారాయణబాబు, దేశిరాజు కృష్ణశర్మగార్లు కొంత కవనం రాశారు.* పట్నంలో నారాయణబాబుగారు "రుధిర జ్యోతి" పద్యగానం చేశారట! అప్పుడు సభాపతి మొదలైనవా రున్నారట! గి. వెం. సీతాపతి గారు "ఇది చిరస్థాయిగా ఉండదగిన సారస్వతానికి చెందినది గాదు గాని, తాత్కాలికమైన ఆనందము, ఉద్రేకము కలిగించి,

* 2-9-40.

ఈ ప్రకారం యిప్పుడు పద్యకావ్యరచయితలు పట్నంవెళ్ళి ఆంధ్రమహాసభలో తమ కావ్యపఠనం చెయ్యడం వక పరిపాటైంది. కొందరు తమ ప్రతిభను బ్రాడ్ కాస్టింగు చేయడంకూడా కద్దు. ఈ బ్రాడ్‌కాస్టింగుకు సంబంధించిన ఆంధ్రులలో మాడువంతులు స్త్రీలు పురుషులుకూడా సంప్రదాయాన్ని లెంచుకుండా మసేవాళ్లే గాని తదనుగుణంగా మార్పుచెందాలనేవాళ్లు కారు. కవిత్వంలో, జీవితంలో, ఆచార వ్యవహారాల్లో, పెద్దవాళ్లను తిట్టి, వాళ్లమాటలను వినవద్దనే ప్రతిదినం రేడియోనించీ ప్రబోధం! స్వచ్ఛందవృత్తిగల స్త్రీపురుషులచేతుల్లో పడిపోయినై అనేక ప్రజాహిత సంస్థలు! కాల మాహాత్మ్యం!

శ్రోతల హృదయ తంత్రులను కంపింపజేసేదే గనుక దీనికిని సారస్వతములో స్థలము లేకపోలేదు" అన్నారు. రామానుజరావు నాయుడుగారు "దీనిలో భావమునకు తగిన శిల్పరచన లేదు" అన్నారు. సభాపతిగారు "వీరి రచనలో భావకాఠిన్యం వున్నా, భాషాసౌష్ఠవం తక్కువనీ, వీరి ఉపమానాలు కొంతవరకు హేయంగానే వున్నవనీ, యింతకన్న యెక్కువ హేయంగా వున్న ఉపమానాలు సంస్కృతంలో వున్నప్పటికీ వీరి ఉపమాలంకారములను అంత మెచ్చుకోజాలమనీ......... వీరి కవిత్వం శాశ్వతంగా వుండదగినది కాకపోయినా, మొత్తంమీద యేదీ శాశ్వతం వుండదు గనుక వీరి కవిత్వమును ఆ కారణంచేత నిరసించ నక్కరలేదనీ, పూర్వసంప్రదాయం పూర్తిగా అనుసరించవలసిన విధిలేదనీ, కాని దానిని పూర్తిగా పరిత్యజించుట అనవసరము, అసంభవమనిన్నీ, దానిని వీరుకూడా కొంతవరకు పాటింపకపోలేదనిన్ని, పాతకొత్త కలయికల్లోనే సొగసుందనీ" చెప్పారు.* భీభత్సం రసాల్లో వకటి కాబట్టి యీ రకం కవిత్వానికీ కూడా కావ్యత్వం సిద్ధించడాని కెంత మాత్రం అభ్యంతరం లేదని నామనవి.♦ నరసింహశాస్త్రిగారుకూడా అలాగే అన్నారు. ఈ భీభత్సకవిత్వం యిప్పుడు కూడా వ్యాప్తమై ఉంది. జులై 1940 భారతిలో గణపతిశాస్త్రిగారు "యుద్ధఘోషణ" అనే శీర్షికతో ఖండకావ్యం వకటి రాశాడు. అంతా భావన. వీరు వాలంటీరుగా చేరి యుద్ధానికెళ్ళి చూచి స్వానుభవం సంపాదించివస్తే

---

* నారాయణబాబుగారు, పూడిపెద్దివారితో కలిసి సంస్కృత హిందీలు వచ్చి తెనుగుకు అపకారం చేస్తున్నయ్యంటూ 'తెలుగు పాట' అనే శీర్షికతో వక గీతం రాశారు. దేవీరాజా కృష్ణశర్మగారి "దయ్యాల పెళ్లి" "భవిష్యత్తు" మొదలైనవికూడా యిట్టి భీభత్స కావ్యాలే!

♦ దీన్ని "అగ్లీజం" (uglyism) వాదులు చెప్పినట్లు వక పద్ధతిచేసి అందరూ అదే అనుసరించి, యిదే కవిత్వ మనక, కవిత్వైకదేశమంటే యెవ్వరికీ యెట్టి అభ్యంతరమూ వుండకూడదు.

చాలా బాగుండును.* ఈ భీభత్సవాతం చాలాకాలంకిందట నరిసింహశాస్త్రిగారికి "నీరోపాట" రాశినప్పుడు కొట్టింది. కాని ఆగాలిని వదుల్చుకున్నాడాయన. చాలా సంతోషం! శ్రీశ్రీ గారికి వెనకటి దశాబ్దిచివరదాకా యీ రెండుమార్గాలూ పట్టుపడలేదు. మూడోదైన "అతినవ్యమార్గ" మెట్లావున్నా భీభత్సమార్గం మాత్రం తెచ్చిపెట్టుకున్న కృత్రిమహృదయపరివర్తన పరిణామమని వెనక అక్కడక్కడా ఉల్లేఖిస్తూ వచ్చాను. ఇంత భీభత్సంలో యింతకాలం ఉండటం చాలా కష్టం. ఈ మార్గం మన సహృదయుల కందేదేగాని చెయిజారి పొయ్యేది కాదు. కాబట్టి యిది మన సాహిత్యభాగమే.♦ శ్రీశ్రీగారిలో యిటీవల కొంచెం మార్పు కనబడుతున్నట్టు తోస్తున్నది. తాత్కాలికమో యేమోగాని విక్రమాశ్వయుజ భారతిలో "ప్రభాతపూజ" అనే శీర్షికతో వక ఖండకావ్యం రచించాడు. వెనకటి "కాళికనాలుక" "వేడినెత్తురు" "రాంబందుల రెక్కల చప్పుడు" లకు మారుగా యీ గీతంలో కొంత ప్రశాంత వాతావరణం కనపడుతున్నది. "ప్రమోదసంపద" "సుగంధిలసూనదామము" "దివ్యపరిమళము" "రుచిరజాహ్నవి" మొదలైనవి కనపడుతున్నాయి. ఇవన్నీ యీన "మనస్సును, మసృణతేజోమయ ప్రపంచమాంగల్యముల" కు దోవ తీస్తే దేశం యీనకు చాలా కృతజ్ఞమౌతుంది. ఈ గీతంలో యీన తన తొలిగీతాలైన "అహరుష్ముఖం" మొదలైనవాటిని స్ఫురింపజేస్తున్నాడు. పరమేశ్వరుడీయన

---

* ఇటీవల యీన కొంచెం సరళ ప్రకృతి దర్శనం చేసినట్టు కనపడుతున్నది. సెప్టెంబరు భారతిలో "మలయమారుతము" యొక్క శైత్య సౌరభ మాంద్యాలు కొంచెం రుచి చూశాడు. ఇక యీనదృష్టిమారవచ్చు. ఇంకొక విశేషం విశ్వనాథకు యీ భీభత్సాట్టహాసము, గాంధిజీనిగూర్చి 2-10-40 తేది ఆంధ్రపత్రికలో రాశిన పద్యాల్లో "హా, హా, హా" లలో కొంచెం ద్యోతకమవుతూన్నది. ఏమో ఈనకూడా మారుతాడేమో ?

♦ కృష్ణశాస్త్రిగారి దుఃఖం లాగే యీ భీభత్సమూనూ!

బుద్ధిని మరల్చాలనని కోరుతున్నాను! ఈ వాక్యాలు రాశినతర్వాత ప్రతిభలో "హ్రీం హ్రీం" అనే పేరుతో వక గీతావళి పడింది. అక్కడ మళ్ళీ మామూలు పంథే! దీనిలో కొంచెం ఆత్మపరీక్ష కనపడు తున్నది. కాని తనను తిట్టేవాళ్ళను తానేమన నన్నాడుగాని వాళ్లకు మంచి మంచి ఊతమైన మాటలే వాడాడు. విశేషంమాత్రం వక టుంది. వీటిలో అనుస్యూతమైన అర్థ ముంది. "పూషా" గారి "Culture and Anarchy" అనే కావ్యంలో నూతన మార్గతత్వం కొంత వివరించబడ్డది. ఎప్పటి కాలెట్లట్టే!

మల్లవరపు విశ్వేశ్వర్రావుగారు యీ భీభత్సమార్గంలో కొంత శ్రమపడ్డా అదంతా ఆయన స్వతఃసిద్ధమైన చిత్తవృత్తికి చాలా దూర మని ఆయన ఖండకావ్య సంపుటి చదివినవాళ్లకు కనపడుతుంది. ఈనవద్ద మాత్రం విరుద్ధభావ సంఘటనముంది.* ఇది కొంత వెనక దేవులపల్లిలోనూ యితరుల్లోనూ చూశాం. అటువంటిది అంతకంటె తీవ్రంగా ఉంది యీనలో. కాని యీన కావ్యాలనుబట్టి చూస్తే యీన చాలా మెత్తనిహృదయ తంత్రులుకలవాడనీ, భావోన్మాదనీ,

* గ్రంథనామమే అటువంటిది. "మధుకీల" పై ముఖపత్రంమీద వక బొమ్మ ఉంది. దానిలో వక కల్లుకూజా, వక జ్వాల, వక పుష్పము, ఉన్నై. పుష్పంలో నించీ తీసిన మధువును క్రోలడంవల్ల హృదయంలో జ్వాల బైలుదేరినట్టు నా కర్థ మౌతున్నది. ఈనలో ఆవేదనాకూడా కనపడుతుంది. ఈనలోకూడా మనస్తత్వం వుంది. అది నిరర్థకం కాదు. అనిర్దిష్టతా, పాఠకుణ్ణి ఊహచేసుకోమనడమూ ఉంది.

> "రంగురంగుల కలలన్ని రగిలి రాజె
> నొక్క కాలాగ్ని కీలగా!—ఒకడకనలు
> ఉత్తమాగభ్రమున భగ్నతరణిభాతి
> మునిగిపోయితినో యేమొ!........"

"కలలు, కాలాగ్నికీలగా రాజడం, ఒక్కడు, అగ్నికీలలో తమస్సు, ఆ తమ స్సులో భగ్నతరణి, దానివలె మునిగిపోయినానేమో! తుదకు తెలియకపోవడం" ఇట్లా ఉన్నై సన్నివేశాలు.

యూనకూ ప్రణయమే సామాన్యంగా వస్తువనీ కనపడుతుంది. "ప్రేయసీ" మొదలైనపదాలు అనేకమార్లు వాడాడు. ఈన సహజంగా కవితాశక్తిగలవాడు. ఈ కింది విమర్శక వాక్యాల్లో సత్యముంది. "ఆలాంటి (మెత్తని అనగా వీణాతంత్రివంటి) గుండెవుంటే, జీవితంలో ఏమంచి అనుభవం వచ్చినా, కవి తన్మయుడైపోతాడు. భావోద్వృత్తి (emotion) కలుగుతుంది. ఆ అంతర్వేగం వున్న నాడికే, నీలాకాశం వెనకాలికి, అంటే పెనుచీకటి కవ్వలికి చూడగలిగే భావనకూడా (imagination) ఉంటేనా! ఈ వరం చాలాచాలా కొద్దిమంది కుంటుంది.......... ఇదే కవిని స్వతంత్రుణ్ణిచేసి, ప్రత్యేక వ్యక్తిత్వమంటూంటారే, దాన్నిస్తుంది. వీటికి తోడు గుండెల్లో, లోపల లోపల సంగీతమున్న వాడైతే, చెప్పదలచుకున్న వాటికి సరిగ్గా సరిపోయేటట్టూ, పాతమాటలు కొత్త అర్థం స్ఫురించే టట్టూ కలుస్తాయి; కొత్తమాటలు కూడావస్తాయి; కొత్తకొత్త నడకల ఛందస్సులు వచ్చేస్తూవుంటాయి; ఎంత పాత పాత ఛందస్సులైనా కొత్తకొత్త పరుగులెత్తుతూ వుంటాయి. ఈ మూడు శక్తులూ ఉన్నవాడు కవి. విశ్వేశ్వరరావు కవి." ఈ వాక్యాలతో సంపూర్ణంగా నే నేకీభవిస్తున్నాను. ఎవరినైతే నేను ప్రత్యేకించానో వాళ్ళందరకీ మూడుశక్తులూ వున్నవి. సూక్ష్మంగా చెప్పాలంటే హృదయమూ, భావనాశక్తి, అంతస్సంగీతం,* వుండేవాడు కవిఅన్నమాట! ఈనను తప్పక సామాన్య నవ్యమార్గానుయాయిగా యెన్నదగినవాడు.♦ ఇతర మార్గాల్లోనుంచీ యీయన్ను యెత్తి

* హృదయం—భావం—హృదయం.
భావనాశక్తి—వస్తు—బుద్ధి.
సంగీతం—రచన—శ్రోత్రం.

వెనక చెప్పినవిషయం జ్ఞాపకానికి తెచ్చుకోమని మనవి!

♦ ఈన "నవ్యాంధ్రకవిత్వం - భావచిత్రణ" అనే భారతి 1939 ఏప్రిల్ వ్యాసంలో ఉదహరించినదికూడా యీ దారినే చూపిస్తున్నది.

మొదటి మార్గంలో ఉంచుతున్నాను. "ఇంట్రో"లోనించీ కొంత భాగం యీకింద యిస్తున్నాను.

"కవి సర్వతోముఖ స్వాతంత్ర్యదూత. స్వేచ్ఛాదాత. అవ్యయం అనాచ్ఛాదితంగా, ఆకాశమధ్యంలో ఊగవచ్చును. విభక్తివిశృంఖలంగా షికారుపోవచ్చును. ప్రతిఫలం విచిత్ర సౌందర్యం. విచిత్రమే సౌందర్యం! సౌందర్యమే విచిత్రం! ఛందస్సుల చండశాసనానికిపోయిన కాలం వెళ్ళిపోయింది. కవిహృదయంలోని రాగాలాపన యెట్లు తీగలుగా సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలె......నవకవికి అనుకరణ అసహ్యం. క్రొత్తశక్తులు క్రొత్త రూపంలో సాక్షాత్కరించాలి. ఇవన్నీ ఋణపక్షాన నవకవుల తిరుగుబాటు. వారు సాధించిన ధనం యేమైనా ఉన్నదా అని ప్రశ్నిస్తారా? చదవండి. 'ఫిడేలు రాగాల డజన్'."

వెనక చేసినువదించిన సూత్రాలుపైదానిలో స్ఫుటంగా కనబడుతున్నై! ఇక యీ సిద్ధమైన సాధనమునుగూర్చి కింది విధముగా రాశాడు నరసింహాశాస్త్రిగారు. "శ్రీ ముద్దుకృష్ణ చాలాకాలంనించీ యీరకమైన కవిత్వం ప్రయత్నించినాడు కాని అందులో వ్యక్తిత్వం కనపడదు. 'జంటుముంచి' రచనలలో ఊసుపోక రాస్తున్నట్టు తోస్తుంది. శ్రీ ఓకుమళ్ళ కామేశ్వరరావు 'పాలపిట్ట' అనే కావ్యసంపుటిని ప్రచురించినాడు. ఇంకా కావ్య సంపుటాలు అటువంటివే అనేకం తయారౌతున్నవి......... ఈమధ్య శ్రీ దేశిరాజు కృష్ణశర్మ యీరకమైన కొన్ని రచనలు చేసినాడు కాని విశిష్టత లేదు. శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుకూడా కొన్ని యీ పోకడలున్నా, అతని కవిత్వం మొత్తంమీద యీమార్గంలోకి రాదు. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు వాదంలో మెచ్చినప్పటికి, రచనల్లోమాత్రము అహంభావ కవిత్వ రీతులు వదలుచడంలేదు. శ్రీ శ్రీ జనార్దనరావు (ఒకప్పుడీన సులభశైలికూడా రాశేనాడు. చూ. ఛత్రసాంబుడు ఆం. ప.).

యింకా కొన్ని కావ్యాలు చెబితే యెట్లావుంటుందో! ........
ఆయన (ఇంద్రకంటి) శ్రీశ్రీని వెనకవేసుకొని వస్తూవుంటాడు కాని ఆయన విమర్శనలు, ఆయన కృతులు, శ్రీశ్రీగాని, సామాన్యంగా అహంభావ కవులుగాని, అంగీకరిస్తారు అనుకోను. ఆయన్ను వారు 'ఉపయోగించుకుంటున్న'ట్లు భావిస్తాను. ...... పిలకా గణపతి శాస్త్రి ........ఇతనికి విశేషమైన జ్ఞానతృష్ణ వున్నది. కీర్తికాముడు. ఇతన్ని యీనవ్యకవిత్వరీతులతో నవ్యకవులూ ఆకర్షించినారు. ఇతని వ్రాతలలోకూడా వారి ప్రతిధ్వనులు కనబడతవి. నూతనమైన పంథల మీద యెంత వ్యామోహమున్నా యిది ఇతని చర్మాంకంతో లోతుకు దిగలేదు.............. మధురమైన కవిత్వం చెబుతున్నాడు."

ఈవాక్యాల్లో వున్న సత్యాసత్యాలను అయాచోట్ల స్పృశించాను. పాఠకులకు తెలుసు.

ఌ

## గోపాలరెడ్డిగారి వివాహం :

గోపాలరెడ్డిగారి వివాహ మొక నవ్యకవి సమ్మేళనం వంటిది. ఆ మహానుభావుడు వీళ్ళందరికీ చాలా ప్రియుడు. కొందరికి పోషకుడు కూడాను అనుకుంటాను. ఆయన వీళ్ళనూ గురుతరులనూ కూడా ఆహ్వానించాడు. మనుష్యులను ఊహాలో ఉంచుకొని చేశే ఉద్యోగ అడ్వరుటైజుమెంట్లవంటివి ఆహ్వానాలు. గోపాలరెడ్డిగారు రవీంద్రసేవ చేసి ధన్యుడై చిన్నతనంలోనే ఉదాత్తమైన సంస్కృతి అబ్బిన యువకుడు. లక్ష్మీపుత్రుడు. భాషాపోషకుడూ సేవకుడూ కూడాను. వెనక ఆయనరాశిన భారతిలో వ్యాసాలసంగతి చెప్పేఉన్నాను. ఈన నవ్యసాహిత్యాని కొక ఆలంబనం. నవ్యసాహిత్యపరిషత్తు ఆయన్ని ఆశీర్వదిస్తూ "సువర్ణాక్షతలు" దంపతులమీాద చల్లినది. ఈ గ్రథనంలో ముఖ్యమైన నవ్యుల ఆశీర్వాద కావ్యాలున్నాయి. తెలికచర్ల

వెంకటరత్నంగారు తాము గద్యకవే కాకుండా ఖండకావ్యం కూడా రచించగలనని చూపారు. "కవయామి, వయామి, యామి" అనే భోజ చరిత్రకథను స్మరింపచేశారు. ఈ గ్రంథంలో భీభత్స కవులకు తాత్కాలికంగా భీభత్స మూగిపోవటం చాలా సంతోషం. వీ శ్లేట్లా రాశారో చూడాలని నాకు చాలా వేడుక వేశింది. కాని పులులన్నీ మేకపిల్లలై పోయున్నై. నారాయణబాబు, పఠాభిగార్లు లేరు. వాళ్లు కూడా ఉన్నట్లైతే మొట్లు రాశేవాళ్లో! శ్రీ శ్రీ గారు వారి సహజ "రనాల్—వస్సు"లో, అర్థవంతంగా గీతించాడు. ఇందుకు యీనకు అభినందనా లిస్తున్నాను. ఇటీవల యీన వదిలేసిన అర్థ వత్త్వాన్ని క్వాచిత్కంగానైనా స్వీకరించిం దీన గీతి. సహజ శబ్ద చిత్రం కనబడుతూనేవుంది. అప్పట్లో రెడ్డిగా రమాత్యపదవిలో ఉన్నారు. ఆ విషయం "చారిత్రిక వైపరీత్యం"గా కనపడి భావిచరిత్ర కారులను సహకారి అవుతుంది. ప్రథమ గీతం సభాపతిగారిది. ఇది సంస్కృతంలో వుంది. సంస్కృతాశీర్వాదంగాని చలామణి కాదు సంపూర్ణంగా. కాబట్టి యీన ఆశీర్వాదం పరిమదాశీర్వాద మన్నమాట! ఈన మొదటి శ్లోకంలో సురాంగనలచేత కల్పక పుష్పాలను చల్లించాడు! రెండవ శ్లోకంలో అర్థనారీశ్వర రక్ష ణను కోరాడు! తుదకు యావత్పరిమదాశీర్వాదాన్ని చల్లాడు. శ్లోకాలు చాలా ముచ్చటగాఉన్నై! విశ్వనాథ పద్యావళిలో, సహజ గాంభీర్య క్లిష్టతాంధ్రాభిమానాలూ, యీవిధంగా రాశిన యితరులం వాళ్ళందరిలో వారి సహజ కవితాగుణాలు ఉన్నై! బాపిరాజుగారు జానపదగీతం రాశాడు. ఉదాత్తంగానే ఉంది. ఈనలోకూడా యీ గీతంలో విరుద్ధ భావసమ్మేళనం కనపడుతున్నది. మచ్చుకు వక ఉదా హరణం.

"పొంగిపోయే ప్రేమ లోతులు"

శివరామంగారు శ్రీ శ్రీగారి శిష్యుణ్ణని కొన్ని విషయాల్లో

చెప్పుకున్నాడాయన గీతంలో! ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి పోకడ కొంత, కృష్ణానందుని పోకడ కొంత, కలిపి వారి పద్యాలలో పెట్టారు. నలదమయంతుల వివాహసందర్భంలో "త్వం కౌముదీ, కుముద బంధురయం నరేంద్రః" అన్నాడు కృష్ణానందుడు. ఇంకేకాకుండా వివాహానికి కోకిలచేత పెండ్లిపాట పాడించారు. తా నుభయకవినని చాటారు చివరభాగంలో! ఇద్దరిలోనూ మాత్రం ఆంధ్రుడు ద్రావిడభూమి నేలుతున్నాడనే గర్వం కనపడుతుంది. ఈ గర్వంలో విశ్వనాథతో పాటు వేదుల కూడా చేరారు. ఈవిధంగా వివిధకవి రచిత ఖండకావ్య సంపుటిలో రెడ్డిగారి వివాహము చిరస్థాయియైపోయింది. రెడ్డిగారి కీర్తి వంశాలాచంద్రార్కస్థాయులై వర్ధిల్లుగాక అని ఆశీర్వదిస్తున్నాను!

**వివిధ విషయాలు:**

ఈవిధంగా వరలిన యీ నవ్యసాహిత్యవీధిలో యిప్పుడు సాధన చేస్తున్న అనేకమంది యువకుల పేర్లు కనపడతవి! వాటిలో కూచిభొట్ల ప్రభాకర శాస్త్రి, అంబడిపూడి వెంకటరత్నం, దామెర రాజగోపాలరావు, విజయవిలాసయుక కృపాకరం (ఈయన అనేక పేర్లున్నయ్యంటారు) నాగరాజామాత్యుడు, చేబ్రోలు సూరన్న, శివరామం, అమంచర్ల రామమూర్తి, కామరాజు బాపయ్య, దిగుమర్తి సీతారామస్వామి, బి. వి. సింగరాచార్య మొదలైనవారున్నారు.* కొందరు నవ్యులు తమ కావ్యాల నచ్చేయించుకోవలెనని ప్రయత్నిస్తున్నారు. అదృష్టవంతులవి అచ్చైనై! బంగాళీభాషకు మూడ

* "కవిత" అని వక ఖండకావ్యం కాజ రాధాకృష్ణశాస్త్రిగారు రాశి ప్రకటించారు. ఈన "కుకవి ఘూకముల చూడ్కుల లెక్కగొనక, పోవువాడ"నని చెప్పుకున్నాడు. నవ్యులలో వక్క గొప్పగుణ మహంప్రత్యయం? మంచికైనా చెడ్డకైనా యిది చెప్పదగివుంది! "వాధూల్"గారు తమ "క్రొత్తపాట"లో "మునిలి సీతులనూ" "ప్రబంధాలనూ" "భావకవిత్వాన్ని" "పద్యాలనూ" వదిలేసి కార్మికులు, వారి సంసారాలే యిప్పుడు కవితా సామగ్రి కావలెనని చెప్పాడు.

లగా రివ్యూ అన్లే "ప్రతిభ" నవ్యులకు ప్రోత్సాహమిస్తున్నది. కొందరు గ్రంథాలు ప్రకటించుకోలేక తాము రాసిన కాగితాలనే సభలకు తీసుకెళ్ళి పద్యగానం చేస్తున్నారు. ప్రకటనదార్లకు లాభంవచ్చే పుస్తకాలు మాత్రమే వేస్తారు.• ఆంగ్లంలో నవ్యకవుల సంఖ్య చాలా ఎక్కువైపోయింది. నవ్యసాహిత్యపరిషత్తు ఎందరి పుస్తకాలు అచ్చేసి నష్టం భరిస్తుంది? అచ్చుఖర్చులు పెట్టుకుంటే తనపత్రాన ప్రకటించటానికి కభ్యంతరం లేదేమో? అయినా కవుల కా శక్తి వుండద్దూ! గ్రంథకర్తల శ్రమలు కొంతవరకు నా స్వానుభవంలో ఉన్నాయి! ఈ నవ్యమార్గంలో అక్కడక్కడా యువకులు సమితులుగా యేర్పడి సాధనచేస్తున్నారు. ఒకటి కాలంలో ఉన్న సంఘాలు, సమితులు, కొన్ని మనవిచేశాను. ఒకటి కొన్ని "ఆంధ్ర సాహిత్య పరిషత్తు" మొదలైన సంఘాలు పాతగిల్లి తుప్పుపట్టి వున్నా! వాటికి మళ్లీ కార్యకారిత్వం రావాలంటే వాటిలోవున్న సనాతనులు శలవుతీసుకొని యువకులకు స్వాతంత్ర్యం యివ్వాలి! కాని ముసలివాళ్లకు కాపేయం మొకు, వనేది సహజమైన విషయం! వాళ్లు బుద్ధిపూర్వకంగా తొలగరు! కొన్ని ప్రాచీన నూతన సంఘాలూ, అవి చేస్తున్న పనిని స్థాలీపులాకన్యాయంగా చెబుతాను.

(1) <u>సద్భావళి పరిషత్తు, బందరు:</u> ఈ పేరుతో మచిలీపట్నంలో కొందరు సారస్వతసేవ చేస్తున్నారు. ముట్నూరి కృష్ణారావుగారి "సమీక్ష" యీ పరిషత్తు ప్రకటించిన పుస్తకరాజం. శ్రీ కృష్ణారావుగారు తమ అమూల్య ప్రతిభను మాకింకా గ్రంథరూపంగా అందచెయ్యవలసిన వారై ఉన్నారు.

(2) <u>ఆంధ్ర భారతి తీర్థ, విజయనగరం:</u> ఇది చాలాకాలంనించీ పనిచేస్తూన్న సంస్థ. బుర్రా శేషగిరిరావుగారు* దీనికి కార్యదర్శి.

• మా అంతి కొవ్వలివారి నవలలు! కొన్ని మట్టుకుంటున్నా. [illegible] [illegible] [illegible] [illegible] [illegible].

* [illegible]

శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవమహారాజులుంగారు దీనికి అధ్యక్షులు. ఈ సంస్థ చాలా పరిశోధనంచేసి అనేక గ్రంథాలు ప్రచురించి, అనేక సుప్రసిద్ధులకు బిరుదము లిచ్చి వక అంతర్జాతీయసంస్థగా పేరెన్నిక గన్నది. దీనికి చాలా శాఖ లున్నై! ఉపన్యాసాలు [illegible] వర్ధంతులుకూడా జరుగుతూ వుంటై! చాలా పెద్దదగిన సంస్థ!

(3) <u>ఉషా గ్రంథావళి, తెలప్రోలు:</u> ఇది ప్రత్యేకంగా యువకుల చేతుల్లోనే నడుస్తున్నట్టు తెలుస్తుంది. ఈ సమితివారు కొన్ని గ్రంథాలు ప్రచురించారు. గిరీశం, పార్వతీశంల పాటు ప్రత్యేక పాత్రగా సృష్టింపబడిన "నీలకంఠం" యీ సమితివారు ప్రకటించిన "నీలకంఠం కథల" నే పుస్తకంలో నాయకుడు.*

(4) <u>నవశక్తి గ్రంథమాల:</u> ఇప్పుడు ప్రపంచాన్ని కలవరపరుస్తున్న రాజకీయ సాంఘికసమస్యలకు సంబంధించిన గ్రంథాలు యీ గ్రంథమాలలో వెలువడ్డై! సామ్యవాదం మొదలైన అనేక విషయాలు వీరి ప్రచురణాల్లో చర్చింపబడ్డై. "చీనాశోధనం" మొదలైనవి.

(5) <u>ఆధునికాంధ్రవాఙ్మయకుటీరం, మద్రాసు:</u> వీరుకూడా కొన్ని గ్రంథాలు ప్రచురించారు. వాటిలో "కరుణకుమార కథలు" వకటి. కర్షకకథలు రాయడం యిప్పుడొక ఫాషనైపోయినది. "వెంకన్న" అనే పెద్దు, దానియొక్క ఆపత్తులు, వర్ణింపబడ్డై యీ కథల్లో! ఈ "వెంకన్న" ప్రవర్తనం, అది కల రయితుయొక్క భావాలు చాలా రసవంతంగా సృష్టింపబడ్డై!

(6) హైదరాబాదురాష్ట్రంలో యిటువంటి కొన్ని సంఘాలున్నై! అన్నిటికంటె పాతది జటప్రోలులో ఉన్న "<u>శ్రీసుజనరంజనీ</u>

* "మజ్లిస్-ఇ-తామీర్ [illegible]" సమితని [illegible] ఉన్నట్టు తెలుస్తుంది. [illegible] యీ సమితి [illegible] తెలుస్తున్నది.

కవితామండలి". దీనికి వాజపేయయాజుల రామసుబ్బారాయుడుగారు అధ్యక్షుడు. ఈన సహజకవి. ఈన రచించిన గ్రంథాలు లెక్కకు మిక్కిలిగా వున్నై! ఈ సభ్యులు ఉత్తరప్రత్యుత్తరాలు పద్యరూపంగా చేసుకోవాలనే సమయ మున్నది. ఈ కవితాసంఘంలోకల్లా రత్నం చేబ్రోలు సరస్వతీదేవి- ఈమె రామాయణాన్ని గూర్చి వెనక ముచ్చటించాను. ఈ సంఘంలో కొందరు చక్కని ఖండకావ్యాలు రాశారు. "కావ్యగుచ్ఛము"ని ఒక కావ్యసంపుటిగా ప్రకటించారు. దీనిలో "గర్వితకన్య" మొదలైన చక్కని ఖండకావ్యా లున్నై!

(7) దేశోద్ధారక గ్రంథమాలని విశ్వదాత పేర సికింద్రాబాదులో ఒకటి ఉన్నది. ఈ మాల రాజకీయ, ఆర్థిక గ్రంథాలు చాలా ప్రచురించింది. సురవరం ప్రతాపరెడ్డిగారి "ప్రాథమిక స్వత్వాలూ" బాలేందుశేఖరంగారి "కమాల్ పాషా జీవితమూ" యీమాలా ప్రచురణంలో ముఖ్యాలు. ఈ మాలాస్థాపకులైన ఆళ్వారుస్వామిగారు చాలా శ్రమపడుతున్నారు. ఈ మాలలోని గ్రంథాలు నిజాంరాష్ట్రాంధ్రులకు ప్రయోజనకారులుగా ఉన్నై!

(8) బూర్గంపాడులో ఆంధ్రవాఙ్మయ సేవాసమితి ఒకటి కె. వి. ఎల్. ఎన్. శర్మగారి ప్రేరణకింద పనిచేస్తున్నది. ఈ సమితి పక్షాన యిదివరలో "కిన్నెర"అని ఒక సారస్వత పంచిక ప్రచురించారు. ప్రతిభ చాలా పొగిడింది దాన్ని! ఇప్పుడు యీ సంవత్సరం మళ్లీ సంచిక ప్రకటించటానికి ప్రయత్నాలు జరుగుతున్నట్టు వింటున్నాము.

(9) "సాధనసమితి"* ఇది లలితకళ లన్నిటిలో సాధకులచేత స్థాపింపబడ్డది. గేయాల్లో కవిత్వమూ, చిత్రలేఖనమూ, మొదలైనవాటిలో

* ఈ సమితి పక్షాన పిల్లలమఱ్ఱి వెంకటహనుమంతరావు "మధుకణములు" అనే గేయసంపుటి ప్రకటించారు. ఇటీవల "భోజరాజు" అను పద్యకావ్యం ఒకటి వచ్చింది.

సాధకులున్నారు. ఈ సమితి ఒక లిఖితసంచికను సాగిస్తున్నది. దానిలోని పద్యాలూ, కథలూ, కొన్నిసంపుటాలుగా ప్రచురించారు. "అంజలి" అనే పేరుతో చక్కని ఖండకావ్య సంపుటం మొదటిది ప్రకటితమైంది. తర్వాతకూడా రెండు మూడు సంపుటాలు వెలువడ్డై! ఇది చక్కని చిత్రాలతోకూడా ఉంది. ఈ సభ్యులు ఉత్సాహం కొరవడకుండా పనిచేస్తారని ఆశిస్తున్నాను. విజ్ఞానమూ, అనుభవమూ యింకా సంపాదించాలె!

(10) "ఆంధ్రకేసరి గ్రంథమాల" అనే పేరుతో కొందరు యువకులు గ్రంథాలు ప్రకటించటానికి ప్రారంభించారు. "కమ్మ తెమ్మెరలు" అనే పేరుతో ఒక కథాగుచ్ఛం ప్రచురించారు. ఇంకా వీరు శ్రమపడి విజ్ఞానం సంపాదించుకుని ఉత్సాహంతో భాషాసేవ చేస్తారని నమ్ముతున్నాను. రెండో మూడో ప్రచురణాలు రాజకీయంలో వచ్చై.

(11). కవికుమారసమితి (అనంతపురం) ఈపేరుతో అనంతపురంలో కొందరు యువకులు నవ్యవాఙ్మయ సాధన చేస్తూ "క్రొక్కారు మెఱుగు" మొదలైన కొన్ని ఖండకావ్య సంపుట్లను ప్రచురించారు.

(12) పై పేరుతోనే రాజమండ్రిలో మరియొక సాధన సంఘము పనిచేస్తూ "సంక్రాంతి సంచిక" "దీపావళిసంచిక" అనే పేర్లతో వివిధ నవ్య సాహిత్య సాధనలు గల సంచికలను ప్రచురించింది.

(13) అభిసారికా గ్రంథమాల (బందరు) ఈపేరున చలంగారి కథలన్నీ సంపుటాలుగా ప్రచురించాలని ఉద్దేశించారు. "చలంగారి లం" అని యువతీవలసే ఒక కథాసంపుటి ప్రచురించారు.

(14) నవ్యసాహిత్యమాల : (అనంతపురం)

(15) లక్ష్మీగ్రంథప్రచారిణి : (తెనాలి)

(16) ఆంధ్రకావ్యమాల : సన్నిధానంవారి ఆధిపత్యంకింద ప్రచురణ మౌతున్నది.

(17) సాహిత్య మండలి : (ఏలూరు) దీనిలో ప్రసిద్ధులగునవ్యులున్నారు. (బొడ్డపాటి బాపిరాజు, ముక్కపాటి కృష్ణమూర్తి మొదలైనవారు.)

(18) ఆంధ్ర విజ్ఞాన పరిషత్తు: రాజమహేంద్రవరములో 'ఆంధ్ర విజ్ఞాన పరిషత్తు' అనే పేరున ఒక సర్వతోముఖ సంస్థ బయలుదేరినట్టు పత్రికవలన (ఆంధ్రపత్రిక 15-9-40) తెలిసింది. ఈ పరిషత్తు సర్వాంధ్రవిజ్ఞానానికీ సంబంధించినట్టు ప్రకటనవల్ల తెలుస్తున్నది. ఈ పరిషత్తుపక్షమున విక్రమదేవవర్మలని ఒక భవనం నిర్మించ నుద్దేశించినట్టుకూడా పత్రికలో తెలుపబడింది. ఈ సంస్థకు విశ్వవిజ్ఞాన వేత్తలగు శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మమహారాజులుంగారు అధ్యక్షులుగా ఉండటం సంతోషకరం. ఇదివరకు బయలుదేరిన వాటి వలెగాక యిదైనా జాతీయముగా సర్వతోముఖాభివృద్ధికి పనిచేస్తుందని ఆశిస్తున్నాము.

(19) నవోదయ లేఖావళి : దీన్ని దేవరకొండ బాలగంగాధర తిలక్ మొదలైనవారు వెలువరుస్తున్నారు. ఇందున "ప్రభాతము-సంధ్య" తొలికగా ప్రచురితమైంది. దీనికి కోలవెన్నువారు పరిచయవాక్యం వ్రాశారు. ఇది ఒక పద్య గీతి మిశ్రకావ్యము. పరిచయం చేస్తూ, "ఇంత చిన్నవయసులోనే యిన్ని అనుభవాలూ, యిన్ని కలలూ మేళా కలిగినవారున్నారని ఆశ్చర్యపడ్డాను." అని వ్రాశారు కోలవెన్నువారు. నవ్యకవుల "అంతులేని ఆవేదనా, ఏమిటో ననంద లోకమూ," అనే

సామాన్యలక్షణాలే యీనలోకూడా కనపడుతున్నై! కోలవెన్నుకు, యీనకూ మల్లవరపువారికీ పోలికలు కొన్ని కనపడ్తై!

(20) సచ్చిదానంద గ్రంథమాల: ఇది కృష్ణాజిల్లా ఎర్రగొండపాలెంలో రామకృష్ణ సీతారామసోదరకవులు స్థాపించారు. వీరి బిరుదులన్నీ రాయడానికిక్కడ చోటు లేదు. వీరుకూడా యథాశక్తి సేవచేస్తూనే వున్నారు.

(21) సాహితీమేఖల (నైజాం): అంబడిపూడి వెంకటరత్నంగారి కావ్యద్వయి (మైనాదేవి- మొరార్కకన్య) మొదటి ప్రచురణం. రమ్యంగా వుంది. రెండో సంపుటంలో "వత్సలుడు" "వనవాటి" అనే రెండు కావ్యాలున్నై. వెంకటరత్నంగారిది చక్కని వాణి. "మైనాదేవి" సిపాయివిప్లవానికి సంబంధించిన కథ. రసవంతంగా చిత్రించాడు. ఈన చాలాకాలంకిందటనే "ప్రణయవాహిని" అనే ఖండకావ్యసంపుటి ప్రకటించాడు. ఎన్నదగిన వ్యక్తి.

ఇందులో చేరని అనేక సంస్థలున్నై. పట్టిక సర్వసంఘ సంకలిత మనుకోక చేర్చని సంఘాలు నన్ను మన్నించాలె నని వేడుకుంటున్నాను. ఇట్టి సంస్థలేగాక కొన్ని కళాశాలలలో సారస్వతసంఘాలున్నై! వీటిలో కొన్ని పత్రికలు ప్రకటిస్తున్నవి. ఈ విధంగా ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, పట్నంలో లాయొలాకాలేజీ, హైద్రాబాదులో నిజాంకాలేజీ మొదలైనవాటిలో వున్న సమితులిట్టివి ప్రచురిస్తున్నై! వీటిలో సామాన్యంగా ఖండకావ్యాలూ, కథానికలూ, యెక్కువగా సాధన చేస్తున్నారు. మొత్తంమీద పరిశోధనాదులకు శ్రమకావాలె. వీటి రెంటికీ భాషలోగాని, భావంలోగాని సామాన్యరచన చెయ్యాలంటే యెక్కువగా శ్రమపడ నవసరము లేదు. అందులో ఖండకావ్యంకంటె ఖండగీతి యింకా సులభం. పత్రికల్లో చూస్తే ఉపన్యాసాలకు లెక్క లేదు.

పరిశోధనంలో వున్న మూడువిధాల్లో అనగా భాషాసారస్వత చారిత్రక పరిశోధనల్లో వెనక మల్లంపల్లి డాక్టరు నారాయణరావు మొదలైనవారినిగూర్చి ముచ్చటించి ఉన్నాను. వారు వారి పరిశోధనలను సాగిస్తూనేవున్నారు. వాళ్లుగాక సారస్వతపరిశోధన విషయంలో ఆంధ్రవిశ్వవిద్యాలయంకంటె మద్రాసు విశ్వవిద్యాలయం శ్రమ చేస్తున్నదని చెప్పటానికి అభ్యంతరం లేదు. ప్రాచ్యపరిశోధనలో ఆంధ్రభాషకుకూడా స్థానమిచ్చి తత్ప్రధానంగా కొన్ని గ్రంథాలూ, పరిశోధకవ్యాసాలూ ప్రకటిస్తున్నది. ఇటీవలనే మల్లంపల్లిగారిని ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు పరిశోధకులుగా నియమించారు. కోరాడవారి ప్రాచ్యపరిశోధకమండలిపక్షాన చేస్తున్న పనిచాలా ప్రశంసనీయం. గ్రంథప్రకటనం వెనకటికంటె చాలా అభివృద్ధైంది. లాభంకొరకు పనికోసం చేసే కంపెనీలు గాక యిటీవల సారస్వతవ్యాప్తికూడా ఉద్దేశంగా కల కొన్ని ప్రచురణసంఘాలు స్థాపితాలైనై. మద్రాసులో నవ్యాంధ్రాదర్శ, తెనాలిలో యువకార్యాలయం మొదలైనవి. వీరు నవ్యసాహిత్యగ్రంథాలు కొన్ని ప్రచురించారు. నవ్యసాహిత్య పరిషత్ప్రకటనాలకు సహాకార్లుగా పనిచేస్తున్నారు.* ఇప్పటి ప్రచురణాల అచ్చు వగైరాలు చక్కగా ఉంటూఉన్నై!♦ చరిత్రకోసం కొందరు వ్యక్తులు

---

* చిదిరమఠం వీరభద్రశర్మగారు గొప్ప పండితుడై, వక్తై, వ్రాయసకాడై హైద్రాబాదులో "విభూతి" అనే చక్కని మాసపత్రిక నడిపిస్తూ, దానిలో కొన్ని ఉద్గ్రంథాలను ప్రచురిస్తున్నాడు. ఈయన యౌవనంలో ఉండి కార్యోత్సాహంతో పని చేస్తున్నాడు. ఇతోధికంగా యీనవల్ల ఆంధ్రదేశం ఉపకారం పొందుతుందని ఆశిస్తున్నాను.

♦ గ్రంథాలు రాసి ప్రకటించుకునే కవులకష్టం చెప్ప శక్యంకాదు. వెనక వకమారు మనవిచేశాను. చదివినా చదవకపోయినా గ్రంథం కొనడమనేది వకటి మనం నేర్చుకోవాలె. హైద్రాబాదులో "అణాగ్రంథమాల"ని వకటి స్థాపించారు. ప్రతి పుస్తకం ఒక్క అణా. ఇందులో రాజకీయం, ఆర్థికం, సారస్వతం అన్ని సంగతుల మీదా గ్రంథాలున్నై! హైద్రాబాదురచయితల్లో ప్రతాపరెడ్డిగారిని వదిలితే,

శ్రమపడుతున్నారు. ఏనాడు లక్ష్మణరావుగారు హిందూ మహమ్మదీయ మహాయుగాలు రాశారో? ప్రారంభించి పోయిన వాటికి ఉత్తరమైనా చేర్చకపోవడమే కాదుగదా, బ్రిటిషు మహాయుగం వ్రాయనే లేదు ఎవ్వరూను. పరిశోధన చేసి రాస్తున్నవాటిలో చాలా తప్పులున్నై! స్కూళ్లల్లో ఉపయోగించే చిన్న పుస్తకాలలో తప్ప ఉద్గ్రంథాలు లేవు. ఈ సందర్భంలో దిగవల్లి వెంకట శివరావుగారూ, మానికొండ సత్యనారాయణశాస్త్రిగారూ చేసినపనికి వారి కీర్తికి యావదాంధ్రదేశం వందనాలియ్యాలె. శివరావుగారి బ్రిటిషు మహాయుగం చాలా గొప్ప గ్రంథం. ప్రతి ఆంధ్రుడూ చదవదగినది. ఇంతకంటె గొప్పది మానికొండవారి గ్రంథం. ఈన బి. డి. బాసూగారు రచించిన "క్రైస్తవరాజ్య వ్యాపన" (Rise of Christian power in India) మనే గ్రంథానికి ఆంధ్రానువాదం చేశారు. దీన్ని ప్రచురించి పెదపాలెం కృష్ణాశ్రమంవారు దేశభాషాసేవ చేసినందుకు వారు మిక్కిలి వంద్యులు. ఆంధ్రులచరిత్ర ఎవ్వరూ సాహసించి పరిష్కరించటానికి భయపడుతున్నారు. అటువంటి భయం కూడదు. ఆంధ్రసాహిత్యానికి అమూలాగ్రమై అధికార పదవి సథిష్ఠించగల చరిత్ర లేదు. ఉన్నవల్లా

చలంచర్ల రంగాచార్లుగారు "హాలికుడని" పోతనామాత్యుని చరిత్రము రాసి, ఖండవల్లి లక్ష్మీరంజనంగారు "తెనుగుచుక్క" అని వక విమర్శనాత్మకవ్యాసావళి రాసి, ఇట్లాగే అనేకులు రాశారు. రంగాచార్లగారి గ్రంథాన్నిగూర్చి "అది ఒక విశిష్టతగల యుక్తిపూర్ణనాటకం. కవిజీవితాన్ని చిత్రించడంలో ప్రథమగ్రంథమ"ని చెప్పక చాలును. "తెనుగుచుక్క" కూడా చక్కని విమర్శకాభిప్రాయాలతో కూడివున్నది! "తెనుగుతల్లి" అని వక యువతి వక పత్రిక పెట్టి భాషాసేవ చేస్తున్నది. ఇప్పటికీ భావకవిత్వవిమర్శ సాగుతూనేవుంది. కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు "సాహిత్యకళ" అనే పేరుతో వక గ్రంథం రచించి వ్యావహారికభాష, భావకవిత్వం మొదలైనవాటిని విమర్శించారు. దీనిలో మంచి హాస్యరచన వుంది. ఈన శ్రీరామవిజయాది గ్రంథాలుకూడా కొన్ని రాశారు. పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ అమూల్యమైన వేదశాస్త్రజ్ఞానాన్ని వినియోగిస్తూనేవున్నారు. "రాజసూయరహస్యం" మొదలైన అనేక గ్రంథాలు - వెనకటి మహాభారతచరిత్రను చేర్చారు.

చాలా తక్కువగా ఉన్నాయి! వాటిలో వీరేశలింగంగారి "కవులచరిత్ర", వంగూరివారి "ఆంధ్ర వాఙ్మయచరిత్ర", భోగరాజు నారాయణమూర్తి గారి "ఆంధ్రసాహిత్యచరిత్ర", అప్పారావు "ఆంధ్రవాఙ్మయచరిత్ర", యిటీవలవరకు ఉన్న గ్రంథాలు. ఇవిగాక జయంతి రామయ్య పంతులుగారు "ఆంధ్రవాఙ్మయ వికాసము"ని కొన్ని వ్యాసాలిచ్చి వాటిని ప్రకటించారు. కేసుపల్లి అచ్యుతరావుగారొక గ్రంథం రచించారు. వీటన్నిటికంటె "ఆంధ్రవాఙ్మయచరిత్ర సంగ్రహమని" మొదట "[illegible]" అనే పేరుతో సక్రమమైన పద్ధతులతో ఒక సంగ్రహవాఙ్మయచరిత్ర రచించి యిటీవలనే దాన్ని ఆధునిక యుగం మీద ఒక అధ్యాయం చేర్చి* పునర్ముద్రణం చేశాడు. ఆధునిక యుగం చాలా సంగ్రహంగా వుంది. కర్తకు మరీదగ్గరగా వున్న సాహిత్యాన్ని సమీక్షించడం కష్టం. అందుచేత అట్లావుంది. ఇవిగాక ఆంగ్లంలో "Heritage of India series" లో రచించిన గ్రంథాన్ని గూర్చి వెనక ముచ్చటించాను. ఈవిధంగా ఉంది సాహిత్య చరిత్ర సంగతి.♦ సమగ్రాంధ్ర నిఘంటువు యొక్క ఆవశ్యకత "ప్రతిభ" లో వాగనుశాసన గిడుగువారి సూర్యరాయాంధ్ర నిఘంటువు మీద రాసిన దీర్ఘవ్యాసం సంపూర్ణంగా స్థాపించింది. నిఘంటువు, జాతి చరిత్ర, సాహిత్యచరిత్ర రాయించడం విశ్వకళాపరిషత్కార్యాలని మళ్లీ మనవి చేస్తున్నాను. సాహిత్య చరిత్ర రాయించాలని నవ్య సాహిత్యపరిషత్తు ఒక తీర్మానంచేశారు. కాని "ప్రతిభా", గ్రంథ

---

* గ్రంథకర్త వెంకటనారాయణగారి పేరుతో.

♦ నవ్యసాహిత్యాన్ని అయిదు తరాలుగా భాగించి దానిలోని నిగ్గును నిర్వచించాడు విశ్వనాథ తన నవ్యసాహిత్యపరిషత్ప్రథమమహాసభాధ్యక్షోపన్యాసంలో! ఇక్కడ ఒక్క లోపం జరిగి ఆయనకే అపకారమైంది. అందరి సంగతి చక్కగా చెప్పాడు కాని తన సంగతి సాకల్యమూ చెప్పుకోడానికి వెనుదీశాడు. సభాధ్యక్షపదవి వల్ల ఆయన కొచ్చిన నష్టమిది! ఏతద్గ్రంథరచనలో ఆయన ఉపన్యాసం నాకు చాలా సహకారమైంది. అందుకాయనకు నావందనాలు!

ప్రచురణమూ, అవిచ్ఛిన్నంగా సాగిస్తే చాలునని నాకు తోస్తుంది! ఇంకా పరిషత్తుకు సర్వదేశావలంబనమేగాక, సర్వరాజావలంబనం కూడా కలిగి, ఆర్థికబలం చేకూరి, అధికారంతో మాట్లాడగల శక్తి రావాలె! "బాలనాయకం బహునాయకం" మాటుందేమో అని నవ్య సాహిత్య ప్రియులకు కొందరికి భయమేస్తున్నది. ఇంకా పండితులకూ కవులకూ విమర్శనం చూడగానే "అగ్గిగోవడ"మనేది నశించాలె! "శేషం కోపేణ పూరయేత్" పద్ధతి యింకా అమలులోనే వుంది.

హైద్రాబాదులో "లక్ష్మణరాయ పరిశోధకమండల"ని వకటి స్థాపించారు. ఆ మండలి కొన్ని శాసనాలు సేకరించిపెట్టి వానిని మారేమండ రామారావుగారిచేత పరిష్కరింపించి ప్రచురిం చారు. దానిలో శాసనపఠనంలో లోపముందనే వగైరా సంగతు లతో ప్రతికక్షులు చాలా విమర్శించారు. ఇందులో కాకతీయచాళు క్యాది శాసనా లున్నై. చాలా విలువగలవని నిశ్చయం. ఈ శాస నాలను తానుపయోగించానని వందానాలిచ్చాడు డాక్టరు యన్. వెంకటరమణయ్యగారు తన "విద్యానగర పట్టణ సామ్రాజ్యములు" అను గ్రంథంలో. ఇవి మరియొకవిద్వాంసుడిచేత పరిష్కరింపిస్తున్నారని వినికిడి. రామారావుగారు చాలా పరిశోధనచేసిన వ్యక్తి. ఆయన పరి శోధనం యిదివరలో కొంత మనం స్పృశించాం. ఆయన గద్వాల సంస్థానచరిత్రకూడా రచించాడు. గుంటూరులో హిందూ కళా శాలలో ఉపాధ్యాయుడుగా వున్నాడు. ఆదిరాజు వీరభద్రరావుగారు యీ పరిశోధకమండలి కార్యదర్శిగా చాలాప్రశంసించదగిన సేవచేస్తు న్నాడు. కొన్ని సంవత్సరాలకిందట యెవరో నిజాంరాష్ట్రంలో కవులు లేరన్నారని మాటపట్టింపుతో కవుల కాహ్వానాలు పంపి, పద్యాలు తెప్పించి, గోలకొండ పత్రికాధిపతులు, "గోలకొండ కవుల సంచిక" అనే పేరుతో వక గ్రంథం ప్రచురించారు. ఇందులో రకరకాల పద్య

కావ్యాలు ఉన్నై! గుణదోషవిచక్షణ పాఠకులకే వదులుతున్నాను.

హైద్రాబాదు నగరంలో సారస్వతప్రియులు కొందరు "ఆంధ్ర కథక మహాసభ" అనే పేరుతో ఒక సంస్థ ప్రారంభించారు. దాని ప్రథమసమావేశానికి "గిరి"గా రధ్యక్షత వహించారు. ఇప్పటికి మూడు సమావేశాలైనై. ఒకదాని కందులో సభాపతిగా రధ్యక్షత వహించారు. చాలా ఉదాత్తమైన ఉపన్యాసం దయచేశారు. సభాపతిగారిని "[illegible]"తో కొన్ని విషయాల్లో పోల్చవచ్చు. సంభాషణ చాలా ఉత్తేజకరంగానూ, హాస్యరస పూరితంగానూ, ఇతరులు యెక్కువగా మాట్లాడటానికి అవకాశం లేకుండానూ వుంటుంది. ఈ కథక మహాసభలో పాల్గొన్న కథకులను చూస్తే అంతా ప్రాంతీయులేగాని, "ఆంధ్ర" శబ్దం సార్థకం కావడంలేదని కనపడుతుంది. ఇది ఒక అఖిలాంధ్రసంస్థ అయితే యెక్కువ ప్రయోజనకారిగా ఉంటుంది.* కాని నవ్యసాహిత్యపరిషత్తులోనే దీనిని కలిపి అనవసరంగా ప్రత్యేకంగా ధనవ్యయం చెయ్యకపోవడం మంచిదని నేననుకుంటాను. ఇక్కడ పెద్ద యిబ్బంది ఒకటుంది. నవ్యసాహిత్యపరిషత్కార్యవర్గంవారు పద్యానికీ, గేయానికీ తత్సభలో యిచ్చే స్థానాన్ని యితరుల కియ్యడంలేదని కొందరనుకుంటున్నారు. అట్లా కాకుండా చేసి ఆ పరిషత్తును బలం కలదాన్నిగానూ, సాధికారసంస్థగానూ చేస్తే సమంజసంగా వుంటుంది. కొంతకాలంకిందట యేలూరులో బందా కనకలింగేశ్వరరావుగారు ఒక నాట్యపాఠశాల యేర్పరిచామనీ తమరూ యింకా ఆంధ్రదేశంలో నటకులూ, పండితులూ, శాస్త్రకట్టులో నాట్యమూ, నటనమూ నేర్పేటట్టు యేర్పాటుచేశామనీ ప్రకటించారు. ఆ సంస్థనుగూర్చి మళ్లీ వినడంలేదు. సినిమాడైరెక్టరులను దాటి శిక్షణాన్నిస్తామన్నా నటకులు యివతలికి వస్తారా? వాళ్లు

* ఈ ఉద్దేశాన్ని సభాపతిగారు సూచించారు. (భారతి. ప్రమాది-భాద్రపదము)

రానిస్తారా ? ఇంకా సినీమా నటులనైనా సూత్రాలు వేసేతామంటే గూడవల్లి త్యాగులు సహకారమిస్తారేమో ? చెన్నపట్నంలో ఆంధ్ర మహాసభను స్థాపించి బులుసువారు మొదలైనవారు అచ్చాంధ్ర అర వాంధ్ర సమ్మేళనంచేదామని ప్రయత్నిస్తున్నారు. ప్రయత్నం సఫల మగుగాక ! పూర్వం పండితులు కాశీకిపోయి వ్యాఖ్యానించేది రావటం పరమావధి ! ఇప్పుడు కవికి పట్నంపోయి రేడియో సంభాషణ యివ్వడం పరమావధి! వ్రాయసగాడికి భారతిలో ఒక వ్యాసం పడటం పరమావధి ! వక్తకు ఆంధ్రసభలో ఉపన్యాస మియ్యటం పరమావధి ! నటకుడికి సినీమాలో నటించటం పరమావధి ! కాబట్టి యివి పరమావధిని కల్పించే సంస్థలైనై ! ఇటీవల ఆంధ్రపత్రి కలో మళ్ళీ "నాట్యకళ" పత్రికను బలపరిచి కళాదోహదంకోసం ప్రయత్నాలు జరుగుతున్నట్లూ, సలహాసంఘంగా యావదాంధ్రదేశం నించీ వకసంఘాన్ని యేర్పాటుచేసినట్లూ, చదివాను. ఏంగచిహ్నమేం కనపడటంలేదు. తోచినముక్క చెప్పినందుకు క్షమించాలి ! సినిమా దినాల్లో నాటకకళకోసం శ్రమపడేటంత పిచ్చి యెవక్కైనా వుందా ? కాని వదలిపెట్ట బుద్ధిపుట్టదు. ఇదీకూడా సహజప్రవృత్తి !

గానము *

త్యాగరాయలువారూ, క్షేత్రయ్యా, సారంగపాణీ, యీ యుగంలోనూ, వెనకటియుగంలో నారాయణతీర్థులు, (కృష్ణకర్ణామృత కారుడు !) మొదలైనవారూ ఆంధ్రులైనా, ఆంధ్రులకు సంగీతంలో ప్రావీణ్యం లేదనీ, కావేరీతీరమే దానికి స్థానమనీ, వింటే అరవలనోటే వినాలనీ, మొదలైన కొన్ని అభిప్రాయాలుండేవి. మనవాళ్ళు వివాహోద్యుత్సవకాలాల్లో దక్షిణదేశంనించీ సంగీత పాటకులను పిల్చి వందలు ఖర్చుపెట్టడం కలిగేది. ఆ విషయం యిప్పటికీ కొంతమట్టుకు జరుగుతూనేవుంది. ద్రావిడదేశంలో గొప్ప పాటకులున్నమాట

* సాహిత్య సంగీతాలు పరస్పరాశ్రయాలు కాబట్టి యిదికూడా నాకు ప్రస్తుతమైంది.

నిజమే! శ్రీనాథుడు తెనుగుభాషను "కర్ణాటభాష" అన్నాడు. సంగీతాన్నికూడా "కర్ణాటసంగీతం" అంటారు. కాబట్టి అదీకూడా సాజాత్యంచేత ఆంధ్రులదే అయి వుండాలె! ఇది పరిశోధకులకు వదిలేస్తున్నాను. "ఆ ఉరవలభాగే మనవాళ్ళకు రాదయ్యా" అనేవాళ్ళు యిప్పటికీ ఉన్నారు. రేడియో సంగీతమంతా చెన్నపట్నంనుంచో, తిరుచినాపల్లినుంచో వస్తున్నది. ఆంధ్రదేశంలో వక్క రేడియోస్థానంకూడా లేదు. మనవాళ్ళుకూడా అక్కడికేపోయి వారిని మెప్పించి పాడాలసొస్తున్నది. సంగీతంలో రంజకత్వం, విద్య తెలియడం, పాడేశక్తి వుండడం! ఇవి వచన సాహిత్యంలో వుండే కవిత్వవిమర్శన శక్తుల్లాంటివి! అన్యోన్యాశ్రయాలో అన్యోన్యస్వభావాలో! ఇప్పుడు పట్నంలో సంగీతపరిషత్తు జరుగుతూవున్నది. అందులో పాల్గొనేవాళ్ళల్లో తంజావూరివాసులు సుందరంఅయ్యరు సుబ్రహ్మణ్యశాస్త్రిగార్లున్నారు. ఈ గ్రామవాసులే వృత్తి విరమించిన ప్లీడరు నటేశయ్యరుండేవారు. వీరు సంగీత విద్యలో చాలా పరిశోధన చేశారు. విద్వాంసులు. ఎన్ని విషయాలు చర్చించగలరోగాని పాడమంటే పాడలేరు! కాని ఇప్పుడు గొప్పపాటకులనబడే వాళ్ళు సాధన చేసి పాడుతున్నారేగాని వాళ్ళలో కొందరు యిదేమిటంటే చెప్పలేరు. అట్టి రెండు శక్తులూ సమ్మిళితంగా వున్నవాళ్ళు దక్షిణాన యెక్కడాకూడా చాలా తక్కువమంది వున్నారు. దక్షిణదేశాన్ని స్పృశిస్తే, సంగీత త్రిమూర్తుల్లో యిద్దరు ఆంధ్రులు; త్యాగరాయ శ్యామశాస్త్రిగార్లు. దీక్షితులవారి కృతులన్నీ సంస్కృతంలో వుండడమే గాకుండా వేదాంతాంశాలు నిండుకొన్నై! అంతకు పూర్వయుగంలో అసలు సంగీతసుధా, చతుర్దండిప్రకాశిక మొదలైన గ్రంథాలు రచించిన, గోవిందదీక్షితులు ఆయన కుమారుడు వెంకటముఖి మొదలైనవాళ్లు కర్ణాటకులు అంటే ఆంధ్రులు. పురందరదాసు కర్ణాటకుడు. సంగీత గ్రంథాలు చాలా తెనుగులవున్నై.

గ్రంథాలను వదలితే కర్నాటక సంగీతానికి సంబంధించిన "సంగీత సంప్రదాయ ప్రదర్శనీ" త్యాదులన్నీ తెనుగులోనే వున్నాయి! పాటకు లందరూ తెనుగు కృతులే ముఖ్యంగా పాడతారు. సంగీతానికి పోషణమిచ్చిన, మధుర, తంజావూరు, ఎట్టయాపురం మొదలైన దేశ ప్రభువులంతా తెనుగువారే. శృతులను కదపనక్కర్లేకుండా అవ్వేతీగలమీద అన్ని మేళలూ వాయించే సమస్థితి గల యిప్పటి వీణను కనిపెట్టినవాడు తంజావూరు రఘునాథరాయలు. అందుకనే దానికి "రఘునాథమేళ" అనే పేరు వచ్చింది! ఇట్టి స్థితిలో సంగీతం అరవవారి సొమ్మనడం చాలా ఆశ్చర్యకరం! ఇదీకాకుండా తెనుగు ద్రావిడ భాషనే వాదంలాంటిదనీ, పరిశోధన చెయ్యదగినదనీ నా మనవి!*

శాస్త్రచర్చలోకి దిగడం నా ఉద్దేశ్యం కాదు. ఈ 50 సంవత్స రాలుగా సంగీతానికి చాలా దోహదం కలిగింది మనదేశంలో. ఆవెనకసంగతి నాకు తెలియదు గాని యీదేశంలో సంగీతవ్యాపకా నికి మూలపురుషులు యిద్దరని నామతం. పెదకళ్లేపల్లి గ్రామవాస్తవ్యు లైన సుసర్ల దక్షిణామూర్తిగారున్నూ, బందరు వాస్తవ్యులైన జంగం కోటయ్యగారున్నూ, ఆదిపురుషులు. వీరిద్దరి పరిచయ్యం నా చిన్నితనం. దక్షిణామూర్తిశాస్త్రిగారు సంపన్నగృహస్థు. సంగీత శాస్త్రవేత్తంటే ఆంధ్రదేశానికి ఆయనే నమ్మ! ఆయన స్వతంగా పాడటంలో అంత సమర్థుడు గాకపోయినా సంగీతశాస్త్ర పారంగ తుడు. ఆయన శిష్యగణం తిరుపతి వెంకటేశ్వరుల శిష్యగణమల్లే దేశమంతటా వ్యాపించి ఉంది. ఆయన యిప్పుడాక ప్రత్యేకసంస్థ

---

* అరవదేశ సంగీత విద్వాంసులు తెనుగు కీర్తనలు పాడవద్దని పక్క ఆందోళన బయలుదేరింది. చిదంబరంలో సర్ ముత్తయ్యచెట్టి మొదలైన అరవవారు చాలా హాగా డంబరం చూపారీ చర్చలో. ఇది ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణోత్సాహానికి ప్రత్యుత్తా హరంగా కనబడుతున్నది. క్షేత్రయ్య, త్యాగరాజు మొదలగు మహామహులు పాడిన తెనుగుభాషకి ఉద్యమమెంత మాత్రం వర్తించదని నాఊహ!

అయిపోయినాము. వారిపేర బందరులో ప్రతిసంవత్సరమూ ఉత్స వాలు జరుగుతై. వెనకటి తరంలో దక్షిణదేశం పోయి సంగీతపాట పాడి వాళ్ళకు గుండెల్లో భయం కలగచేసిన, పొన్నూరు వాస్తవ్యుడు రామసుబ్బయ్యగారీయన శిష్యుడు. ఇప్పుడు బెజవాడ వాస్తవ్యుడైన పారుపల్లి రామకృష్ణయ్యగారీయన శిష్యుడు. రామకృష్ణయ్యగారి నెనర గని ఆంధ్రుడుండడని నా ఆశయం. శాస్త్రిగారు కేవలం గాత్రపాటే గాకుండా నాగస్వరం, మృదంగం, యింకా యితర జంత్రాదుల్లోకూడా శిక్షనిచ్చేవారు. వీరి పుత్రులు నాగేశ్వరశాస్త్రిగారు సంగీతవిద్వాం సుడు. వేణుగానంలో ప్రావీణ్యాన్ని పొందిన గంగాధరశాస్త్రిగా రీయన పితృవ్యపుత్రుడు. పాప మీయనకు హృద్రోగ మవడంచేత పాడవద్దని వైద్యులు సలహాయిచ్చారు. బందరుప్రాంతంలో కోటయ్య గారు కూడా చాలామంది శిష్యగణాన్ని యేర్పరచుకున్నాడు. వెన కటి తరంలో ధేనువకొండ చిన్నయ్యగారుకూడా అనేక శిష్యగణం కలిగిన గొప్ప విద్వాంసుడు. వీరేగాక వెనకటితరంలో స్వరకల్పనలో వకరూ, పల్లవిజ్ఞానములో వకరూ, యీ విధంగా ప్రావీణ్యం సంపా దించిన వారున్నారు. పాపట్ల కాంతయ్యగారు అనేక కృతులనూ, గీతాలనూ, రచించిన వ్యక్తి. గొప్ప విద్వాంసుడు. ఇప్పుడున్నవా ళ్ళల్లో వెనక ఉల్లేఖించిన పారుపల్లివారుగాక హరినాగభూషణంగారు వారణాసి బ్రహ్మయ్యగారు వింజమూరి వెంకటలక్ష్మీనృసింహా చార్యులవారూ, పెద్దరకంలో వాళ్ళు.* నాగభూషణంగారు నిజమైన వాగ్గేయ కారకుడు. బరోడా మైసూరు మొదలైన సంస్థానాల్లో మన్ననలనుపొంది ఆంధ్రులకు కీర్తితెచ్చిన వ్యక్తి. ఈన గాయకుడే కాకుండా సంస్కృతాంధ్రాల్లో నిష్ణాతుడు. పరమభక్తుడు. ఈనసంగీతం

* జంత్రంకూడా యీనకు సాధనమే!

భక్తికి మాత్రమే మార్గంచేసుకున్న పవిత్రుడు.♦ ఒక్క జావళీకూడా యెన్నడూ పాడడు. త్యాగరాయజీవితాన్ని హరికథారూపంగా రచించి ప్రతివత్సరం త్యాగబ్రహ్మోత్సవాల్లో తానుస్వయంగా దాన్ని తన ముఖానే చెబుతూవుంటాడు. గొప్ప సనాతనవాది. తద్వ్యాప్తి కోసం తన పాండిత్యాన్నంతా ధారబోసిన వ్యక్తి. బందరులో నాగేశ్వరస్వామిగుళ్లో సాయంత్రం తరుచు పురాణం చెప్పడముంది. భారతీత్యాది పత్రికల్లో అప్పుడప్పుడూ వారి రచనలను చూస్తూవుంటాం. ఈన సర్వతోముఖ శక్తులు గల అద్భుతుడు.* ఆంధ్రదేశాని కమూల్యాలంకారమని చెప్పదగ్గవాడు. బ్రహ్మయ్యగారుకూడా చాలా శిష్యకోటి కలవాడు. వింజమూరివారు చాలా సంగీత విద్వాంసుడు. ఆయన త్యాగరాయుల జీవితచరిత్రరాశి అనేక విషయాలు చర్చించిన పండితుడు. కాని త్యాగయ్యగారిని విశిష్టాద్వైతిని చెయ్యడానికి చాలా శ్రమపడ్డాడు. త్యాగయ్యగారికి చాలా అపకీర్తొచ్చింది. అరవవారు "త్యాగయ్యర్ వాళ్ యెన్నశొన్నారో తెరియుమా" అని ప్రారంభించి హరికథలద్వారా ఆయన్ను "అయ్యర్"నూ చేశారు. అ[illegible]గే

---

♦ "ఇప్పుడు గాయకులలో (గానమును) వినువారిలో పెక్కుమంది గానమును స్రక్చందనవనితాదిభోగములవలె కొంతకాల మానందమిచ్చు కళగా పరిగణించుచున్నారేగాని, సంగీతము చంచలమైన మనసునను గల వ్యాకులతను పోగొట్టి, నిశ్చలముగా నొనర్చి, పరమాత్మసాన్నిధ్యమునను చేర్చు నాదోపాసన యని తలచువారు చాల తక్కువ. గానవిద్యను నాదోపాసనగా గ్రహించి తరించదలచినవారిలో శ్రీ నాగభూషణంగా రగ్రగణ్యులని చెప్పక తప్పదు........(ఈన) దేశభాషయగు తెనుగు దేవభాషయగు సంస్కృతము, వ్యవహారభాష ఆంగ్లము, యీ మూటిలో పూర్తి పాండిత్యము కలవారు........అనర్గళమైన కవిత్వము చెప్పగలవారు."

(18-10-40 ఆంధ్రపత్రికలో, సుబ్రహ్మణ్యభాగవతులు)

ఈనకు యిప్పుడు దృష్టి కొంచెం తగ్గినట్టున్నూ, పక్షవాతం తగిలినట్టున్నూ వినికిడి. ఈనను బహూకరించవలెనని బందరువాసు లొక సంఘం స్థాపించి 1942 సంవత్సరం మార్చిమాసాంతంలో యీనకు గొప్ప సత్కారం చేస్తున్నారు. ఈన సర్వతోముఖప్రజ్ఞ మిక్కిలిప్రశంసనీయం. పెద్దల ఆశీర్వచనం ఫలించి శతాయుర్వైవర్ధిల్లాలని కోరుతున్నాను.

వింజమూరివారివంటివారు ఆయన్ను వైష్ణవుణ్ణి చేయ దలిచారు. త్యాగయ్యగారు ఆంధ్రుడు, భక్తుడు. మన సొత్తైనప్పటికీ ప్రపంచానికి మనం ఆయ న్నిచ్చేశాం! ఈనగాక యిప్పుడున్న వాళ్ళల్లో నారుమంచి, బలిజేపల్లి సీతారామయ్యగార్లూ, పురాణం కనకయ్యగారూ, పిరాట్ల శివరామయ్యగారూ, తత్సోదరుడు శంకరయ్యగారూ, తాడిగడప శేషయ్యగారూ, పర్వతనేని వీరయ్య చౌదరిగారూ, కంభంపాటి సత్యనారాయణగారూ, వెంకటేశ్వరశాస్త్రిగారూ, మొదలైనవాళ్లు చాలామంది వున్నారు. స్త్రీలల్లో బెంగుళూరు నాగరత్నం, మొదలైనవాళ్లింకా కొందరు చక్కగా యెంత సభలనైనా ఆనందింప జేయగల్గిన వాళ్లున్నారు. పుచ్చా సుబ్రహ్మణ్యశాస్త్రిగారిటీవల నారాయణ తీర్థాశ్రమమనిపెట్టి సరియైన సంగీతాన్ని వ్యాప్తం చెయ్యడానికి పాటుపడుతున్నాడు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి సంగీత విద్యనుగూర్చి వెనకనే ముచ్చటించాను.

ఇక జంత్రం సంగతి ఆలోచిస్తే యిక్కడా గొప్పపేర్లే ఉన్నై! వెనకటి తరంలో సంగమేశ్వర శాస్త్రి వెంకటరమణదాసుగార్లు వీణలో గొప్ప విద్వాంసులు. 1907 సంవత్సరంలో బందరులో వడ్లమన్నాటివారింట్లో వివాహానికి సంగమేశ్వరశాస్త్రిగారిని పిలిపించారు. బెంగుళూరు నాగరత్నంగారు కూడా వచ్చిందప్పుడు. సంగమేశ్వర శాస్త్రిగారి వీణ వాయిస్తూంటే పరవశై పోయింది ఆమె! ఇది నేను కళ్లారాచూశాను. ఈ ప్రకారమే యిప్పుడుకూడా వీణలో అచ్యుతరామశాస్త్రి, శివానందశాస్త్రి, మేడూరి నరసింహారావుగారు మొదలైనవాళ్లు చాలా సరసంగా ఆనందింప చేయగలవాళ్ళున్నారు. ఫిడేలుదగ్గిరికొస్తే హరినాగభూషణంగారినీ ద్వారం వెంకటస్వామి నాయుడుగారినీ మొదట చెప్పక తప్పదు. ఇద్దరూ ఇద్దరే! ఇంకా చల్లపల్లి పంచనాదం మొదలైనవారు చాలామంది వున్నారు. మార్దంగికులకుకూడా లోటులేదాంధ్ర

దేశంలో. అశ్వత్థాటి రామమూర్తిగారి మృదంగవాద్యం తప్పక వారి యింటిపేరుకు సమానంగానే వుండేది! వారణాసి ఘంటయ్య, అకిరి పల్లి ఘంటాలు, రత్నం మొదలైన వాళ్ళనేకమంది ఉన్నారు. పొట్లూరి వీరరాఘవయ్యచౌదరిగారు కంజీరాలో చాలా ప్రవీణుడు. ఈ విధంగా యిప్పుడు గానం చాలా ప్రచారంగా వుంది.

భరతనాట్యం :

ఇటీవల భరతనాట్యానికి చాలా గౌరవం కలిగి అది అంత ర్జాతీయమై పోయింది. ఈ కళలో అనాదిగా మన ఆంధ్రదేశం గొప్ప ప్రసిద్ధి కెక్కింది. కూచిపూడి భాగవతుల ప్రసిద్ధి నల్దిక్కులా వ్యాపించి ఉంది. వీళ్లు భామవేషం వేశి ఆడే నాట్య మప్రతిమానం. భరతముని నిర్దేశించిన మార్గ మిదేనని అందరూ వొప్పుకున్నదే! మన దేశాన్నించీ దక్షిణదేశానికి అనేకవలసలు వెళ్లారు మన ఆంధ్రులు. వాళ్ళు వెళ్లేటప్పుడు ఏరాజుతోనో దండయాత్ర వెళ్ళారు. అప్పుడు వాళ్లతో నటగాయకులుకూడా వెళ్ళారని, యిప్పుడు దక్షిణదేశంలో ఉన్న నటసంఘమే తార్కాణం. తంజావూరుప్రాంతంలో భామ వేషంకట్టేవాళ్లు, అష్టపదులు మొదలైనవి యథాశాస్త్రంగా నాట్యం ద్వారా ప్రదర్శనం చేశేవాళ్లు, స్త్రీలు చాలమంది ఉన్నారు. ఇప్ప టికి తంజావూరుజిల్లాలో కూచిపూడివారి బంధువు లున్నారు. బ్రహ్మోత్సవసందర్భంలో నాటకా (కొరవంజి మొదలైనవి) లాడి నందుకు వారికి మాన్యా లిచ్చారు వెనకటిరాజులు. ఇప్పటికీ వాటి ననుభవిస్తున్నారు. కూచిపూడిలో వెనకతరంలో వెంపటి వెంకట నారాయణ, చింతా వెంకటనారాయణ అనే యిద్దరి అధిపత్యాన రెండు మేళా లుండేవి. ఎక్కడ గొప్ప ఉత్సవాలు, పెద్ద యింటి కార్యాలు అయినా వీరిని రావించి ఆటలాడించేవాళ్లు. వాళ్లు కొంత నాటకఫక్కీకూడా నేర్చి నటించారు. ఈమధ్య దీనికి ఆదరణ

తక్కువైనా మళ్ళీ యిటీవల చాలా హెచ్చింది.* ఇప్పుడు కొంద రక్కడనించీ బయలుదేరి యితరప్రాంతాలకూడా వెళ్ళి నేర్చుకొని వచ్చినవారున్నారు. పెరటిచెట్టు మందుకు రాదన్నట్టు మన కూచి పూడివారి నాట్యకౌశలాన్ని ఇతరులు చెప్పినతర్వాత మనం తెలుసుకున్నాం. ఇప్పుడు కూచిపూడివారే గాక అక్కడక్కడా మన దేశంలో నాట్యం నేర్చినవాళ్ళు నేర్చుకుంటున్నవాళ్ళు చాలామంది ఉన్నారు.♦ హైదరాబాదులో సుమాణం సత్యనారాయణగా రని వక యువకుడు చక్కగా శివతాండవాది నాట్యభంగిమలు చూపి ఆనందింప జెయ్యగలవాడున్నాడు. తాండవకృష్ణ, వి. వి. శర్మలతో కలిసి కొన్ని ప్రదర్శనాల్లో పాల్గొన్నాడు. చాలా ప్రోత్సాహానికి తగినవాడు. ఏలేశ్వరపు రామాంజనేయు లనే ఆయన "బాలగోపాల" తరంగాన్ని సప్తతాళాల్లో షట్కాలాల్లో నాట్యం చేయగల సమర్థతగల మహామహుడు. మనిషి యెంత బలహీనంగా కనపడతాడో సమయానికంత బలంవస్తుంది. గొప్ప భక్తుడు. తెల్లవారేసరి కింకా నాట్యంచేయ్యాలనుం దుంటుంది. గొప్ప మేధావి. సహజపాండితి యిది యీనకు. అద్భుత వ్యక్తి. శిష్ట్లా పూర్ణయ్య అనే

* ఉదయశంకరుడు, మేనక, గోపీనాథ్ మొదలైనవాళ్ళకీ భామకలాపం చాలా పాఠాలు నేర్పింది. కథాకాలీకూడా దానికి తోడైంది. ఇప్పుడీ ఫక్కీని మనవాళ్ళు కొందరు పునరుద్ధరించటానికి గట్టిగా ప్రయత్నిస్తునారు. తాండవకృష్ణ, యం. ఏ., వేదాంతం లక్ష్మినారాయణగారివద్ద తర్ఫీదై తానితరత్రా నేర్చినదాన్ని, మనదాన్ని సమ్మిళనంచేసి ప్రదర్శనా లిస్తున్నాడు. 1942 సంవత్సరంలో ఉదయశంకర్ హైదరాబాదు వచ్చినప్పుడు కూచిపూడి వేదాంతం లక్ష్మినారాయణగారు వృద్ధులయ్యు ఆయన కోరికపైన భామాకలాపం ప్రదర్శించాడు. ఉదయశంకర్ నిర్విణ్ణుడై తుదకు వచ్చి ఆయనకు సాష్టాంగప్రణామం చేసి ఆయనను "అల్మోరా" రమ్మని ఆహ్వానం చేశాడు.

♦ "బి. వి. నరసింహారావు మొదలైనవాళ్ళు, దేవులపల్లి బసవరాజు నండూర్ల పాటలుపాడి నవ్యసాహిత్యాన్ని విస్తరింపజేస్తున్నారు." (విశ్వనాథ)

ఆయన నారాయణతీర్థులవారి తరంగాలు పాడి, భావానుగుణంగా నాట్యంచెయ్యడంలో చాలా సమర్థుడు. ఈ విధంగా గొప్ప కళా వేత్తలు దేశంనిండా వున్నారు. వాళ్లకు ఆదరణ చాలా తక్కువగా ఉంది. దేశం వాళ్లను ఆదరించాలశిన బాధ్యత కలిగివుంది.

హరికథలు :

ఈ వీధి మన సొమ్ము. ఈ వీధి పేరు తల్చుకునేటప్పటికి ఆదిభట్ల నారాయణదాసుగారు మనస్సుకు గోచరమౌతాడు. భావ, రాగ, తాళ సహితంగా హరికథలుచెప్పి మధురభావం శ్రోతల చిత్తవృత్తుల్లో కలగ జేయడంలో యీన అప్రతిమానుడు. ఈన గొప్ప పండితుడు. కేవల సంస్కృతాంధ్రాల్లోనేగాక గ్రీకులాటినులు, అరబ్బీ ఫారసీ భాషలు కూడా యీనకు వశాలు. ఫారసీలోనించీ "ఓమారు ఖయ్యాము"ను పరివర్తనం చేశాడు సంస్కృతాంధ్రాల్లోకీయన. గొప్పకవి. ఆంధ్ర దేశంలో హరికథావీధి యీన భిక్షమే. పెద్దవాడైనాడు. అయినా గజ్జ కట్టాడా అంటే అడ్డులేదు. ఈన గొప్పదనం యెటువంటిది అంటే యీన శిష్యులీనకి పాదసేవచేస్తూ వుంటారు. కాళ్ళు పిసుకు తారు. మాలిసు చేస్తారు. తలంటిపోస్తారు, ఏంచెయ్యమంటే అది చేస్తారు. అటువంటి శుశ్రూష చేసి సంపాదించారు కాబట్టే వారి విద్య రాణిస్తున్నది. ఈన శిష్యగణమూ ప్రశిష్యగణమే యిప్పుడున్న ఆంధ్రదేశంలోని హరికథకులంతా! ఆంధ్రదేశంలో పేరెన్నికగన్న బాలాజీదాసు, వాజిపేయాజుల సుబ్బయ్య భాగవతులు, నేతి లక్ష్మీ నారాయణ భాగవతులు మొదలైనవాళ్ళంతా వీరి శిష్యకోటే! తుదకు హైదరాబాదావచ్చి అక్కడ హరికథలు చెప్పిన బాలబ్రహ్మా నందదాసుకూడా యీన శిష్యుడేనని వినికిడి. వీరేగాక యితరులు కూడా వున్నారు. చిట్టా పురుషోత్తమదాసు భక్తి పరవశుడై హరి కథలను చెప్పగా నేను విన్నాను. నేనుకూడా పరవశుడనైనాను. ఆయన కంఠమూ, ఆకారమూ, చెప్పే పద్ధతీ, సంగీతమూ, అన్నీ

కూడా భక్తిరసానికి చాలా అనుకూలంగా వుంటై. ఈన నాకు బంధువనీ, సహాధ్యాయుడనీ గర్వపడుతున్నాను.*

చిత్రలేఖనం వగైరా :

ఇదివరలో కవ్వురౌ సోదరులు, తలిశెట్టి, దామెర్ల, అడివి మొదలైనవాళ్ళనుగూర్చి అక్కడక్కడ మనవిచేశాను. ఈ మార్గంలో కూడా చాలామంది సాధకులు ఉన్నారు. చావలి నాగేశ్వరశాస్త్రి మొదలైనవారు రూపరచనలో చాలా శక్తిగలవాళ్ళు. ఈ చావలి బాంగాలయిలో ఆంధ్ర చిత్రశాలనే పేరుతో మహాత్మా గాంధి, శ్రీనివాసశాస్త్రి, విశ్వదాత మొదలైనవాళ్ళ చిత్రాలు చిత్రించి లండన్ టైమ్సుపత్రిక మొదలైనవాళ్ళ దగ్గర్నుంచీ పొగడ్తలు పొందాడు. ఈన దేశభక్తుల చిత్రాలను చిత్రించి దేశసేవచేసి ఆంధ్రదేశంలో దేశాభిమానాన్ని పురికొల్పాడు. ప్రకృతిచిత్రరచనలో యీనకి సమానుడు లేడు. ఈనేగాక ఇంకా హైద్రా

---

* నారాయణదాసుగారి విషయమై యొక నవ్యకవికుమారుడు అతిలి సూర్యనారాయణమూర్తిగారు యీ క్రిందివిధంగా కీర్తించాడు.

| | |
|---|---|
| "పల్కు తేనెలు జిల్కు | కాళ్ళగజ్జెలమోత |
| పద్మజాని రాణివిర ! | కంపించె కులగిరులు |
| కవిత వేదవ్యాసు | సంగీతవిద్యలో |
| గంభీర వాక్కురా ! | చక్రవర్తివి నీవు |
| ఆనదక లాస్యగ్నే | మహతీ విపంచికా |
| మా నాట్యగతులలో | మహనీయరూపమవు |
| కరగించు లాస్యాల | నప్రతిశరత్తుతే |
| భరతముని ఆడెరా ! | లిప్తలై నడిచెరా ! |
| శంభోపదమ్ములో | వాగ్గేయ కారకా ! |
| అంభోధి అరచెరా ! | ప్రజ్ఞాదురంధరా !" |

ఒక్క "కులగిరికంప" మనే భీభత్సం తప్ప చాలా చక్కగా వుందీ గీతం !

బాదులో కందాళ సత్యనారాయణ, దశిగ సుబ్బరాయశర్మ మొద లైనవాళ్లు ఊహాచిత్రాల్లోనూ, నఖచిత్రాల్లోనూ, పటచిత్రా ల్లోనూ సాధకులు చాలామంది ఉన్నారు. వీరికందరికి సహాయంచేసి వారి కళనించీ సంపూర్ణ ప్రతిఫలం పొందడం దేశంయొక్క కర్త వ్యం. ఈ కళకు భారతి, గృహలక్ష్మి మొదలైన పత్రికలు చాలా ప్రోత్సాహమిచ్చినై !

గ్రంథప్రచురణాన్ని గూర్చి ముచ్చటించవలసి వస్తే రెండు వ్యక్తులపేర్లు మరవదగినవి కావు. కాశీనాథుని నాగేశ్వరరావుగారు స్వర్గస్థులై నవ్యులయొక్కా, యితర గ్రంథకర్తలయొక్కా, దుఃఖానికి కారణమైనాడు. కవులు, గ్రంథకర్తలు ఆయనద్రవ్యం తిననివాళ్లు చాలా అరుదు. నే నాయనకు మిక్కిలి కృతజ్ఞుడను. నా తంజావూ రాంధ్రనాయకచరిత్ర ఆయన ప్రచురించకపోతే నా పుస్తకం బయటి కొచ్చేదేకాదని స్పష్టంగా చెప్పగలను. ఇప్పు డున్నవాళ్ళలో వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారి పేరు జగద్విదితం. ఎంతమంది యితరులు యెన్ని గ్రంథాలు ప్రచురించినా వీరు చేశిన పనిలో శతాంశం చేయ లేదు. తండ్రిగారు ప్రారంభించిన పనిని సహస్రధా అభివృద్ధి చేశాడు. సంస్కృతాంధ్రగ్రంథాలమాట యెత్తేటప్పటికి ఆయనపేరు జ్ఞప్తి కొస్తుంది. వేదాలదగ్గిర్నుంచీ సమస్తవిషయాలు వీరి ప్రకటనలోకి వచ్చినై. విషయవైవిధ్యం యెంచాలశొస్తే యీ గ్రంథ మింకా కొన్ని పుటలు పెరుగుతుంది. గ్రంథప్రచురణంలో నిర్దుష్టతా, సౌందర్య, విమర్శనలతో కూడిన పీఠికలు, గచ్చుట్టీకలు, మొదలైనవి అనంతంగా విశేషాలను చెప్పచ్చు. ఈనసేవకు దేశం "భాషోద్ధారక" బిరుదా న్నిచ్చింది. ఉన్నవారిలో దాని కింతకంటె తగినవాళ్లు లే రనటం సత్యం. ఆయన రెండు పత్రికలు పెట్టి దేశభాషాసేవలు చేశాడు. వాటిలో త్రిలింగచేస్తున్న సేవ అపారం. దానికి రజతో త్సవం జరిపి దేశం శాస్త్రిలవారికి "సమ్మానసంచికలు రెండు" బహు

మతిచ్చింది. అనేక గ్రంథకర్త లీయనపేరు చెప్పుకుంటూ వుంటారు. ఈన యిటీవల యే పట్నానికి పోయినా బ్రహ్మరథాలు పడుతు న్నారు. బొంబాయి కాకినాడలలో అఖండసన్మానాలు జరిగినై. మద్రాసులో యే తెలుగుద్యమమైనా యీన ముందుండినడపాలశిందే! 1937 సంవత్సరంలో చెన్నపట్నంలో జరిగిన ఆంధ్రమహాసభకు ఆహ్వానసంఘాధ్యక్షుడై రాష్ట్రోద్యమ సేవ చాలా యెక్కువగా చేశాడు. రాయలసీమకూడా రాష్ట్రంలో ఉండాలని చాలా విరివిగా ప్రచారం చేస్తున్నాడు. చాలాసమంజసం. ఆంధ్రరాష్ట్రానికి పట్నమే రాజధానిగా ఉండాలని యీన పట్టుదల. ఉండాలశిందే కూడాను. మెత్తని మాట. మెత్తని హృదయం. మనిషి నిగర్వి! భాషాసేవ అమోఘంగా చేస్తున్న పవిత్రజీవి! దీర్ఘాయుష్యమస్తు! 28—2—41 ఇండియన్ యెక్స్ప్రెస్ యీన్నిగూర్చి చాలా గొప్పగా రాశింది.

౽

# ఉపసంహారము

ఈ కాలంలో వివిధవీథుల్లో ఉత్పత్తైన ఉద్గ్రంథాలనుగూర్చి కొంచెం చెబుతాను. ప్రాచీనమార్గంలో మహా ప్రబంధాలూ, శతకాలూ, గద్యవేదాంతాది వివిధ విషయ గ్రంథాలూ అక్కడక్కడా బయలుదేరుతూనే ఉన్నై!* ఇక నవ్యసాహిత్యం సంగతియె

* వీటి అన్నింటిలో రాజశేఖర శతావధానిగారి 'రాణాప్రతాప చరిత్రము' మకుటాయమానము. కురుగంటి వెంకటరమణశాస్త్రి అనే పేరుగల యీ గ్రంథకర్త జ్యేష్ఠ సోదరుడు లలితోపాఖ్యానకథను, శతకందాలలో "లలితాశతకమ"నే పేరుతో రచించాడు. ఈన యింకా "భల్లాణ చరిత్ర" నే వక ప్రబంధంకూడా రాశాడు. ఈన తర్క వేదాంత శాస్త్రాల్లో నిష్ణాతుడు. మంత్ర శాస్త్రమందు పారంగతుడు. తన గురువర్యులగు జంధ్యాల దక్షిణామూర్తిశాస్త్రిగారి జీవితమును "దక్షిణామూర్తి విలాసము"నే పేరుతో 12 సర్గల సంస్కృతకావ్యాన్ని రచించాడు. ఇంకా తర్క

యెత్తుకుంటే ముఖ్యంగా కనపడేవి మనవిచేస్తాను. "యెంకిపాటలు" సాటిలేకుండా ఒక్కటే యేకాకిగా వెలుగుతున్నది. బాపిరాజు తన లలితకళాజ్ఞానంతో, శశికళ సహాయంతో, వివిధవీధీ సంచారం చేస్తూ నండూరుదగ్గిరికి రావడానికి ప్రయత్నిస్తున్నాడు. భగవంతుడు సహాయం చెయ్యాలని ఆశిస్తున్నాను. ఉన్న మహాకావ్యాల్లో "సౌందరనందం" చాలామట్టుకు సర్వాంగసుందరమై సత్యాహింసలను బోధిస్తూ ధర్మప్రబోధం చేస్తున్నది. అంతకంటె మహాకావ్యం పుట్టలేదు. * సుబ్బారావుగారి గ్రంథాల కన్నిటికీ మకుటాయ

---

మీమాంసలలో ప్రవేశక గ్రంథాలను రాశాడు. ఈ గ్రంథకర్త ఒతాతపానులు "సుబ్రహ్మణ్యామహాగ్నిచిత్" అను పేరుగల సంహిత ప్రకాంతుడు తరువాత సన్యసించి, "అద్వైతానంద తీర్థులను" పేరు గ్రహించి, అనేక వేదాంత గ్రంథాలను రచించారు. ఈ గ్రంథకర్తచే రచింపబడిన తంజావూరాంధ్ర రాజుల చరిత్రమనే గ్రంథంలో వారి వివరణం యిట్లావున్నది. "భాష్యంచ బ్రహ్మసూత్రాణాం తేషాంతాత్పర్యదీపికాం, భాష్యం పురుషసూక్తస్య తైత్తిరీయస్యభాష్యకం, గీతాతాత్పర్యదీపాదశ విరచ్య ప్రథితోభవత్" (విజ్ఞానసర్వస్వం. Vol. II.)

మత ప్రవక్తలు చాలామంది బయలుదేరారు. హరినామ బాబా, రాధాస్వామి మొదలైన వాళ్ళను మన దేశంలో శిష్యకోటి చాలా యేర్పడి ఆ మతాలచుట్టు కొంత వాఙ్మయం బయలుదేరింది. కాని దానిలోవున్న సాహిత్యగుణాలు యెన్నదగినవి కావు. కొన్ని భక్తిప్రధానమైన పాటలు యున్నవి నిజమే. అటువంటి పాటలను రాసిన వాళ్ళల్లో పూర్వ కాపురస్థుడు పెండ్యాల సీతారామయ్యగారు యెన్నదగినవున్నారు. ఈయన "బాబాపాటలు" అనే పేరుతో హరినామగీతాలను రచించారు. భావప్రధానంగా వుంటై. ఈయనశేఖరిని చక్కని రసవచ్ఛైలి సాగింప సమర్థమైంది. ఈయన "సుగుణకట్నము"ని వక చిన్న కావ్యం రచించాడు. మంగిపూడివారి మన్నన పొందింది కావ్యం. చక్కని చిన్న కథను పెంచి భావప్రధానంగా రచించాడు. పిల్లవాడి చేష్టలు, పేదతల్లియొక్క యిక్కట్టులు, గురుశిష్య సంబంధము, పరమేశ్వరుని భక్తప్రాణపరాయణత్వమూ చాలా రసవంతంగా చిత్రించాడీయన. ప్రతిపిల్లవాడు చదువవలసిన కావ్యమిది.

* కాటూరువారు రచించిన "పౌలస్త్యహృదయు" మని వక ఖండకావ్యం చాలా రమ్యంగా వుంది.

మానమై "రమ్యాలోకం" లక్ష్యలక్షణసమన్వయం చేస్తూ ఆయన కవిత్వసార్థక్యాన్ని చాటుతున్నది. కిన్నరసానినృత్యం "నిరస్తసదృశాంతరమై" విరాజిల్లుతున్నది. నవలలో "మాలపల్లి" "నారాయణరావు" "వేయిపడగలలో" తుదిదే ఉదాత్తతమమై ధర్మరక్షకు కంకణం కట్టుకొన్నది.• విశ్వనాథ "యేకవీర" తమిళంలోకి మార్చి రేడియో ప్రదర్శన జరిగిందట! చాలా మెప్పుపొందిందట! (ఆంధ్రపత్రిక 2—2—41) "రామాయణం" తయారౌతూ ఆదికావ్యానికి సమాన మాతానని తొంగి చూస్తున్నది. జాషువా కావ్యాలు క్షీరసాగరతరంగాలవలె రసపూరితాలై పాఠకులను ఆనందింపజేస్తున్నై! నాటకం దగ్గర కొచ్చేటప్పటికి నాకు నోటమాట రావటం లేదు. చింతావారి "శబరి", విశ్వనాథ "వేనరాజు", మొదలైనవి వున్నా, యివి ఇతర కావ్యాలవలె సహృదయులకుమాత్రమే ఆహ్లాదం కలగచేస్తున్నై! § కాని నాటకాలు కేవల సహృదయులకేగాక సామాన్యజనానికంతకూ ఉద్దేశితాలైతేనేగాని సార్థకాలుగావు. కాబట్టి పూర్వకాలంలో ప్రతాపరుద్రీయ, పాండవవిజయ, హరిశ్చంద్ర, బొబ్బిలి, కన్యాశుల్కాలను మించలేదనే చెప్పవచ్చు! నవ్య గద్య పద్య నాటకాలు అక్కడక్కడా ప్రదర్శిస్తూన్నా సామాజికులు వెనకటివాటికి పొందినట్లు రసానుభవం పొందడంలేదు. అంతేగాక యిప్పటి వ్రాతగాండ్ల నాటకాలను—ఏనాటకమైనా చూడండి—పరీక్షిస్తే సామాన్యజనానికి అవగాహనచేసుకోడానికి వీల్లేని వక క్లిష్టశైలితోనూ క్లిష్టసిద్ధాంతాలతోనూ వున్నట్టు కనపడుతై! వైశద్యం చాలా తక్కువ. వస్తువా! నాటకం కొంత జరిగితేగాని తెలియదు. రచనాక్లిష్టాన్వయ

• ఈన శతకకర్తగాకూడా ప్రశస్తి గడించాడు. (చూ. "మా స్వామి") మళ్ళీ "శేబుదొంగలు" అనే పేరుతో వక నవల రాస్తున్నాడు.

§ నర్తనశాల కొంతవరకు ప్రదర్శనయోగ్యంగానే కనపడుతుంది. అశోకం మొదలైనవి కొన్ని ప్రదర్శిస్తే బెబ్బులికూడా తగలచ్చు.

సమన్వితాం. [illegible] చెప్పదలచు కొన్ని సందేహ [illegible] కనపడతై గాని సహజాల్లో [illegible] శాస్త్రిగారి "హంస విజయం" యింకొక [illegible] రుచి యింకా వీళ్ళ నవ్యతను [illegible] కలిగి ఉండ లేదు ! కాని యీ నాటకాలు [illegible] కొంతమాత్ర మభ్యం తరం లేదు. సాహిత్యంగా చదివి ఆనందించదగినవిగా యిప్పటికి కనిపిస్తున్నై ! [illegible] పద్య రూపంగా వున్నా [illegible] సులభ [illegible] పామర జన హృదయంగమంగా వుంది, కొంతవరకు ప్రదర్శన యోగ్యాలుగా వున్నై !* కాని నాటకాలన్నీ కొంచెంచేటి చెంగాల్లోనే వొక్క వరసన గద్యమో పద్యమోగా వున్నై ! సామాన్య ప్రజారంజకంగా వుండాలంటే గద్య, పద్య, కీర్తనా వైవిధ్యం కలిగి, ప్రేక్షకులలో రసావిష్కరణం కలగజెయ్యాలె ! వొక్క ఉదాహరణం. పట్నంలో జరిగిన వొక నాట్యకళాపరిషత్తులో వేనరాజు ప్రదర్శనం ప్రారంభిం చారు. కొంచెంసేపయినతర్వాత ప్రేక్షకులు వొక్కమారు లేచి ఆపమని గోలెత్తారు. ఎంతచెప్పినా వినక ఆపకపోతే తమ ద్రవ్యాన్ని తిరిగి యివ్వవలసిందని నిర్బంధం చేశారు. నిర్వాహకులు వాళ్ళ టిక్కెట్లు వాళ్ళకు మళ్లీయిస్తే రాత్రివేళ సక్కుబాయి నాటకం చూచి ఆనం దించి వెళ్ళారు. "సక్కుబాయి" కీ "వేనరాజు" కీ సారస్వతవిలువలో హస్తిమశకాంతరముంది. కాని చెవిటివాడిముందు శంఖూదినట్లైంది. నాటకవిషయంలో యీ సంగతి గమనించవలసుంది.♦

---

* పద్మావతీ చరణచారణ చక్రవర్తి కొన్నిచోట్ల ప్రదర్శింపబడ్డదికూడాను.

♦ వేలూరి చంద్రశేఖరంగారి "కాంచనమాల"లో చాలావరకు రెండుపద్ధతులు, కలిశాయి. కొంతవరకు నాటకంలో నవ్యతా పురాతనత్వాలకూ పోటీవచ్చి, రసాస్వాదనం ద్వారా సహృదయప్రేక్షకులను ఆనందింపజేసే స్వభావం దీనికున్నది. నూతన మార్గంలో రచించిన నాటకాల్లో యిది చెప్పదగింది. సింగరి నాగేంద్రరావుగారు "తారాశ"

"పారడీ" కవిత్వమనే ఒక హాస్యరసపూరితమైన మార్గాన కొందరు కొంత పద్యసంతతి రచించారు. అంటే ఒకరి నుద్దేశించి వారి చేతలనూ, రాతలనూ హాస్యంగా చిత్రించడం. ఒకప్పుడు ఆంధ్ర రత్నం యిటువంటి మార్గంలో ప్రవీణుడని అనుకుంటూ వుండేవాళ్లు.

"ఆంధ్రపత్రికతోడి అమృతాంజనం బిచ్చి
తలనొప్పి బాపిన ధన్యుడెవడు"

మొదలైన వింకా అనేక ఆంధ్రుల రసనాగ్రాలలో నర్తిస్తూన్నై! ఇటువంటి పద్యాలు జ. రు. శాస్త్రి, మాధవపెద్ది బుచ్చిసుందరరామ శాస్త్రి మొదలైనవారు రాశారు. శ్రీశ్రీగారుకూడా కొన్ని రాశారు. ఆస్వాదకరంగానే వుంటై! తత్కాలానికి నవ్వుపుట్టిస్తై! కానియీవిధంగా యెక్కువదూరం వెళ్లితే వ్యక్తులకుకోపంరావచ్చు. ఎవరినుల్లేఖించి యివి రాయబడతయ్యో వాళ్ళకు కోపం రావటము సహజం. అందరికీ స్వవిషయాలను హాస్యభావంతో తీసుకోడం చాతవుతుందా?

కథానిక చాలా పెరిగింది. వెనక యింద్రగంటివారి లిస్టు నిచ్చాను. తర్వాత మళ్లీ అనేకమందిని చేర్చి సభాపతిగారు ఒక లిస్టు నిచ్చాడు. (భారతి, ప్రమాది భాద్రపదం). దానిలోనే యింద్రగంటివారికంటె కథానికా పరిమితీ, ఉపయోగార్హ భాష మొదలైనవాటిమీద కొన్ని సూచనల నిచ్చాడు. అతి నవ్యకథాని కను గూర్చి రాస్తూ యీన యిట్లా అన్నాడు. "ప్రస్తుత స్థితిలో కథాసాహిత్యములో కల్లోలము కనబడుతున్నది. భావసాంకర్యమూ రససాంకర్యమూ ప్రబలిపోయినవి. శిల్పము క్షీణతవైపు మొగ్గుచూపు తున్నది." ఈలోపం ఒక్క కథానికా సాహిత్యానికేగాక నవ్యసాహి

---

వలె ఒక నాటకం "వింధ్యరాణి" అని రాశాడు. దీన్లో గచ్ఛత్పద్యశైలి (Blank run-on-verse) లో రాశాడు. షేక్స్పియర్ నాటకాల్లో వలె ఒక దుష్టుడిపాత్రను సృష్టించారు. ఈ నాటకంలో డి. వి. సుబ్బారావుగారు పాత్రధరించి ప్రశస్తంగా నటించాడు. ఇదికూడా యెన్నతగిన నాటకమే!

త్యాని కంతకూ వర్తింపచెయ్యవచ్చును. కొడవటిగంటి కుటుంబరావు మొదలైనవారు ఇటీవల కొన్ని దినాలనించీ "గల్పిక" అనే పేరుతో చిన్న చిన్న కథానికలు రాస్తున్నారు. పూడిపెద్ది వెంకటరమణయ్యగారు "కాఫీతాగి కలంపట్టుకుంటే భోజనవేళకు పూర్తిఅయ్యేదిటకథానిక". ఈ "గల్పికలు" కాఫీతాగటం అయ్యేటప్పటికే పూర్తిచెయ్యవచ్చును. కథానిక ఆడవాళ్ళ ప్రాకులవలెనూ, మొగవాళ్ళ కోట్లవలెనూ దిన దినానికీ పొట్టిదౌతున్నది. ఇది కథానికస్థితి.

వ్యావహారిక భాషోద్యమం ప్రజాసామాన్యానికి విజ్ఞానం కలగ జెయ్యాలనే ఆదర్శంతో గిడుగు ప్రారంభించాడు. కాని యీ ఆద ర్శాన్ని యీ నవ్యవాఙ్మయం చాలామట్టుకు మరిచింది. గద్యం లోనూ పద్యంలోనూ కూడా సులభంగా అర్థంకాని క్లిష్టరచన వకటి అలవర్చు కున్నారీ నవ్యుల్లో చాలామంది* విశ్వనాథ గద్యం పద్యంకంటే వైశద్యం కలిగేవున్నా యింకా సులభంగా వుంటేగాని అందరికీ బాగా తెలియదు. ఇప్పుడు నవ్యులురాశే గద్యం కంటె సంస్కృతపదభూయిష్టమై, గ్రాంథికమని పేరుపొందినదే సులభ గ్రాహ్యంగా వున్నదని కొందరనడం నేను విన్నాను.♦ ఈవిషయంలో వీరు తగిన శ్రద్ధ తీసుకోవలెనని హెచ్చరిస్తున్నాను. ఆ పని చెయ్యక పోతే వకవేపున గిడుగువారికీ రెండోవేపున జనసామాన్యానికీ అప చారం చేశినవారౌతారని నా అభిప్రాయం. ఇప్పుడిప్పుడే నవ్య మార్గం అసలు దారే తొలిగిపోతున్న సూచనలు కనపడుతున్నై! ఒకవేళ ఆమార్గసాధకులు పెద్దలమాట వినక, తృతీయపంథలోకిఁ-నా రా, పెద్దవాళ్ళుకూడా, "దుర్యోధనుడిని దండించలేక అనుసరించిన ధృతరాష్ట్రుడివలె" చెయ్యవద్దని నాఁనునవి. బులుసు సాంబమూర్తి మొదలైనవాళ్లు ఆంధ్రులలో దేశాభిమానం పురికొల్పే రచనలు

* చింతా లాంటి కొందరున్నారు అట్లా కానివారు.

♦ చూ. పానుగంటివారి సమాసాలు.

యెక్కువగా లేవనీ అట్టివి కావలెననీ సభాముఖాల్లో అనేకమార్లు ఉపన్యసించారు. * ఈ విషయం దాదాపు అరణ్యరోదనంగా వుంది! యువకులకు ఖండకావ్యం, కథానిక, చాలా సులభసాధ్యాలుగా వున్నై! నిజంకూడాను. ఇతరాలంటే శ్రమపడాలె! చదవాలె! యువకులు పోనీ ఆంధ్రుల చరిత్రను తీసుకుని తమ నవలలు, కథలు, కావ్యాలు రచిస్తూ కొంతకాలం తమ ఆశానిరాశలనూ, ప్రణయాన్నీ, ఆటపాటలనూ, కట్టిపెడితే యిదివరలో దేశాభిమానం చూపలేదనే అపకీర్తి కొంత తొలగిపోతుంది. కొందరు నవ్యులు ఊరికే రాశామని అనిపించుకోడానికి యేదో రాశిపారెయ్యడం. బాగుండలేదు. వ్రాయసగాండ్లు కొంచెం చూచి రాయాలసిన ఆవశ్యకత ఉంది. రచనలో ఒక విధమైన శిల్పం ఉంటేనే గాని అది హృదయాహ్లాదిగా ఉండదు. వ్యావహారిక భాషని యేదిబడితే అది రాయడం, యేమాటలుబడితే అవి వాడడం, అవే మాటలను అనేకమార్లు వాడడం, యిటువంటి సంగతులు చదువరులను విముఖులను చేస్తై! వైశద్యం కావలసిన విషయాన్ని చెప్పడంలోకూడా ఉదాత్తత అవసరం. ఆగస్టు 1940 భారతిలో "సాహిత్యము-జీవితము" అనే 4 పేజీలవ్యాసంలో, "తాలూకు"అనే పరభాషా వ్యావహారికం 4 మార్లు ఉపయుక్తమైంది. "వెనకటి భారతి వలె యిప్పు డుండడంలేదు. వ్యాసాలు చాలా పేలవంగా ఉంటున్నై!" అనేమాటలు అనేకమంది నోళ్ళల్లోవిన్నాను. ఇది ఊరికే తప్పు చూపడానికన్నమాటకాదు. కవులవిషయంలో గ్రంథచౌర్యానికి గడగవద్దని ఆంధ్రపత్రిక గోలెత్తుతున్నది (ఆంధ్రపత్రిక 17-11-40). ఆంధ్రదేశంలో చాలా ప్రశస్తిపొందిన "అసంపూర్ణరామాయణా"న్నిగూర్చికూడా ఆ పత్రికలోనేవుంది.

* 1941 సంవత్సరం డిసెంబరు నెల్లో చెన్నపట్నంలో బ్రహ్మాండమైన ఆంధ్రోత్సవాలు జరిపి గొప్ప ప్రచారం చేశారు ఆంధ్రులు సాంబమూర్తిగారి సహాయంతో ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధిని ఒక్కమారు ఏకదేశంగా ప్రదర్శించి ఆంధ్రేతరులకళ్ళు మిరుమిట్లు గొలిపారు.

హేమాహేమీలు డీకొన్నారు. ఇంతా నాటకంలో అసంబద్ధవిషయ సమ్మేళనం తప్ప యేంలేదు. ఇంత అహామిక యెందుకో!

విశ్వదాతగారు స్థాపించి వదలిపోయిన విజ్ఞాన సర్వస్వం ఆగిపోవడం చాలా విషాదకరం. 2 వ సంపుటం తర్వాత మళ్ళీరాలేదు. ఇటీవల దేవిడి జమీందారుగారి అధిపత్యంకింద "ఆంధ్రవిజ్ఞానము"నే పేరుగల 7 సంపుటాలగ్రంథం వకటి తయారైంది. ఇది చాలాసంతోషవార్త. ఈ రాజాగారు తమపేరును చిరస్థాయిగా చేసుకున్నారు! వంగల శ్రీరామావధాన్లు "ప్రబంధభావ ప్రకాశిక"ని వక ప్రబంధ వివరణ గ్రంథం రచించాడు. అప్పుడప్పుడూ అందులో భాగాలు ఆంధ్రపత్రికలో పడుతున్నై! ఈన కొన్ని నవ్యసాహిత్య కృతులు "సహృదయకలశి" అనే పేరుకింద విమర్శిస్తున్నాడాంధ్రపత్రికలో. జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారి తర్వాత అటువంటి శైలితో తుల్యమైన శైలి నీయన అలవర్చుకున్నాడు. ఉద్ధరణ చిహ్నాలు 'Inverted commas' లెక్కకు మిక్కిలిగా వుంటై. మొత్తంమీద గాలి పోగుచేసుకోవలసి వస్తూంది. ఈన యీవిధంగా సభాపతిగారి కావ్యాలనూ, రాయప్రోలువారి కావ్యాలనూ, విమర్శించాడు. "రమ్యాలోక" విమర్శనం మాత్రం చాలా శబలంగా ఊగులాడుతున్నది. ఈయన అనుకున్నట్టు పూర్వలక్షణానుసారంగా గాని, నవ్యసాహిత్యాని కంతకూ అన్వయించేటట్టుగాని, రాయదలచలేదు రాయప్రోలు. ఆయన కొన్ని పూర్వాధునిక భాషా సాహిత్యసిద్ధాంతాలను తనకు తోచినట్టు సమన్వయించి, తన ఉద్దేశాల కుదాహరణాలుగా కవి ప్రకృతుల అన్యోన్యసంబంధాన్ని తెల్పుతూ వక లక్షణకావ్యం రాశాడు. దాన్ని మన దృష్టిదోషంతో పరీక్షించకూడదు. కవి హృదయాన్ని ప్రవేశించి పరీక్షించాలనుంది. సహృదయుడైన శ్రీరామావధానిగారీ సంగతి మరిచిపోయి ఏమేమో రాశాడు. "సూట్లు బూట్లువేసుకోడం" మొదలైన ప్రసంగాలు చాలా

సభ్యంగా వున్నై. ఇంకా పొగడటం తెగడటంలో కొంత తర్ఫీదు కావలె. విమర్శకుడు సర్వజ్ఞత్వం పూనడానికి వీలులేదు. అది పూనితే కవి హృదయప్రవేశం చేయలేడు. అది చేస్తేనేగాని సరియైన విమర్శనం అసంభవం. రమ్యాలోకంలో తుదిభాగం యీనకు అప్రస్తుతంగా కనపడ్డది. కవి ప్రకృతుల పరస్పర సానుభూతి, పరస్పర ప్రోద్బలం, అది కలగజేసే భావపరంపరా మొదలైనవి లక్ష్యరూపంగా యిచ్చినప్పుడు, యీన పుస్తక పూర్వభాగంలో కవి ఉల్లేఖించిన 'స్వానుభవ భాష్యాల" సంగతి మరిచిపోయినాడన్నమాట! విమర్శకుడి ఆర్డరుకు లోబడేదిగాదు కవిత!

నవ్యుల మార్గాలను నవ్యులే విమర్శిస్తూ ఉండడం, అందులో గుణదోషాలను చూసడమూ, ఇప్పటికి నవ్యకవిత చాలా సాగిందనీ, యిప్పుడు చేయవలసినది కావ్యసృష్టి కాక, విమర్శనమూ, నవ్యమార్గానుసారంగానూ, ప్రస్తుత భాషాకుమారులకు నవ్యసాహిత్యప్రీతి కల్గేటట్టూ, మన సారస్వతాన్ని విమర్శించడమూ, అవసరమని తోచడం చాలా సంతోషం. జ. రు. శాస్త్రి అంటున్నాడు "......కవులు తమ సృష్టిపరతను చంపుకునైనా (కావ్యప్రయోజనంకోసం) ఉన్న కావ్యసౌందర్యాలను తరచి, నీరూ, పాలూ వేరుచేసి, పాత కొత్తలను కలయికచేసి, మళ్ళీ ధ్వన్యాలోకరసగంగాధరాలను......తెనుగున రాశి ప్రరోచన చేయాలసిన పని మిగిలుంది.........సమరసభావాలను, సమాయత్తపరచే విమర్శకులే నేడు ఆంధ్రావనిలో కావలసివున్నారు. ముందుకు పరుగెత్తుకు పోయ్యే కవులకంటె. ఆంధ్రసాహిత్యపరుల్లోంచి కవులకంటె ముందుగా విమర్శకులే దూసుకురావలసిన అదనేమో ఇది". కాని యీన యిటీవల "చావలేక బ్రతుకుతు"న్నట్టు గోచరిస్తున్నది* నవ్యసాహిత్యం చాలా ప్రచారంలోకొచ్చింది. ఫాషనైపోయింది. ఈ కింది విధంగా వక యువకకవి "నవకవి"ని వర్ణించాడు.

* ఆంధ్రపత్రిక 16-12-40

'తెల్లని పంచా
సన్నని లాల్చీ
కంటికి స్పెక్ట్సూ
కాళ్ళకు షైకూస్
చేతిలో ఫైలూ
అమరకపోతే
నవకవి కాడూ.
నోట్లో ఖిల్లీ
చంకలో షెల్లీ
స్విస్సూ వాచీ
సిగరెట్ కేసూ
అలరకపోతే
నవకవి కాడూ.
కిన్నెరసాన్నీ
హృదయేశ్వరినీ
దీపావళినీ
కృషీవలుణ్ణీ
ఎరుగకపోతే
నవకవి కాడూ.
వైతాళికులూ
యెంకిపాటలూ
సౌందరనందం
రమ్యాలోకం
చదవకపోతే
నవకవి కాడూ.
కోయిలగూర్చీ
చంద్రునిగూర్చీ
ప్రేమనుగూర్చీ
ప్రేయసిగూర్చీ
వ్రాయకపోతే
నవకవి కాడూ.
చిత్రలేఖనం
గాత్రమార్దవం
నాట్యభంగిమం
శిల్పకౌశలం
భావపేశలం
తెలియకపోతే
నవకవి కాడూ."

ఇందులో ముఖ్యమైన నవ్యులందరినీ ఉల్లేఖించాడీ నవ్యుడు.

ప్రతిభ రానురానూ వెనకటి బిగువుతగ్గి పేలవమైపోతున్నదంటున్నారు. అతివాస్తవులకు స్థానం యెక్కువయిస్తున్నారంటున్నారు. అదే వెనకటి పత్రికలు చేసిన తప్పు. ఉన్న అన్నిరకాలకు స్థానమిస్తూ నవ్యత ప్రధానంగా చేసుకుని ప్రవర్తిస్తేనేగాని కేవల పక్షావలంబనం పతన హేతువ కావచ్చునని అనుమానం. ఈ అభిప్రాయం చాలామంది ప్రతిభ పాఠకులలో వున్నట్టు నాకు తెలుసు. నవ్యుల

రాతలమీద నవ్యులకే నిరాదరణ కలుగుతున్నదని ఈ కింది నవ్య గీతం తెలియజేస్తున్నది.

"నవ్యం, నవ్యం, నవ్యం అంటూ
బడబడలాడే
పదజాలంతో
లోకం కళ్ళూ
కప్పేస్తావ్,
వేడివేడిబల్
పెసరట్టంటూ
తీసిన అట్టే
తిరగేస్తావ్,"

"చోటుమార్చినా
ప్లేటుమార్చకా
ఒకటే వ్యాదర
ఒకటే వ్యాదర
పెట్టేస్తున్నావ్,
కొట్టేస్తున్నావ్,"

(ప్రతిభ సం.6 సం.1, 350)

మరోవేపునించీ మరివక తరంగం బయలుదేరే సూచనలు కనబడుతున్నై.

"మన దేశానికి పనికివచ్చే, లోకసంగ్రహానికి దారితీసి, ఆనందంలో ముంచివేయగల కావ్యాలను గురించి ఆలోచిద్దాం. నీతినియమాలు, భావాలు, సిద్ధాంతాలు, తత్వాలు మనదేశంలో యీ పరిస్థితుల్లో మధ్యతరగతికి అందుబాటులో వుండాలె. అప్పుడే అది యీ రోజుల్లో కవిత్వమౌతుంది. మనదేశంలో 'బూర్జువా' ప్రజాస్వామిక విప్లవం తీసుకురావాలె. ఇలా తెచ్చేవేళందుకు తోడ్పడే కావ్యాలు. ఈ విషయాన్ని (అతిక్రమించి) కేవలం కళ్ళుమూసుకొని పరులను అనుకరించటంవల్ల కించిత్తు ప్రయోజనంకూడా లేదు. ఇలాంటి విప్లవాలను లేవదీసే కావ్యాలనే ఆంధ్రలోకం ప్రపంచానికి సగర్వంగా చూపించుకోగలుగుతుంది."

(జి. వి. కృ. ఆంధ్రప్రభ 8-3-42)

ఇది వెనకటి అతినవ్యకవితా మార్గానికి తల్లకిందుమార్గం. "బూర్జువా"కూ ప్రజాస్వామికానికీ విరోధం. బూర్జువాలకు యిష్టంపు

నీచార్థ మొచ్చింది. కారణం మనకిక స్థిరత లేదు. మొత్తంమీద ప్రపంచ పరిస్థితులు తారుమారుగా వున్నట్లున్నట్లే యిప్పటి సారస్వత వీధులు అనిర్దిష్టంగా వున్నై. "ప్రతివ్యక్తీ నాఅభిప్రాయమిది" అని చెప్పాకు నేరోజులు. ఒకరు చెప్పడం మరొకరు వినడం వుండే కాలం కాదు.

రాయప్రోలు తమ అమలినశృంగారపూర్వకస్మృతి, లలితభావ వస్తురచనా సమన్వితమైన వాఙ్మయతపస్సు చేస్తూనే వున్నారు. చుట్టూ జరుగుతున్న అల్లరీ ఆగం ఆయన స్థైర్యాన్ని చెలింపచెయ్యడం లేదు. కొందరు కొత్త విధంగా సాధన చెయ్యటానికి పూని ప్రయత్నిస్తున్నారు. ఎంత రెట్లా చేసినా అసలుసూత్ర మాయన్ననుసరించటమే నని కొందరు చెబుతున్నారు. కొందరి కాయన్ను వెక్కిరించాలనుంది గాని పైకెవ్వరైనా చూచిపోతా రేమోనని సిగ్గుపడుతున్నారు. కొందరు వెక్కిరించి నవ్వులకలు పడు తున్నారు. విశ్వనాథ రసమయజగత్తంతా విప్పి చూసి సర్వరసా లకూ బీజము "రసోవైసః" అనే తత్వమేననీ, ఆ రసాన్ని సాధించడం ధర్మమూలమనీ అందరికీ ఎలుగెత్తి చాటుతున్నారు. ఈన సాధన యితరులకు అనుసరించటాని కసాధ్యమై, తెలుసుకొనడానికికూడా అగాధమై, యీన పార్థక్యాన్ని తెల్పుతున్నది. జాషువాకవి ధర్మవిష యంలో మతభేదం లేదనీ, వాఙ్మయతపస్సుకు ఆస్తికులందరూ అధి కారులేననీ, తన జిలుగు నుడికారాలతో మెత్తగా, హృదయరంజ కంగా తెల్పి తన కావ్యాలకు కాంతాసమ్మితత్వాన్ని సాధించుకుంటు న్నాడు.* అడవి తన సర్వతోముఖ లలితకళాజ్ఞానంతో సర్వతో

* ఇటీవలనే యీయనకు 1005 రూపాయలు బహూకరించి కవిపోషకత్వం సార్థకపరచుకున్నారు జయపురాధీశ్వరులు. ఈనకు ఒక యువకుడు పెల్లుట్ల రామ కృష్ణామాత్యుడు "నూరజాల" అనే తన కావ్యాన్ని అంకిత మిచ్చాడు. ఈ కావ్యం చాలా ఉద్రేకపూరితమై చక్కని పోకడలతో నిండివున్నది. స్వల్పవిషయంనించీ పెద్ద

ముఖంగా ప్రకాశిస్తున్నాడు. వీళ్లుగాక పింగళికాటూర్లూ, బసవరాజూ, నండూరీ, నాయనీ, సాహిత్యాకాశంలో వెలుగునిస్తున్నారు. అతినవ్య కవిత్వమేఘం వకమూల ఆకాశాన్నావరించటం మొదలెట్టింది. ఇంత టితో పోతుందో యిది వ్యాపించి ఆకాశాన్నంతా కప్పేస్తుందో తెలి యదు. వకవేళ కప్పివేసినా శాశ్వతంగా వుండజాలదనీ ఋతుధర్మం చేతనైనా మళ్ళీ ఆకాశం శాంతమౌతుందనీ నమ్ముతున్నాను.*

నాపని యిప్పటికి పూర్తైంది! ఇప్పుడు నాకు కలిగే సంతోష మనిర్వాచ్యం. రెండుమాటలు చెప్పి పాఠకుడి సెలవు తీసుకుంటాను. నవ్యసాహిత్యాన్ని వకసారి ఆకాశవిమానంమీదినించీ వీక్షిం చండి! ఎంత సుందరంగా ఉన్నదో! ఏమి దృశ్యము! శాఖావాహి నులు పాముసడకలతో వంకరవంకరగా ప్రవహిస్తున్నై! రాజ వీధులు తీర్చినట్టు కనపడుతున్నై! అన్నిటికంటె ఖండకావ్యపట్టణమతి విశాలమై నానాలంకారశోభితమై నేత్రపర్వం చేస్తున్నది. ఈ నవ్య సాహిత్యదేశాని కిది ముఖ్యపట్టణం. కాని వ్యాసం, శాస్త్రం, మొద లైన కొన్ని క్షేత్రాలు ఫలవంతంగా కనపడటం లేదు. వాటికి దోహదం చేసి ఫలవంతాలుగా చేయడం భాషాకుమారులపైన వక పెద్దభారం. సాహిత్యశరీరం వకభాగం బలిష్ఠం కావడంచేత మరో భాగం బలహీనంగా కనపడుతున్నది. సర్వాంగసుందరంగా వుంటేనే గాని సోదరసారస్వతాలతో తులతూగదు. కాని అయిన అభివృద్ధికి

కథనా అల్లవమే కవిభావనాశక్తికి తార్కాణము. ఈ యువకుడికి చెళ్ళపిళ్ళవారు చెప్పినట్టు "అమాయకత్వ" మున్నది. ఇంకా చిన్నతనంచేత అహంప్రత్యయము కొంచెం యెక్కువపాలుగా ఉన్నది. ఇతోధిక కీర్తివంతు డగుగాక! గుడివాడ యిద్దరు కవిరాజులను (విశ్వనాథ సత్యనారాయణ, త్రిపురనేని రామస్వామిచౌదరిగార్లు) చిత్రభాను సంవత్సరములో (1942) సన్మానం జరిపి ధన్యమైంది.

* ఇటీవల సభాపతి విశ్వనాథగార్లకూడా సినీమాగాలి తగిలింది. దీని పరి ణామ మేమవుతుందో!

సాహిత్యసాధకులు సంతసించవలసినదే!* ఇటువంటి "మాన్యా"నికి వారసులు తప్పక యీ లోటును భర్తీచేస్తారని హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను♦.

---

* "ఒక్క బెంగాలీసాహిత్యాన్ని మినహాయిస్తే తెలుగుసాహిత్యంతో తుల తూగగలిగిన అర్హత మరి యే భాషాసాహిత్యానికీ లేదని ఘంటాపథంగా చెప్పచ్చు. దక్షిణదేశభాషల్లో తెలుగుసమీపంలో చేరజాలే సమగ్రత వక్కభాషకూ లేదు."

(ఆంధ్రపత్రిక 26—1—41)

♦ గుళ్ళపల్లి నారాయణమూర్తిగారు రెండు గ్రంథాలను ప్రచురించినట్లు చూచాను. అందులో ఆంధ్రులకు ఉద్బోధనం కలుగజేసే "ఆంధ్రజ్యోతి" అనే నాటకం వకటి. దీనికంటె రెండోది చాలా గొప్ప గ్రంథం. "విద్యుచ్ఛక్తి-నిస్తంత్రీయోగము" ఇది కొండయ్యగారి "విశ్వరూపం" గ్రంథం తర్వాత యిదే యెన్నదగిన శాస్త్రగ్రంథం. ఇది విశ్వవిద్యాలయంవారిచేత 500 రూపాయల బహుమతి పొందింది. ఇది భౌతికశాస్త్రవిషయాలపైన (Wireless వగైరా) రాసిన గ్రంథం. ఇప్పటి మనకున్న శాస్త్రగ్రంథాలలో యిది వకటి. ఇందులకు గ్రంథకర్తకు ధన్యవాదాల నిస్తున్నాను.